# అష్టాదశ పురాణకథా

## విజ్ఞాన సర్వస్వము

*(ENCYCLOPAEDIA OF PURANIC STORIES)*

సంస్కృతమూలం; **శ్రీకృష్ణ ద్వైపాయన వ్యాసమహర్షి**

తెనుగు సేత: అష్టావధానిః కవనకళాప్రపూర్ణ **డా॥ విద్వాన్ శివశ్రీ**

**( ఇ. శివరామారెడ్డి)** M.A., B.Ed. , B.L.

అడ్వకేట్- కడప.

ఈగ్రంథముద్రణార్థం:- పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం రూ॥ 3500/ - ఆర్థిక సహాయం మంజూరు చేసినది.



శివశ్రీ పబ్లికేషన్స్ ( రిజిష్టర్డ్)

9-268 శివ శ్రీనివాస్,

నబీకోట -కడప 516 003.

- 2000 -

 మూల్యం: రూ॥180-00 మాత్రమే.

# అష్టాదశ పురాణకథా

**ప్రథమ ముద్రణ :**

కాపీలు - 500

**ప్రచురణ సంవత్సరము: 2000**

**వెల : రూ॥ 180-00**

ముద్రణ : **ప్రకాష్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్,**
నాగరాజుపేట,
కడప. ఫోన్: 41378

# భారతీయ సంస్కృతి విలాస విశేషాల

## కథా నిధి పెన్నిధి

# అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

## (ENCYCLOPEADIA OF PURANIC STORIES)

1) బ్రహ్మ పురాణం

2) పద్మ పురాణం

3) విష్ణు పురాణం

4) వాయు పురాణం

5) శ్రీమద్భాగవత పురాణం

6) నారద పురాణం

7) మార్కండేయ పురాణం

8) అగ్ని పురాణం

9) భవిష్య పురాణం

10) బ్రహ్మవైవర్త పురాణం

11) లింగ పురాణం

12) వరాహ పురాణం

13) స్కంధ పురాణం

14) వామన పురాణం

15) కూర్మ పురాణం

16) మత్స్య పురాణం

17) గరుడ పురాణం

18) బ్రహ్మాండ పురాణం

---

అష్టాదశ పురాణాలలోని విశేషాలతో పాటు రెండు వందల ఇరువది పౌరాణిక కథా విజ్ఞాన సర్వస్వం. ప్రతి ఇంట పారాయణం చేయదగిన పవిత్ర గ్రంథం.

# సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ్

## ముందుమాట

**డా॥ కే.పి. రాజు** ఆంధ్రోపన్యాసకులు, ఎం.ఏ., పి.హెచ్.డి.,

శ్రీసంగమేశ్వర పోస్టు గ్రాడ్యుయేషన్ కళాశాల, వీరపునాయుని పల్లి ( పోస్ట్)
కడప జిల్లా – ఆంధ్రప్రదేశ్.

డా॥ విద్యాన్ శివశ్రీ గారు ఉత్తమ జాతీయ పురస్కార గ్రహీత కవి శేఖరులు. కవన కళా ప్రపూర్ణులు. మంచి వచన రచనాధురీణులు. రచయిత, న్యాయ శాస్త్రకోవిదులు సమాజ న్యాయవాది. నిరాడంబరులు అపార సంస్కృత సాహిత్య సంపాదనార్జిత చతుర్ధ భాషా ధురీణులు స్వయం భాషాసాహిత్య సేవకులు, పాండిత్య గరిష్టులు, వరిష్టులు, ఘనాపాఠి, యావదాంధ్ర ప్రదేశ ప్రజానీకానికి శివశ్రీ సుపరిచితులు. సుప్రసిద్ధులు. బాల్యంలోనే కలం పట్టి నిత్యం నిరంతరాయంగా నాల్గున్నర దశాబ్దాలుగా సాహిత్య క్షేత్రంలో కృషిచేస్తున్న నిరంతర సాహితీ కృషీవలుడు, పండితులు, కపట మెఱుగని యదార్థ వాది. న్యాయం కోసం పోరాడేందుకు వెనుదీయని దిట్ట. పట్టుదల, కార్య దీక్ష, ధైర్య సాహసాల్ని, తన సొంతం చేసి కొన్న సహజ కవి పండితులు.

మంచిశైలిలో అనేక భాషా వ్యాకరణాది గ్రంథాలు, సాహితీ గ్రంథాలు శతాధికంగా వ్రాశారు ఏపనినైనా చేయాలని తలంచితే, సాధించినంత వరకు పట్టువదలని విక్రమాదిత్యుడు. శ్రీదేవీ కరుణా కటాక్షాలకు పాత్రుడు నిరంతర ప్రాణాయామ యోగాసన సాధనాలబ్ధ సదారోగ్యవంతుడు.

శివశ్రీ గారు అనువదించిన "అష్టాదశ పురాణ కథావిజ్ఞాన సర్వస్వము" అనే ఈ బృహద్గ్రంథరాజము అనేక పౌరాణిక కథావిజ్ఞాన

నిలయం. ఈ కథలు ఆయా పురాణాల క్రమ పద్ధతిలో కొన్నిభాగాలుగా విభజింప బడ్డాయి. ఇది సుమారు అయిదు వందల పదునెమిది పుటల గ్రంథం. సంస్కృత కర్త శ్రీకృష్ణ ద్వైపాయనుడైన వేద వ్యాస మహర్షి ప్రణీతమైన అష్టాదశ పురాణ కథల్ని, విజ్ఞానాన్ని, ఈ కవివర్యులు సరళీకృత తెలుగు వచనంలోనికి అనువదించారు. మాన్యుల నుండి సామాన్యుల వరకు భారతీయ పురా సంస్కృతి సులభ గ్రాహ్యమయ్యేలా అనువదించాడంటే మాటలా? ఎంతో సంస్కృత పాండితీప్రకర్ష అవసరం. దానికి దాన్ని పుష్కలంగా సముపార్జించుకొన్న గరిష్ట వరిష్ట కవి వరేణ్యులు శివశ్రీగారు. బహుభాషా కవిశ్రేష్ఠులు.

ఈ గ్రంథం బహుజన సేవ్యమై అలతియలతి తెలుగు మాటల పొందికతో గూడి, బహుపురాణ కథలకు నిలయమైంది. ఇది తెలుగు వారు చేసికొన్న పుణ్య పరిపాక విశేషం. ఇందలి శైలి నడకకుంటు పోక సరళ సుందర సులభ గ్రాహ్యమై ఆద్యంతం ఏకబిగిన చదివించు నట్టిది. సుమనోహరంగా, ముగ్ధమోహనమై భావరంజకంగా ఆబాల గోపాలాన్ని పండిత పామరుల్ని అలరించే పల్లెటూరి కన్యపడుచువలె సహజాలం కార, సౌజన్య సౌకుమార్యశైలీ విలసితమై సన్మిత్రుని వలెహిత బోధచేయుచున్నది. నన్నయ్య భట్టు చెప్పినట్లు అక్షర రమ్యత, నానావిధసూక్తి నిధిత్వంతో ప్రసన్న కథా కథన శైలిని సంతరించుకొన్నది.

ఇందలి పౌరాణిక కథలు భారతీయ సంస్కృతికి నిలయములై నీతి బోధలు కల్గి, కర్ణరసామృతంగా నున్నవి. కన్నె పిల్లవలె సహజ సౌందర్య శైలితో అలరిస్తున్నాయి. ఇట్టియింపు సొంపు సోయగం. ఈయన పద్యకావ్యాల్లోనే కాక స్వేచ్ఛాను వాద కథాసం విధానంతో కళ్ళకు కట్టినట్లుగా, దృశ్య కావ్యం వలె సంభాషణా వైశద్యంతో నాటకీయతగల్గి తిక్కన శైలిని మనకు నిజంగా గోచరింప చేస్తున్నదనుటలో ఏమాత్రం అతిశయోక్తి లేదన వచ్చును.

ఈ మాటలు చాలు శ్రీ విద్వాన్ శివశ్రీ గారి నిశిత పరిశీలనాశక్తికి విజ్ఞాన సంపత్తికి నిష్పాక్షికతకు నిదర్శనాలుగా నిలిచేటందుకు ఈ సమయం లో నరువదైదేళ్ళ వయోజ్ఞాన వృద్ధుడైన శివశ్రీ గారు ఇరువది యొకటవ శతాబ్దానికి భారతీయ సంస్కృతి వికాసాన్ని నడిపించే నిస్వార్థ నిర్మల నియమ నిష్ఠా గరిష్ఠ కృషికి మూడేళ్ల సాహిత్య బృహద్గ్రంథ సృష్టికి శుభాభినందన పూర్వకంగా ఆయనకు "శ్రీమహా విష్ణుదేవుడు, సదా శివదేవుడు, సృష్టికర్త పితామహా బ్రహ్మదేవుడు, వారి త్రివిధశక్తులైన శ్రీ లక్ష్మి, పార్వతీ, సరస్వతీ మాతలు అనవరత శాంతి విశ్రాంతి శతాధికవర్ష ఆయురారోగ్య భాగ్యయోగసిద్ధులను ప్రసాదింతురు గాక! అని అంజలి ఘటిస్తున్నాను.

వీరపునాయుని పల్లి (సంతకం) **డా॥ కే.పి. రాజు**

4-12-1999 ఆంధ్రోపన్యాసకులు

# "అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము"
## (ENCYCLOPAEDIA OF PURANIC STORIES)

ఆంధ్ర కరణ కర్త డా॥ విద్వాన్ శివశ్రీ M.A., B.Ed. ,B.L గారి

## వ్యక్తిత్వం ప్రజ్ఞా జీవిత విశేషాలు

డా॥ విద్వాన్ శివ శ్రీ కడప జిల్లా పూర్వపు పులివెందుల తాలూకా ప్రస్తుతం తొండూరు మండలానికి చెందిన తేళ్ళూరు తుమ్మల పల్లెలో తేది 2-11-1934 నకు సరియగు స్వస్తిశ్రీ భావనామ సంవత్సర ఆశ్వయుజ మాస కృష్ణ పక్షం ఏకాదశీ శుభతిథి శుక్ర వారం అర్ధరాత్రి 1-00 గంటకు సింహలగ్నమందు జన్మించారు.

ఈయన జాతక చక్ర మందు ధన స్థానమందు చంద్ర మంగళయోగం విద్యా మాతృ స్థానమందు గురు, శుక్ర, బుధ, రవి, చతుర్థ గ్రహాలున్నవి అది పంచమహాపురుష రాజయోగం సింహలగ్నమందు మోక్ష కారక గ్రహమైన కేతువుండుట జాతకుని పూర్వ పుణ్య విద్యా వికాసాన్ని సూచిస్తుంది. విశేషం ఆయుష్కారకుడై శని రాహువుతో చేరి సప్తమ స్థానమందుండి లగ్నాన్ని చూచుచుండుటచే నీతనికి పూర్ణాయుర్దాయ యోగం! పుట్టింది నిరు పేద కుటంబంలో పూర్వఫల్గుణి నక్షత్రం ప్రథమ పాదం ఫల్గుణివలె (అర్జునునివలె) పితృ గండమున జన్మించుటచే ఒకటిన్నర సం॥ వయస్సు నందే పితృవియోగం సంభవించినది"దైవ పరుల కాపదలురావు వచ్చిన సంపదలుగనవియౌ సంతరించవే అన్నట్లు తల్లి వేంకటాంబగారు సుశిక్షణతో సాకి సంతరించి ఆత్మాభిమానం ఉగ్గుపాలతోరంగరించి పోసి పెంచినది"ప్రేమ బాల్యంబునండియు పెంచి పెద్ద విద్య నేర్పించి గురు బోధ వృద్ధి సేసి, పరిణయము జేసి నొకయింటి కాని గాగ," స్వశక్తి తో పెంచి పెద్ద చేసింది.

ఈయన ప్రాథమిక విద్యాభ్యాసం స్వగ్రామమైన తుమ్మల

పల్లెలోను, ఆరవ తరగతి కోవరంగుట్టపల్లెలోను. 7,8 వతరగతుల (ఇ.యస్.యల్.సి) దొండ్ల వాగు గ్రామమందు జరిగింది ఆయన అదృష్టవశాత్తు హిందు మతోద్ధారక, ప్రచార చక్రవర్తి, మాస్టర్, సీ.వీ.వి. యోగ సాంప్రదాయానికి చెందిన ప్రభాకర ఉమామహేశ్వర రావుగారి ప్రియశిష్యుడు దొండ్ల వాగు కరణం నందిరాజ వేలు గోటార్యులు గారు తన యింటిలో గురుకులాశ్రమ పద్ధతిలో చేర దీసి"భృక్తరహిత తారక రాజయోగం" మంత్రోపదేశంచేసి మోక్షార్హున్ని చేశారు. అప్పుడు గురుపుత్రి వీరల క్ష్మాంబ డా॥ తులసెమ్మ గారి జ్యేష్ఠ సోదరి శ్రీ మతి అలివేణమ్మ గారు మూర్తిత్రయంగా మైత్రితో రాణించారు విధి నిర్ణయం వేరుగా నుండట చే గురు కుమారి వీరలక్ష్మమ్మ స్వర్గస్థురాలగుటచే శివశ్రీ గారు విసిగి విరక్త నంది గాంధీ పద్ధతిలో గ్రామ పునరుద్ధరణ కార్యక్రమముక్రింద ప్రజా సేవకు నడుముకట్టి"వీరలక్ష్మి విద్యా మందిర్" పేర ఉచిత విద్యాప్రాథమిక పాఠశాల స్థాపించి తరువాత ప్రభుత్వపరం చేశారు. అక్కడ పని చేస్తున్నప్పుడే ఈ కవి"వీరలక్ష్మి విద్యాద్విశతి" ని వేమన వలె అతిసులభ శైలి ఆట వెలది పద్యాల్లో రచించి 'అభినవ వేమన' బిరుదును పొందారు. తరువాత విద్వాన్ కోర్సు చదివి, గుర్వాజ్ఞతో గృహస్థుడై జిల్లా పరిషత్తులో ఆంధ్ర భాషా పండితుడుగా 10 పది సం॥ రాలు నిర్విఘ్నంగా పని చేసి విద్యార్థుల విద్యా వినయధురీణులుగా తీర్చిదిద్దారు. విద్యా వికాసాలకు ఆధాత్మిక ప్రబోధలతో తానొక నిస్వార్థసేవ కార్యక్రమంగా వినోబాబావే భూదాన యజ్ఞానికి సమిద ప్రేల్చాడు స్వయం కృషితో ఆంగ్ల విద్యనేర్చి మెట్రిక్ పాసయ్యాడు. ఈయనతర్వాత ప్రభుత్వ గుర్తింపు పొందిన లండన్ మిషన్ క్లాప్టన్ బాలికోన్నత పాఠశాలలో 2-9-1963 నుండి 16-6-1967 వరకు నాల్గేండ్లు పని చేశాక, కడప పట్టణం సెయింట్ జోసఫ్ బాలుర ఉన్నత పాఠశాలలో 17-6-1967 నుండి 31-7-1993 వరకు ప్రథానాంధ్రపండితుడునిగా నిరంతరాయంగా పని చేస్తూ 5-9-1984 అప్పటి భారత దేశాధ్యక్షుడు"జ్ఞానీ జైలుసింగ్" గారి చేత

ఉత్తమోపాధ్యాయుడుగా జాతీయ పురష్కారం పొందారు. క్రీ.శే। దుర్గబాయ్ దేశముఖ్‌తో కలిసి యునెస్కోస్కీము క్రింద వయోజన విద్యావాచకాలు వ్రాసినారు.తెలుగు ప్రభుత్వ పాఠ్యగ్రంథ వ్రాసారు. ఇంకా విశేష మేమంటే ఈయన స్వయం కృషితోనే ఆంగ్లం చదివి పరీక్షలైన ఇంటర్ (స్పెషల్) బి. ఏ. లిట్., తెలుగు ఎం. ఏ లిట్ మరియు బి.యల్ డిగ్రీ పాసైనారు. లాపరీక్ష కడప బసవ రామ తారక స్మారక న్యాయకళాశాలలో చదివి ఉత్తీర్ణుడై పేద ప్రజానీకమునకు ఉచిత న్యాయ సలహా సహాయాలంద చేస్తున్నారు.

ఇంతే కాక ఈయన స్వయంగా శివ శ్రీవిద్యాసేవా సంస్థను స్థాపించి దాని కధ్యక్షులై శివ శ్రీ ప్రాచ్యసంస్కృతి ప్రాథమిక కోన్నత పాఠశాలను స్థాపించి పండ్రెండేళ్ళు నడిపి పదునాల్గురికి ఉద్యోగాలిచ్చి, ప్రభుత్వపు గ్రాంటు, సౌకర్యాలు పొందేటట్లు చేశారు.

ఈయన చతుర్భాషా పండితుడై సాహిత్యసేవ సంస్కృతాంధ్ర హిందీ ఇంగ్లీషు భాషల్లో శతాధిక గ్రంథాలు వ్రాసి వాసి గాంచారు. అందులో ముఖ్యమైనవి. 1) శ్రీవీరక్ష్మి విద్యాదర్శిని విద్యాద్విశతి తెలుగు 2). అను వ్రత విద్యాత్రిశతి –సుమతి వేమన వీరలక్ష్మీ శతకాలకు సంస్కృతీకరణం 3). కబీరు గీతాంజలి- హిందీ నుండి జాతీయ సమైక్యతా ప్రచురణంగా తెలుగు పద్యాను వాదం అయిదువేల అవార్డు పొందినది. మరియు 4).తెలుగు బోధనా పద్ధతులు, 5) శివశ్రీవ్యాకరణ మార్గదర్శి 6)మల్లీశ్వరశతకము, 7) శ్రీమద్భగవద్గీత యథాతథ పద్య గీతాను వాదం, 8)రామాయణ సుందర కాండం, 9)వేమ భారతం ఐతిహాసిక ప్రబంధం; 10)వ్యాస మహాభారతం ఆదిసభారణ్యపర్వాలు, 11) వాయు దూతము 12) శ్రీరాజరాజేశ్వరి శతకం, 13) చంద్రశేఖర శతకం (సంస్కృతం) 14) నీల కంఠేశ్వర శతకం (తెలుగు), 15)Hinduyoga in sky Age" English Preverses ఇలా శతాధిక గ్రంథాలు రచించారు. కడప జిల్లా రచయితల సంఘం మిత్ర సాహితి, మొదలగు సాహితీ సంస్థలన్నీ కలిసి

డా॥ భూతపురి సుబ్రహ్మణ్య శర్మ గారి అధ్యక్షత క్రింద ఈ యనకు కవనకళాప్రపూర్ణ బిరుదంతో 2-11-1994 లో షష్టి పూర్తి కార్యక్రమం నిర్వహించి, సాహిత్య సంఘాలు సత్కరించారు. ప్రస్తుతం శ్రీకృష్ణ ద్వైపాయన వ్యాస మహర్షి ప్రణీతమైన అష్టాదశపురాణాల "అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము" పేర సరళ సుందర వచనగా రచించి, శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారిచే ముద్రణార్థం ఆర్థిక సహాయం మంజూరు పొందారు. సాహిత్యపిపాసులైన పాఠకుల కరకమలాల నలంకరిస్తున్న ఏతత్ గ్రంథ ప్రయోజనాన్ని పాఠకులే నిర్ణయించాలి.

**కృతి ఆవిష్కరణ ఆహ్వాన సంఘం, కడప.**

# సుకవితాయద్యస్తి రాజ్యేనకిమ
# అనుమోదము

## డా॥ రంగాపురము మల్లేశ యాదవ్

బి యస్. సి (సైన్సు) ఎం. ఏ. యం. ఇడి. పి.హెచ్.డి.,

రిటైర్డ్ రీడర్, ప్రొద్దుటూరు.

శ్రుతి, స్మృతి పురాణేతిహాసకావ్య శాస్త్ర, నాటకాది, ప్రక్రియాత్మకమైనది వాఙ్మయం శ్రుతి అంటే వేదమని అర్థం వేదం శబ్దప్రాధాన్యం, ప్రభుసమ్మితం, అది స్వర, వర్ణ విషయుకమైన సంస్కారవమున్న ఉత్తమాధికారులకే అందుబాటులో ఉంటుంది.

ఇంక వేదార్థాన్ని వివరించి చెప్పడానికి స్మృతులు వచ్చాయి. స్మృతులంటే ఇతిహాస పురాణాలు. అర్థప్రధాన మైనవి. శ్రుతులు చెప్పే కర్మోపాసన జ్ఞానాలను గురించి అవి మిత్ర సమ్మితంగా బోధిస్తాయి. పోతే పురాణ నిర్వచనం "పురాపూర్వస్మిన్ భూతమిత పురాణమ" అని అమరకోశార్థం. పురాణము అని భవిష్యపురాణంలో పురాణ శబ్ద నిర్వచనాలున్నాయి.

సర్గమ్ (మొదట సృష్టి) ప్రతి సర్గం (కల్పాంతంలో జరిగే సృష్టి) దేవ,దేవర్షి,బ్రహ్మర్షుల గురించి చెప్పే మన్వంతరం వంశాను, చరితమ్ అనే అయిదు లక్షణాలతో విశిష్టమైనది పురాణం.

ఇక పురాణాల్లోని కథలా అత్యద్భుతములైనవి. అలౌకికం అవి అన్నీ ఒక ప్రయోజనం మున్ననీతులు ప్రధానం శ్లో॥ మద్వయం, భద్వయంచైవ బ్రత్రయం, వచతుష్టయం అ,నా, ప,లింగ, కూస్కాని పురాణాని పృథక్ పృథక్ అనగా 1. మత్స్య, 2. మార్కండేయ 3) భాగవత 4) భవిష్యత్ 5) బ్రహ్మాండ 6) బ్రహ్మ 7) బ్రహ్మవైవర్త 8) వామన 9) వాయవ్య

10) వైష్ణవ 11) వారాహ 12) అగ్ని 13) నారద, 14) పద్మ 15) లింగ 16) గరుడ, 17) కూర్మ, 18) స్కాంధములు అని అష్టాదశపురాణాలు శ్రీకృష్ణద్వైపాయనుడనే వ్యాస మహర్షి చే సంస్కృత భాషలో రచింపబడిన భారతీయ సంస్కృతికి పట్టుగొమ్మలు దివ్యతపోనిధి విజ్ఞాన సంపద్విఖ్యాతుడైన వ్యాసభగవానుడే సాక్షాత్ నారాయణ స్వరూపుడే వీటికి కర్త అని ప్రతీతి

ఇంతకు డా॥ విద్వాన్ శివశ్రీ అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వం ఒక్క చేతి మీద అను వదించడం ఆయన అర్హత పురాభాగ్యం ఇంతకు ఒక్కొక్క పురాణమే ఒక్క విజ్ఞాన సర్వస్వ కోశం అలాంటి అష్టాదశ పురాణాల్లోని అనేక కథావిజ్ఞాన విషయాలను అందమైన తెలుగు, తేనె వంటి తెలుగులోనికి అనువదించి శివశ్రీ ఒక బృహద్విజ్ఞాన సర్వస్వం గా సంతరించిన చిరకాల మిత్రులు డా॥ విద్వాన్ శివశ్రీగారు బహుభాషావిజ్ఞాన వేత్తలు, కవిశేఖరులు మహాకవి కవన కళా ప్రపూర్ణులు శతాధిక గ్రంథకర్తలు ఈకృషికి అభినందనీయులు పట్టుదల కఠోర సాహిత్య, తపోదీక్ష గలవారగుటయే వారింతగా ఎదగడానికి కారణాలు.

వారి ఊటకలం నుండి ఇరువదియొకటవ శతాబ్దంలో మరిన్ని భారతీయ సంస్కృతి ప్రబోధకరమైన ఆధ్యాత్మికరచనలు వెలువడుతాయని అందుకు ఆయన దీర్ఘాయురా రోగ్యభాగ్యలతో విలసిల్లాలని కోరుతు నా "అనుమోదం" తెలియచేస్తున్నాను.

"జయన్తితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి యేషాంయశఃకాయే జరామరణజభయం"

సంతకం. **డా॥ ఆర్. మల్లేశ్ యాదవ్.**

బ్రహ్మ పురాణము

# అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

## శ్రీముఖము

'ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహియేత్'

భగవంతుని నిశ్వాసరూపాలైన వేదాలు భారతీయుల జీవన స్రవంతికి, ధర్మోత్తేజానికి, తత్త్వదర్శనానికి మూల కందాలైనవి ఇతిహాస పురాణాలు వేదాలను సముప బృంహితము చేస్తున్నాయి.

పురాణం అంటే ఏమిటి? అనే మీమాంస ఏర్పడినప్పుడు అనేక కోణాల్లో పురాణా శబ్దం అనేక విధాలుగా నిర్వచింపబడినది.

"పురాపూర్వస్మిన్ జాతిమితి పురాణమ్ (అ.కు.ప్ర)
పురాభూనవం భవతీతి పురాణమ్ (యా.ని. 3.4.19)
పరా ఆగతానాగతౌ అణతి కథయతీతి పురాణమ్
పురాప్రాచీన కాలోదంతం అనక్తీతి పురాణమ్"

పురాణానికి సర్గ ప్రతి సర్గాది పంచ లక్షణాలుండాలని కొందరందురు పురాణ వాఙ్మయం, మహాపురాణాలని, ఉపపురాణాలని, ఉపోపపురాణాలని మూడు విధాలుగా విభజింపబడింది. అందులో పద్దెనిమిది మహాపురాణాలనేది, అందరికి ఏకాభిప్రాయం ఉన్నది. కాని ఉపపురాణాలు 34 అని కొందరు 18 అని కొందరు 17 అని కొందరంటున్నారు. అపౌరుషేయాలైన వేదాలలోగల నిత్య సత్యోపదేశములు సోదహరణంగా సమాజానికి శాంతికి ఉపయోగపడేటట్లు పురాణ వాఙ్మయంలో నిరూపింప బడి నాయనుటలో సందేహమిసుమంతయు లేదు.

# అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

అతి విస్తరమైన పురాణ వాఙ్మయంలో ప్రధానమైన పదునెనిమిది పురాణాలను సంగ్రహముగా పరిచయం చేయడం మనోరంజకంగా కనబడుతున్నది.

1) పద్మ 2) నారద 3) గరుడ పురాణాల్లోని సూక్తులు ఆదర్శభావాలు

2) భవిష్య పురాణాలలో వివాహ పద్ధతులు

3) వరాహ పురాణంలో అన్నదాన మహిమ

4) స్కాంద పురాణంలో వన భోజన విశేషాలు

5) వామన పురాణంలో పుత్రుని కంటే, శిష్యాధిక్యం నిరూపించబడినది.

6) కూర్మ పురాణంలో శివకేశవుల అభేదనిరూపణం, గురువు దగ్గర సత్ప్రవర్తన వర్ణింపబడ్డాయి.

7) మత్స్య పురాణంలో పితృమాహాత్మ్యం మొదలగు గాథలు చేరియున్నాయి.

8) ఈ పుస్తకానికి పేరు దెచ్చే అనేక అంశాలున్నవి.

భారతీయతకు మూలాధారం వేదం. వేదాలన్నీ పురాణాలలో పోషింపబడుతున్నాయి. అనగా వేదార్థమంతయు పురాణాల్లో చక్కగా వివరింపబడ్డాయి.

"వేదాః ప్రతిష్ఠితాస్సర్వే పురాణానాత్రసంశయః"

పురాణ విజ్ఞానం ఐహికాముష్మిక సుఖసాధనం కాని పురాణాలకు తగిన ప్రచారం నేడు కఱువైంది. మన సంస్కృతి, సదాచారాలు తెలిసికోవాలంటే పురాణాలను తప్పక తెలుగులో చదివి తెలుసుకోవాలి. పురాణాల్లో లేని దేది ఇతరత్రా కానరాదు. మానవులంతా కర్తవ్యాన్ని నిర్ణయించుకొని మోక్షాన్ని పొందడానికి పురాణ విజ్ఞానం ఎంతో ఉపయోగపడుతుంది.

## బ్రహ్మ పురాణము

అత్యంతావశ్యకమైన పురాణ కథా విజ్ఞానం గురించి జన సామాన్యం తెలిసికోవాలనే సత్సంకల్పంతో ఈ "పౌరాణిక కథా విజ్ఞాన సర్వస్వం" రచింపబడింది. పండిత పామరులకు ఆబాలగోపాలానికి సైతం పురాణాల పట్ల అవగాహన, పురాణ పఠనాసక్తి పెంపొందించడం ఈ గ్రంథ ప్రథానోద్దేశ్యం. సమాజానికి పొందు పరచడం జరిగింది. పురాణ కథా విజ్ఞాన సందేశాలు, పురాణాల క్రమంలోని నిగూఢతత్వాలు చక్కగా వివరించడమైనది. పురాణకథా విజ్ఞాన సందేశాలు, పురాణాల క్రమంలోని నిగూఢతత్వాలు చక్కగా వివరించడమైనది. పురాణ సర్వస్వం రసరమ్య కథా ప్రవాహాలుగా పాఠకుల కందించడమైనది.

ఉదా:- కార్తవీర్యార్జునుని కథ, జడ భరతవృత్తాంతం, ధుంధుకారుని ప్రేతత్వముక్తి, బ్రహ్మదత్తుని కథ, నిశాచరుని వృత్తాంతం మున్నగునవి అకారాది అక్షర క్రమంలో పూర్వగాథలన్నీ నిఘంటు పద్ధతి వ్రాయబడ్డవి. కలి ధర్మాలు, భాగవత సప్తాహం వైశిష్ట్యం, పితృశ్రాద్ధావశ్యకత, గురు భక్తి మహిమ శిష్య ధర్మం మొ॥ విషయాలు ఎన్నో చిన్న కథలుగా వర్ణించబడ్డాయి. పాఠకులకు మార్గదర్శియై కరదీపికగా ఈ పురాణ కథా విజ్ఞాన సర్వస్వం పని చేస్తుంది. వేదాలు అపౌరుషేయాలంటే నమ్మని వారుంటారు. పదునెనిమిది పురాణాలు వ్యాసమహర్షి వ్రాసినవే అంటే అసాధ్యమనే వారున్నారు. పౌరాణికాంశాలు సత్యాలే అంటే పుక్కిటి పురాణాలని పెదవివిరిచే వారున్నారు. పురాణాల్లో భూగోళికాంశాలు, ఖగోళ విజ్ఞానం, నిత్య జీవితానికి సంబంధించిన అనేక అంశాలున్నాయంటే కాదనే వారున్నారు. వీరంతా మూర్ఖులు. వీళ్ళకంటే మాక్సుముల్లరువంటి పాశ్చాత్యులే నయం వేదాలను అర్థం చేసికోడానికి ప్రయత్నించారు. పురాణ పరిచయ గ్రంథాల అనువదించి ముద్రించారు ప్రాచీన ఆర్ష సాంప్రదాయం పరమ విశిష్టమని తెల్చి చెప్పారు.

తెలుగులో పూర్వం పురాణాలకు సంబంధించి చిన్న పెద్ద పుస్తకాలు వచ్చాయి. భారతీయతను స్పష్టం చేసే సందర్భాలలో పురాణాలను వివరించిన వారున్నారు. అలాగే హిందూ ధర్మ పరిచయం లాంటి గ్రంథాలలో పురాణాల పరిచయం, ప్రశంసలున్నాయి. ప్రస్తావనగా కొన్ని కథల వివరణలున్నాయి. ఉదా: బ్రహ్మపురాణంలో కండువుకథ భాగవత పురాణంలో ఆత్మదేవుని కథ, మార్గండేయ పురాణంలో ఋతుధ్వజుని కథ, లింగ పురాణంలో అదృశ్యంతి కథ మత్స్యపురాణంలో బ్రహ్మదత్తుని కథలున్నాయి. ఇట్టివి క్రోడీకరించింది గ్రంథం. కాలం మారినా విదేశాలలో కూడా పురాణాలపై డిగ్రీ కోర్సులు, పురాణ చర్చ గోష్టులు సాగుతున్నాయి. ప్రాచీన కాలంలో, అవధానాల్లో సభావర్ణనల్లో పౌరాణికుల్ని తప్పక చెప్పడం సాంప్రదాయం. పురాణాలను వ్రాసిన వారిని పౌరాణికుల్ని, ఉపన్యాసకుల్ని గౌరవించడం ఆర్షసాంప్రదాయం. మన సంస్కృతి ఆధ్యాత్మిక చింతన, జ్ఞాన సముపార్జన అంతచ్చేతనా తత్త్వ వివేచనా ప్రాచీన భారతీయ సంస్కృతిలో ప్రధాన లక్షణాలు ప్రాచీన భారతీయ సంస్కృతిలో ప్రధాన నిష్ఠకు ప్రతిబింబాలైన ఈ సద్గుణాలచే ఉత్ప్రేరితమైన మహర్షుల తపోనిష్ఠ యొక్క అక్షరరూపాలే వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు మొ॥ కథా ప్రవచన పద్ధతిలో ఉండటం వల్ల పురాణాలందరికీ అందుబాటులో కావలసిన ధర్మసూత్రాలను, సూక్ష్మాలను ప్రబోధిస్తుంది. మను స్మృతిలో పురాణ వైశిష్ట్యమిట్లు వర్ణించబడింది.

"బిభేత్యల్ప శ్రుతాద్వేదో మామయం ప్రహరేదితి!
ఇతిహాస పురాణాభ్యాం వేదం సముపబృంహియేత్!!"

అనగా అల్ప పాండిత్యం గలవాని వలన వేదము ఇతడు నన్ను మోసగించునని భయపడునంట! కావున ఇతిహాస పురాణాల నాధారంగాగైకొని వేద ప్రతిపదార్థములను పోషింపవలెను. పై మను స్మృతి

ప్రవచనాన్ని బట్టి పురాణ వాఙ్మయమెంత ప్రాధాన్యమును సంతరించు కున్నదో తెలుస్తోంది. కానీ ఆధునిక కాలంలో బాగా చదువుకున్న పండితులు కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను ప్రముఖమైన ఔద్యోగిక వ్యాసంగంలో నున్నవారు కూడా వరుసగా పదునెనిమిది పురాణాల పేర్లు చెప్పలేని స్థితిలోనున్నారు. ప్రాచీన వాఙ్మయంలో ఎంతో ప్రాశస్త్యాన్ని వహించిన ఈ పురాణాంతర్గత కథా విజ్ఞానాన్ని అధ్యయనం చేయాలన్న తపన గల్గిన విద్యార్థులకు ఉత్తేజం కల్గింపలేక పోతున్నారు. అట్టి తరి ఇట్టి పురాణ కథా విజ్ఞాన సర్వస్వం నిఘంటువు వెలువడడం ఎంతయో ప్రశంసనీయం. అధునాతన యుగంలో ఇటువంటి గ్రంథాల ప్రచురణ అత్యవసరమై యున్నది.

పురాణ భారతి చాలా గొప్ప స్వరూపంతో మన యెదుట సాక్షాత్కరిస్తోంది. కాల ప్రవాహంలో ప్రతి క్షణం ఎంత విలువైందో బ్రహ్మ పురాణంలో కండువ మహర్షి కథ ద్వారా తెలుస్తోంది. ఉసరిక, తులసి ఎంత అమోఘ శక్తి సంపన్నాలో పద్మ పురాణం చెబుతూంది. అజ్ఞానాంధకారంలో కొట్టు మిట్టాడే నాటి ప్రజానీకానికి భాగవతంలోని "గోకర్ణాఖ్యానం" ఒక కనువిప్పు కల్గిస్తుంది. ఇలా ప్రతి పురాణంలోని సారభూతములుగా ఒకటో రెండో ఉపాఖ్యానాల అకారాదిగా క్రోడీకరిస్తూ పురాణ విజ్ఞాన సర్వస్వం లో చేర్చడం జరిగింది. అవి ప్రసన్నాత్మక సౌలభ్య సౌకుమారధారా శైలిలో అందించడం జరిగింది.

వేదాలు నిగూఢమైనది. సామాన్యులకు, స్త్రీ, శూద్రాదులకు అందుబాటులో లేనివి. ఉన్నా బహుజనులకు దురవగాహమైనది. వాటి సారసర్వస్వములుగ అవతరించిన గ్రంథత్రయమే భారత భాగవత రామాయణాలు. ఇవి భారతీయ సంస్కృతికి ఆకరాలుగా నున్నవి.

భారతీయుల ఆచార విచార రీతినీతి వ్యవహారాలకు పరమ ప్రమాణికమైనవీ ప్రబంధరాజాలు. ఇతిహాస పురాణాదులు పంచమవేదము ఆయాకాలాల్లో భారతీయ ఋజువర్తన విధానాన్ని సంస్కృతి విశ్వకోశాలన వచ్చును పురాభవం పురాణం అని మత్స్య పురాణం పేర్కొన్నది. విశిష్టమైన లక్షణాలుగల శాస్త్ర గ్రంథాలు మన అష్టాదశ పురాణాలన వచ్చును. ఉదా:- సృష్టి పునః సృష్టి దేవతలు, సుప్రసిద్ధ రాజుల వివరాలు, ధర్మ అర్థ, కామ మోక్షములను చతుర్విధ పురుషార్థములు దానవ్రత నీతి చతుష్షష్టి కళలు, తీర్థ యాత్ర స్థల పురాణయోగ సాంఖ్యములు మొ॥ వాటితో పాటు జీవితం మరియు మరణోత్తరాల సమగ్ర చింతనాలు పురాణాలు వాటియందాదరము కల్గినట్లైన జన జీవనం ఉత్తమం కాగలదు. పురాణాల గురించి ఒక పురాణ మున్నది. మహా పురాణాలు 18, ఉపపురాణాలు 18, పురాణాల మొత్తం శ్లోక సంఖ్య నాల్గు లక్షలు సృష్టి స్థితిలయకారకులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల కథలే పురాణాలు. వీటిలో పది శివ పరమైనవి. మొత్తం పదునెనిమిది.

మన పురాణాలను వ్యాసుడు రచింపగా, ఆయన శిష్యపరంపగా వైశంపాయనుడు, శుకుడు, పైలుడు, జమినీ, తచ్ఛిష్యులు సూత మహర్షి, శౌనకాదులు పురాణ ప్రవచనం చేస్తుండేవారు. రాజులతోను మహర్షులతోను అన్యోన్యంగా సత్సంగమాలతో ఉండేవారు. రాజాధికులు యజ్ఞయాగాదులు చేయించే స్థలాలకు వెళ్ళేవారు. అనేక మంది సూతులు రాజుల మంత్రి మండలిలో గతాని అని పదవిని అలంకరించారు. వీరు యజ్ఞ కాలాల్లో వీరుల పురాణ గాథల వంశ చరిత్రలను గానం చేసేవారు. వాటిలో ఇహపరాల కథలుండేవి. అవతారాల గురించి, స్వర్గ నరకాల గురించిన వర్ణనలండేవి.

ఈ పురాణాలను సర్వత్రా వ్యాప్తం గావించినవారు. రోమహర్ష, ఉగ్రశ్రవులు. వీరు సూతకథామండలికి చెందినవారు. ఆనాడన్ని పురాణాలు

ఒకే రూపాన ఉండేవి. ఈ బృహత్పురాణ సంహితను, సత్యవతీ తనయుడైన వ్యాసమహర్షి పదునెనిమిది పురాణాలుగా విభజించి లోక కల్యాణం కోసం ప్రచారం గావించాడు. ఈ ప్రపంచంలో ప్రప్రథమ గ్రంథ సంపాదకుడు వేద వ్యాస మహర్షియే అని చెప్పవచ్చును.

వేదోపనిషత్తులు ప్రభు సమ్మితాలు. వాటికి సారభూతమైన పురాణాలు మిత్ర సమ్మితములైనవి. సత్య ధర్మాల ఆలంబనతో జీవనం సాగినపుడే మానవులకు శ్రేయస్సు. వాటి సందేశాల ననుసరించి నడుచుకొన్నప్పుడే జన జీవనాలలో నీతి ధర్మాల స్థాయి పెరిగి సుఖ శాంతులు విలసిల్లుతాయి. అష్టాదశ పురాణాల సందేశాలు సార్వకాలీనకాలు, సర్వజనీన సత్యాలు. పురాణాల విజ్ఞానం వల్లనే తమిళ అల్వారు, కర్ణాటక దాసపరంపరకు ,చెందిన భక్తులు బసవేశ్వరుని వంటి శైవకవులు వంగీయుడైన చైతన్య మహా ప్రభువు మహారాష్ట్రకు చిందిన జ్ఞానదేవ్, నామదేవ్, ఏక్‌నాథ్, తుకారాం, ఉత్తరానికి చెందిన కబీర్, గురునానక్ మొ॥ భక్తాదులు పురాణాలలోని గాథలను వివిధ రూపాల చిత్రించి ప్రజానీకంలో ధర్మాచరణాసక్తిని, భక్తియోగాన్ని పెంపొందించారు. మేరువువంటి పురాణ విజ్ఞానాన్ని సంగ్రహంగా సుబోధకంగా పురాణ కథా విజ్ఞానం పేర అందించడం సర్వదా ప్రశంసనీయం.

## పురాణ కథా విజ్ఞాన సర్వస్వం

### *ఉపోద్ఘాతం*

భారతీయ సంస్కృతికి ప్రధానాధారము వేదాలు. మన దేశంపై పలుసార్లు విదేశీయ దురాక్రమణం జరిగినా మన సనాతన సంస్కృతి చెక్కుచెదరక పోవడానికి కారణం మన వేద వాఙ్మయమే! వేదాల పట్ల మనకు గల పవిత్ర పూజ్యతమే! వేదాల పట్ల మనకు గల పవిత్ర పూజ్యభావాధారంగానే

భారతీయుల ఐహికాముష్మిక సౌఖ్యాల్ని మనం నిరంతరం పొందగల్గుతున్నాం. మానవులు తమ జీవితంలో తప్పనిసరిగా ఆచరించవలసిన కర్తవ్యాల్ని వేదాలు పదేశస్తున్నాయి.

ఉదా:- "పుమాన్ పుమాంసంపరిపాతు విశతః" అనే వైదిక మంత్రం ఒక మనిషికి మరొక వ్యక్తి సహాయం చేయడం ద్వారా తమ జన్మను పవిత్రం చేసికోవాలని ఉపదేశిస్తున్నది. ఇట్లే "మిత్రస్యాహం చక్షుషాసర్వానిభూతాని అనే" వేద మంత్రం సమస్త ప్రాణుల మైత్రీ భావంతో చూడాలని హితం భోధిస్తుంది. "కృణో బ్రహ్మవోగృహేసంజ్ఞానాం పురుషేభ్యః" అనే మంత్రమిలా చెప్పుతున్నది. ఓ సుజనులారా! మనమందరం కలిసి మానవుల్లో సద్బుద్ధి కోసం సద్భావన కోసం దైవాన్ని ప్రార్థిద్దామనే సుభావం బీజం వేస్తోంది. ఈ విధంగా ఎన్నో ఆదర్శాలను చూపడం ద్వారా మానవుడు తమ జన్మను సార్థకం చేసికోడానికి వేదాలు సన్మార్గాన్ని ఉపదేశిస్తున్నాయి. ఇట్లే "సత్యంవద, ధర్మంచర, మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" మొ॥ లైన మంత్రాలు సత్యాన్ని ధర్మాన్ని, పెద్దలపట్ల గౌరవాన్ని అతిధులను సన్మానించడాన్ని మన అవశ్యకర్తవ్యాలుగా బోధిస్తున్నది.

ప్రతి మానవుడు ధర్మార్థకామమోక్షము లనే చతుర్విధ పురుషార్థాలను సాధించాలనేదే మానవ జన్మ సార్థకమౌటకు, వేదాలు మానవ ధర్మాన్ని ప్రభోధిస్తున్నాయి. ఈ చతుర్విధ వేదాలలోని నిగూఢార్థాల్ని వెలికి దీసి సామాన్య మానవునికి సైతం అర్థమయ్యేలా హితోపదేశం చేయడానికి పురాణాలు వేదవ్యాస మహర్షి రచించాడు. ఈ కారణంగానే ఋగ్యజుస్సామాథర్వవేదాలనే నాల్గు వేదాలతో సమానంగా 'పురాణం పంచమో వేద'ః అని అయిదవ వేదంగా మహా భారతంచే కీర్తంపబడుతోంది. అట్లే పురాణ వాఙ్మయం పురావృత్తం పురాణం అనే ఉత్పత్తిని బట్టి ఒకప్పుడు

జరిగిన వృత్తాంతాన్ని తెలియజేస్తూ తద్వారా మంచిని గూర్చి ఉపదేశించేవే పురాణాలు. పురాణాల్లో లేని విషయాలంటూ ఏవీలేవు. దేవతల వర్ణనలు సదాచారాలు చతుర్దశవిద్యలు, స్త్రీ–పురుషుల కర్తవ్యాలు, గురు శిష్యుల సంబంధాలు రాజ్యపరిపాలన విధానాలు, పరోపకారం, పుణ్యక్షేత్రాలు, నదులు, భక్తితత్త్వజ్ఞాన–వైరాగ్యములు మొ॥లైన పెక్కు విషయాల్ని తనలో దాచుకొన్నవి పురాణాలు. సాహితీ ప్రక్రియ ఎంతో ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నది. ఇంతటి విస్తార ప్రక్రియ మరియొక్కటి లేదనుటలో వింత లేదు. చతుర్దశ ప్రాచీన విద్యలు పదునాల్గు.

అవి :

"అంగాని వేదాశ్చత్వారో, మీమాంసాన్యాయ విస్తరం!
పురాణం ధర్మశాస్త్రంచ, విద్యాహ్యేతాశ్చతుర్దశ!!"

అని మన సాంప్రదాయ విద్యలు పదునాలుగుగా చెప్పబడినవి.

అవి :–

1. వేదాలు 4 (ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం)
2. వేదాంగాలు 6 (శిక్ష, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పము)
3. మీమాంస 2 (పూర్వమీమాంస, ఉత్తర మీమాంస)
4. పురాణం మరియు ధర్మశాస్త్రం (మనుస్మృతి)

వీటిలో వేదాలు మానవుల్ని కర్తవ్య నిర్వహణలో ప్రభువు వలె, (రాజాజ్ఞగా) శాసిస్తాయి. ఈ కారణంగా వేదాలను ప్రభు సమ్మితాలన్నారు. స్మృతులు విజ్ఞాన శాస్త్రాలు కూడ ఈ తరగతికే చెందుతాయి.

పురాణాలీ విధంగా గాక ధర్మమార్గంలో గల లాభాలను అధర్మ మార్గంలోగల నష్టాలను విడమర్చి, మిత్రుని వలె ఉపదేశిస్తూ ధార్మిక కార్యాలపట్ల ఆసక్తిని, అధార్మిక కార్యాలపట్ల విముఖత్వాన్ని కలుగ జేస్తాయి. కనుకనే పురాణాలు మిత్రసమ్మితాలుగా వర్ణింపబడ్డాయి.

**పురాణ లక్షణం:-**

ప్రతి పదార్థానికి కొన్ని లక్షణాలంటు ఉంటాయి. ఈ విధంగా ఆలోచించేటప్పుడు పురాణ లక్షణాలేవి? అని సందేహం కల్గుతుంది. దీనికి సమాధానంగా-

సర్గశ్చ ప్రతిసర్గశ్చ, వంశోమన్వంతరాణిచ!

వంశానుచరితం చేతి పురాణం పంచలక్షణం

అని పురాణ లక్షణం చెప్పబడింది. 1. సర్గ 2. ప్రతి సర్గ 3. వంశం 4. మన్వంతరం 5. వంశాను చరితం అనే పంచలక్షణాలు కల్గియున్నదే పురాణం సర్గ అనగా ప్రపంచం యొక్క సృష్టి ప్రతి సర్గ అనగా ప్రపంచం యొక్క ప్రళయం వంశమంటె రాజుల మరియు ఋషుల యొక్క సంతాన పరంపరలు వంశాను చరిత్ర అనగా రాజవంశాల్లోను మరియు ఋషి వంశాల్లోను జన్మించిన మహనీయుల గురించిన చరిత్రలు.

ఇవీ పురాణాలకు గల పంచ లక్షణాలు

శ్రీమద్భాగవత పురాణంలో పది పురాణ లక్షణాలున్నవి. కానీ అవన్నియు యీ అయిదు లక్షణాల క్రిందకే వస్తాయి.

**పురాణ కర్త :-**

ఇంతటి మహత్వపూర్ణాలైన పురాణాల కర్త లేక రచయిత ఎవరు? అనే ప్రశ్నకు సమాధాన మీ క్రింది శ్లోకం ద్వారా లభిస్తున్నది.

## బ్రహ్మ పురాణము

"విష్ణు రంశో మునిర్జాతః సత్యవత్యాం పరాశరాత్!
పురాణ సంహితాం దధ్యౌతేషపాంధర్మవిధిత్సయా"

అనే ప్రమాణాన్ననుసరించి సత్యవతీ-పరాశర మహర్షుల పుత్రుడుగా (కానీనుడుగా) శ్రీమహావిష్ణువు యొక్క అంశవల్ల జన్మించిన శ్రీ వేద వ్యాసభగవానుడీ పురాణాలను రచించినట్లు తెలుస్తోంది.

"అష్టాదశ పురాణాల కర్తా సత్యవతీ సుతః" అనే వచనం కూడా ఈ అంశాన్ని ధృవపరుస్తున్నది. ఈ వేద వ్యాస మహర్షియే వేద విభాగం, బ్రహ్మ సూత్ర రచన, మహాభారత, భాగవత రచనలు చేశాడు.

ఈ విధంగా అష్టాదశ పురాణ కర్త వ్యాస భగవానుడు కాగా పురాణ వక్తవ్యాస రచిత పురాణాల్ని మొదటగా ప్రవచనం చెప్పింది సూత మహర్షి. సూతుడు పురాణాల్ని చెపుతున్న సమయంలో విన్న శ్రోతలు నైమికారణ్య వాసులు ప్రశాంత చిత్తులైన శౌనికుడు మొదలైన ఎనుబది యెనిమిది వేల మంది ఋషులు.

ఈ రీతిగా పురాణకర్తయగు వ్యాసమహర్షితో పాటు వక్తయగు సూత మహర్షి, శ్రోతలగు శౌనకాదులు మనకు సర్వదా ప్రాతః స్మరణీయులు పురాణ వాఙ్మయాన్ని లోకానుగ్రహ దృష్టితో మనకందించడం ద్వారా మహోపకారం చేశారు. పురాణాలెన్ని?

మహాపురాణాలు, ఉపపురాణాలని రెండు విధాలుగ నున్నవి. వీటిలో మహా పురాణాలు పదునెనిమిది అన్నియే ఉపపురాణాలు.

శ్లో॥ బ్రాహ్మం పాద్మం వైష్ణంచ; వాయుపీయం తథైవచ!
భాగవతం నారదీయం మార్గండేయం చ కీర్తితమ్॥

అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

శ్లో॥ ఆగ్నేయంచ భవిష్యంచ, బ్రహ్మవైవర్తలింగకే

వారాహం చ తథా స్కాంథం, వామనం కూర్మసంజ్ఞికం

మాత్స్యంచ గారుడం తద్బ్రహ్మండాఖ్యమితి త్రిషట్।

అనే ప్రమాణాన్ని బట్టి ప్రధాన పురాణాలు పదునెనిమిది.

1. బ్రహ్మపురాణం 2. పద్మ పురాణం 3. విష్ణు పురాణం 4. శ్రీమద్భాగవత పురాణం 5. వాయు పురాణం 6. నారద పురాణం 7. మార్కండేయ పురాణం 8. అగ్ని పురాణం 9. భవిష్య పురాణం 10. బ్రహ్మవైవర్త పురాణం 11. లింగ పురాణం 12. వరాహ పురాణం 13. స్కాంద పురాణం 14. వామన పురాణం 15. కూర్మ పురాణం 16. మత్స్య పురాణం 17. గరుడ పురాణం 18. బ్రహ్మండ పురాణం అను పేర్లతోనవి పదునెనిమిది ప్రధాన పురాణాలు. వీటిని తేలికగా తీసికోవడానికి చిట్కాలాగా క్రింది శ్లోకం ఉపయోగిస్తున్నది.

మద్వయం భద్వయం చైవ బ్రత్రయం వ చతుష్టయం।

అనాపలింగ కూస్కాని పురాణాని ప్రవక్షతే!!

అనగా మ అనే అక్షరంతో మొదలయ్యే పురాణాలు రెండు

1) మత్స్య పురాణం 2) మార్కండేయ పురాణం

భ – అనే అక్షరంతో మొదలయ్యేవి రెండు

1) భాగవత పురాణం 2) భవిష్య పురాణం

బ్ర– అనే అక్షరంతో మొదలయ్యేవి మూడు

1) బ్రహ్మ పురాణం 2) బ్రహ్మండ పురాణం 3) బ్రహ్మవైవర్తపురాణం

వ – అనే అక్షరంతో ప్రారంభమయ్యే పురాణాలు నాలుగు

1) వాయు పురాణం 2) వామన పురాణం 3) వరాహ పురాణం 4) విష్ణు పురాణం

గ- అనే అక్షరంతో ప్రారంభమయ్యే పురాణం ఒకటి గరుడ పురాణం

కూ -అనే అక్షరంతో ప్రారంభమయ్యే పురాణమొక్కటి కూర్మ పురాణం

స్క - అనే అక్షరంతో ప్రారంభమయ్యేది ఒక్క పురాణం స్కాంధ పురాణం

అష్టాదశ పురాణాలు – శ్రీ మహా విష్ణువు యొక్క అవయవాలు:- ఈవిధంగా అష్టాదశ పురాణాలని లోక వ్యవహారంతో నున్నవి. ఈ అష్టాదశ పురాణాలన్ని శ్రీ మహా విష్ణువు యొక్క శరీరంలోని పదునెనిమిది అవయవాలతోను మహర్షులు పోల్చారు.

అవేమనగా

శ్లో॥ "బ్రాహ్మం మూర్థాహరేదేవ, హృదయం పద్మసంజ్ఞకం।
వైష్ణవం దక్షిణో బాహుః వాయుర్వామోమహేశితుః।
శ్లో॥ ఊరూభాగవతం ప్రోక్తం నాభిఃస్యాన్నారదీయకం।
మార్కండేయం చ దక్షిణాంఘ్రి; వామోహ్యాగ్నేయ ముచ్యతే!!
శ్లో॥ భవిష్యం దక్షిణో జాను, ద్విష్ణోదేవ మహాత్మనః।
బ్రహ్మవైవర్త సంజ్ఞంతు; వామోజానురుదాహృతః!!
శ్లో॥ లైంగంతు గుల్ఫకందక్షం వారాహం వామగుల్ఫకం।
స్కాంధం పురాణం రోమాని, త్వగస్యవామనఃస్తుతమ్!!
శ్లో॥ కౌర్మం పృష్ఠంసమాఖ్యాతం; మాత్స్యం వేధః ప్రకీర్త్యతే।
మజ్జాతుగారుడం ప్రోక్తం; బ్రహ్మాండ మస్తిగియతే!!
ఏవమేవాభవద్విష్ణుః పురాణావయవోహరిః!!"

ఈ పై శ్లోకాల వివరణ మిట్లు చెప్పవచ్చును.

| | | |
|---|---|---|
| 1) బ్రహ్మ పురాణం | – | మహావిష్ణువు యొక్క శిరస్సు |
| 2) పద్మ పురాణం | – | ” హృదయం |
| 3) విష్ణు పురాణం | – | ” కుడిచేయి |
| 4) వాయు పురాణం | – | ” ఎడమ చేయి |
| 5) శ్రీమద్భాగవత పురాణం | – | ” తొడలు |
| 6) నారద పురాణం | – | ” నాభి (బొడ్డు) |
| 7) మార్కండేయ పురాణం | – | ” కుడి పాదం |
| 8) అగ్ని పురాణం | – | ” ఎడమ పాదం |
| 9) భవిష్య పురాణం | – | ” కుడి మోకాలు |
| 10) బ్రహ్మవైవర్త పురాణం | – | ” ఎడమ మోకాలు |
| 11) లింగ పురాణం | – | ” కుడి చీల మండ |
| 12) వరాహ పురాణం | – | ” ఎడమ చీలమండ |
| 13) స్కంధ పురాణం | – | ” కేశములు |
| 14) వామన పురాణం | – | ” చర్మము |
| 15) కూర్మ పురాణం | – | ” వీపు భాగం |
| 16) మత్స్య పురాణం | – | ” మెదడు |
| 17) గరుడ పురాణం | – | ” మాంస సారం |
| 18) బ్రహ్మాండ పురాణం | – | ” ఎముకలు |

### పురాణాల్లో నీతి బోధ :-

పురాణ కథలు వినడం వలన వాటిలోని అమూల్య విషయాలు వెంటనే మన బుద్ధిలోనికి సూటిగా ప్రవేశిస్తాయి. ఇవే విషయాలు వేదాల్లో కూడా ఉన్నవి. కాని వేదార్థాలు పురాణాలవలె సులభ గ్రాహ్యాలు కావు.

ఉదా:- మనుష్యుడు ఎలా పరిపూర్ణుడు కాగలడో, అందుకు కావలసిన సాధనల గూర్చి ఎంతో వివరంగా తెలియ చేస్తున్నది ఈశానోపనిషత్తుకాని యిది అర్థంకావడం ఎంతో కష్టం ఇదే కనుక పురాణాల్లో అయితే దధీచి మహర్షి శిబి చక్రవర్తి కథల వలన ఉదార త్యాగ గుణములు అనసూయ, సీత, సావిత్రి, మదాలస, దమయంతీ మొ॥ వారి చరిత్రల ద్వారా పాతి వ్రత్యగుణము మొ॥ అంశాలు తేలికగా తెలియడం ద్వారా ఆయా సద్గుణాలు మనలో కూడా ప్రవేశించి మనం పరిపూర్ణులం కావడానికి ఎంతో సహకరిస్తాయి.

### పురాణాల ద్వారా కుల తత్త్వ నిర్మూలన:-

నేటి కాలంలో వలె పురాణ కాలంలోని ఆచార వ్యవహారాలు, కులమతాలు సంకుచితాలు కావు. ఈ రోజుల్లో కనిపించే కుల తత్త్వ భావన అప్పట్లో లేదు.

1) ఉదా:- రామాయణ కర్తయైన వాల్మీకి (బోయకులం) ని ఆదికవిగ, మహర్షిగ అందరు గౌరవించి పూజిస్తారు.

2) పవిత్రాంతః కరణుడైన శుకముని మొ॥ వారు సైతం క్షత్రియుడైన జనక మహారాజు నుండి తత్త్వోపదేశం పొందారు.

3) కటికవాడైన ధర్మవ్యాధుని వల్ల కౌశికుడను బ్రాహ్మణ ముని ధర్మోపదేశం పొందాడు.

4) తులాధారుడనే వైశ్యుని వలన జాబాలి మునికి తత్త్వ జ్ఞానోదయమైంది.

5) రాక్షసియైన హిడంబ - క్షత్రియుడైన భీమసేనుల పుత్రుడైన ఘటోత్కచుడు క్షత్రియ వీరులతో కలసి భారత మహా యుద్ధంలో పాల్గొని అనేకుల సంహరించాడు.

6) ఆటవికయైన శబరి సమర్పించిన ఎంగిలి ఫలాల భుజించాడు క్షత్రియుడైన (కులభేదం లేకుండా) శ్రీరాముడు ఈపై ఉదాహరణాల ద్వారా పురాణ కాలంలో ( ఇప్పుడున్నంత హీనంగా) కులతత్త్వజాఢ్యం లేదని స్పష్టమౌతోంది.

7) పురాణకాలం నాటి గాధి పుత్రుడైన విశ్వామిత్రుడు బ్రహ్మర్షి యగుటయు నాతని గౌరవించుటయు త్రిశంఖుని తపోబలముచే రెండవ స్వర్గం నిర్మించి నిలుపుటయు బట్టి ఆనాడు "బ్రహ్మజ్ఞానోవిదితః బ్రాహ్మణ" అని గౌరవించుట బట్టి కులతత్త్వం లేదనవచ్చు.

8) అట్లే (క్షత్రియుడు కాని) బ్రాహ్మణుడైన జమదగ్ని కుమారుడు పరశురాముడు క్షత్రియ ధర్మంగా, ధర్మ బాహ్యులైన కార్తవీర్యాది-క్షత్ర జాతిని ముయ్యేడు సార్లు గాలించి నిర్మూలించుటను బట్టి ఆనాడు కుల ధర్మంకన్నా వృత్తి ధర్మమే ప్రాధాన్యమైంది.

***స్త్రీలను గౌరవించిన పురాణాలు :-***

పురాణ కాలంలో స్త్రీల కెంతో ఉన్నత స్థానం కనిపిస్తుంది.

1) ఒక్క సీత కోసం శ్రీరాముడు ఉన్నత స్థానం లోని రావణాసురుని సర్వనాశనం చేశాడు.

2) నిండు సభలో అవమానింపబడి ద్రౌపది నూరార్చేటందుకు పాండవులు జరిపిన మహాభారత సంగ్రామంలో పదునెనిమిద అక్షౌహిణుల సైన్యం కురువంశం మొత్తం నిర్మూలనమైంది.

3) సతీదేవికి తండ్రియైన దక్షుని వలన జరిగిన అవమానం భరించలేక ఆమె ఆత్మాహుతి చేసికోగా, దాన్ని భరించలేని పరమ శివుడు దక్షయజ్ఞాన్ని విధ్వంసం చేశాడు. ఇట్టి సంఘటనలే గాక స్త్రీల గౌరవాని కద్దం పట్టే మరికొన్ని ఉదాహరణాలిట్లున్నవి.

1) మహావిష్ణువు - లక్ష్మీపతిగా, శివుడు గౌరీపతిగా, బ్రహ్మవాణీపతిగా శ్రీరామ చంద్రుడు సీతాపతిగ పిలువబడుతున్నారు.

2) అంతేగాక శ్రీరామ చంద్రుడు - కౌసల్య నందనుడుగను.
శ్రీకృష్ణుడు - దేవకీసుతుడగను వినాయకుడు ఉమాసుతుడుగాను పాండవులు - కుంతీసుతులుగను స్త్రీల సర్నావహాలతో ( ఉపనామములతో) కీర్తింపబడుచున్నారు.

3) ఇంకా చెప్పాలంటే పూర్వ సమయాల్లో లక్ష్మీనారాయణులు ఉమామహేశ్వరులు, వాణీ హిరణ్యగర్భులుగాను, సీతారాములు అనడం ద్వారా అయ్యవార్లతో పాటు అమ్మవార్లు కూడా ముందు వరుస నుండి పూజలందుకొను చున్నారు.

4) అంటే తల్లిగా, భార్యగా స్త్రీ మూర్తిలోకంలో మన్ననల పొందుతోంది.

5) మరో విశేషమేమంటే మన దేశంలో ఎక్కడాలేని విధంగా పూరీ జగన్నాథంలో బలరామ కృష్ణులతో సమానంగా వారి సోదరి సుభద్రాదేవి నేటికి ఘనంగా పూజలందుకొంటున్నది.

6) ఈ విధంగా అన్ని రకాలుగ ధన్యురాలు స్త్రీ మూర్తి పురాణాల్లోనే కనిపిస్తుంది. ఈ ఉదాహరణలను బట్టి చూస్తే మన పురాణాలు ధర్మశాస్త్రాలు మహిళను మనమెలా గౌరవించాలో తెలియజేస్తున్నాయి."యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తేతత్ర దేవతాః" అని మను ధర్మశాస్త్రం (మనుస్మృతి) తెలియ జేస్తున్నది, మనకు నిదర్శనం.

## పురాణాల క్రమం – అందులోని నిగూఢతత్త్వం :-

అష్టాదశ పురాణాలో ఒక క్రమ పద్ధతి) కను పట్టుచున్నది. మొదటిది బ్రహ్మ పురాణం, రెండవది పద్మ పురాణమనిన్నీ మూడవది విష్ణు పురాణమనీ, ఈ విధంగా వరుసగా ఆయా పురాణాలను పేర్కొనబడుచున్నవి. ఈ క్రమాన్ని పాటించడంలో ఒక నిగూఢ తత్త్వం దాగియున్నది. అదేమంటే

మనకు కనిపించే ఈ బ్రహ్మాండాన్ని ఎవరు సృష్టించారు? అనే సందేహం కల్గుతుంది. దీనికి సమాధానం బ్రహ్మపురాణం చెప్తుంది. స్థావర జంగమాత్మకమైన ఈలోకాలను సృష్టించింది బ్రహ్మయే! అంటే ఆ బ్రాహ్మ స్వరూపాన్ని సమగ్రంగా తెలియజేస్తున్నది తొలిదైన బ్రహ్మపురాణం.

మరి ఈ బ్రహ్మ ఎలా పుట్టాడు? ఎవరు సృష్టించారు? అనే సందేహం కల్గుతుంది. దీనికి సమాధానం బ్రహ్మ పురాణం చెప్తుంది.

మరి ఈ బ్రహ్మ ఎలా పుట్టాడు? అనే ప్రశ్న ఉదయిస్తుంది. అనే ప్రశ్నకు జవాబుగా విష్ణ పురాణం ఉపద్దేశింపబడ్డది? (మూడవది) తర్వాత ప్రశ్న ఈ విష్ణువు కాధారవేమిటి? దీనికి సమాధానం శేషతల్పం విష్ణువుకాధారమని, ఆ ఆదిశేషుని (వాయుభోక్తను) గురించి బోధించే పురాణం – వాయు పురాణం. (నాల్గవది) ఈ ఆదిశుషుని కాధారామైనది క్షీరసాగర మహోధిమదనం, ఈ క్షీర సాగర వర్ణన అద్భుతంగా ఐదవది శ్రీమద్భాగవత పురాణంలో కన్పిస్తుంది. క్షీరసాగరంలోని మహా విష్ణువు యొక్క సన్నిధిలో సదా నారద మహర్షి ఉంటాడనీ, ఆ నారద మహర్షికి సంబంధించిన వివరాలందించేదే నారద పురాణం ( ఆరవది) స్థూలంగా పై ఆరు పురాణాల మూల సిద్ధాంతాన్ని తెలియ చేసేదే ( ఏడవదైన) మార్కండేయ పురాణం.

ఏనిమిదవదైన అగ్ని పురాణంలో అగ్ని దేవుని మహాత్మ్యం చెప్పబడింది.

చరాచరమైన ఈ సృష్టి నిర్మాణంలోను, మరియు అగ్ని యొక్క ఆ విర్భావంలోనూ, విలక్షణమైన పాత్రను నిర్వహించేవాడు సూర్యుడు ఈ సూర్య తత్వం గూర్చి తొమ్మిదవదైన భవిష్యపురాణంలో వివరించబడినది. ఈ ప్రశ్న జవాబులన్ని, అయ్యాక సూక్ష్మదృష్టితో ఆలోచిస్తూ ఒకసారి వెనుకకి (సింహావలోకనం) చేస్తే బ్రహ్మ చేసిన పరిణామమే ఈ సృష్టిని (పదవదైన) బ్రహ్మవైవర్త పురాణం పునరరుద్ఘోషిస్తున్నది.

ఈ విధంగా సృష్టికి మూలమైన పదకొండవదైన బ్రహ్మను ఉపాసించే మార్గాలనుపదేశిస్తున్నది. పదకొండవదైన లింగ పురాణం మరియు పదమూడవదైన స్కాంద పురాణం శివతత్వాన్ని తెల్పుతున్నాయి.

ఇక మహావిష్ణువు యొక్క అవతారాలను, లీలలను వర్ణిస్తున్నాయి. పన్నెండవదైన వరాహపురాణం, మరియు పదునాలు, పదిహేను, పదహారవ పురాణాలైన వామన – కూర్మ – మత్స్యపురాణాలు. ఈ సృష్టి చక్రంలో అటు, ఇటు, తిరుగుచున్న జీవులు, ఏయే కర్మలవలన ఏ యేజన్మలను పొందగలరో, వారు చేసిన పాపపుణ్యాలకు అనుభవించు రౌరవాది నరకములెట్టివో పదియేడవదైన గరుడ పురాణం వివరిస్తుంది.

సృష్టిలోని లోకాల స్థితి–గతుల యొక్క ఆధారాన్ని తెలియజేసేది పదునెనిమిదవది చివరిదైన బ్రహ్మాండపురాణం.

ఇదీ పురాణాల క్రమం ఇది ఒక ఊహాకల్పన మాత్రమే అయితే పై విషయాలే గాక, మరెన్నో ఇతర విషయాలు కూడా పై పదునెనిమిది పురాణాలన్నింటిలోను ఉన్నాయి. కానీ, ప్రధానంగా చెప్పండిన విషయాలను మాత్రం దృష్టిలోనుంచుకొని ఈ పై క్రమం (పద్ధతి) చెప్పవచ్చుననుట సమంజసం.

**పురాణాలలో యోగ సిద్ధులు :-**

మానవుడు ఏకాగ్ర చిత్తంతో వ్యవహరిస్తే అద్భుతాలైన అణిమాది అష్టసిద్ధులను పొందవచ్చునని పురాణాలు చెప్తున్నాయి. తద్వారా ఏ అసాధ్యమైన పని వైనా సుసాధ్యం చేయువచ్చును. ఇలా చేయడం ద్వారా ఇహలోకంలో కీర్తిని, పరలోకంలో భగవత్సాయుజ్యాన్ని సైతం పొందవచ్చునని అష్టాదశ పురాణాలు ఉద్బోధిస్తున్నాయి.

**ఉదా:-**

పరశురాముడు తన తండ్రియైన జమదగ్ని మహర్షి ఆజ్ఞను శిరసావహించి తన తల్లియైన రేణుకాదేవి శిరస్సు నరికాడు. పితృవాక్య పరిపాలనతో సంతుష్టుడైన జమదగ్ని తపస్సిద్ధివల్ల మళ్ళీ పరశురాముని మాతృభక్తితో కోరిన కోర్కె మేరకు భార్యను బతికిస్తాడు. అలాగే, భగీరథుడు గంగను భూలోకానికి అవతరింప జేయడం, అగస్త్యుడు మహా సముద్రాన్ని ఆచమనం చేసి త్రాగివేయడం మొదలైన సంఘటనలకు కారణం వారి పురాణ ఋషుల తపస్సిద్ధియే.

సీతాన్వేషణకై లంకకు వెళ్లున్న హనుమంతున్ని సముద్ర మధ్యంలో ఛాయా గ్రహణం చేసి ఆపుతుంది, సురస అనే రాక్షసి అతన్ని మింగాలని ప్రయత్నిస్తుంది. అపుడా రాక్షసి కంటే ఎన్నోరెట్లు యోగసిద్ధితో శరీరాన్ని పెంచాడు పవనసుతుడు. ఇది అతని మహిమ సిద్ధికి నిదర్శనం. సంజయుడు యుద్ధ భూమికెంతో దూరంగా హస్తినలోనున్నప్పటికీ కురుక్షేత్రంలో జరుగుచున్న మహా భారత సంగ్రామాన్ని యథాతథంగా దివ్య దృష్టితో చూచి, ధృతరాష్ట్రునికి ప్రత్యక్ష వ్యాఖ్యానం చేయగలిగాడు. దీనికి కారణం వ్యాస మహర్షి తన యోగ సిద్ధి ద్వారా ఆతనికిచ్చిన దివ్యదృష్టియే అనవచ్చును.

యోగ సిద్ధులను గురించి ఇలాంటి ఉదాహరణాలనెన్నియైనా ఉదహరించవచ్చును. బ్రహ్మవైవర్త పురాణంలో ఈ విధమైన యోగసిద్ధులు ఇరువది రెండు చెప్పబడ్డవి. అవి :-

1) అణిమ 2) అఘిమ 3) ప్రాప్తి 4) ప్రాకామ్యం 5) మహిమ 6) ఈశిత్వం 7) వశిత్వం 8) కామనసాయిత్వం 9) దూర శ్రవణం 10) పరకాయ ప్రవేశం 11) మనోజవత్త్వం 12) సర్వజ్ఞత్వం 13) అభీష్టం 14) అగ్ని స్తంభనం 15) చిరంజీవత్వం 16) వాయు స్తంభనం 18) క్షుత్పిపాసా నిద్రాస్థంభనం 19) వాక్సిద్ధి 20) వృతానయనం 21) సృష్టికరణం 22) ప్రాణాకర్షణం అన్నవి అణిమాది సిద్ధుల నియోగ శాస్త్రం చెప్పుతుంది.

వీటిని చెప్పుటేగాక ఇవి యెలా సిద్ధిస్తాయోకూడా బ్రహ్మవైవర్త పురాణం చెబుతోంది. అయితే సాధనలో పరిశుద్ధత లేక పోవడం వల్ల నియమాదుల సక్రమంగా అనుష్టించక పోవడం మొ॥న కారణాల వలన ఈ అణిమాది సిద్ధులు నేటి మానవులకు వశం కావడం లేదు. కాని నిర్మలాంతః కరణంతో, ఏ యితర దుర్వాసనలను దరిచేరనీయక ప్రయత్నిస్తే ఇవి తప్పక సిద్ధిస్తాయి.

ఈ విధంగా మానవాళికుపయోగపడే ఎన్నో యోగసిద్ధి రహస్యాలు మన పురాణాల్లో నిక్షిప్తమైయున్నది.

అష్టాదశ పురాణాల్లోని ప్రధాన సందేశాలివి క్రింద ఉల్లేఖింపబడ్డాయి.

1) ధర్మాన్ని రక్షించడం ద్వారా రాజ్యం, స్వర్గం, ఆయువు, కీర్తి ప్రతిష్టలు మోక్షం మొదలైనవి సిద్ధిస్తాయని బ్రహ్మపురాణం ఉపదేశిస్తున్నది.

2) శివ-కేశవుల మధ్య భేదం లేదనీ ఈ కారణంగా వారిని భేదభావంతో చూడరాదని విష్ణు పురాణం సందేశం

3) గయాక్షేత్రాన్ని దర్శించి వచ్చిన పుత్రుడు తల్లిదండ్రులకు అమితానందాన్ని కలుగజేస్తాడని వాయు పురాణ కథనం.

4) సృష్టిలోని సమస్తమూ దర్శనీయం అని పద్మ పురాణం ఉపదేశిస్తుంది.

5) మోక్షసాధనాల్లో అత్యుత్తమ మైనది భక్తియొక్కటే అంటూ భక్తి తత్వాన్ని సూచిస్తోంది శ్రీ మద్భాగవత పురాణం.

6) ఏకాదశి వ్రతాన్ని నియమ – నిష్టలతో ఆచరించాలని, తద్వారా అభీష్టాలన్నీ సిద్ధిస్తాయని రుక్మాంగద చరిత్ర ద్వారా నారద పురాణం మనకు ఉపదేశిస్తున్నది.

7) దుర్గాసప్తశతి పారాయణ ద్వారా సంపదల్లోను, ఆపదల్లోను దేవి కృపచే శ్రేయస్సు కల్గుతుందని మార్కండేయ పురాణోక్తి సందేశం.

8) ఉత్పత్తి – ప్రళయాలను, ప్రాణుల జీవన – మరణాలను, విద్య – అవిద్యలను తెలిసినవాడే భగవంతుడని అగ్ని పురాణం నిర్దేశిస్తున్నది.

9) సూర్య భగవానుని మహిమల తెలియ జేస్తోంది. భవిష్య పురాణం. ఆదిత్య హృదయాన్ని బోధిస్తున్నది లింగ పురాణం

10) అతిథులను గౌరవించడం అలవరచుకోవాలని బ్రహ్మవైవర్త పురాణం హితోపదేశం చేస్తున్నది.

11) కాశీక్షేత్ర మహాత్మ్యన్ని బోధిస్తున్నది లింగ పురాణం

12) యమునా సరస్వతుల సంగమంలో విష్ణు పూజ సకలాభీష్ట ప్రదాయకమని వరాహ పురాణం వక్కాణిస్తోంది.

13) శ్రీ సత్యనారాయణ స్వామి వ్రత మాహాత్మ్యమును దేవాలయ జీర్ణోద్ధరణ ఫలితాన్ని స్కాంద పురాణం తెలియజేస్తున్నది.

14) విష్ణు భక్తులు, విష్ణు మందిరాలను పూజించాలని వామన పురాణం వివరిస్తోంది.

15) తమ బాధ్యతలను విస్మరించి పుణ్యక్షేత్రాల దర్శన సెపంతో వెళ్ళరాదని కూర్మ పురాణం హితోక్తిగా సందేశం తెల్పుతోంది.

16) మరణించిన పితృదేవతలకు భక్తి శ్రద్ధలతో శ్రాద్ధవిధిని జరపాలని మత్స్య పురాణం ఉపదేశిస్తున్నది.

17) అగ్ర వర్ణాల వారు తమ క్రింది (నీచ) కులాల వారిని, నీచ దృష్టితో చూడరాదని, అలా చూస్తే రౌరవాది నరకం వస్తుందని గరుడ పురాణం హెచ్చరిస్తోంది.

18) భారత దేశపు భౌగోళిక వర్ణన - నక్షత్రాలకు సంబంధించి (ఖగోళ) విజ్ఞాన వివరణనిస్తోంది. బ్రహ్మాండ పురాణం.

అష్టాదశ పురాణాల్లో ఇన్ని నిధినిక్షేపాలున్నవి కనుకనే మన దేశంలో నేటికి ఎన్నో దేవాలయాల్లో ధర్మోపన్యాసాలు నిత్య పురాణ ప్రవచనాలు (టి.టి.డి. హిందూ ధర్మ ప్రచారిణి పరిషత్తు) వంటి ఆధ్యాత్మిక ప్రచార సభల వలన, జరుగుతున్నవి. పురాణాల్లో ఆధ్యాత్మిక విషయాలే కాక ప్రజా సామాన్యానికుపయోగ పడే రీతులు నీతులు ఎన్నో మనకు దర్శనమిస్తాయి.

## వ్యాసమహర్షి పురాణాలకు ఆధారమేమి?

ఇలా ఉండగా వ్యాస మహర్షి, అష్టాదశ పురాణాల రచనలో దేన్ని ఆధారంగా తీసికొన్నాడన్న ప్రశ్న ఉదయిస్తుంది. దీనికి సమాధానంగా 1) ఆఖ్యానం2) గాథ3) కల్పశుద్ధి అనే నాల్గు విషయాలను పురాణ రచనకు ఆధారంగా తీసికొని రచించాడని చెప్పవచ్చును.

ఇందులో:- 1) ఆఖ్యానమంటే స్వయంగా తను చూచిన సంఘటన వృత్తాంతాన్ని కథా రూపకంగా మలచి చెప్పడం, లేక రచించడం!

2) ఉపాఖ్యానం అనగా వ్యాసుడు తన పురాణాలలో రచించిన శ్రీరామ కథ, సత్య హరిశ్చంద్ర కథ మొ॥ ఉపాఖ్యానాలన వచ్చును. అగును.

3) గాథలు:- కొందరు మహా పురుషుల వైశిష్ట్యాన్ని తెలిపే శ్లోకాలున్నాయి.

కాని వాటి కర్తయెవరో తెలియకుంటుంది. అటువంటి శ్లోకాలను తీసికొని వర్ణిస్తే వానిని పూర్వగాథలంటారు.

ఉదా:- వాయు పురాణంలోని పితృగాథ, విష్ణు పురాణంలోని కార్తవీర్యగాథ.

4) కల్పశుద్ధి:- అనగా శ్రాద్ధకల్పమని అర్థం. దాని ద్వారా శ్రాద్ధ కర్మల గూర్చి మత్స్య పురాణం రచించారు. ఈ విధంగా పై నాల్గు విషయాలను ఆధారంగా తీసికొని వేద వ్యాస మహర్షి అష్టాదశ పురాణాలను రచన చేశాడని చెప్పవచ్చు.

*పురాణాలు మోక్షదాయకాలు :-*

1) సృష్టిలోని ప్రతి మానవుడు సుఖాన్నే ఆశిస్తాడు దుఃఖాలు తనకు రాకూడదని అనుకుంటాడు. అయితే మోక్షం తప్ప మిగిలిన భౌతిక సౌఖ్యాలన్నీ తాత్కాలికాలే! అశాశ్వతాలే అవుతాయి.

2) వామనుడు తెల్పినట్లు 'అశాపాశము తాగడున్‌బొడవు లేదంతంబు రాజేంద్ర! వారాశిప్రావృతమేదినీ వలయు సామ్రాజ్యంబు చేజిక్కనన్ గాసిందిరిగాక వైన్యగయ భూకాంతుల్ అన్నట్లు తీరని కోర్కెలే మానవులకు ఎక్కువగా ఉంటూ పరితపిస్తుంటారు. కాని "సంతృప్తిజెందని మానవుడు సప్తద్వీపములు లభ్యమైన - చక్కబడలే'డట! ఇది యథార్థదైవవాక్కు.

3) ఈ విధంగా మనిషి ఆశకు అంతుండదు కనుక శాశ్వతమైన సుఖం ముల్లోవల దాటిన (త్రికాలాతీతమైన) ది మోక్షము మాత్రమే శాశ్వతం. ఈ మోక్షాన్నే ముక్తి అనీ, కైవల్యమనీ, నిశ్శ్రేయసమనీ, పరమ పురుషార్థమనీ ఆర్యులు బోధిస్తారు.

4) ఈ భావాన్నే భర్తృహరి వైరాగ్య శతకంలో చెప్పారు.'పుష్పగుచ్ఛంబునకు బోలె బోనగుశౌర్యమానవంతునకివి రెండు మహితగతులు సకల జనమస్తక ప్రదేశములనైన వనమునందైన జీర్ణ భావంబు జెందు'. అనగా మోక్షము పొందువని భావము.

5) పురాణాల అధ్యయనము వలన మోక్షం ప్రాప్తిస్తుందనుట యధార్థమైనది.

6) పురాణాలలో గొప్ప మహత్త్వమున్నది కనుకనే నేటికిని అనేక పుణ్య స్థలాల దేవాలయాలందు పురాణ ప్రవచనం టి.టి.డి వంటి ధార్మిక ప్రచార సంస్థల ద్వారా జరుగుతోంది.

7) భవరోగానికి మహౌషధం పురాణాలు వాటి పఠన పాఠనములు

"శ్లో॥ అష్టాదశ పురాణానాం నామధేయాని యః పఠేత్!
త్రిసంధ్యం జపతేనిత్యం సోశ్వమేధ ఫలంలభేత్!!"

ఈ అష్టాదశ మహా పురాణాల పేర్లను ఉదయు, మధ్యాహ్న సాయం సమయాల్లో ఎవరైతే పఠిస్తారో వారు అశ్వమేధయాగ ఫలాన్ని పొందగలరని పై శ్లోక భావము.

ఇంతటి గొప్ప తనాన్ని సంతరించుకున్న అష్టాదశ పురాణాలను మనకు ప్రసాదించిన విష్ణు స్వరూపుడైన వ్యాస మహర్షి ధన్యజీవి. ఈ విధంగా సర్వదా వ్యాస భగవానుడు మనకు ప్రాతస్మరణీయుడైనాడని చెప్ప నొప్పును.

"వ్యాసం వశిష్ఠ నప్తారం, శక్తే పౌత్ర మకల్మషమ్!
పరాశరాత్మజం వన్దే శుకతాతం తపోనిధిమ్!!

వ్యాపాయ విష్ణురూపాయ, వ్యాసరూనాయ విష్ణవే!
నమోవై బ్రహ్మనిధయే, వాశిష్టాయనమోనమః

నారాయణం నమస్కృత్యా నరంచైవ నరోత్తమమ్!
దేవీం సరస్వతీం వ్యాసం తతో జయ ముదీరయేత్!"

# 1. బ్రహ్మ పురాణము

ఆద్యం సర్వపురాణానాం, పురాణం బ్రహ్మముచ్యతే

అష్టాదశ మహా పురాణాల్లో మొట్టమొదటిది బ్రహ్మపురాణం

"బ్రహ్మం మూర్ధా హరేరేవ" అనే శ్లోకానుసారం మహా విష్ణువు యొక్క శిరస్సుతో పోల్చబడినదీ పురాణం.

సగటు మానవుడు ధర్మార్థ కామ మోక్షాలను ఎలా సాధించగలడో తెలియచేయడానికెన్నో ఆఖ్యానాలు, ఉపాఖ్యానాలిందున్నాయి. "నానా ఖ్యానేతిహాసాఢ్యం దశ సహస్ర వముచ్చతే" అను శ్లోకానుసారం బ్రహ్మపురాణంలో పదివేల శ్లోకాలున్నవి. 1) పూర్వభాగం 2) ఉత్తరభాగం అని రెండు భాగాలున్నవి. మొత్తం రెండు వందల నలువది యారధ్యాయాలున్నది.

ధర్మంతాలూకు మహిమ ఈ విధంగా బ్రహ్మపురాణంలో ఇలా వర్ణింపబడింది. ధర్మేణ రాజ్యంలభతే మనుష్యః స్వర్గంచ ధర్మేనరః ప్రయాతి! ఆయుశ్చ కీర్తించ తపః ప్రతిష్ఠాం ధర్మేణ మోక్షం లభతే మనుష్యః!!

ధర్మం వల్ల రాజ్య ప్రాప్తి స్వర్గ ప్రాప్తి, ఆయువు, కీర్తి, తపస్సు, ప్రతిష్ఠ చివరికి మోక్షం మొ॥న కోరికలన్నీ సిద్ధిస్తాయని భావం.

బ్రహ్మ పురాణం అనే పేరు వినేసరికి బహుశా బ్రహ్మదేవునికి సంబంధించిన కథా విశేషుంటాయేమోనని ఊహ చాలా మందికి కలుగుతుంది. అయితే వాస్తవానికి మహా విష్ణువు యొక్క మాహాత్మ్యాన్నిది తెలియజేస్తున్నది.

నైమిశారణ్య వర్ణన మహాప్రళయం, అవాంతర ప్రళయాలు, హరిశ్చంద్ర, సగర, భగీరథుల చరిత్ర వసుదేవుని పుట్టుక. భూగోళం, సప్త ద్వీప వర్ణనలు సూర్య పూజా మాహాత్మ్యం కామదహనం, పార్వతీ స్వయంవరము ఇంద్రద్యుమ్న చరితం, పూరీ జగన్నాథక్షేత్ర వర్ణన నరసింహ స్వామి, దేవీ వృత్తాంతం, శునశ్శేఫ చరితం, క్షీరసాగర మథనం, దధీచి, మహర్షి వృత్తాంతం ఆత్రేయ ఋషి వృత్తాంతం,మార్కండేయుభక్తి ప్రభావం, అప్సరసలు విశ్వామిత్రుని తపస్సు భంగ పరచడం ద్వారా శాపవశంచే నదులుగా రూపొందుట. వరాహ, నారసింహ దత్తాత్రేయ – పరశురామ, శ్రీరామ, శ్రీకృష్ణావతారాల వర్ణన మొ॥ అనేక విషయాలు బ్రహ్మ పురాణమందు వర్ణింప బడియున్నవి.

శ్లో॥ "పృథివ్యాం భారతం వర్షం, దండకం తత్ర పుణ్యదం!
తస్మిన్ క్షేత్రే కృతం కర్మ, భక్తిముక్తి ప్రదంనృణామ్
శ్లో॥ తీర్థానాంగౌతమీ గంగా, శ్రేష్టాముక్తి ప్రదానృణాం!
తత్ర యజ్ఞేన దానేన భోగాన్ముక్తి రవాప్స్యతి!!"

సమస్త భూమండలంలో భారత దేశం సర్వ శ్రేష్టమైనదనీ, అందునా దండకారణ్యం పుణ్యప్రదాయక ప్రదేశమనీ, ఈ దేశంలో ప్రవహించే నదుల్లో గంగా, గోదావరి నదులు ప్రముఖమైనవని తెలియజేస్తున్నది.

పరస్త్రీలను కామించరాదనీ అలా చేస్తే ఆ పురుషులు పాపాత్ములై నపుంసకులవుతారని బ్రహ్మపురాణం హెచ్చరిస్తున్నది. భక్తిముక్తి ప్రదాయకమైన ఒక కథ ఈ పురాణంలో ఇలా వర్ణింపబడింది.

పూర్వం గౌతమీ నదీ తీరంలో కండువు అనే మహర్షి నివసిస్తుండేవాడు. ఇతడు సత్యవాది. ఇంద్రియ నిగ్రహం కలవాడు. మరియు

వేదదేవాంగాలలో నిష్ణాతుడు. కందమూలాలు సమిదలు చక్కని పూలతో గూడిన మున్యాశ్రమం నిర్మించుకొని మౌన దీక్షతో ఉగ్ర తపస్సు చేస్తుండేవాడు. వేసవిలో పంచాగ్నుల నడుమ వానాకాలంలో కటిక నేలమీద, శీతాకాలంలో తడిబట్టలతో మంచులో సాగించాడు తన తపస్సు. ఈ తపోదీక్ష చూచి దేవతలాశ్చర్యపడ్డారు. ఇతని తపోభంగానికి**ప్రమ్లోచన** అనే అప్సరసను నియమించాడింద్రుడు. తనకంతటి శక్తిసామర్థ్యాలు లేవని ఊర్వశి మొ॥ వారే ఇందులకు తగినవారని ప్రమ్లోచన యింద్రునితో విన్నవించుకుంది. అందుకింద్రుడు "మరేం పరావాలేదు. మన్మధుడు వసంతుడు వాయువు నీకు తోడుంటారు. నిర్భయంగా వెళ్ళు" అన్నాడు.

ప్రమ్లోచన కండువాశ్రమానికి వెళ్ళింది. తన నృత్యగీత వాద్యాలతో ముని తపస్సును భంగం చేసింది. ఆమె సౌందర్యాన్ని చూచి అజడదారి కాముని చేష్టలకులోనై మంచువలె కరిగిపోయాడు. మనస్సు వశం తప్పింది. ఆ సౌందర్యరాశి వివరాల నడిగాడు పూలకోసం వచ్చానంది. ఆదేశిస్తే తమ ఆజ్ఞను శిరసావహిస్తానంది. మరేమి మాట్లాడక సాదరంగా ఆశ్రమంలోనికి ప్రమ్లోచనను తోడ్కొని వెళ్ళాడు కండువు. తపోబలంతో దివ్య యౌవనాలను, దివ్య వస్త్రాలను పొందాడు. ఇదివరకున్న జడదారి వేషధారణలోని గడ్డం అడ్డంలేదిపుడు, అతని నవ యౌవన యువక సౌందర్యం చూచి ప్రమ్లోచన ఆశ్చర్యపోయింది. కామవశుడయ్యాడాముని, జపతపాదులు ఉపవాస నియమాలు పూర్తిగా మరచాడాతడు. పగలు రేయనే తేడా లేక ఆమెతో సర్వదా కలిసి అమర సుఖాలు పొందాడు. ఇలా నూరేళ్ళు కాలం గడిచింది. నేను స్వర్గానికి వెళ్ళాలి అంది ప్రమ్లోచన. మరి కొద్ది రోజులాగమన్నాడు. సరేనంది. ఇంకో నూరేళ్ళు యుగమొక క్షణంగా కాలజ్ఞానమే లేకుండా గడిచాయి. ఇలా ఎన్నో సార్లు జరిగింది.

ఇలా ఉండగా, ఒక దినం వేకువనే లేచి హడావిడిగ ఆశ్రమం నుండి బయలు దేరాడు ముని. తమరెక్కడికని ప్రమ్లోచన మునినడిగింది. "తెల్లవారింది కదా సంధ్యావందనానికి వెళ్ళాలి మరి లేకపోతే అనుష్ఠానం లోపిస్తుంది." అని ముని సమాధానమిచ్చాడు. "ఇప్పుడా నీకు తెల్లవారింది? నీ అనుష్ఠానం ఎప్పుడో భ్రష్టమైనది" అన్నది అప్సరస. "అదేమిటీ? కొద్ది సేపటి కిందటే గదా! నీవొచ్చావు," అన్నాడు. "నేను వేకువ జామున వచ్చిన విషయం వాస్తవమే! అయితే అది ఇవాళ కాదు. కొన్ని వందల సంవత్సరాల క్రితం" అన్నదామె. నమ్మలేదతడు. ఇప్పటికి 9007 (తొమ్మిది వేల ఏడు సంవత్సరాల ఆరునెలల మూడు రోజులైందని అసలు విషయం తెలిసిందాతనకి.

**కండుమునికి** జ్ఞానోదయమైంది. తను చేసిన అపచారాన్ని స్త్రీ వ్యసనం, తపోభంగం గూర్చి తెలిసికొన్నాడు. తన వివేకం భ్రష్టు పట్టినందులకు మిగుల పశ్చాత్తాప పడ్డాడు. తన్ను తాను తిట్టుకొని ఆత్మ విమర్శ చేసికొన్నడు. **ప్రమ్లోచనను** వెంటనే ఆశ్రమం విడిచి పొమ్మన్నాడు. భయంతో ఆమె స్వర్గానికి వెళ్ళింది.

ఆ ముని తన పాప ప్రక్షాళనార్థం ఆశ్రమం వదలి పురుషోత్తమ క్షేత్రమైన పూరీ జగన్నాథ క్షేత్రానికి వెళ్ళాడు. దక్షిణాన తూర్పు సముద్ర తీరాన పూరీ జగన్నాథ స్వామిని స్మరిస్తూ తపోదీక్షబూనాడు. ఊర్ధ్వ బాహువులతో బ్రహ్మోపాసన అనే మహామంత్రం జపించాడు. అచంచలమైన అతని భక్తి కి సంతసించాడు, హరి మెచ్చి వరం కోరుకొమ్మనగా మోక్షం కోరాడు ముని. ఈ క్షేత్రంలో నిత్యము తనను సేవిస్తే అభీష్టం నెరవేరుతందన్నాడు. జగన్నాథుడభయహస్తంతో అలాగే ఆచరించాడు ముని. కొంతకాలం తర్వాత స్వామి మునికి ముక్తి ప్రసాదించాడు.

## కార్తవీర్యార్జుని కథ

పురువంశంలో కనకుడనే రాజుండేవాడు. అతనికి నల్గురు 1. కృతవీర్యుడు. 2. కృతధన్వుడు 3. కృతౌజసుడు 4. కృతాగ్ని లను కుమారులుండిరి. ఆ కృతవీర్యుని కుమారుడే కార్తవీర్యార్జునుడు లేక కార్తవరాయుడు.

*కార్తవీర్యార్జునుడు* :- ఇతడు సమస్త భూమండలాన్ని పరిపాలించాడు. పదివేల సంవత్సరాలపాటు మహాభయంకరమైన తపస్సు చేసి, దత్తాత్రేయ మహర్షిని మెప్పించి ప్రసన్నం చేసికొని నాల్గువరాలు పొందాడు. అవియేమనగా
1. వేయి చేతులుండుట 2. సజ్జనులను సంరక్షించుట 3. ధర్మపరిపాలన
4. యుద్ధభూమిలో తనకంటే గొప్ప వీరుని చేతిలో వీర మరణం పొందడం అన్నవి. ఇవీ అతని కోరికలు దత్తాత్రేయ స్వామి "తథాస్తు" అని వరాలిచ్చాడు.
5. సప్త ద్వీపాలలో సప్త శత యాగాలు నిర్వర్తించాడు.
6. ఇతని అద్భుత వీర చరిత్రను నారద మహర్షియే గంధర్వగానం చేశాడు.
7. లంకాధిపతి రావణున్ని సహితం అవలీలగా జయించి మహిష్మతీనగరంలో లో బంధించాడు. చివరికి పులస్త్య బ్రహ్మ వచ్చి పాత్ర దానం కోరగా రావణున్ని వదిలాడు.

ఒకసారి అగ్నిదేవుడు తన దాహం తీర్చమని ఇతన్ని కోరాడు. వెంటనే సప్తద్వీపాల్ని అతనికి భిక్షగా సమర్పించాడతడు. అంతే సప్త ద్వీపాలలోని కొండలు, అడవులు మొదలగు వాటిని దహించాడగ్ని. అప్పుడా విధ్వంసంలో ఆపవుడు అనే మున్యాశ్రమం కూడ అగ్నికి ఆహుతియైంది. వరుణపుత్రుడైన ఆపవుడు మహాతపస్వి. ఆ దృశ్యాన్ని భరించలేక జమదగ్నికి జన్మింపబోయే పరశురాముని చేత కార్తవీర్యార్జునుడు సంహరింపబడుతాడని శాపమిచ్చాడు.

చివరకు పరశురాముని కామధేనువును దౌర్జన్యంగా గొనిపోవుటచే అతని గండ్రగొడ్డలికి బలియై, అతనిచే వీర మరణం పొందాడు కార్తవీర్యుడు.

"కార్తవీర్యస్యయోజన్మ కథయే దిహ నిత్యశః

నతస్య విత్త నాశః స్యాన్నష్టం ప్రతిలభేచ్చస:"

ఈ కార్తవీర్యార్జుని కథ పఠించిన వారికి ధన నాశం జరుగదు. పోయిన సొమ్ము తిరిగి లభిస్తుంది అని పై శ్లోక సారాంశం. ఇట్టి అద్భుతమైన కార్తవీర్యార్జుని చరిత్ర బ్రహ్మపురాణంలో ఇలా ఎంతో విపులంగా వర్ణింపబడింది. కార్తవరాయుని కథగా స్త్రీలపాటల్లో చేరింది.

"శ్లో॥ ఇదంయు:శ్రద్ధయానిత్యం పురాణం వేద సమ్మితం!

యః పఠేచ్ఛృణుయాన్మర్త్యః సయాతి భువనం హరేః!!"

భావం:- ఎవరైతే ఈ బ్రహ్మపురాణాన్ని శ్రద్ధగా విందురో? చదివెదరో వారు శ్రీహరి నిలయమైన వైకుంఠం చేరగలరు.

ఈ మహాపురాణమును శ్రీ వేదవ్యాసమహర్షి వర్యులు జైమినితో జెప్పినట్లు వ్రాయబడినది.

పూర్వమొకప్పుడు జైమిని వ్యాసుని దర్శించుటకు బోయి ఆయన సావకాశముగా నుండుట జూచి యిట్లనెను:"గురువర్యా! చాలకాలమునుండి మీవలన సవిస్తరముగా బ్రహ్మపురాణము వినవలయునని మనస్సు ప్రేరేపించుచున్నది. అద్దాని వినిపించి నన్ను గృతార్థుని చేయువలెనని" మిగుల వినయముతో ప్రార్థింపగా, ఆయన ఇట్లు జెప్పనారంభించెను."ఓయీ! పూర్వము బ్రహ్మమానసపుత్రుడగు కశ్యప ప్రజాపతి కిరువురు భార్యలు

లుండిరి. వారిలో మొదటిది దితి, రెండవది అదితి. దితి సంతతి వారికి దైత్యులు అనియు, అదితిసంతతి వారికి ఆదితేయులనియు పేర్లు. ఆ దైత్యులే అసురులు, దానవులు, దనుజాలు, రాక్షసులు అను పెక్కు పేరుల వ్యవహరింపబడిరి. ఆదితేయులు అమరులు, నిర్జరులు, దేవతలు, సురులు మున్నగు పేరుల బరగిరి. దితికి ఒకప్పుడు ఇరువది యేడుగురు కన్యలుద్భవించిరి. వారికే నక్షత్రము లని పేరు.

# నక్షత్రముల జన్మము

వారెవరనగా: అశ్విని, భరణి, కృత్తిక, రోహిణి, మృగశిర, ఆర్ద్ర పునర్వసు,పుష్యమి, ఆశ్లేష, మఖ, పుబ్బ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, విశాఖ, అనురాధ, జ్యేష్ఠ, మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ, శ్రవణము, ధనిష్ఠ, శతభిషము, పూర్వాభాద్ర, ఉత్తరాద్ర, రేవతి, వీరిలో మొదటి తొమ్మండ్రు గురిలో రోహిణియు, రెండవ తొమ్మండ్రు గురిలో అనూరాధయు, మిగిలిన తొమ్మండ్రు గురిలో ధనిష్ఠయు మిగుల సుందరులు. వీరందరిలో రోహిణి మిక్కిలి చక్కనినది. ఒక దినమున సాయంకాలము కశ్యపుడు తన కుమార్తెలను వద్దనుంచుకొని చల్లగాలికై ఉద్యానవనమున నుండగా, పరమమిత్రుడగు దక్షప్రజాపతి ఆయనను చూచుటకు బోయెను. వారుభయులు కొంతసేపు మాట్లాడుకొనుచుండిరి. దక్షుడు ఆపిల్లలను చూచి చాల ముచ్చటపడి, లాలించుచుండెను. అది చూచి కశ్యపుడాకన్యలను దక్షున కిచ్చి ప్రేమతో నాదరించుచుండు మని చెప్పెను. దక్షప్రజాపతియు మిగిలసంతసించి వారిని దోడుకొని తన యింటికి బోయి, తన భార్య కొప్పగించెను. వారు దినదిన ప్రవర్ధమానులై పెరుగుచుండిరి. కొంత కాలమునకు వారికి యౌవన మంకురించెను.

## నక్షత్రములకు చంద్రునితో వివాహము

ఇట్లుయుక్త వయస్సునందు పొంది ప్రకాశించుచున్న కుమార్తెలనుదక్షుడు చూచి, వారికి వివాహం చేయుటకు దగిన కాలము వచ్చినదని ఋషులను బిలిపించి, వారితో నిట్లనెను: "ఆర్యులారా! నా యీ కన్యలకు వివాహము చేయవలసియున్నది. వీరి నందఱిని గుణాధిక్యము, శాంత స్వభావము, సౌందర్యముగల ఒక్కనికే ఇచ్చి వివాహ మొనర్చవలెనని నా యీప్సితము. ఇట్టి పురుషుని మీరు నిశ్చయింపు" డనెను. వారందఱును కొంత సేపాలోచించి, వారిలో దంతవక్త్రుడిట్లనియె"అయ్యా! చంద్రుడను వాడొకడున్నాడు. అతడు యజుర్వేదజుడు. శాంతగుణస్వభావుడు. 27 దినవములలో మేషము. వృషభము, మిథునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము, ధనస్సు, మకరము, కుంభము, మీనము అను పండ్రెండు రాసులయందును సంచరించును. 27 గడియలకొక కరణము చొప్పున పదునొకండు కరణములందు సంచరించును. బవ, బాలవ, కౌలవ, తైతుల, గరజి, వణజి, భద్ర, శకుని, చతుష్పాత్తు, నాగము,కిమస్తుఘ్నము అనునవి కరణములు. ఈ ముప్పది మూడు కోట్ల దేవతలలో చంద్రుడు మిక్కిలి చక్కనివాడు. ఈ కన్యకలనువాని కిచ్చి వివాహమొనరుట యనుకూలముగా నుండునని మాకు తోచుచున్నది." ఈ మాటలు విని దక్షుడంగీకరించి, చంద్రునికి కుమార్తెల నియ్య నిశ్చయించి తగిన వారిచే వర్తమానమంపెను. చంద్రుడు తన అంగీకారమొసంగెను. అప్పుడు సుముహూర్తము నందు ఆ చంద్రుని మెడలోవైచి వరించిరి. పిమ్మట దక్షుడు కన్యకలను ధారబోసి యథావిధిగా వివాహము పూర్తిచేసి, దేవతలకు సత్కారముల నొనర్చి పంపెను. చంద్రుడును పత్నులతో గూడి నిజగృహము జేరెను.

## చంద్రునికి క్షయరోగము కలుగుటకు కారణము

జైమిని వ్యాసుని జూచి, "ఆర్యా! చంద్రుడు చాల చక్కని వాడని కదా దక్షుడు వానికి బిడ్డల నిచ్చెను? అట్టి వానికి వృద్ధిక్షయములు కలుగుటకు గారణమేమి? ఈ సందేహమును మీరు తీర్చవలెను" అనగా వ్యాసుడిట్లనెను: "ఔను! చంద్రుడు పదునాఱు కళలు గలవాడగుటచే చక్కనివాడే. ఇరువదియేడు గురు నక్షత్రములను వివాహముమయ్యెనుగదా! వారి నందఱిని సమానముగా నాదరింపవలెను. కాని, భేదబుద్ధి జూపవచ్చునా! ఇతడు భార్యలలో మిక్కిలి సుందరియైన రోహిణియందు మిగుల ప్రీతిగలవాడై కడమ వారిని నిరాదరించుచుండెను. అందుకు వారు దుఃఖించి భరింపలేక తండ్రియైన దక్షునియొద్దకుబోయి మొఱ పెట్టుకొనిరి. అది విని ఆయన కోపించి పక్ష పాతబుద్ధిగల చంద్రునికి క్షయరోగము కలుగునట్లే శాపమొసంగెను. అది మొదలు దినదినము, అతని కళలు, శరీరము క్షీణించు చుండెను. అంతకంతకు నీరసపడుటచే, భయపడి యేమిచేయుటకును దోచక ఈశ్వరునితో దలపోసికొనగా ఆయన అందునకు కారణము కనిపెట్టి విధునితో నిట్లనెను"చంద్రా! ఇది నీ స్వయంకృతాపరాధము వలన గలిగినది. నీ భార్యలను సమబుద్ధితో జూడనందున నీ మామయగు దక్షుడు నిన్నిట్లు శపించెను. నీవు పోయి ఆయనను ప్రార్థించిన నతడు దీనిని మాన్పగలడు. ఇతరులేమి చేయగలరు." అనగా విని చంద్రుడు దీనతతో దక్షుని చేరి, దండప్రణామము గావించి యెదుట నిలిచి చేతులు జోడించుకొని యుండెను.

## చంద్రుడు దక్షునితో సంభాషించుట

దక్షుడు:- (చంద్రునిచూచి ఆశీర్వదించి) చంద్రా! క్షేమమా?

చంద్రుడు:- మీ యాశీర్వచన ప్రభావమువలన నిప్పటికి గుశలమే?

దక్షుడు :- ఏమీ! ఇప్పటికి కుశలమనుచున్నావు?

చంద్రుడు:- ముందేమి జరుగునో తెలియునందున.

దక్షుడు:- ఏల నీ శరీరము కృశించియున్నది?

చంద్రుడు:- కారణము తెలియకున్నది. మీరే యోచింపవలెను.

దక్షుడు:- నీ వతి వ్యాప్తిచే సంచరించినట్ల కనబడుచున్నది.

చంద్రుడు:- లేదు; అదే కారణమని చెప్పలేను.

దక్షుడు:- నీ భార్యలయందు నీకు సమభావమున్నదా?

చంద్రుడు:- అదియెట్లు సాధ్యము! అందఱును ఒక్క లాగుననుందురా!

దక్షుడు:- బ్రహ్మ సృజించిన వారిలో నొకరిని బోలినవారు వేరొకరు లేరుగదా!

చంద్రుడు:- ఆ కారణముననే అందఱి యందును సమభావముండుట యసాధ్యమంటివి.

దక్షుడు:- సమాన ప్రేమ కనబఱుపవలసియు, వారి యెడల భేదబుద్ధియుంచుట దోషము కాదా?

చంద్రుడు:- అందుదోష మున్న నుండవచ్చును కాని సుందరమైన మనుష్యులను, వస్తువులను జూచునపుడు వారి యెడల ప్రేమ కలుగట సహజము కదా?

దక్షుడు:- నీ మాటలను బట్టిచూడగా, రమ్యముగా నుండువానిని, ప్రేమించుటయందే నీ కిష్టమగునట్లు గనబడుచున్నది. గుణమును ప్రధానముగా గ్రహించుట ప్రాజ్ఞుల మార్గము.

చంద్రుడు:- అయ్యా! పైకి దమంతట తావు కనబడు రూప లావణ్యాతిశయములను విడిచి, కష్టపడి పరిశోధించినగాని కానరాని గుణాతిశయములను గుఱించి కనిపెట్టు వారెవరు! అంత ప్రయాసమేల?

దక్షుడు:- వినుము. నీవు చిన్నవాడవు. లోకానుభవము చాలనందున అట్లూహించుచున్నావు. రూపము ప్రధానము కాదు. అగ్నిని జూచితివా? అంతకంటే తేజముగల పదార్థము వేఱొకటి లేదు! దానిని స్పృశించినంత మాత్రమున గాల్చును. దానివర్ణమువలన మనకు లాభమేమి? మోదుగ పువ్వు మిగుల అందమైనది కాదా! దానియందు వాసనలేదు గదా! కావున రూపము జూచి భ్రమింపగూడదు. ఇంతేగాక, స్త్రీలు అతి రూపవంతులగుటచే కొన్ని ప్రమాదములు సంభవించును. కాబట్టి గుణమునే ప్రధానముగా నెంచవలెను.

చంద్రుడు:- మీరు సెలవిచ్చిన ప్రకారము గుణమే ప్రధానము కావచ్చును. వస్తువుల గుణములు మాఱుచుండును. అందు ముఖ్యముగా మనుష్యాదులగుణముల స్థిరముగా నుండునవి కావు. వారి సహవాసమువలనను, సంచారము వలనను, అభ్యాసమువల్లను, అనుభవమువలనను, వయస్సు వలనను తఱచుగా మాఱుచుండును. అట్టి గుణములను బట్టి నమ్ముటకు, మన యభిప్రాయములను స్థిరపఱచుకొనుటకు అవకాశమెట్లుగలుగును? రూపము అంతవేగముగ మారునదికాదు.

దక్షుడు:- రూపము మాత్రమేల మాఱకుండును ముదిమియు రోగాదులను రూపమును మార్చును, కాని గుణమును మార్చలేవు. గుణములు రెండు విధములు; స్వాభావకములు, తాత్కాలికములు. వానిలో రెండురకముల గుణములు నీవుచేయకున్న జ్ఞానము లేశము లేని పశుపక్ష్యాదులకును, మనుష్యాదులకును భేదమేమి? ఇట్టి జ్ఞానము మనుష్యాదుల కుండుట చేతనే

వారు విద్యాబుద్ధులు నేర్చి దాని నభివృద్ధిచేసికొనుట కవకాశమున్నది. పశుపక్ష్యాదులు జ్ఞానశూన్యములగుటవలననే వానికి పాపపుణ్యములంటవు. అందుచేతనే ఆయా జన్మలందు అవి చేసిన సుకృత-దుష్కృతములకు వానికి దండన లేదు. మనుష్యాదులకు దండన తప్పదు.

చంద్రుడు:- మీరు సెలవిచ్చిన ఈ యుపదేశ వాక్యముల వలన నాకు చాల జ్ఞానము కలిగినది. ఇటు పైని క్రమముగా సంచరింతును. తెలియక జేసిన తప్పులకు క్షమాపణయుండదా!

దక్షుడు:- అల్లుడా! చెప్పెదవినుము. తెలియక చేసిన తప్పులకు పశ్చాత్తాపము నంది, వివేకము కలిగి, తన ప్రవర్తనమును చక్క చేసికొనువారు క్షమింపబడుదురు; ఆపాపములు వారినంటవు. జ్ఞానాగ్నివలన సంచితమును, ఆగామిని, దహించి ప్రారబ్ధమును అనుభవించి కర్మశూన్యులై జీవులు ముక్తి నొందుదురు.

చంద్రుడు:- సంచితము, ప్రారబ్ధము, ఆగామి, ముక్తి అని నాలుగు మాటలు సెలవిచ్చితిరి. వాటి అర్థము నాకు బోధింపవలెను.

దక్షుడు:- శ్రద్ధగా వినుము. గతించిన జన్మములయందు జీవులచే చేయబడినదై ముందు జన్మలో వారిచే ననుభవింపబడుటకు నిలువయున్న కర్మము సంచితము. ఇట్లు ప్రతి జీవునికి ఆయాజన్మముల కర్మ నిలువరముగా నుండును.

వెనుకటి ఏడవ జన్మయందు జీవునిచే చేయబడి, ఈ జన్మమున అనుభవింప బడుచున్నదే ప్రారబ్ధము! దీనిని అనుభవము వలన దప్ప వేఱు మార్గమున నశింపజేసికొనుటకు వీలులేదు.

ఈ జన్మమందు జీవునిచే జేయబడి ముందు జన్మములలో ననుభవించుటకు నిలువలో చేరబోవు కర్మ ఆగామి, వీని నన్నింటిని

నశింపజేసికొనియో, శ్రీహరి యందు మనస్సు లీనము చేసికొనియో, చావు పుట్టుకలు లేని స్థితిని పొందుటకే మోక్షము అందురు. బ్రహ్మజ్ఞానలాభమువలన సంచితము, ఆగామి నశించును. గాని ప్రారబ్ధమనుభవముచే భుక్తయగును కాని నశింపదు. కావుననే హరి హర బ్రహ్మలకైనను ప్రారబ్ధమనుభవింపక దప్పదందురు. కర్మశేషం గలవారికి పుట్టు, చావులు తప్పబోవు.

చంద్రుడు:- బాగుగ సెలవిచ్చితిరి. కాని బ్రహ్మజ్ఞానము పొందవలెనంటిరి. అది ఎట్లు లభించును?

దక్షుడు:- సామాన్యజ్ఞానమును వృద్ధిపొందించు కొనిననది లభించును.

చంద్రుడు:- సామాన్యజ్ఞాన మనగా నేమి? దాని నభివృద్ధినొందించుకొనుట యెట్లు;

దక్షుడు:- లోకమందలి సృష్టియంతయు పరమాత్మ స్వరూపమే యనియు ఆ పరమాత్మయే పిపీలికాది బ్రహ్మపర్యంతము అణువు మొదలు మేరువు పర్యంతము వ్యాపించి యున్న దనియు తెలిసికొని, సమస్తజంతువు లందును, పదార్థములందుయందును, సమబుద్ధి కలిగి తన శరీరమును, ఆత్మను తానెటుల ప్రేమించునో అట్లే సమస్త జీవులను ప్రేమింపవలను. అందువలన అభిమానము తొలగుతుంది, కలిమి లేములయందును, కష్ట - సుఖములందును, జీవేశ్వరులయందు సమత్వదృష్టియు అభేదబుద్ధియు లభించును. అప్పుడు తానే పరబ్రహ్మ స్వరూపమనియు, ప్రపంచ మందంతటను పరబ్రహ్మమును దర్శించుటనే ఆ బ్రహ్మజ్ఞానమందురు.

## చంద్రుని క్షయరోగ విముక్తి

చంద్రుడు:- మామా! చక్కగా బోధించితిరి. ఈ జ్ఞానమార్గము నవలం

భింతును. నాకీ రోగ విముక్తి ఎట్లు కలుగును?

దక్షుడు:- నీవు నీ భార్యల యెడల పాక్షిక బుద్ధితో మెలంగుటచేతనే ఈ రోగము సంప్రాప్తమైనది.

చంద్రుడు:- అది యెట్లు? ఈ జన్మమందు చేసిన పాపపుణ్యములయందు కదా యనుభవింపవలెను?

దక్షుడు:- ఔను! నిజమే. పాపముగాని పుణ్యము గాని హెచ్చుగా చేయబడినపుడు, వాని ఫలము ఈ జన్మ మందే యనుభవములోనికి వచ్చును.

చంద్రుడు:- మామా! నేను చేసినది అంత ఘోర పాపమా!

దక్షుడు:- సందేహమేమి? నీవు వారి నుపేక్షించుటచే వారు మిగుల దుఃఖించి నా వద్దకు వచ్చి మొఱపెట్టిరి. వారి దీనాలాపములు విని, నామనస్సు చాల క్షోభించినది. నీకు శాప మొసంగితి. అందువలన నీకీ రోగము ప్రాప్తించినది. ఇటుమీద నీవు క్రమముగా సమబుద్ధితో వారి నాదరించుచుండిన, నీవు బలాయురారోగ్యములు కలిగియుందువని చెప్ప సహవాహసాదులవలన మాఱుచుండును. స్వాభావికములు మాఱవు. కాని వయస్సుచే పరిపూర్ణత నొందునవి కావు. స్వాభావిక గుణములను గనిపెట్టి మనుష్యాదు లిట్టివారని నమ్మవచ్చును.

చంద్రుడు:- మానవులు చపలచిత్తులు. అందులో స్త్రీలు మిగుల చంచల స్వభావముగలవారు. ఏ వస్తువునైనను నాణెము చేయవచ్చును. కాని మనుజాలను నాణెము చేయుట దుస్తరము. కాబట్టి నేనిది వఱకు రూపమును బట్టియే నాయభిప్రాయములను స్థిరపఱచుకొనుచున్నాను.

దక్షుడు:- కావుననే పొరబడితివి. రూపమును బట్టి నీ భార్యలలో నెవరిని అధిక సుందరి నెంచితివి?

చంద్రుడు:- రోహిణి కదా సర్వసుందరి.

# దేవ - రాక్షస - మానవగుణములు

దక్షుడు:- అనూరాధ, అశ్విని, ధనిష్ఠ, చిత్త మొదలగు సుందరులులేరా? రూపభేదము అన్నట్లే, గుణభేదములును, గలవు. వారిలో అశ్విని, మృగశిర, పుష్యమి, స్వాతి, హస్త, పునర్వసు, అనూరాధ, శ్రవణము, రేవతి ఈతొమ్మండుగురును దేవతాస్వభావము గలవారు. రోహిణి, ఆర్ద్ర, భరణి, పుబ్బ, పూర్వాషాఢ, పూర్వాభాద్ర, ఉత్తర, ఉత్తరాషాఢ, ఉత్తరాభాద్ర వీరు మనుష్య స్వభావము గలవారు. కడమ కృత్తిక, మఘ, ఆశ్రేషా, విశాఖ, శతభిషము, ధనిష్ఠ, చిత్త, జ్యేష్ఠ, మూల వీరు రాక్షస స్వభావము కలవారు. కావున వారికి దేవ మనుష్య రాక్షసగణములని పేర్లు. వారిని నీవు బాగుగ గనిపెట్టిన వారిస్వభావము తెలియంగుదువు.

చంద్రుడు :- ఇటుపైని వారిని పరిశోధింతును.

దక్షుడు:- సరే! కాని యట్టి గుణ-రూపవిభాగము వలన నిప్పుడేమి ప్రయోజనము? వివాహమునకు పూర్వమే వానిని శోధింపవలెను. ప్రవాహము పారలి పోయిన పిమ్మట ఆనకట్ట యెందుకు? అగ్నిసాక్షిగా వివాహము చేసికొన్న పిమ్మట స్త్రీ పురుషులలో నెవరుగాని సురూపులైనను, విరూపులైనను., గుణవంతులైనను దుర్గుణులైనను వారిని విడువగూడదు. అందులో పలువుర వివాహమాడు భర్తకు అందటిని సమానముగా నాదరించుటవిధి. వివాహకాలమున నట్టి షరతులతో బ్రమాణములు చేసికొందురు గదా! వాని నతిక్రమించిన యసత్యదోషము ఘటించును. వివాహకాలమున జేయబడు ప్రమాణములు అట్టివి.

చంద్రుడు:- మామా! వివాహములలో ఎప్పుడీ ప్రమాణములు జరుగుచున్నవి?

దక్షుడు:- నీవు చేసితివి గదా! ఆ ప్రమాణము అన్నియును జ్ఞాపకము లేవా? మంగళ సూత్రధారణమునకు ముందు అన్నమును జూపింపలేదా? అదే అన్నముతో ప్రమాణము చేయుట. తరువాత చేతులతో బియ్యము బట్టుకొని అందు పాలుపోసి మంత్రములతో వధూవరులు తమ శిరస్సులపైన ఒకరి కొకరా పోసికొనుట ప్రమాణము చేయుటగాదా! తరువాత ప్రధాన హోమము చేయుటలో పేలాలు చేతిలో పోసికొని ప్రమాణ వాక్యములచే వానిని అగ్నిలో వ్రేల్చుదురు. సప్తమహర్షులతో అరుంధతిని జూపి ప్రమాణ వాక్యములుచ్చరింతురు. ఈ ఘోర ప్రమాణముల జేయుచు ధర్మ అర్థ కామ మోక్షములకై పరిగ్రహించిన భార్యను ఎన్ని ఇక్కట్టులు వచ్చినను విడువనని భర్త, భర్తను విడువనని భార్య వాగ్దానము జేయుదురు. అట్టి వాగ్దానములతో వివాహమైప పిమ్మట, వానికి దప్పిపోయిన ఎంత పాపము సంభవించును! ఆ పాపమువలన భయంకరమైన నరకబాధల నొందవలెను. కావున నెంతమాత్రమును వారియందు భేదబుద్ధి యుంచగూడదు.

చంద్రుడు:- మామా! ఇట్టి ప్రమాణముల తోడనా వివాహము జరుగును! ఇది నేను చేసినట్లు జ్ఞాపకము లేదే?

దక్షుడు:- నాయనా! ఈ ప్రమాణములు చేయకుండ నెవరికిని వివాహము జరుగదు. ఇట్టి ప్రమాణముల చేయువాడుక అన్ని జాతులందును, మతములందునునున్నది. కాని ఇటీవల మనవారు ఈ ప్రమాణమంత్రాలను దంపతులచే నుచ్చరింపజేయక పురోహితులే చెప్పుచున్నారు. ఆ మంత్రములయర్థమును జెప్పవలెను. అటుల జెప్పకున్న దోషము పురోహితుల జెందును.

చంద్రుడు:- తెలిసి చేసిన తప్పునకు గదా దండన! తెలియక జేసిన దానికి? దండనలేదుగదా!

## దక్షుడు చంద్రునకు జ్ఞానోపదేశము చేయుట

దక్షుడు:- చంద్రా! అజ్ఞానమువలన జేసినను దండన తప్పదు. ఇందుకు నిదర్శనము చూడుము. అగ్నికాల్చునని దెలియకయే దాని బిడ్డలంటుదురు. అది చుఱుకు మనుట మానునా? మనుష్యాదులకు దైవము బుద్ధిని ప్రసాదించియున్నాడు. అందువలన వారు తాము చేయబోవు కార్యముల సాధకబాధకములతను ముందుగా విమర్శించి ఆకార్యముల జేయబూనవలయును. అటుల చేయకున్న దోషము.

చంద్రుడు:- నేనెట్లు నడచుకొనవలెనో సెలవండు. మీయాజ్ఞ దలదాల్తును.

దక్షుడు:- చంద్రా! నీ భార్యలు ఇరువది యేడుగురుగదా! వారిలో దినమున నొక దానిని నీవు కూడియుంట యుక్తము. నీవు వారితో గూడియుంటకు యోగమని పేరు. ఇట్లు యిరువదియేడు యోగములు యేర్పడును. అవి. 1. విష్కంభము 2. ప్రీతి 3. ఆయుష్మాన్ 4. సౌభాగ్యము 5. శోభనము 6. అతిగండము 7. సుకర్మము 8. ధృతి 9. శూలము 10. వణికు 11. గండము 12. హర్షణము 16. వజ్రము 17. సిద్ధి 18. వ్యతీపాతము 19. వరీయాన్ 20. పరిఘము 21. శివము 22. సిద్ధము 23. సాధ్యము 24. శుభము 25. శుక్రము 26. ఇంద్రము 27. వైధృతి అనునవి.

ఇట్లే యిరనువదియేడు యోగము లేర్పడును. నీవిట్లు క్రమము దప్పక సంచరించుచుండిన నీ రోగము నశించును. శుక్లపక్షమున దినమున కొకటి చొప్పున నీ కళలు హెచ్చుచుండును. కృష్ణపక్షమున దినమున కొకటి చొప్పున తగ్గుచుండును. అమావాస్యరోజున ఒకటే కళ గలిగి యుందువు. కాని నీకు యెట్టిబాధయు, బలహీనము నుండదు.

చంద్రుడు:- చిత్తము, తమ సెలవు ననుసరింతును. నాకు శాపవిముక్తి పూర్తిగా ననుగ్రహించివారుగారు.

దక్షుడు:- నాయనా! నా శాపము అమోఘము కావున దానిని పూర్తిగా మళ్ళించుటకు నాకే శక్యము కాదు. ఇంతేకాక నీవు రాజవు. రాజులు మదోన్మత్తులు. జరిగిన వానిని త్వరలో మరతురు. కావున జ్ఞానకార్థముంచు కొనుము.

చంద్రుడు:- చిత్తము, నమస్కారము, సెలవు.

అని తన భార్యలతోనిజగృహంబుజేరి, మామగారియుపదేశమున ననుసరించుచు సుఖముగా నుండెను. అని వ్యాసుడు చెప్పగావిని జైమిని ఆనందించెను.

## మహాపాతకము

పిమ్మట జైమిని వేదవ్యాసుని జూచి యిట్లనియెః అయ్యా! మహాపాతకము లేవి? వానికివి ముక్తిసాధనము లెవ్వి అనిన, ఆయన యిట్లు జెప్ప దొడంగెను. "ఓ మునివర్యా! పాపము అనేక విధములు వానిలో మహాపాపములు అయిదు: 1.స్త్రీ హత్య 2. శిశుహత్య, 3. గోహత్య 4. బ్రహ్మహత్య 5. సువర్ణస్తేయము (= బంగారము దొంగలించుట), వీని వలన మహాపాపములు చేసినవా రనుభవింపవలసినదే గాని, వానికి విముక్తిసాధనములు లేవు. వాని నొనర్చినవారు ఘోర నరకములను భవింపకదీఱదు. అబుద్ధి పూర్వకముగాను, అప్రయత్న పూర్వకముగను జరిపిన వానికి ప్రాయశ్చిత్తములు కలవు. వానిని విధిప్రకారము చేసికొనినచో పాపములు పరిహారము లగును. ఇందులకు దృష్టాంతముగా నొక పురాతన కథగలదు. దానిని జెప్పెదను వినుము. పూర్వము కోసల దేశమున నొక రాజుండెను. ఆయన పేరు భీమసేనుడు. అతడు బహుధార్మికుడు వేద శాస్త్రజ్ఞానవేత్త అతిథిపూజా పరుడు. ఆపట్టణమందు గొప్ప ధనికుడైన

శూద్రుడొకడుండెను. వాని పేరు రాముడు. ఇతడు మిగుల శాంతస్వభావుడు ధార్మికుడు, మంచివాడు, వారిద్దఱును ధనికులగుటచే, చిన్ననాటి నుండి కలసి మెలసి యుండుటచే స్నేహితులైయుండిరి.

## పుణ్యములో పాపము

ఇట్లుండ, నొకప్పుడా దేశమున అనావృష్టి దోషమున జనులు, జంతువులు చాల బాధ పడుచుండిరి; తాము బాగా త్రాగుటకు నీరులేక వారి బాధ లధికమయ్యెను. ఆ బాధ సహింపలేక ఆపట్టణమందలి జనులు గుమిగూడి రాజాతో మొఱపెట్టుకొనిరి. అది విని ప్రజలబాధ మాన్పుటకు భీమసేనుడు రామునితో నాలోచించి గ్రామమునకు వెలపల నొకబావిని లోతుగా త్రవించెను. కాని దాని చుట్టు కాపు దారిగోడ గట్టింపక ముందే జనులు అందలి నీరు వాడుకొనుచుండిరి. ఒకనాటి సాయంకాలమున ఆలమందయొకటి అడవిలో దినమంతయు మేసి, పట్టణమునకు బోవుచుండెను. అందులో నొక దూడ మిగుల దప్పిగొని ఆ బావిచుట్టు ప్రక్కల నున్న పచ్చికమేయుచు పోయి పోయి ఒడ్డుచేరి, అందలి జలమును గ్రోలవలయుననను ఆతురతతో నందు బడెను. జలము లోతుగా నుండినందున వెంటనే యది మృతినొందెను. ఆపశుపాలకుడు ఆపెయ్యతల్లి అఱచుట విని తన దూడకొఱకు జూడగా నది కానరాకుండెను. ఆవులన్నియు నూరికి పోయెను, గాని ఆయావు మాత్రము బావిచుట్టూ తిరుగుచు దానిని విడిచి పోదయ్యెను.

ఈ సంగతి తెలిసి పలువురు జనులచ్చటికి బోయి దూడను పైకి దీసిరి. ఆసమయం దచ్చటికి చేరిన బహుజనసమూహము తనలో దానిట్లనుకొనెను "ఈ దూడ తన దప్పి దీర్చుకొనుటకు ఆతరుతతో వచ్చి నూతిలో బడి చనిపోయినది. ఇందువలన పాపమున్నదా? లేదా? ఉన్న

యెడల ఆ పాపమెవరిని చెందును? అని యొక బుద్ధిమంతుడు ప్రశ్నింపగా, పసుల కాపరిదని కొందఱును, చచ్చిన దూడ సొంతదారునిదని కొందఱును, బావి త్రవ్వించినవారి దని కొందఱు చెప్పిరి. గోపాలకు నడుగగా, వాడిట్లు జెప్పెను. "అయ్యా! నేనొక్క జంతువును కాచు చుండలేదు. నామందలో ననేక గోవులు, దూడలు, ఎడ్లు ఉన్నవి. వానలేమిచే నీరెచ్చటను లేదు. అయినను ఎండ వేళప్పుడు వీని నన్నింటిని ఒక సెలయేట నీరు ద్రావించితి. త్రోవను వచ్చుచుండగా దూడ బావిలో పడియుండును. నేను చూడనేలేదు. దాని తల్లి యఱచుచు బావి చుట్టు దిరుగుచుండుట గాంచి దూడకొరకు జూచితిని. అది కానరాకుండుటచే బావిలో పడియుండునని తలంచి బావిలో తొంగి చూడగా, దూడ కానబడలేదు. కాని నీటినుండి బుడగలు పైకి లేచుచుండెను. బావిలో దూడ మునిగియుండునని యెంచి నేను కేకలువేయుచు పరిగిడి యందఱకు దెలియపఱచితిని. ఇందు నాతప్పేమి;" ఆ మాటలు విని దూడ హక్కుదారుడు ఇట్లనెను "అయ్యా! దూడ నాది. నేను దానికి గడ్డివేసి నీళ్ళు పెట్టి ఇంటి వద్ద కట్టియుంచితిని. పసుల కాపరి అన్నిటితో బాటు నా దూడను విప్పుకొని పోయెను. వానిని మరల ఇండ్ల వద్దనొప్పగించు వఱకు వాని భారము పసులకాపరిది. కావున దూడపోయిన నష్టమేగాక, దోషము నాకెట్లు గలుగును?"

ఈ మాటలు విని యచ్చటి వారిలో కొందఱు బావిని త్రవ్వించిన వారిదే దోషమనిరి. ఆమాటలు విని రాజును వారిస్నేహితుడును ఇట్లు వితర్కించిరి "జలములేమిచే పలుజనులు పొందు బాధలు జూచి సహింపలేక ధర్మార్థము బావి త్రవ్వించిమి. ఇది కేవలము పరోపకార బుద్ధితో జేసినపని. కాని ఒకరిని బాధించుటకు గాదు. దూడ యందులోబడి చనిపోవుట వలన గలుగు గోహత్యాదోషము మామందారోపించు చున్నారట! ఇది యెట్టి

న్యాయమము? అయినను పండితుల వలన ఈ విషయమము తీర్మానింపబడవలెన”ని రాజు పండితులను, మంత్రులను పిలిపించి, సభ గూర్చి వారితో నీ విషయము చెప్పి తీర్మానింపుడని కోరెను. అదివిని పండితులిట్లు జెప్పిరి. “ఓ రాజా! నీవును నీ స్నేహితుడును చేసినది ధర్మకార్యమే. కాని అందొక్క పొరపాటు జరిగినది. అందువలన ఈ గోహత్యాదోషము ప్రాప్తించినది. బావి త్రవ్వించిన మీరు దానిచుట్టు కాపుదారి గోడ గట్టింపవలసి యుండెను. లేదా అట్టి గోడ గట్టించువరకు నచ్చట కాపలామనుష్యుని ఉంచవలసియుండెను. మీ రట్లు జేయకుండుటచే ఈ విపత్తు మూడినది. కావున సగము పాపము మీపాలబడినది. ఇది మీరు బుద్ధి పూర్వకముగా జేసికొని ఇంటికి వచ్చి, పది దినములు అశుచి ననుభవించి పదునొకండవదినమున అగ్నికి ప్రీతిగా హోమము చేసి పిదప రుద్రాభిషేకము, గోభూ హిరణ్య శిలాది మహాదానములు జేసి బ్రాహ్మణులకు తృప్తికరముగా సంతర్పణ మొనరించి, దక్షిణ లొసంగి, వారికి సాష్టాంగ నమస్కారముల జేసి, వారి పాదోదకమును శిరస్సున ధరించి, వారియాశీర్వాదమును బొందిన” దోషరహిత మగును. ఆ ప్రకారము చేసి పాపవిముక్తి నొందిరి. అని వ్యాసుడు చెప్పగా జైమిని విని సంతసించెను. శిలాదాన మనగా సాలగ్రామదానము.

## గోవు పుట్టుట

పిమ్మట జైమిని వ్యాసుని జూచి, “అయ్యా, గోవు పశుజాతి లోనిది గదా? దానికంత పవిత్రత కలుగుటకు గారణమేమి? ఇతరజంతువులకన్న దానికాధిక్యమేమి కారణమున గలిగినది? నాకు సవిస్తరముగా నెఱిగింపుము; నన్ను గృతార్థుని జేయుము” అని అనిన వ్యాసుడాయనతో నిట్లనియె.

“శ్వేతవరాహకల్పమున ఆదివిరాట్టగు పరబ్రహ్మము యోగనిద్ర జాలించి లేచి నలుప్రక్కల పరికింపగా నంతటను జలము వ్యాపించి యుండెను. అప్పుడాతడు మరల సృష్టి జేయదలంచి తన నాభి కమలము నుండి బ్రహ్మనుత్పత్తి జేసెను. ఇంకను సృజింపకోరిక కలుగగా, నదివఱకు ఆయన యందు నిక్షిప్తమయియుండిన ప్రకృతి ప్రత్యక్షమయ్యెను. అప్పుడామె యందు విష్ణువును, మహేశ్వరుని బుట్టించెను. ఇట్లు జన్మించిన త్రిమూర్తుల జూచి మీరు పోయి సృష్టిజేయుడని ఆపర బ్రహ్మ యానతిచ్చెను. అంతవారు వెడలిపోయిరి. గాని ఎంత దూర మేగినను జలమయముగానుండుటచే నందు దిరుగుచుండిరి. వారు సృష్టిచేయకుండుటయు మరల తన యొద్దకు రాకుంటయు జూచి, ఆయాదివిరాట్టువారేమైరో యని విచారించు చుండగా, ప్రకృతి వారిని జూచి వచ్చెదనని బయలు దేఱి కొంతకాలమునకు వారిని నప్పగించెను. అప్పుడామె, కామపరవశురాలై వారిని బొందగోరెను. కాని బ్రహ్మ, విష్ణువు లందు కంగీకరింపరైరి. మహేశ్వరుడు ఒప్పుకొనెను. బ్రహ్మ–విష్ణువులు ముందుగా నాదివిరాట్టువద్ద జేరి ఈ సంగతి విన్నవించిరి, అప్పుడు పరబ్రహ్మ కోపించి ప్రకృతిని గోరూపిణియగునట్లుగా, శివుని మహాపాతకమునొందునట్లును శపించెను. ఈ కారణమున ప్రకృతియే గోవై జన్మించెను. కావుననే దానికంత శ్రేష్ఠత కలుగుటకు గారణము. ఆశాపమును విని ప్రకృతి దేవత పరబ్రహ్మమును జూచి అనేక విధముల బ్రతిమాలుకొనెను. ఆయన కరుణింపక ఇట్లనెను “నీవు పశువువలె సంచరించితివి. కావున శాపము తప్ప” దనెను. అదివిని ఆమె బహువిధముల బ్రార్థించి యిట్లనెను “మీ దేనినైన నేను, సామాన్యపశువునగుట తమకు లాఘవముకాదా! కావున నాకు గరుణించి వరమొసంగుడ” నగా, పర బ్రహ్మ మిట్లానతిచ్చెను. “నీ ముఖమునందు పంచమహాపాతకము లుండును, కాని నీవతి పవిత్రురాల వగుదువు. నీ మలమూత్రములందు లక్ష్మినివసించును.

నీరోమకూపములందు సమస్త దేవతలును నివసింతురు. నీ దర్శనము సర్వపాప విమోచనము. నీపాలు, పెరుగు, నెయ్యి, మూత్రము, మలము పరమ పవిత్రములు. నిన్ను దూడతో గూడా దానమిచ్చువారు నీ శరీరమున నెన్ని వెంద్రుకలుండనో అన్ని వేల దివ్యవత్సరములు నాలోకమున నుందురు. దానికే గోలోకమని పేరు." ప్రకృతిపైన కలిగెను. ఆవుకు 25 సంవత్సరములు ఆయుఃపరిమితి అని వ్యాసుడు చెప్పగా విని జైమిని సంతోషించి అయ్యా! నాజన్మ పావనమైనది.

## గాయత్రి యుత్పత్తి

ఇకను గాయత్రీమంత్రమెట్లు కలిగెనో, దాని ప్రభావ మేమోనాకు సెలవియ్యప్రార్థించుచున్నాను. అనగా వ్యాసమహర్షి యెట్లు చెప్పెను. "పరబ్రహ్మము యొక్క నాభికమలమునుండి బ్రహ్మ జన్మించిన వెంటనే ఓమ్ అను ప్రణవము ఆయనకు వినబడెను. పిమ్మట నాచతుర్ముఖుని ముఖముల ద్వారా ఒక్కొక్క దానినుండి ఆఱు అక్షరముల చొప్పున నలుముఖముల (24) ఇరువది నాలుగు అక్షరములు గల గాయత్రీమంత్ర ముత్పన్నమయ్యెను. అటుపిమ్మట ఆయన నలుముఖముల నాలుగు వేదములు పుట్టెను. అవి: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము. ఈ వేదములయందు గూడ ననేక మంత్రములన్నివి. అవియన్నియు గాయత్రినుండియే పుట్టినవి. కావుననే గాయత్రికి మంత్రమాతృకయని పేరు. దానికంటె మంత్రరాజము లేదనియు, తల్లికంటే వేఱురూపములేదనియు జెప్పుదురు. ఆ మాటలు నిజము పిల్లలు తల్లిని యెన్నిబాముల బెట్టినను ఓర్చునట్లు ఆ మంత్రము నుపాసించువారు ఎన్ని అపచారముల జేసినను ఆ మంత్రాధిదేవత యగు గాయత్రి వానినన్నింటిని సహించి, వారిని బాధింపకుండును. ఇతర మంత్రములన్ననో అట్టివి కావు. ఈ గాయత్రీ

మంత్రమును క్రమముగా జపించు వారికి, ధర్మ అర్థ కామ మోక్షము అను చతుర్విధ పురుషార్థములలో, నెవరు దేనిని కోరి జపింతురో వారికి దానిని దప్పక ఇచ్చును. కాని గ్రహించుటకు ముఖ్య సాధనమైనది. గావున దీనిని బ్రహ్మవిద్య యందురు. ఉపనయనార్హత గల ద్విజాలు దప్పనితరులు దీని నుపాసింపగూడదు. దానిని వారు జపించను గూడదని చెప్పుదురు.” అని వ్యాసమహర్షి జైమినితో జెప్పి యీ పురాణమును ముగించెను.

## శ్రీ బ్రహ్మపురాణము సంపూర్ణము



# ౨. పద్మ పురాణము

శ్లో॥ "హృదయం పద్మ సంజ్ఞితమ్" శ్రీ మహావిష్ణువు యొక్క హృదయ స్థానంలో పోల్చబడింది పద్మపురాణం. శ్రీమన్నారాయణుని నాభికమలం నుండి ప్రారంభమైన బ్రహ్మ సృష్టి క్రియ నాధారంగా చేసికొని బయలు దేరిన పురాణం కనుక దీనికి "పద్మపురాణమనే" సార్థకనామధేయ మేర్పడింది.

"శ్లో॥ పద్మం పంచ పంచశత్సహస్రాహపఠ్యతే" అను ఆర్యోక్తి ప్రకారం 55 వేల శ్లోకాలిందు రచింపబడినది.

"శ్లో॥ యథా పంచేంద్రియ సర్వ: శరీరతి నిగద్యతే!

తదేదం పంచభి: ఖండైరుదితం పాపనాశనమ్!!"

మానవునికి కళ్ళు, ముక్కు చెవులు నాలుక చర్మమనే పంచేంద్రియాలు వలే ఈ పురాణంలో అయిదు ఖండాలున్నవి.

1. సృష్టిఖండం 2. భూఖండం 3. స్వర్గ ఖండం 4. పాతాళ ఖండం 5. ఉత్తర ఖండం ఈ మొత్తం ఐదు ఖండాలలోని అధ్యాయ సంఖ్య యిలాగున్నది.

1. సృష్టిఖండం – 82 అధ్యాయాలు
2. భూఖండం – 129 అధ్యాయాలు
3. స్వర్గ ఖండం – 39 అధ్యాయాలు
4. పాతాళ ఖండం – 113 అధ్యాయాలు
5. ఉత్తర ఖండం – 282 అధ్యాయాలు

మొత్తం 641 అధ్యాయాలు గల్గి, ఏబదియైదువేల శ్లోక సంఖ్యగలది. ఇందులో క్రింది విషయాలు సమగ్రముగా ఇందు వర్ణింపబడ్డాయి.

1. కాలపరిణామ వివరణం, 2. గంగామాహాత్మ్యము 3. క్షీరసాగరమథనం 4. సూర్య మాహాత్మ్యము, 5. దక్షయాగ వినాశం, 6. పాంచభౌతిక శరీర వర్ణన 7. చంద్రవంశ వర్ణన 8. ఆత్మస్వరూపం 9. కర్ణార్జునుల పుట్టుక 10. బ్రహ్మచర్య లక్షణాలు 11. వారి విరోధకారణం, 12. పాపాత్ములు మరణించే తీరు 13. వృత్రాసుర వధ, 14. భారతదేశ నదులు – పర్వతాల వర్ణన 15. వామనావతార వర్ణన, 16. నర్మదా నదీ మాహాత్మ్యము 17. తారకాసుర వృత్తాంతం 18. గృహస్థ ధర్మాలు 19. నరసింహావతార వర్ణన 20. విష్ణుభక్తి మహిమ 21. సదాచార వర్ణన, 22. కార్తీక మాస ప్రాశస్త్యం 23. మాతృపితృ సేవా మాహాత్మ్యం, 24. ఏకాదశీ వ్రత మాహాత్మ్యం 25. ఉసరిక – తులసి మొక్కల ప్రాశస్త్యం 26. రామాయణ కథలు, 27. శనిపీడానివారణ విధానం 28. పురాణాల మాహాత్మ్యం 29. విష్ణు సహస్ర నామ మహిమ 30. వైష్ణవ లక్షణాలు 31. దీపావళి మాహాత్మ్యం 32. హరి పూజా విధానం 33. మాసవారి పూజ. పుష్పనామములు 34. యుగధర్మాలు.

పై ముప్పది నాలుగు విషయాలు పద్మపురాణాలలో విస్తారంగా వున్నాయి. మానవుని మనసులో కల్గే సంకల్పం ఇంద్రియాలతో చూచే వస్తువు బుద్ధితో తెలిసికొనే విషయం – ఇవన్నీ శ్రీహరి రూపాలే అని పద్మపురాణం వక్కాణిస్తోంది.

"శ్లో॥ మద్రూపం మనసా గ్రాహ్యం, యద్గ్రాహ్యం చక్షురాదిభిః!

బుద్ధ్యాచ యత్పరిచ్ఛిన్నం తద్రూప మఖిలం హరేః!!"

ఈ శ్లోకం పై భావాన్ని తెల్పుతోంది. ప్రపంచంలోని సమస్తమూ శ్రీహరిమయమే అని ఉద్బోధించడం పద్మపురాణ సిద్ధాంతం.

"పురుష ఏవేదం సర్వం, సర్వం ఖల్విదం బ్రహ్మ" మొదలైన వేద శ్రుతి ప్రవచనాలు కూడా ఈ సిద్ధాంతాన్నే బోధిస్తున్నాయి. ఆంధ్ర భాగవతంలో

"ఇందుగలడని లేడని సందేహం వలదు దానవాగ్రణి" అన్న విషయం కూడా దీన్ని బలపరచుచున్నదని చెప్పవచ్చును. ఈ పద్మ పురాణంలో ఎన్నో సదాచారాలిట్లు వర్ణింప బడ్డవి ఉదా చక్రి సర్వోపగతుండు కొన్ని :-

1) "నస్థాతవ్యం నగంధ్యం క్షణమపి మప్యసతాసహ "

దుర్జనులతో కనీసం క్షణకాలమైనా కలసియుండరాదు మరిన్ని కలసి నడువరాదు. అలా చేస్తే వారి దుర్గుణాలు వేగంగా అలవడుతాయి. అందువల్ల దుష్టులకు దూరంగా ఉండాలి.

2. "నక్షౌరం కారమేద్ధీరః కుజప్యాహి కదాచన "

మంగళ వారం నాడెట్టి పరిస్థితుల్లోను, క్షురకర్మ చేసికోరాదు. అది మంగళ వారాల్లో అభ్యంగ స్నానం చేయరాదని ఆర్యోక్తి.

3) "తైలాభ్యంగం న కుర్వీత వాసరే రవిభౌమ యోః "

అనేది కూడా పద్మపురాణ వాక్కులే వారి మాటలకు ప్రమాణమన వచ్చును.

4) "శయనం చార్ద్రపాదేన, శుష్కపాదేన భోజనమ్ "

తడి కాళ్లతో నిద్రింపరాదు. తడి లేకండా (కాళ్ళు కడుక్కోకుండా) భోంచేయరాదు. చీకట్లో పరుండరాదు, కనీసం చిన్న దీపమైనా వెల్గించుకోవాలి. ఈ నియమాలనందరు పూర్వులు పాటించేవారు. ఇది పరంపరగా వస్తున్నది. ఈ పురాణంలో చెప్పబడ్డ సాంప్రదాయమే అనవచ్చు.

5) "పశ్చిమ దక్షిణేచైవ నకుర్యాద్దంత ధావనమ్।

ఉత్తరే పశ్చిమే చైవ నస్వపేద్ధి కదాచన॥"

పడమర దక్షిణ దిశలకు అభిముఖంగా పళ్ళుతోముకోరాదు. ఇలాగే పశ్చిమోత్తరములందు (పశ్చిమ ఉత్తరం) తలపెట్టి పడుకోరాదను సాంప్రదాయమీ పురాణానుసరణే! అనగా "ధర్మంచేయకున్ననూ దక్షిణ

తల పెట్టి పడుకోవలె "నను. సాంప్రదాయమీ పురాణానుసరణే! "దానా ధర్మంచేయకున్న దక్షిణ తలాపి పెట్టి నిద్రించాలన్నది, ఉత్తరతలాపి పెట్టితే తలనొప్పి వస్తుంది.

6) "పిత్రోరర్చాచ పత్యుచ్ఛ సామ్యం సర్వజనేషు చ,

మిత్రాద్రోహ విష్ణు భక్తితే పంచ మహామఖాః!!"

ప్రతి వ్యక్తి తన జీవితంలో తప్పక ఆచరించ వలసిన అంశాలివి.

1) తల్లిదండ్రుల సేవ 2) పతిసేవ 3) సర్వజన సమాన దృక్పథం 4. మిత్రద్రోహం చేయకుండుట 5) విష్ణుభక్తి కల్గియుండుట అనే ఈ అయిదు లక్షణాలు అందరిలోనుండాలి. వీటిలో ఏ ఒక్క సుగుణమున్నా మంచి కీర్తి , యుస్వర్గము, మోక్షము సిద్ధిస్తాయని ఈ పురాణోక్తియే.

5) "పితాధర్మః పితాస్వర్గః పితా హి పరమం తపః!

మాతరం పితరం తస్మాత్ సర్వయత్నేన పూజయేత్ "

తండ్రియే ధర్మం తండ్రే స్వర్గం, మరియు తపస్సు నన్నియు తండ్రియే కుమారుని పట్ల తండ్రి సంతుష్టుడైతే సకల దేవతలు సంతప్రీతులౌతారు. సర్వతీర్థ స్వరూపిణి తల్లి. సర్వదేవతాస్వరూపుడు తండ్రి. అందువలననే తల్లిదండ్రుల సేవ తప్పక చేయాలని పద్మపురాణం హితబోధ చేస్తున్నదీ మానవులకు. "మాతృదేవోభవ పితృదేవోభవ " అనే వేదవాణి సారాంశమిదే!

ధాత్రీఫల ప్రాశస్త్యము:– ( ఉసరిక ఫలము)

ధాత్రీ ఫలమంటే ఉసరికాయ లేక ఉసరికపండు. దీనిని సర్వజనులు భుజింప నిష్టపడుతారు. త్రిఫలాలలో నిదియొక్కటి! అందులకు ప్రమాణ కారణమేమైనా ఉందా అని పరిశీలిస్తే దానికి కారణమైన సమాధానాలు పద్మపురాణంలో లభిస్తాయి చాలా!

"శ్లో॥ ధాత్రీ ఫలం పరంపూతం సర్వలోకేషు విశ్రుతమ్!
యస్సరోపాన్నరో నారీ ముచ్చతే జన్మబంధనాత్
శ్లో॥ భక్షణేచ భవదాయః పానవై ధర్మ సంచయః!!
అలక్ష్మినాశనం స్నానే, సర్వైశ్వర్యమవాప్నుయాత్
శ్లో॥ యస్మిన్ గృహే మహాసేన, ధాత్రీ తిష్టతి సర్వదా
తస్మిన్ గృహే నగచ్ఛన్తి ప్రేతాదైతాయ రాక్షసాః!!"

ఉసరిక పండు ఎంతో పవిత్రమైనదిగా సర్వలోకల్లో కీర్తింపబడుచున్నది. ఉసరికి మొక్కను (పెరట్లో) నాటడం ద్వారా సంసారబంధాలు దూరీకృత మౌతాయి. దీని భుజించిన వారికి ఆయుస్సు పెరుగుతుంది. దీని రసాన్ని త్రాగితే ధర్మం వర్ధిల్లుతుంది. ఉసరిక రసంతో స్నానం ( ఆమలకతైలం) చేస్తే, దారిద్ర్యం తొలగిపోయి సకలైశ్వర్యాలు ప్రాప్తిస్తాయి. ఈ ఉసరిక మొక్క ఉన్న యింట భూతప్రేత పిశాచ రాక్షస బాధలుండవు.

"శ్లో॥ ఏకాదశ్యాం పక్షయుగ్మ ధాత్రీస్నానం కరోతియః!
సర్వపాపక్షయం యాతి విష్ణులోకేప్రాప్నువంతి
శ్లో॥ ధాత్రీ ద్రవేణ సతతం యస్సకేశాః సురంజితాః!
వరంః సమ్ముఖో విష్ను సంతుష్టోభవతి ప్రియః!
శ్లో॥ ధాత్రీ దర్శన సంస్పర్శా న్నామ్న ఉచ్చారణే పివా!
వరం సమ్ముఖో విష్ణుః సంతుష్టాభవతిప్రియః!!
శ్లో॥ ధాత్రీ ఫలంచ యత్రాస్తే తత్ర తిష్టతి కేశవః!
తత్ర బ్రహ్మస్థిరా పద్మా తస్మాత్తాంతు గృహేన్యసేత్!!"

కృష్ణపక్షంలోగానీ, శుక్లపక్షంలోగానీ, ఏకాదశినాడెవరైతే గానీ, ఏకాదశినాడెవరు ఈ ఉసరిక రసంతో స్నానం చేస్తారో వారి పాపాలన్ని క్షీణిస్తాయి.

తద్వారా వారు వైకుంఠం చేరుకోగలరు. నిత్యం ఉసరిక రసంతో స్నానం చేస్తుంటే కేశాలు (వెంట్రుకలు) నిగనిగలాడుతాయి. అంతేగాక వారెప్పటికినీ తల్లి పాలు త్రాగవలసిన అవసరముండదు. అంటే వారికి పునర్జన్మ ఉండదని భావం. ధాత్రీ వృక్షాన్ని దర్శించినా లేక స్పర్శించినా లేక ధాత్రీ! అని ఉచ్చరించినా విష్ణు భగవానుడు సంతుష్టుడవుతాడు. ధాత్రీ ఫలమున్నచోట శ్రీమన్నారాయణ మూర్తి, లక్ష్మీదేవి మరియు బ్రహ్మదేవుడు నివసిస్తారు. ఈ కారణంగానే ప్రతియింట ఉసరిక తప్పక నాటాలని పద్మ పురాణం ప్రబోధిస్తున్నది.

"శ్లో॥ సర్వయజ్ఞేషు కార్యేషు, శస్తంచామలక ఫలమ్!
సర్వదేవస్య పూజాయాం వర్జయిత్వా రవింసుత!!
శ్లో॥ తస్మాద్రవిదినే తాత సప్తమ్యాంచ విశేషతః!
ధాత్రీ ఫలాని సతతం దూరితః పరివర్జయేత్!! "

అన్ని యాగాల్లోను, సర్వదేవతా పూజా ద్రవ్యాలలో ఉసరికను తప్పక వాడతారు. ఈ కారణంగానే సూర్యునికిష్టమైన ఆదివారం మరియు సప్తమీ తిథుల్లో ఉసరికాయను ముట్టుకోదారని పై శ్లోకాల భావం.

## 3. తులసీ ప్రాశస్త్యము

"శ్లో॥ సర్వభ్యోః పత్రమా తులసీ శివా!
సర్వకామప్రదా శుద్ధా, వైష్ణవీ విష్ణుసుప్రియా!!
శ్లో॥ భక్తిముక్తి ప్రదాముఖ్యా సర్వలోక పరాశుభా!
యామాశ్రిత్యగతాః స్వర్గ మక్షయం మునిసత్తమా!!
శ్లో॥ కులం శీలం కళత్రంచ, పుత్రం దుహితరం తథా!
ధనం రాజ్య మరోగిత్వం జ్ఞానం విజ్ఞానమేవచ!!"

"శ్లో॥ వేదమూలాంగ శాస్త్రంచ పురాణాగమ సంహితా!
సర్వం కరగతం మన్యే; తులస్యభ్యర్చనేహరేః!!
శ్లో॥ కించ గంగాజలేనైవ; కించపుష్కరసేవయా!
తులసీదళమిశ్రేణ; జలనైవ ప్రమోద్యతే!!"

తులసీదళ పత్రం, పత్ర–పుష్పాలన్నిటిలో శ్రేష్టమైనది. మహా విష్ణువు అయిన ఈ తులసీదేవిని పూజిస్తే కోరిన కోరికలన్నీ ఫలిస్తాయి. శ్రేష్ఠురాలైన ఈమెను పూజించడం ద్వారా మహామునులు స్వర్గసుఖాలను పొందారు. భక్తి శ్రద్ధలతో కూడిన పూజలందుకొన్న తులసీ దేవి తన భక్తులకు మంచి వంశం, సుగుణాలు, భార్య (భర్త) సన్సంతానం, ధనం, రాజ్యం, ఆరోగ్యం, జ్ఞాన–విజ్ఞానాలు మొ॥ వాటికంటే తులసీ దళాలతో మిశ్రితమైన (స్నానం) సామాన్య జలాలతోటి పూజిస్తే విష్ణుభగవానుడత్యంత సంతుష్టుడౌతాడు.

"శ్లో॥ పూజనేకీర్తనే ధ్యానే, రోపణే ధారణేకలౌ!
తులసీ దహతే పాపం, స్వర్గం మోక్షం దదాతి చ!!"

కలియుగంలో ఎవరైతే తులసీ దేవిని పూజిస్తారో, ధ్యానం చేస్తారో! తులసీ మొక్క నాటుతారో; ఆతులసీ దళాలను తలపై ధరిస్తారో వారి పాపాలన్నీ రూపుమాపి, తద్వారా ఆమె స్వర్గ–మోక్షాల నివ్వగలదు. ఈవిధంగా తులసీ ప్రాశస్త్యమెంతో విపులంగా సాక్షాత్కరిస్తుంది పద్మపురాణంలో.

## పురాణాలనెందుకు చదువాలి?

"శ్లో॥ పురాణ శ్రవణం శ్రద్ధా; యస్యస్యాద్భ్రాతరన్వహం!
తస్యసాక్షాత్ప్రసన్నః స్యాతో శివో విష్ణుంశ్చ సానుగః!!

శ్లో॥ యత్స్నాత్వా పుష్కరేతీర్థే; యాగేసింధేచ సంగమే!
తత్ఫలం ద్విగుణం తస్య శ్రద్ధయా వైశృణోతిందః!
శ్లో॥ యే పఠంతి పురాణాని, శృణ్వన్తిచ సమాహితా!
ప్రత్యక్షరం లభంత్యైతే; కపిలాదానజంఫలమ్!
శ్లో॥ అపుత్రో లభతే పుత్రం, ధనార్థీ లభతే ధనమ్!
విద్యార్థీలభతే విద్యా, మోక్షార్థీమోక్షమాప్నుయాత్!!
శ్లో॥ యోశృణ్వన్తి పురాణాని, కోటిజన్మార్జితంఖలు!
పాప జాలంతు తేహిత్వా, గచ్ఛన్తి హరిమందిరమ్!!"

పురాణాలు వినడంలో ఎవరికైతే శ్రద్ధ ఉంటుందో మరియు నిత్యమెవరైతే శ్రవణం చేస్తారో, అటువంటి వారి విషయంలో శివ-కేశవులు మరియు వారివారి గణాలు సంపూర్ణానుగ్రహం ప్రదర్శిస్తారు. పుష్కర తీర్థాల్లో, ప్రయోగ మొ॥ నదీ సంగమ పుణ్య క్షేత్రాల్లో స్నానాలాచరిస్తే ఏ విధమైన పుణ్యమబ్బుతుందో, దానికి రెట్టింపు పుణ్యం ఈపురాణ శ్రోతలకు సంపూర్ణంగా లభిస్తుంది. భక్తి శ్రద్ధలతో పురాణ పఠన – శ్రవణాదులుచేసేవారు కపిలగోవును దానంచేస్తే కల్గు పుణ్యరాశిని పొందగలరు. పుత్రులు లేనివారు పుత్రులను, దరిద్రులు ధనాన్ని, విద్యార్థులు విద్యను మోక్షగాములు మోక్షాన్ని పొందగలరు. పురాణ శ్రోతలు కోటి జన్మల పాపాలను దూరీకరించు కొందురు. చివర్లో శ్రీమన్నారాయణ మూర్తి సాయుజ్యాన్ని పొందగలరు.

## కలియుగ ధర్మాలు:-

"శ్లో॥ కలౌయాస్యన్తి నిర్వృత్తా, ఉత్తమా అతిసీచతామ్!
నీగాశ్చాధన సంపన్నా, యాస్యన్త్యుచ్చపదం ప్రతి!!"

కలియుగంలో ఉత్తములు అధఃస్థితిని పొంది చరిత్ర హీనులవుతారు. అదేసమయాన నీచులు సకలైశ్వర్యాలను, ఉన్నత పదవుల పొంది ప్రతిష్ఠలౌతారు.

"శ్లో॥ పరోక్ష నిందకాఃక్రూరాః సమ్ముఖే ప్రియావాదినః

సాధ్వీవాదం వ ద్విష్యన్తి, భర్తారం పుంశ్చలీ స్త్రియః"

కలియుగంలో మొట్టమొదట మధురంగా మాట్లాడం, పరోక్షంలో దూషించడం నీచుల (మానవుల)కు సర్వసాధారణ మవుతుంది. ఒక కొందరు స్త్రీలు తమ భర్తలపట్ల పైకి ప్రేమ నొలుకపోస్తూ, వారికంట పడకుండా వ్యభిచారాది యెన్నో నీచపనులు చేస్తుంటారు.

"శ్లో॥ స్త్రీజితాః పురుషాస్సర్వే, స్త్రీయో హ్యత్యంత చంచలాః!

కలౌయుగే భవిష్యన్తి; కలౌమర్త్యా దురాశయాః!!"

"శ్లో॥ కలౌ విడ్భోజినోగావః స్వల్పక్షీరాశ్చజైమినే

ఘృతహీనంచ తచ్ఛారం, భవిష్యతి నసంశయః!!"

పురుషులంతా స్త్రీ దాసులవుతారు స్త్రీల స్వభావం చాలా చంచలమౌతుంది. మొత్తం మీద కలియుగ మానవులు మంచి ఆశయాలు లేక దుష్ప్రవర్తకులవుతారు. ఇక ఆవులు గడ్డిని మాత్రమే యిస్తాయి. ఆ పాలలో నెయ్యి బొత్తిగా ఉండదు.

"శ్లో॥ ఆత్మస్తుతి పరాలోకాః పరనిందా పారాయణాః!

భవిష్యన్తిచ ఖల్వాంగా, బా బహ్వన్న భోజనా!!

శ్లో॥ నేతు కామాశ్చ సర్వేపిదాతుకామనకే పిచ!

కలౌమ్లేచ్ఛాభవిష్యన్తి రాజానః పాపతత్పరాః!!"

కలియుగ మానవులు సర్వదా ఆత్మస్తుతి పరనిందల చేస్తుంటారు. వారు మరుగుజ్జులుగా జన్మిస్తుంటారు. చిన్న పిల్లలు సైతం మితిమీరి భుజిస్తుంటారు. సంపాదనే వారి ధ్యేయమవుతుంది. పరోపకారం చేయాలనే భావన లోపిస్తుంది. "నరాన్ పరాన్ దృష్ట్వా సర్వేచోపహసన్తిచ " ఎవరైనా ధర్మమార్గంలో నడుస్తున్నా ధార్మిక కార్యాలు చేస్తున్నా అట్టి వంటి సజ్జనుల చూచి సత్తెకాలపు మనిషని చాదస్తుడని అవహేళన చేస్తుంటారు.

శ్లో॥ "పంచమే వాపిషష్ఠేవా వర్షే స్త్రీ గర్భధారిణీ " కలియుగంలో జరుగబోయే మరో భయంకరమైన వింతయేమంటే అయిదారేళ్ల వయసు గల్గిన ముక్కు పచ్చలారని పాపలు గర్భిణులవుతారు. ఈ రీతిగా కలియుగ ధర్మాలను గురించి ఈ పద్మ పురాణం విపులంగా చెబుతున్నది. కలియుగంలోని ఒక విశేషమేమంటే

శ్లో॥ మద్యదిష్టం పఠంత్యేతత్, శృణ్వంతి చ ముముక్షవః
లభంతేతత్త దేవాశు ప్రసాదాత్కమలాపతే!!

ఏ కోరికలతో ఈ పద్మపురాణాన్ని పఠిస్తారో, వింటారో, వారివారి కోరికలన్నీ లక్ష్మీపతి అనుగ్రహం వలన వెంటనే నెరవేర గలవు.

ఓమ్ తత్సత్.

# మధుకైటభులు

ఈ పద్మపురాణవము వేదవ్యాసుడు వ్రాసినది. సూతుడు శౌనకాదులకు పురాణములు విన్పించుచు పద్మపురాణ ప్రస్తావనవచ్చి ఇట్లు ప్రారంభించెను. పార్వతీదేవి "శ్రీహరి విలాసమును వినిపింపు "మని శివుని వేడగా, నాతడు విష్ణు దేవుని కథలు వినువారికి సమస్తపాపములు నశించునని, యుత్తమలోకములు గల్గునని చెప్పి, జలప్రళయము వర్ణించెను. ఆ జల ప్రళయములో బ్రహ్మాండములు నీటిలో మునిగెను. శ్రీహరి వటపత్రములపై శయనించియుండి, తన నాభి నుండి బ్రహ్మదేవుని పుట్టించెను. అతడు చిరకాల మందుండి యన్ని వైపుల తిరిగిచూడగా జలమగుపించలేదు. నే నున్న ఈకమలము యెక్కడ పుట్టియున్నదని యాతడాకమలనాళము నుండి నారాయణుని యుదరములోనికి పోయి చూచెను.

అందు పర్వతములు, సముద్రములు, బ్రహ్మాండములు చూచి కంగారుపడి మరల పద్మనాళముగుండా తన నివాసము చేరి యోచించుచుండెను. తప! తప! యనుమాటలు వినిపింప తపమాచరించి, సృష్టికర్తయయ్యెను. అతడట్లుతపించు సమయంలో బ్రహ్మచెవి నుండి మధుకైటభులను ఇద్దరు రాక్షసులు వెలికి వచ్చి బ్రహ్మాండముల నదరగొట్టుచుండిరి. బ్రహ్మను యుద్ధమునకు బిలిచిరి. అతడు వారితో పెనగలేక శ్రీహరిని ప్రార్థించెను. శ్రీహరివచ్చి వారినెదుర్కొని కొన్నివేల యేండ్లు పోరాడెను. వారిని జయించుట కష్టమయ్యెను. మాయోపాయముతో జయింపనెంచి, మోహము కల్పించెను. ఆ మోహములో మునిగిన రాక్షసులు "శ్రీహరీ! నీ యుద్ధంబునకు మెచ్చితిమి. నీకు వలయు వరము కోరు కొమ్మ" నిరి. అంత శ్రీహరి "మీరిద్దరూ నా చేతిలో చనిపోవుటకు వర మిమ్మ"నెను.

వారు విని తావాడిన మాట తప్పక, నీరులేని చోటులోనయినచో అట్లేకానిమ్మనిరి. అతడంగీకరించి వారిని తన తొడపై నుంచుకొని సుదర్శన చక్రముతో తలలు తెగనరికెను. బ్రహ్మ మరల తపస్సు చేసుకొనసాగెను.

## దేవరాక్షసాదుల జననము

బ్రహ్మదేవుని సృష్టికార్యములో నాతడూర్ధ్వ లోకము లేడింటిని యేర్పరచెను. సప్తకుల పర్వతములు, సప్తసముద్రములు, నదులను వీటన్నింటిని పుట్టించెను. ప్రజాపతులలో కశ్యపుడొకడు, అతనికి నలుగురు భార్యలు దితి, అదితి, వినత, కద్రువ యను పేర్లుగలవారు, దితికి దైత్యులు అనగా రాక్షసులు సంతానముగా నుండిరి. అదితికి దేవగణములు సంతానమైరి. వినతకు అనూరుడు, గరుత్మంతుడు మొదలగు పక్షిగణములు సంతానముగా నుండిరి. కద్రువకు శేషుడు, వాసుకి, తక్షకుడు, కర్కోటకుడు మొదలగు మహా సర్పరాజులు సంతానముగా కల్గియుండిరి. ఇట్లు ప్రజాపతి వలన దేవ, రాక్షస, మనుష్య, పశు, పక్షి, కీటకాదులు సృష్టింపబడి క్రమక్రమముగా నభివృద్ధి గాజొచ్చెను.

లోకమునందు జీవులు నానావిధములగు బాధలనందుచు సంసారమునందు మునిగితేలుచు జనన మరణములందుచుందురు. వారు ఈ సంసారచక్రము దాటవలెనన్నచో యొక్కటే మార్గము గలదు. అది శ్రీహరిని సేవించుటయే. శ్రీహరిని గూర్చి జపించుట, ధ్యానించుట, గానముచేయుట, పూజించుట, గ్రంథములు పారాయణ చేయుట, అతనికి ప్రీతిగా యజ్ఞయాగాది కర్మల నొనరించుట, యోగాభ్యాసముతో మనస్సునరికట్టి సమాధిస్థితిగల్గియుండుట – యిటువంటి మహాకార్యములు గావించవలయును. ఉపకారస్వభావముతో నుండవలెను. దానధర్మాదులు చేయువలయును. పరహింస, పరనిందాదులు గావించరాదు.

“ఇట్లు భక్తితో నారాయణునకు ప్రీతిగా నెవరు సంచరించెదరో వారు

మాత్రమే ఆయన ప్రేమకు పాత్రులు కాగలరు. జీవుల చర్యలు గమనించుచు రహస్యముగా నందరిహృదయములలో నుండు స్వామిని గుర్తించుట జీవులకు ముఖ్య ధర్మము, ఈ ధర్మము విడచినవారు, యీ సంసారములో బడి చావు పుట్టుకలతో నానాబాధలు పడుచు, దారితెన్నులు లేని అంధకారములో మునిగిపోదురుగాన, వెలుగునిచ్చు విష్ణుభక్తి నెరుగవలె"ననెను.

# గంగామహిమ

ఇట్లు వివరించిన తరువాత విష్ణుప్రీతికరములగు కార్యములలో పావనగంగా స్నానమొకటనెను. అదివిని మునీంద్రులా గంగామహిమను, ఉత్పత్తియు వివరించమని కోరిరి. సూతుడిట్లు చెప్పనారంభించెను. గంగాదేవి విష్ణు పాదమునందుద్భవించి విష్ణునది యను పేరు పొందినది. పూర్వము సగర చక్రవర్తి అశ్వమేథయాగము చేయుదలచి, యాగాశ్వమును వదలెను. దానితో నాతని కుమారులు పది వేల సంఖ్యవారు బయలు దేరినారు. వారు యాగాశ్వము తిరిగినంత దూరము దాని నెవరడ్డగించకుండా, యడ్డగించిన వారు దానినాపకనే రక్షకులై వెళ్ళుచు నానా రాజ్యములు దాటుచుండిరి. ఇంతలో మహాయాగములు పెక్కాచరించిన సగరుడు తన యింద్రాధిపత్యము పొందునేమో నను భయముతో ఇంద్రుడు యాగాశ్వమును హరించి పాతాళ లోకముందన్న కపిలమహామునీంద్రుని యాశ్రమమున కట్టిపోయెను.

సగర కుమారులు యాగాశ్వమునకై దశదిశలు వెదకి గుఱ్ఱమును గానలేకపోయిరి. చివరకు వారు గుఱ్ఱమును చూపకున్న తండ్రియాగము భగ్నమగునని చింతించి భూలోకమున సమస్త ప్రదేశములు శోధించాము. ఇంక పాతాళలోకమునకు బోవుద"మని నిశ్చయించుకొని, భూమిని

త్రవ్వసాగిరి. వారట్లు త్రవ్వి, భూభాగమంతయు వలయము రీతిగా చేసి పాతాళలోకములో ప్రవేశించి యాగాశ్వమునకై శోధించి శోధించి చివరకు కపిలాశ్రమమునకు జేరిరి. కపిలుడు సమాధినిష్ఠుడై యుండుటయు, తమ గుఱ్ఱము బయట కట్టబడియుంటయు చూచి మండిపడిరి, కపిలుడిని దొంగగా ఆరోపించి దూషించారు. ఆయన తపస్సు కపటమైనదిగ భావించి హింసోద్యుక్తులయ్యారు. వారి అట్టహాసాలతో కపిలుడికి తపోభంగం అయింది. ఆయన కళ్ళుతెరచి – ఆ సగర పుత్రుల కేసి కోపంతో చూశాడు. అంతే, ఆయన నేత్రాగ్నులకు ఆ అరువైవేలమంది సగర సంతానమూ మండి బూడిద రాసులై పోయారు. ఇలా వారు కపిలుడి కోపాగ్నికి మాడిపోవటంతో సగర యజ్ఞము సమాప్తముగా లేదు. తరువాత రెండుతరములు నడిచినవి. ఎవరూ వారి మాట తలపెట్టలేదు.

పిమ్మట భగీరథుడు పుట్టెను. అతను పెద్దవాడైన తరువాత – అశ్వమేధ యాగవిషయము, తన తాతల విషయము, తెలిసికొన్నాడు. వారి కుత్తమ లోకములు గల్పించకున్న తమ వంశమంతయు నరకమున గూలునని విచారించెను. వారి కూర్ధ్వగతులు కల్పించు విధాన మెరుగ దలచి బ్రహ్మదేవుని గురించి తపమాచరించెను. బ్రహ్మ, అతని తపమునకు మెచ్చి దర్శనమిచ్చి 'నీకోర్కెయేమ' మని ప్రశ్నించెను. భగీరథుడు విషయమంతయు విప్పిచెప్పెను. చనిపోయిన వారి కుత్తరగతులు కల్పించుటకు మహాదేవుడే సమర్థుడు. నీ వాయనను గురించి తపమాచరించి మెప్పించవె' మని యాతడు వెడలిపోయెను. భగీరథుడు మరల మహాదేవుని గురించి గొప్ప మాచరించెను. చాల కాలమాతడాచరించిన తపమునకు సాంబశివుడానందమంది దర్శన మిచ్చి యేట్లనెను. "కుమారా! నీవు నన్ను గురించి ఏ కోర్కెతో తపమాచరించినావు? నీ హృదయములో నున్న కోర్కెలు చెప్పుమని ప్రశ్నించెను.

భగీరథుడు విని "దేవా! నా తాతలు కపిలకోపాగ్నికి వమాడిబూడిదరాశులైనారు. వారి కూర్ధ్వగతులు కల్గుటకు తగిన యుపాయము నీవలన నెరుగదలచి యీ తపమాచరించితి" "ఓ భగీరథా! నీవు గంగా ప్రవాహము ఆ భస్మరాశులపై ప్రవహింపజేసి వారి కుత్తమ గతులు కల్పించు" మని సలహాచెప్పి శివుడు వెడలిపోయెను. తరువాత నా భగీరథుడు గంగను గురించి మరల ఘోరమగు తపమాచరించసాగెను.

కొన్ని యేండ్లకు భగీరథుని తపముపండినది. గంగాదేవి ప్రత్యక్షమై "ఓ భగీరథా! నీమనస్సులోని కోర్కె ఏమిటి;" అని ప్రశ్నించెను. భగీరథుడు "అమ్మా! గంగాభవానీ! నా జన్మము సఫలమైనది. నీదర్శనమైనది. నా వాంఛితములు తీరగలవు, నీ దర్శన భాగ్యమున కృతార్థతచెందితిని, నాతాతలగు సగర పుత్రులు కపిలకోపాగ్నిబడి దగ్ధమై, భస్మరాశులుగా పడియున్నారు. వారి కుత్తమగతులు కల్పింపదలచి బ్రహ్మను, శంకరుని ప్రార్థించితి, వారు నిన్నాశ్రయించమని సలహా చెప్పిరి. నీ దర్శనమైనది. నీవు నా తాతల భస్మరాశులపై ప్రవహించి వారి కుత్తమగతులు కల్పింపగోరుచున్నా"నని ప్రార్థించెను. అదివిని గంగాదేవి నవ్వి "నాయనా! నేను స్వర్గలోకమునుండి ఈ లోకమునకు వచ్చు సమయమున నాధాటికాగి నన్నుధరించి, జాలుగా వదులువాడు కావలయును. లేకున్న నదరిపోటున వచ్చిపడి భూమిని బ్రద్దలుకొట్టి పాతాళమునకు పోదును. నన్ను ధరించగలవాడు శివుడు ఒక్కడే. నీ వాతనికీ విషయము చెప్పి, సాయము చేయుటకు ప్రార్థించు" మనెను.

భగీరథుడు మరల పరమశివుని గురించి తపమాచరించి ఆతని దర్శనమంది, గంగాదేవి చెప్పిన విషయమంతయు వివరించెను. గంగాదేవి చెప్పిన విషయమంతయు వివరించెను. శివుడాతని భక్తికి మెచ్చుకొని యట్లే

గంగను ధరింతును స్వర్గమునుండి రమ్మనికోరుమని " పంపెను. మరల గంగాదేవిని గురించి తపమాచరించి దర్శనమొందెను. గంగ ప్రత్యక్షమై "నీ వెంట వచ్చెదను నీవు ముందు నడవవలెను. నా ధ్వనికి బెదరరాదు. వెనుకకు తిరిగి చూడరాదు. ఎక్కడ చూచిన అక్కడనే ఆగిపోదును. ఈ పద్ధతుల ననుసరించి నడుచుమని " చెప్పి గంగ స్వర్గమునుండి శివుని జటాజూటమునందు దుమికెను. శివుడా గంగను తన జూటమునుంచి జాలుగా వదలసాగెను.

ఆ జాలు మహాప్రవాహమై భూమి పగులునట్టి చప్పుళ్ళతో, నురుగలతో వడిగల ప్రవాహవేగముతో భగీరథుని వెంబడించి తిన్నగా వానితాతల భస్మరాశులపై ప్రవహించెను. వారా గంగాతోయ స్పర్శతో పుణ్యలోకములకు పోయిరి, మహత్తర పవిత్రతగల్గ యీ గంగను స్మరించినను, అందు స్నానమాడినను, ముఖమార్జన మాచరించుకొన్నను, గంగపైనుండి గాలిని పీల్చినను పరమపవిత్రులై పుణ్యలోకములకు పోవుదురని చెప్పి, కాలకల్పుని కథలోనికి సాగెను.

## కాలకల్పుని కథ

పూర్వము మధురాపట్టణములో సోమశేఖరశర్మ అనునొక బ్రాహ్మణుడుండెడివాడు, అయన విశాలాక్షియను పేరుగల తన జాతి స్త్రీ రత్నమును వివాహమాడి గృహస్థుడై సంచరించుచుండెను. అతడు వేద వేదాంగముల నేర్చినవాడై ధర్మము వీడక జీవయాత్ర సాగించుచు, అతిథి అభ్యాగతుల పూజించెవాడు. స్నానసంధ్యాదులు నగ్నిహోత్రములు, పితృదేవతారాదనలు సమస్తము నెరవేర్చుచు పరమ పవిత్రుడై సంచరించుచుండెను. ఆ దంపతులు పుణ్యము సంపాదించదలచి గంగా స్నానమునకు బయలుదేరిరి. స్నానము గావించి, గంగను కలశములతో

బట్టుకొని తులసీ దళముల నందుంచుకొని, కాలి నడకను ప్రయాణము సాగించుచు వచ్చుచుండిరి. వారట్లు ప్రయాణించివచ్చు కాలములో నొకవర్తకుడు పశ్చిమ దేశమునుండి ప్రయాణమై సరుకులతో నా దారిని వచ్చుచుండెను.

అతడు తన సరుకు నొక రెండెడ్ల బండి మీద వైచుకొని, కాలకల్పుడను తన నౌకరుచే బండి తోలించుకొని పోవుచుండెను, ఆ ముసలి యెద్దు బండిని లాగ లేక లాగ లేక లాగుచుండెను. నౌకరు కాలకల్పుడా కదలలేని యెద్దును కఱ్ఱతో గట్టిగా బాదసాగెను. అది భరించలేక నాయెద్దు నేలపై పడిపోయెను. బండి ఒరిగి బరువు క్రిందపడెను. తన మీద బరువు తగ్గిపోవగా నా యెద్దు కోపముతో కాల కల్పుని గుండెలు క్రుమ్మినది. ఆ పోటు భరించలేక ఆనౌకరు నేలపైబడి మూర్ఛనంది చివరకు మరణావస్థలో బడెను.

గంగాస్నానము గావించి, శ్రీహరిని పూజించి ఆ దారిని తిరిగి వచ్చు చున్న సోమశేఖర శర్మ యీ కాలకల్పుని దుస్థితిని చూచి జాలిపడెను. నౌకరు ప్రాణావశిష్టముగా నున్న విషయము గ్రహించి, తాను తెచ్చిన గంగాజలమును వాని నోట బోసెను. శ్రీహరిని పూజించిన తులసీదళముతో గంగాజలమును వాని శరీరముపై జల్లి, ఆ తులసిదళమును వాని మీదనే బడవైచి తన దారిని తాను పోయెను. వాడు చివరకా ప్రదేశములోనే తన ప్రాణములు విడిచెను. వానిని విడచి సోమశేఖరశర్మ సాగుచుండగా కొందరు భయంకరాకారులను చూచిరి – చావుదెబ్బలు తిని రక్తము గ్రక్కుచు కాళ్ళుచేతులు విరిగి పోవుచుండ నడువలేక మూల్గుచున్న వారిని చూచి "అయ్యా! మీరెవరు? మీరెందుల కిట్లు బాధింపడుచున్నారని" ప్రశ్నించెను. వారు విని మేము యముని దూతలము. విష్ణుకింకరులకూ మాకూ పెద్దవాదము వచ్చినది. వారిని

మేమెదిరించలేక పోతిమి. వారు మమ్ము శిక్షించిరని చెప్పగా, సోమశేఖరుడు వారిని "విష్ణుకింకరు లెందులకు దండించినా"రని ప్రశ్నించెను. అందుకు వారు "మా ప్రభువు యమధర్మరాజు ఒక వర్తకుని నౌకరగు కాలకల్పుడనువాని ప్రాణములు గొనిరమ్మని మాకాజ్ఞాపించిరి. మేము చెప్పినది విని, "వీడే పాపము చేసినాడని మీతో గొనిపోవుచున్నా"రని యడిగిరి. మేము వివరముగా వాడు మొదటి నుండి పాపములే గావించినాడు. ఒక్క పుణ్య కార్యముకూడా చేయలేదు, చివరిదశలో కూడా లేవలేని వృద్ధ వృషభమును చావమోది మహాపాపమును పొందిన జీవి"- అని చెప్పినాము. వారందుల కొప్పుకొనలేదు. "ఈతడు చాలా పుణ్యాత్ముడు, అసలీతడే పాపమునూ యెరుగడు ఈతడు మరణావస్థలో నుండగా గంగాజలమును తులసీదళములతో పానము చేసినాడు. తులసీదళములు శరీరముపై నుంచుకొన్నాడు. అంత్యకాలములో 'నారాయణ' నామస్మరణము వినినాడు. ఇట్టి వానికి పాపము లెల్లుండును! పొండు పొండని మమ్ము చావమోది వానిని వైకుంఠమునకు గొనిపోయి"రని చెప్పగా విని సోమశేఖర శర్మ గంగామహిమను, తులసీపవిత్రతను, అంత్యకాల హరి నామస్మరణమునకు ఫలితమును, ప్రత్యక్షముగా నెరుగితిని గదా యని సంతోషించెను.

## పద్మగంధి చరిత్రము

తరువాత నా బ్రాహ్మణుడు ఇట్లు ఇల్లు వాకిలి విడచి గంగా తీరముననే నివాసముగా నుండి నిత్యము గంగాస్నానము, నారాయణ నామస్మరణము చేయుచు చివరకు మోక్షము పొందగల్గెనని చెప్పగా విని, యింకను విశేషములు వివరించుడని మునీంద్రులుకోరగా సూతుడిట్లు చెప్పదొడగెను. గంగా మహిమ లద్భుతములు. గంగాజలముతో శివాభిషేకముగాని, విష్ణు

దేవార్చనలు గాని కావించువారు మోక్షమును సులభముగా పొందగలరు. శరీరావయవములలో ఏ చిన్నదియైనను గంగలో పడవేసినచో నది- నది యందున్నంతకాల మాదేహి, స్వర్గాది పుణ్య లోకములలో నివసించగడలడు. గంగాతీరములలో నొక వటవృక్షముగలదు. దాని తొఱ్ఱలో నొక కొంగ నివాసవముగా నుండెను. ఆ చెట్టు క్రింద భాగమందొక నాగుపాము నివసించుచుండెను. ఒకనాటి రాత్రివేళ యా నాగుపాము వచ్చి కొంగను కఱచి చంపి దాని మాంసము కడుపారతిని ఎముకలు విడిచిపెట్టెను.

కొంతకాలము వరకునా యెముకలా వృక్షముమీద గూటిలోనే యుండిపోనవి. వాతావరణము మార్పులో నొకసారి తుఫాను గాలి వచ్చినది. ఆ ప్రభంజమునకు ఎన్నొ చెట్లు వ్రేళ్ళతో సహా కూలిపోయినవి. అట్లే గంగాతీర ముందున్న వటవృక్షము కూడ కూకటి వ్రేళ్లతో నేలకు కూలిపోయినది. అది గంగవైపున కొరగిపోవుటతో గూటిలోనున్న కొంగయెముకలు గూటితో సహితవముగా గంగలోపడినవి. ఎప్పుడైతే ఎవముకలు గంగాజలవములో పడిపోయినవో, ఆ క్షణమందు యా జీవికి నరకవాసము వదలిపోయినది. గంగాజల స్పర్శనముతో దానికి పవిత్రత వచ్చినది. పుణ్యలోక మబ్బినది.

అందుచే నాజీవి యొక దివ్యసుందర స్త్రీ రూపము ధరించి యింద్రుని దర్బారులో నుండగల్గినది. అపురూప సౌందర్యవతి ఇంద్రుడామెకు పద్మగధియని నామకరణముచేసి తన దివ్య వేశ్యలలో నుంచి యానందించు చుండెను.

## గంగావతరణము - సులోచన, మాధవవర్మ

ఇట్లు గంగామహిమను వర్ణించి, యింకనూ ఇట్లు చెప్పసాగెను. ఇదివరలో భగీరథుడు యెంతో యత్నము గావించి గంగను తెచ్చెను, తన పితృదేవతలను తరింపజేసెను. ఎందరెందరు గంగాజలపానమును, గంగా

మంత్రజపమును, గంగాస్నానమును, గంగావాయు సేచనమును కావించి పవిత్రులైరో లెక్క పెట్టుటకు మనము చాలము. అనంత మహామహిమలు చూపు గంగను, వేనోళ్ళ శేషుడును వర్ణించజాలడు. గంగానది భరత ఖండములో నుండుటచే దేవతలు సైతము తమతమ అంశలతో ఇచ్చట జన్మించి గంగాస్నానము నాచరించి జన్మ పావనము గావించుకొనుచు మహామహిమలతో జీవయాత్రలు నడుపుచున్నారు.

జంబూద్వీపమునందు తాళధ్వజమను పట్టణము గలదు దానిని విక్రముడను రాజు పాలించుచుండెను. అతనికి అపురూపవతియగు నహిరావతియను పేరుగల సుందరాంగి భార్యగా నుండెను. ఆ దంపతులకు పుణ్యవశమున మాధవుడు యనునొక కుమారుడు గల్గెను.

అతడు క్రమముగా ధనుర్విద్యాది సర్వవిద్యలు నేర్చుకొని, ఆనాటి విఖ్యాత పరాక్రమవంతులలో నొకడాయెను. తండ్రియు, వాని సామర్థ్యము మెచ్చుకొని పట్టాభిషేకము చేసి రాజ్యమప్పగించెను. అతడు చాకచక్యముతో రాజ్యపాలనము గావించుచు ప్రజలందరు మెచ్చునట్లు సంచరింపసాగెను. ఇట్లుండగా నా చక్రవర్తి యొకనాడు వేటకు వెళ్ళి తిరిగి ఇంటికి వచ్చుచుండగా, తన యుద్యానవనములోని యొక తటాకము లోనికి దిగి స్నానమొనర్చి యొక సుందరాంగి నీళ్ళ బిందెతో వచ్చుచుండెను. మాధవవర్మ ఆమె సౌందర్యమునకు సంతోషించి, మోహించినవాడై "ఓ సుందరీ! నీవెవ్వరిదానవవు? యే వంశములో జన్మించితివి? తల్లితండ్రులెవరు? ఏ పుణ్యాత్మునకు నీ భర్తగా యుండు యోగము కల్గించినావు? నీ విషయము దాచకుండ నాకు సమస్తము వివరించుము? నేను ఈ రాజ్యమును పాలించు చక్రవర్తిని. పరకాంతలయం దాశలేనివాడను. నీ సౌందర్యమును చూచి సంతోషించి నిన్ను మోహించుచున్నాను. నిన్ను భార్యగా చేసికోదలచినా"నని

నిష్కర్షగా చెప్పగావిని, వినయముగా తలవంచుకొని"నేను వీని చేతిలో పడినాను. వీడే మోహపరవశుడై యున్నాడు. నా శీల భంగము చేయునేమో? ఏదేని యుపాయమాలోచించి ఈతని బారినుండి తప్పుకొనవలయును యని దీర్ఘాలోచనవము గావించి చివరకు సాహసముబూని రాజువైపు తిరిగి 'ఓ రాజోత్తమా! నేను రాజవంశములో జన్మించినదానను. నా తండ్రి పేరు వీరబాహుడు. నా తల్లి సులోచన, నా భర్త పేరు సుబాహువు నన్ను చంద్రకళయని యందురు. నేను ఇంతవరకు పరపురుషుని మొగమెరుగను. కులదేవతను పూజించుటకు స్నానార్థమై ఇచ్చటకు వచ్చితిని. మీరి దేశపు ప్రభువులు రాజులు ప్రజలకు తండ్రులవంటివారు. పరస్త్రీని చూచి మోహము చెందనివాడే మోక్షార్హుడగును. మీరు జ్ఞానసిద్ధులు. కావున నాయందు వాంఛ వదలియుండ గోరెదను" అని నేర్పుగా చెప్పెను.

కాని, రాజు మోహము వదలలేక "నేను నీయందు మమకార మొందియున్నాను. నన్ను ప్రేమతో చేపట్టుమని యెంతయెా బ్రతిమాలసాగెను. నేను నిన్ను పొందకున్న ప్రాణత్యాగము చేయదలచితిని జీవహత్యాదోషము నీకు తప్పక వచ్చు"నని ఖచ్చితముగా చెప్పివేసెను.

ఆ మాటలు చంద్రకళ విని వాని వ్యామోహమున కాశ్చర్యమందినది. ఆమెకు సులోచన విషయము జ్ఞాపకము వచ్చినది. వెంటనే మాధవవర్మని జూచి "రాజా! నీకు తగిన సౌందర్యవతి యొకతెనా చెలికత్తె యున్నది. మూడు లోకములలో నామెకు సరిపడినది యెవ్వరులేరు. ఆమె యీ మధ్యనే యొక దూతికను నా వద్దకు పంపినది. ఆ దూతికమిమ్ము చూచినది. మీ గుణగణముల నా దూతిక మెచ్చుకొన్నట్లు చెప్పినదనెను.

ఆ మాటలువిని రాజు ఆనందపడి "చంద్రకళా! నీకడకు దూతిపంపిన సుందరాంగి యెవరు? ఏ దేశస్థురాలు? ఎవరి కుమార్తె మరియు

నామధేయమేమి? నాకు సవిరముగా నామె వృత్తాంతము వినిపింపు మని " యడుగగా, నామె "మహారాజా! నేను చెప్పిన సుందరాంగి ప్లక్షద్వీప రాకుమార్తె, సులోచన ఆమె తండ్రి గుణాకరుడు. తల్లి సుశీల. ఆ ద్వీపము సముద్ర మధ్యమునందున్నది. దానికి రాజధాని దీప్తిపుర " మని యామె చెప్పగా మాధవసింహుడాశ్చర్యపడి "చంద్రకళా! మనకా ద్వీపవాసులను చెందుట యెట్లు కుదురును? వారిది దూరప్రదేశము. ఇది సాధించగల కార్యముగాని యుపాయము గాని లేదు, ఇంతటి యసాధ్యవిషయయములో నేనెట్లు నిలుబడగలను? నీవే చెప్పు " మని ప్రశ్నించెను.

అది విని చంద్రకళ "రాజా! మీ గుఱ్ఱముల దండులో నొక దేవతా మహిమగల గుఱ్ఱమున్నది. అది యింద్రుని గుఱ్ఱముల జాతిలోనిది. మీకు దాని మహిమ తెలియదు. నేనెరుగుదును గాన చెప్పుచున్నాను దానిపై కెక్కి నెటకుపోవ గావలయునన్న నటకుపోవగల్గుదురు. నిన్ను నిముషములో దీప్తిపురమున కది చేర్చగలద"నెను. ఆమాటవిని రాజా చంద్రకళను చూచి "నీవు చెప్పినట్లా గుఱ్ఱమెక్కి పోతాననుకొనుము. ఆ పట్టణములో నా యొక్క మొగమెవ రెరుగుదురు? నాకెవరు సాయము చేయుదురు? నేనా సుందరాంగిని యెట్లు చూడగలనో నెప్పి నన్ను పంపు బని వేడుకొనగా – "ఆ పురములో గంధిని యను పేరుగల పువ్వులమ్ముచుండు నొక సుందరాంగి యుండును. నీకామె సహాయపడగలదు. నీవా రాచపడుచును చూచిన వదలగలవా? ఆమె సంగీత సాహిత్యములందు నిపుణురాలు, ఉత్తమ సాముద్రిక చిహ్నములు గల యుక్తవయస్కురాలు, ఆమెకు యెడమ తొడమీద పుట్టుమచ్చయున్నది. నీవామెను వివాహమాడిన సుఖింతువు. నామాట నమ్మి బయలుదేరు" మని చెప్పి చంద్రకళయు రాజాబారినుండి తప్పించుకొని వెడలి పోయెను.

తరువాతమాధవుడు తన గుఱ్ఱపుశాలలోనికి పోయి యచటనుండు గుఱ్ఱములను చూచి "ఓయశ్వరాజములారా! నేను పక్షద్వీపమునకు పోవలయును. మీలో యెవరు నన్నా ద్వీపమునకు దోనిపోదురని ప్రశ్నించెను. అదివిని యందుండు గుఱ్ఱములు యొకదాని మొగమొకటి చూచుకొనుచు సమాధానము చెప్పలేక యట్లే యుండెను. చివరికొక బక్క చిక్కిన గుఱ్ఱము మాత్రము "నేను నిన్ను ప్లక్షద్వీపమును గొనిపోగలను. కాని, నన్ను నీవు నిరాదరణగా చూచినావు. అన్నింటినీ చూచి మేత పెట్టినట్లు యింతవరకు నాకు కడుపు నిండా యింత మేతకూడా పెట్టలేదు. నన్నొక్కసారియైనను చేతితో దట్టినావా? రాజావూ యజమానివీయగు నీవు నన్ను ప్రేమతో చూడకున్న నేనెట్లుందును? నీ యవసరమును గురించి ప్రశ్నించి, యిప్పటికైనా నా శక్తి గమనించినా"వదియే సంతోషమనెను.

రాజా తన తప్పుకు చింతించి "అశ్వరాజమా! నేను చేసినది పొరపాటు, నీవు యింకొక విధముగా తలచకుము, నేటి నుండి నీవు నా పట్టపు గుఱ్ఱానివి. ఇదిగో నీముఖమునందు రాజపట్టము కట్టుచున్నా"నని సువర్ణపట్టము గట్టి, తగిన యాహార పదార్థములు కడుపార బెట్టించి, ప్రయాణ సన్నాహములో నుండెను. ఒక సుముహూర్తమున రాజాయశ్వముపైన గూర్చుండి యనాద్వీపమునకు ప్రయాణమై పోవసాగెను. అది యాకాశమార్గమున ప్రయాణము చేసి ప్లక్షద్వీపమునకు చేర్చెను. పిమ్మట మాధవవర్మ పూవులమ్ముకొను గంధిని యిల్లు గురించి వాకబు చేసి యామెను కలుసుకొని చంద్రకళా వృత్తాంతము చెప్పెను.

ఆమె రాజకుమారుని చూచి"ఇంతటి సుందరాకారుడు దొరకుటకా సులోచన పుణ్యమెంతటిదో గదా!" అనుకొని "ఓ రాజకుమారా! నీవు సులోచనకై యెంతో కష్టపడి వచ్చినావు. ఎక్కడి జంబూద్వీపము? ఎక్కడి

ప్లక్షద్వీపము నీ రాజభోగములు, కోటలు, తోటలు, దొడ్లు సమస్తము వదలి చంద్రకళ మాటమీద సులోచనకై వచ్చినావా? ఎంత శ్రమపడితివి? నిన్ను చూడగా నాకు జాలి గల్గుచున్నది. నీవు నిన్న మొన్నటిలో వచ్చిన ఎంత బాగుండెడిది. సులోచనకు వివాహము నిశ్చయమైనది కుశద్వీప చక్రవర్తి కుమారుడు 'విద్యాధరున' కామె నిశ్చయింపబడినది, రేపే వివాహముహూర్తము, ఆమెయు నాతని వరించినది. ఇద్దరూ ప్రేమతో వివాహము చేసుకొనుటకు సిద్ధమైన సమయములో నీవు వచ్చినావు. నేనేమి చేయగలను? ఇంత దూరము ప్రయాసపడి వచ్చినది - సులోచన ఇంకొకవరుని చేబట్టిపోవుట కనులార చూచుటకే ననిపించుచున్న" దనెను. ఆమె, రాజకుమారుని పరిస్థికెంతయో జాలిపడి నిట్టూర్చెను. రాజకుమారుడు కుప్పకూలినట్లు కూలి మహా దుఃఖమంది గంధిని మొగము చూచి యిట్లనెను.

"ఓ పుణ్యాత్మురాలా! నీవు తప్పనాకీ యవసరములో తోడ్పడేవారెవ్వరూ లేరు. నేను నిన్నాశ్రయించుచున్నాను నీకు రత్నములు, బంగారము, వెలలేని కానుకలు బహుమతిగా నిచ్చెదను. నాయందు దయయుంచి, నీవు నా పక్షాన రాయబారము నడిపి, నాకా సులోచన దక్కునట్లుచేయ ప్రార్థించుచున్నాను. నా ప్రార్థన మాలించి యీ మహోపకారము చేసినచో జీవితాంతము నీకు విశ్వాసపాత్రుడనై యుందును అని పెక్కువిధములుగా దీనముగా నామెను బ్రతిమాలసాగెను. "నేను చీటినిచ్చెదను. దానిని సులోచనకందిమ్ము, ఆమెనాకు భార్యగా నగునట్లు నీవు యేర్పాటు చేయు"మని యెన్నో విధముల చెప్పగా విని, గంధిని జాలిపడి తనకు వీలయినట్లు తోడ్పడెదనని కృతనిశ్చయముతో ప్రయత్నింపసాగెను.

ఆమె పువ్వులమ్మునదిగదా! అందుచే మాధవవర్మ వ్రాసియిచ్చినచీటిని పూవులదండలలో నమరింగింపరచి తిన్నగా సులోచన యున్న యంతఃపురమునకు పూవులబుట్టతో వ్యాపారార్థమన్నట్లు బయలుదేరెను. ఆమె సులోచనను చేరి తన పుష్పమాలలో నుంచి యున్న చీటీ నామె కందించెను. సులోచన ఆలేఖను చూచినది. తరువాత చదువుకొని యెంతో విచారించినది. ఇప్పుడు చేయందగినపని యేమమా? యని చాలాసేపు తటపటాయించి, యిదివరకు మాధవవర్మను చూడ చంద్రకళ కడకు పంపిన చెలికత్తెను పిలిచి యిట్లనెను.

“ఓ చెలీ! నిన్ను జంబూదీవమునకు చంద్రకళ దగ్గరకు చూడమని పంపిన రాజకుమారుడు యిప్పుడు మన ద్వీపము వచ్చినాడు. మన గందిని యింటి వద్దయున్నాడు. ఈ లేఖనాతడు నాకు వ్రాసి గంధినిద్వారా పంపియున్నాడు. సంబంధము నిశ్చయమై వివాహమునకు సిద్ధమగు సమయములో వచ్చినాడు. ఇప్పుడు మనమేమి చేయువలయును? యని చెలికత్తెతో నాలోచించి ప్రియంతముులగు రాజకుమారులకు వ్రాయు విన్నపములు. “ఓ రాజచంద్రా! మీరు నాయందనురాగముగల్గి, నా చెలికత్తె చంద్రకళ వివరించగా ఇట కనేక కష్టములు సహించి వచ్చియున్నారు. మీరు వచ్చుటకు జాగగుటచే నా తండ్రి యింకొకరికిచ్చి వివాహముచేయ నిశ్చయించి ముహూర్తముంచినాడు. కుశద్వీప చక్రవర్తి కుమారుడు విద్యాధరుడు నాకు నిశ్చయించిన భర్త.

తండ్రి చాటుదాననగు నేను స్వతంత్రించి నిలబడకూడదు. మిమ్ములను త్రోసిపుచ్చిన ద్రోహురాలనౌదును. నేనీ యిరకాటములో పడియున్నాను. ఇప్పుడు నాకు తోచినయుపాయ మొకటి మీకు వివరించుచున్నాను. రేపురాత్రి నన్ను వివాహము కడపకు గొనివచ్చునప్పుడు

చేతులు పైకెత్తి నిలువబడుదును. అప్పుడు మీరు నన్నుగాని పోగలిగినచో మీకు భార్యాగా యుందు" నని యొక కమ్మ వ్రాసి దానిని గంధినికిచ్చి రాజకుమారుల కందీయుమని యాజ్ఞాపించి పంపెను. ఇట్లు చీటీ వ్రాసి పంపి మరియొక చెలికత్తెతో" చెలీ! నా మనస్సుకుదురుగా లేదు. నేనొక సంజ్ఞతో చీటీని వ్రాసిపంపితిని. నా రాజపుత్రుడున్న విచారము లేదుగాని యిక్కడ మనకు సమీపములో నున్న వానిని వదులుకొనగలనా? అతడు యెవరో నిజము తెలియకుండానమ్మి మోసపడిన నా తండ్రి తెచ్చిన మంచి సంబంధము వదలుకొని చిక్కులపాలు గావలసివచ్చునేమో? ఆ రాజకుమారుడు జంబూద్వీపము వాడేనా? ఇంత దూరమాతడెట్లు రాగల్గెను? ఎవరైన దేవగంధర్వ జాతిలోనివారు నన్ను మోసము చేయుట లేదు గదా! నేను సంజ్ఞ నిచ్చి పొరపాటు చేసితినా? ఇందులోని నిజానిజములు మనకెట్లు తెలియగలవు? మనము స్వయముగా నెరుగవలయును. దీనికి నాకొక యుపాయము తట్టుచున్నది. మనమాతనిని స్వయంగా చూచుటకు యత్నము చేయవలయును తెల్లవారు జామున మనము స్నానార్థము పోవునట్లు ప్రయాణమై, గంధిని యింటిని చూచుచు పోవుదము. గంధినితో మాట్లాడునట్లుగా వెడలి యా రాజవరుని చూచి మన యనుమానము తీర్చుకొందము" అని చెప్పి యా రాత్రి రాజకుమారునియందు దృష్టినుంచుకొని పరుండి, వేకువనే లేచి, చెలికత్తెలపిండుతో సులోచన స్నానార్థమై బయలుదేరెను.

ఆమె చుట్టు చెలికత్తె లుండగా తనరాక గంధిని ఇంటికి తెలియునట్లు చేసెను. ఈ వార్త గంధిని రాజకుమారునకు తెలియజేసినది. తరువాత రాజకుమారుడు చెలికత్తె గుంపుతో వచ్చియున్న సులోచనను చూచెను. సులోచన రాజకుమారుని చూచెను. ఇట్లిద్దరు చూచుకొని పరమానందము చెందియుండిరి. తమలోని కోర్కెలు నెరవేరునని ఉభయుల పరిమితా

నందముతో చూపుల ద్వారా సమ్మతుల నెరగించు కొనిరి. చెలికత్తె ద్వారా పంపిన సంజ్ఞ ననుసరించి వివాహ సమయుమునకు వచ్చి తనను గొనిపొమ్మని రహస్యముగా చెప్పి, తాను వెడలెను. మాధవవర్మ ఆరాత్రి తప్పక సులోచనను గొనితెత్తునని పరమానందమంది, రాత్రి నిద్ర యుండదని మధ్యాహ్నమే నిద్రలోబడెను.

కర్మవశమున ఆతడా రాత్రి పెండ్లి వేళకుగాని నిద్రనుండి లేవలేదు. కాలము మీరుచున్నది. సులోచనకు వివాహమైన రాజకుమారునకు దక్కదని యెూచించి మాధవుని నౌకరగు ప్రచేష్ముడు తానే గుర్రముమీద పోయి పెండ్లి కూతురును గొనివచ్చి రాజాన కప్పగించవచ్చునని తలచి, సరిగా యా సమయమున కాతడా గుఱ్ఱమునెక్కి పెండ్లి జరుగు చోటునకు వచ్చెను.

ఆ సమయమునకు సులోచన తన రెండు చేతులు పైకెత్తి చూచుచుండెను. గుఱ్ఱము మీద నున్న రాజసేవకుడామెను చేతులతో నెత్తి పైకిలాగుకొని గుఱ్ఱము మీద కూర్చుండబెట్టెను. తరువాత గుఱ్ఱమును సముద్రమును దాటించుమని యాజ్ఞాపించెను. కొంత దూరము పోయిన తరువాత రాజసేవకునకు సులోచనయందు మక్కువ గల్గినది. ఆ గుఱ్ఱము నొక జనశూన్య ప్రదేశములోనికి దిగునట్లుచేసి, యామెను చూచి"ఓ సుందరాంగీ! నేను మాధవవర్మ నౌకరును. నా రాజా నిద్రలో మునిగి, నిన్ను సమయుమునకు గొనిపోవ రాలేక పోవుట చూచి నీవు విచారింతువని బాధపడి, నేను నిన్ను యీ గుఱ్ఱము నెక్కించుకొని వచ్చితిని. మనము ఇద్దరము యౌవనములో నున్నాము. నిన్ను నేను ప్రేమించినాను. ఇచ్చటకు దగ్గరగానున్న కాంచనపురములో నుందుముగాక! దాని చుట్టును సముద్రమున్నది. మనల నెవరూ పట్టుకొనజాలర"నెను.

అదివిని సులోచన "వీడు మూర్ఖుడు. నామాట వినడు నా ప్రాణప్రియుని వదలి ఈ యవస్థలో పడ్డాను. బ్రహ్మ వ్రాసిన వ్రాత నెవరు తప్పింతురు? నాకర్మ యెట్లున్నదో యా దైవమునకే యెరుక. ముందుగా నేను వీనిని మాయలోముంచి వదల్చుకొన్నచో నాకు తోచిన దారిని పోగలన"నని నిశ్చయించి "ఓయీ! నీవు నన్ను ప్రేమించుకొనుటలో నేమియులేదు. మనమిద్దరము వివాహము గావించుకొని సుఖముగా కాపురము చేసికొందుము. నా చేతి రత్నకంకణము పుచ్చుకొని గ్రామము లోనికిపోయి వంటకువలయు సంబారములు తెమ్మని" వానిని సాగిపంపెను.

నేనిట నుండరాదు. వాడు వెడలిన తరువాత నేనీ దివ్యాశ్వమునెక్కి గంగాతీరమునకు పోయి, యచట తపమాచరించెదను. నాతపోఫలితముగా నా ప్రియుడు చిక్కకున్న నేను గంగలో దూకి ప్రాణత్యాగము చేసికొందునని తలచి సులోచన యా గుఱ్ఱముపై గూర్చుండి ప్రయోగకు బయనించసాగెను.

ఈ విధముగా సులోచన దివ్యాశ్వమునెక్కి ప్రయాగ క్షేత్రమునకు పోవుదారిలో కొందరు గంధర్వాంగనలు విమానముల మీద పోవుచు గుఱ్ఱముపై పోవుచున్న సులోచనను చూచి ఆమెను గురించి ప్రశ్నవేసిరి; ఆమె తన వృత్తాంతము వివరించి చెప్పసాగినది. ఆ చరిత్ర విని జాలిపడి "కుమారీ! నీకు భయములేదు. విచారించకుము. నీకు మేము ఇంద్ర జాలమంత్రము నుపదేశింతుము, దానిని జపించుము, నీకు సర్వకార్యసిద్ధియగును" అని చెప్పి యింద్రజాల మహామంత్రము నుపదేశించిరి. పిమ్మటామె ప్రయాగకు పోయి యచ్చట పవిత్ర భాగీరథీ నదీ స్నానము గావించుకొనెను. స్త్రీరూపములోనున్నచో కష్టము లెదుర్కొనవలయునని భావించియొక పురుషుని రూపము ధరించి సమీపమునందుండు సుషేణుడను వానివద్దకు

పోయి "నేను సమస్త శాస్త్రము లెరిగిన వీరవరుడను. నన్ను మీ ఆస్థానములో నుంచుకొను"మ్మని కోరెను. రాజు సంతోషించి. యావీరవరుని తన యాస్థానవములో నావికాధికారి పదవిలో నిల్పి, గంగాతీరమునన్న యోడలో వసతి కల్పించెను. ఇట్లాత డుండు కాలములో నారాజు రాజ్య మందు క్రూర భయంకర మృగము వచ్చి ప్రజలను బాధించి సంహారము చేయుచుండెను రాజు దానిని జయించలేక "ఎవరా దుష్టమృగమును వధింతురో వారికి తన కుమార్తెనిచ్చి వివాహంచేయుదు "నని చాటించెను. వీరపురుషుని రూపములో నున్న సులోచన తన గుర్రమునెక్కి ఖడ్గము చేగొని యా మృగమును వెదకి వధించెను. అప్పుడా మృత మృగశరీరము నుండి యొక మహాపురుషుడు బయటకువచ్చి "ఓయీ! నీవెవరవో నేరుగుదును. నీవు పురుషుండవు కావు స్త్రీవని ఎరుగుదును. నీ వృత్తాంతమంతయు నాకు తెలియనిది కాదు. వినుము చెప్పెదనని సవిస్తరముగా నామె చరిత్రనంతయు వదలకుండా వివరించి చెప్పెను. అది విన్న సులోచన పరమాశ్చర్యమంది ఓ "మహాపురుషుడా! నీలోని యద్భుతశక్తి కాశ్చర్యపడుచున్నాను. నీ చరిత్రము నాకు విన్పింపుమని గౌరవముతో ప్రార్థించి " యడిగినది.

ఆ మాటలు విని ఆ పురుషుడు "ఓ సులోచనా! నేను గత జన్మలో సూర్యవంశపురాజును. నా పేరు ధర్మక్షీవి నేను తొలుత ననేక మహాపుణ్యకార్యము లాచరించియు, చివరకు దుష్టసహవాసముతో సమస్త పాపకృత్యము లాచరించి దుష్టుడననుపించుకొన్నాను. కొంతకాలమునకు శరీరము విడువగా యమదూతలు నన్ను – యముని కడకు గొనిపోయిరి. చిత్రగుప్తునిద్వారా నా జీవితపు లెక్కలు తెలిసికొని నన్ను మహానరకమందు పడవేయించెను. ఆ నరకబాధ లనుభించిన తరువాత గండామృగముగా నుండుమని, నన్ను ఈ శరీరములో ప్రవేశపెట్టిరి. నేను నీ పుణ్యమూలమున

గంగా తీరమున చంపబడి, దుష్టదేశము వదలి పెట్టితిని. నీ గంగాతీర నివాసఫలితముచే నేను పుణ్యాత్ముడనైతిని. నన్ను చంపిన కారణమున యీ రాజా తన కుమార్తెను నీకిచ్చి వివాహము చేయగలడు, నీవు నీ భర్త మాధవవర్మ ననతికాలములో కలిసికొని పరమ సుఖములందుచు పుత్రపౌత్రాభివృద్ధిగా వర్ధిల్లగలవు. మీరిద్దరూ గంగాదేవిని సేవించి ఈ జన్మాంతములో శ్రీహరి నివాసము చేరగలరు. నేను నా పుణ్యబలముతో విమానవముమీద వైకుంఠమునకు బోవుచున్నా"నని, విమాన మెక్కిపోయెను. సులోచన వానిమాటల కానందాశ్చర్యములు పొంది, సుషేణుని జేరెను. ఆడిన మాట ప్రకారము రాజా తన కుమార్తె జయంతి నావీరవరునికిచ్చి వివాహము గావించెను. తొలి రాత్రి జయంతిని వీరవరునివద్దకు పంపగా నాతడామెతో "ఓ సఖి! ప్రస్తుతము నేనొక నియమములో నున్నాను. నా దీక్ష పూర్తియైన పిదప మనము సుఖముగా నుండవచ్చు"నని ఆమెకు సంతృప్తి కల్గించెను.

ఇది యిట్లుండగా సులోచన యిచ్చిన కంకణముతో పట్టణములోనికి పోయిన మాధవుని నౌకరు ప్రచేష్టుడు, సంబారములు తెచ్చుకొని – తిన్నగా యిదివరలో తామున్న ప్రదేశమునకు పరుగు పరుగున వచ్చినాడు. అచట గుఱ్ఱము గాని సులోచన గాని కనిపించలేదు. తానామె యందు మక్కువ పెట్టుకొన్న కారణముగా మతి స్థిమితము తప్పి దేశ దేశాలు తిరుగుచు, ప్రయాగలో యే కోరికతో చనిపోదురో మరుసటి జన్మలో నా కోర్కె తీర్చుకొందరను విషయము నెరిగి బలాత్కారముగా నచట ప్రాణాత్యాగముచేయ సిద్ధపడెను. వీరవరుడు పూర్వమే యెవరిందులోపడి ప్రాణత్యాగము చేయజూతురో వారిని బంధింపుడని నౌకర్లను నియమించిన కారణమున, రాజభటులు ప్రచేష్టుని వీరవరుని కడకు గొనిరాగా వానిని గుర్తించి వీనిని కారాగృహములో పడవేయుడని యాజ్ఞాపించెను. "మరికొద్ది

కాలమునకు విద్యాధరుడు "నన్ను వివాహమాడ సిద్ధపడిన సుందరాంగిని ఎవరో యుపహరించుటచే నాకగౌరవమయ్యెను. నా బ్రతుకెందలకని యాత్మహత్య గావించుకొననెంచి ప్రయాగలోని గంగలోపడిపోవబోగా రాజభటులు బంధించిరి" విద్యాధరుని న్యాయస్థానము నందుంచగా వీరవరు డాతని చూచి గుర్తుపట్టినది. వానివలన సవిస్తరముగా వృత్తాంతము వినదలచి ప్రశ్నించగా నేనా సుందరాంగిని పొందలేక పోయితిని. ముందు జన్మమందైనా పొందగలనని యీ గంగలో ప్రాణత్యాగము చేయనెంచితి ననగా విని వైరాగ్యముపదేశించి సన్యాసము గొనునట్లు చేసెను.

తరువాత మాధవవర్మ యానాటి నిద్రనుండి లేచి పెండ్లి కుమార్తె నెవరో యెత్తుకొనిపోయిరని విని గుఱ్ఱమూ, నౌకరూ కనబడకపోవుటచే తన నౌకరే యిట్లు చేసియున్నాడని భావించి చాలా చింతించాడు. దేశదేశాలు నడకపై తిరుగుచు చివరకు ప్రయాగ క్షేత్రమునకు వచ్చి త్రివేణీసంగమము నందు ప్రాణములు వదలదలచెను. ముందు జన్మమందైనను సులోచనతో పొందు కల్పించుమని శ్రీహరి నారాధించుచు గంగలో మునుగబోవగా రాజభటులువచ్చి యాతని బట్టుకొని విచారణకు వీరవరుని వద్దకు గొనిరాగా సులోచన మాధవవర్మను మర్యాదగాచూచి సుషేణునివద్దకు గొనిపోయెను.

అచట వీరవరుని వేషములో నున్న సులోచన తన వృత్తాంతము సమస్తమూ రాజునకు చెప్పి తాను సులోచననని నిజరూపమును చూపి యారాజకుమార్తె జయంతిని తన భర్తకు వివాహముచేసి యిద్దరు సుఖముగా కాలక్షేపము చేయుచు పెక్కండ్రు సంతానము పొంది శాశ్వితమైన కీర్తి గడించిరి. జయంతికి సోదరులులేని కారణమున ఆ రాజ్యము మాధవవర్మకు సంక్రమించగా నిద్దరు భార్యలతో గంగాతీరముననే యుండి శ్రీహరిని ధ్యానించుచు వారు ముప్పురు పరమపదమునకు పోయిరి.

# వాంఛావటం

తరువాత మహాముని ఎవరైతే వాంఛావటమెక్కి తమ కోరికలను దలంచుచు త్రివేణీసంగమ ప్రదేశమున ప్రాణములు విడుతురో మరు జన్మమందు వారా వాంఛలు పొందగలరు. నిదర్శనముగా నొక కథను విన్పించెదను. వినుము. పూర్వము ప్రయాగయందు ప్రణిధి యను వర్తకుడుండెను. అతడు వర్తకములో హెచ్చు లాభము గడించ దలచి దూరదేశమునకు పోయెను. ఆ సమయములో అతని భార్య నొక మాలవాడామె సౌందర్యము చూచి మోహించెను. వాని నా పద్మావతి నిరాకరించగా నా జీవిత మెందులకు? వాంఛావటమునుండి గంగానదిలో దూకి ప్రాణములు పోగొట్టుకొని మరుజన్మమందు యీ పద్మావతిని పొందుదునని దూకి ప్రాణములు విడచెను. అతడు చనిపోయిన వెంటనే ప్రణిదుని రూపమంది యామెకడకు వచ్చెను. ఆ సమయముననే నిజభర్తకూడవచ్చెను. "ఇదెక్కడి న్యాయమనగా, నారాయణుడు "భూలోక మందు నింద్యమైనను నాలోకమున నింద్యము కాదు వాంఛావటము నుండి గంగలో దూకి ప్రాణములు పోగొట్టుకొని మరు జన్మమందు యీ పద్మావతిని పొందుమనెను. వారిద్దరిలో నిజభర్తను గ్రహించలేక నారాయణుని ప్రార్థించగా నాతడు దర్శనమిచ్చి యిద్దరూ నీ భర్తలే యనెను. ఇదెక్కడి న్యాయమనగా, నారాయణుడు "భూలోకమందు నింద్యమూనను నా లోకమున నింద్యము కాదు వాంఛావటమునుండి ప్రాణత్యాగము చేసిన వాడు – మరుజన్మలో తన కోరిక పొందగలడు. కాన మీరు ముప్వురు విమానములో నా లోకమునకు రండని వారిని విమానములో వైకుంఠము జేర్చెనని సూతుడు వాంఛవట మహిమను యీ కథారూపమున వివరించెను.

# అశ్వత్థవృక్షం

పిదప అశ్వత్థవృక్షమహిమ నిట్లువర్ణించెను. పూర్వము సౌరాష్ట్రదేశము నందు ధనంజయుడను బ్రాహ్మణుండుడెడివాడు. అతని భార్య సుశీల. వారిద్దరూ మహాభక్తిపరులై శ్రీహరి నారాధించుచు భిక్షాటనముతో కాలము జరుపుకొను చుండువారు: వారికి సరైన బట్టలు లేని కారణమున చలికి తట్టుకొనలేక యెండుపుల్లలను తెచ్చుకొని నెగడుపెట్టి కాలక్షేపము చేయుచుండిరి. ఇట్లుండ నొకనాడు ఎండుకట్టెలు దొరకక, పెరటిలోని రావిచెట్టు కొమ్మనరికి చలిమంట కాగదలచిరి. అతడు గొడ్డలిని గొని యారావిచెట్టు కొమ్మనరికినదే దడవుగా నందుండి శంఖచక్రములతో, రక్తముకారు శరీరముతో నారాయణుడు ప్రత్యక్షమైనాడు.

అదిచూచి యాబ్రాహ్మణుడు నారాయణునకు నమస్కరించి "స్వామీ! నీశరీరము నుండి యెందులకు రక్తముగారుచున్నది?" యని ప్రశ్నింపగా విని, నారాయణుడు "ఓ బ్రాహ్మణుడా! నేను అశ్వత్థరూపుడను. నీవు నన్నిప్పుడు గొడ్డలితో నరికినావుకదా? ఆ దెబ్బకే రక్తము కారుచున్న" దనగా విని, బ్రాహ్మణుడు భయపడి నా నేరము క్షమింపుము. దరిద్రముతో బాధపడుచున్నానని దీనముగా ప్రార్థించగా, నారాయణుడు "ఓయీ! నీ దీనావస్థకు జాలిపడియే దర్శనమిచ్చినాను. నీకు యేమి కావలయునో కోరుకొమ్మ" నెను. అది విని నీ పాదభక్తి నాకు ప్రసాదించుము, నన్ను రక్షించు మనగా "నీకు దివ్యభవనము సమస్తైశ్వర్యములు ప్రసాదించుచున్నాను. నన్నాశ్రయించిన వారిని నేనువదలను. శుభముగా నుండు" మని దీవించి యంతర్థానమొందెను. ఇది అశ్వత్థమాహాత్మ్యము కథ.

# శ్రీరామ నామమహిమ

మునులకోరికపై శ్రీరామ నామమహిమ గురించి చెప్పసాగెను. పూర్వము కురుక్షేత్రములో సత్యవసుడను వ్యాపారి యొకడుండెను. అతని భార్య జయంతి. సత్య వసునకు కాలమువచ్చి శరీరము విడిచి మరణించెను. జయంతి మంచి యౌవనములోనుండెను. సంతానములేదు. ఆమె పరపురుషుల జేరి, కామసుఖముల ననుభవించుచు, క్రమక్రమమున వ్యభిచారము వృత్తిగా పెట్టుకొని జీవించుచుండెను. ఒకనాడొక బోయవాడు రెండు చిలుకపిల్లలను విక్రయించుటకుగొని రాగా వాటిని కొని, యొకదానిచే 'రామా' యనియు యింకొక దానిచే 'కృష్ణా' యనియు రోజూ పల్కించుచు వాటితో రామకృష్ణనామములు తాను కూడ ననుచుండెను. ఇట్లు చాల కాలము గడిచిన పిదప నామెకు మృత్యువాసన్నమైనది. ఆమెను యమదూతలు బంధించి గొనిపోవుచుండ విష్ణుదూతలు వచ్చి వారిని దండించి, "ఈమె రెండు చిలుకపిల్లలను కొని వాటిచే "రామా కృష్ణా" యని యనిపించుచు తాననుచు చిరకాల మీశ్వరసేవ చేసినది. రామాయని నోరార నొకసారి యన్ననే పాపములు పోవునప్పుడు ప్రతినిత్యము తానని, వాటిచేత పల్కించుచుండి యీామె అనంత పుణ్యాత్మురాలైనది. శ్రీహరి యాన ననుసరింప వైకుంఠమునకు గొనిపోదు"మని గొనిపోయిరి. కావున సర్వపాపములు రామనామోచ్చారణతో నశించును.

## హరిశర్మ - ఆర్తత్రాణపరాయణి - విశాలాక్షుల - కథ

సత్యయుగంలో హస్తినాపురంలో హరిశర్మ అనే విప్రు డుండేవాడు. అతడు భాగ్యవంతుడు అయివుండి కూడా – పరమలోభియై తాను సరిగా తినక – భార్యాబిడ్డలకు తృప్తిగా భోజనాదులైనా యేర్పాటు చేయక

పీడించేవాడు. అంతటి పరమలోభికూడా పూర్వపుణ్యవశాన – ఆ జన్మలో విష్ణు భక్తుడయ్యాడు. అందువల్ల శ్రీమన్నారాయణుని విగ్రహము పూజిస్తూ ఉండేవాడు. అంతే తప్ప – దైవానికి నివేదన నిమిత్తం కూడా – యేనాడూ భక్ష్యభోజ్యలేహ్యాదులను నిర్లోభంగా చేయించి నైవేద్యము పెట్టిన పాపానపోలేదు.

అదే కాలంలో, అదే నగరంలో ఆర్తత్రాణపరాయణి – అనే ఒక వ్యభిచారిణి వుండేడిది. నిత్యం విటులతో సంగమిస్తూ అహోరాత్రుల భేదం లేకుండా – యిచ్ఛా కామోపభోగా లనుభవిస్తూండేది. వేశ్యా వృత్తిలోనే ఆమె అఖండమైన ఆస్తి పాస్తులను ఆర్జించినది. కాలాంతరాన – యౌవనం సడలి, వ్యభిచారవృత్తి కుంటుపడగా – ఆమె వైరాగ్యము పొందినదై పూర్వసంపాదిత ధనంతో బీదసాదలకు అన్నదానాదులు, బ్రాహ్మణాదులకు వాంఛా ఫలదానాలు చేస్తూ నగరంలో మంచి వ్యక్తిగా పేరుపొందింది.

హరిశర్మ, ఆర్తత్రాణపరాయణీ వుంటున్న రోజులలోనే ఆ హస్తినా పురంలో విశాలాక్షి అనే విధవ భర్త వియోగం సంప్రాప్తం కావడం వల్ల – దైహిక సుఖాలకై మనసు తీరక – జార పురుషులతో సంగమించి కామోపభోగము, లనుభవిస్తు తన్మూలంగా దినచర్య సాగిస్తూండేది. ఆ విశాలాక్షి – ప్రతి సంవత్సరంలోను – దాహాతురులకు మంచినీరు ఇస్తూండేందుకు – చలివేందిరను పెట్టి నడిపేది.

కాలాంతరాన – ఆ విప్ర, వితంతు, వ్యభిచారిణులు ముగ్గురూ దేహాంతం చేశారు. యమదూతలు ఆ ముగ్గురను తీసుకొని వెళ్ళి యముని ముందు నిలిపారు. యముని అనుజ్ఞపై చిత్రగుప్తుడు వారి వారి పాపపుణ్యాలపట్టిక పరిశీలించి – "హేసూర్యనందనా! వీరు ముగ్గురూ అత్యంతమూ పుణ్యాత్ములు. ఆ విప్రుడు విష్ణుభక్తుడు, వేశ్యఅన్నదాత, జారిణి

అయిన యీ వితంతువు – దాహార్థులకు మంచినీళ్ళను దానంచేసిన జలదాయిని అని చెప్పగా – యమధర్మరాజు వారు ముగ్గురినీ వైకుంఠానికి పంపించేశాడు.

కాని, విప్రుడైన హరిశర్మకు వైకుంఠంలో అన్ని భోగాలువున్నా – ఆహారం మాత్రం లేదు. అతడాకలికి తాళ లేక విష్ణువుకు మొర పెట్టుకున్నాడు. విష్ణువు నవ్వుతూ ఈతనిని బ్రహ్మకడకు పంపాడు. పద్మాసనుడైన బ్రహ్మ నవ్వుతూ బ్రాహ్మణ శ్రేష్ఠుడా! ఆ వ్యభిచారిణి – గొప్పగొప్ప అన్నదానాలు, సువర్ణదానాలు చేసినది. బాలవితంతువైన జారిణి – మండుటెండలో దాహార్థులకు ఉదకము దానమిచ్చినది. అన్నోదక దానాలను మించిన దానంలేదు. అందునా – అన్నం వుదకమందే వుంటుంది. గాబట్టి జలదానం యెంతో గొప్పది. మరి అట్టి దానమేదైనా నీవు చేశావా!" అని అడిగాడు. "లేదు కాని – విష్ణువునే నేను నమ్మాను అయన్నే బూజించాను." అన్నాడు హరిశర్మ "నిజమే కాని ఆదైవానికి కూడా నీవేనాడై నైవేద్యరూపంగా పిడికెడన్నం పెట్టి ఎరుగవు కదా! విప్రా! అక్కడ నీవు పెట్టిందే! ఇక్కడ నీకు పుడుతుంది కాని భూలోకాన ఏమాత్రం దానధర్మాలు చేయని నీకు ఈ లోకంలో ఆహారం ఎలా లభింస్తుంది?" అని అడిగాడు బ్రహ్మ. "మరి నాగతి యేమిటి?" అని హరిశర్మ ఆతురపడుచు ప్రశ్నింపగా బ్రహ్మప్రసన్నుడై హరిశర్మా! నువ్వు నేటి రాత్రి నీ బిడ్డల స్వప్నంలో కనపడి నీ దీనావస్థను చెప్పుకో! రోజున కొక్క బ్రాహ్మణునికైనా అన్నదానం చేయుమని చెప్పు. అక్కడ నీపుత్రులచే చేయబడిన అన్నదానం నీ కిక్కడ లభిస్తుంది. ఇంతకుమించి నీకాకలి తీరేదారిలేదు." అని చెప్పాడు. అనంతరం బ్రాహ్మణ మాహాత్మ్యని పూర్వకమైన భద్రాత్ముని కథను చెప్పాడు.

## పద్మపురాణం సమాప్తం

# 3. విష్ణు పురాణము

అష్టాదశ మహాపురాణాల్లో మూడవది విష్ణు పురాణము. "శ్లో॥వైష్ణవం దక్షిణోబాహుః" అను వచనానుసారం శ్రీ మహా విష్ణువు యొక్క కుడి భుజంతో పోల్చబడింది. విష్ణు పురాణం "త్రయోవింశతి, సాహస్రం తత్ర్పమాణం విదుర్బుధాః" ఇందులో 23 వేల శ్లోకాలున్నవని అర్థం. దీనిలో నూట యిరువది ఆరు అధ్యాయాలున్నవి. ఆరు అంశాలుగను ఇది విభజింపబడింది.

ప్రకృతి – పురుషుడు మొదలైన ఇరువది నాల్గు తత్త్వాలు, జగదుత్పత్తి, కాలస్వరూపం, వరాహావతారం, హిరణాక్షవధ, నగరం – గ్రామము మొ। పేర్లతో భూమి విభజన సనకసనందాదుల పుట్టుక, స్వాయంభు మనువు పుట్టుక, దక్ష ప్రజాపతి పుత్రికల వివాహము, లక్ష్మీనారాయణుల సర్వత్ర వ్యాప్తి, దుర్వాసముని ఇంద్రుని శపించడం, ధ్రువుని వృత్తాంతం, నృసింహావతార వర్ణన, భక్త ప్రహ్లాద చరిత్ర, భరత వంశ చరిత్ర వర్ణన, సప్తలోకాలు నరక లోకంలో పాపాల ననుభవించే తీరు, గంగా ఉత్పత్తి – భూమికవతరణం, నవగ్రహ సంచార విధానం, జడభరతుని వృత్తాంతం, బ్రహ్మజ్ఞాన ప్రాశస్త్యం, వేదవ్యాసుడు వేదాలను విభజించడం, పురాణాల లక్షణాలు, విష్ణు ఆరాధన – తత్ఫలితాలు, బ్రహ్మ చర్యము మొ॥ ఆశ్రమాల వర్ణన నిత్యనైమిత్తిక కామ్య కార్యకలాపాలు, గృహస్థ ధర్మాలు, దేవాసుర సంగ్రామము, సగర వంశవర్ణన, యయాతి చరితం, అతి విస్తారంగా శ్రీ కృష్ణావతార వర్ణన, కలిపురుషుని వర్ణన, లక్షణాలు, భగవత్సంకీర్తనా మహాత్మ్యం మొ॥ విషయాలెన్నో ఈ విష్ణు పురాణంలో మనకు దర్శనమిస్తాయి.

వైష్ణవ సిద్ధాంతాలకు మూలాధారమీ పురాణం,. అందుకే వైష్ణవులు మహాభారతంలో శ్రీమద్భగవద్గీతను, ధర్మశాస్త్రంలో మను స్మృతిని వేదాల్లో పురుష సూక్తాన్ని, పురాణాల్లో విష్ణు పురాణాన్ని ఎంతో ఆరాధిస్తారు.

"శ్లో॥ భారతే భగవద్గీతా, ధర్మశాస్త్రేషు మానవా!

వేదేషు పౌరుషసూక్తం, పురాణేషు చవైష్ణవం!!"

అనే పై శ్లోకం,పై భావాన్ని స్పష్టం చేస్తోంది ఈ కారణంగానే శ్రీరామానుజాచార్యులు శ్రీ భాష్యంలోని శ్లోకాలను పెక్కు చోట్ల ప్రమాణంగానుదాహరించారు. ద్వైత మతానుకూలంగా ఈ పురాణంలోని శ్లోకాలను శ్రీమధ్వాచార్యులు చూపెట్టారు.

శ్రవణం, కీర్తన, స్మరణ, పాదసేవ, అర్చన, వందనం, దాస్యం, సఖ్యం, ఆత్మ నివేదన మను రీతిని నవ (తొమ్మిది) విధభక్తి విశేషాల గురించిన వర్ణన విపులంగా విష్ణు పురాణంలో ఉన్నది. భక్తిని గూర్చి ఇంత వివరంగా తదితర పురాణాల్లో లేదంటే అతిశయోక్తిగాదు.

విష్ణు పురాణంలోని ఒక ప్రధాన ఘట్టం గూర్చి ఇక్కడ ప్రస్తావిస్తా ఛాందస వాదులు శివ–కేశవులను భేదవాదములతో వేరుగ చూస్తారు. కాని తమ ఇద్దరి మధ్య ఏవిధమైన భేదము లేదని సాక్షాత్తు శ్రీకృష్ణుడే సదా శివునితో ఇలా అన్నాడు.

"శ్లో॥ యో హంసత్వం జగచ్ఛేదం సదేవాసురమానుషమ్!

మత్తోనాన్యదశేషం యతత్త్వం విజ్ఞాతు మర్హసి!!

శ్లో॥ అవిద్యా వ్యామోహితాత్మానః పురుషాభిన్నదర్శనః!

వదంతి భేదం పశ్యన్తి చావయోవర్తనంహర!!"

"ఓ పరమేశ్వరా! ఈ ప్రపంచంలో దేవతలుగాని, అసురులు గాని, మానవులుగాని మన కంటే వేరుగారు. మన యిద్దరి మధ్య యేవిధమైన భేదం లేదు. కాని, అజ్ఞానవశంతో కొందరు మనల్ని భేద దృష్టితో చూస్తున్నా"రని భావము.

కలి ధర్మాల వర్ణన ఈ విష్ణు పురాణంలో ఇలా వుంది. వేదోక్త ధర్మం విషయంలో ఆ మానవులకు ప్రవృత్తి కల్గదు. వర్ణ ధర్మాలు, ఆశ్రమ ధర్మాలు, నశించును. దాంపత్యధర్మాలు, భార్యాభర్తల బంధం గురుశిష్య సంబంధం మొదలైనవి ధృఢంగా నుండవు. వివాహ విషయంలో విద్యకు కాక ధనానికే ప్రాధాన్యముంటుంది. పురుషులు ధనమధాంధులై యుందురు. స్త్రీలు రూపమదాంధులవుతారు. సువర్ణ-మణి రత్నాదులు లేని కారణంగా కేశాలంకారానికే ప్రాధాన్యమిస్తారు. ధనంలేని భర్తలను భార్యలు వదలివేస్తారు. ధార్మిక కార్యాలకుగాక గృహారామనిర్మాణాదులకే ధనం వెచ్చిస్తారు. ప్రజలు తెలివి తేటలను ఆత్మ జ్ఞానార్థం గాక కేవలం ధనార్జనకే ఉపయోగిస్తారు. మైత్రికి విలువలుండవు. విద్వాంసులు అవమానాల పాలవుతారు. పాలిచ్చే గోవులైతేనే పోషిస్తారు కాని పాలివ్వని గోవుల వధ్యశాలకు పంపిస్తారు. అనావృష్టి, ఆకలి బాధలుగల్గి ప్రజలు ఆకాశం కేసి చూస్తుంటారు. ఆకలి చావులు తప్పవు. పూజలు సరే! కనీసం స్నానాలు కూడ చేయక భుజిస్తుంటారు. శ్రాద్ధకర్మలు చేయరు. స్త్రీ లస్తమానం రెండు చేతుల్లో తలల్ని గోక్కుంటారు. భర్తల మాటలను ఏమాత్రం లక్ష్య పెట్టరు. పరుషంగా మాట్లాడం అబద్ధాలాడటం, సర్వసాధారణమౌతుంది. ప్రభువులు ప్రజా రక్షణను పట్టించుకోక, ప్రజలు బ్రతుకు దెరువు కోసం విదేశాలకు వలస పోతారు. అధర్మం సర్వత్రా బాగా వ్యాపిస్తుంది. తద్వారా ప్రజలు అల్పాయుష్కులౌతారు. మిడిమిడి జ్ఞానం తోను చెడు స్వభావాలతోను మూర్ఖులు మిడిమిడి, పడుతుంటారు. సత్పురుషులకు అవమానాలెక్కువైన

కొలదీ, కలిధర్మాలు తీవ్ర మవుతాయి. సర్వజగద్రక్షకుడైన శ్రీ మహా విష్ణువును పూజింపక క్షుద్రోపాసనలకు ప్రాధాన్యమిస్తారు. దేవతలు వేదాలు వట్టి బూటకాలనే విమర్శిస్తుంటారు. ధన ధాన్యాలు పాడి పంటలు అంతంత మాత్రాంగానే ఉంటాయి. పురుషులు తమతమ అత్తమామలను గౌరవిస్తారే గానీ కన్నతల్లీదండ్రులను పట్టించుకోరు. మనసా, వాచా, కాయా, త్రికరణ శుద్ధిలేక నిత్యం ఏదోయొక పాప కార్యం చేస్తుంటారు. అన్ని అవలక్షణాలున్నా కలియుగంలో కేవలం హరినామ సంకీర్తనం చేతనే తరింపవచ్చును.

శ్లో॥ నామ స్మరణాదన్యోపాయం నహి పశ్యామోభవతరణే!

రామ హరే, కృష్ణ హరే తవ నామ వదామి సదాన్నహరే!!

అన్నట్లు (కేవలం) కృతయుగంలో ఘోరతపస్సు చేస్తేగానీ, పొందలేని పుణ్యరాశిని కేవలం శ్రీహరి నామ సంకీర్తన మొదలైన శ్రవణ, మననాది నామస్మరణచే అల్ప ప్రయత్నాలతో సాధింపగలరు. కలిమానవులు, ఇది కలియుగ ధర్మాల్లో ఒక విశేషం. సౌలభ్యం అనవచ్చును.

శ్లో॥ తత్రా త్రేనైవ యత్నేన, పుణ్యస్కంధమనుత్తమమ్!

కరోతియః కృతయుగే; క్రియతే తపసాహిసః!!

అనే పైభావాన్ని తెలియజేస్తున్నది. ఇలాంటి అత్యద్భుతమైన విషయాలెన్నో శ్రీ విష్ణు పురాణంలో మనకు సాక్షాత్కరిస్తాయి.

# జడభరతుని వృత్తాంతము

మన సమాజంలో ఎవడైన అల్ప (మంద) బుద్ధితో ఉంటే, అట్లాంటి వానిని జడభరతుడు అంటుంటారు. అసలీ జడభరతుడెవరు? అతని పూర్తి వృత్తాంతమేమి? అనే సందేహం తొలగిపోవాలంటే, జడభరతుని గూర్చి విష్ణుపురాణంలోని కథనుండి తెలిసికోవాలి. భరతుడు ఋషభ మహారాజు

కుమారుడు. ఇతని తల్లి జయంతి భార్య పంచజని, బహుకాలం రాజ్యపాలన చేశాక, వార్ధక్యంలో తన రాజ్యాన్ని కుమారులకప్పజెప్పి తపోవనానికి వెళ్ళాడు భరతుడు. అతడు నివసించిన తపోవనం పేరు సాలగ్రామం. ఒక దినం నదికేగి స్నానం చేస్తుండే సమయంలోగర్భిణియైన ఒక జింక నీరు త్రాగవచ్చాది. ఇంతలో సింహ గర్జన వినిపించింది. ఆ జింకనీరు త్రాగక భయంతో బాగా బెదిరింది. ఆదృశ్యాన్ని భరతుడు జాలితో చూశాడు. మనసు కరిగింది. కరుణ ఉప్పొంగింది. జింకకు భయంతో గర్భంలోని బిడ్డ బయట పడింది. ఆ పుట్టిన జింక పిల్లను భరతడు తన తపోకుటీరానికి తీసికొని పోయాడు. భరతుడు సంసార బంధాలన్నీ తెంచుకొని నిరీహుడై తపోవృత్తిబూని అడవికి వచ్చాడు. కానీ, అనాలోచితంగా, అనుకోకుండ తటస్థ పడిన ఈ జింక పిల్లతోటి బంధం మాత్రం నానాటికి బలపడ సాగింది. చివరికా జింకనే స్మరిస్తూ తనువు చాలించాడు. భరతుడీ కారణంగా స్పృహగల్గి, ఆ జ్ఞాపకాలు పూర్తిగా వెన్నంటియున్నాయి. అతడు జింకగా మరల జన్మించాడు.

ఆ తర్వాత జింక జన్మ ముగిసింది. ఆ మరుసటి జన్మలో ఆంగీరసుడనే మునికి కుమారుడై పుట్టాడు. ఒక చోట సుస్థిరంగా నివాసముండక జడునివలె (పిచ్చివానివలె) అన్నిచోట్ల తిరుగుచుండెను. ఈ కారణంగా అందరతన్ని జడభరతుడని పిలిచేవారు. ఒకనాడు కొంతమంది రాజభటులు కాళికాదేవికి తన్ను బలి యిచ్చేటందుకు తీసికొని వెళ్ళారు. అయితే కాళికాదేవి జడభరతుని పరిస్థితకి కరుణామయిమై ప్రత్యక్షమైంది. రాజాను భటుల్ని సంహరించింది. దయాదృష్టితో భరతున్ని వదిలింది. ఇతడు ఇంత జరిగినా నిలకడగ నుండక దేశ సంచారం చేస్తుండేవాడు.

ఇలాగుండగా, ఒక రోజు రహోగణుడనే రాజు వేదాంతాధ్యయనం

కోసం కపిల ముని దగ్గరికి వెళ్ళుతున్నాడు. ఆరాజుగారి పల్లకిని మోస్తున్నట్టి బోయలకసటైంది. ఈ భరతున్ని పిలిచి, పల్లకి మోయమన్నాడు. భరతునికి అలవాటు లేని కారణంగా ఆ పల్లకిమోసే పనిచేత గాలేదు. పల్లకిని కదిలిస్తూ వెనుకబడుచుండెను. అప్పుడు రాజాతని తిట్టాడు. ఏ మాత్రం దూషణలకు విచారింపక, మళ్ళీ తంటాలు పడుతూ భరతుడు పల్లకిమోస్తున్నాడు. ఎత్తుపల్లాల్లో పల్లకి ఊగసాగింది. రాజుగారికి బాగా కోపం వచ్చి భరతున్ని చెడా పెడా తిట్టాడు. అపుడు భరతుడు రాజుతో "మహారాజా! దూషణ భూషణాలు శరీరానికే చెందుతాయి గానీ, ఆత్మకు అంటవు." అన్నాడు. అతని వేదాంత వాక్కులవిని రహోగణ మహారాజాశ్చర్యపడి పల్లకి దిగాడు. అతడే తన గురువని భరతునికి ప్రణామం చేసి, అతని దగ్గర వేదాంత శ్రవణం చేశాడు.

ఈ విధంగా మూడవ జన్మలో జడభరతుడిట్లు మోక్షం పొందాడు. ఇదీ జడభరతుని దివ్య జీవన వృత్తాంతం. ఇలాంటి అమూల్య వృత్తాంతాలెన్నో శ్రీ మహా విష్ణుపురాణంలో ఉన్నవి.

వామన పురాణం వినిఒడలుపులకరించి పోగా – శౌనకాదులందరూ సూతుణ్ణి చూసి – "మహాభాగా! మాకు విష్ణు దేవుడి పురాణం వినిపించు" – అని అడిగారు.

"వినదగ్గపురాణం" అంటూ మొదలు పెట్టాడు సూతర్షి విష్ణుపురాణాన్ని పులస్త్యుడి అనుగ్రహంవల్ల, వశిష్ఠ మహర్షి నుండి పరాశరులవారు నేర్చుకున్నారు. ఆ పరాశరుల వద్ద ఆ పురాణాన్ని యిదే నైమిశారణ్యంలో మైత్రేయుడు విన్నాడు. అంటూ, మా గురువులైన వేదవ్యాసులవారు నాకు బోధించారు. పరాశరుడిమాటల్లోనే వినిపిస్తా" నన్నాడు సూతుడు.

ఔనౌను! పరాశరులవారు బహుపురాణ వేత్తగావిన్నాం వారి గురించి కూడా చెప్పండి అని కోరారు శౌనకాదులు.

సూతుడు నవ్వాడు – తప్పక చెబుతాను. ఎందుకంటే మా గురువుగారైన వ్యాసులవారి తండ్రే పరాశరుడు. ఆ మహాపురాణవేత్తనుంచి ఆవిర్భవించారు గనుకనే మా గురు దేవులు అంత గొప్ప వ్యాసమూర్తి కాగలిగారు. ముందుగా పరాశరుల గురించి వినండి అంటూ – గురుస్మరణ చేసుకొని సూతుడు చెప్పనారంభించాడు.

# పరాశరుడు

ఒకానొకప్పుడు వశిష్ఠ విశ్వామిత్రుల మధ్య యేర్పడిన కలహం కారణంగా, విశ్వామిత్రుడు – రాక్షసుల సహాయంతో వశిష్టుకుమారులు వందమందిని చంపేశాడు. ఆ వందమంది లోనూ జేష్టుడు శక్తి. అతని భార్య దృశ్యంతి. శక్తి వదింప బడే నాటికి దృశ్యంత గర్భవతి. కొన్నాళ్ళకు ఆమె కొక కుమారుడు కలిగాడు. అతనికి పరాశరుడు అని పేరు పెట్టి, మునికుల సంప్రదాయం ప్రకారం విద్యాబుద్ధులు గరపాడు, పెంచి పెద్దను చేసింది దృశ్యంతి. పెద్దవాడైన పరాశరుడు. తన తండ్రియయిన శక్తినీ, పినతండ్రులు

తొంబైతొమ్మండు గురినీ విశ్వామిత్రప్రేరకులైన రాక్షసులు తుదముట్టించిన విషయం తెలుసుకాన్నడు. అందుకు ప్రతీకారంగా సర్వరాక్షస నాశన కరమైన సత్రయాగాన్ని ఆరంభించాడు. ఫలితంగా అనేకమంది రాక్షసులు ఆ యజ్ఞకుండలలోబడి దగ్ధమై పోసాగారు. జాతిలో వృద్ధుడు పులస్త్యుడు. తమ రాక్షస జాతి తరిగి పోవడం చూసి ఆయన హృదయం తరుక్కుపోయింది. వశిష్టున్ని శరణుకోరాడు. నిర్వికారుడైన వశిష్టుడు పులస్త్యుడితో – పరాశరుడి యాగభూమికి వచ్చాడు. మనుమడికి నచ్చ చెప్పి అతి రాక్షసంగాజరుగుతున్న రాక్షసమారణహోమాన్ని విరమింప చేశాడు. పరాశరుడు పగను విస్మరించి పరాన్ని స్మరించసాగాడు.

తమజాతిని – క్షమించి విడిచిన పరాశరుడిని పట్ల గౌరవంతో – "ఏంకావాలో కోరుకోమన్నాడు పులస్త్యుడు. పురాణ ప్రియుడు పరాశరుడు, సర్వపురాణాలన్నీ తెలియ జెప్పమన్నాడు "సమస్తమైన పురాణ జ్ఞానము నీకు సిద్ధించుగాక" అని వరమిచ్చి వెళ్ళి పోయాడు పులస్త్యముని.

పరాశరుడు తిరుగులేని పురాణ వేత్తగా ప్రసిద్ధిచెందాడు.

## పరాశరుడు మైత్రేయుడికి పురాణాలు చెప్పుట

పరమభక్తాగ్రగణ్యుడు, వేదోక్త కర్మానుష్ఠాన తత్పరుడు, వినయశీలి, జిజ్ఞాసుపు అయినమైత్రేయుడు అనే ఋషి యిదేనైమి శారణ్యంలో నివసిస్తూ వుండేవాడు.

ఒకనాడు పరాశరుడు నైమిశారణ్యానికి వచ్చాడు. మైత్రేయుడు, పరాశరుణ్ణి పూజించి, సర్వమర్యాదలూ చేసి వినయం ఉట్టిపడేలా ఆయన చెంత కూర్చుని – పురాణాలు వినిపించ వలసినదిగా కోరాడు. ఏది వినాలని వుందో చెప్పు మన్నాడు పరాశరుడు.

"విష్ణు పురాణం వినిపించండి" అన్నాడు మైత్రేయుడు.

అందులో యేకథ కావాలో కోరుకో మన్నాడు పరాశరుడు.

# లక్ష్మీ ఎవరు?

"లక్ష్మీ భృగుని కుమార్తె అని విని వున్నాను. కాని, లక్ష్మిసముద్రుడి కుమార్తె అని కూడా కొందరంటున్నారు. ఇంతకూ లక్ష్మి భృగుడి కూతురా! సముద్రుడి కూతురా! అసలు లక్ష్మి ఎవరు? అని అడిగాడు మైత్రేయుడు. పరాశరుడు నువ్వు విన్న రెండు విషయాలు యథార్థాలే. ఆమె భృగు పుత్రికగా అందరికీ తెలిసిన విషయమే. సముద్రుడికి యేవిధంగా కుమార్తె అవుతుందో చెబుతాను విను" అని చెప్పసాగాడు.

పూర్వం ఒకప్పుడు - ఐరావతం అనే యేనుగుమీద ఇంద్రుడు స్వర్గలోకంలో విహరిస్తున్నాడు. దేవతలు, మునులు అప్సరసలు, ఒకరేమిటి! పరివారమంతా అతని వెనకనే వుంది.

ఆసమయానికి దుర్వాసమహర్షి అక్కడకు వెళ్ళాడు. వైభవోపేతంగా ఊరేగుతున్న యింద్రుణ్ణి దీవించి - ఒక పారిజాతమాలను బహూకరించాడు. ఆ దండను దేవేంద్రుడు ధరించకుండా - తన యేనుగు కుంభస్థలం మీద అలంకరించాడు. పారిజాత పుష్పాలలోని మధువుకు భ్రమసి అనేకమైన తుమ్మెదలు వచ్చాయి. తుమ్మెదల ధ్వనికి- ఐరావతం కోపించి - తొండంతో తన కుంభస్థలం మీద నున్న దండను తీసి క్రింద పడవేసి త్రొక్కేసింది. తానెంతో అభిమానంతో ఇంద్రుడి కిచ్చిన దండ అలా యేనుగు కాలిక్రింద నలిగి పోవడంతో దుర్వాసుడు క్రుద్ధుడయ్యాడు. ఇచ్చిన బహుమానాన్ని యింద్రుడు నిర్లక్ష్యం చేయడంవల్లనే యిలాజరిగిందని తలపోసి "ఒరేమహేంద్రా! తెల్లయేనుగు నెక్కగానే కళ్ళు మూసుకుపోయి, వళ్ళుమరచి పోయి, బహుమానించిన వారినే అవమానిస్తావా? ఈ నీ గర్వానికి కారణమైన నీ పదవి పోతుంది. నీ సమస్త ఐశ్వర్యాలూ, భోగభాగ్యాలూ అన్నీ సముద్రంలో కలిసిపోతాయి" అని శపించి వెళ్ళిపోయాడు.

ఋషులశాపం ఊరికే పోదుకదా! ఇంద్రుడి సంపదలన్నీ సముద్రం పాలైపోసాగాయి. రాక్షసులు విజృంభించి స్వర్గం ఆక్రమించు కున్నారు. ఇంద్రుణ్ని తరిమేశారు.

## సాగర మథనం

ఇంద్రుడు తన గోడు బ్రహ్మకు మొరపెట్టుకున్నాడు. బ్రహ్మ-యింద్రుణ్ని కూడా తీసుకు వెళ్ళి – విష్ణువుకు విన్నవించాడు. సముద్రాన్ని మథించమన్నాడు శ్రీ మహావిష్ణువు.

మందరపర్వతం కవ్వంగా – వాసుకి అనే సర్పరాజు త్రాడుగా – దేవదానవులందరూ కలిసి సముద్రం మథించసాగారు. ముందుగా హాలాహలం అనే విషం పుట్టింది. దానికి భయపడ్డ సర్వులు పినాకిని ప్రార్థించారు, కరుణించిన పార్వతీపతి ఆ విషాన్ని కబళంగా మార్చి మ్రింగాడు. కంఠంలో నిలిపాడు. ఆనాటినుంచీ ఈశ్వరుడికి నీలకంఠుడు, శ్రీకంఠుడు అనే పేర్లువచ్చాయి. ఈ సారి విష్ణువు కూర్మమూర్తిగా అవతరించి – కొండను తన మూపున ధరించాడు. ఆ మథన తీవ్రతకి సముద్రపుటడుగున పడిపోయిన కామధేనువు, కల్పవృక్షం, ఐరావతాదులన్నీ పైకి రాసాగాయి. కాని, స్వర్గలక్ష్మి మాత్రం సాక్షాత్కరించలేదు. దిక్కుతోచని దేవేంద్రుడు పెద్దలమాట మీద లక్ష్మిని ప్రార్థించాడు.

## స్వర్గలక్ష్మీ పునరుద్ధవానికై ఇంద్రుడు చేసిన లక్ష్మీస్తోత్రం

"శ్లో॥ నమస్తేస్తు మహామాయే శ్రీ పీఠే సురసేవితే!
శంఖచక్ర గదాహస్తే మహాలక్ష్మీ నమోస్తు!!"

నమస్తే గరుఢారూఢే, డోలాసుర భయంకరీ!
సర్వపాపహరే దేవీ మహాలక్ష్మి! నమోస్తుతే!! 2

సర్వజ్ఞే సర్వవరదే సర్వదుష్ట భయంకరీ!
సర్వదుఃఖ హరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే!! 3

సిద్ధి బుద్ధి ప్రదే దేవి భుక్తి ముక్తి ప్రదాయిని!
మంత్రమూర్తే సదాదేవి మహాలక్ష్మి నమోస్తుతే!! 4

ఆద్యంత రహితే దేవీ ఆదిశక్తి మహేశ్వరీ!
యోగజ్ఞే యోగసంభూతే మహాలక్ష్మి నమోస్తుతే!! 5

స్థూలసూక్ష్మ మహారౌద్రే మహాశక్తి మహోదరే!
మహాపాపహరే దేవి మహాలక్ష్మి నమోస్తుతే!! 6

పద్మాసనస్థితే దేవి పరబ్రహ్మ స్వరూపిణీ!
పరమేశి జగన్మాత మహాలక్ష్మి నమోస్తుతే!! 7

శ్వేతాంబర ధరే దేవీ నానాలంకార భూషితే!
జగత్థితే జ్యన్మాత మహాలక్ష్మి నమోస్తుతే!!" 8

ఇంద్రుడు చేసిన ఆస్తోత్రానికి ఇందిరాదేవి ముగ్ధురాలైంది. పరమ కరుణామయి ఆ పరమేశ్వరి సర్వలోకాల్నీ పావనమూ, ప్రభావితముచేస్తూ – ఆ సముద్రం నుంచి పునరుద్భవించింది. ఆనాడు ఆవిధంగా సముద్రం నుంచి సాక్షాత్కరించడం వల్లనే – శ్రీమహాలక్ష్మి సాగరపుత్రికగా చెప్పబడుతోంది."

అని పరాశరులవారు వచించినది విని, మైత్రేయుడు ఆయనను ధ్రువుని గూర్చి చెప్పవలసిందిగా కోరాడు. పరాశరుడు చెప్పడం ప్రారంభించాడు.

# ధ్రువుని కథ

ఉత్తానపాదుడని ఒక రాజా వుండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు, ఇద్దరు కొడుకులూను. పెద్ద భార్య సునీతి కొడుకు ధృవుడు. రెండవయామె సురుచి కుమారుడు ఉత్తముడు. లోక సహజంగా రాజాకు రెండవ భార్య అంటేనే ప్రేమయెక్కువ.

ఓ రోజున సురచికొడుకైన ఉత్తముడు, తండ్రితొడ మీద కూర్చున్నాడు అది ధృవుడు చూశాడు. తనుకూడా తండ్రితొడమీద కూర్చోవాలని ఆశపడ్డాడు. వెళ్లి కూర్చున్నాడు. ఇది కాస్తా సురచి కంట బడింది. ఆమె యీర్ష్యాగ్రస్తయై ధృవున్ని – రాజా తొడమీదనుంచి క్రిందికి లాగేసింది. తండ్రి తొడమీద కూర్చునే అర్హత కావాలంటే – తన గర్భవాసాన జన్మించి ఉండాల్సిందనీ, సవతి అయిన సునీతి కడుపున పుట్టిన కారణంగా ధృవుడికి ఆ అదృష్టం లేదనీ నిందించింది.

ధృవుని మనస్సు చివుక్కుమంది. తన తల్లి దగ్గర చెప్పుకుని దుఃఖించాడు. సవతి వైరాగ్యానికి అలవాటు పడిపోయిన సునీతి, లాలనచూపి బిడ్డనిలాలించడం కోసం – "అందరికీ తండ్రి ఆ నారాయణుడే. కూర్చుంటే ఆయన తొడ మీద కూర్చోవాలి" అంటూ యేదేదో బోధించింది. పసివాడైన ధృవుడి హృదయంలో నారాయణుడు నెలకొన్నాడు. తల్లి యెంత వారించినా వినకుండా బయల్దేరాడు ధృవుడు.

మార్గమధ్యంలో సప్తఋషులు కలిశారు. ధృవుడిదీక్షా నిశ్చలతకి సంతోషించారు. అష్టాక్షరిని వుపదేశించి, ఆశీర్వదించి పంపించారు. ధృవుడు యమునాతీరం చేరాడు. దృఢ సంకల్పుడై శ్రీమన్నారాయణుడి గురించి తపస్సులో నిమగ్నమైపోయాడు. అతడి వయస్సు నైనా పట్టించుకోకుండా

ఆ దేవేంద్రుడు దాకా – ధృవుడి తపస్సుకి ఎన్నో ఆటంకాలు కలిగించడం, ఆ పసివాడు అన్నింటినీ అధిగమించి జితేంద్రియుడు కావడమూ జరిగింది. పరమదయామయుడు ఆ పద్మనాభుడు పసివాడి తపస్సుకి ఆనందించాడు. లక్ష్మీసమేతంగా గరుడవాహనారూఢుడై ధృవుడి ముందు ప్రత్యక్షమయ్యారు. లక్ష్మీనారాయణులిద్దరూ – "నాయనా! ఇంక నువ్వు తపస్సును ఆపి ఇంటికి వెళ్ళు. లౌకిక జగత్తులోని తల్లిదండ్రుల్ని నీ సేవలద్వారా తృప్తిపరచు, నువ్వు రాజావి అవుతావు. అరవైవేల సంవత్సరాలు రాజ్యంయేలుతావు, అనంతరం ఆకాశంలో ధృవనక్షత్రం అనే పేర లోకోన్నతస్థానంలో సుస్థిరుడవై అందరి మన్ననలనూ పొందుతావు. వెళ్ళిరా నాయనా! అని దీవించి" పునః నగరానికి పంపారు. అనంతరం అంతా విష్ణువు చెప్పినట్లే జరిగిందని వేరే చెప్పనక్కరలేదు కదా!

# వేనుడు - పృథుచక్రవర్తి

ఇలా ధృవుడి దివ్యచరిత్రము చెప్పినపిదప ఆ వంశమునకు మిగుల నపకీర్తిగావించిన వేనుడి చరిత్రము విన్నవించమని కోరగా సూతమునీంద్రుడిలా చెప్పసాగాడు. అంగదేశాధిపు డశ్వమేధము చేయసాగెను. హవిర్భావములు గొనుటకు మంత్రయుక్తముగా దేవతలను బిలిచిరి. వారిలో నొక్కరునూ రాకుండిరి. కారణమేమని, యాయజ్ఞముచే యించువారలనడుగగా "మీ రాజా సంతాన హీనుడు. సంతానహీనుని వలన మేము హవిర్భాగములు గొనమనిరి." తరువాత పండితులు రాజాను పుత్రకామేష్టిచేయుమని ప్రోత్సహించిరి. "దానితో నీకు సంతానము గల్గును. దేవతలకు హవిర్భాగములందీయగల" వని వారు చెప్పగావిని యంగ రాజా పుత్రకామేష్టి చేయసాగెను. యజ్ఞపురుషుడు సంతోషించి సువర్ణ పాత్రతో పాయసమందించెను. రాజా పాత్ర నందుకొని భార్యకీయగా నామెగర్భము,

ధరించి పుత్రునికనెను. ఆ పుత్రునకు వేనుడని పేరు పెట్టిరి. వాడుపుట్టిన నక్షత్రబలము గాబోలు, పుట్టిన నాటినుండి దుర్మార్గముగానే ప్రవర్తించు చుండెను. ధనుర్బాణములతో వేటకుపోయి, సాధుజంతువులను సైతము చంపుచు, క్రూరముగా వర్తించసాగెను. వీనికా క్రూర గుణముండుటకు కారణమేమని పెద్దలను విచారించగా మాతామహుడు మృత్యుదేవతను బోలి యుండువాడనియు నాకారణమున తాతగారి పోలికవచ్చి వీడు దుర్మార్గుడయ్యెననియు చెప్పిరి. అంగరాజు శక్తికొలది వానిని శిక్షించి దుర్మార్గమునుండి తప్పింపజూచెను. కాని ప్రయోజనము లేకపోయెను. చివరకువిసిగి యంగ రాజు వాని దుశ్చర్యలు సహించలేక నర్ధరాత్రమున రాజ్యం విడిచి యరణ్యములకుపోయెను. రాజుపోవుటచె రాచి రాజ్యమరాజకమగునని తలచి వేనుని రాజుగాచేసి సింహాసన మెక్కించిరి. అతడు దుష్టబుద్ధివదలక ప్రజలను బాధించసాగెను.

మహనీయులగువారు వానికి బుద్ధులుచెప్పి మందలించజూచిరి. కాని ప్రయోజనము లేకపోయెను. వారు కోపము జెంది తమ మంత్రబలము ప్రయోగించి వేనుని హతునిగావించిరి. వేనుడు చనిపోయినను వాని తల్లి ఆ శరీరమును జాగ్రత్త పరచి కాపాడుచు పుత్రశోకముతో కృశించసాగెను. రాజులేకపోవుటచే, వేనుని శరీరము తొడలు మోదగా అందుండి యొక కుమారుడు జన్మించెను. వాడు కళలేకుండా నుండుట చూచి వానికి నిషాదుడను పేరు పెట్టిరి. వాడూ, వాడివంశము వారూ పర్వతములు గుట్టలు, యడవులలో తిరుగు జాతిగా నిర్ణయింపబడి యుండుండసాగిరి. తరువాత వేనుని చేతులు మధించగా మహావీరుడగు కుమారుడు, లక్ష్మియంశము గల కుమార్తె జన్మించిరి. పిల్లవానికి పృథువని, కుమార్తెకు అర్చియని నామములుంచిరి. వారిద్దరూ దంపతులైరి. వారికి లక్ష్మీనారాయణుల

లక్షణములుండుటచే దేవతలందరూ పరమానందముగా పుష్పవర్షము గురిపించి దివ్యగానములు చేసిరి. దేవతాముఖ్యులు పృథువునకు ఛత్రము, చామరము యితరమగు రాజలాంఛనములు బహూకరించిరి. ఆ సమయములో హోమ గుండమునుండి వందిమాగధులు జన్మించి రాజును పొగడసాగిరి. పృథుని తండ్రి వేనుడు దుర్మార్గముగా నుండుట. దేవగణములు ప్రజలు బాధపడిన కారణమున దేవతలు వర్షము కురిపింపలేదు. ప్రపంచమంత కరువుకాటకము తాండవించి క్షోభ పెట్టసాగెను. అందుచే పృథువు పెక్కు యాగములు చేసెను. తొంబదితొమ్మిది యాగములు చేసి నూరవ యాగము చేయంబూనగా, యింద్రుడా యాగాశ్వము నపహరించుకొని పోయెను. పృథువు విచారించు చుండ బ్రహ్మదేవుడు ప్రత్యక్షమై "చక్రవర్తీ! నీవు చేసిన యాగముల ఫలితముతో భూమియంతయు నోషధీయుమయ్యెను. నీవు భూమిలోని యోషధులు పిదికినావను పేరు నిలబడింది. నీకు యజ్ఞము మిగిలిపోయినదను విచారమక్కరలేదు. నీవు శ్రీహరి యంశములో జన్మించావు. నీకు మోక్షము గల్గును. ఇంద్రపదవితో పనిలేదని చెప్పెను.

కొన్నాళ్ళు కాతడు మహాయోగమవలంభించి శ్రీహరిని ధ్యానించుచు, శరీరము వదలి నారాయణునిలో లీనమయ్యాడు.

# మారీషా - ప్రాచేతసులు

పృథువు కొడుకు బర్హి. బర్హికి పదిమంది కొడుకులు కలిగారు. వారినే ప్రచేతసులంటారు. వారందర్నీ తపస్సు చేసి బ్రహ్మత్వం పొందవలసిందిగా ఆదేశించారు బర్హి. తండ్రి మాటను తలదాల్చి తపస్సుకు బయల్దేరారు ప్రచేతసులు.

వేలాది సంవత్సరాలపాటు సాగిన వారి తపోఫలితంగా - శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమయ్యాడు. తాము ప్రజా పతులవ్వాలని కోరారు ప్రాచేతసులు. అలా జరగదనీ, ప్రచేతసుల కుమారుడు మాత్రం ప్రజాపతి అవుతాడనీ వరం యిచ్చి అంతర్థానుడయ్యాడు అనంతుడు. ప్రాచేతసులు తిరుగుముఖం పట్టి రాజ్యం చేరారు. సుదీర్ఘ కాలంపాటు రాజులేని రాజ్యం కావడం వల్ల ప్రజలంతా వలసలు పోయారు. నగరాలన్నీ అడవుల్లా తయారయ్యాయి. ప్రచేతసులు తపోశక్తితో ప్రభంజనాన్ని సృష్టించి - అడవుల్ని నాశనం చేయసాగారు. కల్లోలాన్ని చూసి మారీషతో సహా వారి ముందు సాక్షాత్కరించాడు చంద్రుడు. ప్రచేతసులారా! శాంతించండి. పునరుద్ధరించుకోవడానికి యిలా అడవుల్ని నిర్మూలించడం తప్పుకాదు కానీ, వృక్షసంతతి నశించడం వల్ల, జీవచైతన్యం నశించే ప్రమాదాలు వున్నాయి. పూర్వం కంధుడనే ముని వుండేవాడు. అతని తపస్సు చెరచడానికని, అమరేంద్రుడు ప్రమోచన అనే అప్సరను నియోగించాడు. ఆ అప్సర అందానికి చలించి, కంధుడు కామాంధుడై తపస్సు మానివేశాడు. ఆ తాపసి తన తప్పు తెలుసుకొని తిరిగి తపస్సులోకి వేళ్ళేటప్పటికి ప్రమోద గర్భవతిగా వుంది కంధుడామెను నిందించాడు. తక్షణం తన ముందునుంచి వెళ్లిపొమ్మన్నాడు.

ఆ మహాముని శపిస్తాడేమోనని భయపడుతునే నింగికె గిరింది ప్రమోదన. ఆ కంగారులో - గర్భవతియైన ఆ అప్సర నుండి లేత పిండం స్రవించి - ఒక వృక్షాగ్రంపై పడింది. వృక్షాలు ఆ పిండాల్ని సంరక్షించాయి, ఓషధీకరణాలైన నా కిరణాలు ఆమెకు ప్రాణప్రతిష్ట చేశాయి. అప్సర యొక్క అందాలశోణితం ఋషీని యోగ వీర్యం - సంయోగించి పుట్టిన ఆమెయే - ఇప్పుడు నా చెంత వున్న యీ బాలమణి మారీష, లోకహానికరమైన మీ క్రోధాన్ని మాని - యీ మారీషను స్వీకరించండి. మీ మనోవాంఛ, మాధవుని వరం అయిన - ప్రజాపతి మీకు ఈమె ద్వారానే పుడతాడు అన్నాడు శశాంకుడు.

మారీష అందచందాలకు ముగ్ధులైపోయారు ప్రాచేతసులు కాని, వారికొక ధర్మ సందేహం పీడించసాగింది. అందువల్ల వారు – చంద్రున్ని చూసి "ప్రభూ! మీరు చెప్పింది బాగానే వున్నది. కానీ, ఈ యిందు ముఖి ఒక్కతెనూ పదిమందిమైన మేము ఎలా వరించేది? ఇది ధర్మ బాహ్యం కాదా!" అని అడిగారు.

కాదు ఏమాత్రమూ ధర్మ బాహ్యం కాదు – అంటూ ప్రాచేతసుల ప్రశ్నకు చంద్రుడిలా జవాబు చెప్పసాగాడు.

# మారీష పూర్వజన్మ

ఈ మారీష పూర్వ జన్మలో ఒక బ్రాహ్మణ కన్య. పెండ్లి చేసిన స్వల్ప కాలానికే భర్త స్పర్శ నెరుగకుండానే ఆమె భర్తకాలం చేశాడు. బాలవితంతువైన యీమె – వాంఛను అణచుకోలేక, అధర్మంలో అడుగు పెట్టలేక, అందరికీ దిక్కైన ఆ ఆదినారాయణుని సేవలలో లగ్నమైపోయింది. కొన్నాళ్లకు శ్రీహరి యీమెకు దర్శనమిచ్చి – "ఏంకావాలో కోరుకోమన్నాడు. అందుకీమె – ఎడతెగని కామంతో సుడి తిరిగి పోతున్నాను నా కామేచ్ఛ తీర్చు – అంటూ పదిసార్లు మొర పెట్టింది. ఈ పదిసార్లుకూడా విష్ణువు తథాస్తు అన్నాడు. "ఈ జన్మకి సాధ్యంకాని ఆ కోరిక – తదుపరి జన్మలో అంటే యీ జన్మలో పదిమంది భర్తల ద్వారా తీరుతందని " ఆదేశించాడు. "విష్ణు భక్తులైన మీరు విశ్శంకగా యీ కన్యని స్వీకరించండి. ఈ హరి మీకిచ్చిన వరం ప్రకారం ప్రజాపతి కాగలిగిన బిడ్డ యీమెయందు కలిగి తీరుతాడు." చంద్రుడు చెప్పిన సమాధానికికి సంతృప్తి చెందిన ప్రాచేతసులు – మారీషను పరిణయమాడి సమస్త భోగాలననుభవించారు, ఆ మారీషా – ప్రాచేతస

దశకము దాంపత్య ఫలంగా అవతరించాడు దక్షప్రజాపతి. నిత్యం భూత సృష్టి మార్గాన్వేషకుడైన దక్షుడు, స్త్రీ పురుష సంపర్క మొక్కటే దారిగా తోచినవాడై – వరుణ పుత్రికమైన 'సిక్కి' అనే ఆమెను పెండ్లాడాడు. ఆమె యందు అయిదుగురు పుత్రులను కని వారిని భూతసృష్టి చేయవలసినదిగా ఆజ్ఞాపించాడు. వారాపనిలో నిమగ్నులయ్యే వేళకి, నారదుడు తారసిల్లి ఆపనిని ఆపించి మోక్షమార్గాన్ని ముపదేశించి చక్కాబోయాడు. దక్షుడు యీసారివైతరిణి అనే ఆమె యందు శబళాశ్వులనే అయిదుగురు కుమారుల్ని కని వారిని ప్రజాపతులుకమ్మన్నాడు. కాని, వారు కూడా నారదుడి మాటల్లోపడి పోయి తండ్రి మాటను కాదని – తపోభూములకు వెళ్ళిపోయారు.

ఇక యిలా లాభం లేదనుకున్న దక్షుడు, ఈసారి వైతరణి యందు అరవై మంది ఆడపిల్లలను కన్నాడు. వారిలో పది మందిని ధర్ముడికి, పదముగ్గురిని కశ్యప ప్రజాపతికి, చంద్రుడికి ఇరవయ్యేడు గురిని, అరిష్టనేమికి నలుగుర్ని అంగీరస, కృతాశ్వ బహుపుత్రులు ముగ్గురికి తలోయిద్దరూ చొప్పున అరుగురు కూతుర్లనూ యిచ్చి వివాహాలు చేశాడు. దక్షుడి కోరిక మేరకు వారందరూ సంతానవతులయ్యారు. మనం చెప్పుకునే యీ దేవ దానవ మానవ గణాలన్నీ వారి సంతానమే. ముఖ్యంగా కశ్యపుడి భార్యల్లో ప్రసిద్ధులైన దితి, అదితి అనే యిద్దరిలో, దితికి హిరణ్యాక్ష హిరణ్యకశ్యపులనే వాళ్ళు జన్మించి, లోకకంటకులు కావడం వారిని విష్ణువు వధించడం, నీవు విన్న విషయాలే అంటూ చెప్పడం ఆపాడు పరాశరుడు "ఔనౌను ముఖ్యంగా ధ్రువుడు మళ్ళాపుట్టాడా అనిపించే ఆ ప్రహ్లాదుడి చరిత్ర అద్భుతం. విన్నదే అయినా మీనుండి వినాలని వుంది." అని కోరాడు మైత్రేయుడు. పరాశరుడు చెప్పనారంభించెను.

# భక్త ప్రహ్లాదుడు

నేను చెప్పడంలో ఏమీ లేదు. విష్ణుగాథల్లోని మాధుర్యమే అంత, ఒకసారి విన్నదేగనక, సూక్ష్మంలో మోక్షంగా చెబుతాను విను. హిరణ్యాక్షుణ్ణి వరాహావతారుడై విష్ణువు చంపేశాడన్న సంగతితెలియగానే, హిరణ్యకశిపుడికి ఎక్కడ లేని కోపం వచ్చింది. అసలే బ్రహ్మ యిచ్చిన వరబలంతో మదించివున్న అతగాడు సోదర మరణంతో వున్మత్తుడై పోయి ఊర్ధ్వలోకాలమీదకి దండయాత్రకి వెళ్ళాడు. అతని చావు విష్ణువు చేతిలో వ్రాసిపెట్టివుండగా ఎవరు మాత్రం యేంచేయగలరు చెప్పు? అధోలోకాలైతేనేం, ఊర్ధ్వలోకాలైతేనేం ఏడూ పధ్నాలుగు లోకాల్నీ పరాక్రమించి ఆక్రమించుకున్నాడు. ఆ హిరణ్యకశిపుడి యింట జన్మించాడు, మహాభక్తుడైన ప్రహ్లాదుడు. బాల్యంనుంచీ కూడా విష్ణుధ్యానతత్పరతతో ఆత్మాహ్లాదుడైన ఆ ప్రహ్లాదుడు హిరణ్యకశిపుడికి కొరకరాని కొయ్యగా పరిణమించాడు. ఎంతయినా తన వంశాంకురమనే వాత్సల్యంతోటి, పసితనంలో ఏదో తెలియనితనం లెమ్మనే ఊహ తోటి అతనిని సహించాడు హిరణ్యకశిపుడు.

రాక్షసకులగురువు శుక్రుని కుమారులైన చండామార్కుల వద్దకు అసురీవిద్యా శిక్షణకై పంపించాడు. పద్మాక్షుడి పాదపద్మాలపై లగ్నమైన అతని బుద్ధిపద్మాన్ని పెకలించాలని గురువులు ఎంతో ప్రయత్నించారు. ఫలితంలేక పోయింది. గురువులు చెప్పిన పాఠాలు అప్పగిస్తూనే చదువుచున్నాడు - కొన్నాళ్ళను కొన్నేళ్ళను - గురుకులవాసం తర్వాత, కుమారవిద్యా పరిశీలనార్థియై తండ్రిగా హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి తన వద్దకు రప్పించుకున్నాడు. అక్కడ హిరణ్యకశిపుడు అడిగిన ప్రశ్నలకు గురువులు చెప్పిన పాఠాలు కాకుండా, తన భక్తి ప్రచార విషయాలనే సమాధానంగా

చెప్పాడు. హిరణ్యకశిపుడు, తండ్రిగా తామసపడ్డాడు. చదువు చెప్పటం అంటే యిదేనా? అని చండా మార్కుల మీద విరుచుకుపడ్డాడు. ఆ రక్షోవిప్రులిద్దరూ – హిరణ్యకశిపుణ్ణి క్షమించమని వేడుకున్నారు. మేమేం చెప్పినా, రాకుమారులు వినడం లేదు. అయినా – మరొక్క అవకాశం యిప్పించుమాకు అని ప్రాధేయపడ్డారు సరే నన్నాడు. గురువులు ఎంత మొత్తుకున్నా, గురువలే్న వైష్ణవనామాలు ధరించమని సలహా యిచ్చాడు.

"గురువుల్లారా! అశాశ్వత జీవితాన్నీ, హామీలేని ఆయుర్దాయాన్నీ నమ్ముకుని, పొట్టకూటి కోసం ప్రభువులకు దాసులై జగత్ప్రభువునే విస్మరించడం మహాపాపం! మీరూ నాలాగా హరిని నమ్మండి. మీకే కష్టాలూరావు" అన్నాడు.

యువరాజుగారు మరింకమారరు లెమ్మని గురువులు పెదవులు విరచేశారు. "హేరాజా! ప్రహ్లాదుల వారికి మన రాక్షస పాఠాలు చెప్పడం మావల్ల కాదు. క్షమించండి" అని హిరణ్యకశిపుడికి విన్నవించుకున్నారు.

విన్న బోయాడు రాక్షసరాజు. ప్రహ్లాదుణ్ణి పిలిపించాడు సామ, దాన భేదోపాయాలన్నీ ప్రదర్శించాడు. చివరకు దండోపాయంతప్ప దారిలేదని భావించి ప్రహ్లాదుణ్ని హింసించాడు. కొరడాలతో కొట్టించాడు. సలసల మరిగే నూనెలో ముంచించాడు. సముద్రంలో నెట్టించినా, కొండల మీద నుంచీ త్రోయించినా, ఏనుగు చేత త్రొక్కించినా, పాములచే కరిపించినా, కాలకూటవిషాన్ని త్రాగించినా ఎన్ని చేసినా పసివాడని పూవులా ఆపసిబాలుడు ద్విగుణీకృతోత్సాహంతో హరినామస్మరణ చేస్తూనే వున్నాడు. ఒక రోజున వుండబట్టలేక హిరణ్యకశిపుడు కొడుకును పిలిచి చెప్పిందివినకండా శ్రీహరినే స్మరిస్తున్నావు. ఆ విష్ణువు వున్నాడంటేనేన్నమ్మను. ఉంటేనాకు చూపించగలవా? అతని చిరునామా

యేమిటి? అని అడిగాడు. ప్రహ్లాదుడు ప్రసన్నహాసంతో ఎంతమాటన్నారు తండ్రీ! సర్వేసర్వత్రా ఆ సర్వేశ్వరుడు నాకు కనిపిస్తూవుంటే వేరే యెక్కడ వున్నాడని అడుగుతారేమిటి? అణవణువూ హరిమయంరే అన్నాడు. అయితే యీ స్తంభంలో వున్నాడా? అని చిరాకు పడ్డాడు హిరణ్యకశిపుడు. ఉన్నాడని ధృఢంగా పలికింది ప్రహ్లాదుని కంఠం. గయ్ మన్నాడు రాక్షసరాజు – అనడమే కాదు.

# శ్రీ ఉగ్రనృసింహావతరణం

ప్రహ్లాదుడీమాటలు విని, హరితోడి తన వైరానుబంధ జాజ్వల్య మానరోషానలంతో హుంకరించి, ఆబాలుణ్ణి ధిక్కరించి "అయితే నీ హరిని ఈ స్తంభంలో చూపించరా" అంటూ – కనత్కనకమణిమయ కంకణం క్రేంకారపూర్వకంగా దిగ్దంతిదంతభేదన పాతవ ప్రశస్తమైన హస్తాన సభాస్తంభాన్ని వేసిన వ్రేటుతో దశదిశలా మిణుగురులు చెదరిపడి ఛటచ్ఛటస్ఫుటస్ఫుట ధ్వనులెగసి – బ్రహ్మాండ కుహరాలు నిండి బీటలు పడ్డట్లు కాగా – ఆ స్తంభంలో నుంచి ఆవిర్భవించిదొక ఆకారం.

ప్రఫుల్ల పద్మయుగళ సంకాశభాసుర చక్ర చాపహల కులిశాంకుశ జలచర రేఖాంకిత చారు చరణతలుడు – చరణ చంక్రమణఘన వినమిత విశ్వ విశ్వంభారాభార ధౌరేయ దిక్కుంభ కుంభీనస కుంభీనీర కూర్మకుల శేఖరుడు – దుగ్ధజలధిజాత కుండాల శుండాదండ మండిత ప్రకాండ ప్రచండ మహోరుస్తంభ యుగళుడు – ఘణఘణాయమానమణి కింకిణీ గణ ముఖరిత మేఖలావలయ వలయుత పీతాంబర శోభిత కటిప్రదేశుడూ – నిర్జర నిమ్నగా వర్తవర్తుల కమలాకర గంభీరనాభీ వివరుడు – ముష్టిపరిమేయ వినుత తనుతర స్నిగ్ధ మధ్యుడూ – కులాచల సానుభాగ సదృశ కర్క విశాల

వక్షుడు – దుర్జనదనుజ భట లతికాలవిత్రాయమాన, ప్రతాపజ్వలన జ్వాలాయమాన, శరణాగత చకోర చంద్ర రేఖాయమాన, వజ్రాయమాన, శరణాగత చకోర చంద్ర రేఖాయమాన, వజ్రాయుధ ప్రతిమాన భాసమాన, నిశాతశర తరముఖ నఖరుడు – శంఖ చక్ర గదా కుంత తోమర ప్రముఖ నానా యుధ మహిత మహోత్తుంగ శృంగ సన్నిభ వీరసాగర వేలాయమాన, మాలికావిరాజమాన, నిరర్గళానేక శతభుజార్గళుడు, మంజుమంజీర మణిపుంజ రంజిత మంజులహార కేయూర కంకణ కిరీట మకర కుండలాది భూషణ భూషితుడు – త్రివళీయుత శిఖరి శిఖరాభ పరిణద్ధ బంధురకంధరుడు – ప్రకంపన కంపిత పారిజాత పాదప పల్లవ ప్రతికాశ కోపావేశ సంచలితాధరుడు – శరత్కాల మేఘ జాల మధ్యమ ధగద్ధగాయమాన తటిల్ల తాసమాన దేదీప్యమాన దంష్ట్రాంకురుడు – కల్పాంతకాల సకల భువన గ్రసన విలసన విజృంభమాన జిహ్వుడు – మేరుమందర మహా గుహాంతరాళ విస్తార విపుల వక్త్రనాసికా వివరుడు – నాసికా వివర విస్సన్నిబిడనిశ్వాస నికర సంఘట్టన స్తంభిత, సంతప్యమాన సప్తసాగరుడు – పూర్వ పర్వత విద్యోతమాన ఖద్యోత మండల సదృశ, సమంచితలోచనుడు – లోచనాంచల సముత్కీర్యమాణ విలోలకీలా భీలవిస్ఫులింగ వితానరోరుద్యమాన తారకా గ్రహమండలుడు – శక్రచాప సురచిరోదగ్ర మహాభ్రూలతా బంధ బంధుర భయంకర వదనుడూ – ఘనతరగండ శైలతుల్యకమనీయ గండభాగుడు సంధ్యారాగ రక్తధారా ధరమాలికా ప్రతి మహాభ్రంకష తంతన్యమాన పటుతర సటాజాలుడూ – సటాజాల సంచాలన సంజాతవాతడోలాయమాన వైమానిక విమానుడు – నిష్కంపిత శంఖవర్ణ మహోర్ధ్వ కర్ణుడూ – మంద దండాయమాన మందర వసుంధర ధర పరిభ్రమణ వేగ సముత్పాద్యమాన వియన్మండల మండిత సుధారాశి కల్లోల శీకరాకార భాసుర కేసరుడు – పర్వాఖర్వ శిశిర కిరణ

మయూఖ గౌర తనూరుహుడు, నిజగర్జన నినాద నిర్దళితకుముద సుప్రతీక వామనైరావణ సార్వభౌమ ప్రముఖదిగిభరాజ కర్ణకోటరుడు – ధవళధరాధర దీర్ఘ దురవలోకనీయ దేహుడు – దేహ ప్రభాపటల నిర్మథ్యమాన పరిపంథియాతుధాన నికురుంబ గర్వాంధకారుడూ – ప్రహ్లాద హిరణ్యకశిపురంజన భంజన నిమిత్తాంతరంగబహిరంగ జేగీయమాన కరుణావీర రససంయుతుడు – మహాప్రభావుడూయైన శ్రీ నృసింహ దేవుడావిర్భవించటం చూసి – మనిషీకాదు మృగముకాదు – యిదేం విష్ణు మాయో! అని వివశతతో నివ్వెరపోయి కోలుకుని – ఆలోక భయంకరమైన సింహముతో తలపడబోయే మదపుటేనుగులాగా – ఆ రాక్షసుడు నృసింహస్వామి కెదురు నడిచాడు. ఆయన దివ్యతేజోజాల సన్నికర్షంతో – మంటలు తాకిన మిడతలాగా – యేమిచేయాలో దిక్కుతోచని స్థితిలో పడిపోయాడు హిరణ్యకశివుడు.

అదే అదనుగా మరింత విజృంభించాడు. నరహరి, బ్రహ్మదేవుడిచ్చిన వరాలకి భంగం కల్గకుండా మనిషీ మృగముగాని నరసింహమూర్తి, ఇంటాబైటా కాని నడుమ గడప మీద కూర్చుని, భూమ్మీదా ఆకాశంలోనూ గాకుండ ఆ రాక్షసుణ్ణి తన తొడలపై వేసుకుని, రాత్రి పగలూగాని సంధ్యాసమయంలో, ఆయుధాలు కానివీ జీవాలూ నిర్జీవాలూ కూడా కానివీ అయిన తన భీషణమైన వజ్రసన్నిభమైన గోళ్ళతో – అతని హృదయోదర కవాటాలని చీల్చేశాడు.

అప్పటికీ చల్లారని రౌద్రంతో మహోగ్రుడై చరిస్తున్న ఆ నృసింహస్వామిని – బ్రహ్మదులచే ప్రోద్బలం చేయబడ్డవాడై ప్రహ్లాదుడు అసమాన భక్తితో స్తుతించాడు. బాలభక్తుని ప్రార్థనకు శాంతించాడు నరసింహస్వామి. అతణ్ణి చిరంజీవుణ్ణి చేశాడు. ఉపర్యుక్తమైన పరాశరప్రోక్త ప్రహ్లాద చరిత్రనివిని మైత్రేయుడు దీర్ఘంగా నిట్టూర్చాడు. పరాశరుడు

ఆశ్చర్యపోయాడు."ఏమిటిమైత్రేయా?" అని అడిగాడు. మైత్రేయుడు తన మనసులోని మాట నిలా చెప్పసాగాడు "ఏమీ లేదు మహాత్మా! ధ్రువుణ్ణి, ప్రహ్లాదుణ్ణీ తన భక్తులైన వాళ్ల నెందర్నో వుద్ధరించాడా ఉపేంద్రుడు కాని ఒకానొక మహాభక్తుడు జన్మాంతం ఆ శ్రీహరినే నమ్ముకుని సాలగ్రామ తీర్థంలో తపమాచరించి – కాలానుసారంగా దేహాన్ని విసర్జించాడు. అయినా అతనికి మాత్రం మోక్షాన్ని ప్రసాదించలేదంటారు విష్ణువు. సర్వసముడైన ఆయనకు ఏదైన పక్షపాతం వుందా?" అని సందేహం.

మైత్రేయుడి సంశయాన్ని విన్న పరాశరుడు మృదువుగా నవ్వుతూ మరీమృదువుగా అడిగాడు – "ఎవరాభక్తుడు? జడభరతుడు గురించేనా నువ్వు అడిగేది?

" ఔను " సమాధానమిచ్చాడు మైత్రేయుడు.

అందులో విష్ణువు దోషం కించిత్తూ లేదు. అసలా జడభరతుడి విషయం సాకల్యంగా విను. అంటూ చెప్పనారంభించాడు పరాశరమహర్షి–

# జడభరతుడు

భరతుడనే వాడు ఒక రాజు. హరిభక్తుడై, కొన్నాళ్ళకు రాజ్యం వదలి, సాలగ్రామ తీర్థంలో తపస్సు మొదలు పెట్టాడు. ఒకరోజు స్నానానికని నదికి వెళ్ళాడు.

నదిదగ్గర ఒక జింక ఈనేందుకు సిద్ధంగావుంది. అప్పుడే అటు వచ్చిన సింహం – జింకని చూసి గర్జించింది. ఆ గర్జనకు బెదిరి నదిమీంచి దూకబోయింది జింక. ఆ దూకుడులోనే జింక ఈనింది. తల్లీ పిల్లా రెండూ నదిలో పడిపోయాయి. తల్లి జింక మరణించింది. అప్పుడే పుట్టిన పిల్ల జింక బ్రతికేందుకు ప్రయత్నిస్తోంది.పౌరుషానికి పేరైన సింహం – వచ్చిన

వాటిని తినడం యిష్టంలేక వెళ్ళిపోయింది. సరిగ్గా అదే సమయానికి నదికి వచ్చాడు భరతుడు. హరిభక్తులకు సహజమైన కరుణాతిశయంతో చావు బ్రతుకుల మధ్యనున్న ఆ జింక పిల్లను గట్టెంకించాడు, పెంచాడు. ప్రాణంలో ప్రాణంగా చూసుకోసాగాడు విష్ణు ధ్యానానికి తప్ప అన్యానికి స్థానంలేని తపోమూర్తిలో జింక తావుచేసుకోసాగింది. చివరకు – భరతుడు మరణాసన్న వేళ – హరిస్మరణ విస్మరించి జింకను విడిచిపోతున్నానన్న బెంగతో కన్నుమూసాడు. అటువంటప్పుడు విష్ణుసాయుజ్యమెలాలభిస్తుంది? అంత తపస్సూ బూడిదలో పోసిన పన్నీరైంది. జింక జన్మ నెత్తవలసి వచ్చింది.

సాలగ్రామ ప్రాంతంలోనే జింకగా పుట్టి, పూర్వజ్ఞాన సంపన్నతవలన, పునః హరిచింతనలో కాలంగడిపి తత్ఫలితంగా మరుసటి జన్మలో బ్రాహ్మణుడిగా జన్మించాడు.

ఆ జన్మలోనూ అతని పేరు భరతుడే అయ్యింది. నిత్య హరిసేవా తాదాత్మ్యతతో – పిచ్చివానిలా–నిష్కర్ముడుగా వుంటున్న ఆ భరతుడు – జడసమునిగా వుండంవల్ల అందరూ అతనిని జడ భరతుడని పిలిచేవారు, అతడలా నిష్కర్ముడు గావటం యిష్టంలేని అతని సోదరులు – జడభరతుణ్ని చూసి – అలా ఖాళీగా కూర్చునేదేదో చేనులో కాపలాగానైనా కూర్చో మన్నారు. జడభరతుడు పొలం కాపలాకి కూర్చున్నాడు. వీరరాజు అనే రాజు వైరాగ్యంతో సద్గురువును ఆశ్రయించడం కోసం – పల్లకీలో ఆదారినే వెడుతున్నాడు. బోయలు పల్లకీ మోయలేక అవస్థపడుతున్నారు. వారు జడభరతుణ్ని చూసి – పల్లకీ మోయమని రాజాజ్ఞగా పలికారు. జడభరతుడు వెళ్ళి పల్లకీ భుజాన కెత్తాడు కాని, అలవాటు లేని కారణంగానూ, మార్గమంతా మిట్టపల్లాలమయంగా వుండడం వల్లనూ – అడుగులు తడబడుతున్నాయి. ఆ విషయాన్ని జడభరతుడు పట్టించుకోకపోయినా, పల్లకీ కుదుపులకు రాజు

పట్టించుకున్నడు. పల్లకీ సరిగా మోయుమని బోయీలను హెచ్చరించాడు. వారు ఆదోషం యీ క్రొత్త బోయీదంటూ జడభరతుణ్ణి చూపించారు. వెర్రివాడిలావున్న జడభరతుణ్ని గద్దించాడు వీరరాజు, దానితొ జడభరతుడు ఒక వెర్రినవ్వునవ్వి యిలా అన్నాడు. "నేను మోయడంలేదు. నీవు మోయబడటంలేదు రెండూ మిథ్యలే. నిన్ను పల్లకీమోస్తోంది. దాన్ని నా భుజాలు మోస్తున్నాయి. భుజాలని వక్షం, వక్షాన్ని కడుపు, కడుపును పిదురులూ, పిరుదులని తొడలు, తొడలని పిక్కలూ మోస్తున్నాయి. ఆ పిక్కల్ని పాదాలుమోస్తున్నాయి. పాదాల్ని నేలమోస్తోంది. నేలని ఆదిశేషుడు ఆయన్ని కాలం, కాలాన్ని సూర్యచంద్రాదులు, వాళ్ళని ఆకాశమూ మోస్తున్నాయి. ఆకాశం క్రిందవున్న నీవూ నేనూ ఆకాశాన్నే మోస్తున్నాం శూన్యాన్ని మోసే నిన్ను నేను మోస్తున్నాననుకోవడం భ్రమ. ఏదో కర్మానుక్రమణికగా జరిగిపోతున్న దానికి – నువ్వూ నేనూ కర్తలం కాదు గదా!" జడభరతుడు చెప్పింది విన్న రాజు అతనిని సద్గురువుగా గ్రహించాడు. జ్ఞానం బోధించమనీ, తత్త్వం తెలియజెప్పమనీ అర్థించాడు. అను గ్రహించాడు జడభరతుడు – తత్త్వోపదేశంచేశాడు. ఆ సందర్భంలో ఋభనిదాఘుల కథనూ చెప్పాడు.

"ఏమిటా కథ? పరాశరుణ్ని అడిగాడు మైత్రేయుడు విను" అంటూ చెప్పసాగాడు పరాశరుడు.

## ఋభ నిదాఘులు

పూర్వం ఋభడనే గురువువద్ద నిదాఘుడనే శిష్యుడు అనేక విద్యలు నేర్చుకున్నాడు. కానిఅతనికి అద్వైతం మాత్రం అబ్బలేదు. కొన్నాళ్ళకు నిదాఘుడు వివాహితుడై, గృహస్థుగా మారాడు. కొన్నేళ్ళతర్వాత ఋభుడు – శిష్యునికి వేదాంత విద్యబోధించేందుకుగాను అతని యింటికి వెళ్ళాడు.

కాని, నిదాఘుడు గురువును గుర్తించలేదు. గృహస్థధర్మంగా కడుపు నిండిందాస్వామీ. అని గౌరవాలన్నీ చేశాడు. భోజనానంతరం కడుపు నిండిందాస్వామీ? అని అడిగాడు.

అందుకు ఋభుడు నవ్వుతూ – "ఆకలీ, దాహం దేహధర్మాలు, తృప్తి, సుఖం మనోధర్మాలు, నువ్వు దైహికపరంగా ప్రశ్నిస్తే – కడుపునిండడం కల్ల. మనోగతంగా ప్రశ్నిస్తే – కడుపూ లేదు – నిండడమూ లేదు." అన్నాడు. కొంచెం వివరంగా చెప్పమని నిదాఘుడు కోరగా – తిరిగి ఋభుడు – "ఆహారం యెప్పుడూ రుచ్యమూ, తృప్తమూ కాబోదు నాయనా! ఈ పాంచభౌతిక వికార దేహమునకు తద్వికార వికారములైన ఆహారముల చేతనే బలంచేకూరుతుంది, తద్వారా మనోధర్మాలకు బలం ఉత్పాదించబడితేనే ఫలం. అలాకాకుండా – వికారాల గురించే ఆలోచించడం విజ్ఞాల లక్షణం కాదు. అందువల్ల నువ్వు– యీ ఐహిక విషయాలోచన మాని పరాన్ని గురించి చింతించ" మన్నాడు.

ఆ మాటలకు చలించిన నిదాఘుడు "తమరెవరో చెప్పండి" అన్నాడు నీచే మరువబడిన నీ గురువును " అని చెప్పి, తన దారిన వెళ్ళిపోయాడు ఋభుడు.

ఋభడు చెప్పింది మననం చేస్తూ మరి కొన్నేళ్ళు గడిపేశాడు నిదాఘుడు. ఒకరోజు, నిదాఘుడు యింటికి కట్టెల మోపు యెత్తుకొని వస్తుండగా – ఎదురుగా పరివారంతో గజారూఢుడైన రాజు రావడం వల్ల – ఆ జనసందోహం నుండి ముందుకు పోలేక, కట్టెల మోపును క్రిందకు దింపి – ఒక వారగా నిలిచాడు. అదే సమయానికి ఋభుడు అక్కడకు వచ్చాడు. ఈ సారి కూడా నిదాఘుడు గురువును గుర్తించలేదు. వారి మధ్యన సంభాషణ యిలా సాగింది.

ఋభుడు:- ఇలా కూర్చున్నా వేమిటి నాయనా!

నాదాఘుడు:- ఈ రాజపరివారమును తప్పించుకొని పోలేక

ఋభుడు:- వీరిలో రాజెవరు! పరివార మెవరు?

నిదాఘుడు:- ఆ యేనుగు మీదవున్న వాడు రాజు. తక్కిన వారు పరివారం.

ఋభుడు:- యేది యేనుగు? యెవరు రాజు?

నిదాఘుడు:- ఆ క్రిందనున్న భారీజీవమే యేనుగు, దానిపై నెక్కి కూరున్నవాడే రాజు.

ఋభుడు:- అయ్యయ్యో! క్రిందంటే ఏమిటో, పైనంటే ఏమిటో తెలియు లేదునాకు, నాయనా - ఆ క్రిందు మీదుల గురించి చెప్పు.

ఋభుడి ప్రశ్నలకి మండుకొచ్చింది నిదాఘుడికి, ఆ కోపంతో అతను ఋభుడి మెడలు వంచి, తానతనిపైన యెక్కి కూర్చుని - ఓరీ సన్నాసీ! యిప్పుడు నీవున్నది క్రింద. నేనున్నది మీద - అర్థమైందా? అన్నాడు.

ఋభుడు చిరునవ్వుతోనే -"ఇంతకూ - నీవు - నేను అని రెండుమాటలు వినబడుతున్నాయి. నీవంటే ఏమిటి? నేనంటే ఏమిటి?"అని అడిగాడు. నివ్వెరపోయాడు నిదాఘుడు వెంటనే ఋభుడి పాదాలపై పడి మన్నింప వేడాడు. "నిస్సందేహంగామీరు మా గురుదేవులే, నేను గుర్తించాను." అన్నాడు.

ఋభుడు ఆనందించాడు. నిదాఘుడికి అద్వైతం బోధించాడు. ఆ గురుశిష్యులిద్దరూ తరించారు -

ఆ విధంగా - జడభరతుడు చెప్పిన కథద్వారా వీరరాజుకు జ్ఞానోదయమైంది. అంతలో - జడభరతుడూ వీరరాజుకూడా సాయుజ్యం పొందారు. అంటూ ముగించాడు పరాశరుడు.

# శని, యముడు, అశ్వనీ దేవతలు

ఏవంవిధ కథన, శ్రమణ కుతూహలులైవున్న ఆముని ద్వయంలో మైత్రేయుడు మనువుల గూర్చి చెప్పమని అడిగాడు. పరాశరుడు చెప్పసాగాడు.

సూర్యుని భార్య సంజ్ఞ, ఆమెకు యముడు, యమున-సంతానం. సూర్యుడి వేడి తాళలేక ఆ సంజ్ఞ తన ఛాయను తనవలెనే తీర్చదిద్ది - యింట నుంచి తాను గుఱ్ఱంగామారి సాగరతీరాన చల్లగాలిలో విహరించసాగింది. జగ న్నేత్రుడైన సూర్యుడు - ఛాయనే సంజ్ఞగా భావించి ఆమెతోనే కాపురం చేస్తున్నాడు. తద్వారా ఛాయ గర్భం ధరించి శనిని ప్రసవించింది. ఆమెకు తనబిడ్డడైన శనియందు ప్రేమ సవతి సంతానమగు యమ, యమునలపై కించిత్ వుపేక్షా వున్నాయి.

సమవర్తి యముడు. అతనుకూడా, ఛాయను తమ తల్లియైన సంజ్ఞ అనే అనుకున్నాడు. అటువంటప్పుడు ఆమె తనపట్లా, తన చెల్లెలయిన యమునపట్లా ఎందుకు వుపేక్షచూపుతోందో అర్థం కాలేదు. సరాసరి ఆమెనే అడిగేశాడు. ఆ ప్రశ్నవిని, యముడిపై విరుచుకుపడింది ఛాయ. అనేకరకాల దూషించింది. దుర్భరమైన ఆదూషణలు వినలేని కాలుడు కాలెత్తి ఆమెను తన్నాడు. మరింత ఆవేశపడిన ఛాయ "నీకాళ్ళు పడిపోనూ" అంది. యముడు అవిటివాడయ్యాడు, బిడ్డ అవిటి తనం గురించి తెలసిన ఆదిత్యుడు యముణ్ని సమీపించి "ఏం జరిగింది?" అని అడిగాడు సత్యరూపుడు యముడు - యదార్థాన్ని చెప్పాడు. "ఆమె మా యమ్మయనే నమ్మకం పోయింది మాకు. కాని అమ్మలాగే వున్న ఆమె యెవరో బోధపడటం లేదు" అని వాపోయాడు.

సూర్యుడు ఛాయకేసి చురచురాచూశాడు. గడగడ లాడిపోయింది ఛాయ. సవితృడికి సత్యాన్ని చెప్పేసింది. మరుక్షణమే మార్తాండుడా అశ్వంగామారి సాగరతీరాన్ని చేరాడు. సంజ్ఞను కూడాడు. అలా అశ్వ రూపంలో కలిసిన సంజ్ఞ తండ్రియైన త్వష్ట వచ్చి – సూర్యతేజాన్ని తరణి బట్టాడు. రాలిన తేజోరాశితో దేవతలకు ఆయుధాలు చేశాడు. సంజ్ఞ సూర్యుడితో కలిసి – సూర్యమండలానికి చేరింది. సూర్యుడు యముడికి కాళ్ళు వచ్చేలా చేశాడు.

స్వరూపాలతో స్వధామంలో – యే మినహాయింపులూ లేని సంపూర్ణ మనోభీష్టాలైన శృంగారాలన్నీ అనుభవించారు సంజ్ఞసూర్యులు. వారికి జన్మించాడు. సావర్ణి. సావర్ణి నుండి – మనువులు ఆరంభమయ్యారు – మనువులనుండి సూర్య చంద్రవంశాదులన్నీ ఏర్పడ్డాయి.

పరాశరుడలా చెప్పగానే మైత్రేయుడు –"స్వామీ! సూర్యాన్వయంలో మాంధాత శ్రేష్టుడని – కథలు కథలుగా చెప్పుకుంటారు అతని జన్మాది విషయాలు వివరించండి" అని కోరగా పరాశరుడు మొదలు పెట్టాడు.

# మాంధాతృ చరిత్రము

కకుత్థ్స వంశములో యువనాశ్వుడనే వాడు సంతానము లేని విచారముతో యడవికి వెళ్ళి మునీంద్రుల నాశ్రయించాడు. తనకు సంతానము ప్రసాదింపుడని ప్రార్థించెను. వారా రాజానందు దయగల్గి మంత్ర జలమిచ్చి నీ భార్యకిమ్మని చెప్పి యొక పాత్రలో నుంచారు. ఆనాటి రాత్రి యా రాజా మిక్కిలి దాహమై, యా మంత్రజలమున్న పాత్రలోని జలమును తానే త్రాగివేసెను. తత్ఫలితముగా అతడు గర్భము దాల్చెను. మరునాడా మునులకు తన పొరపాటు వివరించి చెప్పెను. వారు దయగల్గి "జరిగిన

దానికి విచారింపకుము. గర్భము పరి పక్వమగుట తప్పదు. నవమాసములు పూర్తియైన తరువాత ఆ శిశువు నీ కుడి డొక్క చీల్చుకొని వెడలి వచ్చును. నీ కపాయము రాదని ”· వరమిచ్చిరి.

అట్లు నవమాసములు నిండిన తరువాత, శిశువు కుడి డొక్క చీల్చుకొని యీవలకు వచ్చెను. తండ్రి కనిన పురుషుడు గాన, వానికి త్రాగుటకు పాలు దొరకవు. మునులాతని బొటన వేలునమృతములో ముంచి గుడువ నేసిరి. ఆ వ్రేలు గుడుచుచు బాలుడు బ్రతికెను. వానికే మాంధాతయని పేరు పెట్టిరి. ఈతడు వృద్ధినొంది రాజ్యపాలనము సామర్థ్యముతో నడిపెను. ఈతనికి ముచికుందుడను కుమారుడు, పెక్కుమంది కుమార్తెలు జన్మించిరి. ఆ కుమార్తెలను సౌబరి యను మునీంద్రునకిచ్చి వివాహములు గావించెను” అని శుకుడు చెప్పగా విని, రాజా మునీంద్రుని చూచి “మహాత్మా! ఆ సౌబరి ఎవరు? వాని చరిత్రము చెప్పుకుని ” యడిగెను. శుకుడిట్లు చెప్పనారంభించెను. సౌబరి బ్రహ్మచర్య దీక్షతో నున్న మహాముని. అతడు జలములలో నుండి తపమాచరించు చుండెను. ఆ నీళ్ళలో జలచరములు సంసారము జరుపుకొనుట చూచి తాను గూడ గృహస్థు గావలయునని వాంఛించి మాంధాత వద్దకు వచ్చెను. మాంధాత తన కుమార్తెల నాతనికీయ నిష్టపడలేదు. స్వయంవరములేకనే గాని నా కుమార్తెలకు వివాహము చేయుటమా క్షత్రియ ధర్మము కాదనెను. స్వయంవర మేర్పాటు చేయుమన్నాడు ముని. అదేం చిత్రమో కాని, ఆ కుమార్తెలందరాతనినే వరించి వివాహమాడిరి. అతడు విశ్వకర్మచే భవనములు కట్టించి వారినందుంచి మహాభోగము లనుభవించెనని చెప్పెను.

# కల్మాషపాదుని చరిత్రము

తరువాత, పరీక్షిన్మహారాజు కల్మాషపాదుని చరిత్రము విన కోరగా శుక యోగీంద్రుడిట్లు చెప్పనారంభించెను. ఇక్ష్వాకు వంశములో మిత్ర సఖుడను రాజు గలడు. అతడు యజ్ఞము చేయుచుండెను. వానికి కులగురువులైన వశిష్ఠుడు బ్రహ్మగా నుండెను. యాగము పూర్తియగు సమయమున నొక రాక్షసుడు వశిష్ఠుని రూపములో వచ్చి నాకు యజ్ఞ దక్షిణగా నరమాంసమును వండించి పెట్టుమని కోరెను. గురువు కోరిక కాదనరానిది గదాని రాజట్లే చేయించి వశిష్ఠునకా భోజనము పెట్టించెను. మునీంద్రుడది గ్రహించి కోపగించి "మాకు యిట్టి నీచభోజనము పెట్టెదవా? నీవు చేసిన పనికి రాక్షసుడవై పుట్టుము. నరులను చంపి యా మాంసమునే భక్షింపు " మని శపించెను. రాజు భయపడి "గురువర్యా! ఈ పని తమ యాజ్ఞయే కదా!"యనగా మునీంద్రుడు జరిగినది దివ్య దృష్టిని చూచి, కోపమునణచుకొనెనే గాని, శాపము మాత్రం తప్పదనెను. రాజు కోపగించి గురువునకు ప్రతిశాప మీయబోగా రాజపత్ని అతనిని వారించెను.

చేపట్టిన మంత్రజలము నెవ్వరిమీద గాని, యెక్కడ గాని పడిన ప్రమాదమని తలచి, ఆ జలమును తన కాళ్ళ మీదనే పోసి కొనెను. వెంటనే యాతని పాదములు నల్లబడి మచ్చలు మచ్చలుగా మారుటచే కల్మాషపాదుడను పేరు వచ్చినది. ఇట్లుండగా నాతడు రాక్షసుడై తిరుగుచు, ఒకానొక మునిపత్నిని చంపి తిని వేసెను. ఆమె భర్త – భార్య వియోగమునకు విచారించి "మమ్ము విడదీసితివి గాన, నీకు భార్య సంయోగమైన చనిపోవుదువు గాక! " యన శపించెను. అతడు పండ్రెండేండ్లు రాక్షసుడై తిరిగి, తన రూపమందెను. భార్యను ముట్టకుండా యాతడుండెను. చివరకు

శాపవశమున మరణము చెందెనని రాజుతో మునీంద్రుడా కథ చెప్పెను. తరువాత శంబరుని కథ నిట్లు విన్పించెను. ఒకనాడునారదుడు శంబరాసురుని జేరి "నిన్ను శ్రీకృష్ణుని భార్యకు పుట్టినవాడు చంపగలడ"ని చెప్పెను. మన్మదుడు ప్రద్యుమ్నుడై పుట్టెను. వానిని శంబరాసురుడు గొనిపోయి సముద్రమున వేయగా నొకచేప మ్రింగినది. జాలరులా చేపను గొని వచ్చి శంబరునకు కాన్కగా నీయగా శంబరునింట మాయావతి యను పేరుతో దాసీగా రతీదేవి యుండెను. మాయావతికా చేపనిచ్చి వంట చేయమని పంపగా నా చేపను కోయగా నందు బాలకుడు పుట్టి యీవలకు వచ్చెను. మాయావతి యతడు తన పెనిమిటిగా నెరిగి పెంచసాగెను. అతడు మాయావతి వలన తన సమస్త వృత్తాంతము తెలిసికొనెను. తాను రుక్మిణీ కృష్ణుల కుమారుడననియు, వీడు మోసముతో గొనివచ్చి సముద్రమునందేయగా చేప మ్రింగినదనియు - యిప్పుడిట్లున్నాననియు, తాను మన్మదుడనియు, మాయావతి తన భార్య రతీ దేవి యనియు యెరిగెను. మాయావతి తన మాయా విద్యా విధానమంతయు వానికి నేర్పెను. వాడు శంబరాసురుని మాయామాయుద్ధములో జయించి చంపెను. మాయావతితో ప్రద్యుమ్నుడు ద్వారకకు పోగా వారానవాలు పట్టిరి. వారిద్దరకు వివాహము గావించిరి.

## నిధులు - మన్వంతరాలు

అనంతరం - మైత్రేయుడు - నిధులు మన్వంతరాలు విష్ణువు అవతారాల గురించి ప్రశ్నించగా పరాశరుడిలా చెప్పాడు.

నిధులు తొమ్మిది 1. పద్మనిధి :- సత్వగుణ ప్రధానం బంగారం, వెండి, రాగి మొదలైన లోహాలకు చెందినది. 2. మహాపద్మనిధి:- సత్త్వ ప్రధానం పద్మ రాగ, ప్రవాళ, మౌక్తికాదులకు చెందినది. 3. మకర నిధి:-

తమో గుణమయం. ధనుస్సు కత్తి మొదలగు ఆయుధ ప్రధానమైనది. 4. కచ్ఛపనిధి:- ఇదీ తమో గుణ ప్రధానమే. లోభత్వం దీనికి చెందినదే. 5. ముకుంద నిధి:- రజోగుణ ప్రధానం. వీణా మృదంగాది జంత్ర తంత్రాదులతో కూడుకొన్నది. 6. నందనిధి:- రజోగుణ, తమోగుణాల కలయిక. ధాన్య ధాతువులకు చెందినది. 7. నీలనిధి:- సత్త్వరజోగుణాలతో వుంటుంది. పువ్వులు, పండ్లు, నూలు మొదలగు వానితో యుక్తమై వుంటుంది. 8. శంఖనిధి:-రజస్తమోగుణ నిలయం. అన్న వస్త్రాలకు లోటు లేకపోవడం తప్ప విశేషం వుండదు. లోభులయె ప్రమాదం అధికం.

మన్వంతరాలు 14. ఇవన్నీ మనువుల పేర్లతోనే సాగుతాయి. అవి యివి:- 1. దక్షసావర్ణి, 2. స్వారోచి, 3. ఔత్తమం, 4. తామసం, 5. రైవతం, 6. చాక్షుషం, 7. వైవస్వతమన్వతరం, 8. సూర్యసావర్ణి, 9. దక్షసావర్ణి, 10. బ్రహ్మ సావర్ణి 11. ధర్మ సావర్ణి 12.రుద్రసావర్ణి 13. రౌచ్య సావర్ణి 14. ఔషస సావర్ణి.

విష్ణువు అవతారాలు 21. అవి యివి - 1. హయగ్రీవావతారం, 2. సుయజ్ఞ 3. కపిల 4. దత్తాత్రేయ 5. వరాహ 6. సనక, 7. నరనారాయణ, 8. పృథు 9. మత్స్య 10. కూర్మ 11. జగన్మోహిని 12. నారసింహ 13. వామన 14. పరశురామ 15. రామ 16. శ్రీకృష్ణ 17. బౌద్ధ 18. బ్రాహ్మణ్య 19. ధన్వంతరి 20. ధేనుక 21. కల్కి.

పరశరా! ఈ విష్ణు పురాణం ఎంత విన్నా తనివి తీరదు. శ్రీహరి లీలలు, అవతారాలూ భాగవత పురాణంలో వినవచ్చును. ఈ పురాణానికి చెంది మరేమైనా వినగోరుతున్నావా? అని వశిష్ఠులవారు అడుగగా - సత్యభామ నరకుని ఘట్టం చెప్పమని కోరాడు. మాతాత పాదులైనవారు చెప్పిన విషయాన్ని నీకు చెబుతున్నాను విను మైత్రేయా - అంటూ - పరాశరుడు ఆ విషయాన్ని యిలా తెలియ జేశాడు.

# నరకుడు - సత్యభామ

నరకాసురుడు పదారువేలమంది రాజకన్యలను చెరబట్టి ఉంచిన సంగతిని ప్రకటించి, మరల యిలా చెప్పసాగెను. ప్రాగ్జ్యోతిష పట్టణమున నరకుడను రాక్షసరాజు గలడు. వాని బాధపడలేక దేవతలు శ్రీకృష్ణునితో మొరపెట్టిరి. అతడా నరకుని సంహరించుటకు గరుడ వాహనము మీద తన భార్య సత్యభామతో కలసి వెళ్లి పోరాడెను. సత్యభామ నరకాసురునితో ఘోరతరయుద్ధము గావించెను. చివరకు సుదర్శనాయుధముతో కృష్ణుడాతని శిరస్సు ఖండించెను. వాని కుమారుడగు భగదత్తునకా రాజ్యము నిచ్చి గౌరవించెను. నరకుడు బంధించిన పదునారు వేల రాజకన్యలు శ్రీకృష్ణుని వరించగా – వారిని తన వెంట ద్వారకకు గొనిపోయెను. వారందరాయనను ధ్యాన యోగమున యోగి జన పూజ్యునిగా పూజించి తరించిరి. ఈ విధముగా పదారు వేల మందీ శ్రీకృష్ణుని ప్రియురాండ్రైనారని శ్రీశుకుడు పరీక్షిత్తుకు విష్ణు పురాణ విశేషములను వినిపించెను.

**విష్ణు పురాణము సమాప్తము**



# 4. వాయు పురాణం

అష్టాదశ పురాణాల్లో నాలుగవది వాయు పురాణం . ధర్మం గూర్చి మరియు శివలీలల గురించి వాయుదేవుడు చెప్పిన పురాణమిది.

శ్లో॥ చతుర్వింశతి సాహస్రం పురాణం తదిహోచ్యతే!

అనే శ్లోకానుసారం ఇందులో ఇరువది నాల్గువేల శ్లోకాలున్నవి. వాయోర్వామో మహేశితుః! అనగా ఈ వాయు పురాణం శ్రీ మహా విష్ణువు యొక్క ఎడమ భుజంగా కీర్తించబడినది. ఇందులో నాల్గు భాగాలున్నవి. అవి వరుసగానివి:- 1. ప్రక్రియా పాదం 2) అనుసంగ పాదం 3) ఉపోద్ఘాత పాదం 4) ఉపసంహార పాదం, మనకందుబాటులో నున్న శ్లోకాలు. పదునొకండు వేలు మాత్రమే ! ఈ పురాణంలోని విషయాలు, భూగోళ, ఖగోళాలకు సంబంధించిన విషయాలు, బ్రహ్మాండ రచన, ప్రక్రియ, అగ్ని వంశవర్ణన, యుగ ధర్మాలు, కైలాస వర్ణన గంగావతరణం, శివస్తుతి, ఋషి లక్షణాలు, వరుణ గంగావతరణం, శివస్తుతి, ఋషి లక్షణాలు, వరుణ వంశ వర్ణన జంబూద్వీపం మొ॥ సప్తద్వీపాల వర్ణన. శ్రాద్ధ ప్రక్రియ శ్రీ మహా విష్ణ మాహాత్మ్యము గయాక్షేత్ర వర్ణన మొదలైన అంశాలు ఈవాయుపురాణంలో అగుపిస్తాయి.

వాయు పురాణం శైవ తత్త్వాన్ని బోధించేదే అయినప్పటికి శ్రీ మహా విష్ణువర్ణన కూడా యిందులో కలదు. ఈ కారణంగా ఈ వాయు పురాణాని కొక వైశిష్ట్యముంది.

"శ్లో॥ యో విద్యాచ్చతురోవేదాన్, సాంగోపనిషదోనరః!
న చేత్పురాణం సంవిద్యా. న్నైవ తస్యాద్విచక్షణః!!"

నాలుగు వేదాలు, వేదాంగాలు, ఉపనిషత్తులు మొదలైన వాటి నన్నిటినీ క్షుణ్ణంగా తెలిసికొన్నప్పటికి, ఎవడైతే పురాణాల గురించి ఎఱుగడో, అతడు పండితుడు కానేరడని వాయు పురాణం చెప్పుతున్నది. కొందరు విద్యాంసులు పురాణాల మంచి దృష్టితో చూడరు. అటువంటి వారికి చుఱకే ఈ శ్లోకోద్దేశ్యం.

"శ్లో॥ తస్మాద్యుక్తః సదాయోగీ, ప్రాణాయామ పరోభవేత్ః!

సర్వపాప విశుద్ధాత్మా; పరం బ్రహ్మాదిగచ్ఛతి!!"

ఎవరైతే నిత్యము ప్రాణాయామ మాచరిస్తారో వారు తమ పాపాలను రూపుమాపుకొని యోగులై బ్రహ్మసాయుజ్యాన్ని పొందగలరు.

విశేషాంశము:- మానవుడు యోగి కావాలంటే ప్రాణాయమం ఒక సాధనం. మరియు ప్రాణాయామ స్వరూపం దాని భేదాలు, మరియు వైశిష్ట్యము మొ॥ అంశాలెన్నో చక్కగా ఈ వాయు పురాణంలో అగుపిస్తాయి. ప్రాణాయామానికి - సంబంధించి మరే పురాణం ఇంత వివరంగా చెప్పలేదంటే అత్యుక్తికాదు. ప్రాణాయామాన్ని ఆచరిస్తే, వచ్చే ప్రయోజన మింకా ఇట్లుంది.

"శ్లో॥ ప్రయోజనాని చత్వారి, ప్రాణాయామస్య విద్ధివై!

శాంతిః ప్రశాంతిర్దీప్తిశ్చ, ప్రసాదశ్చ చతుష్టయమ్!!"

శాంతి ప్రశాంతి, దీప్తి, ప్రసాద మనే నాల్గు ప్రయోజనాలు ప్రాణాయామానికి చెప్పబడ్డాయి. శాంతి ఒకటి కాదు. వీటి నిర్వచనం ఎంతో వివరంగా ఉంది. గ్రంథ విస్తర భీతితో చాలించాను. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులనే త్రిమూర్త్యాత్మకమైంది ఓంకారం. ఈ ఓంకారాన్ని ఉచ్చరిస్తే మన మనస్సెంతో ప్రశాంతంగా ఉంటుంది. అయితే దీన్ని ఉచ్చరించేటప్పుడు, దీని వల్ల సంపూర్ణ ఫలం సిద్ధిస్తుందంటూ వాయుపురాణంలోయిలా చెప్పబడింది.

"శ్లో॥ ఏషత్రిమాత్రో విజ్ఞేయో, వ్యంజనం ఛాత్రసుస్వరం!

అని చెప్పడమైంది. అంటే మూడు మాత్రలకాలంలో (ప్లుతంగా) ఓంకారాన్ని ఉచ్చరించి, ఆ తర్వాత మ కారాన్ని ఉచ్చరించాలని భావము ఉదా:- ఓమ్

"శ్లో॥ ఏషత్రిమాత్రో విజ్ఞేయో, వ్యంజనం ఛాత్రసుస్వరం! శ్లో॥ ఇత్యేదక్షరం బ్రహ్మః పరమోంకార సంజ్ఞితమ్!

యస్తు వేదయతే సమ్యక్తథా ధ్యాయతి వాపునః!!

శ్లో॥ సంసార చక్ర ముత్సృజ, ముక్త బంధన బంధనః!

అచలం నిర్గుణం స్థానం, శివం ప్రాప్నోత్యసంశయ!!"

ఎవరైతే ఓంకారమనే అక్షర పరబ్రహ్మను తెలిసికొంటారో మరియు ధ్యానం చేస్తారో వారి సంసార బంధనాలు త్రెంచుకొని శాశ్వతమైన శివసాయుజ్యం పొందగలరని భావము ఈ విధంగా ఓంకారానికి సంబంధించిన వర్ణన ఈ వాయు పురాణంలో ఒక అధ్యాయంలోఎంతో విపులంగా వర్ణింపబడియున్నది.

ఇక లోకాలను వర్ణించే సమయంలో పర్వతాలు, నదులు, వృక్షాలనువర్ణిస్తూ, ఆయా ప్రాంతాలలో నివసించే మానవుల ఆయుః ప్రమాణమిలా వర్ణితమైనది.

1. శ్వేత పర్వతానికి దక్షిణ దిశలో రమణకము దేశంలోని ప్రజలు మంచి బల సంపన్నులు మరియు సుందరాంగులు వారి ఆయుః ప్రమాణం పదివేల సంవత్సరాలు.

2. శ్వేత పర్వతానికి ఉత్తర దిశలో హిరణ్యతము అనే దేశం కలదు అక్కడి మానవులు ధన సంపన్నులు వారి ఆయుఃప్రమాణం పదునొకండు వేల సంవత్సరాలు. మరికొన్ని దేశాలు స్వర్ణమయాలు ఇలాగే ఆయా పరిసరాల్లోని మరో దేశాన్ని వర్ణిస్తున్న వర్ణన యిట్లుంది.

3. అక్కడి భవనాలు కొన్ని రత్నమయాలైతే, కొన్నేమోమణిమయాలు మరి కొన్ని స్వర్ణమయాలు.

4. ఇలాగే ఆ పరిసరాల్లో మరో దేశాన్ని వర్ణిస్తు యిలా వర్ణించింది. అక్కడి చెట్లు నిత్యం ఫల పుష్పాలతో నిండియుండేవనియు ఆ చెట్లు వారికి కావలసిన వస్త్రాలను, ఆభరణాలను ఇచ్చేవని వర్ణించబడింది. ఆశ్చర్యంగా ఉన్నదికదూ.

"శ్లో॥ తత్రవృక్షియన్తే, నిత్యం పుష్పఫలోపగాః!

వస్త్రాణిప్రసూయన్తే,ఫలేష్వభరణీ!"

అనే శ్లోకాం పై భావాన్ని చెప్పుతోంది.

కవికుల గురువు కాళిదాస మహాకవి రచించన అభిజ్ఞాన శాకుంతలంలో వృక్షాలు వస్త్రాల నిచ్చే అంశం సాక్షాత్కరిస్తుంది.

ఈ విధంగా వాయు పురాణంలో కథలకంటే ఎక్కువగా ఇలాంటి ప్రకృతి వర్ణనలే దర్శనమిస్తాయి. గయాక్షేత్ర మాహాత్మ్యం వర్ణిస్తూ

"శ్లో॥ గయా యాస్యతి యఃపుత్రః సస్త్రాతా భవిష్యతి!

గయాప్రాప్తం సుతం దృష్ట్వా పితృణాముత్సవోభవేత్!!"

తల్లిదండ్రులకెందరో కుమారులుండవచ్చును. కాని, ఎవడైతే గయా క్షేత్రం దర్శించి వస్తాడో, అతడే తమ్ముద్ధరించే వాడని తలుస్తారు. గయకు వెళ్ళి స్వామిని దర్శించి వచ్చిన పుత్రున్ని చూస్తే తల్లిదండ్రులకు అమితమైన ఆనందం కల్గుతుందని దీని భావము.

శ్లో॥ ధన్యం యశస్య మాయుష్యం పుణ్యం పాపప్రణాశనమ్!

కీర్తనం శ్రవణం చాస్య, ధారణం చ విశేషతేః!!

ఈ వాయు పురాణం వినువారు మరియు దీని పఠించువారు కీర్తిమంతులై, ఆయుష్మంతులై, తమ పాపాలను పోగొట్టుకొని పుణ్యాన్ని పొందగలరని భావము.

# సూతో వాచః

సూతుడు చెబుతున్నాడు - ఓ శౌనకాది పురాణ విషయ జిజ్ఞాసువులారా! వ్యాస ప్రోక్తమైన అష్టాదశ పురాణాలలోనూ, ప్రముఖ్యమైన వాయు సంబంధిత - వాయు వీయసంహితాంర్గత పురాణ గాథని చెబుతాను వినండి.

ఒకానొకప్పుడు కొందరు ఋషులకి పరబ్రహ్మ తత్వం గురించి సందేహం కలిగింది. నేతి - నేతి విధాన రీత్యా యెంతగా తర్కించి పరిశోధించినా అంత్యం శూన్యమవుతోందే తప్ప, అసలు కిటుకు మాత్రం వంటబట్టటలేదు. అంతటితో వాళ్లంతా కలిసి అబ్జాసనుని దగ్గరకెళ్ళి - "కో బ్రహ్మన్?... పరబ్రహ్మమెవరు?" అని ప్రశ్నించారు. అందుకా వారిజగర్భుడు రుద్రోబ్రహ్మన్ - రుద్రుడే బ్రహ్మ - అని సమాధానమిచ్చాడు. వెంటనే వాళ్ళలో ముని ఒకడు ముందుకు కదిలి - "బ్రూమీమే తత్తత్త్వం"... అయితే ఆ శివ తత్వాన్ని సెలవియ్యి - అని అడిగాడు.

తక్షణమే తామరచూలి ఒక మనోమయ చక్రాన్ని కల్పించి, దానిని బలంగా విసిరాడు - అనంతరం తాపస బృందాన్ని చూసి, "మీరంతా ఆ చక్రం వెనకాలే వెళ్ళండి. ఆ చక్రం యొక్క నేమి యెక్కడ పడిపోతే, అక్కడ మహా సత్రాన్ని చెయ్యండి. అలా చెయ్యగా చెయ్యగా ఆ యాగం దగ్గరికి వాయుదేవుడొస్తాడు. అతన్నడిగితే, అభవతత్వాన్నతను చెబుతాడు"- అని చెప్పాడు.

మునులంతా చక్రాన్ననుసరించారు. అదృష్టవశాన ఆ చక్రం యొక్క నేమి భూమ్మీదనే పడింది. నేమి పడడం వలన ఆ ఊాయి పగిలి, జలపడింది.

చక్రనేమి పడిన కారణంగా ఆ జలచక్ర తీర్థంగా పేరు పండింది. చక్రనేమి పడిన కారణంగా ఆ అడవి నైమిశారణ్యంగా పేరు పడింది.

చతుర్ముఖుడు చెప్పినట్లుగానే మునులంతా కలిసి మహా సత్రయాగాన్ని ప్రారంభించారు. చెయ్యగా చెయ్యగా, యాగం చివరి దశ చేరే నాటికివ వచ్చాడు వాయుదేవుడు. తన అంగ భూతాలయిన నలభై తొమ్మిది గాలుల భూతాల తోనూ కలిసి మరీ వచ్చాడాయన. ఋషులాయనకు చెయ్యవలసిన మర్యాదలన్నీ, చేసి శివతత్త్వం చెప్పమని అడిగారు, చెప్పసాగాడు వాయువు.

# సృష్టి యొక్క పద్ధతి

మహర్షులారా!

"యావై బ్రాహ్మణం విదధాతి
యో దేవానాం ప్రథమం పురస్తాత్
విశ్వాధిపో రుద్రో మహర్షిః"- అని వేదం

ఆరీత్యా యీ మొత్తం అంతా కూడా రుద్రుడి సృష్టి. బ్రహ్మ మొదలైన వాళ్ళంతా ఆయన వల్లనే జన్మించారు. ఆయనే అమృత రూపుడు: అచలుడు, ఆదిత్యవర్ణుడు, అంధకారానికి అతీతమైనాడు. ఆ పరమేశ్వరుడి కన్నా పెద్దవాడు గాని, చిన్నవాడు గాని యెవడూలేడు. ఆయనతో సమానమైనవాడు అసలేలేడు. ఈ సర్వేసర్వత్రా ఆయనొక్కడే నిండివున్నాడు. సర్వేంద్రియ గుణావాసుడా, ఈశ్వరుడు. ఆ యీశానుడే సర్వాధికారి. ఆయనకు కళ్ళు వుండవు. కానీ అన్నింటినీ చూస్తాడు. చెవులుండవు కానీ అన్నింటినీ వింటాడు. ఆయనకేదీ తెలుసుకోవలసిన అవసరం లేదు. అయినా అన్నీ తెలుస్తాయి. ఆయన్ని తెలుసుకోవలసిన అవసరం మనకి చాలావుంది. కాని, మనకి యేమీ తెలియదు. జీవులందరి హృదయాంతరాళాల్లోనూ అణువులో అణువూ, మహత్తులో మహత్తుయై వుంటాడాయన. ఆయనకి ఎటువంటి కోరికలుగాని, అవస్థలుగాని వుండనే వుండవు.

శ్లో॥ "అజామేకాం లోహిత కృష్ణశుక్లా " అనే వేదాను సారం వాత్యా సత్త్వరజస్తమో గుణాలనే లోహిత, కృష్ణ వర్ణాత్మకుడైన స్వయం ప్రకాశుడాయన. పదహారు కళలా ప్రపూర్ణుడాయన. ఆయనకొక అవసరంగాని, పనిగాని యేమీ వుండవు. సంజ్ఞలు అంతకంటే వుండవు. మోక్షం కోరుకునే వాళ్ళంతా తప్పనిసరిగా ఆయన్నే ఆశ్రయించాలి.

# కాలమానం

కల, కాష్ఠ, నిమిషం – అనబడే యీ కాప్రమాణాలన్నీ కూడా శివతేజస్సులే; ఆ కాలాన్ని అతి క్రమించిన వాళ్ళే ఆదిపదమయిన మోక్షాన్ని పొందుతారు. అయితే అదేమంత తేలికైన పనికాదు స్వామీ! కలిగినదంతా కాలవశంగానే పరిభ్రమిస్తోంది సృష్టిలో యే వొక్కటీ కూడాకాలానికి అతీతంగా మనలేదు. ఉన్నదంతా కాలానికి ఊడిగం చేయడమేగాని, ఆ కాలమనేది మాత్రం కాస్తంత కూడా దేనికీ కట్టుబడదు. అదొక్క శివుడికే లొంగుతుంది. అందుకే కాలాంతకుడాయన; తక్కిన వాళ్లంతా కాలంముందు తలొంచాల్సిందే.

అందంగాని, ఐశ్వర్యంగాని – అతీంద్రియత గాని, జితేంద్రియతగానీ, – విద్యగాని, అవిద్యగాని – గుణంగాని, నిర్గుణంగాని – కాలాన్ని నిరోధించేదంటూ యేదీ లేదు. అసలా కాలతత్త్వాన్ని కనిపెట్టడమే అసాధ్యం. అది యెప్పుడేం చేస్తుందో, దానికయినా తెలుసో తెలియదో మనకి తెలియదు. ఆపదగానే వస్తుందో, ఆనందంగానే వస్తుందో, కలిమిగా వస్తుందో, బలిమిగా వస్తుందో, యిష్టంగా వస్తుందో, కష్టముగా వస్తుందో, సుఖాన్నే తెస్తుందో, దుఃఖాన్నే తెస్తుందో – దాని యథేచ్ఛావర్తనానికి బెంబేలు పడిపోకుండా బ్రతకగలిగితే, బ్రహ్మజ్ఞానం కలిగినంత అదృష్టమే ననుకోండి.

ఎంత గొప్పవాడు గానివ్వండి, కాలం యెదురు తిరిగిందో ఎందుకూ పనికిరాకుండా పోతాడు - ఎంతటి హీనుడూ, దుర్బలుడూ, దుర్గలుడూ అయినా సరే - ఆకాలం అను కూలించిందో వాడంతటి వాడింకొకడుండడు.

## కాల నియామకం

వాయువు చెప్పంది వింటూనే " ఔనౌను. ఏదో మా కాలం కలిసొచ్చి నువ్వీ విషయాలన్నీ చెబుతున్నావు మరి. కష్టం - అనుకోకపోతే కాస్తంత కాలం ఎలా నియమించబడిందో, ఆయుర్దాయాలెలా నిర్ణయించబడతాయో కూడా చెప్పి పుణ్యం కట్టుకుందూ "అన్నారా జిజ్ఞాసువులు. అందుకున్నాడా అనిలుడు.

కాలమానం అన్నదే ఆయుష్మానంగా కూడా పిలువబడుతోంది. కను రెప్పపాటు కాలాన్ని నిమిషం అంటారు 15 నిమిషాలు ఒక కాష్ఠ. 30 కాష్ఠలు 1 కళ. 30 కళలొక ముహూర్తం. 30 ముహూర్తాలు అహోరాత్రం, లేదా ఒకరోజు. 15 అహోరాత్రాలు 1 పక్షం. పక్షాలు రెండు రకాలు 1. కృష్ణపక్షం, 2. శుక్లపక్షం. ఈ రెండు పక్షాలూ కలిసి 1 నెల. 6 నెలలు 1 అయనం. అయనాలు 2 రకాలు. 1. ఉత్తరాయనం, 2. దక్షిణాయనం. 2. అయనాలూ కలిపి, అంటే 6 నెలలు + 6 నెలలు = మొత్తం 12 నెలలు. 1 మానవ సంవత్సరమైతే దేవతలకి 1 రోజవుతుంది. మన సంవత్సరంలోని ఉత్తరాయనం దేవతలకి పగలు. దక్షిణాయనం రాత్రి. అంటే మనకి 30 సంవత్సరాలయితే, దేవతలకి 30 రోజులు, అనగా నెలలు వాళ్ళకొక నెల. అలాటి 12 కలిస్తే వాళ్ళకొక సంవత్సరం. ఆ దేవతల సంవత్సరాన్నే దివ్య సంవత్సరం అంటారు.

ఆ లెక్కలతోనే యుగ విభజన జరిగింది. యుగాలు 4. వీటిల్లో మొదటిది కృతయుగం. దీని పరిమితి 4 వేల దివ్య వర్షాలు. సంధ్యాకాలం ఒక్కంటికి 400 దివ్య వర్షాలు. చొప్పున, పూర్వోత్తర యుగాలు రెంటికీ కలిపి మొత్తం సంధ్యాంశ 80 సం॥లు అంటే–4 వేలు + 800 + 4,800 దివ్యవర్షాలు కృతయుగం యొక్క పూర్తి నిడివి. అదే మన మానవ సంవత్సరాల లెక్క ప్రకారం చూస్తే 17 లక్షల 28 వేల సంవత్సరాలు 1 కృతయుగం.

కృతం తరువాతది త్రేతాయుగం. దైవ సంవత్సరాలరీత్యా 3,600 సంవత్సరాలుండే యుగం, మన లెక్కలరీత్యా 12,96,000 వర్షాలుంటుంది. సంఖ్య మూడోది ద్వాపరయుగం. దీని 2,400 దివ్య వర్షాలు. మన గణనానికి 8,64,000 సంవత్సరాలు, కడది కలియుగం – 12,00 దివ్య వర్షాలూ, లేదా 43,20,000 మానవ సంవత్సరాలు.

ఆ నాలుగు యుగాలకీ కలిపి చతుర్యుగం, లేదా, మహాయుగం అంటారు. చిటమంత ఉంటాయి. ఉదా:– అలాటి మహాయుగాలు 71 నడిస్తే ఒక మన్వంతరమవుతుంది. ఇలాంటి మన్వంతరాలు 14 గడిస్తే 1 కల్పం అవుతుంది. 1000 కల్పాలు బ్రహ్మకొక సంవత్సరం. ఆ బ్రహ్మ సంవత్సరాలు 8 వేలు కలిసి ఒక బ్రహ్మయుగం. వెయ్యి బ్రహ్మ యుగాలు (8 వేలు కలిసి ఒక బ్రహ్మసవనం) వెయ్యి బ్రహ్మసవనాలు బ్రహ్మకు జీవితకాలం. అలాటి బ్రహ్మగారి ఆయుర్దాయమంతా ప్రోగుచేస్తే విష్ణుమూర్తికి ఒక రోజు. పైవేల గణన రీత్యాన్నే గుణించగా గుణించగా విష్ణువుగారి ఆయుర్దాయం – రుద్రుడికొకరోజు. రుద్రాయుర్దాయం మహేశ్వరుడి కొకరోజు. మహేశ్వరాయువు మొత్తం సదాశివుడికొకరోజు. ఇలా లెక్కలు కట్టుకుంటూ పోగా పోగా కారకుడైన పంచముఖేశ్వరుడి దగ్గరకు వెళ్ళే సరికి కాలమూ వుండదు, గణనమూ వుండదు. అసలూ కాలాన్ని కల్పించేదే ఆయన కదా!

సృష్టి వున్నంత కాలమూ ఆయనకొక పగలు. సృష్టి లేనంత కాలమూ ఆయనకొక రాత్రి నిజానికాయన కిలా రాత్రీ పగలూ అంటూ యేమీ లేవు లేవండోయ్! ఊరికే మీకు అర్థంగావడం కోసం అలా అన్నానంతే.

## బ్రహ్మ వగైరాలు

ఈ బ్రహ్మాదులందర్నీ ఆ భగవంతుడే సృష్టించాడు. వాళ్లలో బ్రహ్మకి మనందర్నీ సృష్టించే పని నప్పగించాడు. శివానుగ్రహంతో బ్రహ్మ - మున్ముందుగా మనోసృష్టిని చేశాడు. కాని, అది వ్యాప్తంకాకపోవడం వల్ల, పురుషుడికి ఏదయినా తోడుని కల్పించి సృష్టిని జరిపించాలనుకున్నాడు. అందుకోసంగాను - పురుషేతరమైన మానవ రూపం కోసం మథన పడ్డాడు. ఊహు... ఏమీ తట్టలేదు. మరోదారి లేక శివుడి కోసం తపించాడు. మనసుకు తోచాడా మహాత్ముడు. బ్రహ్మ ఆయనను ప్రార్థించి - తన యిబ్బందిని వివరించమన్నాడు. పురుషుడికి ఆధారభూతమయ్యేలాటి పురుషేతరత్వాన్ని తెలియజెప్పమన్నాడు. కరుణాంతరంగుడయిన శివుడు తక్షణమే తన నుంచి శక్తిని ఆవిష్కరించాడు. అంతటితో బ్రహ్మకళ్ళు తెరుచుకున్నాయి.

కళ్ళముందర మహా మాయా సమాయుక్త మయిన కంఠేకాల దర్శనంతో మానవుడికి తోడుగా మానవిస్ఫురించిందా మేధావికి. తామరచూలి తలపుకు తట్టిన ఆ పురుషేతర మానవ రూపమే - స్త్రీ.

సంతుష్టుడయిన చతుర్ముఖుడు స్త్రీని కల్పించి పురుషుడితో సంధానింపచేశాడు. పురుషుడు ఆధానం చేశాడు. అంతటితో అన్నాళ్ళుగా సాగుతువస్తున్న మనో సృష్టి కాస్త మైథున సృష్టిగా పరిణితి చెందినది. క్రమక్రమేణా ప్రాచుర్యంలోకి రావడంతో - తదతీతమైన మనోసృష్టి దాదాపుగా అవతరించి పోయిందనే చెప్పు కోవాలి. ఆ మీదట స్త్రీ పురుషుల పరసల్లాపాలతో సృష్టి సమస్తం తీవలు సాగింది.

# రసమూర్తుల రగడ

అసలు మానవులూ - దేవతలూననే కాదర్రా, పార్వతీ పరమేశ్వరులయినా అంతే. ఆ మైథునంలోని మాధుర్యమే అంతటిది మరి! అయితే - యీ ఆడా మగా సరసం ఒక్కొక్కసారి అరసంగానో విరసంగానో పరిణమించే ప్రమాదముంది కూడా. స్త్రీ పురుషులిద్దరూ రసహృదయులూ - పరస్పర మనస్కులూ అయితే తప్ప - అరసాలూ విరసాలూ అసలు జీవితానికీ - జగత్తుకీ కలిపి మరీ ఎసరు పెట్టేస్తుంటాయి. ఒక కథ చెబుతాను వినండి

పార్వతిని, పరమేశ్వరుడు తరచూ - కాళీ - కాళీ (నల్లదానా, నల్లపిల్లా, నలుపూ) అని పిలిచేవాడు. ఏకాంతంలో అన్నాడూ అంటే, అదేదో ఆలూమగల సరదాయే! కాని అన్నిచోట్లా, అందరి ముందరాకూడా అదే పిలుపయితే ఆవిడ మాత్రం మనసు నొచ్చుకోదా? నొచ్చుకుంది. చివరికొక రోజున శివుడితో చెప్పేసింది.

"అస్తమానం, అందర్లోనూ అలా నల్లా - నల్ల పిల్లా అని పిల్చి, నన్నెందుకిలా యేడ్పించడం? నా వొంటి రంగు మీకు నచ్చకపోతే నచ్చక పోవచ్చును గాక - అది పెళ్ళాడ్డానికి ముందే చూసుకోవాలి. అప్పుడేమో అతి ఉదారంగా పెళ్ళాడేసి యిప్పుడిలా డిల్ల చేస్తే, నా మనః స్థితి ఎలావుంటుంది? గడియకోసారి కాళీ (నల్లా), కజ్జాలా (కాటికా), శ్యామా (నీలం పిల్లా), తమసా (చీకటి) అని పిలుస్తూంటే నా గుండె గుబులైపోదా? పోనీ, అవన్నీ ఎందుకు లెండి? భర్తకి తృప్తికలిగించనిదీ, ఆయన్ని సంతోషపెట్టనిదీ ఆయన పెళ్ళాంకన్న మట్టిముద్ద నయం. అందుచేత, నేను మీకు ఆనందాన్ని కలిగించడానికే నిశ్చయించుకున్నాను. పెనిమిటి కాబట్టీ పెద్దలు కాబట్టీ, మునుముందుగామీరనుమతి నిస్తే, వెళ్ళి తపస్సు చేసు

కుంటాను. నా వంటికి పట్టిన యీ కారు నలుపురంగని కడిగేసుకుని. కనకమయప్రభలనీనే గౌరవర్ణముతో మళ్లోస్తా " అంది.

శివుడు కంగారు పడ్డాడు. "వద్దువద్దని అభ్యంతర పెట్టాడు. ఈ వర్ణమాత్రానికి తపస్సెందుకు నీక్కావాలంటే ఆ రంగుని నీకు నేనే అనుగ్రహిస్తాను. అయినా సృష్టిలో అందరూ నా గురించే తపస్సు చేస్తూంటే, నువ్వు వేరే యెవరికోసం జపం చేస్తావు?" అని అడిగాడు.

"బ్రహ్మ కోసం తపిస్తాను. భర్తగారి ముచ్చట కోసం బ్రహ్మకోసం తపించి, బంగారు రంగుని సాధించమని భావికాలంలో భార్యలకు ఆదర్శప్రాయ మవుతాను. ముందు మీరొప్పుకోండి చెబుతాను." అంటూ పరమశివుడి పాదాలంటింది. దీవించి పంపాడు శివుడు.

## కాళి తపస్సు - పులి సేవలు

కైలాసం దిగువ కారడవి చేరింది కాళి. "పరబ్రహ్మమయిన పరముడు నా మేనికి మేలిమి బంగారు ఛాయనిచ్చును గాక" అని సంకల్పించింది. ప్రతినిత్యం పార్థివ లింగార్చన చేయసాగింది. భవుడికి చెప్పినట్లుగానే - బ్రహ్మగురించి తపస్సాచరించడం మొదలపెట్టింది.

ఆ అడవిలోనే అతిక్రూరమైన పులి ఒకటుంది. ఒక రోజున దానికి వేట దొరకలేదు. ఆకలికడుపుతో అమురావురువమంటూ, డొక్కలెగరేసుకుంటూ ఆహారాన్వేషణలో కాళి యొక్క తపో ఆశ్రమాన్ని చేరింది. అమ్మవారిని చూసింది. "అమ్మయ్యా! భోజనం దొరికింది " అని సంతోషించింది. అమ్మవారిని చంపుకు తినాలనుకుంది. ఆవిడమీదకి ఒక్క దూకు దూకింది. కాని ఆమె అందలేదు. పులి మళ్ళా యెగిరింది. అయినా అమ్మవారందలేదు. చాటునుంచి మీద పడబోయింది. కాళిని స్పృశించడం కూడా దానివల్ల కావడంలేదు. అమ్మవారికిదంతా వినోదంగా వుంది.

ఆ పులి యెవరో యేమిటో? ఒంటరిగా తపస్సు చేసుకుంటూన్న తనని ధ్యానానంతర వేళల్లో వినోద పరచడానికే వచ్చినట్టుగా అనిపించింది. అంతటితో ఆవిడ కాపులిమీద దయ కలిగింది. అమ్మదయవుంటే అన్నీ ఉన్నట్లే కదా! అలాగే ఒక కరుణా పూరితమైన చూపు చూసింది కాళి. ఆ చూపు సోకిందే తడవుగా ఆపులికి ఆకలి తీరిపోయింది. క్రూరత్వం కూలిపోయింది. సాధుత్వం సంక్రమించేసింది. అంతటితో ఆ పులి అక్కడే వుండిపోయి అమ్మకీ, ఆశ్రమానికీ కాపలా కాయసాగింది. ప్రత్యేకించి ధ్యానాంతర సమయాలలో కాళికి యెక్కడలేని వినోదాన్నీకలిగిస్తుండేది.

పార్వతి చేసే పార్థివలింగార్చననీ, పటిష్ఠమైన తపస్సునీ – తదేకంగా చూస్తుండి పోయేదా పుండరీకం. అమ్మవారి నుపాసిస్తూన్నట్లుగా వుండేది.

## కాళి - గౌరి - కౌశికి

ఆ రోజుల్లోనే శుంభ నిశుంభులనే రాక్షస సోదరుల అఘాయిత్యాలు విపరీతం కాజొచ్చినవి. ఆ బాధలు పడలేని దేవతలు బ్రహ్మను ప్రార్థించారు. బ్రహ్మ ఆలోచించాడు. ఏమీ తోచిందికాదు. సర్వుడైన శర్వుడేమో కొండమీద నున్నాడు. శివాభిన్నయైన శక్తి చూస్తే కోనలో వుంది. మరింత ఆలోచించగానే మార్గం తట్టింది. తక్షణమే – తల్లి యెదుట ప్రత్యక్షమయ్యాడు.

“అమ్మా! అందరికీ అన్ని వరాలనీ యిచ్చే చల్లని తల్లివి నువ్వు, మాతో పనిపడితే – చిన్న కబురు పెడితే – మేమేమే పరిగెడుతూ వస్తాం కదా నీ సన్నిధికి! అలాంటిది మా గురించి నువ్వు తపస్సు చెయ్యడమేమిటమ్మా?” అని, ఆమెను శ్లాఘించి, నమస్కరించి “ఆజ్ఞాపించుతల్లీ” అంటూ దోసిలి బట్టి నిలిచాడా తోయజసూతి.

మనసులో మాట చెప్పింది మహామాత. మందహాసం చేశాడా బృందారకాద్యుడు. "నీ మనసు తీరుతుంది తల్లీ! కాని , నీవు విసర్జించబోయే కాళీ వర్ణాన్నీ మాత్రం వృధాపోనియ్యకు. శుంభ నిశుంభుల పీడ పడలేకపోతున్నాం. మహాశక్తివైన నువ్వు తప్ప, మరొకళ్ళు వాళ్ళకి నువ్వులూ నీళ్ళూ వదిలించలేరు. అందుచేత, నీ కాళీత్వాన్ని దేవతారక్షణార్థం, రాక్షస సంహారార్థం అనుగ్రహించి, నువ్వు గౌరివై శివరమణార్థం కైలాసం వెళ్లు అన్నాడు.

"సరే నంది" సతి. అనడమే ఆలస్యంగా అమ్మవారి నుంచి నల్లనల్లని కాళీత్వం కన్యకగా బయటకొచ్చింది. ఆ కన్యకి బ్రహ్మ "కౌశికి" అని పేరు పెట్టాడు. సింహాన్ని వాహనంగా అమరించాడు. వింధ్యాచలం మీద నివసించమన్నాడు. మధుమాంసాదులన్నీ అమ్మవారికి వలె యేర్పాటు చేశాడు. ఆమె వింధ్య పర్వతాన్ని చేరి అక్కడ శుంభ నిశుంభుల్ని వధించడం వేరే కథ.

ఇక కాళీత్వం కన్యకా రూపంలో వింధ్యకి వెళ్ళిపోవడముతో - అమ్మవారు స్వచ్ఛ గౌరవర్ణంతో భాసించింది. కైలాసానికి బయలుదేరింది. వెడుతూ వెడుతూ, అన్నాళ్ళూ తననే నమ్ముకుని వున్న పులిని కూడా తనతో తీసుకు వెళ్ళింది.

## సోమనంది

నల్లగా కొండదిగి వెళ్ళిన తల్లి, పచ్చటి బంగారపు రంగులో కొండెక్కి వస్తూంటే గిరిజనులందరికీ కళ్ళు గిర్రున తిరిగాయి. ప్రమథులంతా తెల్లబోయారు. తల్లేనని తెలుసుకున్నాక చాలా ఆనందించారు.

అమ్మవారు సరాసరి అయ్యవారి యేకాంత మందిరం చేరారు. ఆమెను

చూసి శివుడు ఎంతో సంబరపడ్డాడు. ఆమె నెత్తుకొని గిరగిర త్రిప్పాడు. ముద్దుల వర్షం కురిపించాడు. అనంతరం ఆ దంపతులు కథా కమామీషూ మాట్లాడుకున్నారు. గౌరి, పులిని ప్రవేశపెట్టి దాని సేవలు వివరించింది. "ప్రాణేశ్వరా! మీ మందిరాలకి నందిలాగనే, నా మందిరానికీ పులి అనుగ్రహించరూ?" అంది గోముగా "సరే" నన్నాడు. గోగంధర్వుడు. ఆ పులి కేసి ఒక్క చూపు చూశాడు. తక్షణమే ఆ పులి పుత్తడి బొమ్మలాటి పడతిగా మారిపోయింది. వరవేత్రహస్తగా, చిత్రవర్ణ కవచగా పరిణమించిన ఆ వ్యాఘ్ర సుందరికి సోమనంది అని నామకరణం చేశారు. శివపార్వతులు. అని ఆపాడు వాయుదేవుడు.

ఆ కథనింత విన్నాక – "అనిలదేవా! అష్టాంగ యోగాల గురించి కూడా తెలియజేయు" మని మునులు కోరడంతో – మళ్లా చెప్ప ప్రారభించాడు భగవాన్ మరుత్.

# అష్టాంగ యోగం

పవనోవాచ:– తన భక్తులనను గ్రహించే నిమిత్తంగా ఆ శివుడే యోగాన్ని రచించాడు. ఎనిమిది అంగాలతో కూడుకున్నది కావడం వల్ల ఆ యోగానికి "అష్టాంగ యోగ" మనే పేరొచ్చింది. వివరాలు చెబుతాను వినండి.

1. యమము:– అంటే సర్వేంద్రియాలనీ నిగ్రహించడం, లౌకిక వాంఛాయుతాలైన ఇంద్రియాలని ఆయా కర్మల నుంచి విరమింపచెయ్యడం.

2. నియమము :– అంటే వేదోక్తమైన కట్టుబాటనీ, క్రమశిక్షణనీ పాటించడం.

3. ఆసనము:– పద్మాసనం మొదలైన వివిధ ఆసనాలతో అనువైన వాటిని అభ్యసించి, వాటిని సుఖమయం చేసుకుని ఆచరించడం.

4. ప్రాణాయామం:– అంటే వాయువును నిరోధించడం పీల్చే శ్వాసనూ అరికట్టడం.

5. ప్రత్యాహారం:- విషయ వాంఛలలో విహరించే అవయావల్నా, వైదిక కర్మలవైపూ - తత్త్వం వైపూ మళ్ళించడము.

6. ధారణ:- సర్వదా భగవద్విషయాన్నే ధరించి, తదితరానికి దూరంగా వుండడం.

7. ధ్యానం:- ఏకాగ్ర మనస్కంగా భగవద్విషయాన్నే చింతన చేయడం.

8. సమాధి:- ఆ చింతనా, యేకాగ్రతల్ని స్వేచ్ఛగా వదిలేస్తూనే, కాల పరిమితికి పెంచుకుంటూ వెళ్ళడం దాని కదిగా నిలవరించబడినప్పుడు తప్ప, మరెప్పుడూ - మరే కారణం చేత కూడా లైకికానికి మళ్ళక పోవడం.

ఈ యెనిమిది రంగాలతోనూ సాధన చేయబడే యోగం వల్ల శివభక్తి వృద్ధి అవుతంది. శివానుగ్రహం చేరువవుతంది. ఒక వేళ ఉపరి సాధనకు ఆశక్తులయితే మాత్రం శివనామాష్టకాన్ని నిత్యం జపించడం వల్ల కూడా భక్తి, జ్ఞాన, వైరాగ్యాది సత్సంపన్నత కలిగి శివానుగ్రహ పాత్రులు కావచ్చును.

# శివనామాష్టకం

శివుని యొక్క యెనిమిది పేర్లూ యివి-

1. శివాయ నమః 2. మహేశ్వరాయనమః 3. రుద్రాయ నమః 4. విష్ణవే నమః 5. పితామహాయ నమః 6. సంసార భిషజే నమః 7. సర్వజ్ఞాయ నమః 8. పరమాత్మ్యాయనమః

ఈ నామాష్టకం మల్లేనే, శివారాధనాదులైనా చేయలేని వారి నిమిత్తం మానసిక పూజ చెప్పబడింది. మానస పూజలో శివపరంగా యెనిమిది పువ్వులతో పూజ చేయాలి. అంటే మన మనస్సులో ఆ యెనిమిది పువ్వుల్నీ ఆయనకి సమర్పిస్తున్నట్లుగా స్మరించుకోవాలి.

# శ్రీ శివ మానస పూజా పుష్పాష్టకం

శ్లో॥ "అహింసా ప్రథమం పుష్పమింద్రియ నిగ్రహం
సర్వభూత దయా పుష్పం క్షమా పుష్పం విశేషతః
శాంతి పుష్పం, తపః పుష్పం, ధ్యాన పుష్పంతథైవచ
సత్యపుష్పం విధిం పుష్పం శివప్రీతికరం భవేత్."

అంటే – "ఓ శివుడా! నా యందలి అహింస, ఇంద్రియ నిగ్రహం, ప్రాణికోటి పట్ల దయ, కష్టాలలో ఓర్పు, ఇతరులు నన్ను కోపించినా నేను మాత్రం వహించిన శాంతీ, నా తపస్సు, నీయందలి చింతన, తెలిసో తెలియకో నేను పలికిన – ఎఱిగిన నిజాలూ – అనే యీ యెనిమిదీయే యెనిమిది పువ్వులుగా – విధి విధానంగా నిన్ను పూజిస్తున్నాను. నీకివి నచ్చును గాక. నీకు నేను నచ్చుదును గాక!" అని అర్థం. అని ఆగాడు వాయువు.

చెప్పినది విని, ఆశ్చర్యపోతూనే – "అయ్యయ్యో! ఇవన్నీ మాకు యథార్థంగా తెలియవు సుమా! – ఏదీ శివప్రీతికరమైన పూజలూ వ్రతాలూ యింకాయేమన్నా వుంటే చెప్పు ఇన్నాళ్లా వాయుదేవుడి వంటే – ప్రాణ స్వరూపుడివనే ననుకునేవాళ్ళం. నువ్వెంత జ్ఞాన స్వరూపిడివో యిప్పుడిప్పుడే తెలుస్తోంది బాబ్బాబూ! ఆ శివారాధనా విషయాలు మరిన్ని మా చెవినేద్దూ" అని కోరారు ఋషులు, మంద మంద హసనాలతో పలకసాగాడు పవనుడు.

# పార్థివలింగం – పాశుపతం

శివపూజ లన్నింటిలో పార్థివలింగ పూజే పరమ శ్రేష్ఠమైనది. అర్చనలలో

ఇందెంత ముఖ్యమైనదో, వ్రతాన్ని చేపట్టిన సాధకులు – చైత్రమాసంలో పార్థివలింగాన్ని, వైశాఖంలో వజ్రలింగాన్ని, జ్యేష్ఠంలో మరకత లింగానీ, ఆషాఢంలో మౌక్తిక (ముత్యపు) లింగాన్ని, శ్రావణంలో ఇంద్రనీల లింగాల్నీ, భాద్రపదంలో పద్మరాగ లింగాన్నీ, ఆశ్వీయుజంలో గోమేధిక లింగాన్నీ కార్తీకంలో విద్రుమ (పగడపు లింగాన్నీ, మార్గశిరంలో వైడూర్యలింగాన్నీ, పుష్యంలో గరుడపక్షి లింగాన్నీ, మాఘంలో సూర్యకాంత లింగాన్నీ, ఫాల్గుణంలో చంద్రకాంత లింగాన్నీ అర్చించాలి.

పైన చెప్పిన రత్నాలు లభ్యం కానప్పుడు, 12 నెలలలో కూడా బంగారపు లింగాలెన్నో, వెండి లింగాలెన్నో పూజించుకో వచ్చును. అశక్తులయితే రాగి లింగాల్నో, అందుకూ తాహతులేని వాళ్ల ఇత్తి లింగాలనీ, అపాటి స్తోమతుకూడా కరువైనవాళ్ల మట్టి లింగాల్నయినా సరే ఆరాధించుకోవచ్చును. సుగంధ ద్రవ్యాలతో చేసిన లింగారాధనం కూడా ఆచారంలో వుంది.

అలాగాని చెప్పాంకదాని యిదే వరసలో పూజించడమూ పొరబాటే, వర్ణాశ్రమ ధర్మ రీత్యానూ, అయా కుటుంబపు టాచారాల రీత్యానూ, వారివారి వేద శాఖల రీత్యానూ – ఏ ఏ లింగాల్ని పూజించడం ఆనవాయితీయో సాంప్రదాయాలో వాటినే పూజించాలి. అలా చేయడం వల్ల ఎంతో సత్ఫలితాన్ని సాధించు కోవచ్చును. గతంలో ధౌమ్య సోదరుడైన ఉపమన్యుడీపాశుపత వ్రతం చేసే పాపాలన్నీ పోగొట్టుకున్నాడు. ఆ కథ చెబుతా నాలకించండి.

## ఉపమన్యోపాఖ్యానం

ఉపమన్యుడు మరీ పసివాడిగా వుండగానే, వాళ్ళ నాన్న వ్యాఘ్రపాదుడు కాలం చేయడం వలన, అతనూ, అతని తల్లీ మేనమామల

యిళ్ళని ఆశ్రయించాడు. మేనమామల పిల్లలంతా సమృద్ధిగా పాలూ వగయిరా ఆహారాలు స్వీకరిస్తూ యేపుగా ఎదుగుతుండేవారు. ఉపమన్యుడూ అతని తల్లీ – వాళ్ళకి బంధువులే అయినా, అనాథలు కావడము వల్లా తగినంత ఆదరాన్ని చూపించేవాళ్ళు కాదు ఉపమన్యుడు చూస్తే పసివాడు. పాలంటే పడిచచ్చే వయసతనిది. అతనికి తగినన్ని పాలందకపోవడంతో తల్లిమీద ఒత్తిడి తెచ్చాడు. ఆమె దగ్గర పాలేనాడో యిరిగిపోయాయి. కావల్సినన్ని కన్నీళ్ళు మాత్రమే వున్నాయి. పిల్లాడి బాధచూడలేక తన కన్నీళ్ళతోనే కాసింత పేలపిండి వేసి కలిపి అవే పాలని యిచ్చింది. ఒక గ్రుక్క తాగగానే అవి పాలుకావని తెలుసుకున్నాడు ఉపమన్యుడు. అంతటితో వాటిని తిరస్కరించాడు. గతిమాలిన ఆ తల్లి కొడుకును ఒడిచేర్చి లాలించి తమ పరిస్థితి నంతటినీ వివరించింది. అర్థం చేసుకున్నాడతను. "అయితే నన్ను దీవించి పంపించు. ఈశ్వరుడి కోసం తపస్సు చేసి పాలసముద్రం తెచ్చుకుంటాన్నేను" అన్నాడు. అంగీకరించింది తల్లి. శివ పంచాక్షరి నుపదేశించింది. ఒరే చంటి! మన శైవులకీ పంచాక్షరే మహాయుద్ధం జపించి సిద్ధి పొందు. దీన్నే అఘోరాస్త్రం అంటారు. ఎంత ఘోరమైన ఆపదయినా తప్పిస్తుందీ మంత్రం అని చెప్పింది. తన భర్త ద్వారా తనకు సంక్రమించి, జాగ్రత్త పరచబడివున్నవి. విరజాభస్మాన్ని కూడా అతనికిచ్చింది. తపస్సుకీ అనుమతించింది. ఆశీర్వదించింది.

అడవులు బడిపోయాడా అర్భకుడు. ఒక దట్టమైన అడవిలో కెళ్ళి పాశుపత వ్రతం బట్టి జయప్రదంగా ముగించిజపం మొదలెట్టాడు. జపం ధ్యానమయ్యింది. ధ్యానం తపస్సయ్యింది. అది చూసి ఆ అడవిలో వున్న శప్తరాక్షసమూక విఘ్నాలు కల్పించబోయింది. అయినా చలించలేదా కుర్రాడు. అతనిని ఓడించలేకపోవడంతో ఆ రాకాసి గుంపు అతగాడి కింకరులుగా మారిపోయారు.

ఉపమన్యుడి తపస్సు ఊపునందుకుంది. ఆ వేడిమికి స్వర్గంలో వున్న దేవతలకి అరికాళ్ళ చుర్రుమన్నాయి. విష్ణువును ముందుంచుకుని, విరూపాక్షుడికి శరణిచ్చి నువ్వెళ్ళిఉపమన్యుడి తపసు ఊపు నందుకుంది. ఆ వేడిమికి స్వర్గంలో వున్న ఆ కుర్రవాడికి కనబడు. ఏ వరం కావాలో యిచ్చెయ్యి. అతన్ని తపస్సాపించు మేం తప్తమైపోకుండా రక్షించు" అని ప్రార్థించారు. 'సరే' నన్నాడు శంభుడు అయినా ఉపమన్యుణ్ణి పరీక్షింపదలిచి – యీశ్వరుడు కాస్తా ఇంద్రుని వేషములో వెళ్ళి ఏం వరం కావాలో కోరుకో మన్నాడు.

"శివుడి కోసం నేను తపిస్తుంటే తమరొచ్చారేమిటి దేవరాయా! మీ వరాలు నాకేమీ అక్కర్లేదు. మీనాంకవైరి రావాలి. నా మనోగతం యీడేరాలి. తమరు దయ చేయండి" అన్నాడుపమన్యుడు.

ఇంద్రవేషంలో వున్న యీశ్వరుడు అతని నిష్ఠకుమెచ్చుకుని సాంబశివుడై సాక్షాత్కరించాడు. అబ్బుర పడ్డాడాబిడ్డ, ఆనందించాడా అర్భకుడు. అతని ఆనందానికి పరాకాష్ఠగా శరీరం గగుర్పొడిచింది. రోమాలు నిక్కబోడిచాయి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. నోటిమాట పెగిలింది కాదు. మహారసజ్ఞుడా మందాకినీధరుడు. ఉపమన్యు డడగకుండానే, అతనికి పాలసముద్రంలో పాలు– పెరుగు సముద్రాన్నీ కూడా దత్తత చేసేశాడు. గణాధిపత్యాన్ని యిచ్చాడు. ముద్దు పెట్టుకున్నాడు. 'నువ్వు నా బిడ్డవిదా' అన్నాడు. "అయితే నాకు మాత్రం బిడ్డకాడా యేమిటి?" అంటూ అమ్మవారాకుర్రాణ్ణి తన తొడమీద ముద్దాడింది. కుమారస్వామి కెలాగారం చేస్తుందో, అలా గారం చేసింది. అమ్మవార్ని అంకం చేరాక, ఇక చెప్పేదేముంది? ఉపమన్యుడికి నిత్య కుమారత్వం దానికదే సిద్ధించింది.

ఇలా వాయువు చెప్పింది విని మరి, "ఉపమన్యుడు కృష్ణుడికి శివభక్తి

గురించి చెప్పాడంటారుకదా! అదేమిటి?' అని అడిగారు తాపసులు. మంచిమాటడిగారు వినండి అని ఎత్తుకున్నాడు వాయు దేవుడు.

# కృష్ణోపమన్య సమాగమం

తపస్సు, శివుడు వరాలివ్వడం వగయిరాలన్నీ పూర్తయిన తర్వాత, ఉపమన్యుడు హిమాలయ ప్రాంతాలకి వెళ్ళి, అక్కడే వుండసాగాడు. అలా వుండగా సంతానం కోసం శివుడి గురించి తపస్సు చేయాలనే ఉద్దేశ్యంలో కృష్ణుడు హిమాలయాల దగ్గరికి వచ్చాడు. ఉపమన్యుడిని కలిశాడు. "ఉపమన్యా! నేను సంతానం కోసం పినాకపాణి గురించి తపస్సు చెయ్యాలని వచ్చాను అగ్రశేణి ఉగ్రభక్తుడివి నువ్వు. నాకు శైవాన్నిచ్చి - తపో విధానం తెలియజెయ్యి" అని కోరాడు కృష్ణుడు. ఆమీదట ఉపమన్యుడిలా ఉపదేశించ సాగాడు.

# త్రివిధ భక్తి

1. బాహ్య భక్తి :- ఇది కాస్తంత మందకొడిగా ఫలిస్తుంది. అంటే, వేషభాషాదిగా ప్రారంభమై దైవీయ విశ్వాసము కలిగి క్రమశఃపురాకృత సుకృద్వరాన రెండవ రకం భక్తిగా మారుతుంది.

2. అనన్యభక్తి:- ఈ భక్తిలో దైవీయారాధన ఏకైక దైవపరంగా సాగుతుంది. బాహ్యాడంబర రహితంగానే చింతన ధ్యానాదులు సాగుతాయి. తొలి తరహా భక్తిలోంచి జరుగుతుంది. ఇది కాస్త చురుగ్గా ఫలిస్తుంది.

3. ఏకాంత భక్తి:- ఇది ఎంత వేగవంతమైనదో, దీనిని వంటపట్టించుకోరు. అంతకంతా మందకొడిగా సాగే వ్యవహారం. అనన్య భక్తిలోంచి యీ యేకాంత భక్తి కలవరచుకోవచ్చు. లేదా, పూర్వపుణ్యంవల్ల

పుడుతూనే యేకాంత భక్తులూ కావచ్చును. ఈ భక్తిలో ప్రత్యేకతేమిటంటే మనో చిత్త బుద్ధ్యహంకారాదులన్నీ ఆ దైవమందే లగ్నమయి వుంటాయి. మాటలు కాదుగదా అది! మంద, మాధ్యము, వేగాలలో బేధమే తప్ప - భక్తి అనేది ఏ తరహాదయినా సరే క్రమ క్రమేణా ఫలించి తీరుతుంది.

## త్రివిధ జపం

1. వాచక జపం:- ఉదాత్తాను దాత్త స్వరాలతో చుట్టూ వున్న వాళ్ళకి వినబడేలా చేసేది వాచక జపం.

2. ఉపాంశు జపం :- పెదాలు మొత్తం కదుపుతూ శబ్దం యెవరికీ వినబడకండా చేసేది ఉపాంశు జపం.

3. మానస జపం:- ఎవరికీ యేమీ వినబడదు పెదవులూ కదలవు. అసలు మనం జపం చేస్తున్నట్లే యెవళ్ళకీ తెలియదు. కాని, మనోగతంగా జపం చేస్తూనే వుంటాం. దానినే మానస జపం మధ్యం.

వీటిల్లో మానసం ఉత్తమం. ఉపాంశు మధ్యం. వాచకం సామాన్యం, ఇవేగాక - ఈ జపాలే అగర్భ జపం సగర్భ జపం అని రెండు రకాలు.

1. అగర్భ జపం:- ఒకసారి ప్రాణాయామం చేసి, తదుపరి జపం చేసి, చివర్లో మళ్ళా ప్రాణాయామం చేయడం అగర్భ జపం.

2. సగర్భ జపం:- ప్రాణాయామంలో వుంటూనే 40 పర్యాయాలు జపం చేయడం ఈ రెండింటిలో అగర్భం ఉత్తమం, సగర్భం ఉత్తమోత్తమం, సగర్భమైన మానస జపం ఉత్తమోత్తమం.

## జపవిధి

వ్రేళ్ళమీద కన్నా, వ్రేళ్ళమీదుండే రేఖల (కణువుల) మీద జపం చెయ్యడం వలన 8 రెట్లు ఎక్కువ ఫలం కలుగుతుంది. పుత్ర బాలీ బీజాలతో

జపిస్తే 10 రెట్లు ఫలితం ప్రాప్తిస్తుంది. అంతకన్నా శంఖమణులు, వాటికన్నా పగడాలు, వీటికన్నా స్పటికాలు, వాటిని మించి ముత్యాలు, అంతకంటే పద్మ బీజలూ, అధికాధిక ఫలప్రదాలు, బంగారు జపమాల వలన బంగారమంత ఫలమనుకో, ఇక, కువ గ్రంథులూ - రుద్రాక్షలూ నంటావా - అబ్బో - వాటితో జపంచేస్తే కలిగే ఫలాన్ని మనం కాదుగదా ఆమహేశ్వరుడు కూడా చెప్పగలడో లేదో.

# జపమాల

30 రుద్రాక్షల జపమాలతో జపిస్తే ధనప్రాప్తి కలుగుతుంది. 27 రుద్రాక్షల మాలీజపం పుష్టికలిగిస్తుంది. 25 రుద్రాక్షల మాలముక్తి హేతువు. 15 రుద్రాక్షల హారముతో చేసేది అభిషేకంలో బాగా పనికి వస్తుంది. 54 రుద్రాక్షల మాల హృదయానికి మంచింది.108 రుద్రాక్షల మాల సర్వ శ్రేష్ఠం

బొటనవ్రేలితో జపిస్తే మోక్షం వస్తుంది. చూపుడు వ్రేలితో జపిస్తే శత్రు నాశనం - శాంతీ సిద్ధిస్థాయి. చిటికెన వ్రేలిమీద జపం సర్వదా శుభం కలిగిస్తోంది.

# జపస్థలి

ఇంట్లో చేసే జపం కన్న, ఆవుల కొట్టంలో చేసే జపమూ, అంతకన్నా అరణ్యాల్లో చేసేదీ, దానికన్నా దేవాలయాల్లో జరిపేదీ ఒక దానికన్నా ఒకటి గొప్పవి. వీటికన్నా కూడా పర్వతాలమీదా, పుణ్య నదీతీరాల్లోనూ, గురు బ్రాహ్మణాగ్ని గోసన్నిధుల్లోనూ చేసేవి క్రమ క్రమోన్నతాలైనవి.

# జపదశ

అభిచారాదులకి దక్షిణాభిముఖంగా జపించాలి. ధనార్థులు పడమర వైపు ముఖం పెట్టుకుని చెయ్యాలి. శాంతి కాములూ, ముముక్షువులూ, నిష్కాములూ ఉత్తరాభి ముఖంగా జపించుకోవాలి. వాంఛాసిద్ధి, మోహన వశ్యాకర్షణాదులు, లౌకిక జీవితావసర విజయాదులకీ తూర్పు ముఖంగా జపం చేసుకోవాలి.

# జపస్థితి

మొలకి పైభాగంలో యజ్ఞోపవీత తప్ప, మరో నూలుపోగంటూ వుండడానికి వీల్లేదు. పైన కండువా వేసుకునో, అంగీ తొడుక్కునో, గొంతుకి గుడ్డ చుట్టుకునో, తలకి పాగా చుట్టుకునో జపం చెయ్యకూడదు. జపం చేసేటప్పుడు కామ క్రోదాది వికార రహితంగా వుండాలి. స్నానము చెయ్యకుండానో, చేసినా అపవిత్రంగా వున్నప్పుడో జపం పనికి రాదు. తుమ్ములూ-దగ్గూ వస్తూంటే జపం పట్టివ్వదు. మధ్యలో వస్తే మధ్యలో ఆపెయ్యాలి. తుమ్మువచ్చినా, ఆవులింతొచ్చినా, కుక్క కనిపించినా, నీచులు కనిపించినా జపం ఆపెయ్యాలి.

జప సమయానిగ్గాని, మధ్యలో గాని ఆటంకాలు కలిగితే రెండు రెప్పపాటుల కాలం ఆగి, ఆచమించి, శివ పార్వతుల్నీ - గణపతిని - గురువునీ స్మరించుకుని మళ్ళా మొదలుపెట్టి చేసుకోవచ్చును.

నడుస్తూగాని, పడుకునిగాని, యథాలాపంగా కూర్చునిగాని, రాచవీధుల్లోగాని, అపవిత్ర స్థలాలలోగాని జపం చెయ్యకూడదు.

# మినహాయింపులు

అయితే ఈ నియమాలేవీ యోగులకి వర్తించవు.

అలాగే కలియుగ మానవులకి గూడా వర్తించవు.

కలియుగంలో వాళ్ళు - కూర్చునిగాని, నడుస్తూగాని, పడుకునిగాని నిలబడిగాని - చివరకు పరిగెడుతూగాని జపం చేసినా తప్పులేదు అల్పాయుర్దాయం అధర్మం, అనారోగ్యాలూ, అతి దరిద్రాలతో సతమతమయ్యే అల్పజీవులైన ఆ కలియుగ మానవుల కోసం మాత్రం పై విషయాల్ని మినహాయింపులుగా చెప్పారు.

అయినప్పటికీ - సదాచారాన్ని పాటిస్తూనే యథేచ్ఛగా జపం చేసుకోవడంవల్ల వాళ్ళు కూడా మరింత సత్ఫలితాలని పొందుతారు. ఇదీ జపవిషయమని ముగించాడా ఉపమన్యుడు. విన్నాడు కృష్ణుడు సరే - యోగ పంచకం గురించి చెప్పు అని అడిగాడు.

# యోగపంచకం

పేర్లోనే వుందిగదా! ఉపమన్యుడు చెబుతున్నాడు - యోగాలు ఐదురకాలు -

1. మంత్రయోగం 2. మంత్ర యోగాన్ని ప్రాణాయామసహితంగా సాధన స్వరయోగం, 3. మంత్ర ప్రాణాయామాలతో పని లేకుండానే మనసు నా దైవం మీద లగ్నం చేసి సాధించేది భావయోగం 4. ఆ భావనలోనే ఉన్నదంతా శివాంతర్లీనంగా తలబోసి అభ్యాసం చేయడం అభావయోగం 5. అభావయోగంలో చెప్పబడిన శివాంతర్లీన సృష్ట్యాదులన్నీ సమసిపోయి శివ మొక్కటే దర్శించబడడం చివరిదైన మహాయోగం.

ఏ యోగాన్నాశ్రయించినా - అష్టాంగాల్ని పాటించాలి. చిట్టచివరి

ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులాచరించకపోయినా – మొట్టమొదటి యమ నియమాసక ప్రాణాయామ చతుష్క మాత్రం ఖచ్చితంగా ఆచరించి తీరాలి.

అహింస సత్యం దొంగిలంచకపోడం, బ్రహ్మచర్యం, ఇతరులనుంచి ఏమీ పుచ్చుకోకపోవడం అనేవి యమం క్రిందకొస్తాయి. శుచిసుభ్రాలు, తృప్తి ఇవి నియమం.

ప్రాణాపానోదానవ్యాన సమాన నాగ కూర్మక కృతం దేవదత్త ధనంజయాలనే పేర్లతో మనవంటో గాలి పది రకాలుగా వుంటుంది.

ప్రయాణీకత కల్పించేది ప్రాణవాయువు. ఆహారాన్ని క్రిందికి గ్రహించేది అపానం. సర్వాంగాలనీ పెంచేది వ్యానం, మర్మ స్థానాన్నుద్రేకపరిచేది ఉదానం సర్వాంగాలా సమానంగా వర్తించేది సమానం త్రేణువులూ అవీ తెచ్చేది నాగం. వాకాసాన్నిచ్చేది కూర్మకం. ఆకలి కల్పించేది కృకరం. ఆవలింతకి మూలం దేవత్తం. ఒళ్లంతా పరచుకునుండేది ధనం జయం – ఈ ధనం జయం ఒక్కటే కృష్ణా! మనం మరణించిన తర్వాత కూడ మన శరీరాన్నొదలి పెట్టకుండా ప్రాకులాడు తుండేది ఈ ధనంజయమే నయ్యా!

ప్రతి రోజూ క్రమంగా అభ్యసిస్తే, ఈ ప్రాణాయామం సర్వదోషాల్ని హరిస్తుంది. శరీరాన్ని సంరక్షిస్తుంది. ఎన్నివ్రతాలు, దానాలు, ధర్మాలు జపతపాలు, యజ్ఞ యాగాదులు ఎన్నయినా చేయి. వాటిన్నింటి ఫలం కలిస్తే. సక్రమంగా ప్రాణాయామం చేసిన ఫలితంలో పదహారోవంతుకూ్కడా సమానం కావంటే నమ్ము!

## యోగవిఘ్నాలు

ఉపమన్యుడు కృష్ణుని కిలా చెప్తున్నాడని, సత్కులీన ఋషులకు

వాయు దేవుడు చెప్పుతున్నాడు.

"శ్రీకృష్ణా! 1. ఆలస్యం, 2. వ్యాధులు, 3. పొరపాట్లు, 4. శంకలు, 5. చిత్త చాంచల్యం, 6. అశ్రద్ధ, 7. భ్రాంతి, 8. సంకటాచరణం, 9. ఇంద్రియ వాంఛ, 10. మనో వైకల్యం – అనే ఈ పదికూడా యోగాభ్యాసానికి గొప్ప విఘ్నాన్ని కల్గిస్తాయయ్యా!"

1. ఆలస్యం: మన శరీరాలు రెండూ కార్యోన్ముఖం కాకపోవడం ఆలస్యం.

2. వ్యాధులు: పూర్వాకృత కర్మమను, కాదా, వర్తమాన వాతావరణాది కాలం వల్ల ఏర్పడ్డ కఫ, వాత, పిత్తాల వికారమును, లేదా వంశపారంపర్యమును అదీకాదంటే ఆదాన వేళ శుక్లశోణిత దోషాలను. తీవ్రతర వర్తమాన వేధల కర్మలే అను – మొత్తం మీద దేహమాత్రుల అసౌక్యం కల్గించేవి వ్యాధులు.

3. పొరబాట్లు: అభ్యాసంలో అధిక సమయం విరామం తీసికొనుటవల్ల ఏర్పడేటివి ప్రమాదాలు అనబడే పొరపాట్లు.

4. శంక: ఈ పొరపాట్లువల్ల ధారణ తప్పి అటు – ఇటూ అనే తర్కంలో (వల్ల) ముంచెత్తి భ్రష్టుపట్టించేది శంక.

5. చిత్తచాంచల్యం: యోగేతర విషయాల పైకి మనసు స్పందించడం.

6. అశ్రద్ధ: అభిరుచి కొఱవడం వలన కలిగేది అశ్రద్ధ.

7. భ్రాంతి: బుద్ధికి అతిచారం పట్టడం, లేదా అతిచారం అనేది భ్రాంతి.

8. సంకటం: అజ్ఞాన పరమైన అంతర్వివాదమే సంకటకాచరణం. ఆధ్యాత్మిక దుఃఖం శరీరతాపరూపం అధిభౌతిక దుఃఖం, అస్త్రశస్త్రాలు–అశనిపాతాలు, ఉప్పెనల (తుఫాను)వల్ల కల్గే బెడదలు అధిదైవిక దుఃఖం – ఈ మూడు రకాలు దుఃఖాలకి కలిపి పెట్టిన ముద్దుపేరే సంకటం.

9. మనశ్చాంచల్యం: ఇచ్ఛా విఘాతం వల్ల కలిగేది మనశ్చాంచల్యం.

10. వైకల్యం : ఇంద్రియాలు బలవత్తరాలైన విషయాలలోలత్వం కల్పించడం.

# యోగ సిద్ధులు

ఎలాగో పట్టు బట్టి పైన చెప్పిన పది విఘ్నాలను నివారించుకుని నెగ్గుకరాల్గితే అభ్యాసం ఒక్కత్రాటికి (కొలిక్కి) వచ్చినట్లే. అప్పుడు ఆరు రకాలైన యోగ సిద్ధులు స్పష్టంగా సిద్ధిస్తాయి. ఆయారింటిని గురించి చెప్పుతా విను కృష్ణా! అన్నాడు ఉపమన్యుడు.

1) ప్రతిభ : అంటే ప్రతి విషయంలోనూ ఉన్నది ఉన్నట్లుగా తెలిసికోగల్గుడమన్నమాట.

2) శ్రవణం: అంటే మన ప్రయత్నమేమీ లేకుండానే వివిధ శబ్దాలు వినటం.

3) వార్త: సర్వప్రాణుల గురించి, అవలీలగా అవగతమై పోవడం.

4) దర్శనం: దివ్యమైన దృశ్యాలు కనబడడమూ, చూడగల్గడం కూడా.

5) ఆస్వాదం: అద్భుతమైన రసాలు ఆస్వాదించబడడం.

6) వేదన: ఈ యోగంలో లోకపాలకులంతా దివ్యసుగంధాల నందిస్తారు.

బ్రహ్మాది దేవతలు సాక్షాత్కరించి, అనేక రత్నాదుల బహూకరిస్తుంటారు. స్వచ్ఛందం. అత్యంత మధురం అయిన మాట తీరబ్బుతుంది. దేవకాంత లెంతో వినయ విధేయతలతో అన్ని రకాల ఔషధులను రసాయనాలను అందచేస్తారు. ఇవే కాకండా పంచ భూతతత్త్వాల, ప్రాజాపత్యాద్వైశ్వర్యాలు ఇవి చాలా వున్నవి.

# యోగాభ్యాసానికి యోగస్థలం

ఎలాంటి ఆయాసాలు అనారోగ్యాలు లేని వాడే – యోగాభ్యాసాని

కర్షుడు. పరిశుభ్ర ప్రాంతాల్లోనూ, అపాయం లేని స్థలాల్లోనూ నిర్ణీతాలైన నిశ్శబ్ద స్థలాలలోను మాత్రమే యోగ సాధన చేయాలి. సుగంధ యుక్తాలైన పుష్పాలు, సమిధలు, దర్భలు, శుదోధదకం అందుబాటులో నుండే చోట. కందమూలాదులు విరివిగా నుండే చోటను యోగాభ్యాసం సాగించాలి. ఇంతెందుకు మనస్సుకు సంపూర్ణంగా నచ్చింది. పెద్దలు చెప్పిన అర్హతలన్నీ ఉన్నది. అన్ని వసతులు కల్గింది అయిన స్థలంలోనే యోగాభ్యాసం చేయాలి.

## ధ్యానం

నిత్యం ధ్యానంలోనే ఉండాలి. శివధ్యానం అత్యంత ప్రధానం. ఈ శివమూర్తులు మూడు రకాలు. 1) అఘోరమూర్తి 2) మిశ్రమ మూర్తి 3. ప్రశాంత మూర్తి. వీటిలో - అఘోర మూర్తి నారాధించడం సద్యోఫల ప్రదం మిశ్రమమూర్తి, ఆరాధనకాస్త మెల్లగా ఫలిస్తుంది. ఇక ప్రశాంతమూర్తి నర్చించడమనేది కేవలం మోక్షం కోసమేనని ధ్యానించాలి.

ధ్యానం రెండు రకాలు కృష్ణా! 1. సవిషయం, 2. నిర్విషయం వీటిలో రెండోదైన నిర్విషయం యెందుకూ కొరగాదను వాదనొకటుంది. అయితే, సవిషయం సాకారోపనమనీ, నిర్విషయం నిరాకరోపనమనీ మరో వాదన కూడా వుంది. అసలెలాగోలాగ శివ ధ్యానానికంటూ శ్రీకారంచుడితే, అదే మనల్ని సత్యంలోనూ, సక్రమమార్గనా నడిపిస్తుంది.

# ప్రాణాయామ సిద్ధులు

1. శాంతి – అన్ని ఆపదలూ అంతరించి పోవడమే శాంతిసిద్ధి.

2. ప్రశాంతి – ప్రత్యక్ష, పరోక్షాలనే బాహ్య, అభ్యంతర – దుఃఖాలన్నీ దూది పింజల్లా చెదిరిపోవడం – ప్రశాంతి సిద్ధి.

3. దీప్తి - బయటనే కాకుండా, మనలోపల కూడా వెలుతుర్ని చూడగలగడం దీప్తి సిద్ధి.

4. ప్రసాదం - ఏవిధమైన వికారాలూ లేకుండా సర్వే సర్వత్రా బుద్ధి స్వాస్థ్యంగా వుండడం ప్రసాద సిద్ధి.

కృష్ణా! బాహ్యాంభ్యంతరాలైన సాధనా సమస్తము కూడా బుద్ధి ప్రసాదత వల్లనే అనుకూలిస్తాయోయ్. శివుణ్ని ధ్యానించాలి. శివధ్యానం లేనిదే శివజ్ఞానం సిద్ధించదు. ప్రాణాయామాది యోగాభ్యాసం చెయ్యనిదే ధ్యానం కుదరదు. అందుచేత, ధ్యానంతో సరితూగగల తీర్థంగాని, తపంగాని, లేనే లేవని తెలుసుకోవాలి. నిత్యం ధ్యానంలో వుండాలి. శివ ధ్యాలోనే వుండాలి. శివుణ్ణే ధ్యానిస్తూండాలి.

## మంగళాంతం

ఆ విధంగా ఉపమన్యువు కృష్ణుడికి శైవతత్త్వ ప్రబోధము చేశాడని - ప్రవచించి, వాయువు తన ప్రవచనాన్ని ముగించాడు. మునులానందించారు. వాయువును పునఃసత్కరించారు. పరమ ప్రసన్నుడయిన వాయువు ఆ షట్కులీ నీనులయిన నైమిశవాసులతో బాటు సకల ప్రపంచ భూత కోటినీ సహృదయంతో దీవించాడు.

ఓం సర్వేషాం స్వస్తిర్భవతు

ఓం సర్వేషాం శాంతిర్భవతు

సమస్త సన్మంగళాని భవంతు

## వాయు పురాణం సమాప్తం



# 5. మద్భాగవత పురాణము

అష్టాదశ మహాపురాణాల్లో అయిదవది శ్రీ మద్భావగవతం

శ్లో॥ "ఊరూ భాగవతం ప్రోక్తమ్" శ్రీ మహా విష్ణువు యొక్క ఊరు స్థానంగా (తొడలు) వర్ణితమైనది. ఇందులో పండ్రెండు స్కంధాలు, పదునెనిమిది వేల శ్లోకాలు గల్గి యున్నది.

భగవంతుడైన శ్రీ మహా విష్ణువు అద్భుతలీల లిందు దర్శనమిస్తాయి. ఇందులోని కథలును ఈ పురాణాన్ని పారాయణం చేస్తే, సకల మనోభీష్టాలు నెఱవేరుతాయి. అందుకే భాగవతమంటే కల్పవృక్షమంటారు. విద్వాంసులు వేదకల్పతరువు – విగళితమై, శుక, ముఖాద్రవమున మొనసియున్న, భాగవతపురాణ; ఫలరసా స్వాదన. ఫలము గనుడురసిక భావవిదులు అన్నాడు సహజ పాండిత్యుడు భక్తాగ్రేసురుడు ఆంధ్ర భాగవతకర్త బమ్మెర పోతన.

భా లంటే భక్తి, గ అంటే జ్ఞానం, వ అంటే వైరాగ్యం, తం అంటే తత్త్వం పరిపూర్ణమైందనే అర్థంలో భాగవతం అనే పేరు సార్థకమైనదని దీనిని విద్వాంసులు బహుదా చమత్కరిస్తుంటారు.

1. ప్రథమ స్కంధంలో – భగవద్భక్తి మహాత్మ్యము, భగవత్కథల శ్రవణ – కీర్తనల ఫలితాలు, నారద మహర్షి పూర్వజన్మ వృత్తాంతం పాండవుల చరిత్ర, భీష్మ పితామహుని మహా ప్రస్థానం మొ॥ అంశాలున్నవి.

2. ద్వితీయ స్కంధలోని విషయాలు శ్రీమన్నారాయణ మూర్తి విరాట్స్వరూప వర్ణన, సద్యోముక్తి విధానం, కోరికల సాధనకై ఆయా దేవతల ఉపాసన, బ్రహ్మాండ (వర్ణన ) నిర్మాణం. భగవదవతారాల వర్ణన పురాణ లక్షణాలు మొ॥ వర్ణింపబడ్డాయి.

3. తృతీయ స్కంధంలోని విషయాలు – శ్రీ విష్ణు పురాణం, కథలు మహావిష్ణువు నాభికమలం నుండి బ్రహ్మదేవుని పుట్టుక, పది విధాలైన సృష్టి మానవుల ఆయు ప్రమాణం, వైకుంఠ లోక వర్ణన – హిరణ్యాక్ష హిరణ్య కశ్యపుల వృత్తాంతం, మోక్ష ప్రాప్తి వర్ణన మాతృ గర్భంలో జీవోత్పత్తి క్రమం మొదలైనవి వర్ణించబడ్డవి.

4. చతుర్థ స్కంధంలో దక్షయాగ వర్ణన, ధ్రువ చరితం, పృధు మహారాజ చరితం, పురంజనోపాఖ్యానం మొదలైన విషయాలున్నవి.

5. పంచమ స్కంధంలోని విషయాలు – ప్రియవ్రత చరితము, అగ్నీధ చరితము, భరత చరితము, జఢభరత వృత్తాంతము, సంసార సాగర వర్ణన, భరతవంశ చరిత్ర వర్ణన, భూగోళ ఖగోళ వర్ణన వివరణ, అనేక విధములైన నరకయాతనలు మొదలైనవి వర్ణించబడినవి.

6. షష్టమ స్కంధంలో అజామీళోపాఖ్యానం, దధీచి వృత్తాంతం, వృత్రాసుర వధ, చిత్ర కేతు వృత్తాంతం మొదలైన అంశాలున్నాయి.

7. సప్తమ స్కందంలో హిరణ్య కశిపుని పరిపాలన, ప్రహ్లాద చరిత్ర, మానవ ధర్మాలు, ఆశ్రమ ధర్మాలు దర్శనమిస్తాయి.

8. అష్టమ స్కంధంలో గజేంద్ర మోక్షం, క్షీరసాగర మధనం, మోహినీ వేషంలోనున్న మహా విష్ణువును శివుడు మోహించుట, బలిచక్రవర్తి చరితం మొదలైన అంశాలతో కూడియున్నది.

9. నవమ స్కంధం సుకన్య, రేవతి కన్యల చరితం, నాభాగ చరితం అంబరీషోపాఖ్యానం, మాంధాతృ చరితం, త్రిశంఖు కథ, హరిశ్చంద్ర చరితం, సగర వృత్తాంతం, భగీరథ వృత్తాంతం, యయాతి చరితం, పురువంశవర్ణన, దుష్యంత చరితం, రంతిదేవుని చరిత్ర, యదు వంశ వర్ణ మొదలైన ఘట్టాలు ఇందులోనున్నవి.

10. దశమ స్కంధంలో శ్రీ కృష్ణావతార వర్ణన శ్రీ కృష్ణలీలలు, రాస క్రీడలు ఎంతో వివరంగా నున్నవి.

11. ఏకాదశమ స్కంధంలో సాధువుల లక్షణాలు, సత్సంగ మహిమ, అష్టాదశ సిద్ధులు, యమనియమాది అష్టాంగ నియమాలు మొ॥ విషయాలిందు కనిపిస్తాయి.

12. చివరిదైన ద్వాదశ స్కంధంలో కలియుగరాజుల వర్ణన, కలియుగ ధర్మాలు, కల్క్యవతార సమయం, నాలుగువిధాలైన ప్రళయాలు, వేదవిభజన, మార్కేండేయు చరితం మొ॥ అంశాలున్నాయి.

హిందూధార్మిక వాఙ్మయములో అత్యుద్భుతంగా ప్రబోధించే గ్రంథం శ్రీమద్భాగవతం. వేదవ్యాస మహర్షి వేదవిభాగం చేశాడు, బ్రహ్మపురాణం మొదలుకుని 18 మహా పురాణాలు రచించాడు. వేదాంత సూత్రాలు, బ్రహ్మసూత్రాలు, మహా భారతం మొదలైన గ్రంథాలు రచించాడు కాని ఏదో అసంతృప్తి ఆ మహర్షిలో ప్రవేశించింది. మానసిక ప్రశాంతత లేదు. అట్టి సమయంలో నారద మహర్షి, వ్యాసుని కడకు వచ్చాడు. యోగక్షేమాలడిగిన నారుదునితో తన పరిస్థితిని చెప్పుకున్నాడు. పరాశర పుత్రుడైన వ్యాసుడు. శ్రీకృష్ణ లీలలను ప్రత్యక్షంగా వర్ణిస్తూ శ్రీమద్భాగవతం రచింపుమని ఉద్బోధించాడు నారదుడు. తత్ఫలితమే ఈ భాగవత పురాణ రచన, దాంతవ్య జీవనం ధార్మికం, ప్రశాంతం, సఫలం, సుఖమయం చేసుకోనడానికి ఈ భాగవత పురాణం ఉపకరిస్తున్నది భక్తులకు.

"శ్లో॥ మోక్షసాధన సామగ్ర్యాం భక్తిదేవ గరీయసీ"

అన్న అర్యోక్తి కలదు. మోక్ష మార్గాలెన్నో వున్నా వాటిలో శ్రేష్ఠమైనది భక్తి మార్గం మాత్రమే. ఈ భక్తి తత్వాన్ని ఉపదేశించడం ద్వారా శ్రీమద్భాగవత పురాణం విశేష ప్రశస్తిని పొందింది. అందుకే "ఏకం భాగవతంశాస్త్రం.

ముక్తిదానేన గర్జితి" ముక్తి నివ్వగల్గిన శాస్త్రాలలో ప్రధానమైంది భాగవతమేనని పౌరాణికులు నొక్కి వక్కాణించారు.

శ్లో॥ "విద్యావతాం భాగవతే పరీక్షా" అన్న ఆర్యోక్తి ప్రకారం శ్రీ మద్భాగవత పురాణంలో గల పరిజ్ఞానాన్ని పాండిత్యాన్ని బట్టి ఎవరు నిజమైన పండితులో, కారో నిర్ణయించవచ్చని చెప్పారు. అంటే భాగవత పురాణంలో వేదాంత విషయాలెంతో గంభీర నిగూఢార్థాలతో కూడియుంటాయని దీన్ని బట్టి తెలుస్తున్నది.

శ్లో॥ దారిద్ర్య జ్వర దాహితానాం, మాయాపిశాచీ, పరిమర్ధితానాం సంసార సిందౌ పరిపాహితానాం క్షేమాయ వైభాగవతం ప్రగర్జతి!!

దారిద్ర్యపీడితులు, దుఃఖితులు, అనారోగ్య బాధితులు మాయ అనే పిశాచికి బలియైనవారు. సంసారమనే సముద్రంలో పడినవారు ఇలాంటి వారిని రక్షించడం కోసమే భాగవతం పుట్టిందనవచ్చు.

శ్లో॥ "ఏతస్మాద పరంకించిన్మనం వృద్ధేన విద్యతే!

జన్మాంతరే భవేత్పుణ్యం, తదా భాగవతం లభేత్!!

శ్లో॥ భారతే మానవం జన్మ, ప్రాప్య భాగవతం నయైః

శ్రుతం పాప పరాధీనై రాత్మఘ్నితస్తుతైః కృతః!!

పవిత్ర భారతావనిలో జన్మించిన ప్రతి వ్యక్తి తప్పక భాగవత పురాణ కథా శ్రవణం చేయాలి. పాపకార్యవశులై అలా చేయక పోతే అది ఆత్మహత్యా సదృశ్యమే కాగలదు.

"శ్రీమద్భాగవతాన్ముక్తిః" కథ యిలాగుంది.

తుంగభద్రా నదీ తీరంలో ఒక పట్టణం నాగులా పురముంది. అక్కడి ప్రజలందరు ధార్మికులు అదే పట్టణంలో ఒక పండితుడున్నాడు. అతని

పేరు ఆత్మదేవుడు. అతని భార్య ధుందులి పెద్ద గయ్యాలి గంప. తన మాటే చెల్లాలని భర్తతో పోరి సాధిస్తుండేది. సదా వాగుతుండేది. అందరిండ్లలో జరిగే విషయాలు పట్టించుకుని కలహిస్తుండేది. ఈ దంపతులకు నిత్యకలహమున్నా, అర్థకామాలే ప్రధానమైనది. ఎంతకాలం కాపురం చేసినా, వారికి సంతానం మాత్రం కల్గలేదు. అప్పటికి వారికి కొంత జ్ఞానోదయమైంది. ధర్మకార్యాలు చేయసాగారు. ఎన్ని దానాలు చేసినా ప్రయోజనం లేకపోగా సంతానం మాత్రం కల్గలేదు."అపుత్రస్యగతిర్నాస్తి" అన్న ఆర్యోక్తి ప్రకారం ఆ పండితుడు గ్రహించి ఈ సంతాన హీనత బాధను భరించలేకుండెను. ఒకనాడు విరక్తితో అడవికి వెళ్ళాడు. నీరసంగా ఒక చెట్టు క్రింద కూర్చున్నాడతడు. ఆ సమయంలో ఒక సన్యాసి అచ్చటికి వచ్చి కారణం వివరించాడు. ఆ మహర్షి కాళ్ళ మీద పడి ఏడ్చాడంతటి పండితుడు. సన్యాసి ఓదార్చాడు.

శ్లో॥ "కథం రోదిషి విప్రత్వం కాతే చింతా బలీయసీ!
వదత్వం సత్వర మహ్యం, స్వస్య దుఃఖస్య కారణమ్!

"ఓ బ్రాహ్మణా! ఏడుస్తున్నావేల? నీ దుఃఖ కారణమేమిటీ? నాకు చెప్పు" అనగా అప్పుడా బ్రాహ్మణుడు దీనుడై యిట్లన్నాడు"ఓ మహాత్మా! నేనేమని చెప్పను పూర్వజన్మలో నేనేమి పాపం చేశానో, ఈ జన్మలో సంతాన ప్రాప్తి లేదాయె, ఆత్మహత్మ చేసికొందామని యిక్కడికి వచ్చాను. సంతానం లేని వానికి ఇహపరాలు లేవందురు. వాని బ్రతుకు, ఇల్లు, సంపదలుండీ వ్యర్థమే గదా!"

శ్లో॥ "పాల్యతే యా మయాధేనుః సావంధ్యా సర్వదా భవేత్
మామయా రోపితో వృక్షః సో పి వంధ్యత్వ మాశ్రయేత్!
శ్లో॥ యత్ఫలం మద్గా యాతం, తచ్చశీఘ్రం వినశ్యతి!
నిర్భాగ్య స్యాన సత్యస్య, కిమతో జీవతేనమే."

"ఓ తపోధనా, నేను పోషించుకునే ఆవు గొడ్డుదయింది. నాయింట్లో పెరిగే మొక్కలు పూత పూయవు. ఇంటికి పళ్ళు కూరలు తెస్తే అవి వెంటనేకుళ్ళి పోతాయి. దౌర్భాగ్యుడనైన నాకు సంతాన యోగం లేదు. ఇన్ని బాధ లనుభవవిస్తూ నేనేమి చూచుకొని బ్రతుకాలి? అందుకు ఈ అడవిలో ఆత్మహత్య చేసికొందామని వచ్చాను. ఈ మాటలు విని, దీనత్వం చూచి ముని కరిగిపోయాడు. దివ్యదృష్టితో కారణం గ్రహించాడు. విప్రవర్యా, కలత చెందవద్దు. సంతాన హీనత చూచి విచారింపకు, ఏడు జన్మల వరకు నీకా సంతాన ప్రాప్తి లేదు. కాన సంసార వాసన వదులుకో, సన్యాసం స్వీకరించి భగవత్ప్రాప్తి కోసం, ప్రయత్నంచేయుము" అని ముని ఆత్మదేవునికి హితోపదేశం చేశాడు.

ఈ హితోక్తులు ఆత్మదేవునికి నచ్చలేదు. మహాత్మా! నాకు వైరాగ్యం అవసరం లేదు. సంతాన సుఖమే కావాలి. సన్యాసం వద్దు. తమరు దయ తలిస్తే, నాకు పుత్రప్రాప్తి చేకూర గలదు. లేకపోతేనే నాత్మహత్యకు సిద్ధమౌతాను. ఇదే నా నిశ్చితాభిప్రాయము" అన్నాడు. అతని ఉడుము పట్టుదలను గమనించాడాముని. ఇక లాభం లేదనిపించింది. ఆత్మ దేవుని కొక పండిచ్చాడు. "ఈ ఫలాన్ని నీ భార్యతో కలిసి తినాలి. సత్యం, దానం, పవిత్రత, ఏకభుక్తం మొ॥ నియమాలతో ఒక సంవత్సర కాలం గడిపితే నీకు బుద్ధి ముంతుడైన పుత్రుడుదయిస్తాడు" అని సెలవిచ్చి తన దారిన వెళ్ళి పోయాడాముని. ఆత్మదేవుడెంతో సంతోషంతోనింటికెళ్ళాడు. భార్యతో నడవిలో జరిగిన వృత్తాంతం ఫలప్రాప్తి తెల్పాడు. సంయమిచ్చిన పండామెకిచ్చాడు. తానేదోపనిమీద బయటికెళ్ళాడు. అవుడు భార్య ధుంధులి గట్టిగా ఏడుస్తూ పని మనిషితో ఇట్లన్నది.

శ్లో॥ "అహో చిన్తామమోత్పన్నా, ఫలం చాహం సభక్షయే!
ఫల భక్షేణ గర్భః స్యాగర్భేణోదరవృద్ధితా!
స్వల్పభక్షం తతోశక్తిర్గృహ కార్యం కథంభవేత్!
దైవాద్ధాటీవ్రజేద్గ్రామే ఫలాయేద్గర్భిణీకథం!
శుకవన్నివసేద్గర్భః తం కుక్షేః కథముత్సృజేత్!
త్యర్యక్చేదాగతోగర్భస్తదామే మరణం భవేత్!
ప్రసూతాధారుణం దుఃఖం సుకుమారీ కథం సహే!
మందాయాంమయి సర్వస్వం ననాందా సంహరేత్తదా!!
సత్యశౌచాదినియమో దురారాధ్యన సదృశ్యతే!
లాలానే పాలనే దుఃఖం, ప్రశూతాయానశ్చవర్తతే!
వంధ్యావా వాధవానారీ, సుఖినీచేతి మేమతిః!!"

తా॥ "సఖీ! నాకిప్పుడు పెద్ద చింత గల్గింది. నేనీ పండు నెట్టి పరిస్థితుల్లో తినను. దీని భుజిస్తే నాకు గర్భం వస్తుంది. గర్భం వస్తే కడుపుపెద్దవుతుంది. గర్భవతి యెక్కువ తినరాదు. తినక పోతే నీరసం వస్తుంది. ఇంట్లోపనుల చేయలేను. ప్రమాద పరిస్థితి యేదైనా సంభవిస్తే,. తప్పించుకొనుటకు పరిగెత్తలేను. ఒక వేల పిండం అడ్డంగా వస్తే తిరిగి ప్రసవమైతే నాకు గండం తప్పదు. ప్రసవించుటలో ఎన్నోకనా కష్టాలుంటాయట! నేనేమో సుకుమారిని తట్టుకోలేను. నా ఆరోగ్యం క్షీణిస్తే, ఇదే సమయమని నా సంపదంతా నా ఆడబిడ్డ కాజేయువచ్చు. ఇక మూవారు చెప్పిన సత్యం, పవిత్రత మొ॥ నియమాలు నేను పాటించలేను. పుట్టిన బిడ్డను పెంచడం నాకు సాధ్యంగాదు. అందుచే నా దృష్టిలో స్త్రీ సుఖపడాలంటే గొడ్రాలైన, లేక విధవైనా కావాలి. ఎట్టి పరిస్తితుల్లోనూ, సంతానవతి కారాదు. ఇది నా స్వీయాభిప్రాయం" అన్నది.

చివరికామె పండు తినలేదు. భర్త వచ్చి 'పండు తిన్నావా?' అన్నాడు. ఎప్పుడో తినేశాయింకానా అని అబద్ధమాడింది. సరిగ్గా ఆ సమయానికి ఆమె చెల్లెలీమెను చూచిపోదామని వచ్చింది. ధుంధులి విషయమంతా ఆమెతో చెప్పుకొంది. అప్పుడా చెల్లి అక్కబాధ గ్రహించి ఇలా చెప్పింది. అక్కా! నేనిప్పుడు గర్భవతిని నాకు పుట్టబోయే బిడ్డను నీకిస్తాను. అప్పటివరకూ నీవు గర్భవతిగా బావకు కనపడేలా నటించాలి. ఇంటి గుమ్మందాటి బయటకు వెళ్ళకు. నాకు ప్రసవం జరిగిన వెంటనే నాకు పుట్టిన బిడ్డను నా భర్త ద్వారా నీకడకు చేర్పిస్తాను. మరి అందుకు ప్రతిఫలంగానేమేమో నా భర్తకు అడిగినంత పైకమివ్వాలి. నన్నెవరైనా ప్రసవించావా అని అడిగితే, నాకు గర్భస్రావమైందంటాను. ఆ తర్వాత నీ యింట్లోనే వుండి బిడ్డ పాలన పోషణలన్నీ నేను చూచుకుంటా, మరి ఆ సన్యాసి యిచ్చిన పండున్నది గదా! దాని ప్రభావం పరీక్షించాలి. దాన్ని ఆవుకు పెట్టు"మంది. అక్క చెల్లెలు మగ బిడ్డను ప్రసవించింది. చెల్లెలు చెప్పిన పథకం ప్రకారం ఆ బిడ్డ ధుంధులి కడకు చేర్చబడ్డారు. తనకు సుఖ ప్రసవం జరిగి మగ బిడ్డను కన్నానని భర్తతో చెప్పింది. ఆ అమాయకపు ఆత్మదేవుడు తనకు సంతాన ప్రాప్తి కలిగిందని ఎంతో సంతోషించాడు. ఎంతో వైభవంగా ధుంధుకారుడ ని పేరుపెట్టి పేదలకు, బ్రాహ్మణులకు దానధర్మాలు ఘనంగా చేశాడు. తనకు చనుబాలు తక్కువైనాయని, తన చెల్లెలి కిటీవలె గర్భస్రావం జరిగిందని వృథాగా పాలు పోతున్నాయట! ఆమెను పిలిపించుకొని తమ యింట ఉంచుకుంటే పాలిచ్చి బాబును పెంచుతుందంటే భర్త సరే అన్నాడు.

శ్లో॥ "త్రిమాసే నిర్గతే చాథ, సాధేనుః సుషువేర్భకమ్!
పరాగ సుందరం దివ్యం, నిర్మల కనక ప్రభమ్!
శ్లో॥ భాగ్యోదయోధునా జాత ఆత్మదేవస్య పశ్యత!
ధేన్యాబాలః ప్రసూతస్తు దేవ రూపీతికౌతుకమ్!!

శ్లో॥ నజ్ఞాతం తద్రహస్యంతు, కేనాపి విధియోగతః
గోకర్ణతం సుతం దృష్ట్వా, గోకర్ణం నామ చాకరోత్!!

మూడు నెలలు గడిచాయి. ఆత్మదేవుని గోవుకు ప్రసవమైంది. సర్వాంగ సుందరుడు, బంగారు కాంతితో మనుష్యరూపానున్న బాలునికి జన్మనిచ్చిందా గోవు. శుభ పరంపరలతో ఆత్మదేవుడు మైమరిశాడానందంతో, ప్రజలంతా ఈ వింత శిశువును దైవ ఘటనగా భావించి తండోపతండాలుగా దర్శింప వచ్చారు. ఆ దివ్య బాలుని ఆవు కనుటచే చెవులు రెండు మాత్రం ఆవు చెవులు వచ్చాయి. ఈ కారణంగా ఆ బిడ్డకు గోకర్ణుడని పేరు పెట్టారు. ఆ యింట ధుంధుకారుడు, గోకర్ణుడు కలిసి పెరుగుతున్నారు. గోకర్ణునికి అన్నీ సుగుణాలు అబ్బినవి. అన్ని శాస్త్రాలు చక్కగా చదివి మేధావి అనిపించుకాన్నడు.

ధుంధుకారుడు మాత్రం చదువుసంధ్యలబ్బక దుర్మార్గుడు, తిరుగుబోతయ్యాడు. నిత్యం స్నాన సంధ్యలుచేయడు. చెడు తిరుగులెక్కువయ్యాయి. దొంగతనాలలవాటయ్యాయి. ప్రజలంతా ఇతన్ని అసహ్యంగా చూసేవారు. ఆటలకోసం తోటి బాలుర పిలిచి నూతుల్లో తోచేవాడు. కత్తులు, పిడిబాకులు ధరించి హంతకునివలె ఎప్పుడెవరిని చంపాలని, విచ్చలడివిగా తిరిగేవాడు. అమాయకులను, అంధులను ఆటపట్టిస్తూ పీడించేవాడు. చిన్న ప్రాయంలోనే వేశ్యాలోలుడయ్యాడు. తండ్రి యావత్తు ఆస్తిని కాజేసి, హారతి కర్పూరంలా ధూంధాంగా ఖర్చుపెట్టాడు. తల్లిదండ్రులితని బాధలు భరించలేక దుఃఖితులయ్యారు. ఆత్మదేవుడు దుఃఖంతో "నేనెక్కడికి పోవాలి. ఎవరితో చెప్పుకోవాలి. నాకింక మరణమే శరణ" మని గట్టిగా రోధించసాగాడు. అట్టి దుఃఖ సమయంలో తండ్రి దగ్గరకు వచ్చాడు గోకర్ణుడు. "సంసారం సారం లేనిదని సుఖ దుఃఖాలు

ఓర్చుకోవాలని బోధించాడు. బంధాలు తెంచుకోవాలె గాని పెంచుకోరాదని తండ్రికి వేదాంత, వైరాగ్యాలు ఉపదేశించి ఓదార్చాడు. గోకర్ణుడిలా తత్త్వ బోధ చేశాడు.

శ్లో॥ "దర్మం భజస్వసతతం, త్యజలోకధార్మన్!
సేవస్వ సాధువురుషాన్, జహి కామతృష్ణామ్!!
శ్లో॥ అన్యస్య దోషగుణ చింతన మాశుత్యక్త్వా!
సేవా కథార సమహో నితరాంపిబత్వం!!"

"సదా ధర్మ మార్గంలోనే ప్రవర్తించుడు. లౌకిక వ్యవహారాలు విసర్జించు సత్పురుషుల సేవించాలి. కోరికలను దూరం చేసికోవాలి. గోకర్ణుని సదుపదేశ వేదాంతవచనాల త్రికరణ శుద్ధిగా ఆత్మదేవుడు పాటించాడు. సర్వకాల సర్వావస్థల్లో హరిసేవలో లీనమైనాడు. కొంతకాలమయ్యాక తపోవృత్తితో అడవికేగి శ్రీకృష్ణసాయుజ్యంపొందాడు.

తండ్రి మరణానంతరం ధుంధుకారుడు తల్లిని మరింత పీడించాడు. ఈ బాధలు తట్టుకోలేక బావిలో దుమికి ధుంధులి ఆత్మహత్య చేసుకొంది.

గోకర్ణుడు స్థిత ప్రజ్ఞ కలవాడు. సుఖదుఃఖాలు, శీతోష్ణాలు, రాగద్వేషాలు స్వకీయ పరకీయులనే భేదభావములతనిలో అగుపించవు. తీర్థయాత్రలకెళ్ళాడు. ధుంధుకారుడు అయిదుగురు వేశ్యలను తెచ్చి, యింటిలోనే పెట్టుకొన్నాడు. వారిని పోషించేటందుకు మరిన్ని అకృత్యాలను చేయసాగాడతడు. ఒక రోజు వేశ్యలు విలువైన స్వర్ణాభరణాల తెచ్చిపెట్టమని అతన్ని వేధింపసాగారు. వారి ఆనందమే అతనికి కావాల్సింది. ఆ రాత్రికే దొంగతనం చేసి వారి కవితెచ్చిచ్చాడు. గజదొంగ అయిన అతని దగ్గరుంటే తమకు గూడా చెఱశాల తప్పదని వేశ్యలు అతని పీడ వదలించుకునేందులకు అంతా కలసి అతన్ని గుట్టుగా హత్యచేశారు. అపుడా ధనం, ఆభరణాలు

మూటగట్టుకొని, వేశ్యలంతా వేరే ప్రాంతాలకెళ్ళి పోయారు.

శ్లో॥ "సుధామయంవచోయాసాం, కామినాం రసవర్ధనమ్!
హృదయంశిరాధారాభం, ప్రియఃకోనాయ యోషితామ్!!"

వేశ్యల పలుకులు అమృతం కురిపిస్తాయి. కాముకులు వారికి దాసులౌతారు. అయితే ఆ వేశ్యల మనస్సు పదునైన కత్తి వంటిది. వారికి ప్రియులంటూ ఎవ్వరూ ఉండరు. ధనం మాత్రమే వారి ప్రీతికారకం. అందుచే వారినెప్పుడూ నమ్మరాదు. చివరికి ధుంధు కారుడు హత్యానంతరం తన పాపంచే ప్రేతంగా మారాడు. అతని ప్రేతం ఒక చోట స్థిరంలేక ఆకలిదప్పులతో అంతగా తిరుగుచు అల్లాడసాగాడు. అన్న మరణవార్త తీర్థయాత్రల్లోనున్న గోకర్ణునికి తెలిసింది. అన్న ఆత్మశాంతి కోసం గయాశ్రాద్ధం చేసి, తిరిగి యింటికి వచ్చాడు. ఆ రాత్రి ప్రొద్దుపోవుటచే అతడింటి బయట వసారాలో పండుకొన్నాడు. అర్ధరాత్రి సమయంలో అక్కడికి ప్రేత రూపంలో నున్న ధుంధుకారుడు వచ్చాడు. ఒకసారి మేకగా, మరొకసారి యేనుగు, దున్నపోతు రూపాల్లో గోకర్ణుని కడకు వచ్చాడు. దానికి ఉలికిపడి గోకర్ణుడు నిద్ర లేచాడు "నీవెవ్వరవు ప్రేతమా! భూతమా! పిశాచివా, రాక్షసుడివా! ఎందుకిలా తిరుగుతున్నావు చెప్పు"మన్నాడు. ప్రేతమైన ధుంధుకారుడు గట్టిగా రోధించాడు. సమాధానం చెప్పాలన్న నీరసంతో మాటలు పెగిలి రాలేదు. సైగలు మాత్రం చేయసాగాడు. గోకర్ణుడు మంత్ర జలంతో ప్రోక్షించాడు. దానితో ప్రేతం తప్పరిల్లి యిలా చెప్పసాగింది. "సోదరా! గోకర్ణా! నేను నీ అన్నను ధుంధుకారుడను. నా స్వయం కృతాపరాధం వల్ల హత్య చేయబడి ప్రేతమయ్యాను. నాకు నిష్కృతి లేదు. ప్రస్తుతం గాలియే నాకాహారం ఎంతో హీనంగా దీనంగా ప్రేతంగా తిరుగుతున్నా నన్నేవిధంగానైన ప్రేతరూపం పోయేలా చేసి, నీవే కాపాడ

వలసింది, అని తమ్ముని ప్రాధేయపడి ప్రార్థించాడు. అప్పుడ జాలితో గోకర్ణుడు "నీముక్తి కొరకు నేను గయాశ్రాద్ధం చేశాను. నీకింకా ముక్తి లభించక పోవడం ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు. అప్పుడా ప్రేతరూపధారి అన్నాడు. "నూరు గయాశ్రాద్ధాలు చేసినా నాకుముక్తిలేదు. వేరే ఉపాయం చూడు" అన్నాడు ధుంధుకారుడు సరే! నేనాలోచిస్తా! నీ వెళ్ళిపొమ్మని పంపించాడు. తెల్లవారిని తర్వాత గోకర్ణునిరాక అక్కడ వారందరికి తెలిసింది. సాదరంగా అతని పలుకరించారు. గోకర్ణుడు ధుంధుకారుని సంగతి వారితో చెప్పాడు. అతడు ముక్తి పొందే ఉపాయం చెప్పమని అక్కడి పెద్దలైన పండితుల నభ్యర్థించాడు, గోకర్ణుడు. జగచ్ఛక్షువైన ఆ సూర్య భగవానుడు మాత్రమే దానికుపాయం చెప్పగలడని చెప్పరు. గోకర్ణుడు సూర్యుని ప్రార్థించాడు. శ్రీమద్భాగవత సప్తాహం అన్నకు ముక్తి నిప్పించాలని నిశ్చయించుకొన్నాడు.

వెంటనే శ్రీమద్భాగవత సప్తాహానికి ఏర్పాట్లు చేశాడు గోకర్ణుడు. ఈ శుభవార్త విని అనేక ప్రాంతాల నుండి భక్తకోటి అరుదెంచారు. పీఠమలంకరించాడు గోకర్ణుడు. భాగవత పఠనం ప్రారంభించే సమయానికి పిశాచ రూపంలో నున్న ధుంధుకారు డచ్చటికి వచ్చాడు. ఏడు సమభాగాలుగా నున్న వెదరుబొంగు అక్కడ పడి వుంటే దానిలోకి ప్రవేశించాడు ధుంధుకారుడు. భాగవత కథా పఠనమొదలైంది. భక్తిశ్రద్ధలతో వింటున్నాడు. ప్రేతరూపధారి ధుందుకారుడు శ్రోతలందరు చూస్తుండగనే పటపట మంచు పెద్దశబ్దంతో వెదరు గడియలోని ఒక భాగం చీలిపోయింది. ఇలా దినమొకటిగా ఆరు భాగాలు చీలాయి. ఏడోరోజు కార్యక్రమం పూర్తి అయ్యేటప్పటికి ఏడవ భాగం కూడా చీలింది. ఆ వెదరు గడియలోనుండి పీతాంబరాలు, కుండలాలు ధరించి ధుంధుకారుడు పిశాచ రూపం పోయి.

దివ్యమైన దేవతా రూపంతో ప్రత్యక్షమయ్యాడు. "నీకారణంగా నేను విముక్తునయ్యా!: నా ప్రేత రూపం పోయింది." అంటూ తమ్మునికి తన కృతజ్ఞతలను ఆర్ద్ర హృదయంతో తెల్పాడు.

శ్లో॥ "ధన్యాభాగవతీవార్త, ప్రేత పీడవినాశినీ!
సప్తాహోపి తథాదాన్య కృష్ణలోకఫలప్రధః!!

ప్రేత పీడను నాశనము చేయగల శ్రీమద్భాగవత కథలు ధన్యములు. భాగవత సప్తాహమెంతో శ్రేయోదాయకమైనది. శ్రీకృష్ణ సాముజ్యమొందించగల ఏకైక మార్గం శ్రీమద్భాగవత కథా శ్రవణ – సప్తాహం" అంటూ భాగవతాన్ని అందరు స్తుతించారు.

కృష్ణవాసుదేవ – కేశవ పరమాత్మ, అప్రమేయవరద – హరిముకుంద మిమ్ము చూడగంటి – మీ కృపగనుగొంటి – అఖిసౌఖ్యపదములందగంటి".

శ్లో॥ "భిద్యతే హృదయ గ్రంథశ్ఛిద్యతే సర్వసంశయాః!
క్షీయన్తే చాస్యకర్మాణి, సప్తాహ శ్రవణేకృతా!!"

"బాగవత సప్తాహంలో పాల్గొని భక్తి శ్రద్ధలతో శ్రవణం చేస్తే హృదయం పరిశుద్ధమౌతుంది. సంశయాలన్నీ పటాపంచలౌతాయి. అంతేకాక సకల పాపాలు పటా పంచలౌతాయి."

ఈ విధంగా కృష్ణభక్తి తత్పరుడయ్యాడు ధుంధుకారుడు ఇంతలోనే వైకుంఠం నుండీ దేదీప్యమానంగా విమానమొకటి వచ్చి ఆగింది. విష్ణుదూతలు ధుంధుకారుని సాదరంగా వైకుంఠానికి ఆహ్వానించారు. అప్పుడాశ్చర్యంతో గోకర్ణుడు విష్ణుదూతలనిలా అడిగాడు.

శ్లో॥ "అత్రైవ బహువ సన్తి శ్రోతారోమనః నిర్మలా!
ఆనీతాని విమానాని నతేషాం యుగవత్కుతః!!"

శ్లో॥ "శ్రవణం సమభాగేన సర్వేషామిహదృశ్యతే!
ఫలభేదః కుతోజాతః ప్రభువంతు హరిప్రియా!!"

"ఓ వైష్ణవోత్తములారా! భాగవత సప్తాహంలో పాల్గొని పరిశుద్ధ హృదయాలతో శ్రవణంచేసిన వారెందరో ఉండగా, వారందరిని ఆహ్వానించక కేవలం ధుంధుకారు నొక్కన్నే ఆహ్వానిస్తున్నారా! సప్తావహంలో వారందరు సమానంగా పాలు పంచుకొన్నారు గదా ధుంధుకారునికి మాత్రం వైకుంఠ ప్రాప్తి యోగం పట్టుటేల? ఇతరులకు ఆ భాగ్యము లబించదేల తెల్పండి" అన్నాడు. అప్పుడు విష్ణుదూతలిలా సమాధాన మిచ్చారు.

శ్లో॥ "శ్రవణం తు కృతం సర్వైర్నతంద్ర మననం కృతం!
ఫలభేదస్తతోజాతో, భజనాదపి మానవ!!

శ్లో॥ సప్తరాత్రిముపోష్యైన ప్రేతేన శ్రవణం కృతం!
మననాది తధాతేన స్థిరచిత్తే కృతం భృశమ్!!

శ్లో॥ విశ్వాసో గురువాక్యేషు స్వస్మిన దీనత్వభావనా!
మనోదోషజ యశ్చైవ కథా యాం నిశ్చలామితిః!!

శ్లో॥ ఏవమాది కృతం స్యాచ్ఛేత తదావైశ్రవణే ఫలమ్!
పునః శ్రవాస్తే సర్వేషాం, వైకుంఠేవసతి ధ్రువమ్!!"

"ఓ గోకర్ణ! వినుము. భాగవత కథల సప్తాహంలో పాల్గొనిన ఇక్కడివారందరు శ్రవణం చేశారు. కానీ మననం చేయలేదు. ఈ కారణంగా వారికి వైకుంఠాహ్వానమందలేదు. ప్రేత రూపంలో నున్న ధుంధుకారుడు ఈ నేడు రాత్రులు తాను శ్రద్ధతో విన్న విషయాలను ఏకాగ్ర చిత్తంతో చక్కగా మననం చేశాడు. గురువుగారి మాటల పట్ల గౌరవం, అహంకార రాహిత్యం ప్రతివాడలవరచుకోవాలి. మనస్సులోని మాలిన్యాన్ని దూరీకృతం

చేసికోవాలి. నిశ్చల మానసంతో భాగవతకథా శ్రవణ మననాలు చేసినవాడు, తప్పక అట్టివారికి వైకుంఠం ప్రాప్తిస్తుంది,'' అని అన్నారు.

హరి దూతల ఉద్దేశ్యం గోకర్ణుడు గమనించాడు. ఒక శుభముహూర్తంలో మళ్ళీ రెండోసారి భాగవత సప్తాహం నిర్వహించాడు. శ్రోతలందరు శ్రద్ధగా శ్రవణ మననాలు చేశాడు. సప్తాహం పూర్తియైంది. ఎన్నో విమానాలు వైకుంఠం నుంచీ వచ్చాయి. విష్ణుదూతలే కాక సాక్షాత్తు శ్రీ మహా విష్ణువే వచ్చాడక్కడికి జయజయధ్వనులు మిన్నుముట్టాయి.

భక్త స్వాధీనుడయ్యాడు శ్రీహరి. మహానందంతో పాంచజన్యమనే శంఖంపూరించాడు. ప్రేమతో గోర్ణని ఆలింగనం చేసుకొన్నాడు. భాగవతకథా శ్రోతల రూపురేఖలు మారిపోయి విష్ణుసదృశులయ్యారు.

శ్లో॥ "అయోధ్యా వాసినః పూర్వం, యథారామో సంగతాః!
యథాకృష్ణేన తేనీతా, గోలోకం యోగిదుర్లభం!!

శ్రీ రామావతారం చివరలో శ్రీరాముడెలాగు అయోధ్య ప్రజలందరిని తన వెంట వైకుంఠానికి తీసికొని వెళ్ళాడో అదే విధంగా శ్రీమహా విష్ణువు (శ్రీకృష్ణుడు) ఈ భాగవత శ్రోతలందరిని తనతో వైకుంఠానికి విమానాల్లో తీసుకొని వెళ్ళాడు.

శ్లో॥ "వాతాంబు పర్ణాశన దేహశోషణైః!
తపోభిదుగ్రైశ్చిరకాల సంచితైః!!
యోగశ్చ సంయాన్తి నతాం గతింవై
సప్తాహగాథా శ్రవణేన యన్తిమాం!!"

"మునులు గాలి, నీరు, ఆకులనే ఆహారంగా స్వీకరిస్తూ శరీరాన్ని శుష్కింప చేస్తూ ఎంతో కాలం ఘోర తపస్సు చేయడం ద్వారానూ పొందలేని ఉత్తమ గతిని (వైకుంఠ ప్రాప్తి) శ్రీమద్భాగవత సప్తాహంలో పాల్గొని శ్రవణ – మననాలు చేయడం ద్వారా పొందగలరు."

శ్రీ మద్భాగవత పురాణం గురించి ఎంత వర్ణించినా పరిమితమే అగును శ్రీకృష్ణ పరమాత్మ దానిగూర్చి యిలా సెలవిచ్చాడు.

శ్లో॥ "మత్కథావాచనే నిత్యం, మత్కథా శ్రవణే రతమ్!
మత్కథాప్రీతమననం, నాహం త్యక్ష్యామి తం నరమ్!!

ఎవరైతే నాకథలను పఠిస్తారో, భక్తిశ్రద్ధలతో శ్రవణ మననాదులు చేస్తారో, తద్వారా సంతృప్త హృదయులౌతారో అలాంటి వారిని సర్వకాల సర్వావస్థలందు నేను రక్షిస్తాను అన్నాడు.

ఓం తత్సత్, నారాయణేతి సమర్పితామ్.

ఆ విధంగా భాగవతపురాణ ప్రాశస్త్యం పురాణం విని మైమరచిన మునులందరు సూతుణ్ని భాగవతపురాణం వినిపించమని కోరారు. చెప్పటం ప్రారంభించాడు. సూతర్షి.

# భాగవత రచన

మా గురువుగారైన వ్యాసుల వారు ప్రజోపయోగముగా వేదములు విభాగించి పురాణములు రచించినా తృప్తి తీరక యేదో మనో వైకల్యంతో బాధపడసాగాడు.

అప్పట్లో ఒకనాటి పుణ్యకాలము నందు నారద మహా మునీంద్రుడు నారాయణ గానము చేయుచు పరమానందముగా వ్యాసమునీంద్రు నాశ్రయమునకు వచ్చెను. ఆ దేవముని రాక కానందించి వ్యాసుడెదురేగి గౌరవ ప్రదముగా గొని వచ్చి యర్ఘ్య పాద్యాదులిచ్చి యుచితాసనమున గూర్చుండబెట్టి కుశలము లడిగి సంతోషముతో నున్న సమయుములో

వ్యాసుడిట్లనెను. "మహాత్మా! నాకు మనః చాంచల్యము వేధించుచున్నది దీనికి కారణము తెలియుట లేదు. మీరు దేవ మునీంద్రులు గాన నా విషయమాలోచించి తగిన యుపాయము చెప్పగోరెదనని " వేడెను. అది విని నారద మహాముని "వ్యాసా! నీవు వ్రాసిన గ్రంథములన్నియు లోకోపకారములైనను, వానిలో మహాభారతము వేదసారముగా పంచమవేదముగా రచించితివి, ఆ రచన బాగున్నది గాని, యందులో ధర్మార్థకామములున్నవే గాని మోక్షోపాయమును గురించి వ్రాయబడలేదు. అందుచే మోక్ష గ్రంథమును రచించితివా నీకు యీ చాంచల్యము నివారణమగు" నని చెప్పి, తన దారిని తాను పోయెను. తరువాత వ్యాసమహామునీంద్రుడు మోక్ష ప్రధానమగు గ్రంథము వ్రాయదలచి, లోకములను సృజించి రక్షించిన వాడు శ్రీహరి. అతడు తన భక్తుల కపాయములు రాకుండా చూచుచుండును. లోకమంతయు వైష్ణవ మహోతేజంతో నిండియున్నది. కలియందు ప్రజ లల్పాయుష్కులై మహా పాపము నాచరించుచు నరక కూపములో బడుచు చచ్చుచు పుట్టుచుందురు. వారికి చావు పుట్టుకలు లేని మార్గము శ్రీహరి పాదసేవనము, భక్తి మాత్రమే. భక్తి మార్గములో నవ విధములున్నవి. ఏయే భక్తి మార్గములలో నడచిన వారిని శ్రీహరియెట్లాదుకొని వారికభయమిచ్చి తనలో జేర్చుకొనునో ఆయావిధములన్నియు దివ్యమగు కథామార్గములో గ్రంథము గావింతునని మనస్సులో సంకల్పించుకొనెను – అని సూతుడు చెప్పగా శౌనకాదులు – యా శ్రీహరి యవతారములు, లీలలు– వివరించి చెప్పమని కోరిరి. అది విని యా మహానీయుడు యిట్లారంభించెను. లోకములో పాపములు పెరిగి ప్రజ లవినీతితో నున్న కాలమున శ్రీహరి తానవతరించి యవినీతిని, దుర్మార్గమును నశింపచేసి ధర్మమునిల్పి భూభారము తీర్చు చుండును. ఆయన భూభారము తీర్చుటకు ధరించిన రూపములే యవతారము

అనబడుచున్నవి. మొదట బ్రహ్మచర్య వ్రతస్థుడై యుండునది ప్రథమావతారము. రెండవది యజ్ఞవరాహరూపము. హిరణ్యాక్షుడను రాక్షసుడు శ్రీహరిని జయించదలచి లోకములన్నియు వెదకసాగెను. ఎక్కడా హరి జాడ కన్పించనందున పాతాళములో నుండునని తలచి తన కక్ష్యముగా నున్న భూమిని చుట్ట బెట్టి విసిరివేయబోగా విష్ణువు శంఖ చక్ర గదాదులు ధరించి మహాభయంకరమైన వరాహమూర్తియై తన కోరతో వానిని పొడిచి వధించి, భూమిని యథాస్థితిలో నుంచెను. అదియే యజ్ఞవరాహావతారము.

మూడవది నారదుడు. నాల్గవ రూపము నరనారాయణులు. కపిలుడుగానైదవ రూపము, దత్తాత్రేయు డారవరూపము యజ్ఞుడనునది యేడవ రూపము, యురువిక్రము డెనిమిదవ రూపము, పృథు చక్రవర్తి తొమ్మిదవ రూపము, పదియవది మీన రూపము, పదకొండు కూర్మ రూపము, పండ్రెండు ధన్వంతరి, పదమూడు మోహినీరూపము, పదనాల్గు నరసింహ రూపము పదిహేను వామన రూపము, పదహారు పరశురామ రూపము, పదిహేడు వ్యాస రూపము. పదునెమ్మిది శ్రీరామ రూపము, పందొమ్మిది, ఇరువదుల బలరామకృష్ణ రూపములు, ఇరువదొకటి బుద్ధరూపము. తరువాత కలియుగంలో రూపము శంబళ గ్రామమున కల్కి రూపముగా పెద్దలచే చెప్పబడును. అది ఎట్లో వివరించు మని యడిగిరి. వారికి సూతుడిట్లు చెప్పెను.

# పరీక్షిత్తుకు ముని శాపము

పాండవులకు వంశాంకురమున్ను, వారి ప్రపౌత్రుడునూ యగు నభిమన్యు కుమారుడు పరీక్షిత్ పాండవుల యనంతరం రాజ్యాభిషిక్తుడయ్యెను. అతడు రాజ్యపాలనము చేయు సమయములో

నొకసారి వేటకు బయలు దేరెను. ఆయన వేటాడి యలసి సొలసి దాహము చెంది దూరముగా నున్న శమీక మహా మునీంద్రు నాశ్రమునకు వచ్చెను. అతని ప్రక్కన కమండలమున్నది. మహాముని సమాధిలో నుండెను. దాహముతో బాధపడి 'యిన్ని నీరములిమ్మని' అడిగెను. మునీంద్రుడు సమాధిలో నున్న కారణమున సమాధానమీయలేదు. రాజు పిలిచి పిలిచి వేసారి చివరకు దాహబాధకొలది పట్టరాని కోపమంది అచటనే చచ్చి పడియున్న పామును వింటికొనతో నెత్తి యా ముని కంఠమున వైచి వెడలెను. అతడు సమాధిలో నుండి కదలలేదు – మెదలలేదు.

కొంతసేపటికి శమీకుని కుమారుడు శృంగియనువాతడాశ్రమమునకు వచ్చెను. తండ్రి సమాధిలో నుండుటయు భుజముపై పాము శవముండుటయు చూచి కంగారు పడెను. తోడి ముని బాలకులను బిలిచి వారి సాయముతో చచ్చిన పామును లాగించి వైచి "నా తండ్రికిట్లవమానము ఎవరు చేసిరా?" యని చాలా సేపు చింతించి, సమీపమున నున్న యేటికి పోయిస్నానమాచరించి, యాచమనము కావించి "ఎవడైతే నా తండ్రి మెడలో చనిపోయిన పామును వడవేసి పోయెనో వాడు సర్పదష్టుడై వారము రోజులలో మరణించుగాక యని" శపించెను. తరువాత అచటి గందరగోళమును బట్టి శమీకుడు కనులు తెరచి చూచెను. జరిగిన చరిత్ర మంతయు మునీంద్రుడు దివ్య దృష్టిని చూచి వచ్చినవాడు పరీక్షన్నరేంద్రునిగా నెరిగి కుమారుని మందలించెను. తన శిష్యులను బిలిచి పరీక్షితుని కడకుపోయి యీ శాపవిషయము చెప్పి తగు రీతిగా దానినుండి తప్పించుకొనుమని చెప్పుడనెను. శిష్యులు వేవేగముగా పోయి పరీక్షిత్‌ని దర్శించి రాజా! మా ముని పుత్రుని శాప ప్రకారము, వారము రోజులలో నీవు సర్ప దష్టుడవై చనిపోదువట. శక్తియున్న యత్నము చేసి శాపము త్రిప్పుకొను మార్గం జూడుమని ముందుగా తెలియజేయ పంపించినారు" నిరి. పరీక్షిత్

మహాజ్ఞాని, భక్తుడు. పాండవ వంశములోనివాడు గాని సామాన్యుడు గాడు. అందుచేత తన మరణమునకు విచారమందలేదు. మనస్సును చిక్కబట్టకొనెను.

## ప్రాయోపవేశము - ముని బృందము రాక

భార్య పుత్ర రాజ్యాదులందు మమకారము వదలి గంగా నదిలో పవిత్ర స్నానము గావించి, ఆ తీరము నందుత్త రాగ్రముగా దర్భలు పరచి వాని మీద పరుండి ప్రాయోపవేశ దీక్ష బూనెను. పరీక్షితునకు మహాయోగము పట్టినది. జ్ఞాన మార్గములో యిన్ని రోజులకు మరణమని యెరిగి ఉత్తర భాగీరథీ తటమున ప్రాయోపవేశుడైనాడని పొంగిపోవుచు రాజర్షులు, దేవర్షులు, బ్రహ్మర్షులు – శిష్యులోను, శిష్యుల శిష్యులతోను, గుంపులు గుంపులుగా వచ్చి చేరుచుండిరి. ఆ వచ్చిన వారిలో సామాన్యుడొక్కడు లేడు. అత్రి, విశ్వామిత్ర, మైత్రేయ, భృగు, భారద్వాజాది మహామహులు హరినామ కీర్తనలు గావించుచు పరుగుల మీద వచ్చుచుండిరి. ఆ రాజు చుట్టు బ్రహ్మవాదుల సభ యెంతో ముచ్చటగా నుండెను.

వారందరూ వచ్చుట చూచి పరీక్షిత్తు వారికి తగిన ఆసనములు చూపి మర్యాదలు గావించి చేతులు జోడించి "మహనీయులారా! బ్రహ్మతేజోమూర్తులారా! మహాతపోవ్రతశీలులారా! మిమ్మొక ప్రశ్న నడుగుచున్నాను. క్షమించి సమాధానము నీయగోరెదను. మీరు నా చరిత్రము విన్నారు గదా! నాకు వారము రోజులలో మరణమున్న స్థితిలో నేను మోక్షము పొందు మార్గముపదేశింపుడు. మీరు బ్రహ్మవేత్తలు గాన నా ప్రశ్నకు జవాబీయగల" రని తన విశ్వాసము ప్రకటించెను. వారా మాటలు విని "పరీక్షిత్! నీవడిగినది సబబుగానే యున్నది. కాని, వారము రోజులలో

మోక్షమెట్లు వచ్చునని చెప్పుదుము? ఇది చాలా కఠినమగు విషయము. అయినను మేమాలోచింతుము" యని వారిలో వారు తర్కించుకొని తుదిగా యిలా అన్నారు.

# శుక మహర్షి ప్రవేశం

ఈ సమస్త ప్రకృతియు శ్రీహరి రూపమే. ఆయన విరాట్పురుషుడు. పంచ భూతములు, భూమి, ఆకాశము, తేజస్సు, వాయువు, జలముగా తెలియును. ఆయన దయలేనిదే యేదీ తెలియరాదు. ఈ ప్రకృతిని దాటుట కష్టము. నీవడిగినది ప్రకృతి కంటకుండా యీశ్వరుని జేరు విధానము గదా! యీ శరీరధారికి మోక్షము చేకూరుటకు విధానము యింత స్వల్ప కాలములో నెట్లు ప్రాప్తించునో! యింత వరకూ మాకనుభవములో లేదు." ఇట్లు వారను చుండగానే కృష్ణద్వైపాయన మునీంద్రుని కుమారుడు, మహనీయుడు శుక యోగీంద్రుడు పదారు సంవత్సరముల వయస్సుతో దిగంబరుడై దైవయోగమున పరీక్షితుని యొద్దకు వచ్చెను. ఆయన రాగానే మునులు ఆసనాల నుండి దిగి సగౌరముగా యెదురు వెళ్ళి లోనికి గొని వచ్చిరి. రాజు సాష్టాంగ మొనరించి యుచితాసన మిచ్చెను. ఇంతలో మహామునులు లేచి "రాజా! నీవడిగిన ప్రశ్నకు మేము సమాధానము చెప్పలేకపోయినాము. ఈ మహానుభావుడు నీకు సరియగు సమాధానము చెప్పగలడని" యనగా, 'శుక యోగీంద్రుడు యదేమ'న్నట్లు వారిని చూచెను. దానికి జవాబుగావారు "ఓ మునీంద్ర చంద్రమా! ఈ రాజ చంద్రుడు బ్రాహ్మణ శాపముచే వారము రోజులలో సర్పదష్టుడగును. వారము రోజులలో మరణించనున్న యితడిప్పుడేమి చేసిన మోక్షము పొందగల"డని ప్రశ్నించిరి. రాజు కూడ "నాకు మోక్షము పొందునుపాయము చెప్పగోరెద"నని ప్రార్థించెను.

మహాముని విని రాజా "దీనికంత కావలయునా? వారము రోజుల వ్యవధిలో మోక్షము సునాయాసముగా పొందగలవు ఏడుఘడియల జీవితమున్న సమయములో శ్రీహరి ధ్యానముతో ఖట్వాంగుండను మహారాజు మోక్షమందెను నీవు మోక్షమందుట.కేసందియమును లేదు, నీకు మోక్షోపాయముగా నొక గ్రంథమును విన్పింతును. అందులకే నేనిక్కడకు వచ్చితిని. రాజా! నా తండ్రి వ్యాసభగవానుడు మహా భాగవతమను ముక్తి గ్రంథము రచించి, నాచేత చదివించెను. నేనా గ్రంథమును యీ వారము రోజులపాటు యిచటనేయుండి నీకు విన్పింతును. శ్రద్ధతో ఏకాగ్రచిత్తముతో విన్నచో నీకు మోక్షము తప్పక సిద్ధించును." అని చెప్పి, యిట్లారంభించెను. శ్రీహరి యొక్క స్వరూపమే ప్రకృతి, అందు భూతపంచకము, పృథివ్యాదులు, అహంకారము, మహత్తత్త్వ మనునవి యేడావరణములు గలవు. శ్రీహరి విరాడ్రూపము వివరింతును వినుము.

## విరాడ్రూపము

పాతాళము పాదయుగము, రసాతలము పాదపైభాగము మహాతలము గుల్ఫము, తలాతలము సుతలము – జానువులు, వితల మూరువు, అతలము జఘనము, నభోభాగము నాభి, నక్షత్రమండలము వక్షఃప్రదేశము, కంఠము, మహర్లోకము, ముఖము, జనోలోకము, తపోలోకము లలాటము, శిరస్సు సత్యలోకము, యింద్రాదులు బాహువులు కర్ణము దిక్కులు, శబ్దము శ్రవణేంద్రియము, అశ్వినీ దేవతలు నాసారంధ్రములు, గంధము ఘ్రాణేంద్రియము, ముఖము యగ్ని నేత్రము లంతరిక్షము, నయనేంద్రియము సూర్యుడు, దివారాత్రులు కనురెప్పలు, భృకుటి బ్రహ్మపదము, జఠరము సముద్రములు, శల్యములు పర్వతములు, నాడీమండలము నదులు, మనస్సు చంద్రుడుగా విరాట్ పురుషుని దివ్యరూపముగ వర్ణింపబడినది.

మోక్షము గోరువారు దీనిని ధ్యానించి శ్రీహరిని మనసార తలచవలయును. విశ్వమయుని పూజించుట తరించుటకు మార్గము. మహామహనీయ గుణమూర్తియగు జగన్నాథుని స్మరణతో మోక్షము సిద్ధించును. ఆ పరమేశ్వరుడే యనంతనామములతో రూపములతో వర్తించు చుండెను. అందుచే, ప్రకృతిలో ఏది దర్శించి యారాధించినను శ్రీహరికే చెందగలదను గాఢ విశ్వాసముతో సంచరించుట శ్రేయము.

బ్రహ్మ తేజమును, పటుత్వము దేవేంద్రుడు ఇచ్చును. ఆదిత్య దేవతలు స్వర్గసుఖములు కల్పింతురు. దుర్గాదేవి సంపదల నిచ్చును. భూదేవి పుష్టినొసగును. గంధర్వులవలన సౌందర్యము, యజ్ఞమువలన కీర్తి పెరుగును. శంకరుడు విద్యలను శ్రీహరి పురుషార్థములను ఇచ్చును. భోగముల నింద్రుడు దయచేయును. కావున యన్నిటికన్న పురుషార్థములు శ్రీహరిసేవతో గల్గుటచే యా హరి సేవవలన పొందరానిది లేదని" శుకమహర్షి చెప్పెను. ఆ మాటలు విని రాజు 'స్వామీ! నాకు విష్ణుభక్తి వృద్ధినొందుచు శ్రీహరిని ధ్యానించుచు చిత్తస్థైర్యము గల్గుటకు మార్గముపదేశింపు 'మని ప్రార్థించెను. శుకుడు నవ్వుతూ చెప్పనారంభించాడు.

## పురాణ లక్షణాలు

పురాణ గ్రంథమునకు పంచలక్షణములు ప్రధానము. సర్గము, ప్రతి సర్గము, వంశము వంశానుచరితము, మన్వంతరములు – వాటి విశేషములు గల్గియుండునది మహాపురాణమందురు దానికి యుప లక్షణములు కూడా వున్నవి. వాటిని వివరించెదను. సర్గమనగా సృష్టిక్రమము. ప్రతివర్గమనగా ప్రళయము, మనువుల పరిపాలనము – విశేషములు మన్వంతరము.

వంశములకు సూర్య చంద్రవంశముల ప్రారంభము. అందు

జన్మించినవారు. వారు చేసిన మహాకార్యములు. ఇవియన్నియు కలిసియున్న గ్రంథమును పురాణమందురు. ఉపలక్షణములలో విసర్గము బ్రహ్మయుత్పత్తి. సృష్టిక్రమము, స్థానము, భగవద్విజయము, భక్తరక్షణము, ముక్తిపొందుటకు సాధనములు, సృష్టిస్థితి లయస్థాన విషయము ఇవన్నియు వుండును. ఇట్లు పురాణమును గురించి వివరించి శ్రీశుకుడు కథారంభము గావించెను.

విదురుడు తీర్థయాత్రకు బయలుదేరెను. దారిలో మైత్రేయుడు కలిసెను. విదురునివలన మైత్రేయుడు జ్ఞానము పొందెనని కథారంభము గావించెను. విదురుడు తీర్థయాత్రలకెందులకు బయలు దేరెను? దాని విషయము ముందు చెప్పు మని రాజడిగినాడని, సూతుడిట్లు విదురుని తీర్థయాత్ర విషయిమందుకొనెను, వనవాసాజ్ఞాతవాసాదుల శ్రమపడి యెటో వ్రతభంగము కాకుండా తీర్చిరి. తరువాత ధర్మరాజాదులు గోపాలమూర్తిని కౌరవసభకు రాయబారిగా పంపిరి. ఆసభలో కృష్ణుడు జరిగిపోయిన దానిని వదలి, యుభయవర్గములు సంధిచేసుకొని, క్షేమముగ నుండుడని బోధించెను. దుర్యోధనుడు దుష్టస్నేహ ప్రోత్సాహముతో రాయబారము చెడగొట్టెను. తరువాత విదురుడు ధృతరాష్ట్రునితో రహస్యంగా –

"శ్రీకృష్ణుడు సాక్షాత్పరమేశ్వరుడు, ఆయన మాటలలో సత్యమున్నది. దానిని జరుపుట మంచిది, అట్లు జరపనిచో వంశనాశనము కీర్తినాశనము జరుగును. నీవైనా నా మాటలు విని యందరను బ్రతికించు" మని యెన్నో విధముల బోధించినను వినక కుమారుని కాదనలేకపోయెను. విదురుడు విసిగిపోయి యుద్ధరక్తపాతము చూడలేక తీర్థయాత్రలకేగెను.

# విదురుడు - మైత్రేయుడు

దారిలో మైత్రేయుని కలిసెను. వారట్లు పోవుచు తీర్థ యాత్రలు

చేయుచుండగా, దారిలో శ్రీ కృష్ణభక్తుడు యుద్ధవుడు గన్పించెను. వానితో విదురుడు శ్రీకృష్ణకుశలవార్తలు చెప్పమని యుడుగగా శ్రీకృష్ణడవతారము చాలించెనని చెప్పెను. విదురుడు చాల దుఃఖించెను. శ్రీమన్నారాయణుడే "శ్రీకృష్ణుడు. ఆయన భూమిపై సజ్జనులను రక్షించిన మహానుభావుడని యెంతగానో యాక్రోశించెను. తరువాత యుద్ధవుడు "విచారముడుగుము. నీవు శ్రీకృష్ణునివలన పొందిన తత్త్వమును మైత్రేయునివలన జ్ఞానోపదేశముగా పొంది నలుగురకు విరజిమ్ము" మని ప్రోత్సహించి తనదారిన తాను పోయెను. ఉద్ధవుని సలహానుసరించి మైత్రేయునాశ్రమము ప్రవేశించి యాతని కలుసుకొని యిట్లడిగెను.

"అయ్యా! నీవెవరవు? చెప్పు" మనగా విని "నేను వ్యాసపుత్రుడను, శూద్రుడననెను. దాసీక్షేత్రమున వ్యాసాంశముతో జన్మించినవాడను. తల్లిమాట దాటలేక వ్యాసుడు దాసిసంగమ మాచరించెను. సత్యవతి శంతనుని భార్య, ప్రథమ సంతానమగు భీష్ముడు, తండ్రికి సవతి తల్లియగు సత్యవతిని పెండ్లి చేయదలచి బ్రహ్మచర్యదీక్ష నాజన్మాంతము దాల్చినాడు. సత్యవతి సంతానము నశించినది. ఆమెకు గల్గిన నా తండ్రి వ్యాసుని పిలిచి వంశము నిల్పుమని కోరినది. ఆమె కోడండ్రు వ్యాసుని రూపం సహించలేక పోవుటచే వారి దాసిని యలంకరించి వ్యాసుని జేరబంపిరి. ఆమె వ్యాసబీజము ధరించి నన్నుకన్నది. అందుచే నేను వ్యాససుతుడ"నన్నాను. తరువాత మైత్రేయుడిట్లు ప్రశ్నించెను.

"నీవు యమధర్మరాజు యంశమందు రదియెట్లు జరిగినద"ని యడిగెను. మాండవ్య మహాముని శాపముతో యముడు శూద్రయోనిలో జన్మించెను. ఆ విషయమును వినుము. ఒకప్పుడు రాజకోశాగారంలో దొంగలుపడ్డారు. పసిగట్టిన పహరాభటులు వారిని తరుమసాగారు. దొంగలు

మాండవ్యాశ్రమములో దాగుకొనడం వలన రాజభటులాయన గూడ దొంగయని భావించి, బంధించారు. ఆవేశపరుడయిన రాజు విచక్షణా రహితంగా అందరికీ శిక్షలు విధించారు. ఆరీతిగా మాండువ్యునకు కూడా కొఱత వేయబడెను. మరణానంతరము ఆయన యముని చేరి తన శిక్షకు కారణమడుగగా చిన్నతనమున తూనీగలకు సూదులు గ్రుచ్చుటయే కారణమనగా విని యముని చూచి ధర్మాధర్మము లెరుగనివాడవు, నీవు కొన్నాళ్ళు శూద్రయోనిలో జన్మించి యుండుమని శపించెను.

అందుచే నేను యమధర్మ రాజాంశ సంభూతుడిగా చెప్పబడుతున్నాను. వర్తమానంలో - ధృతరాష్ట్రుడు శ్రీకృష్ణుని రాయభారమును, నాహితవును విననందున విసిగి నేను తీర్థాటనకై బయలు దేరినాను. దారిలో నుద్ధవుడు కన్పించి "మిమ్ము దర్శించి మహాజ్ఞానమును పొందుమని" ప్రోత్సహించి పంపెను. "అందులకై తమ దర్శనమునకు వచ్చితినని చెప్పెను. మైత్రేయుడు విని "నీవు శ్రీకృష్ణభక్తుడవుగాన ఆ ప్రభువు తన నిర్యాణ కాలమందు నీకు జ్ఞానోపదేశము చేయమని చెప్పినాడు, ఆయన చెప్పిన యుపదేశమిది, భగవంతుడు సృష్టికి పూర్వము మాయను తనలో నిముడ్చుకొని యోగనిద్రలోనుండి, తరువాత సృష్టి ప్రారంభము చేయుటలో మాయను లోకములకు విడుచును. పరమేశ్వరుడు జీవులలో నాత్మరూపములో నుండి లోకవ్యవహారములు నడుపుచుండును. విలాసముగా ననేక రూపములు దాల్చి క్రీడించుచుండును. ఈ ప్రపంచమంతయు పరమేశ్వరుని విరాట్ స్వరూపమని తెలియును.

చలనములేకుండా ప్రతిజీవిలోనూ యీశ్వరాంశముగోళ్లి త్రిప్పుచున్నది, భగవంతుడు నిశ్చలుడు, అతడు జీవుల దేహములలో నున్నను శరీరాత్మకమగు కర్మలనంటకుండా యట్లే నిలచియుండును,

సంసారతాపత్రయము నశించు కీశ్వరసేవా విధానమే ముఖ్యమార్గము, ఇది యీశ్వర విలాససంబంధమగు తత్త్వ మని వివరించగా నాతడానందించి సందియములు తీరగా తృప్తుడయ్యెను. తరువాత విదురుడు మైత్రేయుని చూచి యిట్లడిగెను. మహాత్మా! విష్ణుకింకరులయిన జయవిజయులు రాక్షసులుగా జన్మించిరని విన్నాను. ఆ చరిత్రము చెప్పమని అడగగా – మైత్రేయుడు పరమానందమంది ఈశ్వర విలాసము విచిత్రముగా నుండును, ఎవరికెట్లు విధించునో యప్పటివరకు తెలియదు, ఆ సమయములో నేదోయెక మిషమీద వారి నా కర్మమునందు ముంచును. తద్వారా జన్మమేర్పడును. కర్మక్షయ మగువరకు వారందరా జన్మకు లోబడి యుండవలసి యుండును.

# జయవిజయుల రాక్షస జన్మలు

జయవిజమయులు శ్రీహరి ద్వారరక్షకులుగా వుండేవారు. వారు విష్ణు పాదాశ్రయులు. భక్తగణము నిరంతరము వారినుండియే శ్రీహరిని దర్శింపవలయును. అట్టిమహాపుణ్యాత్ములు హరిమందిరమున కావలిగా యుచున్న సమయములో – సనక సనందనాది మునీంద్రులు బాలక వేషములలో పరుగులెత్తుచు పోవుచుండగా వారిని జయవిజయులడ్డగించిరి. దానితో కోపము చెంది "శ్రీహరి దర్శనమునకు మీయనుజ్ఞ గావలయునా? మమ్ము మీ రగౌరవము చేసినారు గాన, మీరీ హరివాసము నందుండ నర్హులుకారు. భూలోకమున రాక్షస జన్మలెత్తుడు పొండని " శపించిరి. వారదిరిపడి తమరపాటునకు దుఃఖితులై యుండగా శ్రీహరి వచ్చెను. నారాయణు పాదములపై పడి, జరిగినది వివరించిరి.

అది విని, శ్రీహరి "మునులశాపము తప్పదు, భూలోకములో

జన్మింపకతప్పదు. మీరు నాతో స్నేహముగానుండి యేడు జన్మలలో నన్ను కలియుదురా? లేక, విరోధులై తిరుగుచు మూడు జన్మలెత్తిమీ స్థానములకు వత్తురా? ఇదియే నేజేయు సాయమనగా విని "మాకునీతో విరోధముగా నుండి మూడు జన్మలలో నిన్ను జేరునట్లువరమీయుమని" ప్రార్థించిరి. శ్రీహరి సమ్మతించెను. అంతవారు దితిగర్భములో రాక్షసవీరులై జన్మించిరి. ఆసమయమువలులో దితి కశ్యపునాశ్రయించినది. తనకు సంతానము ప్రసాదించుమన్నది. నాసవతులు సంతానవతులగునపుడు నాకు సంతానము కావలదా! యది గ్రహింపుడని కోరినది. ఆ తొందరపాటులో నామె సంధ్యాసమయమందు తేజము నిల్పుమని కోరినది. దానితో నామె గర్భమున యిరువురు కుమారులు గల్గిరి. వారు వీరాధివీరులై యుందురని కశ్యపుడే నిర్ణయించెను. దితి తన పుత్రులు రాక్షసలగుటకు విచారించినది.

అందుపై కశ్యపుడు దేవీ! నీవు సంతానము గురించి బాధపడకుము. నీకుమారుని గర్భములో పవిత్రుడు, మహనీయుడు యైన పురుషుడు జన్మించి, కులము పావనము చేయువాడగును. వాని భక్తికి శ్రీహరి స్వయముగా వచ్చి దీవించి నీవంశమునకు వన్నె పెట్టునట్లు చేయును. హరి దయావీక్షణము మన మీద తప్పక బడును. మనవారందరు పుణ్యలోక నివాసులగుదురని చెప్పెనని విదురునకు వివరించెను.

తరువాత దితి, నూరుదివ్యవత్సరము లాగర్భభారము మోసి, చివర కిద్దరు కుమారులను కనినది. వారే హిరణ్యాక్ష, హిరణ్యకశిపులుగా పేరుపడిన రాక్షసవీరులు. శ్రీహరి వరాహరూపముతో హిరణ్యాక్షుని వధించెను. హిరణ్యకశపుడు హరిభక్తుడైన తన కుమారుని పెక్కు బాధలుపెట్టగా నాతడు హరిభజనము వదలకుండా బాధలు సహించి శ్రీహరిని స్మరించగా, వాని తండ్రిపెట్టు బాధలు నాతడు సహించి సుఖముగా నుండెను. కాని

హిరణ్యకశ్యపుడు వానిని పరీక్షింపతలచి హరిని చూపుమని, ఈస్థంభ మందున్నాడా? అని గద్దించెను ఉన్నాడన్న మాటవిని హిరణ్యకశ్యపుడు స్థంభము గొట్టగా అందుండ శ్రీహరి నరసింహ దేవుడుగా అవతరించి వానిని సంహరించి ప్రహ్లాదుని రక్షించెనని చెప్పగా విని – యిట్టి భక్తి దైవయోగమున గాని రాదుగదా! రాక్షసపుత్రుడైన ప్రహ్లాదునకెట్లోచ్చెనని ప్రశ్నించెను. మహాముని యిదివాని పురాకృత పుణ్యఫలమేగాని వేరొకటికాదు సుమా! ఈ బాలుడు లీలావతి గర్భములో నుండగా యింద్రుడామెను చెరబట్టి గొనిపోవు సమయములో నారాయణ భక్తి స్వరూపుడగు నారద మహాముని యాదారని పోవు సమయములో నారాయణ భక్తి స్వరూపుడగు నారద వంహావుని యనాదారినిపోవుచు ంయింద్రునిచూచి గద్దించి దేవరాజ్యాధిపత్యమువహించి ధర్మమునెరవేర్తునన్న దీక్షబూనిన నీవే యొంటరిగా నుండిన, గర్భిణీ యబలను చెరపట్టెదవా! యని యడిగెను. ఇంద్రుడు "లీలావతి భర్తకు భయపడి వురలవాని యంశవములో బుట్టినవాడెంత దుష్టుడగునో యన్న భయముతో ఈ గర్భస్థశిశువును సంహరించదలచితి" ననగా "చాలు నీ ప్రయత్నము విరమింపుము. నీ దారిని నీవు పొమ్ము"యని యా యింద్రుని నారదవుహావుని సాగగనంపి, యామెను తన నివాసమునకు గొనిపోయెను.

అచట లీలావతికి వుహాజ్ఞాన వుుపదేశించుటకు నారదుడు మొదదలిడెను. గర్భభారమున లీలావతి నీరసపడి వినజాలని సమయములో గర్భస్థుడగు బాలుడా నారదుని భక్తి బోధలు చక్కగా నాలకించి ప్రముఖుడాయెను. ఆ యుపదేశమే ప్రహ్లాదుడిని మహనీయునిగా చేసింది. అందుచే యోగము కర్మ సకల జీవులను మార్చగలదని చెప్పి ముందు కథకు సాగెను.

# కపిలుడు - దేవహూతి

ఇట్లు శ్రీశుకుడు చెప్పెనని సూతుడు శౌనకాదులకు భాగవత కథను విన్పించసాగెను. "నాటి సాంఖ్యయోగము రచించిన కపిలమహాముని యెవరికి జన్మించెను. ఆ మహానీయుని దివ్యచరిత్రము విన్పించు"మని వారడుగ శ్రీశుక యోగీంద్రుడు పరీక్షితునకిట్లు చెప్పనారంభించెను. మున్ను పృథుచక్రవర్తిని గురించి లోకములు ఘనముగా చెప్పుకొన్న విషయము తెలుసుకదా! ఆయన భూదేవిని ధేనువుగా జేసి యౌషధులను బిదికిన మహనీయుడు. ఆయన మనుమడు ప్రాచీన బర్హి. ఆ మహారాజు పెక్కు యాగములు గావించి శ్రీహరి ప్రసాదము బడసినవాడు. నారదుని వలన మహాతత్త్వముపదేశమందిముక్తుడయ్యెను. ఆ మహానీయుని చరిత్ర పరమపావనమైనది. ప్రాచీన బర్హికి దివ్యోపదేశము చేయుదలచి నారదముని యాతని కడకు వచ్చెను.

రాజాతనికి సమస్త పూజలుగావించి కూర్చుండ జేసి"మహాత్మా! నేను సంసార బంధనములో చిక్కుకొన్నాను, ఇందుండి విడనడు మార్గముపదేశము చేయు"మని ప్రార్థించెను."నీవు మహాక్రతువుల గావించి పెక్కు పశువులను వధించినావు అవి యిప్పుడు – నీవెప్పుడు దొరుకుదువా అని – నిన్ను కొమ్ములతో నెగజిమ్ముటకు సిద్ధముగా నుండి బుసలుకొడుతున్నవి. నా మాటయందు నీకు నమ్మకము లేకపోతే నీవే చూడు మని తన కమండలములోని జలముతో అతని కండ్లు తుడిచెను. అప్పుడు అతనికి ఆ పశువులు వరవళ్ళు ద్రొక్కుతూ కొమ్ములు విసురుతూ భయంకరముగా కన్పించగా చాలా భయపడెను. ఆ భయముతో నారదమహాముని పాదములంటి"స్వామీ! నేను వీటినుంచి తప్పించు కొను నుపాయము సూచించుడని" ప్రార్థించెను.

నారదముని ఆ రాజు ప్రార్థన లాలకించి"రాజా! నీవు భయపడ నవసరములేదు. వాటి వలన యుపకారమురాదు. నీకు నాయుపకారముతో ముక్తి లభించును. విచారించకు మని యిట్లుదేశించును. - "ఈ శరీరమొకయూరు. ఆ యూరి యందున్న జీవుడు రాజు. వానికి వాని బుద్ధియే భార్య. శరీరములోని తొమ్మిది రంధ్రములు తొమ్మిది ద్వారములు. ఇందు, బుద్ధియను స్త్రీ యింద్రియాల సుఖులతో స్వేచ్ఛగా సంచరించు చుండును. జీవుని తన స్వాధీనములో నుంచుకొని, తనకు నచ్చిన విధముగా త్రిప్పుచుండును. అందుచే జీవుడా బుద్ధియు, నింద్రియములు చెప్పినట్లునడువక యనగా ప్రకృతికి స్వాధీనము గాకుండ జాగ్రత్త గల్గి సంచరించవలయును. అనగా, ఇంద్రియ లోలత్వముతో నడువక బుద్ధిని యీశ్వరార్పణ కార్యములందు ప్రవేశ పెట్టించి భగవంతునిచసేవించిన వారికే భయమును రాదు; లేదు; ప్రతి దేహధారీ జీవాత్మ పరమాత్మలను నేర్పుగా గ్రహించి, జీవాత్మను పరమాత్మ సన్నిధానమునకుక్రమముగా జేర్చుచు, యందు లయించినచో ధన్యులగుదురు. ఇంద్రియలోలురైనవారు, బుద్ధిని యింద్రియములు ప్రోత్సహించునట్లు త్రిప్పుచు సంసార సుఖములనే శాశ్వతముగా భావించి యందే మున్గుచు తేలుచుందురు. పరమాత్ముని చేరలేరు, పెద్దలగువారు సమస్తమెరిగి బుద్ధిని నిగ్రహించి, కామసుఖములను వాంచింపక, నిగ్రహ బుద్ధితో సంచరించి, ఈశ్వర సేవయందే నిమగ్నులై యుందురు.

పామరులు చేయు పనులు గూడ వివరించెద వినుము. పామరులనగా ఇంద్రియములకు స్వాధీనులై యిహ సౌఖ్యములనే స్థిరముగా భావించువారని యర్థము. ఈ పామరజనము యిల్లు, వాకిలి, భూములు, ధనము, భార్యాబిడ్డలు వీనినే స్థిరమగు వానిగా తలచి నిత్యం వానిని పోషించుటకు,

వృద్ధి చేయుటకు తమ జీవితకాలమంతా వృథాగా వ్యయము చేయుచు, కామ క్రోధ లోభములకు స్వాధీనముగా నుండి, పరహింస పరోపకారము - పరనిందలు గావించుచు, వాటికి లొంగి తమ జీవితం గడుపగా - ముసలితనం మీద పడును. అప్పుడు శరీరంలో యింద్రియములు పట్లు తప్పి రక్త బలంచెడి కఫవాత పిత్తములు పెచ్చు పెరిగి బాధించుచుండగా మంచము పట్టి జీర్ణావస్థలో శరీరముండగా కృశించి పోవుదురు. ఈ శరీరము నుండి ప్రాణవాయువు లెగసిపోవు వరకు శరీరాభిమానముతో నుండి నానా విధముల మనోవైకల్యము లనుభవించుచు శరీరమును వదులుదురు. ఇట్లు చనిపోయిన జీవిని యమదూతలు పట్టికొని పోయి లెక్కచూచి నరక వాస శిక్షలనుభవింప జేయుదురు. మరల కొన్నాళ్ళకు జన్మ లెత్తుచు చచ్చుచు తిరుగుచుందురు.

తరువాత, కపిలుని చరిత్ర వారంభించెను. "శ్రీహరియే కపిలావతారుడై జన్మించెను. ఇది శ్రీహరి యవతార చరిత్రము వినుౕ మని మొదలు పెట్టెను. కర్దమ ప్రజాపతిని బ్రహ్మదేవుడు చూచి"పుత్రా! నీవు భార్యను గ్రహించి సంతాన వంతుడవు కమ్ము దానితో కృతార్థుడవగుదు"వని ప్రోత్సహించెను. అతడు బ్రహ్మయుపదేశము ననుసరించి పుష్కర తీర్థమున కొన్నివేల సంవత్సరములు తపమాచరించి శ్రీహరి కటాక్షము పొందెను. పద్మనాభుడు ప్రత్యక్షమై కర్ద ప్రజాపతీ! నీ తపమునకు మెచ్చితిని. నీకు వలయువరములను వేడు మన్నాడు. దానికా ప్రజాపతి పరమానందమంది "గరుడ వాహనా! నీవు నా యందు దయుదలచి వరమునీయ వచ్చినందులకు సంతోషమైనది. నా తండ్రి యాజ్ఞాను సారము వివాహమాడదలచితిని. నాకు సరిపడు కన్యారత్నమును ప్రసాదింపచేసి కృతార్థుని చేయువేడెదన "నెను. ఆ మాటవినిన చక్రధారి"రేపు స్వాయంభువమనువు తన కుమార్తె నిత్తునని

నీ వద్దకు వచ్చును. నీవామెను పరిగ్రహింపుము, ఆమె వలన నీకు తొమ్మండుగురు కన్యలు, నొక కుమారుడు గల్గుదురని యానతిచ్చి వెళ్ళిపోయెను. మరునాడు సాయంభువ మనువు తన భార్యకుమార్తెలతో వచ్చి కర్దమ ప్రజాపతిని వివాహమాడు మని కోరెను. అందు కాతడు స్వాయంభువమనువా! నాకొక నియమము గలదు. నీకుమార్తె గర్భము ధరించగా తరువాత నేనామెను విడిచెదను. మీకు దాని కంగీకారమైన మీ కుమార్తెను వివాహమాడుదు ననెను. వారాలోచించుకొని యా సమయమునకు సమ్మతించిరి.

కర్దముడు మనువు కూతురయిన దేవహూతిని వివాహమై బిందు సరోవరములో స్నానము చేయించగా అందు నుండి కొన్ని వేలమంది కన్యలుద్భవించి దేవహూతిని సేవించసాగిరి. కర్దముడు తన తపోబలముతో నొక దివ్య విమానమును కల్గించెను. తన భార్యా దేవహూతిని, యాకన్యకామణీ పరిచారికలను దానిపై నొక్కొంచి తా ముందుండగా విమానము ఆకాశ మార్గమున మేరు పర్వత ప్రాంతమునకు జేరెను. అచ్చట వారు సుఖభోగములను భవించు కాలమున దేవహూతి తొమ్మండుగు కుమార్తెలను కన్నది. కర్ధమ ప్రజాపతి తానిచ్చిన మాటననుసరించి భార్యను వదలజూచు సమయములో దేవహూతి "నీకు గల్గిన ఈ స్త్రీ సంతానము నన్నేమి ఉద్ధరింతురు? వారు పెరిగి పెద్దవారై యత్తవారింఢ్లకిపోదురు. మీరు నన్ను విడచినచో నాకెవరుతోడు! నా కడుపున పురుషసంతానము గల్గిన తరువాత మీరు నన్ను వదలినను బాధగల్గ"దని బ్రతిమాలెను, ఆతడది విని మరల యామెతో సంసారము చేయుగా, కొన్నాళ్ళకు దేవహుతి గర్భవతియై కుమారుని ప్రసవించినది. అతనికి కపిలుడను పేరు పెట్టిరి. కపిలుని జననమునకు దేవతలానందించి పుష్ప వర్షం గురిపించిరి. బ్రహ్మాది దేవతల కపిలుని జన్మకానందమంది శ్రీహరి యవతారము గాన యనేక విధముల

నుతులు గావించి, తమ సంతోషము వెలిబుచ్చిరి. పుత్రికలను మహామునులకు వివాహము గావించుమని చెప్పిరి. ఆ కన్యలలో తొలిపిల్లను మరీచికి, యనసూయ నత్రికి, నంగీరసమునికి శ్రద్ధను, అహిర్భుధ్న్యను పులస్త్యునకు, గతిని పులకునకు, క్రియను క్రతువునకు, ఖ్యాతిని భృగునకు, వశిష్ఠునకరుంధతిని యథ్వర్యునకు శాంతిని యిచ్చి పెండ్లి గావించెను తరువాత శ్రీహరిని స్మరించుచు కర్దముడు ముక్తిని సంపాదించెను.

తరువాత తల్లికి – శ్రీహరి యవతారమైన కపిలమహాముని – దేహము, జీవుడు యింద్రియముల బాధలు, జ్ఞాన మార్గము, ఈశ్వరుని సేవించు భక్తి యోగ మార్గముపదేశించెను.

# ఋషభ చరిత్రము

శ్రీ మన్మహాభాగవతమును శుకమహాముని పరీక్షితునకు విన్పించుచుండెను. రాజు శ్రద్ధాసక్తులతో వినుచుండెను.

ఋషభుని చరిత్ర ప్రారంభమైనది. "ఆ ఋషభుడెవరు? హరి యెందుకా యవతారమెత్తెనో వివరించుమనీ రాజు కోరగా మునీంద్రుడిట్లారంభించెను. స్వాయంభువ మనువునకు ఉత్తానపాద, ప్రియవ్రతులను పుత్రులిరువురండిరి. ప్రియపుత్రుడు బర్హిష్మతియందు పదిమంది కుమారులనుగనెను. వారిలో నేడుగురు సప్తద్వీపాధిపత్యము పొందిరి. ముగ్గురు తపోవృత్తితో వెడలిపోయిరి. జంబూద్వీపాధిపతియగు నాగ్నీంధ్రుడు పూర్వజీతుయను దేవకన్యను పెండ్లాడి తొమ్మడుంగురు కుమారులను కనెను. తరువాత యామె దేవలోకమునకు పోయెను.

ఆమె బిడ్డలైన తొమ్మండుగురిలో నాభీయనువాడు శ్రీహరిని గురించి ఘనముగా తపమాచరించెను. నీవంటి కుమారుని ప్రసాదించమని

ప్రార్థించెను. అతని కోరిక ననుసరించి శ్రీహరి వానికి కుమారుడై పుట్టెను. ఆ శిశువునకు ఋషభుడను నామకరణము గావించెను. నాభి, హరిభక్తుడగుటచే తన పదవికి మోసమువచ్చునని యింద్రుడు యాతని రాజ్యములో వర్షము కురిపింపలేదు. ఋషభుడు తన మహిమతో కడవపోతగా వర్షము కురిపించెను. అది చూచి తండ్రి పరమానందమంది శతమన్యుని పుత్రిక జయంతితో వివాహము గావించెను. అదివరలోనే తండ్రి కుమారునకు సమస్త విద్యలు నేర్పించిన కారణమున అతడు గొప్ప ప్రజ్ఞానవంతుడయ్యెను. అతనికి భరతుడాదిగా వందమంది పుత్రులు జన్మించిరి ఋషభుడు చాలా కాలము రాజ్యమేలి తుదకు రాజ్యసుఖములు రోసి సమస్త వ్యామోహములు విడిచి బ్రహ్మావర్తము జేరబోవుచుండ మంత్రులు, సుతులు వెంటబడగారాజు యీ ప్రేమ కల్లప్రేమ, జీవులు శాశ్వతముగా నుండు వారుకారు. కానప్పుడీ ప్రేమలెందుకని, వారికి విచిత్రమైన రీతిగా తత్త్వము నుపదేశించి వెనకకు పంపెను, తానరణ్యములో తపమాచరించు వేళ దావానలముచే దగ్ధుడై శరీరము విడచెను.

## ఖగోళ నిర్ణయము

ఇట్లు రాజునకు ఋషభుని చరిత్రము చెప్పి రాజా! వింటివిగదా! ముక్తి పొందదలచినవారు మోహాదులు,కామ క్రోధములు విడిచినగాని సాధ్యపడదని ప్రబోధించి ఖగోళమును గురించి చెప్పసాగెను. రాజా! ఖగోళశాస్త్రము పరమాశ్చర్యకరమగునది. దీని కాధారము, కాలము కాలమునకు హేతువులు - గ్రహములు, రాశులు, నక్షత్రములు మొదలగునవి. ఈకాలమును యేర్పరుచుటకు సూర్యుని గమనము చుక్కాని వంటిది. సూర్యుడు నిత్యము గగనమండలములో సంచారము చేయుచుండును. ఆయన కనుపించు కాలము పగటిభాగము. కనుపించని

కాలము రాత్రిభాగము. ఇట్లు రెండు భాగములు కలిసిన మనుష్యమానములో నొక రోజగును. అట్టి రోజులు ఏడైన వారమందురు. నాల్గువారములు నెల. రెండు నెలలు ఋతువుగా చెప్పబడును. ఆరుమాసములొక అయనమందురు. రెండయనములు సంవత్సరమగును. అనగా సంవత్సరమునకు, ఉత్తరాయణ దక్షిణాయనములను రెండింటిని. సూర్యగమనమును బట్టి నిర్ణయించిరి. మూడు ఋతువు లయనము. రెండుమాసములు ఋతువు గదా! ఇట్లు కాలము పరమేశ్వర స్వరూపమ్మై జీవులు శరీరము ధరించి సంచరించుటకు పరిగణనములో నుపయోగించును. ఈ సూర్యగమనము – రాశులతో సంచారమును బట్టి వాతావరణము, జీవుల యోగావయోగ నిర్ణయము గావించుడును. రాశులు పండ్రెండు, అవి మేష, వృషభ, మిధున,కర్కాటక, సింహ, కన్యా, తులా, వృశ్చిక, ధనూమకర, మీనములు, అశ్విని మొదలు రేవతీ నక్షత్రపర్యంతం నక్షత్రములు ఇరువదేడుగా నిర్ణయింరి.

సూర్యుడు తన గమనములో రోజానకు తొమ్మిదికోట్ల యేబదియొక్క యోజనములు తిరుగును. చంద్రుడు మొదలగు గ్రహములు భూమికి కొన్ని లక్షల యోజనముల దూరములో నుండును. చంద్రునకు పైన నక్షత్రములు వాటిపైన శుక్రుడు అతనికి పైన గురుడు, శని, వాటిమీద సప్త ఋషిమండలము, దానిపైన శింశుమార చక్రము, ధ్రువఖ్యింద్ర, వరుణ, కశ్యపాదులతో చరించునని ఖగోళమును గురించి చెప్పెను.

## అజామిళోపాఖ్యానము

ఇట్లు శుకముని మహాభాగవతము రాజానకు విన్పించుచు, "అంత్య కాలమున హరి నామ స్మరణము చేయుచు ప్రాణములు విడిచిన వాడెంత పాపాత్ముడైన శ్రీహరి లోకమగు వైకుంఠము చెంద గల"డని రాజాతో

ముందు సూత్ర ప్రాయముగా భక్తి బలమును గురించి వివరింపగా రాజా విని "మహామునీ మీరు చెప్పిన విధముగా నెవరైన అంత్య కాలమునందా హరినిస్మరించి మోక్షము నొందినారా? ఆ విషయము నాకు విన్పింపు" మని కోరెను. మహాముని సంతోషముతో 'రాజా' నీవడిగిన ప్రశ్నకు జవాబుగా నేనొక దివ్య వృత్తాంతము విన్పింతునని యిట్లు ప్రారంభించెను.

పూర్వం కన్యాకుబ్జమనే నగరంలో అజామిళుడను బ్రాహ్మణుడు కలడు. అతడు సదాచార కుటుంబములో జన్మించెను. ఉపనయమైనది మొదలు వేదములు, శాస్త్రములు నేర్చుకొని తన వంశము వారు మెచ్చునట్లు సంచరించసాగెను. అతడట్లు పరమ నైష్ఠికుడై సంచరించుచుండగా శరీరధారులకు పరీక్షాసమయమగు యౌవనమంకురించింది. దాని వలన వానిలో కామ వాంఛ రేకెత్తినది. తండ్రితో నగ్ని హోత్రాదులు గావించుచున్న కాలమున సమిధలు, పూవులు, కుశలు సంపాదించుట కరణ్యమునకు బోయెను. ఆ సమయమందొక నీచ జాతి స్త్రీ యొుకపొదలో జారపురుషునితో రతియందు దేలుట చూచెను. అది చూచి అతనికి మతి భ్రమించినది. ఇంతి మాట, తండ్రిమాట, యగ్నిహోత్రముల మాట – అన్నియు మరచిపోయి యా జారిణి స్త్రీ యందే మనసు నిల్పి యామెను పొంద గోరెను. తనతో తెచ్చిన ఫల, కుసుమ, కుశాదులు దూరముగా విసరివైచి, యామె దరికి చేరి పొందు నర్థించెను. ఆమెను యొుడబరచి, దానికి తాను భర్తగా మారి యడవిలో నొక కోయపల్లె వద్ద కాపురము పెట్టి తన వంశమునూ, మర్యాదనూ మంట గలిపి, దాసీ భర్తగా పేరొంది – భ్రష్టుడై యడవిలో నుండ సాగెను. ఆ నీచ స్త్రీ వలన యజామిళుడు నలుగురు సంతానమును పొందెను. చివరగా ఒక మగపిల్లవాడు పుట్టెను. వానికి నారాయణుడని పేరు పెట్టెను. చంటివాడు కావున వానినా యజామిళుడు

గారాబముగా చూచి లాలించుచుండెను. కొంత కాలమున కజామిళునకు వార్థక్య స్థితి వచ్చినది శరీర పటుత్వము తగ్గినది. దగ్గు, పగర్పు, ఆయాసము పెరుగుచుండెను. మంచము పట్టెను. క్రమముగా మృత్యుకాలము సమీపించెను. మరణబాధ పడుచుండెను. కొంతసేపటికి యమకింకరులు వలలు పాశములు పుచ్చుకొని మహాభయంకర రూపములతో వచ్చి యా జీవిని బంధించి గొనిపోవ చుట్టూ తిరుగుచుండిరి. ప్రాణవాయువులు శరీరాన్ని వదులు సమయమున కాతనికి - తన కడసారి కుమారుని చూడవలెనను వాంఛ గల్గి "నారాయణా! నారాయణా! నారాయణా!" యని ముమ్మారరచి ప్రాణములు వదలెను. వెంటనే కాలకింకరులు వచ్చి యా జీవిని బంధించబోయిరి. ఇంతలో ఒక దివ్య విమానమున విష్ణుకింకరులు వచ్చి యమదూతలను గట్టిగా గద్దించి దూరముగా నెట్టిరి. వారు తెల్లబోయి చూచి "మమ్ము మీరెరుగరు. మేము యమధర్మరాజు దూతలము. యమునాజ్ఞ ధిక్కరించ నెవరి శక్యము? మీరు యెవరు? " మేము శ్రీహరి దూతలము. మా ప్రభువాజ్ఞ ననుసరించి యీ పుణ్యజీవిని గొనిపోవ విమానము గొనివచ్చినాము. మీరీతని బంధింపలేరు. ఇంక మీరు పొండ" నిరి. యమదూతలు ఆశ్చర్యపోవుచూ - ఈతడేమి పుణ్యుడయ్యా! బ్రాహ్మణ వంశములో జన్మించి సమస్తకులాచారములు వదలి వర్ణ సంకరుడైనాడు. నీచ స్త్రీ వలన సంతానము పొంది వారితో జీవయాత్ర సాగించి, సమస్త ధర్మములనూ వదిలి పెట్టినాడు. దారులు గొట్టి దొంగతనములు గావించిన ఇట్టి మహాపాపి పుణ్యాత్ముడని మీరు బయలు దేరివచ్చినారా? ఇట్లు చేసిన మీ పరపతీ, మీ ప్రభువు పరపతీ యేమైనా యుండునా?" అన్నారు. ఆ మాటలకు విష్ణుదూతలు నవ్వుతూ - ఓ యమదూతలారా! మీకో రహస్యం చెబుతాం గుర్తుంచుకోండి. ఎంతటి పాపాత్ములు కానివ్వండి, యెటువంటివారు కానివ్వండి, యే స్థితితో ఉన్నా, యే భావంతోనైనా సరే

మా ప్రభువైన శ్రీమన్నారాయణుని నామాన్ని స్మరిస్తే వారి సర్వపాపాలు అగ్నితాకిన దూదిలా భస్మమయిపోతాయి. అటువంటిది, ఇతడు తన అవసాన కాలములో మూడుసార్లు నారాయణ నామ స్మరణం చేశాడు. తద్వారా ఇతడు వైకుంఠాన్ని చేరవలసిన మహాపవిత్రుడయ్యాడు. ఇక మీరు దయచేయండి" అంటూ యజామిళ జీవిని బిలిచి,"మా ప్రభువు నీకు కొంత వ్యవధి నిచ్చెను. ఇప్పుడు నిన్ను యమకింకరుల బారినుండి తప్పించితిమి. నీవు యోగ మార్గములో శరీరము వదులుటకు మేము యీ శరీరములో నుంచుచున్నాము. తెలివి గల్గి నారాయణ భజనము గావించుచు యోగ మార్గమున శరీరము వదులుమని" దీవించి, యాజీవిని దేహముందుంచి వారు వెళ్ళిపోయిరి. తన ముందు జరిగిన విష్ణు యమదూతల సంవాదము వినినవాడు గావున శరీరములో ప్రవేశించి నా జీవితము ధన్యమైనది. నాకంత్య కాలమున నారాయణ స్మరణము వచ్చినదని తలచి భార్యపుత్రాదులను వదలి వైచి, హరి నామ స్మరణ మారంభించెను.

అతడట్లు నీచ స్త్రీ సంబంధ జాతపాత కాన్నంతటినీ పొగొట్టుకొని, హరి ద్వారమునకు వెళ్ళి యొక జీర్ణాలయమున ప్రవేశించి, దానిని శుభ్రపరచి యచట యోగమును బూనెను. క్రమముగా యోగియై సమాధిస్థితి పొంది హరి ధ్యానసక్తుడై యోగ మార్గమున శరీరము విడచి వైకుంఠమును చేరెను.

# చిత్రకేతు చరిత్రము

అంత్య కాలంలో యేజీవి నారాయణ నామ స్మరణముతో శ్వాస విడుచునో ఆ జీవి శ్రీహరి నివాసము జెందుననుటకు నిదర్శనముగా శుక యోగీంద్రుడు పరీక్షిత్తునకు యీ కథ చెప్ప తరువాతి కథ నిట్లారంభించెను.

పూర్వము శూరసేన దేశమును చిత్రకేతుడను మహారాజు పరిపాలించుచుండెను. అతనికనేక మంది భార్యలు కలరు. అందులో

పట్టపురాణి కృతద్యుతికి గాని తన ఇతర భార్యలెవరికి గాని సంతానవములేకపోవుటచే రాజు విచారగ్రస్తుడయినాడు. ఇట్లుండగా దైవయోగమున నొకనాడంగీరస మహాముని యా రాజగృహమునకు వచ్చెను రాజా మహాముని కుచిత సత్కార్యములు గావించి దివ్యాసనము మీద కూర్చుండ జేసెను.

మహామునీంద్రుడా రాజు మొగము చిన్నబోవుట చూచి రాజా! నీ మొగము విచారగ్రస్తమై కన్పించుచున్నది. కారణమే"మని యడుగగా - చిత్రకేతుడు"మునీంద్రా! నాకు చాలామంది భార్యలు గలరు. కాని, వారిలో ఏ యొక్కరికినీ కడుపు పండలేదు నాకు సంతానము లేని విచారము పట్టుకున్నది. తమరు దయ యుంచి సంతానముగల్గు యార్గము సూచించ వేడుచున్నా నని" ప్రార్థించెను. దానికా ముని "రాజా! నీకు విచారమక్కరలేదు. నీ పెద్దభార్య సంతానవంతురాలైయుండును. కాని సుఖ దుఃఖములు రెండునూ నీ వనుభవించవలసియున్న" దని చెప్పి తన దారిని తాను పోయెను అంగీరసుడు చెప్పినట్లే రాజు పుత్ర కామేష్టి చేసెను. సంతాన ప్రదమైన యజ్ఞపాయసం నిర్మించబడి, శాస్త్రోక్తంగా అభిమంత్రించబడి రాజునకందీయబడింది. రాజాపాయసాన్ని పట్టపురాణి కృతద్యుతికిచ్చాడు. ఆమె శ్రద్ధా భక్తులతో భుజించినది. తత్ఫలంగా గర్భం ధరించి, సకాలానికి మగబిడ్డను కన్నది. రాజు బాలుడికి శాస్త్రుక్తముగా బారసాల నామకరణాది ఉత్సవములు గొప్పగా సాగించెను. దానధర్మములు, పండితపూజలు, యన్నదానములు, ఇతర మహాదానములు గావించి పిల్లవానిని గారాబముతో పెంచు చుండిరి. అప్పటినుండి రాజునకు పట్టపురాణి యందనురాగము పెరుగసాగెను. వారిద్దరిమధ్యా యాబాలుడు చేయుపనులు నాటపాటల కలరుచు వారు మిన్ను ముట్టసాగిరి. వారట్లుండగా రాజునకున్న యితర భార్య లోర్వలేక వారికెడబాటువచ్చు మార్గమును యోచించసాగిరి.

చివరికందరిలో నొకతె దీనికింత యోచనము చేయుపనిలేదు. ఈ పుట్టిన బాలుని చంపినచో రాజుకు పట్టపు దేవి మీద నున్న మమకారము నశించును. అప్పుడావెం మనతో సమానురాలగు నని యోచన చెప్పెను. వారందరాయోచనకానంద మందిరి. ఒక నిర్ణీత కాలమున యా బాలునకు పాలలో విషమును గలిపి యిచ్చిరి. ఆ రాత్రి యెవరునూ చూడలేదు. బాలుడు నిద్రించుచున్నాడని భావించిరని వాడు యిూసినకన్ను తెరవకట్లే యుండుటను పెద్ద భార్యము, రాజును చూచి విచారించసాగిరి. ఈ దురంత కార్యము యితర భార్యలవలన జరిగినదని మహాముని దివ్యదృష్టిని గ్రహించెను. వెంటనే వచ్చి, తన ప్రభావముతో బాలుని బ్రతికించగా నా బాలుడు వారిని చూచి "ఓ వెఱ్ఱులారా! నా కోసము విచారింతురా? ఎవరికెవరు సంబంధము? ఇదియంతయు ఋణానుబంధము నారాయణుడొక్కడే శాశ్వతతేజుడుగా నెరుగుడు – మీరు విచారము వదలి శ్రీహరి ధ్యానము గావించి తరించు"డని జెప్పి కన్నులు మూసికొనెను.

ఆ యుపదేశము ననుసరించి యా దంపతులాబాలునకు దహనసంస్కారములు గావించి, పిదప, నారదోపదేశముతో భగవంతుని నామమంత్రము జపించుచు యేడురోజులుండిన నారాయణుడు ప్రత్యక్షమై కామగమనముగల విమానము నిచ్చెను. అతడు కైలాసమునకేగి శివదంపతుల నవమానింప వృత్రాసురుడై జన్మించెను.

## త్రిపురాసుర సంహారము

శుకుడు చెబుతున్నాడు–

దేవతలు, రాక్షసులు సహజవిరోధులయిన సవతి సోదరులు. దేవతలను జయించి వారి వైభవములను తాము పొందుటకు రాక్షసులు

సర్వదా యత్నములు చేయుచుండిరి. కాని, దేవతలను జయించలేక యొకసారి మాయాశిల్ప వేత్తయగు మయునాశ్రయించగా శత్రుభేద్యములు గానివి, యిచ్ఛవచ్చిన చోటునకు పోగల, యితరుల కదృశ్యముగా, నుండునవినై యుండునట్లు మూడు పురములను తయారుచేసి వారికిచ్చెను. అవి ఒకటి యినుము, రెండవది వెండి, మూడవది బంగారముతో నిర్మింపబడినవి. త్రిపురాసురులు శత్రువులకుకొంగకుండా ఆయా పురములలో నివాసముగా నుండి ప్రపంచక్షోభ గల్పించుచు మహాభయంకరముగా వర్తింపసాగిరి.

ఈ త్రిపురములు పిడుగుపాటుగా వచ్చి లోకములోని నగరములను, యితరములగు సమస్తములను నాశనము చేయుచుండగా దేవతలు వాటిని జయించలేక శివుని కడకు జేరి తమ్ము రక్షింప ప్రార్థించిరి. శివుడు దేవతల కభయమిచ్చి "త్రిపురములను" నేను హరింతును. మీరు భయమువిడచి స్వస్థతచెందుడని చెప్పియాగ్నేయాస్త్రములుద్భవించియా త్రిపురములను చుట్టుముట్టి జ్వాలలు లేవదీసి యా పురములను, యందుండు రాక్షస గణములనూ సర్వనాశనము గావించెను. చనిపోయిన రాక్షస శరీరములను మయుడు సిద్ధరసకూపమున పడవేయించుచుండగా – వారు పునర్జీవితులై వజ్రశరీరములు కలవారై మరల యుద్ధమునకు వచ్చుచుండిరి. వారిని జూచి దేవతలు చాలభయపడిరి. శ్రీహరి ధేనురూపము దాల్చి యా సిద్ధరసకూపము లోని రసమును త్రాగివైచెను. దానితో రాక్షసులకు బలము తగ్గెను. ఇట్లుచెప్పి, శ్రీహరి యవతారములలో ముఖ్యమనను, సర్వవ్యాపకావతారమును నృసింహావతారమని జెప్పి, ప్రహ్లాదుని చరిత్రకు సూచనగా, శ్రీహరిని నమ్మిన వారికి మృత్యుభయము గాని ఇతరుల వలన భయము గాని రాదుసుమాయని యిట్లారంభించెను.

# శ్రీ నృసింహావతారము

హిరణ్యాక్షుని మరణానంతరము యతని అన్నగారైన హిరణ్యకశివుడు తమ్మునిజంపిన క్రోధముతో శ్రీహరిని వధింపదలచి బ్రహ్మను గురించి గాఢతపము గావించసాగెను. అతడు చేయు తపమునకు ప్రపంచమంతయు దద్దరిల్లినది. లోకములన్నియు కుతకుతలాడినవి. ఇంద్రాదులు గడగడలాడి బ్రహ్మను జేరి యరాక్షసరాజా తపమును మాన్పింపు మని ప్రార్థించిరి. అతడు హిరణ్యకశపునకు దర్శనమిచ్చి కావలయువరము కోరుమనగా – దేనివలనను మరణము లేకుండా వరమిమ్మనెను. అతడు వాని మాట కాదన లేక సరే నని వరదానము చేసి పోయెను. వాడా గర్వముతో లోకములను, లోకపాలురను జయించి, త్రిలోకాధి పత్యమువహించి దేవతలను తరిమివేసెను. వారు చేయునది లేక శ్రీహరినాశ్రయించి ఆ హిరణ్యకశిపుని వధించమని కోరగా కాలము రావలయును. వానికి కూడా కొంత తపోబలమున్నది. వాడు తన కన్నకుమారునితో విరోధపడి బాధించే సమయములోనే వానికి మృతియునెను. ఆ మాటలు విని వారి దారిని వారుపోయిరి. హిరణ్యకశిపుని కొడుకులలో చివరివాడు ప్రహ్లాదుడు మొదటినుండి శ్రీహరియందు భక్తి పూర్ణుడై తిరుగుచుండెను. తండ్రి నారాయణుయందు విరోధముగల వాడుగాన కుర్రవాని తన కులగురు పుత్రుల వద్ద త్రివర్గపాదములు నేర్పపంపెను. వాడందరివలె చదువుచు, యందు సారములేదని స్వంత నిర్ణయములు గావించుచుండి తోడి వారికి నారాయణ భక్తియే తరింపచేయునదని బోధించసాగెను. వారు విని "నీకీ భక్తి యెట్లబ్బినదని ప్రశ్నించగా – నాతడిట్లనెను. "నా తండ్రి తపమునకు పోవగా, నేను కడుపులో వున్న సమయమున నింద్రుడు నా తల్లిని చెరపట్టి గొనిపోవుచుండగా నారద

మహాముని యింద్రుని చీవాట్లు పెట్టి నా తల్లిని వదిలించి తన యాశ్రమములో నుంచుకొని రక్షించెను. ఆ సమయములో నారదమునీంద్రుడు నారాయణ భక్తిని నా తల్లికి బోధించగా గర్భములోనున్న నేను విని యాభక్తిని యందుకున్నా"ననెను. తరువాత హిరణ్యకశిపుడు కుమారుని పిలిచి నీ భక్తి మహిమచూతునని - పాములచే కరపించి, నిప్పులలో త్రోయించి, విషమును తినిపించి, పర్వతశిఖరముల నుండి త్రోయించి, సముద్రమధ్యలో పడవేయించి, భూమిలోపాతించి, యేనుగు గుంపుతో త్రొక్కించి చూచెను. అతడు చావకుండుటచే శ్రీహరిని చూపమనెను. హరి యన్నింటిలో వున్నాడన్న పుత్రునిమాటలతో సభాస్థంభమును బ్రద్దలుకొట్టగా శ్రీహరి నృహరిరూపుడై యందుండి వచ్చి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని కాపాడెను. ఇది నృసింహావతారము కథ.

# గజేంద్రుడు - శ్రీహరి

ఇట్లు నృసింహావతార కథ చెప్పి, ప్రహ్లాదునకు అజగర రూపుడైన మునీంద్రునకూ జరిగిన సంవాదమును వినిపించెను. గయ, ప్రయాగ, పులహాశ్రమము, కురుక్షేత్రము, నైమిశము, ప్రభాసతీర్థము, వారణాసి, పంపాసరోవరము, మధురాపురము, కుశస్థలి, బిందు సరోవరము, నారాయణాశ్రమము మహేంద్రగిరి, మలయపర్వతము, శ్రీహరిని విగ్రహము, భాగవతులసేవ, బ్రాహ్మణ పూజ యివన్నియు సత్ఫలితములిచ్చునవి. వీటియందు సద్బ్రాహ్మణున్ని శ్రీహరి ప్రతిగా భావించి పూజించినవారు ముక్తులగుదురని చెప్పి ముక్తి మానవులకే కాదు. ఏ జన్మలోనున్నను ఈశ్వర భక్తి మోక్షమిచ్చునని గజేంద్రమోక్షకథ నిట్లారంభించెను."రాజా! మున్నొక గజరాజు శ్రీహరి నాశ్రయించి మోక్షము పొందినకథను విన్పింతును వినుము, త్రికూట పర్వత ప్రాంతములో నొక సాంద్రారణ్యము గలదు.

అందనేక రకములగు నడవిమృగములు కాపురము చేయుచుండెడివి. అందులో పదిలక్షలకోట్ల యేనుగుల గుంపు యొక నాయకుని యాధీనములో నుండి స్వేచ్ఛగా సంచరించుచు తమకడ్డులేని విధమున నుండి వివిధములగు క్రీడలతో కాలము జరుపుకొనుచుండెను. ఈ యేనుగుల గుంపునకే నొక నాయకుడగు యేనుగున్నదనీ చెప్పితినిగదా! ఆ గజరాజు యొకసారి యాడ యేనుగల గుంపుతో గూడి యడవులలో తిరుగుచుకొంతసేపటికి సమీపముందున్న యొక సరోవరములోనికి దిగెను. ఆ సరోవరమునందున్న నాయేనుగుల గుంపుతో గజరాజు జలక్రీడలాడుచు యా మడుగంతయు నల్లకల్లోము కావించసాగెను. ఇంతలో నామడుగులోనున్న బలమైన మొసలి యొకటి గజరాజు కాలుపట్టుకొని లాగసాగెను. గజరాజు కూడా చాలా బలము గలవాడుగాన – దానికి దొరకకుండా తనకాలు విడిపించుకొనుటకు సర్వప్రయత్నములు గావించసాగెను. తన దంతములతో నా మొసలి శరీరమును యనేకపోట్లు పొడిచెను. మొసలి పైభాగము యెటువంటి వానికిని లొంగనిదిగాన గజరాజు యత్నము సాగలేదు. స్థానబలముతో మొసలి విజృంభించినది. దానిపట్టు వదల్చుకొనుటు గజరాజు నానా విధముల పోరాటము ప్రారంభించినది. విరామం లేకుండా నాసరోవరములో పోరాటము సాగించాయి. పోరాటము పదివందల సంవత్సరములపాటు ఘోరముగా సాగినది. జలచరముగు మొసలికి స్థాన బలముతో నీరసమురాకుండెను. భూచరుడగు గజరాజు నీరసస్థితిలో పడినది. ఆ మొసలి తన్నువదులుట లేదు. తన నీరసస్థితి పెచ్చు పెరుగుచున్నది. పోరాటములో తమ జయము సంపాదించుట కష్టమని నిరాశచెందింది? చివరకు ప్రాణావశిష్టదశకు వచ్చినది. ఆలోచించి, యిక ప్రాణములు నిలువవనీ – మకరిచేతిలో తనకు చావు తప్పదనీ నిశ్చయించుకొనినది.

"నాకు తోడ్పడువారు గన్పించుటలేదు. ఏమి చేతు "యని పగచుచు యిట్లాలోచించెను. ఎవడు యీ లోకములను సృష్టించి రక్షిస్తున్నాడో, సమస్త జీవులకీ ఆధార భూతవై యెవడున్నాడో! యెవనియందు జీవులు ప్రళయకాలములో లీనమగుదురరో - యట్టి దైవం మహానుభావుడగు పరమేశ్వరుని నన్ను రక్షించుటకు ప్రార్థించుచున్నాను. పేదలందును, దిక్కులేనివారియందును, ఆపదలో చిక్కిన వారియందును, సమస్తము నిండిన తేజముగల పరమేశ్వరుడు, రక్షించుమనని చెప్పబడు జగన్నాదుడు నన్నురక్షింప ప్రార్థించుచున్నాను. ఓ శ్రీహరి! లక్ష్మీపతీ! ఓ నారాయణ! ఓ జగదీశా! రావా! నన్ను దయతో చూడవా! దిక్కులేని జీవమునై యిలా మహాబాధల నందు చున్నాను. నా ప్రాణములు పోవుచున్నవి, నాకు నీవే శరణ్య మని ప్రార్థింపగా వైకుంఠవాసుడగు సర్వేశ్వరుడా గజరాజు మొరవిన్నాడు. వెంటనే గజేంద్రుని రక్షింప పరుగు తీసినాడు.

పరుగెత్తుకుపోవు లక్ష్మీపతిని దేవలోకము వారందరూ చూచి నమస్కారములు గావించినను తిరిగిచూడక గజరాజున్న మడుగుగట్టుకు జేరి, తనచక్రాయుధముతో మకరితల ఖండించెను. గజరాజు కాలువిదలింపగా తన చేతితో శ్రీహరి దాని శరీరము నిమిరి బాధ తీర్చి ముక్తినిచ్చెని చెప్పెను.

అది విని రాజు శుకమునీంద్రుని చూచి "మహామునీ! నోరులేని గజరాజు స్తవమెట్లుచేసెను? శ్రీహరి యెట్లువినెను? యీ కథ యన్నింటికన్న విచిత్రముగానున్నదే! దాని విషయమును అనుమానముదీరునట్లు నాకు వివరించు మనగా శుకయోగీంద్రుడిట్లు చెప్పనారంభించెను."రాజా! ఈ మకరియు - గజరాజున్ను శాపతప్తులైనారు; వారి చరిత్రము వినుము. పూర్వం ద్రవిడ దేశాధీశుడైన యింద్రద్యుమ్నుడనే రాజు తపోనియముతో నుండి

యాశ్రమము కట్టుకొని కాలము జరుపుచుండెను. ఒకనాడగస్త్యమహాముని యా రాజాశ్రమమునకు రాగా, ఆ సమయానికి ధ్యానంలో వున్న రాజాయన్ని గుర్తించలేదు నీవు మూఢ గజరాజువై పుట్టుదువుగాక! యని శపించగా, నాతడు క్షమాభిక్షవేడెను. మునీంద్రుడు దయతలచి నీ తపోఫలితముగా శ్రీహరి స్వయముగా నీకు మోక్షము ప్రసాదిస్తాడు అని శాపవిముక్తి గడువు శెలవిచ్చెను. ఆరాజే గజరాజయ్యెనని చెప్పగా విని యామకరియెవ? రనగా విని ఇట్లనెను. దానికి కూడ శాపమే కారణము. ఆ చరితము వినుమని యిట్లు చెప్పసాగెను. "హూహూ యను గంధర్వరాజు కామగమనముగల విమానమునెక్కి గర్వముగా తిరుగుచు స్థూలశిరమహాముని యాశ్రమమునకు పోయి ఆయనను విచిత్రరూపముతో భయపెట్టుటచే ఆయన మండిపడి – "పెద్దలైనలవారిని పరిహాసము చేతువా? మూడుఢా! నీవు భూలోకమున మకరివై చిరకాలము పడియుండు మని శపించగా వాడు గర్వము విడిచి ఆయన కాళ్ళు పెట్టుకొనెను. మునీంద్రుడు జాలిపడి ఓ గంధర్వరాజా! నీవు మకరివై యున్న కాలమున శ్రీహరి చక్రస్పర్శతో ఆ రూపముపోయి మరల గంధర్వరాజువగదు" వని శాపము మళ్ళించెను. ఆ రాజు యీ గంధర్వుడు యిలా కరీ మకరీగా మారి, వారి శాపావసాన సమయమున శ్రీహరి వలన యీ దేహములు విడిచి దివ్యదేహము లందినారు.

## జగన్మోహినీ అవతారము

ఇట్లు గజరాజ మోక్షపుకథను విన్పించగా, రాజు పరమానందమంది శ్రీహరి మాయావిలాసము గురించి ఇంకా విన్పించగోరగా శ్రీశుకుడిట్లు విన్పించసాగెను. శ్రీహరి భక్త రక్షణకు వేయని వేషములు లేవు. పురుష స్త్రీ రూపములు గూడ ధరించి మాయావిలాసము చూపించిన క్షీరసాగర మథన చరిత్రము వినుమని యిట్లు ప్రారంభించెను. దేవతలు, రాక్షసులు చావు లేకుండా నమృతమును సంపాదించనెంచి పాలసముద్రమును తరచదలచిరి.

మందరపర్వతము కవ్వముగాను, వాసుకిని కవ్వపు త్రాటగాను ఏర్పరచి మథించుచుండిరి.

వారట్లు మథించు కాలములో యెన్నో పుట్టినవి. కల్పవృక్షము, కామధేనువు, ఐరావతము, ఉచ్చైశ్శ్రవము, లక్ష్మి, చంద్రుడు మొదలగునవి పుట్టుటే కాక హాలాహలమనే విషము పుట్టగా శివునారాధించిరి. ఆతడా విషమును ఉండగా జుట్టి తన కంఠముననిల్పెను. పిమ్మట అమృతకలశముతో ధన్వంతరి పుట్టెను. రాక్షసులా కలశమునుగొని వారు త్రాగనెంచగా దేవతలు భయపడి, రక్షించమని శ్రీహరిని ప్రార్థించిరి. రాక్షసు లమృతము త్రాగిన దేవతలకు బ్రతుకులేదనీ – తమను దయచూడ మనీ దీనముగా వేడుకున్నారు. శ్రీనివాసుడు దయా హృదయుడూ దేవతాపక్ష పాతీయగుటచే వారి మొరలను విని, వెంటనే తా నదృశ్యమై మాయాసుందరీ రూపము దాల్చి గానము చేయసాగెను. వారా గానము విని పరమాశ్చర్య మందగా మెల్లనినడకలతో, శరీరమునిండా దివ్యాభరణములతో జగన్మోహినీ రూపముతో వచ్చి వారిని తన వాలు చూపులతో వశపరచుకొని యా యమృత కలశమును పుచ్చుకొనెను.

దేవతలను, రాక్షసులను రెండు పంక్తులుగా కూర్చుండబెట్టి దేవతల కమృతము పోసెను. రాహుకేతువులను రాక్షసులు మారు వేషముతో దేవపంక్తిలో కూర్చుండగా వానిని చక్రాయుధముచే ఖండించెను. ఇట్లు దేవతల కమృతమునిచ్చి, రాక్షసులను చెదరగొట్టిన జగన్మోహినీ రూపుడగు హరిని సేవించెను.

# యయాతి చరిత్రము

పూర్వము మహర్షుల వలన బ్రహ్మరథము పట్టించుకొన్న నహుష చక్రవర్తికి ఆర్గురు కుమారులుండిరి. వారిలో యయాతి పెద్దవాడు. ఈ యయాతి మహారాజు శుక్రాచారుల కుమార్తె దేవయానిని వివాహమయ్యెనని

యనగా "బ్రాహ్మణ కుమార్తెను రాజా ఎట్లు వివాహమాడె "నని పరీక్షిత్ యాశ్చర్యముగా ప్రశ్నించెను. అప్పుడా రాజానకు శుక యోగీంద్రుడిట్లు చెప్పదొడగెను. వృషపర్వుడను రాక్షస రాజునకు శుక్రాచార్యుడు గురువుగా నుండెను గదా! వృషపర్వుని కుమార్తె శర్మిష్ఠ, శుక్రాచార్యుని కుమార్తె దేవయాని. ఇద్దరూ స్నేహముగా తిరుగుచుండేవారు. ఒకనాడు వారిద్దరూ చెలికత్తెలతో కలసి యుద్యానవన సరోవరములో జలక్రీడలాడుచూ చీరలు వదలి గట్టుపై పెట్టిరి. వారట్లు జలక్రీడోత్సవములో నుండగా నా దారి పోవుచున్న శివ పార్వతులను చూచి సిగ్గుపడి చీరలు ధరించిరి. అట్లు ధరించుటలో తొట్రుపాటువలన దేవయాని చీరను శర్మిష్ఠ ధరించినది. అందుకు కినిసిన దేవయాని శర్మిష్ఠను జూచి "నీవు దాసి దానవు. నా తండ్రికి శిష్యుడు నీ తండ్రి. నా వస్త్రములు ధరింప నీకేమి హక్కున్నది"యని యెన్నో విధముల నీచముగా దూషించినది. శర్మిష్ఠ పౌరుషపడి దేవయానిని చంపదలచినది. తన చెలికత్తెలను పిలిచి యామెను వివస్త్రను చేసి పాడు నూతిలో పడవేసిరండని యాజ్ఞాపించెను. వారందరామెను సాయము పట్టి వివస్త్రను చేసి పాడు నూతిలో పడవేసిరి. ఆమె ఘొల్లున కేకలు వేయుచు స్నేహితురాండ్రను బిలవసాగినది. ఎవరునూ పలుకలేదు. అట్లా నూతిలో బడి యామె వాపోవుచున్న సమయమందు వేటాడ వచ్చిన యయాతి ఆ యార్తనాదము వినెను. నూతిలో దీనావస్థలో నున్న యా దేవయానిని చూసి జాలిపడి, తన పై బట్టను విసిరి ఆమెకు మాన సంరక్షణము గావించెను. తరువాత నామెను బయటకు తీయుటకు తన చేతి నూతగా నిచ్చి యావలకు జేర్చెను. ఆమె యాపద నుండి, బైటపడి యయాతిని చూచి 'ఓ రాజా! నా పాణి గ్రహము గావించినావు నేను నీ భార్యను. నన్ను పరిగ్రహింపు 'మనెను. అది విని "నీవు బ్రాహ్మణ కన్యవు. నేను క్షత్రియుడను మనకు వివాహము

తగదని ” విని మున్నుకచూడను వాని శాపముతో నేను క్షత్రియునకు భార్యను కావలయును గాన నన్ను చేపట్టు మని పట్టుపట్టగా నతను సమ్మతించెను. తరువాత, శుక్రాచార్యులను జేరి దేవయాని రాజకుమార్తె చేసిన పనిని గురించి చెప్పి రాజును వదలి పెట్టము. వాడికి సాయము చేయవలసి దని నిర్బంధించెను. ఇది విని వృషపర్వుడు గురువును జేరి తన కుమార్తె దోషమును నేరమును క్షమింపుమని ప్రార్థించి, “నాకుమార్తెచే నీ కుమార్తె కిష్టము వచ్చినట్లు ఊడిగము చేయింతు”నని యొడబరచి, శర్మిష్ఠను దేవయానికి దాసిగా నుండజేసెను. ఇట్లు శర్మిష్ఠ దాసీత్వము చేయుచున్న కాలమునందొకసారి రాజొంటరిగా నున్న వేళ శర్మిష్ఠ అతనితో “రాజేంద్రా! నేను ఋతుస్నాతనై యున్నాను. నీవు రాజువు గాన దీన స్థితిలో నున్న వారిని రక్షించుట ముఖ్య ధర్మము. అందుచే నీవు నాకు కామ తృప్తి గావించుమ’ నగా రాజు సమ్మతించి యయాతితో కలసెను. ఈ సంగతి క్రమముగా శుక్రాచార్యునకు తెలిసి రాజును కోపగించి “నా కుమార్తెను వదలి దాసీదాని పొందును పొందిన నీకు వయస్సుడిగి ముసలి తనము వచ్చుగాక”యని శపించెను. ఆ శాపము ననుసరించి యాతడు వెంటనే ముసలి వాడయ్యెను. యయాతి దేవయాని వలన యదువు – తుర్వసులను కుమారులను పొందెను. తరువాత దేవయాని కుమారులను యదువు – దుర్వసులను, శర్మిష్ఠ యిద్దరి కుమారులను తన ముసలితనము గొని వారి వారి యౌవనము నిమ్మని కోరెను. వారు తండ్రి మాటను నిరాకరించిరి. శర్మిష్ఠ కుమారులలో చివరివాడు పూరువు. అతడు తన యౌవనమును తండ్రికిచ్చి యాతని వార్ధక్యమును తాను గ్రహించెను.

యయాతి చిరకాల మా యౌవనముతో భోగములనుభవించి, విరాగియై, కుమారుడగు పూరువునికి తిరిగి యౌవనము నిచ్చి వేసెను. తన

మాట మీరని కుమారుడగు పూరువునకు రాజ్యమిచ్చి పట్టాభిషిక్తుని జేసి తానడవులకు బోయెను. పూరువు రాజై - క్రమముగా నాతని పేరుతో యా వంశము పూరు వంశముగా కీర్తి జెందినది.

# దుష్యంతుడు - శకుంతల

ఈ విధముగా పూరు వంశము పూరుని కారణముగా నభివృద్ధి చెందినదని చెప్పగా రాజా విని "మహామునీ! పూరు వంశములో ప్రసిద్ధుడైన వాని చరిత్రను వినిపింపు" మనగా నిట్లారంభించెను. పూరు వంశములో చాలా మంది రాజులు జన్మించిరి. వారిలో దుష్యంతుడొకడు. ఆతడు రాజ్యమేలు చున్న సమయములో నొకసారి వేటాడుటకై కణ్వాశ్రమ ప్రాంతమునకు బోయెను. అతడు వేటాడి, కణ్వ మహాముని దర్శనము చేయదలచి యాశ్రమములోనికి బోయెను. అచట నొక అపురూపలావణ్యవతీ, యౌవనవతీయగు సుందరిని చూచి 'మహాముని యెందేగినా' రని ప్రశ్నించెను. ఆమె 'వారు ఇప్పుడు సమిత్కుసుమ పుష్పాదులకై వనములకు బోయిరి. యిప్పుడే వచ్చెదరు. మీరంతవరకుండు''డని రాజును గౌరవించెను. రాజామె సౌందర్యాదులు చూచి – రాజకుమార్తెగా భావించి, ఆమె యందు మనస్సు గలవాడై "కణ్వ మహామునీంద్రులు దీక్షాపరులు కదా! నీవెట్లాయన కుమార్తెవగుదు" వనెను. అప్పుడామె తన చరిత్రము నిట్లు వివరించెను. "విశ్వామిత్ర మునీంద్రుడు ఘోరతర తపమాచరించుచుండగా, తపోవిఘ్నము చేయుమని ఇంద్రుడు మేనకను పంపెను. ఆమె వచ్చి, విశ్వామిత్రుని లోబరుచుకొని కొన్నాళ్ళాయనతో నుండి నన్ను ప్రసవించి యీ యాశ్రమ ప్రాంతారణ్యములో నొక చెట్టు మొదలున వదలి వెడలిపోయెను. నా తండ్రి మరల తపమునకు బోయెను. నాయందు జాలిపడిన శకుంత పక్షులు – తేనె, తదితర ఉచ్చ పదార్థములు యిచ్చి

పెంచినవి. శకుంతములచే పెంచబడినదానను గాన నన్ను శకుంతల యని పిలువసాగిరి. స్నానార్థము వచ్చిన కణ్వముని నన్ను గుర్తించి తన యాశ్రమమునకు గొని వచ్చి పెంచగా నా మునీంద్రుని పెంపుడు బిడ్డనైతి" నని తన చరిత్రను చెప్పగా దుష్యంతుడానందించి, యీమె రాజపుత్రిక గావున వివాహమాడదగునని గాంధర్వ విధానముగా వివాహమాడి యామెను పొంది, కొన్ని రోజులలో రాజధానికి గొని పోవుదునని చెప్పి నమ్మించి వెళ్ళిపోయెను. తరువాత కణ్వుడు వచ్చి తన కుమార్తె స్థితిని గమనించి వివాహము చేసికొనుట కానందించెను. ఆమె యాశ్రమములో నుంచగా చక్కని కుమారుని కన్నది. అతనికి భరతుడని పేరిడినారు.

చిన్నతనములోనె సింహములు నదలించి వాటిపై స్వారీచేయుట మొదలగు సాహసకృత్యములు చేయుట చే యాతనికి సింహదమనుడను బిరుదు కలిగినది. అఖండయశశ్లాఘయుగు ఆ భరతుడే మీ భరత వంశమునకు మూలపురుషుడయ్యెనని రాజునకు భరతుని చరిత్రమువినిపించెను. తరువాత మహాదాతయగు రంతి దేవుని చరిత్రము వినిపించెను.

# రంతిదేవుని కథ

భరతునికి భరద్వాజుడను కుమారుడు గల్గెను. అతని వంశములో రంతిదేవుడు జన్మించెను. భరద్వాజునకు మన్యువు పుట్టెను. అతనికి బృహత్ క్షత్రుడు, జయుడు, మహావీర్యుడు, నరుడు, గర్గుడు గల్గిరి. వారిలో నరునకు సంకృతియు, వానికి గురుడు, రంతి దేవుడను వారలుజన్మించిరి. ఆ రంతి దేవుడు విష్ణుభక్తి పరాయణుడై రాజ్యమేలుచు తన దనమంతయు దాన ధర్మములకై వినియోగించి విరాగియై యరణ్యములకు వెళ్ళి నివాసముండెను. అతడు నలుబదియెనిమిది రోజులు నిరాహారుడై యుండ,

నొక నాడు యాతని కాహారము దొరకెను. అది తిను సమయమునకు పరీక్షార్థముగా పరమేశ్వరుడు బ్రాహ్మణరూపుడై వచ్చి, తన కోగిరము కావలెనన్నాడు. రంతిదేవుడా యాహారము వానికొసగి, తానిన్ని జలములు త్రాగియుండెను.

కొన్నాళ్ళకొక హరిజనుడు నలుబది కుక్కలతో వచ్చి కొద్దిగ యన్నము పెట్టుమని యడిగెను. అంతట రంతి నాయనా! నావద్ద ఎట్టి ఆహార పదార్థములు లేవు. ఇన్ని రసయుక్తములగు జలమున్నవి త్రాగుమని నిండా జలమున్న తన చేతి మట్టి పాత్రను వానికిచ్చి వేసెను, వెంటనే శ్రీహరి యా మహారాజు త్యాగమున కానందపడి దర్శనమిచ్చి నేనే నిన్ను పరీక్షించుటకు వచ్చినాను – నీ కాటంకము లేని నిర్మల విష్ణుభక్తిని ప్రసాదించుచున్నాను. నీవు యోగివై చిరకాలము నన్ను ధ్యానించుచు వైకుంఠమును చేరగలవని చెప్పి వరమిచ్చి యంతర్ధానమయ్యెను. రాజవర్యుడైన రంతి దేవుడనేక యజ్ఞములు గావించి, కోటిమేధములు చేసి, యనేక గోగణములకు పుణ్య లోకములు ప్రసాదింపజేసిన మహాపుణ్యాత్ముడు. అతడు మీ భరత వంశములోని వాడే. మీరందరూ పూరు వంశ్యులూ, భరత కులాదీపకులైన వారూ సుమా!

# శ్రీ కృష్ణావతారము

శ్రీ శుకుడిట్లు భాగవతపురాణము వినిపించుచు, శ్రీ కృష్ణ భగవానుని దివ్యలీలావతార విశేషములు వినిపింతును. వినుమని మొదలిడెను.

యదు వంశములో వసుదేవుడు జన్మించెను. ఆ వసుదేవునకు యుగ్రసేనుని కుమార్తె నిచ్చి వివాహము గావించిరి. ఇది యిట్లుండగా భూలోకమందు కంసాది దానవులు పెచ్చు పెరిగి ధర్మ ధ్వంసము గావించుచుండిరి. వారి బాధపడలేక బ్రహ్మేంద్రాదులు శ్రీహరి మందిరము

నకు పోయి వారి గోడు విన్పించగా, నారాయణుడు "మీరు భయపడకుడు, మీకు సుఖము గల్గ జేయుటకు నేను భూలోకమున దేవకీ వసుదేవుల గర్భమున జన్మించెదను. దూతలను సంహరించి భూభారమును తీర్చెద "నని చెప్పి వారిని సాగనంపెను. దేవకీ వసుదేవుల వివాహము జరిగిన పిదప కంసుడు తోబుట్టువునూ బావమరిదినీ రథముపై నెక్కించుకొని యత్త వారింటికి పంపుచున్న సమయమున నాకాశవాణి "కంసా! నీ చెల్లెలు గర్భమున పుట్టిన యెనిమిదవ వాడు నిన్ను సంహరించును, జాగ్రత్త' యనెను. అది విని మండిపడిన కంసుడు యామెను చంపబోగా వసుదేవుడు అడ్డుపడి మా సంతానము నీకిత్తుము. ఆడుది, చెల్లెలగు దానిని చంపవలదని వారించగా కంసుడు వారిని చెరసాలలో నుంచెను. తర్వాత యేడుగురు సంతానమును కంసుడు సంహరించెను. ఎనిమిదవ చూలుగా శ్రీహరి నిజరూపముతో శంఖచక్రాద్యాయుధములతో, పీతాంబరముతో, చతుర్భుజములతో దర్శనమిచ్చి దేవకీ వసుదేవులకు చెప్పి బాలరూపుడయ్యెను. ఆ బాలు నర్ధరాత్రి తట్టలో బెట్టుకొని, వసుదేవుడు వ్రేపల్లెకు జేర్చి యశోద ప్రక్క పరుండ బెట్టి, అచట నున్న యాడు పిల్లను గొని వచ్చెను. వసుదేవుడు కారాగారము చేరగానె – చెరసాల తాళములు వానికవేపడెను. తాళములు పడగానె ఆ పిల్ల యేడుపు మొదలు పెట్టింది. ఆ యేడుపువిని కావలి వారు లేచి, కంసునికి చెప్పగా, నాతడు వచ్చి యా బాలను తలక్రిందులుగా బెట్టి నరుక చూచెను.

ఇంతలో నా శిశువు వాని చేయి దాటిపోయి గగనమున కెగసిపోయి యష్టాదశభుజ యగు యోగ మాయ రూపము దాల్చి 'ఓరే కంసా! నిన్ను చంపు వాడు వ్రేపల్లెలో పెరుగు చున్నాడు. నీకు వాని వలన మరణము తప్ప'దనెను. అదివిని కంసుడు ఆ బాలుని సంహరించు వుపాయమును లాలోచించ సాగెను.

# పూతన, తృణావర్త, శకటాసుర భంజనం

ముందుగా, బాలకుని సంహరించుటకు పూతనయను రాక్షసిని మాయా రూపము దాల్చి వ్రేపల్లెకు నెడల నియోగించెను. అది వచ్చి బాలెంతరాలి వేషముతో వచ్చి వ్రేపల్లెలో నిల్లిల్లు శోధించసాగెను. చివరకు యశోద గృహమునకు వచ్చి పరుండి యున్న బాలు నెత్తుకొని పాలీయ బోయెను యశోద వారించినను దాని తత్వమెరిగి యామె చనుబాలు రెండు గ్రుక్కలతో పీల్చి, ఆపై నామె రక్త మాంసములన్నియు మరొక్క పీల్పుతో హరించి తుదకు ప్రాణమును పీల్చగా మహాధ్వని చేయుచు పర్వతాకారములో నిజరాక్షస రూపమున నేలపడి విలవిల తన్నుకొని చచ్చెను. ఆశరీరమును యాదవులు తుండెములుగా నరికి దహనము చేయగా, నందుండి సుగంధ వాయువులు వచ్చినవి. పూతన చనిపోయిన వార్త విని కంసుడు శకటాసురుని పంపెను.

వాడు, బండి చక్రముగా మారి వ్రేపల్లెలో తిరుగుచుండెను. ఒకనాడు గోపాలుడు వీధిని పడియుండ వాని మీదకు సాగాడు రాక్షసుడు. కృష్ణుడా చక్రమును బట్టుకొని తిరుగుచు వానిని కదలనీయక యణచి పెట్టి వధించెను. శకటుడు చక్రాకారము వదలి రాక్షసుడై పడి చచ్చెను. కృష్ణుడా శవముపై నెక్కి రాక్షసుని మర్ధించుచుండగా, యశోద ప్రమాదము లేకుండా బాలుడు బ్రతికినాడని సంతోషించి దిగదుడుపులు వగైరాలు చేసి తృప్తిపడెను. శకటాసురుడు చనిపోయిన వార్త విని కంసుడు అచ్చెరువందితృణావర్తుని పంపెను.

వాడు సుడి గాలి రూపుడై వ్రేపల్లెలో దిరుగుచు వీధిలో నాడుకొను గోపాలబాలుని సుడి చుట్టి గొనిపోయెను. ఆ సుడిలో గోప బాలుడు

గగనమున కెగసి వాని కంఠము బట్టుకొని వ్రేలాడసాగెను. వాడా బాలుని భారము సహించలేక చివరకు ప్రాణములు విడుచుచు గావు కేక పెట్టి వ్రేపల్లె నదరగొట్టెను.

ఆ చావు కేక విని జనులందరూ యీవలకు రాగా రాక్షసుని కంఠమును జుట్టియున్న కృష్ణుడు కనుపించెను. యశోద వచ్చి కుమారుని విడిపించి యెత్తుకొని 'బిడ్డా! దుర్మార్గుల చేతిలో పడకుండా బ్రతికినావని ముద్దిడుకొని విభూతి పెట్టి యోదార్చెను. వ్రేపల్లె ప్రజలా రాక్షస శరీరమును ముక్కలుగా నరికి దహనకాండను నిర్వర్తించిరి.

## కాళీయమర్ధన - గోవర్ధనోద్ధరణాదులు

శ్రీకృష్ణుడు క్రమముగా పెరిగి పెద్దవాడగుచుండెను. గోపాలురతో గూడి యమునా తీరమందున్న బృందావనారణ్యములకు పశువులను దోలుకొని పోయి మేపుచున్నాడు. ఆ యమునా తీరాల నొకమడుగు గలదు. అందులో కాళీయుడను సర్పరాజు తన పరివారముతో నివాసము చేయుచు మడుగు జలములను విషపూరితము గావించుచుండెను. శ్రీకృష్ణుడా జలములను పరిశుద్ధము చేయదలచి, గట్టు మీదున్న కడిమి చెట్టునుంచి మడుగులోనికి దూకి, ఈదుచు కాళీయుని నివాసమునకు బోయెను. ఇది చూచి కాళీయుడు, హరిని సాధారణ బాలునిగా నెంచి, శిక్షింపదలచి, పడగలతో నున్న తన శిరము సాచి వేయదగినన్ని కాట్లు వేసెను. కృష్ణుడు యా కాటులను లెక్కబెట్టకుండా యాతని విషము హరించుపో,చ వునట్టాతని పడగలపై నెక్కి తాండవము చేయుచుండ, నాతడా బాధ సహించలేక ప్రాణావశిష్టుడైన సమయమున నాతని భార్యలు శ్రీకృష్ణుని బ్రతిమాలి భర్తను బ్రతికించుకొనిరి. గోపాలు నాజ్ఞపై కాళీయుడా యమునా జలములను –

పశువులూ, జనులూ త్రాగుటకు వీలుగా పరిశుద్ధము గావించి, ఆ చోటు విడిచి పోయెను. శ్రీకృష్ణునందరూ కొనియాడిరి. వ్రేపల్లె వాసులకు – ప్రతియేడు ఇంద్రయాగం చేసే అలవాటు వుంది. ఒకసారి శ్రీకృష్ణుడు ఆ ఆచారాన్ని తప్పించాడు. "ఇంద్రుడి కెందుకు పూజ? అంతకన్నా మన ప్రాంతంలో వున్న గోవర్ధనగిరికి చేయడం మంచిది. మీరిచ్చే నైవేద్యాలను ఈ పర్వతం ప్రత్యక్షంగా తీసుకుంటుంది" అన్నాడు. కృష్ణునిపై విశ్వాసం గల గోపగణం నైవేద్యాలను గిరి గ్రహించడం చూడాలనే ఉత్సుకతతో గోవర్ధన గిరికి సంబరం చేసిరి. ఆ కారణంగా కోపగించాడు దేవేంద్రుడు.

ప్రజల మీద అలిగిన వజ్రి వలాహకాల్ని పంపి భయంకరమైన వర్షం కురిపించాడు. ఆ వడగళ్ళ వానతో – కడగళ్ళ పాలైపోయారా అమాయకులు. అయినా ఆగ్రహం చల్లారని అమరాధీశుడు రాళ్ళ వర్షం కూడా కురిపించాడు. 'రక్షించు కృష్ణా అంటూ ఆర్తనాదాలు చేశారు గోపికలు. విన్నాడు కృష్ణుడు. ఇంద్రుడికి బుద్ధి చెప్పాలనుకొన్నాడా వుపేంద్రుడు. ప్రజసంఘానికి అభయమిచ్చి. వడివడిగా గోవర్ధనగిరికి చేరాడు. అంత పెద్ద పర్వతాన్ని అతి సునాయాసంగా పెళ్ళగించి చిటికెన వ్రేలితో పైకెత్తి పట్టాడు. ఆ పర్వతం ఓ పెద్ద గొడుగులా వుంది. దాని అడుగు భాగపు నడుమ నిలిచి వున్న కృష్ణుడు 'మీరంతా యీ పర్వతం క్రిందికి వచ్చి చేరండి. ఈ వాన మిమ్మల్నేమీ చేయలేదు. భయపడకండి' అంటూ అందరినీ బిగ్గరగా పిలిచాడు. గోవులు, వృషభాలు, గోవత్సాలు, ఆబాలగోపాలం గోపాలకృష్ణుడి పిలుపు నందుకొని – గిరి క్రిందకు చేరారు. కృష్ణుడి శరణుజొచ్చిన ఆసర్వ ప్రాణులు సంరక్షింపబడ్డాయి.

వారం రోజుల పాటు అహోరాత్రులూ శిలా వర్షం కురిసింది. కృష్ణ సంరక్షణలో నున్న యే ప్రాణికీ కూడా కించిత్తైనా కష్టం కలగలేదు.

వాసుదేవుని శక్తి ముందు వాసవిశక్తి వెలవెలబోయింది. దేవేంద్రుడు వర్షాన్ని ఆపి భూమికి దిగి వచ్చాడు. శ్రీకృష్ణుడికి నమస్కరించాడు. తను చేసిన తప్పినదానికి క్షమాపణలు చెప్పుకున్నాడు. చెంపలు వేసుకొన్నాడు. కృష్ణుడాతనిని క్షమించాడు. అనంతరం యింద్రుడు తన లోకానికి వెళ్ళాడు. వ్రజవాసులంతా కృష్ణుని కీర్తించారు.

అనంత లీలా విలాసుడైన శ్రీకృష్ణుడిలా యెన్నో లీలలు చూపించారు. భగవంతుడగు ఆ శ్రీహరి లీలా విశేషములు విని పరమానందమందుచు పొంగిపోయే భక్తులు ముక్తులు సుమా! శ్రీకృష్ణలీలలు యిలా యెన్ని చెప్పుకున్నా తనవి తీరదు. ఇంకా వినాలని అనిపిస్తూ వుంటాయవి.

# బ్రహ్మకు గర్వభంగం

ఓసారి బ్రహ్మ దేవుడు రవ్వంత గర్వంతో కృష్ణలీలన్ని పరీక్షించి చూడాలనుకున్నాడు. వెంటనే బృందావనారణ్యాలలో మేతకు వెళ్ళిన గోవులనీ, వాటిని తోలుకుపోయిన గోపకులనీ మాయం చేసి ఒక కొండ గుహలో దాచేశాడు. కృష్ణుడది కనిపెట్టి అదృశ్యమైన గోపకులను అచ్చం అలాగే వుండే వారినందరినీ సృష్టించేశాడు. తానేమీ యెరుగని వాడిలాగా మురళి నూదుకుంటూ వారందరితో కలిసి యింటికి వెళ్ళిపోయాడు. శ్రీ కృష్ణ కల్పితులైన ఆ మాయాగోపకులు యెవరిళ్ళకు వాళ్ళు వెళ్ళిపోయారు. ఎవ్వరికీ యే అనుమానమూ కలుగలేదు. బ్రహ్మదేవుడికి మతిపోయింది. నాకు నాలుగు తలకాయలు వుండి కూడా బొత్తిగా తలకాయలేని పనిచేశాను. విష్ణులీలల్ని శంకించి మోసపోయాను. ఆ జగన్నాథుడికి 'నాపై ఆగ్రహం రాకండా, యిప్పుడే వెళ్ళి క్షమాపణలు కోరుకుంటాను' అని నిశ్చయించుకొని సరాసరి నీలమేఘశ్యాముని వద్దకు

వచ్చాడు. ముకుళిత హస్తుడై ముకుందుని స్తోత్రం చేశాడు. "తప్పుకాయుమని" ప్రాధేయపడ్డాడు. శ్రీ కృష్ణుడు చిరునవ్వు నవ్వాడు. "నా లీలలు చూద్దామను కున్నావు చూశావు కదా! తృప్తిగా వుందా? ఇందులో నీ తప్పేమీ లేదు. స్థిమిత పడి నీ లోకానికి వెళ్ళి నీ పనిలో నువ్వుండ" మని చెప్పి పంపివేశాడు. గర్వభంగమైన బ్రహ్మ సత్యలోకానికి వెళ్ళి పోయాడు.

## గోపికా వస్త్రాపహరణం

మరోసారి శ్రీ కృష్ణ కృతమురీరవళీ శ్రవణోన్మత్తలై కృష్ణ గృహీత మానసులై ఆత్మీయంగా తమ సర్వస్వాన్నీ కృష్ణార్పణం చేసుకున్నారు కొందరు గోపికలు. వాళ్ళంతా శ్రీకృష్ణుడే తమకు భర్త కావాలనే వాంఛతో కాత్యాయనీ వ్రతం ఆచరించారు. ఆ సందర్భంగా వ్రత దీక్ష గైకొన్న వ్రజకామినులు కొందరు కలసి స్నానం నిమిత్తమై ఒక చెరువుకు వెళ్ళారు. తమ వస్త్రాలను నగలను తీసి గట్టు మీద వుంచి మీద నూలు పోగు లేకుండా స్నానానికై చెరువలో దిగారు. కృష్ణ స్పృహులై ఒకరి మీద ఒకరు యేవేవో చతుర్లు విసురుకుంటూ జలక్రీడ లాడుతున్నారా రమణులు అంతలోనే వినిపించింది శ్రీకృష్ణుడి వేణు గానం. త్రుళ్ళిపడ్డారు. గబగబా గట్టు మీద కెక్కి బట్టలు కట్టుకోవాలనుకున్నారు. తీరా చూస్తే అక్కడి వారి నగలే తప్ప విడిచిన చీరలలో నూలుపోగు చూడా కనబడలేదు. కంగారు పడిపోయారా కాంతలు. అంతోనే అది శ్రీకృష్ణుని పనే అయి వుంటుందని అనుకున్నారు. తమ బట్టలు పట్టుకుపోయి యెక్కడ దాక్కున్నాడో అని దిగులు పడ్డారు. ఎక్కడికో పోవాల్సిన కర్మ కృష్ణుడి కేం పట్టింది. అసలు ఆయన లేని తామేమి గలదు గనుక? గోపికల మనసులోని ఆలోచన పసిగట్టాడు కృష్ణుడు. వెంటనే తన మృదుమధుర స్వరంతో "ఓ స్నానసుందరులారా! నేను యిక్కడే యీ చెరువు గట్టు మీదున్న చెట్టు మీదనే వున్నాను" అన్నాడు. చట్టున తలలెత్తి

చూశారు గోపికలు. మందస్మిత సుందర వదనారవిందుడైన మాధవుణ్ణి చూస్తూనే బాహువులతో తమ వక్షాలను దాచుకుని తక్షణమే కంఠాల వరకు నీట మునిగిపోయారు. "కృష్ణా నిన్నే నమ్ముకున్న వాళ్ళం నిన్ను తప్ప అన్యాన్ని ఆశించనివాళ్ళం. నువ్వే యిలా చేయడం తగునా? మా స్వామివి కదూ! మా చీరలు మాకిచ్చేయి" అని ప్రార్థించారు. అదివిని, బుజిబుజి రేకుల చిరు నవ్వులు నవ్వాడు పురుషోత్తముడు. "వ్రజాంగనలారా? కాత్యాయనీ వ్రత దీక్షాపరులైన మీరు వివస్త్రలై స్నానం చేయడం చాలా దోషం. సరే తెలిసో తెలియకో అలా చేసేశారు. ఇప్పుడు మీరు నన్ను తప్ప మరేదీ ఆశించని వాళ్ళమన్నారు. నన్నే నమ్మామన్నారు. నేను మీ స్వామినన్నారు. ఔనా?" అని అడిగాడు. ఔనన్నారు. యువతులు మంచిది. అయితే మీరలా వివస్త్రలుగానే గట్టు మీదకు వచ్చి మీమీ దుస్తులు నానుండి తీసుకోండి" అని చెప్పాడు కృష్ణుడు "అమ్మో యింకేమైనా వుందా? మా సిగ్గుపోదూ? అంటూ బెంబేలు పడిపోయారు గోపకాంతలు. గలగలా నవ్వాడు బాలకృష్ణుడు. "వెర్రి వ్రజలారా! నా కన్నా మీకు మీ సిగ్గే ముఖ్యంలా గుందే? ఇంతటి దేహాభిమానంతో నున్న మిమ్మల్ని కాత్యాయనీ దేవి యెందుకు కరుణిస్తుంది? "ఓ మరాళ గామినులారా! అభిమానం మనుష్యులను ఆశోపహతులను చేస్తుంది. దేమాభిమానం మోక్షాన్ని దూరం చేస్తుంది" అని వారికి తత్త్వోపదేశం చేశాడు స్వామి. ఆయుపదేశంతో త్యక్తాభిమానులూ, నిశ్శంకలూ, నిస్సంగలూ అయిన వ్రజాంగనలు - నిలువునా నిలిచి చేతులెత్తి మ్రొక్కారు శ్రీకృష్ణునికి, స్వామి, వారి వలువలు వారికిచ్చి తాను అదృశ్యుడయ్యాడు.

"పరీక్షిన్మహారాజా! తన వారిపట్ల ఆ స్వామి ప్రదర్శించే లీలలు యెన్నో తత్త్వార్థాలతో కూడుకుని వుంటాయి. అంతర్యం అర్థం చేసుకుంటున్న కొద్దీ అవన్నీ ఆత్మానందకారకాలే అవుతాయి.

# వ్రజం నుండి మధురకు

"మీ మాటలకు అడ్డుతగలుతున్నా ననుకోకపోతే ఓ విన్నపం" అన్నాడు పరీక్షిత్తు, "ఏమిటన్నట్లు చూశాడు శుకుడు" ఇక్కడ కృష్ణలీలలు సరే ఈ కృష్ణున్ని చంపించాలని ప్రయత్నించాడు కదా కంసుడు తృణావర్తుడి చావు తార్వాత మళ్ళీ అతగాడేయేకుట్రలు చేశాడు? కృష్ణుడా పన్నుగడల నెలా ఛిన్నాభిన్నం చేశాడు. అదంతా వినాలని" వుంది అన్న పరీక్షిత్ మాటలకి చిరుదరహాసం చిందుస్తూ, శ్రీశుకుడిలా పలుక నారంభించెను.

దుర్మార్గులకీ, దుష్టులకీ దొర లాంటివాడా కంసుడు. రాక్షసాంశతో పుట్టాడు. వాడెందుకు వూరుకుంటాడు? తృణావర్త మరణానంతరం కూడా బకాసుర, ధేనుకాసుర, అఘ రాసురాది రాక్షసులను పంపుతూనే వున్నాడు. ఇది పనిగాదనుకొని కంసుడింకొక యెత్తుగడవేశాడు. తనకు వలె, కృష్ణుడికి సేవకుడు అయిన అక్రూరుడు అనే వాణ్ణి బృందావనానికి పంపాడు. తాను ధనుర్యాగం చేస్తున్నా నని "తదర్థం బలరామకృష్ణుల్ని ప్రత్యేకంగా ఆహ్వానిస్తున్నా నని చెప్పు "మన్నాడు. తన స్థావరంలో అయితే తనకు బల మెక్కువగా నుంటుందనీ, అందువల్ల బలరామకృష్ణులిద్దర్నీ తేలిగ్గా అంతం చేయవచ్చునీ ఆలోచించాడతగాడు. కంసుడి దురాలోచన అక్రూరుడికి తెలుసు. "కుట్రో, కూహకమో కృష్ణుణ్ణి దర్శనం చేసే అవకాశం దొరుకుతోంది తనకిక, కాబట్టి వెళ్ళి తీరా "లనుకున్నాడు. మంచి రథంలో బయల్దేరాడు.

అక్రూరుడి గురించి ముందే తెలిసిన బలరామకృష్ణులు – అతన్ని ఆదరంగా ఆహ్వానించారు. తానువచ్చిన పనిని వారికి విన్నవించాడు అక్రూరుడు అవతారపురుషులైన బలరామకృష్ణులు అతని మాట మన్నించారు. మధురానగరానికి వెళ్ళేందుకు సిద్ధపడ్డారు.

ఈవార్త తెలిసి ప్రజమంతా ఘొల్లుమంది. "కృష్ణున్ని చూడకుండా క్షణం కూడా వుండలేము మేము. ధనుర్యాగమూ లేదు; ఏమీలేదు. మధురకు వెళ్ళడానికి వీల్లేదుగాక వీల్లేదు." అని బైఠాయించారు. "అసలీయనెవరో వచ్చి మనకృష్ణున్ని మనక్కాకుండా తీసుకుపోతున్నాడు. ముందీ అక్రూరుని సంగతి తేల్చేయాలి" అన్నారు కొందరు. అందర్నీ శాంత పరిచారు బలరామకృష్ణులు. పల్లెచేత తమ ప్రయాణానికి వల్లె అని పించుకున్నారు. బంధు, మిత్ర, పౌరాదులకి సర్దిచెప్పినంత తేలికగా గోపికలకి నచ్చ చెప్పలేక పోయాడు స్వామి.

**"బృందావనం పరిత్యజ్య పాదమేకం న గచ్ఛతి!"**

"ఈ బృందావనాన్ని విడిచి ఒక్క అడుగైనా ముందుకు పడదన్నావు నువ్వు మరిప్పుడు చేస్తున్న దేమిటి? నల్లటివన్నీ నీళ్ళూ, తెల్లటివన్నీ పాలూ అనుకునే అమాయకులం మేము. అయినా నువ్వుమాత్రం నీలిరంగుపాలమూర్తివి మమ్మల్ని నమ్మించి యిలా దగాచేస్తావా నల్లనయ్యా? నిన్నేమైనా కష్టపెట్టి వుంటే చెప్పాలిగామరి, యిలా శిక్షిస్తావా? నీ సాన్నిధ్యం తప్ప యేమీకోరం. నిన్ను తప్ప యేదీ కనం, వినం, భావించం, నువ్వే దూరమైనాక యీ సంసారాలూ చట్టబండా లెందుకు? నువ్వేదూరమైతే మాకీ బ్రతుకులెందుకు మాధవా? అసలెందుకు మాకీ ప్రాణాలు" అంటూ కృష్ణపాదాల మీదపడి విలపించారు వాళ్ళు.

రసార్ద్ర పులకిత – గాదద్గికుడై పోయాడా రసమూర్తి 'రసోవైసః' అని వేదాలు యే పరబ్రహ్మను అదేపనిగా స్తోత్రాలు చేస్తున్నాయో – ఆశ్రీకృష్ణ పరబ్రహ్మ గోపికాలాపాలకు మధురలాలసా విధురాధరాంకురిత మందహాసుడవుతూ – "మహాభాగా" లని పిలిచాడు వారిని.

"ఓ మహాభాగ్యశాలులారా! మీరు చెప్పిందంతా నిజమే మీ సమస్తాన్నీ నా కోసం త్యాగం చేశారు. నా నుంచి యేమీ కోరకుండానే – జ్ఞాన కర్మేంద్రియాలన్నింటినీ నా యందే లగ్నంచేసి నాకు యెనలేని సేవలు చేశారు. నన్ను ప్రేమించారే తప్ప, నా ప్రేమను అడిగి యెరుగరు. అసలు నా నుంచి యే లేశమూ ఆశించి వుండలేదు మీరు. తను, మన, ధన, ప్రాణాలన్నీ నాకే అర్పించారు. నిజంగానే నేను మీకెంతో ఋణబడివున్నాను. మీకోసం యేమి చేసి కూడా ఆ ఋణాన్ని తీర్చుకోలేను, నేను మీకు శాశ్వత ఋణగ్రస్తుణ్ణి గోపికలారా! నన్ను క్షమించండి. ప్రేమ రాజ్యం సంయోగవియోగాలనే రెండు భావాలతో విరాజిల్లుతోంది. బాహ్య సంయోగంలో ఆత్మవియోగం కలుగుతుంది. వియోగంవల్ల నిత్య ప్రేమికా ప్రియతమ భావాలే అంతరంగంలో నిండి వుండటం వల్ల అది సంయోగమే గాని వియోగం కాదు" అని అనేక సంగతులు వారికి బోధించి యెట్టకేలకు అంగీకరింప చేసి అక్రూరునితో కలిసి మధురకు బయలుదేరాడు శ్రీకృష్ణుడు. అతడి ననుసరించాడు బలరాముడు.

## మధురలో మాధవుడు

నగర ప్రవేశం జేయగానే – ఊరంతా చూస్తామని చెప్పి బలరామకృష్ణులు రాచవీధిలో రథం దిగిపోయారు. నగర సందర్శనం ఆరంభించారు. మార్గమధ్యంలో ఒక మడేలుతో ఘర్షణ జరిగింది. బలరామకృష్ణులు వాణ్ణి చితక దన్ని తమకు కావలసిన కొన్ని దుస్తుల్ని గెలుచుకున్నారు. అనంతరం సంచారంలో కుబ్జతారసిల్లింది. కృష్ణుడామెని పూలమాలలూ, గంధం మొదలైన లేపనాలూ, యితర పరిళమద్రవ్యాలూ అడిగాడు. జగన్మోహనుడైన కృష్ణున్ని చూచి కుబ్జ ప్రేమభావంతో ఆయన

అడిగివన్నీ యిచ్చేసింది. సంతుష్టుడైన సర్వాత్ముడు - వికారరూపియైన కుబ్జను విశేష సౌందర్య రాశిగా చేశాడు.

# కంస చాణూర మర్దనం

అటు తర్వాత, ధనుర్యాగదర్శనార్థం బలరామకృష్ణులు కంసుడి కోటకు సాగారు, కంసుడు ఆ దుర్గద్వారం దగ్గర కువలయాపీడం అనే యేనుగును వుంచాడు. ఉత్తేజక ద్రవ్యాలు బాగా పెట్టబడి వుందా యేనుగు. బలరామకృష్ణులు రాగానే యేనుగును వాళ్ళమీదికితోలించి త్రొక్కించి చంపేయమని మావటివాడికి చెప్పాడు కంసుడు. మావటివాడు అలాగే చేశాడు; కాని బలరామకృష్ణులేమైనా తక్కువ తిన్నారా? సింహపిల్లల్లా యెగబడ్డారా యేనుగు మీదకి. ప్రచండ ముష్టిఘాతాలతో దాని కుంభస్థలం బ్రద్దలు కొట్టేశారు. దాని రెండు దంతాలనూ విరిచేసి అన్నాదమ్ములిద్దరూ చెరొకటీ భుజాన వేసుకున్నారు. అక్కడనుంచి సరాసరి యాగశాలలో వీరస్పర్థలు జరిగేచోటుకు చేరుకున్నారు. కంగుతిన్నాడు కంసుడు అంతలోనే తేరుకున్నాడు. కంసుడి దగ్గర చాణూరుడు, ముష్టికుడు అని యిద్దరు మల్లయోధులున్నారు. మల్లయుద్ధంలో వాళ్ళని గెలిచేవారేలేరని పెద్దపేరు. అక్కడి వీరస్పర్థలలో - బలరామ కృష్ణులకీ చాణూర ముష్టికులకీ పడింది యుద్ధం. పర్వతాల్లా వున్నారు; చాణూర ముష్టికులు. పర్వతాల్ని పడగొట్టేసే వజ్రాయుధాల్లా వున్నారు బలరామకృష్ణులు హోరాహోరీ సాగింది పోరాటం. ముందుగా బలరాముడు తన ముష్టిఘాతాలతో ముష్టికుడ్ని వధించేశాడు. కరికుంభ విచ్ఛేదనా పాటవమైన ప్రచండముష్టితో కృష్ణుడు చాణూరుణ్ని చంపేశాడు. ఆ విసురు కాలగర్భంలోంచి వెలివడ్డ కంసమృత్యువులా ఆకంసుడి మీదకి దూకాడు. పురటి పొత్తిళ్ళ నుంచీ దినదిన గుణీకృతమౌతున్న

ఆవేశంతో ఆ పోరులో కృష్ణుడు కంసుణ్ణి క్రిందపడేశాడు. కంసుడి కిరీటం నేలమీద పడింది. కృష్ణుడు తనయెడంచేత్తో కంసుడి కొప్పుపట్టుకున్నాడు. కుడిచేత్తో - కంసుడి కత్తిని లాగి వాడి కత్తితోటే ఒకే ఒక్క వ్రేటుతో ఆ దుష్ట కంసుడి శిరస్సు నరికి అవతల పారేశాడు దేవతలు పుష్పవర్షం కురిపించారు."కంసచాణూర మర్దనాయనమః, కంస కంఠ నికృంతాయనాయ నమః" అంటూ లలాటాంజలిబద్ధులై శ్రీకృష్ణున్ని స్తోత్రం చేశారు. తదనంతరం శ్రీహరి కంసుడి కారాగారంలో వున్న తల్లి తండ్రులు - దేవకీ వసుదేవుల్నీ - తాతగారైన ఉగ్రసేనుణ్నీ విడిపించాడు. ఉగ్రసేనుడికి పునఃపట్టంగట్టి బలరామ శ్రీహరులిద్దరూ సాందీపుడి దగ్గర విద్యాభ్యాసానికి వెళ్ళారు. విద్యాభ్యాసం తరువాత యెప్పుడో చచ్చిపోయిన గురుపుత్రుణ్ణి వరుణలోకంనుంచి తెచ్చి, గురుదక్షిణగా సమర్పించాడు శ్రీహరి.

అటు తర్వాత కంసుడి మామగారూ, మహాబలశాలీ అయిన జరాసంధుడు మధురను ముట్టడించాడు. బలరామ శ్రీహరులు జరాసంధుణ్ని తరిమేశారు. కాని, సిగ్గులేని జరాసంధుడు చీటికి మాటికీ దండెత్తడంతో ప్రతీసారీ గెలుపు తమదే అయిప్పటికీ కూడా, నిత్య యుద్ధాలు ప్రజాజీవనానికి కంటకం కలిగిస్తాయనే ఆలోచనతో - శ్రీహరి యాదవరాజ్యాన్ని మధురనుంచి తరలించాలనుకున్నాడు. సముద్ర మధ్యంలో ద్వారకానగరాన్ని నిర్మింప చేసికొన్నాడు.మధురను విడిచి, శత్రుదుర్భేద్యమైన ద్వారకలో రాజ్యం సుస్థిరం చేశాడు.

## రుక్మిణీ కళ్యాణము

ఆరోజుల్లో - కుండిన నగరాన్ని రాజధానిగా చేసుకుని విదర్భ రాజ్యాన్ని భీష్మకుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి ఆరుగురు

సంతానం. పెద్దవాళ్ళయిదుగురూ పురుషులు కడగొట్టు ఆడపిల్ల పేరు రుక్మిణి. శ్రీహరి గుణగణాలు వినీ వినీ – పసితనం నుంచీ శ్రీహరినే తన భర్తగా వరించింది. ఇప్పుడు రుక్మిణీ యుక్తవయస్కురాలైంది. తండ్రి ఆమె వివాహం గురించి ఆలోచిస్తున్నాడు. రుక్మిణీ అన్నగార్లు అయిదుగురిలో పెద్దవాడు రుక్మి, రుక్మి తన చెల్లెల్ని, శిశుపాలుడికిచ్చి చేయాలని నిశ్చయించుకున్నాడు. తండ్రితో వాదులాడి తనమాటే 'ఔనని' పించుకున్నాడు. వివాహానికి ముహూర్తాలు నిశ్చయించేశారు.

అది తెలిసి కలవరపడింది రుక్మిణీ. అగ్నిద్యోతనుడు అనే ఒక బ్రాహ్మణ్ని పిలిచి తన మనసులో వున్నమాట చెప్పింది. "మీరు ద్వారకకు వెళ్ళండి. నా ప్రేమను శ్రీహరికి చెప్పండి సింహానికి దక్కవలసినదాన్ని నక్క లెగరేసుకుపోయినట్లు, కృష్ణపరం గావలసిన నన్ను శిశుపాలుడు చేపట్టాలని చూస్తున్నాడు. ముహూర్తానికి ముందే ఆయన్ని వచ్చి రాక్షసవిధిని యెత్తుకుపొమ్మని చెప్పండి. పెళ్ళికూతుర్ని చేశాక, చెలికత్తెలతో కలిసి పట్టణం వెలుపలి కొండమీద కోవెలలో గౌరీపూజకి వెడతాను. నన్ను తనతో తీసుకొని వెళ్ళడానికి అదే మంచి అదను అని చెప్పండి. ఆయన వచ్చి నన్ను స్వీకరించని పక్షంలో మరికనేను ప్రాణాలతో వుండేది లేదని కూడా చెప్పండి. మీ ఋణం వుంచుకోను" అని చెప్పింది. అగ్నిద్యోతనుడు ద్వారకకు బయలుదేరాడు. ద్వారకలో అతనికి చక్కటి ఆతిథ్యాన్నిచ్చాడు హరి. రుక్మిణి చెప్పిన విషయాలన్నీ కృష్ణుడికి వినిపించాడు బ్రాహ్మణుడు. అన్నీ విన్న కృష్ణుడు అందంగా నవ్వుతూ "బ్రాహ్మణ వాక్యం నా కెప్పుడూ శిరోధార్యమే. తప్పకుండా వస్తాను మీ రాకుమారిని రాక్షసవిధిని పాణిగ్రహణం చేస్తా" నన్నాడు.

అన్నంత పనీ చేసేడు కృష్ణుడు, గౌరీపూజకు వెళ్ళి మరలివస్తున్న రుక్మిణిని – మగ పెళ్ళివారిలో మగటిమిగలవాళ్ళమని చెప్పుకునే వారందరూ చూస్తూండగానే చేయి అందించి తన రథం మీదకు లాక్కున్నాడు. రుక్మిణినలా లాక్కోవడం గుఱ్ఱాల కళ్ళేల నిలా సడలించడం, అవి వాయువేగంతో ద్వారకవైపు దౌడుతీయడం అంతా రెప్పపాటు కాలంలో జరిగిపోయింది.

తేరుకున్న పెళ్ళివారు రుక్మిణీ కృష్ణుల్ని తరముకు వెళ్ళారు. కృష్ణుడు ఒంటరిగానే వాళ్ళని అడ్డుకున్నాడు. పెళ్లి కొడుకైన శిశుపాలుడూ, రుక్మిణీ అన్నగారైన రుక్మి కలిసి అశేషసైన్యంతో కృష్ణుణ్ని ముట్టడించారు. కృష్ణుడు ఒంటరిగా విదర్భకు వెళ్ళాడని తెలిసి, జరగబోయేది ముందే వూహించిన బలరాముడు సైన్యసమేతంగా బయలుదేరాడు. రుక్మి, శిశుపాలుడు కృష్ణుణ్ణి చుట్టుముట్టిన సమయానికి అక్కడికి చేరుకున్నాడు. బలరామ రణప్రవేశంతో కృష్ణుడు వాయువు తోడైన దావానలంలా విజృంభించి శత్రుసేనారణ్యాలని దహించేయసాగాడు. పరాభూతుడైన శిశుపాలుడు పారిపోయాడు. దురభిమాన రుగ్మతావశుడైన రుక్మితెగించి వచ్చి కృష్ణుడి పైకి వచ్చాడు. వాణ్ణి అవలీలగా ఓడించేశాడు వాసుదేవుడు. చంపడానికి సిద్ధపడ్డాడు. క్రొత్త పెళ్ళి కూతురైన రుక్మిణీ వారించింది. "ఎంతకైనా వాడు నా అన్నయ్య నా పెళ్ళి వాడి చావు ఒకేసారి కావడం నేను భరించలేను. దయజేసి వాడ్ని చంపకండీ!" అని వేడుకుంది. ఆమె మాట మన్నించాడు శ్రీహరి. సునిశితమైన శస్త్రంతో రుక్మిణి తల వెంట్రుకలను, మీసాలను కొరిగి రుక్మిణితో కలసి ద్వారక చేరాడు.

జరిగింది విన్న భీష్మకుడు – జనార్ధనుడికి క్షమాపణలు చెప్పుకున్నాడు. శ్రీహరి కాళ్ళు కడిగి కన్యాదాన ఫలం పొందాడు. పెద్దలందరి

సమక్షానా జగన్నాథుడు ద్వారకలోనే రుక్మిణీని విధ్యుక్తంగా వివాహమాడి తన దాంపత్య జీవితానికి శ్రీకారం చుట్టాడు.

# శ్యమంతకమణి

సత్రాజిత్తు అనే రాజుండేవాడు. అతడు గొప్ప సూర్యోపాసకుడు. రాజు భక్తికి మెచ్చి, గ్రహరాజైన సూర్యుడు అతనికి"శ్యమంతకం" అనే అద్భుతమైన మణిని యిచ్చాడు. ఆ మణిని ఆరాధించడం వల్ల రోజుకు ఇరవై మణుగుల బంగారం సిద్ధిస్తుంది. ఏతద్రత్న ప్రభావం వల్ల సత్రాజిత్తు అధిక సంపన్నుడై సాటివారిలో మేటిగా చెలామణీ అవుతున్నాడు.

ధనం పెరుగుతున్నకొద్దీ అతనిలో మదం కూడా పెరగసాగింది. కృష్ణుడు కౌస్తుభాన్ని ధరించినట్లే తానుశ్యమంతకాన్ని ధరించేవాడు. ఒకానొక రాజగోష్టిలో సంభాషణా వశాన సత్రాజిత్తు కౌస్తుభాన్ని కించగా మాట్లాడాడు. అందుకు కృష్ణుడు నవ్వుతూ"ఔనౌను! పోనీ మన యిద్దరి మణులూ మార్చుకుందామేమిటి?" అని పరాచికమాడాడు. సత్రాజిత్తు దానిని వేళాకోళంగా తీసుకోలేదు. నిజంగానే కృష్ణుడు తన మణి విషయంలో యీర్ష్యపడుతున్నాడని భావించి, ఆనందిచాడు. అసలే కృష్ణుడు నవనీతచోరుడు, గనుక, తన మణిని కూడా దొంగిలిస్తాడేమోననే అనుమానంతో నిత్యం జాగ్రత్తగా వుంటూండేవాడు.

ఒకరోజు సత్రాజిత్ తమ్ముడైన ప్రసేనజిత్తు అనేవాడు ఆ మణిని ధరించి అడవిలో వేటకు వెళ్ళాడు. ఆ వేటలో ఒక సింహం ప్రసేనుణ్ని చంపివేసింది. సూర్యదత్తమైన శ్యమంతకాన్ని చూసి, అది – యువరాజు యొక్క గుండెకాయ అనుకుని నోటబుట్టుకుని గుహవైపు వెళ్ళ సాగింది. ఆ సమయానికే అటుగా వస్తున్నాడు జాంబవంతుడు. పండితుడూ,

మన్వంతరజీవీ అయిన ఆ భల్లూకపతి మణిని గుర్తించాడు. సింహాన్ని ఆవలీలగా వధించి మణిని తన గుహకు తీసుకుని వెళ్ళాడు. జాంబవంతుడి కూతురు జాంబవతి. అతడా మణిని ఆమె కేళీమందిరంలోని అలంకారంగా కట్టిపెట్టాడు.

ఇక్కడ సత్రాజిత్, వేటకెళ్ళిన తమ్ముడు రెండు మూడు రోజులైనా రాకపోవడంతో కలతబడ్డాడు. పై శ్యమంతకాన్ని అతడు తీసుకెళ్ళి వుండటంవల్ల మరింతగా భయపడ్డాడు. రాజకీయాల కాలవాలమైన ఆ క్షత్రియుడు. తమ్ముడి అదృశ్యానికి రాజకీయ కారణం వెదికాడు. కృష్ణుడే మోసం చేసి మణిని హరించి ఉంటాడని నిశ్చయించుకున్నాడు. అదేవిషయాన్ని ప్రచారం చేయడం మొదలెట్టాడు. తద్వారా తనకు సరిపడని శౌరి లోకంలో అవమానాలపాలై పోతాడుగదా!

సర్వజ్ఞతా, సర్వకర్తా ఆ కృష్ణుడు నిందను ఆనందంగా తలదాల్చాడు. "ఈ అపనిందను తొలగించుకోవడానికి నేనే స్వయంగా వెళ్ళి పసేనుడి జాడనీ, శ్యమంతకాన్నీ సాధించుకుని వస్తానని" శపథం చేశాడు.

## చంద్రదర్శన దోషం

భాద్ర పదశుద్ధ పంచమినాడు అన్వేషణకు బయలుదేరతానన్నాడు కృష్ణుడు అంత ఆలస్యందేనికి అని అడిగాడు బలరాముడు. అప్పుడా కృష్ణుడిలా చెప్పాడు"అన్నా! బలరామా! చాలాకాలం పూర్వం విఘ్నేశ్వరుడి జన్మదినం వచ్చింది. ఆరోజు కైలాసం అంతా కన్నుల వైకుంఠంగా అలంకరించారు. శివకుమారుడి పుట్టిన రోజు పండుగ చూడాలని దేవతా గణాలన్నీ సమకూడాయి. వాద్య, గీత, నృత్యవిశేషాలతో గిరికందరాలు మార్మోగుతున్నాయి. అటువంటి సంతోషకర సమయంలో గుజ్జురూపుడైన

బాలగణపతి తాను కూడా నర్తించసాగాడు. గజవదనుడు, అజాడు మొలనూలుచుట్టిన బొజ్జగలవాడూ అయిన గణపతి నాట్యాన్ని చూసి చంద్రుడు అపహాస్యం చేశాడు. అందుకు కినిసిన విఘ్నేశ్వరుడు చంద్రదర్శనం దోషితమగుగాక అని శపించాడు. అనంతరం అందరూ ప్రార్థించగా దయాంతరంగుడై భాద్రపదశుద్ధచవితి ఆయన జన్మదినం గాబట్టి, తనని పూజించి కథాక్షతలు శిరసున తాల్చకుండా ఆ రోజున చంద్రుని చూచినవారు మాత్రమే అపనిందలు పాలవుతారని అనుగ్రహించాడు.

అన్నా! సీరపాణీ! గత సంవత్సరం – రాచవ్యవహారాల సందడిలో నుండి నేనా పూజలోపాల్గొనలేదు, ఆ రాత్రి క్షీరఘటంలో క్షీరార్ణవోద్భవుడి ప్రతిబింబం చూడవలసి వచ్చింది. ఆ దోషమే ఈ అపనిందకి కారణం. మరో ఒకటి రెండు దినాలలో వినాయక చవితి రాబోతుంది. ఆ రోజు ఆయనను ఆరాధించి మరునాడు బయలుదేరి నిర్విఘ్నంగా పని ముగించుకుని వస్తా" అన్నాడు.

ఆ వచనానుసారమే వినాయకవ్రతమాచరించి శుభలగ్నంలో, శుభ శకునాలు చూసుకుని సర్వశుభంకరుడైన లీలామానుషవిగ్రహ రూపుడా కృష్ణుడు శ్యమంతకాన్వేషణకు బయలుదేరాడు.

## ఒక మణి ఇద్దరు - భార్యామణులు

అడవులలో ప్రసేనుడి కళేబరం కనిపించింది. చేరువలోని సింహం అడుగుల గుర్తులు చూసుకుంటూ అటుగా బయలుదేరాడు కృష్ణుడు. కొంత దూరం వెళ్ళాక పెనుగులాట గుర్తులూ జాంబవంతుని పాదాలగుర్తులూ పసిగట్టాడు. మెల్లగా జాంబవంతుడి గుహలోకి చేరాడు. ఆ గుహలో జాంబవతి యొక్క కేళీడోలికలో శ్యమంతకాన్ని చూశాడు. ఆ

ఊయలలోనే యేవో మధుర భావాలలో తేలుతు ఊయలలూగుతున్న జాంబవతినీ చూశాడు. జాంబవతి కూడా కృష్ణుణ్ణి చూసింది. తొలిచూపులోనే ఆమె తన మనసు నా జగన్మోహనుడికి అర్పించుకుంది.

అంతలోనే వచ్చిన జాంబవంతుడు తన కూతురుతో ప్రేమ భాషణచేస్తున్న కృష్ణుడితో యుద్ధానికి తలపడ్డాడు.

వాళ్ళిద్దరూ వారం రోజులపాటు అహోరాత్రులూ పోరాడుకున్నారు. అనంతరం జాంబవంతుడికి అలసట రాసాగింది. అతడు యుద్ధాన్ని ఆపి "మన్వంతరజీవినీ, మహాబలశాలినీ యైన నన్నే అలయచేసిన నువ్వు సామాన్యునివిగావు. సిద్ధుడివో శ్రీమన్నారాయణుడివో అయివుండాలి, నిజం చెప్పు" అన్నాడు.

అందుకు కృష్ణుడు నవ్వుతూ అతనికి శ్రీరామావతారరూపములో దర్శనం యిచ్చాడు. "జాంబవంతా! త్రేతాయుగంలో శ్రీరామపట్టాభిషేక వేళ అందరి వాంఛితాలు తీరుస్తూ!" నీకే మీ కావాలో కొరుకొమ్మంటే, నువ్వు నాతో ద్వంద్వయుద్ధాన్ని కోరావు. నీ ముచ్చట ద్వాపరంలో తీరుస్తానని మాటనిచ్చాను నీకోరిక తీరిందా?" అని అడిగాడు. జాంబవంతుడు కృష్ణుణ్ని శ్రీహరిగా గుర్తించి కీర్తించాడు. శ్యమంతకమణితోబాటే తన పుత్రికామణి యైన జాంబవతిని కూడా సమర్పించుకున్నాడు. జాంబవతీ శ్యమంత సహితుడై ద్వారకకు మరలివచ్చి శ్యమంతకాన్ని సత్రాజిత్తుకు అప్పగించాడు.

కృష్ణకృత కార్యానికి, లజ్జితుడైన సత్రాజిత్ తనని క్షమించమని వేడుకున్నాడు. శ్యమంతకంతోబాటు తన కుమార్తెయైన సత్యభామను శ్రీకృష్ణుడికి కానుకగా ఇచ్చాడు. కృష్ణుడు పెద్దలందరి సమక్షంలోనూ విధ్యుక్తగా జాంబవతీ, సత్యభామలను పెండ్లిచేసుకొని పెద్దభార్య రుక్మిణీతో సహా ముగ్గురూ రాణులతోనూ సుఖంగా వుండసాగాడు.

# శ్రీ కృష్ణుడి యితర కళ్యాణాలు

సత్యభామను పరిణయమాడిన వెనుక, సూర్యపుత్రికయైన కాళింది – శ్రీకృష్ణుణ్ని వలచి, గాంధర్వవిధిని వివాహం కోరింది. అంగీకరించిన కృష్ణుడు, ఆమెను స్వీకరించాడు.

ఆ అనంతరం అవంతీదేశాధీశులైన విందానువిందులు తమ చెల్లెలైన మిత్రవిందకు స్వయంవరం చాటించగా కృష్ణుడు అక్కడి రాజులందరిని జయించి ఆమెను చేపట్టాడు. కోసలేశ్వరుడైన నగ్నజిత్తు ఆవుల మందలోనున్న ఏడు ఆంబోతులను పట్టి కట్టి వేసేవారికి, తన కుమార్తెయైన నాగ్నజిత్తి నిచ్చి వివాహము చేస్తానని ప్రకటన చేశాడు. తన పట్టిని కట్టబెట్టగలనని ప్రతిజ్ఞజేశాడు. వివిధ దేశాలకు చెందిన యెందరెందరో పరాక్రమవంతులూ, వీరులూ, మహాబలశాలులూ వచ్చారు కాని యెంత ప్రయత్నించీకూడా ఆ వృషభ సప్తకాన్ని అదుపులోనికి తెచ్చుకోలేకపోయారు. ఈ వార్తవిని కృష్ణుడు స్వయంగా కోసలకు వెళ్ళాడు. నగ్నజిత్తు నవ్వి కృష్ణా! ఎందరో మహావీరులు ఓడిపోయారు. అనవసరంగా అవమానాల పాలవకు, నా ఆబోతులను నువ్వేమీ చెయ్యలేవు" అన్నాడు. కృష్ణుడు అంతకన్నా సమ్మోహనంగా నవ్వుతూ "అవకాశమిచ్చిచూడు" అన్నాడు. అహంకరించివున్న నగ్నజిత్తు యేడు ఆబోతులనూ బరిమీదకు వదిలాడు. అద్భుతకర్ముడైన శ్రీకృష్ణుడు ఆయేడింటినీ అవలీలగా నిరోధించి, బంధించి వేశాడు. నగ్నజిత్తు తలవంచుకున్నాడు. క్షమించమని వేడుకుంటూ తన కూతురైన నాగ్నజితిని శ్రీహరికిచ్చి పెండ్లి చేసాడు. ఆమెతో బాటు పదివేల పాడి ఆవుల్నీ, దివ్యమైన వస్త్ర ఆభరణాలతో అలంకరించబడిన మూడు వేలమంది దాసీలనీ తొమ్మిదివేల యేనుగుల్నీ,

తొమ్మిది లక్షల గుర్రాల్నీ – అంతే పదాతి సైనికుల్నీ కట్నకానుకల రూపంలో సమర్పించాడు.

ఏతత్కల్యాణానంతరం – శ్రీహరికి మేనమామ కూతురైన భద్రను బంధువులకోరికపైనా, మద్ర రాజపుత్రిక లక్షణను స్వయంవరంలోనూ పెండ్లాడాడు. అంతటితో ఆయనకి ఎనుమండుగురు భార్యలయ్యారు. 1.రుక్మిణి, 2.జాంబవతి, 3.సత్యభామ, 4.కాళింది, 5.మిత్రవింద, 6.నాగ్నజితి, 7.భద్ర, 8.లక్షణ లనే అష్టమహిషులతో అలరారుతూ – జగదారిష్టాలను నష్టపరిచే వాడూ, భక్తేష్టాలను పరిపుష్టి చేసేవాడూ అయిన శ్రీకృష్ణ పరమాత్మకు నమస్కరిస్తున్నాను.

ఏవంవిధమైన శ్రీకృష్ణకల్యాణ శ్రీకృష్ణ గాథ సర్వపాప, తాపహరం, శాంత్యైశ్వర్యప్రదం – అని శుకుడు చెప్పింది విని పరీక్షిత్తు"నృగ చరిత్రని వినిపించ" మని కోరాడు. శుకుడు చెప్పసాగాడు.

## నృగరాజు చరిత్ర

ఇక్ష్వాకుడి కొడుకు నృగువు. అతడు ఎంతో ధర్మపరుడు నిత్యదాత. ఆ నృగుడొకనొక మహాయజ్ఞం నిర్వహిస్తూ – కశ్యపుడికి అనేకమైన గోవుల్ని దానంచేశాడు. కర్మవశాన – దానమీయబడిన వాటిలో ఒకానొక ఆవు మరల వచ్చి దూడలో కలిసిపోయింది. పశువుల కాపరులు దానిని గుర్తించలేక పోయారు. రాజు దానమిచ్చిన ఆవులన్నింటిలోనూ అందమైనది, తనకెంతగానో నచ్చినదీయైన ఆ ఆవు తప్పిపోవడంతో కశ్యపుడు కొంచెం బాధపడ్డాడు. ఎంత వెదకినా లభించలేదు.

కొన్నాళ్ళు గడిచిన తర్వాత మహారాజైన నృగుడు మరో బ్రాహ్మణుడికి మరి కొన్ని గోవుల్ని దానంచేశాడు. ఆ గోవుల్లోనే – కశ్యపుడి

మంద నుంచి తప్పించుకొన్న ఆవు కూడా వుంది. దానం తీసుకొన్న బ్రాహ్మణుడు ఆలమందను తన యింటికి తోలుకొని పోసాగాడు. కాలవశాన మార్గ మధ్యంలో కశ్యపుడు తారసపడ్డాడు. అతడి మందలో వున్న తన ఆవును గుర్తించి ఆశ్చర్యపోయాడు. ఆ బ్రాహ్మణున్ని ఆపి -"ఈ ఆవు నీకెక్కడిది?" అని అడిగాడు. అందుకా బ్రాహ్మణుడు -"నృగమహారాజు యిచ్చాడు." అని చెప్పివెళ్లిపోయాడు. కశ్యపుడు సరాసరి నృగుడి వద్దకు వెళ్ళాడు జరిగిన విషయం చెప్పాడు, "నిజానికి ది నా ఆవు. దానిని దానంచేసే హక్కు నీకెవడిచ్చాడు." అని నిలదీశాడు. నృగుడు చాలా బాధపడ్డాడు. "తెలిసిచేసిన తప్పుకాదది తెలియక దొరలిన పొరబాటిది. నాకు యెఱుక లేకుండానే మీయావు నామందలో కలవడం జరిగింది. ఇప్పుడు తెలిసి తెలిసి దానమిచ్చిన ధేనువుని తిరిగినిమ్మనడం న్యాయం కాదు గదా! విధివశాన జరిగినదానికి నేనూ చింతిస్తున్నాను. ఆ ఆవుస్థానే వెయ్యి ఆవులిస్తాను మీకు. శాంతించండి" అని కోరాడు.

కశ్యపుడు వినిపించుకోలేదు. తనకు ఆ ఆవే కావాలనిపట్టుపట్టాడు. బ్రాహ్మణుణ్ణి నిరాశపరచడం యిష్టంలేనినృగుడు ఆవుని దానంపట్టిన విప్రుణ్ణి పిలిపించి విషయం చెప్పాడు. ఆ ఒక్క ఆవునూ తిరిగి యిప్పిస్తే - వేయి ఆవులిస్తానన్నాడు పాపపరిహారంగా మరో తొమ్మిదివేల ఆవులు, వెరసి పదివేల ఆవులిస్తాను" అన్నాడు. ఆ బ్రాహ్మణుడు కూడా తనకు కశ్యపుడి ఆవే కావాలన్నాడు. చరాచరా సభనుంచి వెళ్ళిపోయాడు. నృగుడు కశ్యపుణ్ణి ఓదార్చాలని యెంతో ప్రయత్నించాడు. అతనిని శాంతిపం చేయడం కోసం లక్షగోవులిస్తానన్నాడు "అయినా సరే కాదూకూడ" దన్నాడు కశ్యపుడు.

"వీధిదారిన దానమిచ్చిన దానిని పెరటదారిన అపహరించి వేరొకరికి దానంచేసే నువ్వు ధర్మాత్ముడివికావు. నీ ముఖం చూస్తేనే పాపం, ఇలా

విప్రధనం విషయంలో ఇంకెపుడూ వూసరవెల్లిలా ప్రవర్తించకు' అని హెచ్చరించి – కశ్యపుడు కోపంగా యింటికి వెళ్లిపోయాడు.

కాలాంతరంలో కర్మానుసారంగా నృగుడు కాలంచేసి యముడి సన్నిధికి గొనిపోబడ్డాడు. యముడతన్ని సమ్మానించాడు. "మహారాజా; అఖండమైన పుణ్యాలు చేశావు నువ్వు, కాని – అపుణ్యాలలో కూడా – తెలియకండానే కొన్ని పారబాట్లు జరిగిపోయాయి. ముఖ్యంగా బ్రాహ్మణ కోపానికి గురిఅయ్యావు అందువల్ల ఆ రవ్వంతపాపఫలం ముందుగా అనుభవిస్తే తదనంతరం సుదీర్ఘకాలం స్వర్గభోగాలు అనుభవిద్దువుగాని, ముందు పుణ్యఫలమా? పాపఫలమా? అని అడిగాడు. ముందుగా స్వల్పమైన పాపఫలమే అనుభవిస్తానన్నాడు నృగుడు. యముడు తథాస్తు అన్నాడు. తక్షణమే ఇక్ష్వాకుడైన నృగరాజు ఊసరవెల్లిగా మారిపోయి భూమినిపడ్డాడు.

ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడి కరస్పర్శతో పాపవిముక్తుడై దివ్యదేహుడై స్వర్గాన్ని అలంకరించాడు. ఇదీ నృగుడికథ అని చెప్పాక – పరీక్షిత్, పౌండ్రిక వాసుదేవుడి విషయమై అడిగాడు. శుకులవారు యిలా చెప్పారు.

## పౌండ్రక వాసుదేవుడు

"పూర్వం కరూశదేశాన్ని పాలించేవాడు పౌండ్రక వాసుదేవుడు. లోకంలో యశోవంతులపట్ల యితరుల ఈర్ష్యపడడం సహజమే గదా! అదేవిధంగా కాశీరాజు ప్రభృతులతో కలిసి – పౌండ్రక వాసుదేవుడు – కృష్ణుడి పట్ల యీర్ష్యాళువై వుంటూండేవాడు.

పులిని చూసి నక్క వాతపెట్టుకున్నట్లు"– అతడు కూడా కృష్ణునివలెనే – పీతాంబరం ధరించేవాడు. కిరీటం, నెమలిపింఛం పెట్టు

కొనేవాడు. ఒక పెద్దచక్రం, శంఖం యెప్పుడూ తనతోనే వుండేలా యేర్పాటు చేసుకొన్నాడు. ఒకటేమిటి? ఇవన్నీ కృష్ణుడికి తెలిసినా, నవ్వేసి వూరుకున్నాడు. కాని, పౌండ్రక వాసుదేవుడికి అహంకారం పెరిగి – పెరిగి ఒక రోజున కృష్ణుడికి యిలా రాయబారం పంపించాడు.

"కృష్ణా! నా పేరు వాసుదేవుడు. నీ పేరు కృష్ణుడు కాని మీ తండ్రి పేరు మీద నవ్వుకూడా వాసుదేవుడని పిలిపించుకుని నన్ను అవమానిస్తున్నావు. నువ్వేదో నెమలి పింఛం పెట్టుకుంటావనీ, మురళివాయిస్తావనీ, శంఖచక్ర ధరుడవనీ అనుకోకు. అవన్నీ నాకూ వున్నాయి. అంచేత నీకో విషయము ఖచ్చితంగా చెబుతున్నాను. ఈ ప్రపంచంలో యిద్దరు వాసుదేవులు వుండటానికి వీలులేదు. ఉంటే నువ్వుండాలి. లేదా, నేనుండాలి – ఏమాంటావ్?"

దూత చెప్పిందివిని – చిరునవ్వు నవ్వాడు కృష్ణుడు."మా యిద్దరిలో ఎవరో ఒక్కళ్ళే వుండాలి అనేది ఆయన కోరికైతే కాదనేదేముంది? అలాగే చేస్తాను" అని చెప్పు అని తన సందేశాన్ని దూతచేత పంపించాడు. మండి పడ్డాడు పౌండ్రుడు. మిత్రుడైన కాశీరాజుసేన మూడు అక్షౌహిణీలు తనదొక రెండక్షౌహిణిలు వెరసి అయిదు అక్షౌహిణిల సైన్యంతో కృష్ణుడిపై యుద్ధాన్ని ప్రకటించాడు.

వాసుదేవ, పౌండ్రిక వాసుదేవులమధ్య ఘోరయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో కృష్ణుడు – పౌండ్రకునిపై చక్రం చక్రం ప్రయోగించాడు. చక్రం పౌండ్రికుడితల నరికేసింది. అదిచూసి – కాశీరాజు ఆవేశంతో కృష్ణుమీదకు వచ్చాడు, కృష్ణుడు ఆ కాశీరాజుతలను కూడనరికి, ఆ రాజు యొక్క కోటలోనే పడేలా కొట్టాడు. కాశీరాజు బంధుమిత్ర మంత్రి పుత్రాదులందరూ జరిగిందానికి యెంతగానో చింతించారు.

కాశీరాజు కొడుకైన సుదక్షిణుడనేవాడు – కృష్ణునిపై పగతీర్చుకోదలచి – అగ్నికి అభిచార హోమం చేశాడు. ఫలితంగా అందులోంచి ఒక మహాభయంకరమైన శక్తి ఆవిర్భవించింది. సుదక్షిణుడు – దానిని కృష్ణుడ్ని వధించిరమ్మని పంపాడు.

ద్వారకలోని అంతఃపురంలో కృష్ణుడు సొగటాలాట లాడుతుండగా – అక్కడకు వెళ్ళింది ఆ అభిచారశక్తి. గుర్తించాడు శ్రీహరి సర్వసృష్టినీ గడగడలాడించే వైష్ణవీ శక్తియు తుడికీ ఘాతమెుకలెక్క? వచ్చిన – ఆఘాతం మీద పడబోయింది సుదర్శనచక్ర ప్రయోగంతో అభిచారశక్తి కంగుతింది. కంగారుపడుతూ పునఃకాశీని చేరింది. సుదక్షిణుడి పురోహితుణ్ణి చూసి "నాకు బలినివ్వండి – ఆ సుదర్శనం నుంచి కాపాడండి అంది ఆ విప్రక్షత్రియులిద్దరూ నిస్సహాయంగా నిలబడడంతో ఆగ్రహించి – సుదక్షిణుణ్ని – పురోహితుడ్ని మ్రింగేసింది. ఆ దేసమయాన సుదర్శనం ఆశక్తి శిరస్సును తెగేసింది. అంతటితో ఆగకుండా కాశీరాజ్యం నిర్జీవమయ్యేలా విజృంభించి, అనంతరం శ్రీకృష్ణుడ్ని చేరింది.

## కుచేలోపాఖ్యానము

ఇలా హరికళ్యాణ లీలావిశేషాదికములన్నీ పెక్కు కథలుగా వినిపించిభక్తరక్షణ కథా శ్రవణము గావించ నెంచి శుకయెాగి కుచేలోపాఖ్యానమును నిట్లు చెప్పదొడగెను.

"రాజా! వింధ్య పర్వత ప్రాంతమందొక మునిపల్లెలో కుచేలుడను పేద బ్రాహ్మణుడు కాపురము చేయుచుండెను. పెక్కుమంది పిల్లలతో, వామాక్షి యనబడు నిల్లాలితో దారిద్ర్యముతో బాధపడుచున్నను ఎవరివద్దకు పోయి పైసపుచ్చుకొనక ప్రాప్తించిన దాని ననుభవించుచు నానాబాధలతో

కాపురము సాగించుచుండెను. దరిద్ర బాధపడలేక, వామాక్షి, భర్తను చూచి "మీతో చదువుకొన్న స్నేహితుడగు శ్రీకృష్ణుని దర్శనము కావించి దరిద్రబాధతీర్చు మని" ప్రార్థించినది. ఆమె ప్రార్థనను విని నమ్మతించి యూ హరికుపాయనముగా నెద్దియైన నియ్యమనెను. అంతనాయిల్లాలు తుట్టలుగట్టిన యటుకులను చినిగిన పైకండువాయిలో ముడివైచి సాగనంపెను కుచేలుడు గోవిందధ్యాన పరాయణుడై ద్వారక చేరెను. శ్రీకృష్ణ మందిర ద్వారమువద్ద ద్వారపాలకు లడ్డగింపగా వాసుదేవుని స్మరించుచు నటనే నిలచియున్నందుకు భక్తుని హృదయమెరిగిన శ్రీహరి రక్మిణీసమేతుడై యెదురువచ్చి యూతని కౌగలించుకొని లోనికి గొనిపోయి తన మృదుతల్పమున గూర్చుండబెట్టెను. రుక్మిణీదేవి నీరుపోయుగా శ్రీహరి యూతని పాదములు గడిగి ఆ నీరు తన శిరస్సున జల్లుకొని, రుక్మిణీదేవి శిరమునజల్లెను. గంధమునలది పూవుల పూజించి యిలవేల్పువలె హరి ఆ కుచేలుని నారాధించెను. ఇష్ట ప్రసంగాదులైన పిదప శ్రీహరి "సుధామా! చిన్ననాటి స్నేహితుడివి. ఇన్నేళ్ళకి వచ్చావు. మరి నాకోసం యేం తెచ్చా" వన్నాడు, కుచేలుడు సిగ్గుపడుతూనే మౌనంగా వుండిపోయాడు. అతని వుత్తరీయువుకొంగున వున్నమూట శ్రీహరి కంటపడనేపండింది. ఏదో తెచ్చికూడా మొగమాటపడతావేం మిత్రమా? అంటూ ఆమూట లాక్కున్నాడు కొంటె శ్రీహరి. కుంచించుకుపోతున్నాడు కుచేలుడు. శ్రీహరి మూటవిప్పాడు. ఆనందంతో మెరిసాయి ఆయునకళ్ళు."అరే? అటుకులా! నాకు చాలాయిష్టం, చూశావా రుక్మిణీ! చిన్ననాటి స్నేహితుడు గనుక నాకు ఏది యిష్టమో గుర్తించి మరీ తెచ్చాడు"అంటూనే రెండు గుప్పిళ్ళ అటుకులు గొంతులో వేసుకున్నాడు. అనంతరం - కుచేలుడు శ్రీహరివద్ద శెలవు తీసుకుని బయలుదేరాడు. చిత్రమేమిటంటే! కృష్ణ సందర్శనానందంలో అతడు శ్రీహరిని సహాయం అడగడమే మర్చిపోయాడు.

సర్వాంతర్యామియైన శ్రీహరిని వేరే అడగాలా? కుచేలుని నుండి సంగ్రహించి తాను భుజించిన రెండుగుప్పిళ్ళ అటుకులస్థానే - అతని పూరిగుడిసె పాలరాతిభవనమైంది. తనయిల్లేమైందా అని తడబడుతున్న కుచేలున్ని అతని ఇల్లాలు వచ్చి ఆహ్వానించింది. భక్తరక్షణ కళాదురంధరుడైన శ్రీహరి మహిమ అప్పుడు అర్థం అయింది. ఆ వెర్రి బ్రాహ్మణుడికి. ఇలా చెప్పుకుంటూపోతే అంతూ దరీ వుండవనుకో ఆ హరిలీలలకి.

## యాదవులను మునులు శపించుట కృష్ణ-నిర్యాణం

ఈ విధముగా శ్రీకృష్ణభగవానుని లీలలు విశేషములు చక్కగా వివరించగా రాజా విని తన్మయుడై యింకను యాదవవంశ చరిత్రమును వినిపింపుమని యడుగగా శుకుడిట్లు ప్రారంభించెను."మహారాజా! వినుము. శ్రీహరి భూభారము తీర్చదలచి కురుక్షేత్ర సంగ్రామములో దుష్ట ప్రజాక్షయము శిష్టరక్షణ కావించిన ఆయనను దర్శింప నారదాది మహామునీంద్రులు ద్వారకానగరమునకు వచ్చిరి. యాదవకుమారులు వారిని గేలిచేయదలచి సాంబుడను వానికి గర్భిణీ స్త్రీ వేషము వేసి మునుల యెదుట నిలబెట్టి "దీనికి పుట్టువాడు మగవాడా? యాడుదియా?" యని ప్రశ్నించిరి. త్రికాలవేదులగు మునులా పరిహాసమునకు తీవ్రపడి "వీనికడుపున యాదవనాశనము చేయు ముసలముపుట్టు" ననిరి అట్లేయొక యినుపరోకలి పుట్టినది. వారందరూ భయపడి శ్రీహరివద్దయేగి యారోకలిని చూపిరి శ్రీహరి యా రోకలినిసన్నగా రజముచేసి సముద్రములో కలుపుడని సలహాచెప్పెను.

వారందరూ రోకలిని యరుగదీసి సముద్రములో గల్పిరి. ఆ రజమంతయు సముద్రపు వారనున్న తెల్లదుబ్బులకు నంటుకొని

యుండెను. ఇట్లుండగా యాదవులొక పర్వదినమున సముద్రస్నానానికై వచ్చిరి. సముద్రస్నానము గావించి ఆ సంబరంలో సురాపానంచేసి వారిలో వారు సరసవాడునట్లు సముద్రతీరమున గల్గిన అల్లుదుబ్బులతో బాదుకొనసాగిరి. శాపవశమున ఆపాటికే వారందరూ మరణము చెందిరి. ఇట్లు యాదవవంశం ముసల మూలమున సర్వనాశనమైనది. ఆ ముసలము నరుగదీసి చిన్న ముక్కను వదలిరి. ఆ ముక్క నొకకిరాతకుడు తన యులుగునకు తగిల్చి తిరుగుచుండెను. ఈతడు పూర్వజన్మలో వాలియని యందురు. శ్రీహరి ద్వారకనువదలి యరణ్యమునకు జేరి యుద్ధవునితో మాట్లాడుతూ, ఒకకాలి నింకొక మోకాలిపై పెట్టి, ఊపగా యాతడు ఆ కదలిక లేడి కన్ను కదలికలా భావించిన కిరాతకుడు బాణముతో కొట్టెను, వెంటనే యా బాణపాతముతో శ్రీహరి తన యవతారము వదలి వైకుంఠము జేరెను. అంతలో బలరాముని శరీరమునుండి మహాసర్పమువచ్చి యాతని తేజము శేషునిలో కలిసిపోయెను. మహారాజా! యిట్లు భగవానుడు భూలోక భారము తీర్చి, ధర్మమునునిల్పి శాశ్వత కీర్తి గడించెను. ఆ దివ్యలీలల నానందముతో గానముచేయు ప్రజలు తప్పక తరింతురు.

# పరీక్షితుని మరణము

ఇట్లు శ్రీకృష్ణ నిర్యాణము గురించి వివరించగా విని, పరీక్షిత్ "భవిష్యత్తు గురించి రాబోవు రాజవంశములు కలియుగ విశేషములు గురించి చెప్పు" మని యడిగెను. ఆ మాటవిని శుకయోగీంద్రుడు చెప్పారంభించెను. బృహద్రథునకు పురంజయుడు, తరువాత కాకవర్ణుడు, వానికి క్షమవర్మ్యడు మొదలగు వారు జన్మించి పాలించగా మహానందులు మహానందికి శూద్రస్త్రీవలన జన్మింతురు. మహానందులు తొమ్మండుగురు, చంద్రగుప్త చక్రవర్తికి చాణక్యుడను బ్రాహ్మణ సహాయముతో రాజ్యప్రాప్తియగును.

తరువాత యశోక చక్రవర్తి రాజ్యమేలును. క్రమముగా రాజ్యములలో సాంకర్య స్థితులు కల్గును కలిలో యుగధర్మములు పెరుగ, శ్రీహరి శంబళగ్రామములో కల్కి యను నామముతో జన్మించి గుఱ్ఱమునెక్కి ఖడ్గము ధరించి లోకములోని దుష్టులను సంహరించి, ధర్మం నిల్పునని మహాత్ముడగు శ్రీశుకుడు మహాభాగవత దివ్య కథామృతము వినిపించి, తరువాత యిట్లు చెప్పగాడగెను.

"పరీక్షిన్మహారాజా! కలియుగమునందు ప్రజలు కామక్రోధాదులతో నిండి వర్ణాశ్రమ ధర్మాల విడిచి దురాన్న భక్షణము, దురాచారములు, శూద్రసేవావరతులై యుందురు. ధనహీనులై తల్లితండ్రులను, సుత సోదర, సోదరీ దాయాదులను విడచి కామోపభోగములలో వ్యత్యాసములేక కులనాశనము గాలించెదరు, కఱవు, యనావృష్టులతో దేశములు క్షోభించుచుండును. బ్రాహ్మణులు కులాచార ధర్మాలను సమస్త యజ్ఞాది కర్మలను వదలుదురు. కలియందు ముహూర్తకాలము మాత్రము హరిస్మరణము చేసినచో నూరుయజ్ఞనముల ఫలితము పొందగల్గుదురు. కావున, నీవు శ్రీహరి నామస్మరణము గావించుచు జీవితము గడుపుకొన్న చోతప్పక మోక్షము ప్రాప్తించునని ప్రోత్సహించెను. ఆ తరువాత ప్రళయకాలములో లోకములన్నియు జలమయమగునని రాజాతో చెప్పెను. ప్రళయసమయములో మహావాయువులు వీచును ఏనుగుతొండములావు ధారలతో వర్షము పడును. మిట్టపల్లములు లేకుండా జలమయముగనగు యూ రాజానకు చెప్పి మహాభాగవత కథ విన్పించెను.

ఇట్లుండగా – బాహ్మణ శాపము ప్రకారము తక్షకుడు బ్రాహ్మణ వేషముతో బయలుదేరి వచ్చుండెను. దారిలో తక్షకునకు కశ్యపుడను బ్రాహ్మణు డెదురుపడెను. వానిని చూచి తక్షకుడు మీరెవరు? ఎక్కడకు పోవుచున్నారని యడిగెను. అందుకు కశ్యపుడు పరీక్షితుని ఆ శాపము ననుసరించి తక్షకుడు కాటువేయునట? ఆ విషము హరింపజేసి రాజాను

బ్రతికింతుననెను. నీవంతటివాడవా? అయితే విను. నేనే తక్షకుణ్ణి. ఇప్పుడు ఇయా మఱ్ఱిచెట్టును కాటువేసెద, బ్రతికించుమని దానిని శక్తికొలది కాటువేసెను. ఆ చెట్టు సర్పవిషప్రభావముచే బూడిదయ్యెను. ఈ కశ్యపుడు ఆ బూడిదను ప్రోగుచేసి కమండలముజలము ప్రోక్షించి, మంత్రించి నిమిషములో పునర్జీవింపచేయుగా – తక్షకుడాతనికి అగణితధనమును విశేషము గానిచ్చి ఋషి శాపము నిల్పుమని కోరెను. తరువాత తక్షకుడు బ్రాహ్మణ వటుల ద్వారా రూపముతో వెళ్ళి పరీక్షితుకొక నిమ్మపండు నిచ్చెను. అందుండి నలుపురంగు పురుగు వెలువడి క్రమంగా చూడగా సర్పాకృతిపొంది మహావ్యాళమై కాటువేసి రాజును మృతుని గావించెను. అతడు శ్రీహరి లోకము పొందెను.

తరువాత రాకుమారుడగు జనమేజయుడు రాజు దేహమునకు కుచితమగు ఉత్తరలోక క్రియలు గావించెను. పిదప మహామునులందరు జనమేజమునకు పట్టాభిషేకము గావించిరి, అతడే సర్పయాగము గావించి తండ్రిని చంపిన కోపము తీర్చుకొని యాస్తికుని వలన సర్పయాగము సమాప్తము గావించెను.

## భాగవతపురాణం సమాప్తం



# 6. నారద పురాణము

నారద మహాముని ఉపదేశించిందీ పురాణం. "నాభిఃస్యాన్నారదీయకమ్" శ్రీమహావిష్ణువు యొక్క నాభి స్థానంతో పోల్చబడింది నారద పురాణం.

'పంచవింశత్సహస్రాణి నారదీయం తదుచ్యతే!'

ఇందులో ఇరువది యైదువేల శ్లోకాలున్నాయి. పూర్వఖండం ఉత్తర ఖండమని రెండు భాగాలు కలవు. మొదటి ఖండంలో నూట ఇరువదియైదు, రెండవ ఖండంలో ఎనుబదిరెండు కలిసి, మొత్తం రెండు వందల యేడధ్యాయాలు కలవు.

పురాణాల ప్రశస్త్యం, శివకేశవుల అభేదం, భక్తి విశిష్టత, సదాచారం, పురాణ ప్రవక్తల గురుత్వం, కలియుగంలో చేయరాని కర్మలు, వివాహానికి పనికిరాని స్త్రీల లక్షణాలు, సత్యహరిశ్చంద్ర చరిత్ర. శ్రీకృష్ణమాహాత్మ్యము బ్రహ్మాండోత్పత్తి వర్ణన, సుభాషితాలు మొ॥ లైన అంశాలు ఇందులో చాలా విపులంగా వర్ణింపబడియున్నవి.

## భక్తి విశిష్టత:-

శ్లో॥ "నదానైర్న తపోభిర్వా, యజ్ఞైర్వా బహుదక్షిణైః
భక్తిహీనై ర్మునిశ్రేష్ఠ, తుష్టతే భగవాన్ హరిః!!"

దానమైనా, తపమైనా, యజ్ఞమైనా సంపూర్ణ భక్తిభావంతో చేయువలెను. అహంకారముతో చేస్తే అది ఫలించదు. భగవంతుడు సంతుష్టుడు కాజాలడని భావము.

శ్లో॥ "లోకే నధన్యః సశుచిః స విద్వాన్, స ఏవయుక్తసచధర్మశీలః!
జ్ఞాతా సదాదాతాసచ సత్యోవక్తా, యస్యాస్తి భక్తిఃపురుషోత్తమాఖ్యే!!"

ఎవనికైతే పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని యందు భక్తి భావం వుంటుందో అతడే లోకంలో ధన్యుడు; పవిత్రుడు, పండితుడు, వక్త, ధర్మతత్పరుడు, జ్ఞాని, దాత మరియు సత్యవంతుడని భావం. అంటే భగవంతుని పట్ల వినమ్రత ఒక్కటి వుంటే పై సుగుణాలన్నీ వాటంతట అవే అలవడుతాయని భావం.

అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీనగరం, అవంతికా, ద్వారవతి ఈ ఏడు నగరాలు మోక్ష దాయకాలని నారద పురాణంలో కీర్తింపబడ్డాయి.

ప్రజా రక్షణ, శత్రు సంహారం, న్యాయంతో కూడిన పన్ను విధానం మృదుభాషిత్వం, గోరక్షణ తత్పరత, ఆహారం, వస్త్రం గృహం అనే కనీస సౌకర్యాలు చేకూర్చడం, మద్యం సేవించేవారిని ఆ నగరం నుండి బహిష్కరించడం మొ॥ రాజధర్మాలుగా నారద పురాణం ప్రబోధిస్తుంది.

## దశహరా (దశరా):-

పాపం పది విధాలు

1. దౌర్జన్యంతో పర వస్తువులనపహరించడం. 2. పరుల హింసించండం 3. పరస్త్రీలను చెరపట్టి అనుభవించడం 4. అసత్యం పలకడం 5. కొండెములు చెప్పడం 6. అసంబద్ధవ్య వర్థ ప్రలాపం 7. పరవస్తువుల కాజేయాలనే కోరిక 8. ఇతరులకు చెడుజరగాలని కోరుకోవడం 9. ప్రయోజనం లేని విషయాలతో పట్టుదల పెంచుకోవడం దశవిధ పాపాలు.

పైపాపాలు నశించాలంటే జ్యేష్ఠ శుద్ధ దశమి నాడు భక్తితో భగవంతుని సేవించాలి. అందుకే దశహరా అని పేరు వచ్చింది. హర్యానా మొ॥ ప్రాంతాలలో జ్యేష్ఠ శుద్ధ పంచమి నాడు దశరా పండుగ ఆచరిస్తారు. మనం ఆశ్వీయుజ శుద్ధ దశమి నాడు దశరా పండుగ చేసుకొనుచున్నాము.

## సుభాషితాలు :-

రత్నాలవంటి సుభాషితాలను నారద పురాణం ప్రబోధిస్తుంది.

1. అకించనుడు (నిస్సందేహి) సదాసుఖంగా ఉంటాడు. నిత్యశంకితుడు సదా కష్టాలపాలవుతుంటాడు.

2. యౌవనం, పుష్కలమైన ధనము, అధికారం, అవివేకమనే నాల్గింటిలోనే, ఏ ఒక్కటున్నా అనర్థమే కలుగుచుండును. ఒకే వ్యక్తిలో ఈ నాల్గున్నూ జతగూడి యుంటే ఇక చెప్పేదేముంది. ఈ భావాన్ని తెలియజేసే శ్లోకమిట్లుంది.

శ్లో॥ "యౌవనం ధనసంపత్తిః ప్రభుత్వమవివేకితా!

ఏకైక మప్యనార్థాయు, కిము యత్ర చతుష్టయమ్!!

శ్లో॥ అపకీర్తి సమో మృత్యుర్లోకేష్వన్యోనవిద్యతే!

అపకీర్తిని మించిన మృత్యువు వేరొకటుండదు.

శ్లో॥ యత్రసన్తః ప్రవర్తనే, తత్రదుఃఖంనబాధతే!

వర్తతే యత్ర మార్తాండం, కథంతత్ర తమో భవేత్!!"

సత్పురుషులు (సాధువులు) నివసించే చోట కష్టాలుండవు.

సూర్యుడున్న చోట చీకటి ఉండదు గదా!

శ్లో॥ దాస భావంచ శత్రూణాం, వారస్త్రీణాంచ సౌహృదమ్!

సాధుభావం చ సర్పాణాం, శ్రేయస్కామో నవిశ్వసేత్!!

శత్రువుల వినయ ప్రదర్శన, వేశ్యల సహృదయుత, సర్పం సాధుభావం వీటినెప్పుడు నమ్మరాదు. ఇవెప్పటికైనా నష్టం చేయక విడిచి పెట్టవు.

శ్లో॥ "దుర్జనేష్వపి సత్త్వేషు, దయాంకుర్వన్తి సాధవః!
నహింసహరతే జ్యోత్స్నాం చంద్రశ్చండాల వేశ్మనః!!"

సత్పురుషులు నీచులపట్ల కూడా దయా దృష్టి కలిగియుంటారు. చంద్రుడు చండాలుని (హరిజనుని) ఇంటి ముందు వెన్నెల కాయకుండ తన కిరణాలను ఉపసంహరించు కొనడు కదా!

శ్లో॥ "సర్వలోక హితాసక్తాః సాధవః పరికీర్తితా!!"

సర్వజనుల హితం కోరే వారే సాధువులనబడతారు.

శ్లో॥ "సతాం సాప్తపదీ మైత్రీ, సత్సతాంత్రి పదీ తథా!
సత్సతామపి యేసన్త, స్తేషాం మైత్రీ పదే పదే!!"

ఏడుగురు కలిసి నడిస్తే, ఉత్తములు మిత్రులవుతారు. మూడడుగులు కలిసి నడిస్తే ఉత్తమోత్తములతో మైత్రి కలుగుతుంది. అంతకంటే ఉత్తములతో అడగడుగునా ఏర్పడే అనుబంధమే మైత్రీ భావమనబడుతుంది.

శ్లో॥ సుజనో నయాతి వైరం, పరహితబుద్ధిర్వినాశకాలేపి!
చేదేపి చందనతరుః సురభియతి ముఖం కుఠారస్య!!

సర్వదా పరులకు శ్రేయస్సు కాంక్షించు వాడే ఉత్తముడన బడును. తనకు ప్రాణాపాయస్థితి వచ్చినా సరే తన స్వభావం(పరోపకారబుద్ధి) మార్చబోడు. శత్రువుకు సహితం హితాన్నే కాంక్షిస్తూ ప్రాణాలు వదులుతారు. దీనికి చక్కని దృష్టాంతమిలా చెప్పవచ్చు. తనను నరికే గొడ్డలికి కూడా గంధపు చెట్టు సుగంధాన్నే పంచిస్తుందిగదా!

"అవస్యం దివసం కుర్యాత్, దానాధ్యయన కర్మసు!"

దానం, అధ్యయనం, ఎన్ని ఆటంకాలు వచ్చినా, చేయకుండా ఆపరాదు.

శ్లో॥ "యత్కీలైః పాంసుభిః శక్తిః వాల్మీకః క్రియతే మహాన్!
నతత్రబల సామర్థ్య, ముద్యోగస్తత్రకారణమ్!!"

"చీమలు చిన్న మట్టితో పెద్ద పెద్ద పుట్టలను కట్టుకొనుచున్నవి. చిన్న చీమల కంతశక్తి, సామర్థ్యాలు ఎలా వచ్చాయి. అంటే వాటిలో వానికి అసలు శక్తి సామర్థ్యాలు తక్కువే! కాని పుట్టను కట్టుకోవాలనే గట్టి ప్రయత్నమే పుష్కలంగా వాటికుంది. ఆ ప్రయత్నమే అంతటి అసాధ్యమైన పనిని చేయిస్తుంది. కనుక చీమలలో నున్న ప్రయత్నమన్న గుణాన్ని మనం అలవరచుకుంటే ఎంతటి అసాధ్యకార్యాలపైనా సాధింపవచ్చు." అని నారద పురాణం అనేక సుభాషితాల బోధిస్తుంది.

విద్య ఎలా ఉంటుంది? ఎలా వశమవుతుందనే దానికి జవాబు గురుశుశ్రూషతో గురుదయతో విద్యార్జన చేయవచ్చును. విద్య గురుకరుణారసంతో మనలోకి ప్రవహిస్తుంటుంది. దీనికుదాహరణమిట్లు చెప్పుకొనవచ్చును. అదేమనగా బావిత్రవ్వేవాడు తనపని చేస్తూనే ఉంటాడు. అతనిమీద మట్టి కూడ పడుతుంటుంది. చేతులు బొబ్బలెక్కుతాయి. నీరసం కల్గుతుంది. నిలువలేని స్థితి వస్తుంది. అన్నింటికీ సహించి తట్టుకుంటాడు. నీరువచ్చేవరకు త్రవ్వుతుంటాడు. తప్పకుండా నీరు ఎప్పటికైనా వచ్చి తీరుతుంది. ఇలాగ గురుశుశ్రూషచేస్తే చక్కని విద్య మనకు సంప్రాప్తిస్తుంది.

శ్లో॥ "యథాఖనన్ ఖనిత్రేన, భూతలంవారివిన్దతి!
తథాగురు గతాంవిద్యాం, శుశ్రూషరపిగచ్ఛతి!!"

విద్యా సంపాదనలో ఉత్తమ మార్గం గురు శుశ్రుషతో సద్గురుని సంతృప్తి పరచిన కొలది విద్య వస్తుంటుంది. కొన్ని పర్యాయాలు గురువు చేత చీవాట్లు, దండన కూడా సంభవిస్తుంటాయి. అన్నింటిని తన మేలుకే అని భరించాలి. నిరంతరం శుశ్రూషతో గురువుగారి అనుగ్రహం సంపాదించాలి.

ఇలాంటి సుభాషితాలెన్నో నారద పురాణంలో రత్నాలవలె ప్రకాశిస్తున్నాయి.

శ్లో॥ యఃశృణోతి నరోభక్త్యా, శ్రావయే ద్వాసమాహితః!
సయాతి బ్రాహ్మణోధామః నాత్ర కార్యవిచారణా!!
భక్తి శ్రద్ధలతో నారద పురాణాన్ని చదివేవారు, వినేవారు బ్రహ్మసాయుజ్యం తప్పక పొందగలరు.

మున్ను ఈ నారదపురాణ మగస్త్యునకు వ్యాసమహాముని చెప్పెనని, సూతుడు శౌనకాదులకు చెప్పనారంభించెను.

ద్రవిడదేశమును ద్రవిడాధీశుడను రాజా పరిపాలించు చుండెను. అతనికి చిరకాలముగా సంతానములేని బాధ యెక్కువై బాధింపసాగెను, సంతానములలేని బాధ యెక్కువై బాధింపసాగెను, సంతానములేని జన్మ సార్థకతలేదు. సంతానము – వంశమును కొనలు సాగునట్లు చేయును. సంతానమువలన నుత్తరలోకగతులు గల్గును. సంతానహీనులు పున్నామ నరకమును పొందురు. అందుచే సంతానము గల్గవలయునని దీక్షబూని, యారాజా చాలా ప్రయత్నములు చేసెను గాని, ఏయొక్కటియున్నా ఫలించలేదు. చివరికాతడు మంత్రబలమే మహాబలము. దానితో సాధించలేనిది లేదు. దీనికి తగిన ఉపాయం మంత్ర శాస్త్రములో నుండును. కావున నేను గురువును విడవకుండా ఆశ్రయించి నాకోర్కె దీర్చుకొందునని నిశ్చయించి, గురువగు రాజవర్మను తనవద్దకు పిలిపించి, యుచితాసన మిచ్చి, కూర్చుండజేసి "గురువర్యా! నేను సంతానములేని చింతతో బాధపడుచున్నాను. నాకు యీ బాధతీర్ప, మీకన్న సమర్థులెవడున్నారు? నాయందు దయయుంచి తగుమార్గము సూచించమని" ప్రార్థించినాడు.

ఆ మాటలు విని, రాజశర్మ తలనూపుచూ "మహారాజా! మంత్రశాస్త్రమునకు కాని కార్యములు లేవు. సమర్థులగువారిచే రుద్రగంధి మహాయాగము నడుపవలెను. అట్లు గావించినచో నీకు సంతానము గల్గునని నెను. తరువాత, యాగ విధానము వివరింపగా, విని వెంటనే దానికి సరిపడు సంభారములు తెప్పించి, యజ్ఞసన్నాహము గావించెను. మంత్రవిదులగువారిని రప్పించి, రాజశర్మ చెప్పినట్లు చేయించగా ఆ హోమగుండము నుండి యొక్క యెద్దు వచ్చెను. దానికి వారాశ్చర్యపడి యా యెద్దును బాణముతో గొట్టిరి. అది యా కుండములోనే బడి చనిపోయెను. ఆ గుండము నుండి యొక దివ్య పురుషుడు వచ్చెను. వారాశ్చర్యపడి చూచుచుండ, నింతలో నారద ముని యచటకు వచ్చెను. ఇదేమి యెద్దు పడినదని వారా మునీంద్రు నడుగగా, ఇప్పుడు యొక పురుషుడు కూడా వచ్చినాడా గాదా! మరల హోమము చేయుడని నారదుడు వారిని ప్రోత్సహించెను.

వారట్లు చేయగా నాహోమకుండము నుండి మరల యెద్దు, దివ్యపురుషుడు యిద్దరునూ వచ్చిరి. అది చూచి నారద మునీంద్రుడు రాజును బిలచి 'ఓరాజా! నీవు వెంటనే యష్టావక్ర మహామునీంద్రుని పిలువనంపుము. ఆయన సమస్తము చక్కబెట్టగలవాడ'నెను. వారు నానా విధముల శ్రమపడి యష్టావక్రమహాముని నాశ్రయించి యాగమునకు గొనివచ్చిరి. వారికి జరిగిన దంతయు వివరించిరి. అదివిని యా మహాముని, "యెద్దు రక్తంతో తృప్తి పొందునది యెవరో యెరుగుదురా! వారు తురుష్కులగుదురు. జరిగినది యేదియో జరిగినది. మరల మీరు హోమము గావించు" రనెను. అదిచూచి అష్టావక్రుడు దంత వక్ర మహామునిని రప్పింపుడు. ఆయన దీనిని సరిదిద్దగలడని సలహాచెప్పెను. ఆ ముని మాటలు ననుసరించి దంతవక్రమహామునిని గొనిరా బయలుదేరిరి. దంతవక్రుడు

వచ్చినాడు. దివ్య దృష్టితో చూచినాడు. జరిగినదంతయు గ్రహించినాడు. ఈ యాగము నెవరు చేయమన్నారని యడిగినాడు. రాజశర్మ ముందునకు వచ్చి "మారాజా సంతానార్థియై యొక యుపాయము నాలోచించుమని కోరగా నేను యోచించు సమయమునందు శ్రీహరి నాస్వప్నమున వచ్చి రుద్రగ్రంథియాగము చేయింపుమని ప్రోత్సహించెను. నేను స్వప్నములో యాగవిషయంవు విని యిపుడు దీనిని చేయించినా'నని వివరించెను.నాల్గుసారులు నలుగురు పురుషులుద్భ వించినారు గదా! ఆ నలుగురు తురుష్కులు. వేదధర్మములేయుగమున కేవి నిర్ణయింపబడినవో వాటి ప్రకారము నడుపుటయే మనవిధి. అట్లు తెలియక నడుపుటచే ఈ వైపరీత్యములు పుట్టుచుండును. ఆ నలుగురు పురుషులు ఒకానొక విషలతకు మూలపురుషులు. ఎద్దును చంపిన బాణమునకు శుద్ధికావించవలయును. కంచు కలశముతో జలము తెచ్చి యందు పచ్చకర్పూరపు పొడిని జేర్చి యా యుదకమును దానిపై చల్ల యాబాణము నిమిషములో మాయమగును. మిగిలిన విషయములన్నియు బ్రహ్మమాత్రమే యెరుగును. నారదమహాముని నాయనకడకు పంపినచో సమస్తము చక్కబడగలదని దంతవక్త్రమహాముని సెలవిచ్చెను.

ఆయన చెప్పిన ప్రకారమంతయు గావింపబడెను. నారదుని పట్టుదలతో బ్రహ్మదేవుడు బయలుదేరి వచ్చెను. అతడు వచ్చి యది యంతయు చూచి "పూర్ణాహుతి గావించుడు. పైన యోచించ వచ్చు" నని సలహా చెప్పెను. వారట్లు చేయగా బంగారముతో వృషభమును చేయించి సత్ శీలుడగు వృషభములను చంపిన పాపము పోవునని చెప్పెను. ధనస్సు పరిమళమగు జలమును చల్లగా బాణము మాయమయ్యెను. వృషభమును సువర్ణముతో చేయించి దానమిప్పించెను. ధనుస్సునకు చల్లిననీరు కల్లుగా

లెక్కబడుటచే ధనురాధి దేవత నారదుని శపించెను. తరువాత బ్రహ్మనిజలోకమునకకు బోయెను రాజా మిగిలిపోయెను. రాజశర్మవిచారించి మునీంద్రులను చూచి "మహాత్ములారా! మారాజా సంతాన విషయమేమనగా వారు రాజశర్మతో మీ రాజా గురుపత్నీ మోహంచెందిన కారణాన సంతాన హీనుడయ్యెను. కావున మీరాజుచే గంధాధి యాగము గావంపజేయుము. అతడు సంతానవంతుడు గాగలడని సెలవిచ్చిరి. ఆ మాటలు విని రాజశర్మ తన రాజును సమీపించి 'రాజా! గురుపత్నీ మోహము చెందిన కారణముగా నీకు సంతానం గలగలేదని మహాముసులన్నారు. ఇది నిజమా! అసలేమి జరిగినదని ప్రశ్నించెను.

రాజాశ్చర్యపడి "గురువర్యా! చాలాకాలము పూర్వము నేను తీర్థయాత్రార్థమన్ని చోట్లకు తిరిగి తిరిగి గౌతమీ తీరమునకు వచ్చితిని, అచ్చట నత్రిమహాముని నాశ్రయించి మంత్రోపదేశము పొందినాను. ఆయన భార్యను చూచి మోహపడినమాట వాస్తవమే' నన్నాడు.

ఆ మాటలు విని రాజశర్మ సంభారములు సమకూర్చుకొని గంధాధి యాగమున కుపక్రమించెను. ఎంతో మంది బంధువులు, సామంతులు, సమస్త ప్రజలు. సర్వదిగీశవాసు లాయాగము చూడ వచ్చిరి. రాజా యథా విధిగా వినాయకు నర్చించి మనస్సు నిర్మల స్థితిలో నంచుకొని శ్రద్ధాభక్తులతో నాయాగము చేసెను. దేవత లందరు తమ తమ హవిర్భాగము లందుకొని రాజాను దీవించిరి. రాజాపరమానంద మంది యజ్ఞ హవిస్సును తన భార్యకిచ్చెను.

యజ్ఞము చేయించిన వారికి, హోతలకు, బ్రహ్మకు, ఋత్విక్కులకు – మహాగౌరవ విధానముగా బహుమతులిచ్చి సన్మానించెను. వారందరానంద మందిరి. బంధుజనము, యజ్ఞమునకు వచ్చిన వారూ తమతమ ఇండ్లకు మరలిపోయిరి. యజ్ఞ సంబంధ బలమున రాజపత్ని గర్భము ధరించెను.

కొన్నాళ్ళు కామె చక్కని కుమారుని ప్రసవించినది. వానికి శూరసేనుడను నామకరణము గావించిరి. వానికి వయస్సు రాగానే గటమహాముని కుమార్తెనిచ్చి వివాహము జరిపిరి. చాలాకాలము సంతానము లేకపోయినది. వారు దుర్గారాధనము గావించిరి. ఆ దుర్గాదేవి దయవలన వారికొక కుమారుడు గల్గెను వానికి సురదుడను పేరుపెట్టిరి వానికి యౌవన దశ రాగా గాంధారరాజు కుమార్తెను వివాహమాడెను. వారు శివునారాధించ సాగిరి. శివప్రసాదముతో నా దంపతులు కుమారుని పొందిరి. వానికి జయద్రథుడను నామకరణము చేసిరి. పిదప శివు"డాకుమారుడు తండ్రికి విరోధియగు"నని చెప్పెను. సురథుడు జయద్రథునివలన నవమానమొంధి, తపమాచరించుటకు మార్కండేయ మహామునీంద్రాశ్రమమునకు బయలుదేరెను.

# అన్నదాన ప్రభావము

పిదప ఋషులు అన్నదాన మహిమను చెప్పమని కోరగా సూతుడు చెప్పసాగెను. పూర్వము నారాయణభట్టను బ్రాహ్మణుడు రత్నాకారమను గ్రామములో నివసించుచుండెను. అతడు మహానీయుడు, విద్యావంతుడు, మహాతపశ్శాలియను పేరుపొందెను. అతడు దానధర్మా! లెన్నియో చేసియున్నాడు. నిత్య మతిథు కన్నదానమిడునట్లు సత్రము స్థాపించినాడు. ఒకనాడతని భార్య "మీరుచేయు యన్నదానమున మనకు ఫలమేమి?" యని యడిగెను. అతడు సమాధానము చెప్పలేదు. ఆమె యలిగి ఇది యంతయూ దండుగే నని యన్నదానములు జరుగకుండ చేసెను. దానితో నారాయణ భట్టు తనకు భార్య నిత్యము తనకు పెట్టుచున్న నన్నములో తాను సగముంచుకొని మిగతా సగము నెవరికైన బెట్టుచుండెను.

ఇట్లు తనకిచ్చుచుండు నాహారమున సగము నితరులకు పెట్టుచుండుటచే, నాతడు చిక్కి సగమగుచెండెను. అతని భార్య, తన భర్త కృశించుటకు విచారమంది యంతకన్న హెచ్చుగా నన్నము పెట్టసాగెను. అతడా అన్నమును మునుపటి వలనే సగభాగము తీసి యితరులకు పెట్టి. మిగిలినది తాను తిని మునపటి కంటె బుష్టిగా నుండసాగెను. ఇట్లుండ నొకనాడు భర్త స్థిమితముగా కూర్చున్న సమయములో భార్య "నేను యెన్నిమారులు మిమ్ముయన్నదాన ఫలితమడిగినను చెప్పకున్నారు. నేడు దానిని గురించి చెప్పక తప్పదని బలవంతము చేయసాగినది. నారాయణభట్లు విని "తొందరరపడకు నీకంత ముఖ్యముగా గావలయునన్నచో రేపు చెప్పెదను వెందువుగాని" యని, తన నిత్యకృత్యములు తీర్చుకొని యన్నదాన మహిమను శ్రీహరి ద్వారా తెలియగోరి తూర్పు ముఖము పట్టి పోసాగెను.

ఎండనబడి, పోయిపోయి, అలసట చెంది, యెదుట నున్న సంపెంగ చెట్టు నీడకు జేరుకొని కూర్చుండెను. ఇంతలో నావృక్షము నుండి "ఓ బ్రాహ్మణుడా! నీవు ఎవడవు? ఎక్కడకు పోయెదవు చెప్పు"మని మాటలు వినవచ్చినవి. అతడు తన దరిద్రమును చెప్పి, పై యన్నదాన మహిమ గురించి శ్రీహరి నడిగి తెలిసికొన వచ్చితిని యనగా విని యా వృక్షము నవ్వి శ్రీహరి నీకగుపించునా? నీవు కోరినది చెప్పునా? ఎందుకీ వెఱ్ఱి భ్రమ" యనెను. అదివిని ఆ బ్రాహ్మణుడు "శ్రీహరి దయామయుడు భక్తులు కోరిన దానిని తప్పక తీర్చును. నాకాయన యగుపించును. అన్నదాన మహిమను చెప్పగలడ"నెను. "ఆ మాటలు యడుగుము. నేను పూవులు కాయలు లేకుండా, ప్రజల కుపయోగించకుండా యీ జీవితము నడుపుటకు కారణము తెలిసికొను మని పలికెను. బ్రాహ్మణుడు సమ్మతించి, ఒక మహారణ్యములో బడిపోవుచుండెను. దారిలో ప్రొద్దు గ్రుంకినది

అంధకారబంధురముగా నుండి దారి తెలియుటలేదు. మనుష్యులు లేరు. ఆ దారిలో ఒకా నొక రాతిమీద గుల్మము వానిని " చూచి, వాని చరిత్ర విని నేనిట్టి రాతి మీద నాహారము లేకుండా బ్రతుకుటకు కారణమేమి? ఇదికూడా యడగి తెలిసికొని రమ్మన్నది.

మరునాడు బ్రాహ్మణుడు మరల ప్రయాణమయ్యెను. అతడు దారిబడిపోవుచుండ యెండబడెను. దాహమై, యెదుట సరోవరమున్న దానిని చూచి దాహము తీర్చుకొన బోవగా నందు రక్తము నిండియుండెను. అతడు దాహము తీరక నిట్టూర్చి యొక చెట్టు నీడను కూలబడెను. ఆ సమయములో కృష్ణశర్మయను నొక బ్రాహ్మణుడా దారినిపోవుచు మాట్లాడ శక్తిలేని నారాయణుని మొగముపై నీళ్ళుచల్లి, సేదదీర త్రాగుటకు జలమిచ్చి, యాతని విషయమడిగి తెలిసికొనెను. తరువాత కృష్ణశర్మ "ఓ మహానుభావా! నీవు శ్రీహరి దర్శనమునకు బోవుచున్నావు. నేను అందరికి సదుపాయముగా చెరువు త్రవ్వించగా నందు జలములేదు సరిగదా రక్తము నిండియున్నది. నీవా హరిని కలుసుకున్నప్పుడు దీని కారణమడిగి చెప్ప"మని ప్రార్థించెను.

కృష్ణశర్మ, నారాయణభట్టును భోజనము చేసి పోవుదువుగాని యింటికి రమ్మని పిలిచెను. శ్రీహరిని దర్శించువరకు భోజనము చేయనను నియమముతో నున్నాను. మీరు పొండని యాతని సాగనంపి, తనదారిని తాను శ్రీహరి దర్శనార్థము ప్రయాణమై పోవుచుండెను. అట్లు, తన్నుజేర పట్టుదలతో వచ్చు బ్రాహ్మణుని యందు దయగల్గిన శ్రీహరి యొక బ్రాహ్మణ రూపము ధరించి యాతని యెదుటకు వచ్చెను.

బ్రాహ్మణరూపము ధరించిన శ్రీహరి యీనారాయణ భట్టునుజూచి "అయ్యా! మీరెవరు? యెక్కడికి పోవుచున్నారని "ప్రశ్నించెను. అతడు నాపేరు నారాయణభట్టందురు. శ్రీహరిని దర్శించ బోవుచున్నాననెను.

'నీకాయన యగుపించునా? ఆయన దర్శనముతో నీకు పనియే' మనగా 'నేను శ్రీహరిని దర్శించి, నాలోనున్న యనుమానములు తీర్చుకో దలచినా' ననగా నాతడు విని విజ్ఞానవంతులకు గాని యగుపించని హరి నితరులు చూడజాలరు గదా? యనెను. "చివరకాహరి నీ కాయనతో నేమి పని యున్నదో నన్నడుగుము. సమాధాన మీయగలనేమో చూచెదనని శంఖ, చక్రా్యాయుధవములతో పీతాంబరమును ధరించి యెదుట నిలబడెను. శ్రీనివాసునకు సాష్టాంగపడి, యనేక విధముల ప్రార్థనలు చేసి, చేతులు జోడించి, నారాయణ భట్టు ఇట్లనెను.

"ఓ నారాయణా! నేను వచ్చుదారిలో సంపెంగ చెట్టు మిమ్ము దర్శించునప్పుడు తనకు పూవులు కాయలు లేకుండా యున్నాయని దానికి కారణమడుగుమన్నది యనెను. శ్రీహరి విని యా సంపెంగచెట్టు వ్రేళ్ళ యందు వెండి, బంగారము ఉన్నవి. అవి యెవరికైన ఇచ్చినచో చెట్టుపూతతో, కాయలతో నుండు"ననెను. "ఒక రాతిమీద నొక గుఱ్ఱము మేత లేక యట్లే నిలబడియున్నది. రాత్రింబవళ్ళుపవాసము చేయుచుండుటకు కారణమడిగి రమ్మన్న దని" చెప్పగా, శ్రీహరి విని "యా గుఱ్ఱము కాళ్ళ క్రింద రత్నములున్నవి. వానిని దానము చేసినచో నది సుఖముగా తిరుగును. మేతమేయు ననెను. "స్వామీ! ధనవంతుడైన బ్రాహ్మణుడు ప్రజోపకారార్థము చెఱువు త్రవ్వింపగానందు జలము లేకుండా రక్తము నిండియుంటుటకు కారణమడుగమన్నా"డనెను. దానికి సమాధానముగా చక్రధారి "ఓయీ! యా బ్రాహ్మణుని యింటిలో రజస్వలలైన కన్యలిద్దరున్నారు. అట్టి వారింట నుండగా యజ్ఞకార్యములు చేయరాదు. అది తెలియక నాతడు యజ్ఞకార్యములు సాగించుచున్నాడు. వారికి వివాహము జరిగిన తరువాత మరల చెరువునకు ప్రతిష్ఠచేసిన యార్తవము ఆగి ప్రశస్తమగు జలమగునని సమాధానముచెప్పెను. అది విని 'స్వామీ! నాకు గల సంశయము

తీర్చుకొనుటకై వచ్చితిని గదా! అన్నదానము వలన ఫలితము నాకు చెప్పగోరెదన'నెను. శ్రీహరి విని 'నీకు గన్పించిన కృష్ణశర్మ కోడలు గర్భిణియై యున్నది ఆమెకు మగ శిశువు గల్గును. శీర్షోదయ సమయముననే నీవు ప్రశ్నింపవలెను. బొడ్డుకోసిన చెప్పజాలదు. సమయంమించకుండా యడుగుమని చెప్పి శ్రీహరి మాయమయ్యెను. ఆ బ్రాహ్మణుడు మరలివచ్చుచు కృష్ణశర్మ మఱ్ఱిచెట్టు క్రింద నుండగా చూచి దగ్గరగా పోయెను. అతడి బ్రాహ్మణు నింటికి గొని పోయి భోజనము పెట్టి కూర్చున్నతరువాత నీ ప్రశ్నకు సమాధానముగా శ్రీహరి నీయింటనున్న కన్యలకు వివాహము గావించినచో యజాజలము శుద్ధోదకమగునని చెప్పినాడనెను. నారాయణభట్టు తగినవాడని యెంచి, యాకన్నెల నాతనికే యిచ్చి వివాహముచేసి, యెక్కువకాన్కలతో కుమార్తెల నల్లునితో పంపెను. కోడలి ప్రసవసమయమునకు కబురు పంపుమనెను. తరువాత యా తటాకమునకు పునఃప్రతిష్ఠ జేయగా జలము సర్వులకు పానయోగ్యముగా మారెను. తరువాత రాతిపై గుఱ్ఱమునకు నారాయణుని సమాధానము వినిపించెను. "నాకాలి క్రింద రత్నములు గొను"మని యీయగా గుఱ్ఱము బ్రాహ్మణుని వెంట బయలు దేరిపోయెను. దారిలో సంపెంగ చెట్టు కన్పించి నా మాట యేమని శ్రీహరి చెప్పెననెను. "నీ చెట్టువ్రేళ్ళలో వెండి, బంగారములున్నవి. అవి యెవరికైన దానముచేసిన పూవులు, కాయలతో నీవుందువని చెప్పినా"డన్నాడు. ఆ చెట్టు "నీవే యా వెండి బంగారములను గొను"మని బ్రాహ్మణునకీయగా, వెంటనే యా చెట్టుపూవులు కాయలతో నిండియుండెను. భార్య యెదురై నారాయణభట్టింటికి చేరగానాతని భర్త తెచ్చిన యాధనమున కానందమంది, సవతుల గౌరవించి తృప్తి పొందెను.

కొన్నాళ్ళకు నారాయణభట్టునకు మామగారు తన కోడలికి ప్రసవ సమయము వచ్చినదని రమ్మని కబురు చేసెను. అతడు వెళ్ళి ప్రసవించు

సమయములో శిశువుని జూచి యన్నదాన మహిమను గురించి నిన్నడుగుమని శ్రీహరి యాజ్ఞాపించినాడనగా, విని, యాయన చెప్పలేనిది నేను చెప్పగలనా? అయిననూ నారాయణాజ్ఞానుసారము నాకు తెలిసినది నేను చెప్పెదనని యిట్లారంభించెను. ప్రాణము నిల్పునది అన్నముగాన, యన్నదానము ప్రాణము నిల్పునని విని యున్నముగార. అన్నదానము ప్రాణదానముతో సమానమని మనెను. అన్నదానము నివారించువా రెట్టి ఫలితమందెదరని ప్రశ్నించగా – ఆ మాట విని శిశువుల యీ యూరికి దక్షిణముగా మేకలమందగలదు. అందులో నొక మేక యీన మోపైనది. నీవా శిశువును ప్రశ్నించిన సమాధానము వచ్చు"ననెను. అతడా మేకవద్దకు వెళ్ళి శిశువు యీవల బడబోవు సమయములో నన్నదానము నివారించిన యేమి ఫలము వచ్చును? యని యడిగెను. ఆ మేకపిల్ల యిట్టని సమాధానము చెప్పెను. "నేను గతజన్మలో కోసలరాజా కుమారుడను. నాతండ్రి నిరంతరము దాన ధర్మములు చేయుచుండగా నేను వారించి ధాన్యపుకొట్లకు, కోశాగారమునకు తాళములు బిగించి యాపు జేసితిని నేను కాలవశమున మృతి జెందగా యమదూతలు నన్ను బంధించి యమునివద్ద నిలబెట్టిరి. అతడు నా విషయము విని యిట్లాజ్ఞాపించెను. వీడు దానధర్మలడ్డ పరచినాడు. కాన, వీనికి మేక జన్మములు పెక్కుసార్లు గల్గజేసి బలవంతపు మరణం కల్గునట్లు శాసించితి ననెను. తత్కారణముగానే నేను యీ జన్మపొందితి నని సమాధానము చెప్పెను.

ఇది విని నారాయణభట్టు యింటికి మరలిపోయి యన్న దానము ఆటంక పరచినవారు బలవన్మరణములంది. పెక్కు జన్మలెత్తుదురని చెప్పెను. అతడు భార్యలతో నిరంతర మన్న దానము చేయుచు సమస్తమగు సుఖశాంతి సంపదలతో తులతూగుచుండెను. చిరకాల మాతడన్న దాతయై జీవించి, తుదిని భార్యాత్రయముతో సహాశరీరము విడిచి పుణ్యలోక నివాసము

పొందెనని చెప్పి తరువాత కథ – శివధనుస్సు విషయమని యందించెను. అది విని శివధనుస్సు జనకునకెట్లు వచ్చినదీ చెప్పుమని మునులడగ నిట్లు చెప్పసాగెను.

## జనకుడు - శివధనుస్సు

మిథిలాధీశుడైన జనకుడు దిగ్విజయ యాత్రకు బయలుదేరి – అన్ని దిక్కులనూ గెలుస్తూ కైలాసప్రాంతమందలి రుద్రవనం చేరి అక్కడ విడిది చేశాడు. అదే రోజు పాతాళ లోకంనుంచి ఒక గొప్ప పామువచ్చి తనతలపై నున్న చంద్ర కాంత మణిని అక్కడ ఒక పర్వతశిఖరం మీద ఉంచింది. ఆ కాంతితో ఆ ప్రాంతమంతా దేదీప్యమానంగా వెలిగిపోసాగంది. పాము ఆ వెలుతురులో పరిసరాలలో తనకు తగిన ఆహారాన్ని స్వీకరించి పునఃమణిని తలదాలిచి మరల పాతాళానికి వెళ్ళిపోయింది.

అంతా గమనించిన జనకమహారాజా అత్యంతాశ్చర్య విస్మితుడై పోయాడు. ఎలాగైనాసరే, ఆ దివ్యమణిని తాను పొందాలని ఆశపడ్డాడు. వెంటనే మిత్రుడైన దేవేంద్రునకు కబురు చేశాడు. జనకుడి నుండి వర్తమానం అందగానే, అతనివద్దకు వచ్చాడింద్రుడు. జనకుడాతని సత్కరించి, ఉచితాసనమున కూర్చుండ బెట్టి, స్థిమితపడినాక – మణివేషితమైన ఫణివైనం గురించి కదిపాడు.

అంతావిన్న యింద్రుడు – తొందరపడవద్దని సలహాయిచ్చినాడు జనకుడికి, ఆ మణిని జగదీశ్వరుడై న శంకరుడు శేషునికి ప్రసాదించాడు. శేషుడు దానిని పాతాళలోకంలో నుంచాడు. బహుశః అతని సంతతివారెవరో ఆ మణిని యిక్కడకు తెచ్చి వుంటారు. పాముల్నో, శేషుణ్ణో మనం

జయించగలిగినా యీవార్త యీశ్వరుడికి తెలిస్తే మనలను మననివ్వడు. తానివ్వడమే కాదు. దానిని సంరక్షిస్తాడు కూడాను.

ఇంద్రుడు చెప్పింది విని, జనకుడు కూడా రవంత భయపడ్డాడు. కాని, ఆ మణిని పొందాలనే లుబ్దత్వంతో ఈశ్వరుణ్ణి జయించలే మంటావా? అని సందేహం వ్యక్తంచేశాడు. అబ్బుర పడ్డాడతడు. జనకా! శివుడి రౌద్రం సంగతి అటుంచు. అసలు ఆయన దగ్గర ఒక లోకోత్తరమైన ధనుస్సు వుంది. దానిముందు ఎంతవారైనా దిగదుడుపే" అని చెప్పాడు. ధనస్సు విషయం రాగానే – జనకుడు రవంత తేలికగా నూపిరి పీల్చుకున్నాడు ధనుర్యుద్ధమే అయితే దిగులు లేదు. ఎందుకంటే ఆ యుద్ధంలో శివుణ్ణియినాసరే ముమ్మారు గెలిచేలా విష్ణువు నాకిచ్చినవరముల వుంది అని చెప్పాడు జనకుడు మణిని అపహరించడానికే నిశ్చయించుకున్నాడు.

ఆ రాత్రి ఆ మణితో వచ్చే పాముకోసం వనాటువేశాడు భయంకరమైన ఖడ్గాన్ని ధరించాడు. రానే వచ్చింది పాము రాబోయే ప్రమాదాన్ని పసిగట్ట లేకపోయింది. మణిని శిఖరం మీద నుంచి మేతకు బయల్దేరింది. అదే అదనుగా జనకుడు వెళ్ళి మణిని హస్తగతం చేసుకున్నాడు. వెలుగు అదృశ్య కావడంతో జరిగినమోసాన్ని గుర్తించింది పాము. పగతో బుసలు కొడుతూ జనకుడి పైకి రాసాగింది మహావీరుడైన జనకుడు ఆ పామును రెండు తుండులుగా నరికేశాడు.

"హర హర మహాదేవా"! అని ఆర్తనాదం చేస్తూ అసువులు బాసింది ఆ మహాసర్పం.

మృత్యువేళ చేసిన ఆ మహార్తనాదం శంకరుడి చెవులకు సోకింది, భక్తవల్లభుడైన భోలాశంకరుడు తన ధనుస్సు నెక్కుపెట్టినారి సంధించాడు.

గొప్పదైన ధనుష్టంకారం చేశారు. ఆ ధనుష్టంకారమే రణభేరిగా - ప్రమథగణాలతో సహా కదలి జనకునిపై యుద్ధానికి దిగాడు. దేవ దేవాదులందరూ నింగిన నిలచి - భువికి దిగివచ్చి భూపతితో పోరాడుతున్న శివుణ్ణీ, ఆయనను లక్ష్యపెట్టకుండా పోరాడుతున్న జనకుణ్ణి వారి నడిమి ఘోరయుద్ధాన్నీ ఆశ్చర్యంగా చూడసాగారు.

నందీశ్వర, భృంగీశ, చండీశ్వర, వీరభద్ర, సుబ్రమ్మణ్యేశ్వరాదులతో కూడుకుని వున్న ఆ శివసైన్యాన్ని గెలవడం ఎవరితరం? శివుడు తన ధనుర్విద్యతో భూనభోంత రాళాలూ బాణాలతో నింపేస్తున్నాడు. అలా వూహించని జనకుడు - యింద్రుని మాటలు గుర్తుకు వచ్చి - రవంత తెలివితో - విష్ణుదత్తమైన వరబలంతో - శివధనుస్సును అపహరించాడు.

అవమానంగా భావించాడది అంబికాపతి. అన్నిలోకాలవారూ హాహాకారాలు చేశారు. శివధనురపహరణమా? అదేమైనా తేలికపనా; మండిపడ్డ మహేశుడు - లీలాయుద్ధాన్ని ఆపి - తన త్రిశూలాన్నెత్తాడు. ఆ రౌద్రమూర్తిని చూసిన జనకుడు చేతులెత్తేశాడు. ధనుస్సును శివపాదాల సమీపాన ఉంచేశాడు. "అపరాధిని మన్నించ" మన్నాడు. కాని రుద్రుడాతని మొరనాలకించలేదు. నిజ శూలధారతో జనకుని శిరస్సు ఖండించబోయాడు. కనిపెట్టి, సరిగా మధ్యలోకి వచ్చాడు విశాఖుడు. శివుడిని స్తుతించి శాంతింప చేశాడు.

"విష్ణు వరప్రభావమే గాని - యిది జనకుని శక్తికాదు. వైష్ణవమాయ యెంత బలవత్తరమైనదో మీరెగని దేమున్నది! అయినా ఆ ధనుస్సు గాంధార భూపాలుడిది. ఆయన నుండి గర్గుడికి, గర్గుడినుంచి మీకు సంక్రమించింది. ఇప్పటికే చాలా కాలమైంది, ధనుస్సు తీసుకున్నాడన్నా పేరేగాని జనకుడు దాని పూజించగలడే దప్ప మోయగలడా? ఉపయోగించగలడా? అందువల్ల తండ్రీ! నువ్వు శాంతించు. బావిలో - విష్ణువు రామావతారాన్ని ధరించి -

ఈ జనకుల యింటనే యీ ధనువును విరిసి వేస్తాడు" అని కుమారస్వామి చెప్పగా వైష్ణవ మాయను తెలుసుకొని – శివుడు యుద్ధం చాలించాడు. జనకునికి ప్రాణభిక్షతో పాటు, ఆ ధనువును కూడా బిచ్చవేసి – కైలాసానికి తరలివెళ్ళిపోయాడు ఆది భిక్షువు.

ఆనాటినంచి – ధనుస్సు జనకుల యింటనుండి, నిత్య విధ్యుక్త పూజాదికాలు అందుకుని – త్రేతాయుగంలో శ్రీరాముని చేతిలో వికీర్ణం కావించబడింది.

# సాక్షిగోపాలుడి కథ

అనంతరం అగస్త్యునిచే ప్రశ్నింపబడినవాడై వ్యాసుడు గోపాలాది గాథలను యిలా వివరించారు.

త్రేతాయుగంలో విష్ణువు శ్రీరామునిగా అవతరించాడు ఆయన ఆ అవతారంలో సీతాలక్ష్మణుతో కలసి చిత్ర కూటంమీద నివసించే రోజులలో ఒక యేకాంతవేళ సీతాదేవి రాముడిని – "స్వామీ! ఈ త్రేతాయుగానికి ఇలా రామావతారం దాల్చారు. మరి రాబోయే ద్వాపరంలో ఏ అవతారం దాల్చబోతున్నారో కూడా సెలవీయండి" అని కోరింది.

అందుకు శ్రీరాముడు జవాబు చెబుతూ – "ద్వాపరయుగంలో కంసాది రాక్షసుల సంహారార్థం మథురలో జన్మించి కారణాంతరాలవల్ల వ్రేపల్లెకు తరలించబడి, కాలాంతరాన కంసాది దానవులను సంహరిస్తాను అంతేకాదు, దానవాంశులందర్నీ సంహరింపజేయించి భూభారాన్ని హరిస్తాను. అప్పుడు నా పేరు శ్రీకృష్ణుడు, నీ పేరు రుక్మిణీ అన్నాడు.

ఏకాంతం కావడం వల్ల, భవిష్యద్రహస్యం మరింతగా తెలిసికోవాలనే వాంఛవల్లా సీతాదేవి – హేస్వామిన్ ! ఏకమాత్రపత్నీ శరవ్రతులు మీరు.

ఆయావిషయాల పట్ల విశ్వాసంకోసం – సాక్ష్య, లక్ష్య, ప్రత్యాక్షాలను కూడా అనుగ్రహిస్తూ వుంటారు. కాబట్టి, యీ మీ మాటకు సాక్షియెవరు? అని చతురువిసరగా – శ్రీరాముడు సర్వజ్ఞుడవడం చేత సీతాదేవి గళసీమలో అలరాతుతున్న ఒక మణి హారాన్ని సాక్ష్యం చేసి తన మెడలో దాల్చాడు.

అనంతరం సీత ఆ భావి యవతారరూపమును చూడ వలెనని కోరడంతో – విశ్వసౌందర్యమూలమూ, స్వయంసౌందర్యమూలమూ, స్వయం సౌందర్యము, సర్వజగన్మోహనశరమూ అయిన శ్యామసుందరవర యుక్తమైన గోపాలరూపాన్ని ఆమెకి చూపించాడు. జగన్మాతయైన సీత అంతటితో తృప్తిపడక – "భావికి సాక్ష్యాధారాలతో ఒకటిగా – మణిహారారంతో బాటే – మీ యీ రూపాన్ని కూడా యేదైనా తావున స్థిరబరచమని కోరింది సరే నన్నాడు సాకేతరాముడు.

సీతాకూడా నిదులోనికి ఒరిగిన పిదప గరుడుని పిలిచి నీలాద్రి ప్రాంతానికి చేరాడు. కలియుగంలో ధరించబోయేబుద్ధావతారాన అనీలాద్రిపై నేనివసించాల్సి వుంటుంది. గనుక అక్కడికి అయిదు క్రోసుల దూరంలో – సీకుచూపిద శ్యామవర్ణ గోపాలరూపాన్ని పొందుపరచాడు.

సీతకూ, భావితరాలవారికీ సాక్షీభూతంగా వెలయింపచేసినది అవడంవలన, దానినే "సాక్షీగోపాలుడు" అంటారు. శ్రీజగన్నాథానికి సమీపంలో వున్న అత్యంత మాహాత్మ్యం గల క్షేత్రమిది. జగన్నాథ యాత్రకు వెళ్ళే భక్తులందరూ తప్పనిసరిగా – యీ క్షేత్రాన్ని కూడా దర్శించి తీరుతారు.

## నీలచక్రమణి

అనంతరం అగస్త్యుడు – జగన్నాథక్షేత్రంలోని నీల చక్రమణిని గూర్చి ప్రశ్నించగా, వ్యాసులవారిలా చెప్పారు. నాయనా! ఇది మహాభక్తులకు తప్ప

యితరులకు నమ్మశక్యముకాని విషయము. ఎవరు యేమనుకొనినా గాని – జరిగిన యదార్థము మాత్రము నీకు చెబుతాను. సావధానుడవై ఆలకించు.

చాలాకాలం పూర్వం ఉత్కళ దేశాన్ని పరిపాలించ ఇంద్రద్యుమ్నుడనే రాజుకు శ్రీమహావిష్ణువు పేర బుద్ధరూపంలో ఆలయాన్ని నిర్మించాలని కోరిక కలిగింది. ఇంద్రద్యుమ్నుడి విషయంలో సందేహించాల్సిన పనియే మాత్రమూ లేదు. అతడు నిజముగానే విష్ణుభక్తుడు కాని రాచరికపులంపటాల తాలూకు వేదనాగ్రస్తతచేత – అంతరంగంలో నివృత్తి మార్గావలంభికావటమే – ఆ ఉద్దేశ్యమునకు కారణం.

బుద్ధరూప ంలో వుండే విష్ణువునకు ఆలయం ఏవిధంగా కట్టాలి? విగ్రహం యెలావుండాలి అనేది అతని వద్ద నున్న శిల్పులకూ, విద్వాంసులకూ – బోధపడలేదు. దానితో, రాజు చింతాక్రాంతుడై పోయాడు. అతగాడ్ని విష్ణుభక్తికి ఆశ్చర్యపోయిన దేవతలు – తమ అభినందన సూచకంగా – స్వప్నంలో విగ్రహరూపాన్ని చూపించారు. బ్రహ్మానంద భరితుడైన రాజు ఆ విధంగానే విగ్రహాన్ని చేయించాడు. మరి దేవాలయమో! కాగల కార్యం గంధర్వులే తీర్చిరన్నట్లు దేవీయమైన ఇంద్రద్యుమ్నుడి సంకల్పాన్ని దేవతలే నెరవేర్చదలచారు. దేవతల శిల్పి, ఆగమశాస్త్రనిగమూడూ అయిన విశ్వకర్మ దేవేంద్రుని ఆజ్ఞతో ఒకే రాత్రిలో ఆలయాన్ని నిర్మించి రాజుకు కబురు పంపాడు.

అమితానందాన్ని పొందిన యింద్రద్యుమ్నుడు ఆ ఆలయంలోనే బుద్ధరూపంలో నున్న విగ్రహాన్ని విష్ణు తుల్యంగా ప్రతిష్టించాడు.

వినాయకుడికి పెళ్ళికి అన్నీ విఘ్నాలే అన్నట్లు, అది కాస్తా సాటి రాజలోకానికి కన్ను కుట్టచేసింది. దానితో పరరాజులు ఆ ఆలయం చక్ర శూన్యమని అపవాదులు వేయసాగారు.

ఇంద్రద్యుమ్నుడు మరోసారి చింతావ్యాకులుడైనాడు. ఎందరో మహామహులను పిలిచి ఆ ఆలయానికో చక్రం వేయమన్నాడు, కాని ఆ ఆశ ఎవరివల్లా తీరలేదు. భవబంధమైన సంసార చక్రాన్నించి విడవడినదే సన్యాసం మళ్ళా దానికి చక్రం వేయగలవారెవరు? ఆనాటికెవరికి తోచలేదు. అటువంటిస్థితితో - విష్ణువాతని యందు కరుణగలవాడై స్వప్నంలో గోచరించాడు "రాజా! ఆలయ నిర్మాణపు నిర్మాణపు హడావుడులవలన - దానిని ఆశ్రయించుకొనిన దైవతాసర్పం పారికుద్ది ప్రాంత సముద్రతీరానికి వలసపోయి - అక్కడ అసువులు బాసింది దాని మణిని తెప్పించు" అని చెప్పాడు.

మరునాడే మహారాజా వేత్తలైన బ్రాహ్మణులను, అవసరులైన యితరులనూ వెంట నిడుకొని ఆ సాగరతీరం చేరాడు. మరణించిన పాము యొక్క కళేబరమూ, మణీ లభించాయేగాని - ఆ మణిని యెవ్వరూ మోయలేకపోయారు. అతిలోక భారమైన ఆ దివ్యమణిని - ఆలయం వద్దకుఎలా తరలించాలో తెలియక యింద్రద్యుమ్నుడు హరిధ్యానంలో మునిగిపోయాడు. అతని విశ్వాసానికి మెచ్చిన విష్ణువు వటురూపంలో వచ్చి - ఆ మణిని నాకు ఆసనంగా అలంకరించు - నేను దానిపై కూర్చుంటే అది నీ ఆలయందాకా యెగురుకుంటూ వస్తుంది అని చెప్పాడు. మహాభక్తుడైన రాజా నమ్మాడు. ఆ మణి మీద పట్టు పుట్టా పరిపించి ఆసనయోగ్యం చేయించాడు.

ఇంద్రద్యుమ్నుడు - యిదంతా యేదోపైశాచిక మాయగా తలిచాడు. దాంతో విష్ణు స్మరణచేస్తూ నేను నిన్నే నమ్మాను నా వాంఛా దీర్చు లేదా భక్తుడిని కోలుపో అని సంకల్పించి ప్రాయెూపవేశానికి ఉపక్రమించాడు. భక్తజన భాంధవుడుకదా భగవంతుడు! తక్షణమే అతని ముందు గోచరించాడు.

"మహారాజా! ఆ మణితో చక్రాన్ని నిర్మించడం మానవులకు సాధ్యమైన పనికాదు. నేనే స్వయంగా తయారు చేయించి నీచే ప్రతిష్ఠితమైన బుద్ధాలయానికి అన్వయింపచేస్తాను. ఇక నీవులే అని ఆనతి యిచ్చాడు. మరునాటి ఉదయం వరకూ గడువును ఇచ్చాడు.

స్వామీ ఆనతిచ్చినట్లే మరుసటి ఉదయానికల్లా సర్పఫణామణికి నిర్మితమైన చక్రమును చేదాల్చి తత్స్థాపనకు సిద్ధముగా విశ్వకర్మని పిలిచాడు.

అది చూచి మహానంద భరితుడైన ఇంద్రద్యుమ్నమహారాజు భేరీ మృదంగాది సర్వమంగళ వాయిద్యములనూ, వేద వాచకులైన బ్రాహ్మణులనూ సిద్ధపరిచాడు.

వేదోక్తవిధిని యీ భూలోకానికి అనువైన ఆగమాది శాస్త్రవిధివి, దైవనిర్మితమైన ఆ నీలమణి చక్రం ఆ ఆలయంలో వేయబడింది.

అందువల్లనే దానికింత ప్రసిద్ధి

ఈనాటికీ ఎనలేని తేజస్సుతో విరాజిల్లే - ఆ నీలమణి చక్రం అక్కడే వుంది. నమ్మి భక్తితో ఆరాధిస్తే - సత్ఫలితాన్ని - సద్యోఫలంగా పొందగలగడంలో ఏమీ సంశయము లేదు. అని చెబుతూ - వ్యాసభగవానులు - యీ నారదపురాణాన్ని ముగించారు. వినిన అగస్త్యులు సంతుష్టులయ్యారు.

"యద్భావం తద్భవతి"

**నారద పురాణం సమాప్తం**



# 7. మార్కండేయ పురాణం

మునులు సదా ధర్మ మార్గాన్నే ఎన్నుకొని ప్రవర్తిస్తుంటారు. ఆ ధర్మాలకు సంబంధించి వారికి కొన్ని సంశయాలు కలిగినవి. వాటికి సమాధానాల గూర్చి మహర్షులు మార్కండేయ మహర్షి నడిగారు. వారి సంశయ నివృత్తికై ఆ మహర్షి చేసిన ఉపదేశమే మార్కండేయ పురాణం.

"మార్కండేయం దక్షిణాం ఘ్రిః"

విష్ణుభగవానుని కుడిపాదంగా వర్ణింపబడింది ఈ పురాణం.

మార్కండేయ పురాణం హితదా ఖ్యాతంచసప్తమమ్

అనగా మహాపురాణాల్లో ఏడవది మార్కండేయ పురాణం ఇందులో నూటముప్పది నాలుగు అధ్యాయాలున్నవి. తొమ్మదివేల శ్లోకముల గల్గి యున్నది. ఇందలి కథలు.

1. బలరాముని తీర్థయాత్రలు 2. హరిశ్చంద్రోపాఖ్యానం, జీవోత్పత్తి విధము, నరకయాతనల వర్ణన, పతివ్రతల మాహాత్మ్యం కార్తవీర్యార్జునుడు దత్తాత్రేయ మహర్షి యొక్క అనుగ్రహాన్ని పొందుట, రాజధర్మాలు, వర్ణాశ్రయాల వర్ణన యోగశాస్త్ర సిద్ధాంతాలు.

ఓంకార స్వరూపం, బ్రహ్మాండోత్పత్తి, ప్రాకృత, వైకృత సృష్టి వర్ణవ, జంబూద్వీప వర్ణన, దేవీ మాహాత్మ్యము సూర్యవంశ వర్ణన, కరంధమ చరితం, అవీక్షత వృత్తాంతం, వపుష్మంతుని సంహారం, అవీక్షిత వృత్తాంతం, మొదలైనవిందు కలవు.

కలియుగంలో మానవుల కోరికలన్నింటిని తీర్చే దేవత దుర్గాదేవి లలితా సప్తశతి పారాయణతో ఉపాసకులీమెను ప్రత్యక్షం చేసికొంటారు.

ఆ సప్తశతి ఈ పురాణంలోనే సాక్షాత్కరిస్తుంది. ఈ కారణంగా మార్కండేయ పురాణం ఎంతో ప్రసిద్ధిని పొందగల్గింది. సంపదలతోనూ, ఆపదలలోనూ, దుర్గాసప్తశతిని పారాయణం చేస్తే ఆపదలు తొలగి శుభాలు చేకూరుతాయి! దేవీ నవరాత్రులలో ఈ పరాయణను విశేషంగా ఆచరిస్తారు.

పతివ్రతా శిరోమణియైన మదాలస వృత్తాంతం ఈ పురాణంలోనే ఉంది. ఈమె చరిత్ర ఎంతో ఆదర్శప్రాయం విక్రాంతుడు, సుబాహువు, శతమర్ధనుడు, వీరు ముగ్గురు మదాలస పుత్రులు. వీరు తమ తల్లి దగ్గరనే వేదాధ్యయనం చేసి వైరాగ్యం పొంది, ఉత్తమ శివభక్తులౌతారు. నాల్గవ కుమారుడు అలర్కుడు తల్లి ఉపదేశాలను నిర్లక్ష్యం చేస్తాడు. రాజ్య పరిపాలననే కీర్తి దాయకమని, ఇతని వాదన, అయితే చివర్లో కొన్ని విచిత్ర సంఘటనలు ఇతని జీవితంలో జరుగుతాయి. ఈ కారణంగా అతనిలో మానసిక పరిణామం కల్గుతుంది. తన తల్లి మదాలస ఉపదేశ మార్గాన్నే అలర్కుడు కూడా అనుసరిస్తాడు. ఇది సంగ్రహంగా మదాలస చరిత్ర.

## శ్రీ మహావిష్ణువునకు నాలుగు రూపాలున్నవి

1. వాసుదేవ రూపం :- ఇది అనిర్వచనీయమైంది. శ్వేత రూపంలో మహాయోగులకు మాత్రమే ప్రత్యక్షమౌతుంది.

2. శేషరూపము :- పాతాళంలో నివసిస్తూ, సమస్త భూమండలాన్ని ధరించే రూపమిది. ఈ రూపమే దశావతారాలకు సంబంధించినది.

3. ప్రద్యుమ్న రూపం :- ప్రజా రక్షణ ధర్మ సంస్థాపనార్థం అవతరించిన రూపమిది. ఈ రూపమే దశావతారాలకు సంబంధించినది.

4. అనిరుద్ధ రూపము :- వైకుంఠంలో శేషశాయి పై ఉండే రూపమిది.

# ధర్మ పక్షులు

పూర్వం మందపాలుడనే ముని ఉండేవాడు. ఇతడు కఠినమైన బ్రహ్మచర్య వ్రతం పాటించేవాడు. ఒకనాడు యోగాభ్యాసంతో తన దేహాన్ని విసర్జించాడు, కాని పుణ్యలోకం చేరలేదు. దీనికి కారణమేమని దేవతలను విచారించాడు. దానికి దేవతలు నీకు సంతానంలేకపోవడమే కారణం "అపుత్రస్య గతిర్నాస్తి" అన్న ఆర్యోక్తి వినలేదా? అని సమాధానమిచ్చారు. శీఘ్ర సంతానం పక్షులల్లోనే సాధ్యం! అందుకని జరిత అనే పక్షితో రమించాడు. జరత్కారి సారదృక్కు, అస్తంభమిత్రుడు, ద్రోణుడనే నల్గురిని సంతానంగాంచాడు. నాల్గవ కుమారుడైన ద్రోణుని భార్య తార్ధి. ఆమె మొదటి జన్మలో ఒక అప్సరస, పేరు వపువు. ఈమె కథ యిలాగుంది ఒకనాడు ఇంద్రుని సభలో అప్సరసల్లో నెవరు గొప్ప? అనే ప్రశ్న చర్చకు వచ్చింది. న్యాయ నిర్ణేత నారద మహర్షి. ఎవరైతే హావభావలతో అందచందాలతో దుర్వాస మహర్షిని ఆకర్షిస్తారో ఆమె గొప్పదని నారదుడు నియమము పెట్టాడు. తనకలాంటి శక్తి సామార్థ్యలున్నవన్నది వపువు. దుర్వాసుని ఆకర్షించుటకు, అతని తపోభూమికి బయలుదేరి వెళ్ళింది. తన నాట్యగానాదులచే ఆ మునిని మురిపించింది. తనలో కల్గిన మోహకారానికి దుర్వాసముని చాలా ఆశ్చర్యపడ్డాడు. వెంటనే అపరరుద్రుడై ఆగ్రహించాడు. ఆమె ప్రార్థించి శాప విమోచనం గూర్చి అడిగింది. సంతానవతి వయ్యాక బాణాహతి మరణించి. ఆ తర్వాత యింద్రలోకానికి రాగలవన్నాడు.

కందరుడు - మదనిక అనే పక్షి జంటకు సంతానంగా పుట్టిందీమె. పక్షి ద్రోణుని భార్య తార్ధి యీామెయే. గర్భవతిగా నున్నప్పుడే ఒకనాడీమె మహాభారత యుద్ధం జరుగున్నుడు ఆకాశంలో ఎగురుతున్నది. అప్పుడు అర్జునుడు ఒక గుర్రం మీదికి బాణప్రయోగం చేశాడు. ఆ బాణం గురితప్పి

సింగి పైనెగిరి తార్షికి తగిలింది. వెంటనే గర్భస్రావమైంది. నాల్గుగ్రుడ్లు బయటపడ్డాయి. శాపవిముక్తి కల్గి స్వర్గానికి వెళ్ళింది. శమీక మహాముని ఆ గ్రుడ్లను భద్రపరచి రక్షించాడు. వాటి నుండి పింగాక్షుడు, వారాటుడు, వృతుడు, సుముఖుడు అనే పక్షులు జన్మించాయి. శమీకుడు వీరిని పెంచి పోషించాడు.

ఈ పక్షులు ముందటి జన్మలో సుకృశుడనే మహావిద్వాంసుని కుమారులు. తండ్రి శాపకారణంగా పక్షి జన్మ వచ్చినా, మానవ బాష వచ్చేలాగు సకల శాస్త్రుల జ్ఞానం అనుగ్రహించాడు తండ్రి. కనుక వీటిని ధర్మపక్షులంటారు. మహాభారతంలోని సందేహాలన్నింటిని ఈ పక్షుల ద్వారా తీర్చుకొన్నాడు వ్యాస శిష్యుడైన జైమిని మహర్షి. ఈ కథ మార్కండేయ పురాణంలోనిది. కుమారులు మూడు రకాలని ఇట్లు చెప్తుంది.

1. యదుపాత్తం యశఃపిత్రా: ధనంవీర్యమథాపివా!
తన్న హాసయతే యస్తు, సన్నరో మధ్యమః స్మృతః!!

తండ్రి సంపాదించిన ధనకీర్తులను వంశగౌరవ పరాక్రమాదుల పోగొట్టుకొనకుండా నిలువుకోగలవాడు మధ్యతరగతికి చెందిన కుమారుడు.

2. తద్వీర్యావధికం యస్తు, పునరన్యత్ స్వశక్తితః!
నిష్పాదయతితం ప్రాజ్ఞవదన్తి నరముత్తమ్!!

తండ్రి సంపాదించిన కీర్తి ధనాదులనే కాక స్వశక్తితో మరింత ఆ సంపదల రెట్టింపు చేసికొనే వాడే ఉత్తముడైన కుమారుడందురు పండితులు.

3. యః:పిత్రా సముపాత్తాని, ధనవీర్య యశాంసివై!
న్యూనతాం నయతి ప్రాజ్ఞాస్తమాహు: పురుషాధమమ్!!

తండ్రి సంపాదించిన పై సంపదలన్నీ నానాటికీ నాశనం చేసేవాడు అధముడైన కుమారుడు అని విద్వాంసులంటున్నారు. మరో విశేషమైన విషయాన్ని క్రింది శ్లోకంలో చెపుతోందీపురాణం.

శ్లో॥ భక్తస్యన్మయః పిత్రా, లోకే విజ్ఞాయతే నరః!

యత్పుత్రాత్ ఖ్యాతి మభ్యేతి, తస్య జన్మ సుజన్మనః!!

తండ్రి పేరు చెప్పుకొని, ఆ కీర్తితో కాలక్షపం చేయాలనే కుమారుడు మిక్కిలి పనికిమాలిన వాడు. అట్టి వాని జన్మ వ్యర్థం. నేను ఫలానా వాని తండ్రిని అని ఏ తండ్రి సగర్వంగా చెప్పులోగలవాడో అట్టి వాని కుమారుడే నిజమైన కుమారుడని (సార్థకనామధేయుడు) పై శ్లోకం వివరిస్తోంది.

ఇట్లు సమాజంలోని పుత్రుల పాత్రలను వారి కర్తవ్యాలను వివరిస్తూ ఆణిముత్యాల వంటి ఎన్నో సూక్తులున్నాయి. మార్కండేయ పురాణంలో అట్లే మంచి మైత్రీ గుణాన్ని తెలియజేసే ఒక అద్భుత కథ యొకటి మార్కండేయ పురాణమందిట్లున్నది.

శత్రుజిత్తు మహారాజు కుమారుడు ఋతుధ్వజుడు. ప్రజ్ఞా పరాక్రమౌదార్యాల సుగుణ రాశియే గాక సౌందర్యపండితుడు. ఒకప్పుడు శాస్త్ర చర్చ, మరొకపుడు (శాస్త్ర) కావ్య పాఠం. ఇంకొకపుడు గంధర్వగాన కళా ప్రదర్శనం, క్రీడలు, శస్త్రాస్త్ర ప్రయోగాలు ఒకటేమిటీ అన్నింటిలో తానుండీ, పాల్గొనుచుండాల్సిందే. అశ్వతరులనే నాగ కుమారులిద్దరితనికి ఆప్తమిత్రులు. ఋతుధ్వజుడు వీరిద్దరిని వదలియుండలేనంత స్థితికి వచ్చాడు.

ఒక దినం అతని గుణగణాల గూర్చి తమ తండ్రితో వర్ణించి చెప్పారు నాగకుమారులు. అందుకు సంతసించిన నాగరాజు, అశ్వతరులు తమ మిత్రునికి కావలసిన ధన, కనక వస్తు వాహనాదుల కానుకగా తీసికొని వెళ్ళి యివ్వమని చెప్పాడు. అయితే కుమారులు అట్లాంటి వాటికి కొదువ

లేదు. మనమతనికి ఒక సహాయం చేయవచ్చు. కానీ అది మన వల్ల జరిగేపని కాదు. త్రిమూర్తులు మాత్రమే ఆ పని చేయగలరన్నారు. పుత్రులైన అశ్వతరులు తండ్రితో.

ప్రయత్నం చేస్తే అసాధ్యమంటూ ఏదీ జగత్తులో నుండదు. చిన్న చీమలు తమ ప్రయత్నంతో ఎంత దూరమైనా ప్రయాణించగలవు. గరుత్మంతుడు వేగంగా ఎగుర గల్గుటకు అతని ప్రయత్నమే కారణం. భూలోకంలో నివసించే ధ్రువ కుమారుడు తన ప్రయత్నంతో ఉన్నత స్థానం అధిష్టించాడు గదా! కనుక ప్రయత్నిస్తే మీరు మిత్రుని ఋణం తీర్చుకోగలరన్నాడు తండ్రి. తండ్రీ, ఋతుధ్వజుని కథ సవివరంగా చెబుతాను వినండి అని కుమారులకు చెప్పసాగాడిట్లు.

పూర్వం గాలవుడనే ముని తన ఆశ్రమంలో తపసు చేస్తుండేవాడు. పాతాళకేతు వనే రాక్షసుడు రోజూకొకవేషంతో ముని కడకు వచ్చి తపోభంగం కల్గించ ప్రయత్నింస్తుండేవాడు. ఆ రాక్షసున్ని సంహరిస్తే తన తపోబలం క్షీణిస్తుందనే కారణంతో ముని ఊరకుండేవాడు. ఒక దినమారాక్షసున్ని వధగూర్చి ఆలోచించే సమయంలో ఆకాశంనుండి ఒక గుఱ్రం వచ్చింది.

సూర్యుని వలే అవిశ్రాంతంగా ప్రయాణించగలదీ అశ్వ భూమ్యాకాశాల మధ్య గానీ, సముద్రంలోగానీ మరెక్కడైనా ఎంతోవేగంగా వెళ్ళగల సామర్థ్యం గలదీ గుఱ్రం. శత్రుజిత్తు మహారాజు గారి పుత్రుడైప ఋతుధ్వజుడు దీనినెక్కి నిన్ను పీడిస్తున్న రాక్షసుని సంహరించగలదని పలికింది ఆకాశవాణి. అదే విధంగా ముని అశ్వంతో ఋతుధ్వజుని కలిశాడు. రాక్షసుని సంగతి వాడు చేసే అటంకాలు తెల్పాడు. ఆ గుఱ్రం మీద ఆశ్రమానికి వెళ్ళాడు ఋతుధ్వజుడు. రాక్షసుడు వరాహరూపం ధరించి వచ్చాడు. ఋతుధ్వజుడు వాన్ని తరిమి కొట్టిడు. పాతాళానికి పరుగు

తీశాడు రాక్షసుడావరాహ రూపంలో రాజక్కడుకూ వెళ్ళాడు. అక్కడిద్దరు సుందరీమణులున్నారు. ఒకరు గంధర్వరాజైన విశ్వావసువు కుమార్తె, మరొకరు ఆమె చెలికత్తెయైన కుండల, పాతాళకేతుడు వారి నక్క డబంధించాడు. తమను బంధివిముక్తుల చేయుమని కోరింది కుండల. అలాచేసి ఆమె కోరిక ప్రకారమే రాజు మదాలసను పెళ్ళి చేసికొన్నాడు. దానికభ్యంతరం చేస్తూ పాతాళకేతువు అడ్డువచ్చాడు రాజుకు. రాజుతన్ని సంహరించాడు. భార్యతో కలిసి తన రాజధానీ నగరానికి వెళ్ళాడు.

ఇలా ఉండగా కొన్ని రోజుల తర్వాత పాతాళకేతుని సోదరుడైన తాళకేతువు కుట్రతో మదాలస మరణించింది. భార్య మరణంతో వైరాగ్యం వహించి ఋతుధ్వజుడు పిచ్చివాడయ్యాడు. అయితే ఈ కథ విన్న నాగకుమారులు, తండ్రితో మదాలసను బ్రతికించ గల్గితే అదే మనమా రాజకుమారునికి చేయగల సహాయమన్నారు.

వెంటనే అశ్వతరుడు సరస్వతీ దేవిని గూర్చి తపస్సు చేశాడు. ఆదేవి ప్రసన్నంతో సంగీత విద్యను వరంగా పొందాడు. ఆ సంగీత విద్యతో పరమ శివుని మెప్పించాడశ్వతరుడు - మదాలసను బ్రతికించమని పరమేశుని ప్రార్థించాడు. తథాస్తు న్నాడు పరమశివుడు. వెంటనే మదాలస బ్రతికింది. ఎంతో సంతోషంతో అశ్వతరుడామెను తోడ్కొనిపోయి ఋతుధ్వజుని కప్పచెప్పాడు. ఈ విధంగా నాగకుమారుల మైత్రి కారణంగా మదాలస మళ్ళీ దక్కింది రాజుకు. ఈ కథ యెంతో విపులంగా మార్కండేయ పురాణంలో చెప్పబడింది.

ఇక పతివ్రతా ధర్మాలు, భర్త చేసికొన్నపుణ్యంలో సగభాగం భార్యకు వస్తుందంటారు పెద్దలు. నిజమే కాని అదంత తేలికగా రాదని, చిత్తశుద్ధితో పతిసేవ చేస్తేనే వస్తుందని యిలా చెప్పబడింది. "పుణ్యస్యార్థాపహారిణిః"

పతిశుశ్రూషయైవహి. పరపురుషున్ని చూచినపుడు అతని తెలివి తేటలు అందం తన పతిలో లేవే అని ఏ భార్య తలంపు రానీయకూడదని మార్కండేయ పురాణం ఉపదేశిస్తున్నదిట్లు

శ్లో॥ శ్రుత్వాతత్పూజయేద్యస్తు పురాణం సప్తమం పునః!
సర్వపాపవినిర్ముక్తః పునాత్వేద నిజంకులం!!

ఇట్టి పవిత్రమైన మార్కండేయ పురాణాన్ని భక్తి శ్రద్ధలతో విన్నవానికి పఠించిన వారికి తమ సర్వపాపాలు నశించడమే కాక, వంశాభివృద్ధి కూడా కల్గుతుంది.

ఒకప్పుడు జైమిని మార్కండేయుని చూచి "శ్రీహరి యవతారములు దాల్చుట. ఒక భార్యకైదుగురు భర్తలుండుట, బలరాముడు తీర్థయాత్రలు చేయవలసి వచ్చుట, ఉపపాండవులు బలవన్మరణము పొందుట యివి నా కనుమాన హేతువులు. ఈ సందేహములు తీర్పగోరెద" ననెను అంత మార్కండేయుడు – "జైమినీ! నేనం జపాదంలు జరుపుకోవలయును. వింధ్యాద్రియందు నాల్గు ధర్మపక్షులున్నవి. అవి నీ సందేహములు తీర్చు నని చెప్పెను. జైమిని అదివిని"పక్షులు మాట్లాడగలవా? మనభాషవాటికి వచ్చునా? అవియంత ధర్మపరిజ్ఞానమెట్లు సంపాదించిన?" వని యడుగ ఆ పక్షులు వేదవేదాంగము లెరిగి ధర్మములు తెలిసినవి.

పూర్వమొకసారి నారదమహాముని దేవేంద్రుని చూడబోగా, యింద్రుడు అతనిని గౌరవించి కూర్చుండబెట్టి, రంభ, మేనక, యూర్వశి, తిలోత్తమ, ఘృతాచి, మిశ్రకేశి యనబడు పెక్కుమంది యూటకత్తెలను చూపి, "తమకునచ్చిన సొగసయినదానిని నాట్యం చేయుమని ఆజ్ఞాపింపు" డని చెప్పగా నారదుడు వారిని చూచి, "దూర్వాస మహామునిని మోహింప చేయువారెవరో వారే నేను మెచ్చుడి వారగుదురనెను. అది విని వపువను దేవవేశ్య

దుర్వాసుని లోబరుచుకొనగల దానను నేనేనని" ముందనకు వచ్చి ఆ ముని ఆశ్రమ ప్రాంతముజేరి గానము చేయసాగెను.

# అప్సరస - దాని సంతానము

దూర్వాస మహాముని దాని గానారావాన్ని విని వచ్చి "నీవు తపోవిఘ్నము చేయదలచి వచ్చినావు, కావున గ్రద్దవై జన్మింపు మని శపించెను ఆమె భయపడి, శాపవిమోచనము తెలుపుమని కోరగా పదునారు యేండ్లు గ్రద్దవై యుండి సంతాన చతుష్టయమంది, యొక యలుగు దెబ్బకు శరీరము విడిచి స్వర్గావాస మందగలవని విమోచనము చెప్పెను. ఆ వసువు గ్రద్దగా పుట్టింది. ద్రోణుడను పక్షిని వివాహమై పదారేండ్ల కాపురము గావించి బాణపాతముతో తాను పడిపోవుచు నాలుగు గ్రుడ్లను నేలకు జార్చెను. వపువు నిజరూపము రపొంది దేవకాంత యయ్యెను. పడిపోయిన నాలుగు గ్రుడ్లమీద యేనుగు వెడగంట పడగా యవి పొదగబడెను. కిచకిచలాడుతూన్న వాటినిగని, శమీకమహాముని తన యాశ్రమమునకు గొనిపోయి పెంచుచుండగా నవి మనుష్య సంభాణము లాడుచుండుట విని ముని యచ్చెరువంది మీరెవరు? యీ మనుష్యభాషణము మీకెట్లు వచ్చిన" దని యడుగగా "మేము సుకృతుని కుమారులము. ఇంద్రుడొకనాడు పక్షియైవచ్చి నరమాంసభోజనము గోరెను. మాతండ్రి మమ్మాతని కాహారముగా నుండుడని యాజ్ఞాపింప తిరస్కరించితిమి. మా తండ్రి కోపగించి మమ్ము పక్షులుగమ్మని శపించెను. "యేనాడూ జైమినీ మహాముని యడిగిన ప్రశ్నలకు మీరు ధర్మయుక్తముగా సమాధానము చెప్పుదురో, ఆనాడు మీరు శాపమునుండి విముక్తులగుదురని శాపవిమోచనము తెలిపెను అని చెప్పినవి. శమీకముని ఆ పక్షులను వెంటనే వింధ్య పర్వతములకు బొమ్మని పంపివేసెను. అని మార్కండేయుడు చెప్పగా విని జైమిని

మహాముని, వింధ్యపర్వతమున బోయి ఆ ధర్మపక్షులను చూచెను. అవి వేదములను సస్వరముతో గానము చేయుట చూచి ఆశ్చర్యపడెను. పిదప తనలో కలిగిన సందియముచే ప్రశ్నలను ధర్మపక్షుల నడుగగా, అవి యిట్లు పలుకసాగినవి.

పక్షులు:- జైమినీ! శ్రీహరి భూభారము తగ్గించుటకు ధర్మము నిల్పుటకు మనుజరూపము ధరించుచుండును. 2. ఇంద్రుడు త్రిశిరుని వధించగా బ్రహ్మహత్యా దోషము చెంద తన యమునకు, వాయువునకు, నశ్వినీ దేవతలకునూ పంచగా ధర్మజ, భీమ, నకుల సహదేవులును - యింద్ర తేజమున నర్జునుడును పుట్టిరి, ఇట్లుయిదుగురుగా పుట్టిన ఇంద్ర తేజమును దలచి యైదుగురూ తన భర్తరూపులేననీ, తానే వారి భార్యగా దలచి శచీదేవి యగ్నికుండమున ద్రౌపదిగా జన్మించెను. 3. శ్రీకృష్ణుడు పక్షపాతముతో పాండవులను వెనుక వైచుకొని వచ్చుచున్నాడనియు, తన శిష్యుడైన కౌరవేశ్వరునకు ధర్మంగా సాయము చేయుట లేదనియు కినిసి బలరాముడు విరాగియై తీర్థయాత్రలకు పోయెను. 4. మున్ను విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని బాధించు సమయములో విశ్వేదేవతలు విశ్వామిత్రుని చంపదలచి యుండగా, నది గ్రహించి, విశ్వామిత్రుడు వారిని భూలోకములో జన్మించుడని శాపమిచ్చెను. వారు మన్నించుమని వేడుకొనగా - శాంతించి ద్రౌపదీ గర్భములో పుట్టి, యశ్వత్థామచే బలాత్కార మరణమంది మరల స్వర్గమునకు జేరదని శాపవిమోచన మిచ్చుటచే, వారు దిక్కులేని చావు పొందిరని ధర్మపక్షులు సమాధానమిచ్చెను.

తరువాత జైమినిముని "పాపములెవ్వి? వాటికనుభవించదగిన శిక్షలెట్లుండును? నాకు చెప్పుడని" వేడగా, ధర్మపక్షులు మిథిలానగరములో జనకుని వంశములో విపశ్చితుడను రాజు జన్మించగా అతడు కొన్నాళ్ళకు

మరణించెను. వానికి నరక శిక్షవేయగా నా నేరములు చెప్పుడు, నాకెందులకీ శిక్ష విధించితి రని ప్రశ్నించెను. "రాజా! నీవు ధర్మపాలనము చేసినను, ప్రజలను కన్న బిడ్డలవలె చూచిననను, పరస్త్రీ ధనాదులందపేక్ష బూనకున్నను నీ దోషములు వినుము. "నీకిద్దరు భార్యలుండగా వారు ఋతుస్నాతులై యున్న సమయమున నొకదానిని పొంది రెండవ దానియందు విముఖత్వము చూపలేదా? యని యడిగి యది పాపమగుటచే నరకము చూచితవి. ఇంక స్వర్గమునకు బోవచ్చునని గొనిపోయిరి. పేదల నాదరించుట, దిక్కులేని వారిని చేరదీయుట, మహాపుణ్య కార్యములు, యజ్ఞ దాన తపము లాచరించుట యివి యన్నియు చేసిన వారికి స్వర్గ భోగములు కల్గును. చిన్న చిన్న పాపములకు భూలోకమందే శరీరపీడా రూపమున ఆ దోషములు నివారణ మగును. అందుచే మానవుడు సత్కార్యములు గావించి యుత్తమలోకము లందుటకు తగినవాడుగా నుండ ప్రయత్నింపవలెనని చెప్పాయి. తరువాత జైమిని పతివ్రతా మహిమను వర్ణించుమని కోరెను.

## పాతివ్రత్య మహిమ

పూర్వం కౌశికుడను బ్రాహ్మణుడు ప్రతిష్ఠానపురము నందు నివసించుచుండెను. అతడు కుష్ఠురోగియై బాధపడు చుండెను. అతని భార్య మహాపతివ్రత. తన భర్త కుష్టురోగియైనను, సదా సేవించుచు అనురాగము వదలకుండా భక్తితో మెలగుచుండెను. రోగియగువాడు నిరంతరము సాధింపులు వేధింపులతో విసుగు కల్పించుట సహజమే గదా! అలాంటి బాధలన్నింటినీ సహించుచు నా యిల్లాలు సంచరించుచుండు కాలమునందు ఆ రోగిష్ఠి బ్రాహ్మణు డొకవేశ్య ను జూచి మోహపడి తవకామెతో పొందుగూర్చుమని భార్యను గోరెను. అట్లు సేయకున్న

మరణింతునని బెదరించెను. ఆమె యుదారస్వభావము గలది మగుటచే ముందుగా నా వేశ్య యింటికి పోయి, యామె నాశ్రయించి, తన భర్తకోర్కెను తీర్చుమనెను. ఆ వేశ్య యీ యిల్లాలి సద్గుణమునకు మెచ్చి, సరే నని సమ్మతించెను. అంత నా యిల్లాలు నడువలేని భర్తను భుజములపై గూర్చుండబెట్టుకొని ఆ పడుపుకత్తె యింటికి గొనిపోవు చుండెను. ఆ సమయమున మేఘము లాకాశమంతయు నిండి పోయినవి. కటికచీకట్లు గ్రమ్మినవి. ఆ చీకట్లలో నాయిల్లాలు భర్తనుమోసుకొని పోవుచుండగా దారిలో కొరత శిక్షబడిన మాండవ్యమహాముని కి, కౌశికుని పాదములు తగిలి బాధ పెట్టగా నా ముని కోపముతో ఎవనివలన నాకింత బాధకలిగినదో వాడు "సూర్యోదయమగుసరికి చనిపోవుగాక!" యన్నాడు. అది విన్నదా పతివ్రత, తెల్లవారితే తన పసుపు కుంకుమలు పోవునని "సూర్యోదయమే కాకుండుగాక యని ప్రతిశాప మిచ్చెను. దానితో చీకట్లట్లుయుండినవి. సూర్యాది గ్రహచలనము స్తంభించినది.

లోకములోని వారందరు నానా విధముల బాధపడుచు గొల్లుమనిరి. బ్రహ్మాదులందరూ కలసి అత్రి భార్యమగు యనసూయ నాశ్రయింప, నామె ఆ పతివ్రత చెంతకు వచ్చి "లోకమును క్షోభ పెట్టకు. నీ భర్త చనిపోయినా వెంటనే దుర్గంధ శరీరము వదలి నవమన్మథాకారుడగును. శాపము మళ్లించు" మని చెప్పగా ఆమె శాపము త్రిప్పినది. సూర్యోదయమైనది. అంత కౌశికుడు నూత్న శరీముతో వచ్చి తన భార్యను కలుసుకొనెను.

## దత్తాత్రేయుడు - కార్తవీర్యుడు

ఇట్లు లోకోపకారిణియైన అనసూయకు దేవతలు వరమీయదలచి వాంఛితము తెల్పుమనిరి. ఆమె ఆనందపడి "నాకు త్రిమూర్తులు

కుమారునిగాజన్మించునట్లు వరమిమ్మనెను వారు తథాస్తు యని సమ్మతించిరి. తరువాత నారదుని విచిత్రోపాయముతో త్రిమూర్తుల భార్యలను పరాభవింపగా వారు బాధపడి యనసూయకు పాతివ్రత్య భంగము గావించుడని వేధించరి. ముగ్గురు త్రిమూర్తులు బ్రాహ్మణ వేషములు ధరించి అనసూయ వద్దకు వచ్చి వివస్త్రవై వడ్డించుమనిరి. ఆమె వారిపై అక్షింతలు, మంత్రజలము చల్లాగా. ముగ్గురునూ బాలురైరి. వారినూయలలో పెట్టి పెంచుచుండ త్రిమూర్తుల భార్యలు వచ్చి"పతి భిక్షను పెట్టుమని" ప్రార్థించిరి. "ముగ్గుర రూపము గల కుమారుని నాకిచ్చి మీ పెనిమిటులను గొనపొండ"నగా జగన్మాతలట్లు చేసినారు. ఆ బాలకుడే దత్తాత్రేయుడు.

దత్తాత్రేయుడు పెద్దవాడై తల్లి తండ్రుల యనుజ్ఞ పొంది తపమాచరించసాగెను. కొందరు యోగులా మహానుభావుని జేరి మాకు యోగము, జ్ఞానము ప్రసాదింపుము. నీ శిష్యులమై యుందుమె మని బాధించసాగిరి. వారి బాధపడలేక దత్తాత్రేయ మహనీయుడొక స్త్రీని సృష్టించి వారికి తానామెతో క్రీడించుచున్నట్లు గన్పింప జేసెను. వారది చూచి "మనము పొరపడితిమి, ఈ దత్తాత్రేయుడు కామలోలుడు. కామలోలుని వద్ద యోగ జ్ఞానములు పొందుట కుదురునా? మనదే పొరపాటని తమ బుద్ధి మార్చుకొని దత్తాత్రేయుని వదలివేసిరి. వారి బాధను తప్పించుకొన్న దత్తాత్రేయుడు, యదేచ్ఛగా తపమాచరించుచుండెను. ఇట్లాతడు తపమాచరించు కాలము నందు కార్తవీర్యుడు రాజ్యము చేయువలసి వచ్చినది.

అప్పటికి కర్తవీర్యుడు రాజ్యము వదలి తపము చేయబోవుదునని నిశ్చయించుకొనెను. ఈ లోపల గర్గ మహాముని వచ్చి"కార్తవీర్యా! నీవు సహ్యాగిరి పొమ్ము. అచ్చట దత్తాత్రేయుడు తపమాచరించుచున్నాడు. ఆయన త్రిమూర్తి స్వరూపుడు. నీకు వలము వరము నిచ్చుననొని తెలుపగా యింద్రునకాయన రాజ్యమిప్పించెనని వింటిని. దాని విషయము చెప్పుమని

కార్తవీర్యుడు ప్రశ్నింపగా, ఆ మహాముని పూర్వము జంభాసురుడు యింద్రుని జయించి రాజ్యపాలనము గావించుచుండెను. ఇంద్రుడు దత్తాత్రేయుని జేరి తన దీనావస్థ వివరించి శరణు గోరెను. దత్తాత్రేయుడు ఇంద్రుని కరుణించి నీవా జంభుని నా వద్దకు మాయోపాయమున గొనిర"మ్మని పంపెను. ఇంద్రుడా జంభునకు లొంగినట్లు నటించి పారిపోవుచుండగా జంభాసురుడింద్రుని వెంబడించి దత్తాత్రే యాశ్రమమునకు వచ్చెను. జంభుడు వచ్చుసరికి దత్తాత్రేయుని వద్ద లక్ష్మీదేవి యున్నది. వాడామెను చూచి మోహించెను. వెంటనే వాడామె నొక తట్టలోనుంచికొని, దానిని తలపై పెట్టుకొని పారిపోయెను. అది చూచిన దత్తాత్రేయుడు ఇంద్రుని పిలచి, ఇంద్రుని చూచి దత్తాత్రేయుడు"నీవు ఇప్పుడు యుద్ధములో జయము పొందగలవు. యుద్ధము చేయు"మనగా నింద్రుడా మహనీయుని యాజ్ఞప్రకారము యుద్ధము గావించి జంభుని జయించి రాజ్యము మరల సంపాదించుకొనెను. కావున నో కార్తవీర్యా! నీవా మహాత్మునాశ్రయింపుము. నీవాయన దయ సంపాదించితివా, చెప్పరాని బలముతో రాజ్యవైభవములతో మహా సత్త్వవంతుడై యుండెదవని ప్రోత్సహించెను. ఆయన మాటలు విని కార్తవీర్యాడానందపడి లక్ష్మి నివాసమేయే స్థానమునందున్న యే ఫలితములో చెప్పమని గర్గు నడిగెను. ఆమె యెచ్చటనున్ననూ పరమ సంతోషము, సుఖము, భోగము, పాండిత్యము, సుందరీ స్త్రీ వైభవము సమస్తము సమకూడునని"చెప్పి కార్తవీర్యుని దత్తాత్రేయాశ్రమము నకు పంపెను. అతడా మహామహుని ధ్యానించుచు తన యభీష్టము తీరు సమయము వచ్చినదని పొంగిపోసాగెను.

అతడట్లు బయలుదేరి సహ్యగిరీంద్రము జేరి దత్తాత్రేయు నాశ్రమము సమీపించెను. ఎదుట జపనిష్ఠలో నున్న మహనీయుని, బ్రహ్మవిద్యా సంపన్నుని, త్రిమూర్తి స్వరూపుని దర్శించి సాష్టాంగపడెను. ప్రేమతో నాతని

చూచి దత్తాత్రేయుడు దీవించెను. ఆ దీవెనతో కార్తవీర్యుడమిత బలశాలియయ్యెను.

# కువలయాశ్వ చరిత్రము

ఆ కార్తవీర్యుడు జమదగ్నిని సంహరించగా కార్తవీర్యుని పరశురాము సంహరించెను. ఈ విధముగా ధర్మ పక్షులు వినిపించిన తరువాత, జైమిని ఓ ధర్మపక్షులారా! కువలయాశ్వుడెవడు? అతడా నామధేయమెట్లు గడించెను? యని ప్రశ్నింప, నా పక్షులిట్లు చెప్పనారంభించెను. శత్రు జిత్తు కుమారుడగు ఋతధ్వజానికే కువలయాశ్వుడను పేరు వచ్చినది. గాలవ మహాముని తపమాచరించుచుండగా పాతాళ కేతువను రాక్షసుడా మునీంద్రుని తపస్సు విఘ్నము చేయుచుండెను. వాని యందు కోపము బూని తన తపోబలముతో నొక యశ్వమును గల్పించెను. ఈ గుఱ్ఱము అడవులు, పర్వతములు, నదులు దాటిపోగల శక్తిగలదై యున్నది. ఆ గుఱ్ఱమునకు గువలయాశ్వమను పేరు గలదు. ఆ మునీంద్రుడు రాక్షస బాధలనుండి తప్పింపుమని ఋతుధ్వజుని కోరెను.

అతడా ముని యిచ్చిన గుర్రము నెక్కి రాక్షస సంహారము చేయ బయలు దేరెను. అందుచే నాతనికి గువలయాశ్వుడను పేరు వచ్చినది. అతడాశ్రమునకు బోవగా నారాక్షసుడు వరాహరూపము ధరించి యా మునీంద్రుని బాధింపసాగెను. వానిని సంహరించుట కర్థచంద్రబాణము ప్రయోగించి కొట్టగా వాడా రూపము విడిచి యొక బిలము జేరెను. కువలయాశ్వుడు వానిని జయింప ఆ బిలము ద్వారా పాతాళలోకమునకు పోయెను. వాడు మాయమయ్యెను. అచ్చట నొక యపురూప సౌందర్యవతియగు యువతి గన్పించెను. వారిద్దరు నొకరినొకరు చూచుకొని

మోహములో బడిరి తొలిమోహముగుట వలన ఆ యబల మూర్ఛజెందినది. ఆమె చెలికత్తె యొకతె యుపచారములు చేయుచుండెను. కొంతసేపటికామె తెలివి నంది తన చెలికత్తెను చూచి ఈ సుందరుడెవడని ప్రశ్నించెను ఆమె మనసులోని విషయమెరిగి కువలయాశ్వుడిట్లా చెలికత్తెకు సమాధానముగా చెప్పగొడగెను.

"నీవీమె చెలికత్తెవని భావించుచున్నాను. ఈ సుందరి యెవరు? ఎందుకిట్లున్నది? ఇటనుండు కారణమేమి? సవివరముగా చెప్పుమ"నెను. అదివిని ఆమె యిట్లు చెప్పదొగెను. "ఈమె నా చెలికత్తె. గంధర్వ రాజగు విశ్వావసుని కుమార్తె. ఈమె పేరు మదాలస. వజ్రకేతుని కుమారుడు పాతాళకేతుడీమెను బలాత్కారముగా గొని వచ్చి యిందుంచెను. ఈమెను వివాహడువమాడుయత్నములో నున్నాడు. నా స్నేహితురాలు వానిని వివాహడుట కిచ్ఛగించలేదు. తా నాత్మహత్య గావించుకో జూచు సమయములో కామధేనువు వచ్చి, మదాలసను జూచి "నీవు బలాత్కారముగా చనిపోబనిలేదు. కొలది దినములలో నొక మహాపురుషుడిటకు వచ్చి ఆ రాక్షసునిచంపి నిన్ను వివాహమాడిగలడు. ధైర్యమవలంబింపు" మని చెప్పి వెళ్ళిపోయినది. ఇంతవరకు ప్రాణవాయువులను చిక్కపట్టి యున్నదనగా విని, అ రాజనందనుడు యిప్పుడా రాక్షసుడెక్కడున్నాడని ప్రశ్నించెను. అందులకామె "వాడు కోటలో నున్నాడు. నీవీమెను చేపట్టగానే వాడు నీ మీదకు యుద్ధమునకు రాగలడనె"ను. మదాలస మీయందునురాగముతో నున్నది. మీరు స్వీకరించకున్న ప్రాణత్యాగము చేయగలదని చెప్పెను. ఆ మాట విని రాజనందనుడు "నీవెవతవు? ఈమెతో నీకు సంబంధమెట్లు కుదిరన"దని ప్రశ్నించెను. ఆ మాట విని ఆమె యిట్లు చెప్పదొడగెను.

"రాజా! నేను వింధ్యవంతుని కుమార్తెను. నన్ను కుండల

యందురు. నా భర్తను శుంభుడను రాక్షసుడు వధించినాడు. నేను విరాగమంది తీర్థాటనము చేయుచు నీ ప్రదేశమునకు వచ్చితిని. ఇచ్చట యీయామె స్థితికి జాలిపడి యిక్కడనే యుండి పోయితిని. ఈమెకు సహాయురాలనై యున్నా. ఈమె గంధర్వ కన్నె. సంగీత సాహిత్యము లందును జ్ఞానము నందును గొప్ప శక్తిగలది. ఈమెను చేబట్టి నీవు సర్వ సుఖము లనుభించు మని" చెప్పెను. దానికాతడు సమ్మతించి యా గుఱ్ఱముపై నామె నెక్కించుకొని పోవుచుండగా రాక్షసుడు గ్రహించి రాజపుత్రునితో యుద్ధమునకు తలపడెను. వానిని తన దివ్యాస్త్రముతో సంహరించి, రాజనందనుడు మదాలసను తన పట్టణమునకు గొనిపోయి చక్కగా వివాహమాడి యిష్ట్యానుభోగములను భవింప సాగెను.

తరువాత కువలయాశ్వుడు పునః రాక్షస సంహారమునకు బయలు దేరి పాతాళకేతుని తమ్ముడగు తాలకేతుడుండు యాశ్రమము జేరెను. నీళ్ళలో మునిగి తపమాచరించు తాలకేతుడొక మాయాముని రూపము ధరించి కువలయాశ్వుని కడకు వచ్చి యిట్లనెను. ఓ రాజకుమారా!నేను వరుణుని గురించి యాగము చేయుచున్నాను. నీ కంఠాభరణము నాకిమ్ము నేను వచ్చువరకు నీవీ యాశ్రములో నుండుమని చెప్పి యా నగ పుచ్చుకుని వాడు వెడలెను.

వాడట్లు తన యాశ్రమము విడిచి నీళ్ళలో మునిగి కువలయాశ్వుని పట్టణమునకు పోయెను. ముని వేషమున పోయి యాతని తండ్రితో నిట్లనెను. "రాజా! నీ కుమారుడు కువలయాశ్వుడు రాక్షసులతో యుద్ధము గావించి చనిపోయెను. దానికి గుర్తుగా నీ కంఠాభరణము గొని వచ్చితిని చూడుమని యా నగవారికియుగా, నా తండ్రి యది కుమారుని నగగా గుర్తించి పట్టరాని దుఃఖము పొందెను. తరువాత నీవార్త మదాలసకు తెలిసి ఆమె ప్రాణములు విడిచెను. తాను తలచిన పని పూర్తియైన పిదప

తాలకేతువు రాజా కుమారునకుత్తర క్రియలు జరుపు వరకుండి, మరల సరోవరము నుండి యీవలకు వచ్చి కువలయాశ్వుని జూచి యిట్లనెను. "రాజకుమారా! నా పని పూర్తియైనది. నీవు వెళ్ళవచ్చునని సాగనంపెను. ఆ రాజకుమారుడు అతని గుర్రముతో వేగముగా నింటికి పోయెను. అచ్చట భార్య చనిపోవుట విని చాలా దుఃఖించి విరాగియై తన స్నేహితులతో తిరుగసాగెను.

ఇట్లుండగా నశ్వతరుడను నాగరాజా కుమారులిద్దరు భూలోక సంచారము చేయుచు కువలయాశ్వుని పట్టణము చేరి ఆ రాజుతో సహవాసము చేయసాగిరి. అతని మంచితనము విజ్ఞానము, నిర్మల స్నేహమునకు మెచ్చుకొనుచు నిత్యము రాకపోకలు సాగించుచుండిరి. ఇటు వీరు వచ్చి పోవుటలు నాగరాజా గమనించి యెక్కడకు మీరు ప్రతి దినము పోవుచున్నారని ప్రశ్నించెను. వారు కువలయాశ్వుని స్నేహము గురించి చెప్పిరి. నాగరాజా విని, యోచించి ఆ రాజనందనుడు ఇప్పుడు భార్య వియోగముతో బాధపడుచున్నాడు. గాన వాని భార్యను మరల బ్రతికింప దలచి, వారితో చెప్పి తన పడగ నుండి యిదువది రెండేండ్ల యువతి, మదాలసగా బయుటకు రప్పించె. ఆ తరువాత కుమారులచే వర్తమానమంపి ఆ రాజకుమారుని నాగలోకము రప్పించి క్రొత్తమదాలసతో వివాహము గావించెను. ఆ దంపతులు పరమ సంతోషము జెంది సుఖముగా కాలము గడుపుచుండిరి. మదాలస కువలయాశ్వుని వలన నలుగురు కుమారులను కన్నది. ముందరి ముగ్గురు తల్లి వలన జ్ఞానోపదేశము పొంది యోగము నవలంభించిరి. నాల్గవవాడు యలర్కుడను పేరుతో తల్లి వలన రాజ్యపాలనాదు లెరిగి సమర్థుడై రాజ్యపాలనము చేయుచెండెను. తల్లివలన శౌచాదులు ధర్మ నిర్ణయములు సైతము ఎరుగుచుండెను. అతనికి కుమారుడు గల్గెను.

విరాగము లేకుండా రాజ్యపాలనము చేయు సోదరునికి విరాగ గుణము కల్పించనెంచి అతని సోదరుడు సుబాహుడు దూరమాలోచించి యొక దూతను పంపించి కాశీరాజా రాజ్యమపహరించ నున్నాడని చెప్పించెను. అలర్కుడు రాజ్యమీయనని యుద్ధము చేతునని చెప్పి యుద్ధమునకు దిగెను. కాశీరాజా వారి పరిచారికలను స్వాధీనపరచు కొని యలర్కు నోడించెను. అతడు విరాగియై, ధనము లేని వాడై, ముఖ్యమగు మోక్షమార్గము పొంద నెంచి భగవదవతారమగు దత్తాత్రేయుని దర్శించి జ్ఞానము సంపాదింపనెంచెను.

అతడా దత్తాత్రేయు నాశ్రమము జేరి నమస్కరించి "ఓ మహామహుడా! దత్తాత్రేయ దేవా! నిన్ను నేనాశ్రయించితిని ఇప్పుడు రాజ్య భ్రష్టుడనై యున్నాను సమస్త సుఖములు పోగా బికారినై వచ్చినాను. నన్ను దయచూడు" మని ప్రార్థించెను. అది విని దత్తాత్రేయుడు వానిని చూచి "అలర్కా! లోకములో సంపదలు స్థిరము కావు. శరీరము పాంచ భౌతికము, శరీర ధారులెప్పటికో యెకప్పటికి తోలు తొడుగును వదల వలసినదే! ఈ రాజ్యము, సంపదలు, భార్యాపుత్రులు, పరివారము, లోక వ్యవహారము స్వప్నము వంటివి. కలలో గన్పించిన వస్తువులు కన్ను దెరువగానే గనుపించ వట్లు మనకనుల ముందు ననే వారందరూ మాయ మగుట చూచుట లేదా? పనికి రాని మమకారముతో జీవితము వ్యర్థమగుటకు జ్ఞానులు నమ్మతింపరు.

వారు తెలివిగా తమ జీవితమును మలచుకొని తపో, దాన, యజ్ఞాదులాచరించుచు శ్రీహరి ప్రీతిగా, సాధకులై సంచరించ వలెను. క్రోధాహంకారములు వదిలిన గాని ముక్తి జెందనేరడు. ఈ మహాత్మ్యమును గ్రహించి యీశ్వరు నారాధించుమని" బోధించెను.

# సార్వోచిషమను చరిత్రము

ఇట్లు చెప్పిన ధర్మపక్షులను చూచి జైమిని మహాముని "ఓ ధర్మపక్షులారా! మీరు నాయందనుగ్రహముతో కువలయాశ్వుని చరిత్రము విన్పించిరి. చాలా సంతోషమైనది. అట్లే దేవ, ఋషి, పితృ, మనువుల విషయములు సవిస్తరము తెలుప ప్రార్థించుచున్నా"ననగా అవి చెప్పనారంభించినవి.

పూర్వము వరుణానదీతీరములో నరుణాస్పదమను పట్టణము గలదు. అందు వేదవేదాంగము లెరిగి, సదాచార సంపన్నుడైన ప్రవరుడను నొక యుత్తమ బ్రాహ్మణుడుండేవాడే. ఆయన నిత్యాగ్నిహోత్రి. నిజమాన్యభూములమీద వచ్చు ఆదాయముతో నిత్యము అతిథి యభ్యాగతుల నాదరించుచు తల్లిదండ్రులను సేవించుచు - కులపత్నితో కాలము జరుపుకొనుచుండెను.

ఇట్లుండ నొకానొక కాలమునందు రససిద్ధు డొకడా ప్రవరుని గృహమునకు వచ్చెను. ప్రవరుడా వచ్చిన సిద్ధుని గౌరవించి, యాతని సామర్థ్యమున కుప్పొంగి యిట్లడిగెను. "ఓ మహానీయా! మీరు సమస్త దేశములు తిరిగి యున్నారు. ఎక్కడెక్కడ యేయేమి విశేషములు లున్నవో నాకు విన్పించుమని" కోరెను. ఆసిద్ధుడదివిని సంతోషించి "బ్రాహ్మణోత్తమా! నేను తిరగని స్థలము లేదు. హిమాచలమాదిగా కన్యాకుమారి వరకు తిరిగినవాడను. బదరీనారాయణ, కేదారము, హింగుళాశక్తి స్థలము, ప్రయోగ, కాశీ మొదలగు మహాక్షేత్రములు సంచరించినాను. అందులో హిమాలయములోని సొబగులు ఎవరునూ వర్ణించలేదు. మహాతీర్థములు మహానదులు జన్మస్థానములు, నానావిధ

రమ్యప్రదేశాదులందుగల విశేషములెన్నో చూడదగినవని చెప్పగా ప్రవరుడానందపడి దానిని చూడవలయునని కోరికపడెను. సిద్ధుడది విని నా వద్ద పాదలేపన మనుపసరు గలదు. ఆ పసరు వ్రాసికొన్నచో పాదములు అశ్రమముగా నెంతదూర మైనపోయి స్వల్ప కాలములో వేళదప్పకుండా నింటికి పోవచ్చు" నని చెప్పగావిని తనకా పసరునిమ్మని పుచ్చుకొనెను. సిద్ధుడు తనదారిని తాను పోయెను. మరునాడు కృత్యములు తీర్చుకొని ప్రవరుడా పసరు కాలికి వ్రాసికొనడా దాని మహిమతో హిమగిరిమీద వ్రాలెను. అతడట్లు హిమగిరిజేరి, యందుండు సమస్త పుణ్యప్రదేశములు చూచి, సంతోషించుచుండెను. అట్లాతడు మధ్యాహ్నము వరకు నాల్గు తట్టులు తిరుగుటచే ఆ సమయపు టెండవేడిమి కాపసరు కరిగిపోయెను.

అంతటితో యింటికి చేరే మార్గం తెలియని ప్రవరుడు, పరితాపంతో ఆ పర్వతము పైనే తిరుగులాడుచుండెను. అతడట్లు తిరుగుచు కొండకోనల సంచరించుచు తానింటి కెట్లు పోవలయునా? యని సందేహంగల మనస్సుతో నుండి యూగాడు సమయములో నాతనికొక దివ్యగానము దూరమునుంచి వినిపించ సాగెను. ప్రవరుడు ఆ గానము వచ్చే దిశగాపోగా అతని కండ్లముందు ఒకమహాభవనమగుపించెను. అతడా భవనమును చూచుచు పరమాశ్చర్యమందుచున్న సమయములో ఆ భవనము ముందువాకిలిలో దివ్యాభరణ భూషితురాలై యపురూప సౌందర్య ఖనియగు నొక దివ్యాంగన యొడిలో వీణనుంచుకొని వీణాగానము చేయుచుండెను. అతడు సరిగా ఆమె యెదుటకు రాగా, నామె వీణ నాతిన్నెమీదనుంచి గౌరవ పూర్వకముగా ప్రక్కనున్న యొక పోక చెట్టు మొదట వినయముగా నిలబడెను. ఆదివ్య స్త్రీ ప్రవరుని రూపురేఖా విలాసములుచూచి యౌవన ప్రాయముచే మోహితయై రెప్ప వాల్చక చూచుచుండగా నీ శ్రోత్రియ

బ్రహ్మణుడు "ఓసుందరీ! నీ వెవరవు? ఎందులకిట్లొక్క దాన వున్నావు? నీ విషయము చెప్పుము."

నాది అరుణాస్పదపురము, నేను ప్రవరుడను బ్రాహ్మణుడను, నేను ఒక రససిద్ధుని వలన పసరు పొంది దాని ప్రభావముచే నీ హిమగిరికి వచ్చినాను. ఎండకు పసరు కరిగిపోయింది.నేను త్రోవ తప్పినాను. నాకు మా వూరు చేరే త్రోవజూపి పున్నెము గట్టుకొమ్మనెను. ఆమె యాతని యందు మమకారము గలదై జాణగా నిట్లు మాట్లాడెను. 'నీవు దారితప్పి యచ్చుటకు రావలయునా? ఎన్ని దారులు లేవు? వయస్సులో నున్న నన్ను బంటరిగా పలకరించుటకు వచ్చినావు. నీ హృదయము గ్రహించినాను. ఇంత లేసి కన్నులున్న నీవు దారితప్పితివా? చాలు చాలు నీ మాటలు విచిత్రములు. వీటివూటెందులకు? నన్ను గురించి యడిగినావు గాన, నా చరిత్రను చెప్పుచున్నాను వినుము. "నాది గంధర్వజాతి. నాతల్లి మేనక. మేము దివ్యవంశములోని వారలము. నీవు శ్రోత్రియుడ ననుచున్నావు నీవు చేయు యజ్ఞయాగాదులవసరము లేకుండా గంధర్వ స్త్రీనగు నన్ను చూచితివి. నాయింటికి వచ్చితివా, నావద్ద నుండిన సమస్తభోగములు నీకు సిద్ధించును. ఇచ్చట నుండుము. నీజన్మ సఫలమగు"ననెను. అతడు విని "నా తల్లిదండ్రులు, కులపత్ని, యగ్నిహోత్రములు విడచి యిచ్చట నెట్లుందును? నీకు పుణ్యముండును, నాకు దారిచూపి నాయింటికి జేర్చుమ"నెను. ఆమె విని యోచించి బ్రాహ్మణుడా! నీకు యెన్ని జన్మలెతత్తినను గంధర్వ స్త్రీ చిక్కునా? నీ పుణ్యము మంచిది. నాతో నీవుండిన భూలోకమున గాకుండా దివ్యలోక సంచారము ప్రాప్తింపచేయుదు నని యెంత యోచెప్పెను. అతడు పరస్త్రీలను ముట్టియెరుగుడు. ధర్మమార్గము తప్పనివాడు. అందుచే నామె చెప్పిన మాటలు వినిపించుకొనకుండగా తనదారిని తాను తిరిగి వెళ్ళిపోజూచెను. కాని, వరూధిని ఒక్కసారైనా ప్రవరుడి పొందు

నభిలషించినది. ఇతడు చాంధసుడుగదా లోబరచుకొందమని దరిజేరెను.

అట్లు జేరి, యాతని యందలి యనురాగము విడువలేక యొక్కసారి యాతనిపైబడి గాఢముగా కౌగిలించెను. అతడా పరస్త్రీ సంపర్కమందాశ లేనివాడగుటచే పెడమొగము పెట్టి శ్రీహరీ యని, ఆమె భుజములు పట్టుకొని నెట్టివేసి, యగ్నిని స్మరించి "ఓయగ్నిదేవా! నేను నిన్ను నిరంతరము సేవించువాడనైనచో నీవే నాకాధారమని నేను భావించిన, దాన ధర్మయజ్ఞాదులయందు నిష్ఠతో నున్నవాడనైన నీవు నన్ను ఇంటికి జేర్పగలవు. నేను పోకున్న నగ్ని హోత్రములారిపోవును. నా తల్లిదండ్రులు బాధ పడుదురు. ఇల్లాలు విచారించు చుండును. నన్నింటికి జేర్పు" మని ప్రార్థించగా, నాయగ్నిదేవుడాతని కోర్కెననుసరించి ప్రవరుని వాని గృహమునకు జేర్చెను.

# స్వరోచి జననము

అట్లాతడు వీతిహోత్రుని సహాయముతో యిల్లు జేరిన పిదప, చిరకాలమునుండి వరూధిని యందు మోహపరవశుడై తిరిగి, యామె వలన తృణీకరింపబడిన యొక గంధర్వకుమారుడు మాయా ప్రవరరూపము ధరించి అమాయకునివలె నటించుచు నా ప్రదేశములలో దిరుగుచు వరూధిని యెదుట గానబడెను. ఆమె యీ మాయాప్రవరుని నిజముగా తాను వలచినవాడేనని తలచి సమీపించి "ప్రియా! నీకు నా యందు మమకారము గల్గెనదా? ఇంటికి పోయి వచ్చితివా? నన్ను విడలేక, బుద్ధి మార్చుకొని వచ్చితవా? రమ్మ" ని సాదరముగా పిలిచి గూర్చుండబెట్టుకొనెను.

అతడు "శ్రోత్రియత్వమును భంగపరచి యిప్పుడు నిన్నుచూపి మనస్సు కుదురవడ వచ్చితిని. నీ పొందు సామాన్యులగు భూలోకవాసులకు

లభించునా? ఇది నా పుణ్యము సంతోషమని" తన తృప్తిని వెల్లడించెను. ఆమె యాతని సంభాషణలకు, వయస్సున కానందపడి యాతని పొందు గోరెను. మాయా ప్రవరుడు తన్ను నిజముగా వరూధిని చూచిన యానవాలు పట్టునను శంకతో "వరూధినీ! మా వంశాను ప్రకారము నాకొక నియమమున్నది దానికి నీ వంగీకరించినచో నేను నీతో గూడి కామకేళీ విలాసములలో పాల్గొందును. మనము కలిసినప్పుడు నీవు కనులు మూసుకొని యుండుట మాయాచారమనెను. ఆమె యా నియమమున కంగీకరించి యా మాయారూపుడైన గంధర్వునితో చిరకాలము కాపురము నడపెను. కొన్నాళ్ళకామె వాని లక్షణములు గ్రహించి, అతడు మాయా ప్రవరుడనియు, గంధర్వ జాతివాడనియు నెరిగి కోపము చెంది వానిని భూలోకములో మనుష్యుడవై జన్మించుమని శపించినది. అతడా శాపము పొంది వరూధిని పొందు వదలిపోయెను. ఆ సమయమున వరూధిని గర్భము ధరించినది. కొంత కాలమునకు వరూధిని యొక శుభలగ్నమందు కుమారుని ప్రసవించినది. మహత్తర తేజోమయుడైన యాబాలునిన చూచి పరమానందమంది స్వరోచి యను పేరుంచి మిగుల గారాబముతో పెంచుచుండను. వరూధిని గంధర్వ కాంత యగుటచే నాతడు బ్రాహ్మణ బీజోత్పన్నుడుగాన యధావిధిగా నుపయనాది కృత్యములు గావించి ధనుర్విద్యా పండితునిగా జేసెను. స్వరోచి నానాటికి పెరిగి పెద్దవాడగు చుండెను. అతడొకనాడు మందరాచల ప్రాంతమున సంచరించుచుండగా "రక్షింపుము, రక్షింపు" మన్న స్త్రీ ఆర్తనాదములు వినిపించెను. స్వరోచి యామెను సమీపించి నీవెందులకు భయపడుచున్నావు? నీ వృత్తాంతమేమి? యని యడుగగా ఆమె యిట్లు సమాధానము చెప్పెను. మహానీయా! నేను ఇందీవ రాక్షుడను గంధర్వరాజ పుత్రికను. నా పేరు మనోరమ నేనొక రోజున

విభావరి, కళావతి యను నా చెలికత్తెలతో తిరుగుచూ నొకసన్నగిల్లిన శరీరముగల మునీంద్రుని హాస్యము సేసితిని.

ఆయన కోపము చెంది "నిన్ను రాక్షసుడు భక్షించుగాక యని నన్నును, మీకు కుష్ఠ క్షయవ్యాధులు కలిగి బాధపడుదురు గాక యని నా చెలికత్తెలను మమ్ము మువ్వురను శపించెను. ఆ శాప ప్రకారము రాక్షసుడొకడు నన్ను మ్రింగుటకు వచ్చుచు తరుముచున్నాడు. నాయందు దయయుంచి వాని బాధ తప్పింపగోరెదను. వానిని జయించ లేనను భయము నీకవసరము లేదు. నా తండ్రివలన పొందిన ధనుర్విద్యను అస్త్రశస్త్రములు నీకుపదేశించెద"నని యుపదేశించెను. వెంటనే స్వరోచి దివ్యాస్త్ర ప్రయోగము చేసి రాక్షసుని గొట్టెను. వాడాతనికి మ్రొక్కి యిట్లనెను.

"వీరశిఖామణీ! యింక నీవు బాణసంధానము చేయనక్కరలేదు. నీవు వేసిన బాణము నాటినది, దానితో నా శాప విముక్తియైనది? నేను బ్రహ్మమిత్రుడను మహామునివద్ద నథర్వణవేదము నేర్చుకోబోగా నాకాయన యా వేదము చెప్పనిరాకరించెను. నేను శాంబరీవిద్యా విధానమున నదృశ్యుడనై ఆయన శిష్యులకు ఆయుర్వేదం చెప్పుచుండగా విని నేర్చుకొంటిని ఇది గ్రహించి నీవు రాక్షసుడవై పొమ్మని శపించెను. నేను శాపవిముక్తి నడుగగా ఒకరాజు నన్ను నీకు బాణము నాటునట్లు వేయును. దానితో విముక్తియన్నాడు. నీ మూలమున నిజరూపమందితిని.

నా పేరు యిందీవరాక్షుడు సుమా! యీ మనోరమ నా కుమార్తె. మా యిద్దరను బాధలనుండి తప్పించి కాపాడిన నీ యుపకార మెన్నటికీ మరువజాలము. నీకు నాకుమార్తెనిచ్చి వివాహము చేయుదును పెండ్లాడు మనెను. దానికి స్వరోచియామె యందునురాగము గల్గి వివాహమాడ నమ్మతించెను. అదివిని మనోరమ వివాహమాడెను. ఇందీవరాక్షుడు తన

నగరమునకు పోయెను. తరువాత స్వరోచి యోషధులను స్వీకరించి విభావరీ కళావతుల శరీరములు బాగుచేసెను. శరీరమంత రోగ ములుబాగుచేసిన స్వరోచిని మిక్కిలిగా నభినందించిరి. వారిలో విభావరి మహాత్మా! నీవు నా శరీరమున కున్న రోగము వలన్ని నాకు పకారము చేసితివి. నేనుమందారుడను విద్యాధరుని పుత్రికను. నాకు సమస్త జంతువుల భాషలు తెలియును నీకాభాషలు తెలియునట్లు విశ్వాస పూర్వకముగా చెప్పెదనని యా విద్య స్వరోచికి నేర్పి, ఇట్లనెను. "సుందరాకారా! నా స్నేహితురాలిని చేపట్టినట్లు నన్ను కూడ చేపట్టు మని ప్రార్థించెను. స్వరోచి యామెను చేబట్టెను. తరువాత కళావతి స్వరోచిని చూచి, "ఓ పురుషపుంగవా! నేనొక ముని కుమార్తెను. నేను పుట్టకపూర్వమే నా తండ్రి బ్రహ్మచర్యము నవలంబించెను, నా తండ్రి తపము చేయుచుండ పుంజికస్థలయను యప్సరస నా తండ్రికడకు వచ్చి యాతని తపము చెరచి కొన్నాళ్ళుండగా నేను జన్మించితిని. నా తల్లిదండ్రులు నన్ను విడిచిరి. నేనాత్మహత్య చేసికొనబోవ పార్వతీదేవి వచ్చి నా ప్రయత్నము వారించి పద్మిని యను నవనిధులు తెలియగల్గు విద్య నేర్పి, నిన్ను స్వరోచియను వీరుడు వివాహమాడునని దీవించి పోయెను. నీవు నాకు దొరికితివి. నీకాపద్మినీ విద్య నేర్పెదను, "నన్ను వివాహమాడు మన "నాతడంగీకరించి యా విద్యను గొని, కళావతిని కూడా వివాహమాడెను.

## స్వారోచిష మనువు

ఇట్లు స్వరోచి ముగ్గురను వివాహము గావించుకొని వారితో యథేచ్ఛగా సమస్త భోగములను భవించుచుకాలము జరిపెను. మనోరమకు విజయుడు, విభావరికి మేరునందరనుడు, కళావతికి ప్రభాసుడు జన్మించిరి. వారి ముప్పురకు మూడు పట్టణములు గట్టించి పద్మినీ ప్రభావమునందు

వారిని కాపురములుంచెను. ఒకనాడు స్వరోచి వేటాడబోనగా నొక యెలుగు కనిపించినది. దానిపై బాణము విడువ విల్లెక్కు పెట్టుచుండ నొక యాడులేడి యడ్డువచ్చి నన్ను నీ యలుగుతో సంహరింపుము. ఈ జీవితముపై విరక్తి పొందితిని యని దీనాతిదీనముగా ప్రార్థించినది. ఆ కురంగినీ చూచి నీ వెవరిని వరించితివి చెప్పుమనగా నిన్నే వరించితి నని సిగ్గు, భయములతో చెప్పి, సంతోషమున తలవంచియున్నది. అది విని స్వరోచి "నీవు మృగజాతిలోని దానవు, నిన్నెట్లు గూడదగు నని" ప్రశ్నించెను. ఆ మాటవిని నీకనుమానమెందులకు? నన్నొక్క మారు కౌగిలించుకొనుము నీ యనుమానము తీరుననెను.

స్వరోచి యాకురంగిని కౌగిలించుకొనగా నది వన దేవతగా మారి పోయినది, ఇదియేమి యని చూడగా నామె యిట్లనెను. "స్వరోచీ! మనువు పుట్టుటకు దేవతలు నన్ను ప్రార్థించి పంపిరి. నీకై యీ వనములో నుండి సమయమునకై చూచుచుంటిని అనగా స్వరోచి యామెను గూడెను. సద్యోగర్భవతియై యా వన దేవత యొక కుమారుని ప్రసవించినది. పుష్పవర్షము కురిపించి దేవదుందుభులు మ్రోగించి దేవతలా కుమారుని జననమున కానందము ప్రకటించిరి. ఆ కుఱ్రవాడు నానాటికి శుక్ల పక్ష చంద్రునివలె పెరుగుచు వృద్ధి పొందెను సర్వోచి కుమారుడు గాన స్వారోచుడను పేరొందెను. అనంతరమొకనాడు స్వరోచి వన విహారమునకు పోయి అచ్చట హంసమిధునము మాటలాలకించి వరక్తి చెంది వాన ప్రస్థముపొంది పరమేశుని ధ్యానించుచు యోగనిష్ఠ బూని శరీరము విడచి యుత్తమ లోకములు పొందెను. తరువాత బ్రహ్మదేవుడు స్వారోచిషుని మనువుగా నియమించెను" యని ధర్మపక్షులు చెప్పగా విని జైమిని వాటితో నిట్లనెను. "పార్వతి యిచ్చిన పద్మినీ విద్యా ప్రభావమును స్వరోచికి నేర్పెనని కళావతిని గురించి చెప్పితిరి గదా! దాని ప్రభావమే" మనెను.

# మనువుల క్రమము

అదివిని యాధర్మ పక్షులిట్లు చెప్పినవి. పద్మిని విద్య కధిదేవత లక్ష్మీదేవి. పద్మినీ విద్య నేర్చినవారికి నిధుల విషయము తెలికగా నెరుగబడును. నిధులు - పద్మము, మహాపద్మము, మకము, కచ్ఛపము, ముకుందము, కందము, నఅలము, శంఖమను పేర్లు గల్గియుండును యని జైమినికి చెప్పగా, నుత్తమ మనువు గూర్చి చెప్పుమనెను. ఉత్తానపాదున కుత్తముడు గల్గెనని ప్రారంభించి ధర్మపక్షులు చెప్పసాగెను. రాజు తన భార్య స్వభావము నామెనడవిలో పదిలి వేసెను, ఒకనాడు బ్రాహ్మణుడొకడు తన భార్యనెవరో యెత్తుకొని పోయిరనియు తన భార్యను తెచ్చి యిమ్మని రాజును కోరెను. రాజు వాని కోర్కెననుసరించి తిరిగి త్రికాలజ్ఞ మహామునినడుగగా నామె నొక రాక్షసుడుతన స్వాధీనములో నుంచుకొన్నాడనెను. రాజా బ్రాహ్మణస్త్రీ పోలికలడిగి తెలిసికొని, వెదకి రాక్షసుని జంపబోవగా వాడు శరణువేడి బంటుగా నుందుననెను, నీ వెందులకీమెను పట్టుకొంటివనగా నేపట్టుకొన్న వారి సుకృత దుష్కృతములు తీసికొందునన నీమెనామె పెనిమిటికి కప్పగించమనెను, రాక్షసుడట్లు చేసెను.

మరల రాజు మునీంద్రుని దర్శించి తన భార్య విషయమడుగగా నీ భార్య పాతాళలోకములో నాగరాజు కుమార్తె వద్ద చెలికత్తెగా నున్నదనెను. నాగరాజు నీ భార్యను తన్ను వరింపుమని బాధింపగా నాతని కుమార్తెనంది, తండ్రికది తగదని నీతిచెప్పనామెను మూగగానుండమని శపించెను. ఆమె వద్ద నీ భార్యయున్నదనెను. రాజు రాక్షసునిబిల్చి తన భార్యను గొని రమ్మని పంపగా నాతడామెను గొనివచ్చెను. రాజు "భార్యతో నీవు సుఖముగా నుండి కాపురము చేసుకొనమనిన విని ఆమె నా స్నేహితురాలి మూగతనము

పోగొట్టమని కోరినది. రాజు సువర్మయను మంత్రవేత్తను బిలిచి సరస్వతీ సూక్తములు చదివించి యామూగతనము పోగొట్టగా నంది సంతోషించి నీకు సర్వసుఖములు గల్గును. మంచి కుమారుడు జన్మించునని దీవించగా నుత్తముడు జన్మించెను. ఆయుత్తమ మన్వంతరము దాటగా, తామసుడు మనుపయ్యెను. తరువాత రైవతుడు మనువయ్యెను. వాని తరువాత చాక్షుషుడు మనువయ్యెను. తుదుపరి వైవస్వతుడు, సావర్ణి, దక్షసావర్ణి, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణియనువారులు క్రమముగా, మనువులైరి. తరువాత రౌచ్యుడు మనువయ్యెను. ఇట్లు మనువుల విషయము చెప్పగా విని జైమిని ధర్మపక్షులను జూచి పార్వతీదేవి వధించిన శుంభనిశుంభుల చరిత్రము విన్పింపగోరెను. మార్కండేయుడు క్రోష్టికి చెప్పిన విధిని మీకు చెప్పదవినుమని మొదలిడెను.

# శుంభ - నిశుంభులు

హిరణ్య కశిపుని వంశములో సుందోపసుందులకు శుంభ నిశుంభులు గల్గిరి. వారింద్ర పదవిగోరి తపమాచరించు బ్రహ్మను మెప్పించి మరణములేని బ్రతుకు కావలయు నని వరము కోరగా, ఆయన దేవీయంశముగల కన్నె తప్ప యితరు లెవరూ మిమ్ముజంపజాలరని చెప్పి వెళ్ళిపోయెను. ఇంద్రాదులు ఈ రాక్షసుల దుర్మార్గములు భరించలేక బ్రహ్మను ప్రార్థించిరి. బ్రహ్మ తన దేహమునుండి యొక తేజము గల శక్తిని పుట్టించి నీవు హిమ గిరి దక్షిణ శిఖరమున నున్న దుష్టరాక్షసులను సంహరింపుమని యాజ్ఞాపించెను. అక్కడామె చెలులతో సంచరించుచుండగా చండముండు చూచి శుంభునకు చెప్పిరి ఆమె సుందరి. నీవామెను గ్రహించదగున ననగా, అతడు కొంత మంది దూతలను పంపెను. వారినామె తృణీకరించిది. తరువాత యుద్ధము ప్రకటింప వారినీ వారి పరివారమునూ సంహరించి

వేసెను. తరువాత శుంభనిశుంభుల మేనల్లుడు రక్తబీజుడు దేవి నెదరింపగా వానివలన రక్తబీజులెందరో పుట్టుచుండగా దేవీ మాహాకాళీ రూపముతో రక్తము నేలమీద పడకుండ నాలుకతో నాకి, వానిని సంహరించెను. ఇంద్రాదులకు రాజ్య మెప్పటియట్లు నిష్కంటవముగా పరిపాలింప సాయపడినదా దేవి. ఇది దేవి చరిత్రమని చెప్పెను.

తరువాత జన్మ, రోగ, వృత్యువులను నివారించు శక్తి సూర్యోపాసనమందున్నదని యొక యుపాఖ్యానము ధర్మపక్షులు చెప్పగా జైమిని వినెను. ఆ పిదప వైశాలినీ వివాహ మిట్లు వర్ణించి చెప్పెను.

# అవీక్షద్వైశాలినుల పెండ్లి మరుత్తు పుట్టుక

విదిశాపురాన్ని విశాలు డనే రాజు పరిపాలిస్తూ వుండేవాడు. అతని కూతురుపేరు వైశాలిని. అందచందాలలో, విద్యాగుణగుణాలలో ఆమెకుయామే సాటియని పేరు. విశాలుడు వైశాలినికి స్వయంవరం ప్రకటించాడు. ఆ స్వయం వరానికి వచ్చిన రాకుమారులలో ప్రధానుడు, అవీక్షిత్. అతడు బలాశ్వని కుమారుడు మహావీరుడైన అవీక్షిత్. వైశాలిని తననువరిస్తుందో వరించదో ననే భయంతో – ఆమెను బలవంతముగా రథము పైనెక్కించుకొని వెళ్ళిపోసాగాడు. అది చూచిన క్షత్రియ వీరులతనిపై తిరగబడ్డారు. కాని, అతిలోక పరాక్రమశాలియైన అవీక్షిత్, వారనందరినీ – సునాయాసంగా ఓడించివేశాడు. ఆ రాజులు మరింత ఆవేశపరులై కపటోపాయంతో అవీక్షిత్‌ను బంధించారు. వైశాలిని విడిపించారు. విశాలుడు అవీక్షిత్‌ను కారాగారంలో వుంచాడు.

అనంతరం – అక్కడి వరులలో యిచ్చ వచ్చిన వారిని వరించమని వైశాలిని కోరారు. కాని, ఆమె నిరాకరించి, "ఇందరు వీరులన

ఏకమాత్రుడిగా నిర్జించిన అవీక్షిత్ కన్న మహావీరుడు లేడు. వీళ్లందరూ అతనిని మోసంచేసి బంధించారు. నేను పరాక్రమవంతుడైన అవీక్షిత్‌ను చేసుకుంటానేగాని, మోసగాళ్ళను చేసుకోను." అంది రాజాలు తలలు వంచుకొని వెళ్ళిపోయారు. అక్షిత్‌కు పిల్లనివ్వడం పరువు తక్కువ పనిగా భావించి, విశాలుడు మౌనంగా వుండిపోయాడు.

తనకొడుకు విదిశాపురంలో బంధించబడ్డాడని తెలుసుకున్న బలాశ్వుడు విశాలుణ్ని ఓడించి, అవీక్షిత్‌ను విడపించాడు. వైశాలిని వివాహం చేసుకోమన్నాడు. ఈ సారి అవీక్షిత్ అంగీకరించలేదు. ఆమె ముందు శత్రువుల చేత బంధితుడై నను ఆమె దృష్టిలో ఆడంగికన్న హీనుడవుతానని, అందువల్ల వివాహం చేసుకోనని చెప్పాడు. ఆ మాటలు విన వైశాలిని విరక్తితో వన భూములకు చేరి తపస్సు చేసుకోసాగింది. ఆమె తపస్సుకు మెచ్చిన దేవతలు "సప్తద్వీపాలనూ శాసించగల చక్రవర్తిని కనగలవు" అని దీవించారు. పెండ్లి కాకుండా పిల్లలెలాపుడతారని అడిగింది వైశాలిని నీకే తెలుస్తుంది. ఆమాట తప్పదు అని చెప్పి దేవతలు అదృశ్యులయ్యారు. వైశాలిని తపోనియమాలు పాటిస్తూ అడవిలో వుండిపోయింది. కాల గమనంలో - బలాశ్వుడు బాగా ముసలివాడైపోయాడు. మనుమలకోసం తపించుపోయి ఆ ముసలిరాజా బలవంత పెట్టడంతో ఎట్టకేలకు - కొంతకాలం తర్వాత వివాహం చేసుకోవడానికి అంగీకరించాడు అవీక్షిత్ అనంతరం ఒకరోజున వేటకు బయలుదేరాడు. దైవలీలగా - అతడు వైశాలిని వుంటున్న అడవికే వచ్చాడు. అదే సమయానికి - దృఢకేశుడు అనే రాక్షసుడు వైశాలిని చూచి - ఆమెను అపహరించుకు పోసాగాడు. ఆమె రక్షించమని కేకలు పెట్టసాగింది. ఆ ఆర్తనాదాలు విన్న అవీక్షిత్ దృఢకేశుడితో తలబడ్డాడు. దృఢ కేశుడు - అవీత్ పరాక్రమానికి అబ్బురపడి, మెచ్చుకుంటూ - ఓ

"రాకుమారా! నేను గృహస్థులవలన తప్ప మరణించను. నువ్వు మెంతటి వీరుడివైనా - బ్రహ్మచారివైన కారణంగా నన్ను నిర్జించలేవు. అందువల్ల ఈ పిల్లను నాకు వదలి నీ దారిన నీవు వెళ్ళిపో" అన్నాడు.

ఆపదలోవుండి, రక్షించమని ప్రాధేయ పడుతూన్న స్త్రీని వదలి వెళ్ళడం ధర్మం కాదు. గనుక రాక్షస సంహారార్థం, ధర్మనిర్వహణకోసం అవీక్షిత్ - రాక్షసగ్రస్తయైన ఆ కన్యనే తాను వివాహ మాడుతా నన్నాడు. వైశాలిని అవీక్షిత్‌ని గురించి అతనిని వివాహమాడేందుకు అంగీకరించినది. వారిద్దరూ మానసిక పరిణయాన్ని పాటించారు. తక్షణమే అవీక్షిత్ నేను గృహస్థుడను అని ప్రకటించి - ఆ రాక్షసుణ్ని వధించాడు. అనంతరం వైశాలిని గుర్తించాడు. అడవిలో యిరువు గాంధర్వవిధిని వివాహమాడారు, పిదప రాచనగరుకు చేరి అగ్నిసాక్షిగా పెండ్లి చేసుకున్నాడు. దేవతల వరం వలన వారికి మరుత్ అనే కుమారుడు జన్మించాడు. కాలాంతరంలో అతడే - ఏడూ దీవులనూ యేచ్ఛత్రాధిపత్యంగా పరిపాలించి - షట్చక్రవర్తులలో ప్రథముడయ్యాడు. అతని చరిత్రనే మరుత్తరాట్చరిత్రము అంటారు. ఈ మార్కండేయ పురాణాన్ని - శ్రీమార్కండేయ మహాముని క్రోష్టికి చెప్పిన ప్రకారం, ధర్మపక్షులు జైమిని వినిపించినట్లు వ్యాసుడు వ్రాసినట్లుగా - సూతులవారు శౌనకాది మహామునులకు - బోధించారు.

## మార్కండేయ పురాణం సంపూర్ణం



# 8. అగ్ని పురాణము

"శ్లో॥ వశిష్టయాగ్నినాప్రోక్త మాగ్నేయం తత్ప్రచక్షతే" అనగా

అగ్నిదేవుడు వశిష్ఠ మహర్షికి చేసిన సద్బోధమే అగ్ని పురాణం.

"శ్లో॥ వామో హ్యాగ్నేయ ముచ్యతే!"

శ్రీ మహా విష్ణువు యొక్క యెడమ పాదంగా వర్ణింప బడిందీ అగ్ని పురాణం. ఇందులో మూడు వందల ఎనుబది మూడధ్యాయాలున్నవి.

1) దశావతార వర్ణన, 2) రామాయణ ఘట్టాలు,3) మహాభారత ఘట్టాలు, 4) సృష్టి వర్ణన 5) దేవాలయాల నిర్మాణం ఫలం 9) వాస్తుపూజా విధానం 10) గయాక్షేత్రయాత్రావర్ణన 11) శ్రాద్ధకల్పము 12) బ్రహ్మచారి, గృహస్థ, వాన ప్రస్థ, యతి ధర్మాలు 13) అనేక విధమైన ప్రాయశ్చిత్తాలు 14) పాడ్యమి మొ॥ ఆయా తిథుల్లో చేసే వ్రత, పర్వ విధానాలు, ఫలాలు 15) స్వప్న ఫలాలు 16) శకున విజ్ఞానం 17) స్త్రీ, పురుష జాతిలక్షణాలు 18) ఆయుర్వేద శాస్త్రం 19) రత్న పరీక్షా విధానం 20) కావ్యనాటకాలంకార లక్షణాలు 21) ప్రళయ వర్ణన 22) నరకలోక వర్ణన 23) అద్వైత బ్రహ్మతత్త్వం మొ॥ విషయాలు– ఈ అగ్ని పురాణంలో సవిస్తరంగా సాక్షాత్కరిస్తాయి.

అగ్ని పురాణంలో కూర్మావతార వర్ణన ఈ రీతిగా నున్నది. దేవాసుర సంగ్రామం భయంకరంగా జరిగింది. దేవతలోడి పోయారు. వారి సంపదలన్నీ నశించాయి. దీనికి కారణం – దుర్వాస మహర్షి శాపమే. బ్రహ్మాది దేవతలంతా, మహావిష్ణువును శరణు వేడారు. రాక్షసుల్ని జయించే ఉపాయం సెలవివ్వమని ప్రార్థించారు. వెంటనే వారితో సంధి చేసికొమ్మని విష్ణువు సలహా నిచ్చాడు. మఱియునిట్లు చెప్పాడు. "మందర పర్వతం కవ్వంగా, వాసుకి కవ్వపు త్రాడుగా చేసికొని క్షీరసాగరాన్ని మథించాలి. అప్పుడందుండి

అమృతం వెలువడుతుంది. అది మాత్రం రాక్షసులకందనీయరాదు. మీకు మాత్రమే దక్కాలి. అందుకై మీకు నా సంపూర్ణ సహకార మందజేస్తాను. పోయి ఆ పని ప్రయత్నించండి" అన్నాడు విష్ణువుదేవుడు. క్షీరసాగరం మధునం ప్రారంభించారు. అయితే ఆదిలోనే ఒక ఆటంకమెదురైంది. మందర పర్వతానికి స్థిరంగా నిలబడటానికి ఆధారమేమి లేకపోవుటచే, అది క్రిందికి జారిపోసాగింది. అప్పుడు దేవతలు ప్రార్థించగా విష్ణుభగవానుడు కూర్మావతారం తాల్చి తన వీపుపై మందర పర్వతాన్ని కదలకుండానిల్పాడు. ఆటంకం తొలిగిపోయింది. మెల్లగా మధనం సాగిస్తున్నారు దేవతలు. రాక్షసులు కూడా మేము కలిసి పని చేస్తానని వాసుకి తలభాగం పట్టుకొని చిలుక సాగారు. అట్లు మధిస్తుండగా ముందుగా, వాసుకి బాధతో క్రక్కిన విషం హాలాహలం పేరుతో లోకాల దహించేలా బుస్సున పొంగి బయటకు ప్రవహిస్తోంది. అప్పుడు దేవతలు ప్రార్థింపగా పరమశివుడు దాన్ని నేరేడు పండువలె ముద్దగా చేసి కంఠంలో ధరించాడు. కనుక కంఠం కమిలి నీలకంఠుడయ్యాడు. ఆ కల్పవృక్షం, శ్రీ కౌస్తుభం, అప్సరసలు లక్ష్మీదేవి ఉద్భవించి బయటకి వచ్చారు. వాటి నన్నింటికి తమకై శ్రమించి మందరాన్ని మోసిన శ్రీ మహావిష్ణువుకు కృతజ్ఞతా పూర్వకంగా సమర్పించుకొన్నారు. శ్రీ మహాలక్ష్మీదేవిని విష్ణువుకిచ్చి కల్యాణం చేశారు. చివరికి ధన్వంతరి దేవుడు అమృత కలశంతో బయటకు వచ్చాడు. అందులో నున్న అమృతాన్ని దేవతలకు దక్కనీయకుండా రాక్షసులు లాక్కొన్నారు. అప్పుడు మరలా దేవతలు సహాయం చేయమని ప్రార్థించగా శ్రీమహావిష్ణువు జగన్మోహిని అవతారమెత్తి అసురుల మధ్య సాక్షాత్కరించాడు. ఆ సౌందర్యరాశిని చూచి రాక్షసులంతా వైష్ణవమాయలోబడి తమకు పంచమని అమృత కలశాన్ని మోహినికి అందించారు. అప్పుడాయన దేవాసురుల రెండు పంక్తులుగా కూర్చుండబెట్టి మొదటి బంతిలోని దేవతలకే అంతా పంచ సాగాడు. అది

గ్రహించి రాహుకేతువులనే రాక్షసులు రహస్యంగాదేవతల బంతిలోకి వచ్చికూర్చున్నారు. వారిద్దరికి కూడా అమృత మందింది. సూర్యచంద్రులీ దృశ్యం గ్రహించి, వారు రాక్షసులని విష్ణువుకు సైగచేశారు. వేంటనే ఆయన వారిని తన చక్రధారల కెరజేశాడు. అయితే అమృతసేవన ఫలితంగా, వారిద్దరు తల మొండెంగా బ్రతికి తమరహస్యం వెళ్ళడించిన సూర్యచంద్రులపై ప్రతి సంవత్సరం సూర్యచంద్రులను గ్రహణాల రూపంలో ఇప్పుటికి బాధిస్తుంటారంటారు. ఈ విధంగా కూర్మావతార వర్ణన సంగ్రహంగా అగ్ని పురాణంలోనున్నది.

ఇక రామాణంలోని కొన్ని ఘట్టాలిలా వర్ణింపబడ్డాయి. వాలి వధతర్వాత కిష్కింధాధిపతియైన సుగ్రీవుడు తారతో భోగలాలసుడై సీతాన్వేషణ విషయంలో తగినంత శ్రద్ధచూపలేదు. ఏరుదాటాక తెప్పగాల్చినట్లు చేసిన మేలుమరిచి నిర్లక్ష్యం చేశాడు. అప్పుడు సీత విరహంతో వేగుచున్న శాంతమూర్తియైన రాముడు సైతం సుగ్రీవుని చర్యకు ఆగ్రహోదగ్రుడై కండ్లెర్రచేశాడు. తమ్ముడైన లక్ష్మణుని ద్వారా సుగ్రీవునికిలా ఒక సందేశం పంపాడు.

"శ్లో॥ నచ సంకుచిత పంథా, యేన వాలీహతోగతః।
సమయేతిష్ఠ సుగ్రీవ। మావాలి పథమన్నగా!!"

"సుగ్రీవా। చెడుదారిపట్టి వాలి మరణించాడు. అలాంటి తప్పుడు దారిలో నీవు నడవకు। అన్నమాట మేరకు సీతాన్వేషణ విషయంలో దృష్టిసారించు. అలా చేయకపోతే వాలికి పట్టిన దుర్గతియే నీకు కూడా పట్టుతుందని" భావం. దీన్ని సందేశమనేకంటే తుది హెచ్చరిక అంటే సమంజసంగా ఉంటుందేమో!

రామాయణంలోని మరొక సంఘటన యిలా వర్ణింపబడింది.

సీతనెత్తుకు రమ్మని రావణుడు మామయైన మారీచుని మనోభిప్రాయమెంత ఆర్ద్రంగా సాలోచనంగానుందో ఈ శ్లోకం చెబుతుంది.

"శ్లో॥ రావణాదపి మర్తవ్యం మర్తవ్యం రాఘవాదపి!
అవశ్యం యదిమమర్తవ్యం, వరం రామాన్న రావణాత్!!"

సీతనెత్తుకొని రాకపోతే రాజాజ్ఞ పాటించక పోవడమౌతుంది. దీనిని సహించపక రావణుడు చంపేస్తాడు. సరే! అతని ఆజ్ఞ పాటించి సీత జోలికి పోతే శ్రీ రాముని చేత మరణం తప్పదు. 'వెనుక గొయ్యి- ముందునుయ్యి' సామెతగా మరణం మాత్రం తప్పదు. అటువంటప్పుడు దుర్మార్గుడైన, రావణుని చేత మరణించే కంటే శ్రీరామబాణాగ్ని మరణించి, పుణ్యలోకప్రాప్తి పొందుట యుక్తం.

రామాయణంలో ఇంకో సన్నివేశమిలా వర్ణిపబడింది. లంకలో రామ రావణ యుద్ధరంగాన రావణుని సైన్యమంతా మట్టి గరుస్తోంది. మహాయోధానుయోధులంతా మరణించారు. ఈ ప్రపంచంతోనే సంబంధం పెట్టుకొక ఆరునెలల తిండి తిని, ఆరునెలల నిద్రాముద్రితుడై యుండే కుంభకర్ణున్ని, మధ్యలోనే నిద్రనుండి, ఆపద్ధర్మంగా మేల్కొల్పవలసిన పరిస్థితి వచ్చింది. ఈటెలతో భటులు పొడిచి, భేరీధ్వనులతో ఏనుగు ఘీంకారాలతో అతి కష్టంతో మేల్కొల్పగా, అతి కష్టంతో నిద్రనుండి మేల్కొన్నాడు. యుద్ధవార్తలు తెలిసికొన్నాడు. యుద్ధకారణం తెలిసికొన్నాడు. రావణుడు పరస్త్రీ వ్యామోహంతో సీతాపహరణం చేయడమని అతనికర్థమైంది. అపుడు అన్నయైన రావణాసురునితో నిలాఅంటాడు.

"శ్లో॥ సీతా యాపహరణం పాపం, కృతం త్వంహి గురుర్వతః!
అతోగచ్ఛామి యుద్ధాయ, రామం హన్మి న సంశయః!!"

"అన్నయ్యా! సీత నపహరించి తెచ్చి పాపకృత్యం చేశావు. నీవు చేసింది పూర్తిగా తప్పే! అయినా నీవు జ్యేష్టుడౌట నాకు సంబంధ రీత్యా పూజనీయుడవు. కనుక తప్పకుండా యుద్ధమొనరింప వెళ్తా. రావణుని సంహరిస్తా"నని దీని భావం. ఎంత మహోన్నతులైన తపస్సంపన్నులైనా సరే అక్రమాలకు పాల్పడరాదని కుంభకర్ణుని సలహాద్వారా అగ్ని పురాణం హితువు ఉపదేశిస్తోంది. ఈ విధంగా అయిదవ అధ్యాయం మొదలుకొని పదకొండవ అధ్యాయం వరకు శ్రీమద్రామాయణ వర్ణన నుండి పండ్రెండు, పదమూడు, పదునాల్గవ అధ్యాయాల్లో మహాభారత సన్నివేశాల వర్ణన అగ్ని పురాణంలో సాక్షత్కరిస్తాయి.

మహాభారత కురుక్షేత్ర సంగ్రామంలో పాల్గొన్న యోధానుయోధులు, అతిరథ మహావీరులందరు నేలకొరిగి వీరమరణం పొందారు. చివరికి దుర్యోధన పక్షాన, అశ్వత్థామ, కృతవర్మ, కృపాచార్యుడు ముగ్గురు మాత్రమే మిగిలారు, పాండవుల పక్షంలో, కేవలం పంచ పాండవులైదుగుదురు, శ్రీకృష్ణుడు మొత్తం ఏడుగురు మాత్రమే బ్రతికి బట్టగట్ట గలిగారని అగ్ని పురాణ మిట్లు చెప్తున్నది.

శ్లో॥ "కృతవర్మ, కృపో ద్రౌణి, స్త్రయోముక్తాస్తతో రణాత్!
పాండవాః సాత్యకిః కృష్ణః స్సప్త ముక్తాన చాపరే!!"

దుర్యోధన వర్గానికి చెందిన కృతవర్మ, కృపాచార్యుడును అశ్వత్థామ అనే ముగ్గురును, పాండవ పక్షానికి చెందిన వీరుల్లో పాండవులు, కృష్ణుడు సాత్యకి, ఏడుగురు మాత్రమే మిగలారు. రెండు పక్షాలను సంబంధించి మొత్తం పదిమంది మాత్రము మిగిలారు. ఇక భగవంతుడంటే ఎవరు? అనే ప్రశ్నకు సమాధానం అగ్ని పురాణంలో నిలా తెల్పబడింది.

శ్లో॥ "ఉత్పత్తి ప్రళయం చైవ, భూతానామాగతింగతిమ్!
వేత్తి వాద్యామవిద్యాంచ, సవాచ్యోభగవానితి!!"
సృష్టి, స్థితి, నాశనం, ప్రాణుల జీవన్మరణాలు, విద్య, అవిద్యల, నెఱిగిన వాడే భగవంతుడని భావం.

దేవాలయాల నిర్మాణం పవిత్ర కార్యం; మనస్సులో కనీసం ఆ సంకల్పం కల్గినా, శత జన్మ కృత పాపాలు భస్మీ పటలమౌతాయి. దేవాలయ నిర్మాతలు, తమ యిష్టాభీష్ట పుణ్యలోకాలు పొందుతారు. బ్రహ్మహత్యాది మహాపాతకాలు దోషదూరీకృతమౌతాయి. సకల పుణ్యతీర్థ క్షేత్ర దర్శన స్నానాది పుణ్య ప్రాప్తి కల్గుతుంది. ఈ విధంగా దేవాలయం నిర్మాణ పుణ్యకార్యాన్ని ప్రేరేపిస్తుందీ పురాణం. అగ్ని పురాణం పెద్దగా కథలకు చోటవ్వలేదు. కానియీ జగస్సృష్టిలోని వివిధ విద్యలు, వేదాంతం పదార్థాల లక్షణాలు వాటి పరీక్షా విధానాలు స్వప్న, శకునాలకు సంబంధించిన ఫలితాలు మొ॥ న విషయాలన్నీ దర్శనమిస్తాయి. శుభస్వప్నాలు, అశుభ స్వప్నాలని స్వప్నాలు రెండు విధాలని చెప్పబడ్డాయి.

| **స్వప్న కాలం** | **ఫలించే సమయం** |
|---|---|
| 1) తొలిజాము | ఒక సంవత్సరం లోపు ఫలిస్తుంది. |
| 2) రెండవజాము | ఆరునెలల్లో ఫలిస్తుంది. |
| 3) మూడవ జాము | మూడుమాసాలల్లో ఫలిస్తుంది. |
| 4) నాల్గవ జాము | పక్షం రోజుల(15దినాల) లోపు ఫలిస్తుంది. |

## 1. అశుభ స్వప్నాలు:-

గుండు చేయించుకొనడం, దిగంబరంగా ఉండి తిరగడం కుళ్ళిన మాసిన దుస్తుల్ని ధరించడం, సర్పాన్ని చంపడం, పంది, కుక్క, గాడిద,

ఒంటెల నెక్కడం, పక్షి మాంస మారగించడం, తల్లి గర్భంలో ప్రవేశించడం చితాగ్ని ప్రవేశం, దేవతలు, రాజు గురువు- వీరి కోపాగ్నికి గురిగావడం, నదిలో పడికొట్టుకొని పోవడం, వేడినీళ్ళ స్నానం, వాంతులు, విరోచనాలు కావడం, దక్షిణ దిశప్రయాణం గృహపతనం, పిశాచాల వికృత క్రీడ, ఓటమి, కాషాయ వస్త్ర ధారణ మొ॥నవి.

## ౨) శుభ స్వప్నాలు:-

కొండ, మేడ, ఏనుగు, గుఱ్ఱం పైకి ఎక్కినట్లును. తెల్లని పూలు అగుపడడం, శ్వేత వస్త్రధారణ, శత్రు నాశనం, వాదం, జూదం రణాల్లో విజయం, క్షీరపానం, దేవ తలు, రాజు, గురువు మొ॥వారు తన్ను ప్రశంసించడం రాజ పట్టాభిషేక దర్శనం మొ॥ నవి శుభస్వప్నాలు. స్వప్నం చివరిలో రాజు - ఏనుగు- గుఱ్ఱం, బంగారు, ఆవు, ఎద్దు మొ॥ నవి. అగుపిస్తే కుటుంబవృద్ధి. ఈ కారణంగా నాల్గవ జాము (తెల్లవారు) నందు ఇలాంటి స్వప్నాలను చూచినప్పుడు వెంటనే నిద్ర నుండి లేవాలి. మళ్ళీ నిద్రిస్తే ఆ స్వప్నం ఫలించదట. ఇటువంటి చక్కని వశేష విషయాలీ అగ్ని పురాణంలో వర్ణింబడియున్నాయి. కనుకనే

శ్లో॥ "ఆగ్నేయం పఠితంధ్యాతం, శుభం స్యాద్భుక్తి ముక్తితదమ్!

ఈ అగ్ని పురాణాన్ని శ్రద్ధా భక్తులతో చదివినను, స్మరించినా, విన్నా, భుక్తి, ముక్తులు లభిస్తాయి.

పూర్వకాలము నందు బ్రహ్మ కోరికపై శివుడు కొంత మంది దేవతా కన్యలకు 'అగ్నిపురాణము' చెప్పనారంభించెను- ఒకానొక సమయములో నేను బదరికాశ్రమమునకు వెళ్ళితిని. అప్పుట పరమనియమంతోజి వేశ్వర

మహాముని తపమాచరించుచుండెను. నా రాక చూచి యాముని యిట్లు ప్రశ్నించెను. "సాంబశివా! నీవెందులకిక్కడకు వచ్చినావు ? జనశూన్య ప్రదేశముగా నీవెరుగవు గాబోలు. ఇట్టి ప్రదేశమునకు నీవు వచ్చితివనిన ఆశ్చర్యముగా నున్న"దనెను.

అ మునీంద్రుని చూచి నేనిట్లన్నాను 'ఓ మునివర్యా! నా రాక కారణము వినుము. నిన్ను బ్రహ్మదేవుడగ్ని పూజా విధానము గురించి చెప్పమని కోరెను. నాకది తెలియక మనోభ్రమణము గల్గి యిట్లు తిరుగుచు ఈస్థలమునకువచ్చినాను. నీవు నాయందుగల భక్తితో నాకా యగ్ని పూజాక్రమము విన్పించ'మని కోరెను. అ మాటవిని జీవేశ్వరయోగి శివునితో నిట్లనెను. "శంకరా! అగ్నిదేవుని జన్మ వృత్తాంతము విన్నవారికినరకబాధలు, యమలోక దర్శనముగల్గవు –కాన –శ్రద్ధాభక్తులతో విను'మని యిట్లు విన్పించెను. "లోకములోనగ్ని యైదువిధములుగా నున్నది. సముద్రములో నున్న దానిని బడబాగ్నియందురు. జంతుజాలపు గర్భములోనున్న యగ్నిని జఠరాగ్నియందురు అదియేజీవులు తినుపదార్థములను జీర్ణము చేయును. కట్టె కట్టె రాచు కొనగా పుట్టిన –యగ్నిని కాష్టాగ్ని యం దురు అదియే దావానలమనికూడ చెప్పదురు. వజ్రముల రాపిడితొ వచ్చు యగ్నిని వజ్రాగ్ని యందురు. ఇంద్రుని వ జ్రాయుధము కద పిన యెంతటి దానినైన దహించును. తరువాత మహాగ్ని గోళము. సూర్యతేజము. సూర్యుడు మహాగ్ని గోళము. అందుచే నాతని కిరణములు సోకిన వేడిమి పుట్టును గదా!

సముద్రములోనుండు మహాగ్ని బడబాగ్ని యంటినిగదా. ఈబడ బాగ్ననే కొందరు బ్రహ్మాగ్నియని కూడా యందురు. ఈ బ్రహ్మాగ్ని సంబంధమగు మ ంత్రమును మూడు లక్షలు జపించిన వారికి బ్రహ్మలోక నివాసము గల్గును. ఆ మంత్రమునకు జపము, దానికి హోమము, తరు

వాత తర్పణము, బ్రాహ్మణభోజన క్రమము జరుపుచుండ వలెను. బ్రాహ్మణ భోజన క్రమము జరుపుచుండ వలెను. అట్లుచేసి మంత్రసిద్ధి పొందిన వారు సత్యలోకములో నిత్యనివాసముందురు. సూర్యాది దివాగ్నిమంత్రమును యధావిధిజరిపించి- హోమ, తర్పణ, భోజనాదులు గావించువారికి సమస్త-పాపములు నశించగలవు. వారికి శరీరమున సూర్యసమాన తేజో వికాసము కల్గును. దూర దృష్టి గల్గినవారై త్రికాలవిషయము లెరిగినవార గుదురనెను. తరువాత, జఠరాగ్ని విషయము వినుము. మంత్రజపాదులతోమనము తిను పదార్థములు బాగుగా జీర్ణమగును. అట్టివారారోగ్యముతో నుండిచిరకాలము జీవించగలరు. ఆహితాగ్ని మంత్రసిద్ధివలన వాగ్బలము గల్గి తిరుగు లేనిరీతిగా మాటలాడగలరు.

ఇంక వజ్రాగ్ని మంత్రములను జపించివారి శరీరములు వజ్రసదృశ్యములై యుండగలవు. వారినేయాయుధములు, మహాస్త్రములు బాధంచనేరవు. దవానలవమబడు కాష్ఠాగ్ని జపించి సిద్ధిపొందిన వారికి నిప్పువలన కాల్పులు గాని పుండ్లుగాని మంటలుగాని - ఎట్టిబాధలు గానిరావు. అట్టియుపాసనాపరులకు వాగ్బలము విశేషముగా నుండును. పూర్వము వారంద రుపాసనా పరులగుటకు ముఖ్యకారణము మనము గ్రహించవలయును. మానిసిక నిగ్రహమువలన నాత్మబలము పెరిగి వారి హృదయ స్థిరత్వముపెంచును. దానినే దైవబలమందురు. దైవబలమున్న వారు వశ్యముగల వాక్కుగలవారగుదురు. వశ్యవాక్కు గల వాడగును వశ్య వాక్కనగా వినుము. ఎవరు ప్రేమతో గాని, కోపముతో గాని దీవించినను, నిందించినను శపించినను యామాటప్రకారము జరుగుటయే వశ్యవాక్కుఅనబడును, అతనివాక్కున కంఠబలము వచ్చుటకు కారణము మంత్రసిద్ధియేనని వేరుగ ననవలెనా? ప్రజలకు ననగా నార్తులకు, పేదలకు యాతనలయం దున్నవారికిసహాయపడునది వశ్యవాక్కేయని యెరుగుము.

# అగ్నిదేవుని జననము

శ్రీనివాసుడువైకంఠనగరమున నొకసారి మహాసభ గావించెను. ఆసభకు బ్రహ్మ మహేశ్వరుడు ఇంద్రాదిక్పాలురు సమస్త దేవసంఘములు వచ్చిరి. ఆ మహాసభపెక్కుమంది దేవతలు నాట్యములు చేయుచుసభలోని వారల కందర కానందము గల్గించుచు మోహపరచుచుండిరి. ఈయుప్సరలు జలమునుండి జన్మించిరి. కావున నే వీరికింత సౌందర్యాతిశయము గల్గిశోభించు చున్నారని బ్రహ్మదేవుడానందపడి చూచుచుండెను.వారిని చూచినకొలదీ యతానిమోహము యెక్కువైనది. అతని తేజము వారి రూపవిభ్రములకు.లొంగిపోయి మోహపడగా వీర్యస్కలనమయ్యెను. అతడా సభలో దాని నావలపారవేయ వీలులేక వస్త్రమునందే ఇమిడ్చి,యాబట్టను సభాంతమున క్షీరసాగరమున విసరి వైచెను. దానినుండి యొక బాలుడుద్భవించెను. ఆబాలుడు పుట్టిన వెంటనే లేచివచ్చిబ్రహ్మదేవుని తొడపై గూర్చుండెను.

జలాధి దేవత –సముద్రప్రభువు వరుణుడు ఆకుమారుడు తన జలములలో జన్మించినాడు గాన, తన కుమారునిగా భావించి బ్రహ్మతొడపై నున్నవాని నీవలకు బడలాగెను. బాలుడా బ్రహ్మను వదలజాలకుండెను . వానిని తన వెంట గొనిపోవ వరుణుడు సమీపించ రాగా, బ్రహ్మవానిని త్రోసి వేసెను.వరుణుడు మూర్ఛిల్లెను. తరువాత లేచి సభవారిని జూచి యిట్లనెను. "ఈ బాలుడు నాజలములలో బుట్టినవాడు గాన , నాకుమారుడే గాని బ్రహ్మ–కుమారుడు గాడు , నన్ను త్రోసివుచ్చి బ్రహ్మ యీబాలుని చేపట్టుట యిదేమీ న్యాయము ? మీరు సభలోని పెద్దలు గాన ధర్మ నిర్ణయము చేయుడని" వేడెను. బ్రహ్మవారలను జాచి"నన్నువదలి పెట్టని బాలుని

నేనెట్లు వద్దందును? నేను బాలుని విడువ" ననెను. ఈ వివాదము నారాయణుడు విన్నాడు విని ఈసభలో బ్రహ్మకు వీర్యస్ఖలనమైనది. ఆ వీర్యముచే జన్మించిన వాడీ బాలుడు. బ్రహ్మయే తన వీర్యమును క్షీరసముద్రమున బడవైచెను వాని వలననే బాలుడు జన్మించెను. కావున వీర్యము బ్రహ్మకు సంబంధించినది, క్షేత్రము జలములకు సంబంధించిన వరుణుడు ఉపనయనాది సంస్కారములు గావించును. వరుణుని పుత్రునిగా పేరొందగలడు. ఈతనికి దహనశక్తి యుండును. జలములద్దానిని చల్లబరచగల" వని విష్ణుండాన తిచ్చి సమన్వయపరచెను.

# వాయునందనుని వృత్తాంతము

క్రమముగా నగ్ని పెరిగి పెద్దవాడయ్యెను. దిక్పాలకత్వము పొందెను ఇంద్రసభలోనికి తరచు వచ్చుచు పోవుచుండెను. ఇట్లుండగా రంభాయూర్వశుల నాట్యములు చూచుచుండగా నింద్రియస్ఖలనమైనది అందుండి సువర్ణము పుట్టినది. సువర్ణమింద్రయముగా గలవాడు గాన నగ్నికి హిరణ్యరేతసను నామము సార్థకమైనదని మునీంద్రులతో చెప్పగా విని వారానందపడి "సూతమునీంద్రా! ఎన్నోపురాణములూ వాటి యందలి మహామహిమలుగల చరిత్రములు వినిపించితివి. హనుమంతుడీశ్వరాంశ సంభూతుడందురు. దాని విషయము మేమెరుగునట్లు వివరించ గోరెదమని యడుగగా నిట్లారంభించెను. "మునీంద్రులారా! రమ్యక వనమను దేవతా వనము కలదు. అందులో నానావిధజంతుజాలము సంచరించుచుండును ఒకనాడు సింహమిధునము దాంపత్యసుఖమనుభవించుచుండగా శివుడు చూచి తేజమును జార్చెను. దానిని వాయుదేవుడు జాగ్రత్తపరచి యొక వస్త్రపుటములో నుంచెను.

పిమ్మట నాప్రాంతములో తపమాచరించు అంజనీయను తపస్వికి నిత్యమాహార మాతడిచ్చుచుండెడివాడు. ఆమె యాతడిచ్చిన పదార్థములు మ్రింగి తన యాకలి తీర్చుకొనుచుండెడిది. ఆ సమయములో నీశ్వరుని యింద్రియమును గూడ ఫలరూపముగా నామెకందీయగా నామెగర్భములో కుమారరూపుము దాల్చుచుండెను. లోన కుమారరూపుడు తల్లితో మాట్లాడసాగెను. ఆమె యాగర్భభారముసహించలేక వెంటనే యావలకు రమ్మని చెప్పినది. ఆ కుమారుడు దిగంబరత్వముతో నీవలకు రాజాలననెను. వేంటనే యామెశివునారాధించి శివకవచ మాతని కందించెను. వజ్రకచముతో శిశు వంజనాదేవి గర్భమునుండి వెలుపలకువచ్చెను.

ఆశిశువు పుట్టిన వెంటనే ఆకలి బాధ సహించలేక"అమ్మా! నా కాకలి యగుచున్నది. ఏదైన తినుట కిమ్మ"నెను."ఆమె యేమియిత్తునా?" యని సందేహపడి యిటునటు చూచుచుండ, ఇంతలో నాశిశువు ఉదయించు చున్న సూర్యమండలమును చూచి, యది యొక ఫలముగా భ్రమించెను. వెంటనే పైకెగసి యాఫలము నందుకొన బోవగా సూర్యకిరణ తీవ్రతను సహించలేక పోవుటయు – ఇంద్రుడీతడెవడో రాక్షసుడు సూర్యుని మ్రింగ జూచుచున్నాడని వజ్రాయుధముతో చెంపపైగొట్టుటతో – ఆ బాలుడు మూర్ఛ బడియుండ, వాయుదేవుడు ఆతని నెత్తుకొని యొక గుహలో నుంచి తాను కూడ నందుండెను. అతటిట్లుండుటచే ప్రపంచ మంతయు వాయుసంచారము లేక నట్టుడికి పోవుచుండెను, వాయుదేవు డెక్కడుండెనో తెలియరాకుండుటచే దేవగణమింద్రాదులతో బ్రహ్మకడకేగి తమ దీనావస్థను వివరించిరి. బ్రహ్మదేవుడు చూచి "తనపుత్రునింద్రుడు కొట్టినాడని కోపంతో నాతడు రహస్యముగా నున్నాడు. మనమందర మాతని కడకు వెళ్ళి, వాని పుత్రుని బ్రతికించి, వరదానములు చేసిన మనకు

వాయువు ప్రసన్నుడగు" ననెను. వెంటనే బ్రహ్మసలహా ననుసరించి, వారందరు వాయువున్న గుహకడకు పోయి వాయువును స్తవములు గావించిరి.

బ్రహ్మదేవుడు వాయువును చూచి' ఓ వాయుదేవుడా, లోకములను బాధించుట తగునా? నీవు , యిట్లురహస్యముగా నుండి వాయువును భేధించిన ప్రజలేమగుదురు? నీవులోకోపకారము గావించుమనెను. వాయువువిని –"లోకములన్నియు నాకుమారునికన్న ఘనమా? ఈ యింద్రుడు నా బాలుని దవడమీదకొట్టెను, దవడ లోతునకు పోయినది. నాపుత్రుని విడచి మీ కొరకు నేనురాజాల" నన్నాడు. వారందరూ బ్రతిమాలి నీ కుమారునకు వచ్చిన ప్రమాదములేదు. మేమందరము వరము లిచ్చుచున్నాము. నీపుత్రుడు ఎవరివలనను యేయాయుధమువలనను బాధనొందడు. మరణము పొందడు చిరంజీవియై యుండగలడు. మేముగానీ, మాసంబధమగునే యాయుధములుగాని నీకుమారుని కపకృతిచేయులేము. ఇదిగో నీకుమారుడులేచునని, బ్రహ్మతన కమండలోదకమును వానిపైజల్లెను.

అతడు కాళ్ళు నిగిడించుచులేచి, యెదుటనున్న బ్రహ్మ నొకతన్ను తన్నెను. బ్రహ్మదేవుడు వాని నేమియు చేయలేక"నాయస్త్రమునకు వైదుగడియల కాలము మాత్రము వీడు కట్టుబడగలడు. అది వీని కుపయోగించు శాప "మని చెప్పి, హనుమంతుని దీవించి వారు వెడలిరి. హనుమంతుడు పూర్వము కన్న బలవంతుడు తేజోవంతుడునై తిరుగలేని పరాక్రమముతో సంచరించుచుండెను.

## అంజనకు అహల్యశాపం

అంతా విన్న ఋషులు "సూతా శివతేజోసముద్భవుడైన మారుతికి

కోతి రూపం యెందువల్ల కలిగింది?" అని అడిగారు. అది అంజనాదేవికి అహల్యయిచ్చిన శాపఫలం . ఆ కథ చెబుతాను వినండి అని మొదలెట్టాడు సూతుడు. గౌతమని యింట లేని సమయములో సూర్యేంద్రులు అహల్య యెరుగకుండానే యామెను పొందగా యామె కిద్దరు కుమారులు పుట్టిరి. గౌతమ మునీంద్రుల వలన యంజన జన్మించినది. ఒకనాడు గౌతముడు ఆకుమారులను భుజముపై గూర్చుండబెట్టుకొని యంజనను నడిపించుచు ఎండలో దూరవము సాగుచుండెను. గతములో నింద్రునిచర్య నంజన యెరిగినది. అహల్యయందుచే నంజనయందు ప్రత్యేకద్వేషముతో సంచరించుచుండెను. ఆమె యా విషయము యెప్పుడు బయుటపెట్టునో, అప్పుడు తన కాపురము చెడునను సందేహముతో, నుండసాగినది. ఇట్లుండ గౌతముడు వారిని మోయుటయు తన్ను నడిపించుయు జూచి, ఆ యంజన గౌతమునితో "తండ్రీ! అన్యబీజ జాతులైన కువూరులను ఎత్తుకొని నడచుచు, నీకుమార్తెను నన్ను నడిపించెదవా!" యని ధిక్కరించెను.

అది విని గౌతముడు –వారిని జలాశయం చెంతకు గొని పోయి వీరు నా యౌరసపుత్రులైన యీదుకొనివత్తురు, కారేని కోతులై పోదురని నీటిలోనికి గిరాటు వేసెను. వారు కపివీరులై యాగంగను దాటిపోయిరి. వారు వాలీ సుగ్రీవులైరి. తన కుమారులను యేటినీటిలో బడవేయించి కోతులుగా చేసిన యంజనను చూచి యహల్య 'నీకు కోతిమెగమువాడు కొడుకుగా పుట్టగలడని' శపించెను. గౌతముడు విని ఆగ్రహించి, తన ఇల్లాలిని పాషాణమై యుండుమని శపించెను. ఆమె శిలా రూపమై పోయింది. ఆ అంజనా గర్భము ననే హరిమర్కట మర్కటునిగా శ్రీ ఆంజనేయుడు అవతరించి, తరువాత కిష్కింధానగరమునకు జేరి, వాలి సుగ్రీవునితో నెక్కువ దోస్తిగల్గి, అతని వంంత్రిగా వారి ఎక్కువ సన్నిహితుడై సంచరించుచుండెను.

ఇట్లుండగా త్రేతాయుగములో రావణాది దుర్మార్గులు పెరిగి భూలోకములో సంచరించి దేవలోకములను జయించుచు దిక్పాలురను నానాహింసలు పెట్టుచుండుటచే వారు భరింపలేక శ్రీహరిని దర్శించి తమ బాధలు వివరించిరి. అతడు వారి బాధలు విని, "నేను భూలోకమున జన్మించి దుష్టశిక్షణము గావించెదను, మీరు పొండని" సాగనంపెను.

తరువాత శ్రీహరి, సంతానములేక పుత్రకామేష్టిచేయుచున్న, దశరథ మహారాజునకు పుత్రుడై పుట్టుటకు యజ్ఞపాయసము దశరథున కిప్పించెను. అతడు తన భార్యల కాపాయసము పంచియిచ్చెను. పెద్ద భార్య కౌసల్యకు రాముడను పేరుతో శ్రీహరి జన్మించెను. తరువాత విశ్వామిత్రుని యాగసంరక్షణ గావించి, యహల్యశాపము విమోచనము చేసెను. విశ్వామిత్రుడు తనతో వచ్చిన రామలక్ష్మణులను జనక రాజపురికి గొనిపోయెను. అక్కడకు వచ్చిన రాజకుమారులు శివధనుస్సు నెత్తలేక పోయిరి. గురువగు విశ్వామిత్రుననుమతితో రాముడు లేచి శివధనస్సు నెత్తిచెఱకుగడ విరచినట్లు విరచివైచెను. సీతను రాముడు వివాహమాడి, అయోధ్యకు పోవుదారిలో పరశురామునికి గర్వభంగము గావించెను.

తరువాత, తండ్రి ఆజ్ఞ ప్రకారము రాముడు సీతాలక్ష్మణులతో నరణ్యావాసము చేయబోయెను. భరతుడు రాముని పాదుకలనుగొని సింహాసనము పైనుంచి రాజ్యపాలనము చేయుచుండెను. శ్రీరాముడు పంచవటి సమీపమున పర్ణశాల నిర్మించుకొని యున్నకాలములో రావణుని చెల్లెలు శూర్పణఖ, లక్ష్మణునివలన పరాభవ మంది, ఖరదూషణాదులను రాఘవునిపైకి పంప రాముడు వారిని వధింపగా, దిక్కుతోచని ఆరక్కసి, తన కసి తీర్చుకొనుటకుగాను లంకకు వెళ్లి రావణునితో సీతాసౌందర్యము వర్ణించెను. మాయారూపముతో రావణుడు సీత నెత్తుకొని పోయెను. రామ

లక్ష్మణులు సీతాన్వేషణము చేయుచు పంపా సరోవరము రాగా దూరము నుండి సుగ్రీవుడు చూచి , తన యన్న పంపినవారుగా భావించి ఆరాతీసి రమ్మనగా శ్రీరాముడు హనుమంతుని వెంటవెళ్ళి సుగ్రీవునితో సఖ్యము గావించెను. తరువాత రాముడు వాలిని వధించెను. సీతాన్వేషణకు సుగ్రీవుడు వానరవీరులను పంపెను. హనుమదాదులు దక్షిణ దిశకు వెళ్లిరి.

హనుమంతుడు సముద్రము దాటి లంకను శోధించి, సీతకు రామముద్రికనిచ్చి, యామె శిరోమణి నానవాలు గైకొని, లంకను దహించి, సముద్రము దాటి, రామునికి సీతాక్షేమము నివేదించెను. తరువాత, రాముడు వానరసైన్యములతో లంక కు పోయి , రావణాదులను సంహరించి, హనుమదాదులతో పుష్పక విమానములో నయోధ్యకువచ్చి సింహాసనమెక్కెను. హనుమంతుడు శ్రీరామునికి మహాభక్తుడని చెప్పెను.

# కాలము -కాలమహిమ

ఈ విధంగా అగ్నిపురాణంలోని హనుమద్గాథను వివరించికాలాన్ని వర్ణించి అనంతరం లోకవ్యవహారాదుల్నిలా చెప్పసాగాడు –

లోకంలో ఎనుబదిలక్షల రకముల జీవరాసులున్నవి. ఒక్కొక్కరకమునకు కోటానుకోట్లు జీవములున్నవి. వీనిలో –గ్రుడ్ల నుండి వచ్చినవి, అండజములు యోనిజములు, వాయుజములు– మొదలగునవి పెక్కులు గలవు. అందుల జన్మించినజీవగణములు స్వల్పాయుర్దాయము గలయవిగా నుండును. చీమలు, దోమలు నల్లులు యితరసూక్ష్మ కీటకములివి యన్నియు స్వల్పకాలములో దేహములు వదలు నవియై యుండెను రాను రాను జన్మలు జరిగిపోగా క్రమముగా చతుష్పాదజీవులు సరీసృపములుగా మారుచుండెను.ఒక్క జీవియేతన

సుకృత దుష్కృత్య ఫలితములతో నానా జంతుజన్మలెత్తుచుండును, పాపమక్కువైన దుష్టజీవజన్మలు, పుణ్యము పాపము మిశ్రమ జన్మలు నెత్తుచు క్రమముగా పుణ్యవిశేషముచే యుత్తమ జన్మల లోనికి ప్రవేశించును. కర్మననుసరించి యాయా జన్మలు పొందుచు, తాము ధరించిన శరీరము ద్వారా సుఖదు:ఖములనుభవించుచు, జన్మాంతరముల నందుచుండును. వివిధ జన్మలనెత్తి మంచి యోగమున్న జీవులు సాధువర్తనముతో సంచరించుచు, యోగ్య జీవితము నడుపుకొని పుణ్యము సంచరించుచు, యోగ్యజీవితము నడుపుకొని పుణ్యము సంపాదించును. ఉదాహరణకు ఒక సర్పమున్నదనుకొనుడు సర్పము విషజంతువు. దానిని చూచిన భయపడుదురు. కాని, కొన్ని సర్పములు సాత్త్వికగమనముతో నపకారము చేయకుండుట కూడ ప్రజలెరుగుదురు గదా! సాత్త్విక మైన దానిని పూజింతురు. విషపూరితమైనదానిని శిక్షించెదరు.ఈ వ్యత్యాసము మనము గమనించ వలెను రెండును ఒకే శరీరము దాల్చినను గతజన్మసంస్కార వాసనలతో గుణము ప్రకటితమగును. అగుణము ననుసరించి జీతములో పుణ్య పాపముల కృత్యములుసాగు చుండును.

ఈ జీవితములో జీవధారులు పూర్వజన్మ వాసనతో నిచట నిలచి పనులు చేయుచుందురు. ఆపనులు పరోపకారములు- పరాపకారములని రెండు రకములు అందులో పరోపకారములు-పరాపకారములు రెండు ర కములు అందులో పరోపకారములలో కామ్యము, నిష్కామ్యములను భేదములు గలవు కామ్యకర్మలనగా- ప్రతిఫలాపేక్షతో యితరులకు చేయుపాయము, లేక, ఉపకారము. ఎదుట వారివలన మరల నెంతలాభము వచ్చును? ఎట్లుపకారముచూపి లాభమెంత సంపాదింతు నన్న కాంక్ష నుంచుకొని చేయు సహాయమునకు కామ్యకర్మమని పేరు. ఇంక

నిష్కామ్యములనగా నిట్లుండును ఎదుటవాడు పడుకష్టములకు - యితర బాధలకు మనస్సులో జాలి పుట్టగా, ప్రతిఫలము నపేక్షించకనే చేయు సహాయమునే నిష్కామ్య సహాయమందురు. ఇది పరమేశ్వర నకు ఇష్టమైన కార్యము. ఇట్టి బుద్ధి గల్గినవాడు తానుచేయు ప్రతి కర్మ పరమేశ్వరని ప్రీతికై చేయుచున్నానని, భావించి చేయును. ఇట్టి కర్మలు దైవ ప్రీతికరములు, ఉత్తమములు, పేదలకు, అనాథలకు, ఆర్తులకు, వికలాంగులకు, దిక్కులేని స్త్రీ గణములకు సహకరించుట, గో- భూసురరక్షణాది కృత్యములందు నిమగ్నమైన దయాహృదయులు త్యాగులనబడుదురు.

వారు స్వార్థము గోరని మహనీయులుగా చెప్పబడుదురు. దానము -ధర్మము మానవుని కృత్యములు; ఇంద్రియ నిగ్రహ మన్నిటికన్న ముఖ్యము చెడుపనులయందు బుద్ధిని జొరనీయక. దుష్టసహవాస దుర్జన ప్రోత్సాహ కృత్యములు విసర్జించుట, యింద్రియ నిగ్రహమందురు. పరమేశ్వర ప్రీతి కార్యము లాచరించుటయందు బుద్ధిని జొన్పినవాడు ప్రముఖుడు. ఈశ్వరబలము సంపాదించగలవాడు. వాడు సర్వపూజ్యుడై శోభించును వానిని ప్రపంచము మెచ్చును. దాన ధర్మముల విషయములు వివరింతును వినుడు. దానమనగా పాత్రతనెరిగి, సంకల్పముచేసి , దేశకాలాది పరిగణనలతో జలము వదిలి యిచ్చునది అట్టిదానము మున్న బలిచక్రవర్తి మొదలగువారు చేసినారు గదా!

ధర్మవిషయము వివరింతును. ధర్మమనగా పాత్రాపాత్ర విచక్షణ ధర్మవిషయము వివరించును. ధర్మముగా పాత్రాపాత్ర విచక్షణ యుండదు. ఎదుటి వ్యక్తియున్నయున్న స్థితిని గమనించి వాని కాపద గానున్న సమయములో తానడ్డపడి యాపదలు తప్పించుచు దాటించుట ధర్మమందురు. ధర్మశబ్దమునకు మూరర్థములు గలవు.వేదాదులు నేర్చి, యందుడు విధానము లెరిగి, యాపద్ధతి నడచుట యొకటి, తన శరీరము,

తనస్థిగతులు గ్రహించియుక్తమార్గమున నితరులకపకారము, లేకుండా నేర్పుగా, చేతనైన యుపకారము చేయుచు నడుచుట-రెండవది . ఇక మూడవది-తాను ధరించిన శరీరము మితమగు నాయువుతో నెప్పడువలుట మితమగ నాయువుతో నెప్పడోయొకప్పుడు వదలుట తథ్యమని యెరిగి, యా జీవిత కాలములో తాను నడువదగిన మార్గమెంచుకొనుట. అనగా-

శరీరము నున్న పరమాత్మతేజమును గుర్తించుటకు వీలుగా మనోనిగ్రహము పొందుట, సత్సాంగత్యము చేయుట యజ్ఞ -దాన - తపమును విడువకుండుట. భక్తి గ్రంథములు పారాయణచేయుట. ఈశ్వర భక్తిని బోధించుట. తానాచరించునదే యితరులాచరించవలెనని, కోరక -తాను తన కర్తృవ్యము లాచరించుట ఇవన్నియు మూడవ ధర్మముగా నిర్ణయింప బడినది. ధర్మవ్యాసంగమున పాటించకుండానే, మహాభక్తుడు- పూర్వజన్మ ఫలితముగా బాల్యముగానుండి భగవద్భక్తి పరుడై యీశ్వరార్పితబుద్ధితో - అహంకార మమకారములు వదలి కొనును. ఇదియే ముఖ్యభాగవతధర్మము.

కావున కాలమును గుర్తించి తన కుత్తమ మధ్య మాధమగతులు రాకుండా ముక్తిమార్గము నెరుగుటయే కాలమహిమ మని చెప్పి యామహాముని నలరించెను.

## అగ్నిపురాణము సమాప్తం



# 9. భవిష్య పురాణము

శ్లో॥ భవిష్యందక్షిణో జాను:

ఈ శ్లోకం ప్రకారం శ్రీ మహావిష్ణువు యొక్క కుడి మోకాలితో భవిష్య పురాణం పోల్చబడింది.

శ్లో॥ చతుర్దశ సహస్రాతు తథా పంచశతానిచ

అనగా ఈ పురాణంలో పదునాల్గు వేల, ఐదువందల శ్లోకాలున్నవి మొత్తం ఐదువందల ఎనుబదియైదు అధ్యాయాలు గలవు.

1. సృష్టి వర్ణన 2. పురాణోత్పత్తి క్రమం 3. షోడశ విధసంస్కారాలు 4. సావిత్రీ దేవి మాహాత్మ్యం 5. స్త్రీల శుభాశుభలక్షణాలు,6. ధర్మాలు 7. నానావిధాలైన వ్రతాలు, 8. పర్వదినాలు9. రథసప్తమీమాహాత్మ్యం, 10. సర్వ సమాయాలకు సూర్యుడే మూలమనే సిద్ధాంతం, 11. సాంబచరిత్ర 12. సూర్యదేవమాహాత్మ్యం,13. దేవతాప్రతిమ లక్షణాలు, 14. సూర్యపూజాఫలాలు 15. ధర్మస్వరూపం 16. వాస్తుపూజా విధానం. 1. పద్మావతి 2. వీరవర 3. కామాంగి, 4. త్రిలోక సుందరి 5.చంద్రావళి 6. జీమూతవాహనుడు, మొదలైనవారి కథలును శ్రీసత్యనారాయణ స్వామి వ్రత కల్పము-కథలు, 17.కల్క్యవతార వర్ణన, 18. అన్నదాన ప్రాశస్త్యం 19. సకలదానాల విధానం, 20. సదాచార ధర్మం మొదలైన అనేక విషయాలిందులో నున్నవి. 21. "సూర్యదేవర" వర్ణన ఈ భవిష్యపురాణంలో నున్నవి. సూర్యదేవర వర్ణన ఈ భవిష్య పురాణంలో నున్నంత విస్తరంగా మరేచోట లేదు.స్త్రీ ధర్మాలను తెల్పేసందర్భంలో ఒక శ్లోకమిలా వర్ణిస్తుంది.

శ్లో॥ భర్తృ చిత్తానుకూలత్వం, యాసాం శీలమచ్యుతమ్!
తాసాం రత్న సువర్ణాధి: భార ఏవ నమండనమ్!

ఏ స్త్రీ యైతే భర్త మనోగతాను సారం బాగా అవగాహన చేసికొని సదానుకూలవతియై ప్రవర్తిస్తుందో, అట్టి స్త్రీయే ఉత్తమ వనిత. ఆ యొక్క సుగుణమే ఆమెకు ఆశాభరణం! అంతే గాని బంగారురత్న భూషణాదులామెకు ఆభరణాలు కావు.

శ్లో॥ తస్మా త్సర్వాస్వవస్థాసు, మనోవాక్కాయ కర్మభి:
ప్రియా సమాచరేన్నిత్యం, తచ్చిత్తానువిధాయినీ!!

కనుక అన్ని పరిస్థితుల్లోనూ కాయా, వాచా, మనసా భర్తకు అనుకూలంగా నడిచి మంచిని చేకూర్చాలని భావం. ఇలాగే భార్య పట్ల భర్త ఎలా నడుచుకోవాలో గూడా తెల్పింది. అందుకోసం ఈపురాణంలో ఒక్క అధ్యాయమే పూర్తిగా చెప్పబడింది.

శ్లో॥ జాయాత్వర్థం శరీరస్య, నృణాం ధర్మాది సాధనే!
నా తస్తాసు వృధాంకంచిత్, ప్రతికూలం సమాచరేత్!!

ఏ పురుషుడైనా, ధర్మార్థ కామాల్ని, సాధించాలంటే అర్ధాంగిగా భార్య పాత్ర ఎంతో శ్లాఘనీయమైనదిగా నుండి ఈ యథార్థాన్ని గ్రహించి, ఆమె సదాశయాలకు అనుకూలంగా నడుచుకుంటుండాలి. మరియు ఆమెనే విధంగా బాధించరాదు.

ఈ విధంగా భార్యాభర్త సరస్పరావహనతో మెలగాలి. భిన్నాభిప్రాయాల గౌరవించి ఏకాభిప్రాయానికి రావాలి. తద్వారా జీవిత నౌకను సుఖంగా సాగించాలని ఈ భవిష్య పురాణము ఉపదేశిస్తుంది.

సూర్య దేవ పూజాఫల వర్ణన సందర్భంలోనిలా చెప్పబడింది.

శ్లో॥ "రాజాచోరాగ్రహ. సర్పా దారిద్ర్యం దుఃఖ సంపద !!
నైతే పీడయితుం శక్తా: ప్రసన్నే భాస్కరే ప్రతి!!"

ప్రత్యక్షదైవమైన శ్రీసూర్యభగవానుని సంపూర్ణాను గ్రహం కల్గిన వారికి -రాజభయం, చోర భయం, గ్రహపీడ, సర్పభయం, దారిద్ర్యం, దుఃఖపరంపర మొ॥ ఏ విధమైనచింతలుండవని భావము.

సమాజంలో ఎన్నో రకాలైన వివాహాలు జరుగుతున్నాయి. కొన్ని సంసారాలు పచ్చగా నుంటే, మరికొన్నేమో మరీ కొన్ని దినాలలోనే కుప్పకూలి పోతున్నాయి. ఎందుకిలా జరుగుతున్నది? ఈ దుష్పరిస్థితిని ఎలా అరికట్టాలనే ప్రశ్నకు చక్కని సమాధానమిస్తోంది.

శ్లో ॥ "త్రివిధావివాహ సంబంధో, హీన తుల్యాదికై స్పహ!
తుల్యై స్పహసమస్తేషా, మితరే నీచ మధ్యమౌ!
శ్లో॥ అసమైర్నింద్యతే సద్భి: ఉత్తమై పరిభూతయే!
తుల్యై: ప్రశస్యతే యు స్మా త్తస్మాత్సాదుత మోమత:!!
శ్లో॥ తస్మాద్వివాహ సంబంధం, సఖ్యమే కాంత కారిణామ్!
సదృశైరేవ కుర్వీతనోత్తమేవవృత్తమై:"

తమకంటే తక్కువ స్థాయిలో నున్న వారితో ఎక్కువ, సమాన స్థాయి భేదాల బట్టి వివాహ సంబంధాలు మూడు విధాలు. హీన స్థాయి వారితో సరితూగలేము. కనుక అవమానం పాలు కావాల్సి వస్తుంది. సమానస్థాయి వారితోనయితే ఏ విధమైన చీకాకులు కలతలుండవు. కనుక యిటువంటి వివాహ సంబంధాలేర్పరచుకోవాలని భవిష్య పురాణం ఉపదేశిస్తున్నది.

భక్తి ముక్తులే గాక సమాజహిత దృష్టి పురాణాల్లో వుందని చెప్పటానికి ఇలాంటి సందేశాలెన్నో ఉదాహరణలుపురాణాల్లో వున్నవ చెప్పటానికి

ఇలాంటి సందేశాలేన్నో ఉదాహరించవచ్చును. తాము పేదవారైనా తమ పెళ్లి సంబంధాలు లక్షాధికార్లతో జరుగాలని ఆశిస్తారు. ఇలాంటి వారికి కనవిప్పు కావాలి. ఈ పురాణ మహర్షి వాక్యాలు. ఇక వివాహాలెన్ని విధాలు? వాటి లక్షణాలెవ్వి? అనే వాటికి జవాబుగా క్రింది శ్లోకా లగుపడుతాయిందులో.

శ్లో ॥ "బ్రాహ్మోదైవస్తదా చార్ష: ప్రజా పత్య స్త థాసుర!!

గాంధర్వో రాక్షసశ్చైవ, పైశాచోష్టమోధమ!!"

1 . బ్రాహ్మము 2. దైవము 3. ఆర్షము 4. ప్రాజాపత్యము 5. అసురము 6. గాంధర్వం 7.రాక్షసం 8. పైశాచమని వివాహాలు అష్ట వాధాలు మన భవిష్య పురాణంలో మహర్షి చెప్పారు.

శ్లో॥ అచ్ఛాద్యచార్చ్ఛయిత్వాతు , శ్రుతశీలవతే స్వయమ్!

ఆహూయదానం కన్యాయా: బ్రాహ్మధర్మప్రకీర్తిత.

విద్యా వినయ సంపన్నుడైన బ్రహ్మచారికి సాంప్రదాయబద్ధంగా, సకల విధ లాంచనాలతో కన్యాదానం చేస్తే, దానిని బ్రాహ్మ వివాహమని పిలుస్తారు. ఈ వివాహం ధర్మ శాస్త్ర సమ్మతమైంది.

శ్లో॥ వితతే చాపి యజ్ఞేతు, కర్మకుర్వతి చార్త్విజే!!

అలంకృత్య సుతాదానం, దైవోధర్మ ఉదాహృతి !

యాగశాలలో ఋత్విజుడుగా నున్న వటునికి అలంకృతమైన కన్యను దానం చేయడం దైవ వివాహమని ధర్మశాస్త్రం సమ్మతిస్తుంది.

శ్లో॥ ఏకం గోమిధునం ద్వేవా వరాదాయ ధర్మత:

కన్యా ప్రదానం విధివ, దార్షియో ధర్మ ఉచ్యతే !!

ఒకటి లేక రెండింటిని ఆవుల వరుని వలన పుచ్చుకొని ధర్మబద్ధంగా కన్యాదానం జరిపిస్తే, దానిని ఆర్షవివాహమందురు.

శ్లో॥ "సహోభౌచరితం ధర్మ, మితి వాచాను భాష్యతు!

కన్యా ప్రదాన మభ్యర్చ్య, ప్రజా పత్య విధి స్మృతః !!"

"అర్థేచ, ధర్మేచ, కామేచ నాతిచరామి" అని వధూవరులిద్దరు ప్రమాణానికి కట్టుబడి వివాహమాడితే అది ప్రాజాపత్యం. ఇది ధర్మశాస్త్ర సమ్మతమైనదే.

శ్లో॥ "జ్ఞాతిభ్యోద్రవిణం దత్వా, కన్యాయాశ్చైవ శక్తితః!

కన్యా ప్రదానం స్వచ్చం దాసురోధర్మ ఉచ్యతే! ఓ"

కన్య తల్లి దండ్రులకు గానీ, పోషకులకు గానీ, భక్తికొలది కన్యాశుల్కమిచ్చి చేసే వివాహం అసురమనిపించు కుంటుంది. ఇది పూర్వం విస్తారంగా జరిగి ముసలి వాళ్లకు సహితం కన్యల నమ్మి సహగమనం పేరిట, భార్యను భర్తశవంపై చితిలో నంటించి కాల్చేవారు . కనుక రాజారామ మోహన రాయ్, ఈశ్వర చంద్ర విద్యాసాగర్, జ్యోతిరావు పులే, కందుకూరి వీరేశలింగం వంటి సంఘ సంస్కర్తలు వీటిని తూర్పార బట్టి నిషేధింప జేశారు. నేడు వాటి స్థానంలో లక్షలు గుమ్మరించే వరకట్న పిశాచి మన సంఘాన్ని పీడిస్తోంది. దీని రూపు మాప మరో సంస్కర్త అవతరించాలి. ఇది ఒక విధంగా ధర్మశాస్త్ర సమ్మతం కాదనే అనవచ్చును.

శ్లో॥ "ఇచ్ఛయా న్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్యచ!

గాంధర్వః సవిధిరే యం మైథున : కామ సంభవ!!"

వధూవరులు యుక్త వయస్సు వచ్చి యుండి పరస్పరాకర్షణకు లోనై పెద్దలతో ( తల్లి తండ్రుల) అనుమతి పొందక ( స్వయం వరంవలె ) స్వయంగా జరుపుకొనేదే గాంధర్వ వివాహమనవచ్చు. అయితే జీవితంలోని సాధక

బాధకాల గ్రహింపక యౌవనావేశంతో తల్లి దండ్రుల అనుమతి సలహాలేక గాంధర్వ వివాహం జరుపుకొని శరీరాలు మైధునీ క్రియతో ఏకమైతె ఈ వరకట్న కాలంలో మరీ మోసపోయేది స్త్రీయే అనవచ్చును. స్త్రీ త్వరగా తన్ను సమర్పించుకుంటుంది. పురుషుడు ఆడదాన్ని లొంగింపచేసికొనుటే గొప్పని పువ్వునాకర్షించిన తుమ్మెద వలె, స్త్రీ యౌవనం కొల్లగొట్టి, అందలి మాధుర్యం గ్రోలి, తాళి గట్టి వివాహం చేసికోకనే తప్పించుకొని పోయేప్రమాదమెక్కువగా నున్నది.

అతి ప్రాచీన కాలంలో (భారత కాలం) పూరు వంశస్థుడైన దుష్యంతుడివలన గాంధర్వ వివాహం పేరుతో విశ్వామిత్ర ఋషి కన్య కణ్వకమహర్షి పోషిత శకుంతల గర్భవతిగానయి యెన్ని యగచాట్ల పాలైందో తెలిసిందే! కాబట్టి దేశకాల పరిస్థితుల బట్టి నేటి స్త్రీలు కామ వశులై గాంధర్వ వివాహానికి సమ్మతింపక, అనుభవజ్ఞులైన పెద్దల తల్లి దండ్రుల సలహా తీసికొని, ఆచి, తూచి, అడుగు వేయడం మంచిదని చెప్పవచ్చు.

శ్లో॥ "హత్వా ఛిత్వాచ, క్రోశంతీ బలవత్ రుదతీం గృహాత్!
ప్రసహ్యకన్యాహరణం, రాక్షసోవిధిరుచ్యతే!!"

ఇష్టంలేవి కన్యను బలాత్కారంగా లాగికొని పోయి, కొట్టి, తిట్టి ఎత్తుకొని వచ్చి వివాహం జరిపితే అది రాక్షసవివాహమగును. ఇప్పుడవి యెక్కువగా జరుగుచున్నవి. ఇవి ధర్మశాస్త్ర విరుద్ధమైనవి.

శ్లో ॥ సుప్తాం మత్తాం, ప్రమత్తాంచ రహోయత్రోప గచ్ఛతి!
స పాపిష్ఠో వివాహానం, పైశాచః కథితో ష్టమ!!

నిద్రావస్థలో గాని, మైమరచి మైకంలో నున్న కన్యను రహస్యంగా ఎత్తుకొని వచ్చి వివాహమాడితే అది పైశాచిక వివాహమనబడును. ఇది

ధర్మశాస్త్ర సమ్మతమైనది కాదు. ఈ విధంగా అష్ట వివాహాలు చెప్పబడినవి. ఇక అన్న దాన మహిమ భవిష్యపురాణంలో యిలా చెప్పబడినది.

శ్లో ॥ "అన్నంలై ప్రాణి నా ప్రాణా: అన్న మోజోబలం సుఖం!
ఏ తస్మాత్కారణాత్సద్ధి: అన్నద: ప్రాణద: స్మృతి!!"

ఏ ప్రాణికైనా అన్నమేప్రాణ ప్రదమైంది. అన్నం తేజస్సు, బలం సుఖాలను కల్గిస్తుంది. అన్నం లేని వానిలో ఈ గుణాలు కనిపించవు. అందుచేత అన్నదాత ప్రాణదాత గా కీర్తింపబడుతాడని అన్నదానానికి ప్రేరణ నిస్తున్నదీ శ్లోకం. ఇవియే కాక ఎన్నియో విక్రమ భేతాళ కథలు ఈ భవిష్య పురాణంలో అగుపడుతాయి. మనకు యమునా నదీ తటమున ధర్మస్థలపురం గలదు. ఆ పురపాలకుని పేరు గుణాధిపుడు. సుశీల, హరిశర్మ అనే పుణ్య దంపతులు అందు నివసించేవారు. హరిశర్మ అనే పుణ్యుడు వేదాంగ శాస్త్ర కోవిదుడు. వీరికిద్దరు సంతానముండిరి. కుమారుని పేరు సత్యశీలుడు కుమార్తె పేరు మధుమతి. సత్య శీలుడు వేదాధ్యయనాయనార్థం కాశీ పట్టణానికి వెళ్ళాడు. మధుమతి వామనుడనే యువకుడిని ప్రేమించింది.

ఇలా గుండగా, మధుమతి తండ్రి హరిశర్మ త్రివిక్రముడనే వరున్ని చూశాడు. అన్నయగు సత్యశీలు డక్కడ కేశవున్ని వరునిగా ఎన్నుకొన్నాడు. ఒక శుభ ముహూర్తమున యీ ముగ్గురు (వామన, త్రివిక్రమ, కేశవులు) పెళ్ళి చూపులకు మధుమతి యింటికి వచ్చారు. సరిగా అదే సమయంలో మధుమతిని ఒక సర్పం కాటువేసి, ఆమె చనిపోయింది. ఆమెను బ్రతికించ కొనడానికి ముగ్గురు వరులును ప్రయత్నాలను, చేశారు. కాని ప్రయోజనం లేక పోయింది.

ఈ బాధ నుండి వధువు మరణం తట్టుకొనలేక త్రివిక్రముడు సన్యాసియై దేశ పర్యటన చేయసాగాడు. కేశవుడామె అస్థులను నదీ

సంగంలోకలుపుటకై చితాభస్మాన్ని, అస్థుల్ని, తీసికొని ప్రయోగ తీర్థానికి వెళ్ళాడు.వామను డామెనే చూస్తూ చితి దగ్గరే నిరీక్షిస్తున్నాడు. ఇది వారి ముగ్గురి పరిస్థితి, త్రివిక్రముడలా దేశటన చేస్తూసరయూనదీ తీరంలోని లక్ష్మణ పురం వెళ్ళాడు. సరిగా ఆ దినమే ఆ యింటి దాసీ పుత్రుడు మరణించాడు. ఆ దాసీ పుత్ర భిక్ష పెట్టమని రామశర్మ నర్థించింది. సంజీవన మంత్రంతో ఆమె కుమారుని బ్రతికించాడు రామశర్మ. ఈమంత్రం నేర్చుకొన్నాడు. అక్కడుండిన త్రివిక్రముడు. వెంటనే మధుమతి ఉన్న ఊరికి వచ్చాడాతడు. ఆమెను బ్రతికింపదలచాడు.

రామశర్మ నుండి గ్రహించిన(మృతి సంజీవని) మంత్రం పఠించి, మధుమతిని బ్రతికించడానికి వచ్చాడు త్రివిక్రముడు. అంతకు ముందే చని పోయిన రాజకుమారుడు ఆ మంత్రం పఠింపగా బ్రతికాడు. అప్పుడు రాజు "నీకేమి బహుమతి కావాలో కోరుకొమ్మని త్రివిక్రముని అడిగాడు. "కేశవుడు మధుమతి అస్తికలను తీసికొని తీర్థయాత్రలకు వెళ్ళాడు. అతన్ని వెంటనే వెనక్కి పిలిపించండి" అని రాజానడిగాడు. అతని కోరికను మన్నించి కేశవున్ని రాజు పిలిపించాడు. ఆమె అస్థికలను పేర్చి సంజీవని మంత్రం పఠించి ఆమెని బ్రతికించాడు త్రివిక్రముడు. ఆమె పునర్జీవితురాలైంది.

ఆ ముగ్గురు వరులామెను ప్రేమించిన కారణంగా ఆమెను పెళ్ళాడ సిద్ధపడ్డారు. ధర్మం ప్రకారం అర్హుడైన వానినే చేపడుతానంది మధుమతి. వారితో "విక్రమాదిత్యా! ఈ ముగ్గురు లో ఆమెను పెళ్ళాడానికి అర్హుడెవరు? అని అడిగాడు భేతాళుడు విక్రముడిట్లు సమాధానం చెప్పాడు.

శ్లో॥ "ప్రాణ దాతా తుయో విప్ర, పితేవ గుణ తత్పర:।
తదపిదాతాతుయో విప్ర : భ్రాతృతుల్యో: సవేదవిత్॥"

మంత్రం పఠించి, ఆమెను బ్రతికించిన వాడు త్రివిక్రముడు తండ్రి వంటివాడు. అస్థుల నిచ్చిన కేశవుడు అన్న వంటి వాడు. ఆమె చితిని విడువక ఆమె స్మరణతోనే నిరీక్షించిన వామనుడే మధుమతికి ధర్మశాస్త్ర రీత్యా భర్త కాదగినవాడు.

శ్లో॥ "యచ్ఛ్రుత్వాసర్వ పాప భ్యో, ముచేతే మానవోనృప!
అశ్వ మేధ ఫలం ప్రాప్య, గచ్ఛేద్భానౌన సంశయః

ఈ భవిష్య పురాణం విన్నవారు సకల పాప విముక్తులౌతారు. మరియు అశ్వమేధయాగము చేసిన సత్ఫలం గూడా పొంది, సూర్య నారాయణుని సాయుజ్యం పొందగలరు.

భాగవతం ముగిసిందనగానే మునులందరూ ఆశ్చర్య పోతూ "ఏమిటన్నావ్ ? ఆ శ్రీ హరి మళ్ళాఅవతరిస్తాడు? కలిని నిర్మూలిస్తాడా? శ్రీకృష్ణ నిర్యాణం విని వ్యాకులమైన మాహృదయాలకు నెంత చల్లటి కబురు చెప్పావయ్యా! ఏది నీ మధుర వచనాలతో ఆయన అవతరణ కారణాలనీ, ఆచరించబోయే అద్భుత కర్మలనీ, వివాహాది విశేషాలనీ అన్నిటినీ సవిస్తరంగా చెప్పి- మమ్మల్ని కృతార్థులను చేయువయ్యా" అన్నారు. వారి మాటలకు సూతుడు మందహాసం చేస్తూ- అదంతా భవిష్యత్ పురాణం. దీనినే"కల్కి పురాణం" అని కూడా అంటూంటారు. శ్రీ కృష్ణ నిర్యాణంతో ద్వాపర యుగం అంతరించింది. కలి ప్రవేశించాడు. అదే కలియుగారంభం. ముందుగా యుగధర్మవిధానాలు చెబుతాను శ్రద్ధగా ఆలకించండి" అంటూ ప్రవచనాన్ని ప్రారంభించాడు.

## కలియుగ లక్షణాలు

అధర్మాసత్యములు దంపతులు. వారికి కంభుడను కుమారుడు, మాయ అను కుమార్తె గల్గిరి. వారిద్దరికి వివాహమైన దంభుని,

వికృతిని గనిరి. వారికి క్రోధము, హింస యను కుమారుడు కుమార్తె పుట్టిరి. ఆ యిరువురకు కలి జన్మించెను. కలి నల్లని శరీరము వాడు, బారుగా నున్న కడుపువాడు, గుహవంటి నోరుగలవాడు, రక్త వర్ణము నేత్రములు గలవాడు, మహాభయంకర వికార రూపము గలవాడు దుర్వాసనా దేహము గలవాడు, సురాపానము చేయువాడు, ద్యూతమున నందిష్టము గల్గి చరించువాడు, స్త్రీ వ్యామోహముతో నుండువాడై కలిపురుషుడు లోకపాలనమునకు సిద్ధపడును. అతని పాలనములో అధర్మము పెచ్చు పెరిగిలోకముల నాక్రమించును. కలియందు మానవుల సంచారములు వివరించెదనని మొదలిడెను. మాత పితృ నిందల నొనరించుచు, సదాచారములను విడుచుచు, వాటిని నిందించుచు, వేదాదులను వదులుచు, నీచ సేవలయందాసక్తి పెంచుకొనుచు, నాస్తిక వాదముతో తర్కము గావించుచు, వేదాది విద్యలను విక్రయించుచుందురు. ధనికుడే గొప్పగా గణింపబడును. విప్రులు వర్ణ సంకరు లయ్యెదరు. సంసారులను కులటా స్త్రీలగను, కులటల నుత్తమ స్త్రీలగను చూచెదరు. ప్రతి వారిని మోస కారములలో ముంచుటకు యత్నింతురు. కాషాయములు ధరించి సన్యాసి వేషులై సంసారములు నడుపుచుందురు. ప్రతివానికి బ్రాహ్మణుడనబడుట యందు వాంఛయు, బ్రాహ్మణుడన్న విరోధమును పెరుగును. ధనమున కాశించి బ్రాహ్మణులు యుక్తాక్తము లెరుగకనందరి యిండ్లలో యాచకత్వము నందెదరు. వితంతువులు గృహిణులుగా మారగలరు. వర్షపాతములు, వర్షాభావములు మితిమీరి యుండగలవు. సుంకముల భారము ప్రజలు మోయలేకుందురు. కలియుగములో మొదటి పాదమున

శ్రీకృష్ణుని, రెండవ పాదమున శ్రీహరిని హెచ్చుగా నిందించుచుందురు. తరువాత వర్ణ సంకరము, ఏక పంక్తి భోజనములు జరుగును. కలిలో ఐదువేలేండ్లు నిండిన తరువాత ధర్మము, ధర్మ పరులెచ్చుటను గన్పింపరు.

కలిలో కొంతకాలము పోయిన తరువాత నారాయణుని గురించి యోచనలుండవు. క్షుద్రదేవతల నారాధించుచు తాత్కాలిక ఫలముల నపేక్షింతురు. పాషాండ ధర్మములను బూని, వేద ధర్మములు జారవిడుతురు. చదువుకున్న వారు పనికి రాకుందురు. అవిద్యాపరులు పండితులుగా పూజింపబడుదురు. స్వగోత్రీకులతో వివాహము లగుదురు. పితృ దేవతారాధనలు మానుదురు; చనిపోయిన వారి కుత్తరక్రియలు జరుపరు. స్త్రీ వశవర్తులై పురుషులు సంచరించెదరు. కాలక్రమములో సృష్టి సన్నగిల్లి పోవును. ప్రజలంగుష్టమాత్ర దేహులగుదురు, వృక్షములు మూరెడెత్తుగా నుండగలవు. యజ్ఞయాగాదులు లేకపోవుటచే దేవతలు హవిర్భాగశూన్యులై బ్రహ్మనాశ్రయించెదురు, వారి పాట్లు విని బ్రహ్మ తాను సమర్థుడ నని చెప్పి వారిని వెంట నిడుకొని వైకుంఠమునకు పోవును. అప్పుడాహరి వారి బాధలు విని దయతలచి "మీబాధలు నేను నివారించెదను. భారత దేశములో "శంబళ"యను గ్రామములో విష్ణు, యశుడను బ్రాహ్మణుడుండును. ఆయనకు సుమతి యను పేరుగల యిల్లాలుండును. నేనాయన యింట సుమతీ గర్భమున బుట్టెదను. నాభార్యయగు లక్ష్మి సింహళములో పద్మావతి నామము ధరించి జన్మించగలదు. మీరందరూ మీయంశములతో నాపరివారముగా బంధువులుగా జన్మించండి! దేవాపి - మరత్తులను రాజులుగా చేసి, నా భక్తిపరులగుట చే భరత వర్షములో సర్వ మండలాధిపత్యము వారికికట్ట బెట్టెదను. తరువాత నేను నా లోకమున వచ్చెదను. ఆ సమయములో కృతయుగ ధర్మయుగముగా ధర్మము నడుచుట కారంభమగును" అని భవిష్యమును, వారికి చెప్పెను ఇ ట్లు చెప్పిన హరి చతుర్భుజములతో జన్మించును. అట్లు పుట్టిన శ్రీ హరిని యా పుణ్య దంపతులు మిక్కిలి

స్తోత్రము. చేయుదురు. గంగాదేవి స్త్రీరూపము ధరించి వచ్చి కమండల జలములతో స్నానముచేయించును. ఆ బాలుని దర్శించుట మహామహులగు మునీంద్రులు వచ్చి చూచి యానందించి తమ యాశ్రమములకు పోవుదురు. అతనికి ముగ్గురన్నదమ్ములుందురు. ఆ దేశములో విశాఖయూపుడను రాజు పరిపాలించగలడు. తరువాత ఉపనయనపు వయస్సు రాగానే తండ్రి యుపనయనాంతర మాతడరణ్యముల బడిపోయి త్రోవలో పరశురాముని కలుసుకొనును. ఆయన వద్ద ధరుర్విద్యాది సమస్త విద్యలు నేర్చుకొనును. "పద్మావతిని వివాహమాడి మరుత్తుదేవాపులకు రాజ్యమీయగల" వని యాతని పరశురాముడు దీవించును. శంకరుడు అతనికి గరుత్మంతుని వంటి వేగగమనము గల గుఱ్ఱమును బహూకరించును. అతడా గుఱ్ఱమునెక్కి ప్రపంచమంతయు దిరిగి దుష్టులను ఖండించును. ధర్మ రాజ్యము నిల్చును. తరువాత శ్రీ శుకముని వచ్చి శ్రీ హరిని చూచి సంతోషించి వెళ్ళి పోవును. విశ్వకర్మ దివ్యమగు పట్టణము నిర్మించగా కల్కి మూర్తి యత్తవారి యూరు విడచి యాపురమునకు పోవును. చతురంగ బలములతో, దండుతో, దాసదాసీ జనముతో నాపట్టణము శోభించును. కలికి మూర్తి పద్మావతితో కాపురమునకు ప్రవేశించును. విష్ణయశుడా పురము నకు వచ్చి కొలువు తీర్చి యున్న కుమారుని చూచును. అప్పుడు కల్కి అతనితో "తండ్రీ! నీచేత నే నశ్వమేదము చేయించ దలచినాను. మీరాజ్ఞాపించిన నా సైన్యము తో దుష్టులగు రాజులను శిక్షించి, నాస్తికులను ఖండించి, క్రతువు సమాప్తము చేయింతు" ననును. విష్ణు యశుడు కుమారున కనుజ్ఞ యిచ్చి దీవించి పంపును. అతడు బయలు దేరి కీకట పురమున బుద్ధుని దేవాలయముపై యుద్ధము ప్రకటించును. వారు బలవంతులై వేద ధర్మ దూరులుగా నుండుటచే విశాఖ యూపునితో కలసి వారిని జయించును బౌద్ధరాజును, జైనులను జయించును. పిమ్మట మాయాదేవితో గొప్ప యుద్ధము జరుపును.

కలికి మూర్తి పాషండ మతముల వారిని జయించి చక్ర తీర్థమునకు పోవును. అచట వాలఖిల్యాది మునులు విచారముతో గనవత్తురు. వారు విచార కారణమడుగగా కుంభకర్ణుని మనుమరాలొక రాక్షసి గలదు. దాని పెనిమిటి కాలకుంజుడు, ఆమెకు వికుజుండు పుత్రుడు వారు పెట్టు బాధలు వర్ణింపజాలము, వారిని చంపి మాబాధలు తీర్చు మని ప్రార్థింతురు. కలికి మూర్తి ఆ రాక్షసితోనూ, దాని పతీసుతులైన కాలకుంజ వికుంజులతోను యుద్ధమాచరించి వారిని సంహరించును. దాని కుమారుని సంహరించును. పిమ్మట హరిద్వారమున గంగాస్నానమాచరించి, పుండరీక పనము దర్శించి మహామునులకు తన దర్శన మిచ్చి పూజలు గొనును. అ కల్కి మూర్తి వారందరు క్షత్రియులని యెరిగి వానిలో వంశ చరిత్ర మడుగును. వారిలో మరుత్తుడిట్లు చెప్పును. "నాది సూర్యవంశం మనుపు సంతతి వాడను. మా వంశ చరిత్రము ప్రసిద్ధమైనదని యెరుగుము. శ్రీరాముని వరకు నందరెందరోయనగా విని యారాముని చరిత్ర వినిపింపుమని కల్కి మూర్తి మరుత్తును కోరును. మరుత్తుడు శ్రీరామ చరిత్రము చెప్పనారంభించెను.

## రామకథ

రావణ కుంభ కర్ణాదులు రాక్షస ప్రభువులు. రావణుడు మహాతపమాచరించి శివుని వల్లను, బ్రహ్మవల్లను వరములు పొంది– దేవ కోటులను, ప్రజలను బాధించసాగెను. వారందరు శ్రీహరిని దర్శించి తమ బాధలు తీర్చుమని ప్రార్థించిరి. అందుకు విష్ణువు "నేను దశరథునికి కుమారుడనై అవతరించి వారిని వధింతును. ఆనాటికై నాకు తోడుగా నేడు మీమీయంశములతో వానరులను సృజింపుడని" చెప్పెను.

తరువాత దశరథ మహారాజు పుత్రకామేష్టి చేయంగా "యజ్ఞపురుషుడు" పాయస పాత్ర నిచ్చెను. దశరథుడు పాయసములు భార్యలు ముగ్గురకు పంచి పెట్టును. వారు గర్భవతులై రామ, లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను వారిని కుమారులుగా గనిరి. ఒకనాడు విశ్వామిత్రుడు దశరథుని కడకు వచ్చి "యాగ సంరక్షణార్థము నితనితో పంపు" మనెను. దశరథుడు కులగురువగా వశిష్ఠుని ప్రోత్సాహముతో, రామ లక్ష్మణులు నాతని వెంట బంపెను. రాముడు విశ్వామిత్రుని వలన అస్త్ర శస్త్రదులుపదేశమంది, తాటకను, మారీచ సుబాహులనెడి యజ్ఞ విఘ్న కారులను దునుమాడి గురువున కానందము కల్గించెను. తరువాత గాధేయుడు జనకరాజు కుమార్తెయగు సీతా స్వయంవరమునకు రాజ పుత్రులను వెంటనిడుకొని బయలు దేరెను. దారిలో శ్రీ రాము డహల్యకు శాపవిమోచనం కావించెను. మిథిలకు జేరి శివధనస్సును విరచి సీతను పెండ్లాడెను. తిరిగి వచ్చు దారిలో పరశురాముని భంగపరచి, అయోధ్యను జేరెను.

దశరథుడు రామునకు యువరాజ్య పట్టాభిషేకము చేయదలపెట్టగా కైక కోరిన వరముల వలన రాముడు సీతా లక్ష్మణులతో నరణ్య వాసము చేయబోయెను. భరతుడు పాదుకా పట్టాభిషేకము గావించి నంది గ్రామములో నుండెను.

రాముడు పంచవటి తీరములో పర్ణశాల నిర్మించుకొని సీతా లక్ష్మణాదులతో నుండగా మారీచుడు మాయలేడిగా వచ్చి రాముని మోసగించగా, నాతడు దాని వెంట పోయెను. ఆవేళకు రావణుడు సన్యాసి రూపమున వచ్చి సీత నెత్తుకొని పోయెను. రామ లక్ష్మణులుసీతను వెదకుచు పంపా తీరము జేరిరి. అచట హనుమంతుడు రామలక్ష్మణులతో

మాట్లాడి సుగ్రీవునితో సఖ్యము గావించెను. శ్రీరాముడు వాలిని వధించి, సుగ్రీవుని రాజుగా చేసెను. కృతజ్ఞతగా సుగ్రీవుడు వానర వీరులను సీతాన్వేషణకు పంపగా హనుమంతుడు లంకకు వెళ్ళి సీతను దర్శించి లంకను దహించి వచ్చి రామునకు సీత వృత్తాంతము నెరిగించెను. రాముడు వానర సైన్యంతో లంకపై దండెత్తి రావణుని వధించి విభీషణున కచట పట్టము కట్టి, సీతతో గలసి పుష్పకమెక్కి యయోధ్యకు వచ్చి రాజయ్యెను.

# రామ వంశము

ఆ రామునకు కుశుడు, లవుడు అను కుమారులిద్దరుండిరి. కుశున కతిధి, యతనికి నిషదుడు వానికి నభుడు, అతనికి పుండరీకుడు, వానికి క్షేమధన్వుడు, వానికి నృపశేఖరుడు, వానికి హేనుడ, వీనికి పారిపాత్రుడు, వీనికి బలాహకుడు, వాని కర్కుడు, వీనికి రజనాథుడు, వీనికి ఖగణుడు, యతనికి విధృతుడు, వీరికి హిరణ్యాక్షుడు, యతనికి పుష్టుడు, అతనికి ధ్రువుడు, నతనికి స్యందనుడు, వానికగ్ని, వానికగ్ని వర్ణుడు, నతనికి శీఘ్రుడు పుట్టిరి. ఆ శీఘ్రుని కుమారుడను నేను మరుత్తును. శీఘ్రుడు నాతండ్రి యని మరుత్తు శ్రీరాముని తరువాత వారి వంశ చరిత్రము కల్కితో చెప్పును, నేను, నాకుమారుడు, బుధుడు నామనుమడు సుమిత్రుడు. మేము ముగ్గురు క్షాత్రం జచ్చి నీయవతార దర్శనమునకై కలాపి గ్రామములో తపస్సు చేస్తూకూర్చున్నాం.వ్యాసుడు నీరాక చెప్పగా ఇలా వచ్చి నిన్ను దర్శించు కోగలిగాం" అని మరత్తు చెప్పును.

# చంద్ర వంశం

ఆ పిదప దేవాపి యనునతడు చంద్ర వంశముగురించి యిట్లు చెప్పును. బ్రహ్మదేవున కత్రి కుమారుడు. ఆయనకు చంద్రుడు పుట్టెను

ఆచంద్రునకు బుధుడు బుట్టెను. వానికి పురూరవుడు పుట్టెను. వానికి యయాతీ, నహుషుడు , పుత్రులుగాబుట్టిరి. నహుషుడు ఇంద్రపదవి పొంది యగస్త్య శాపముతోసర్పమైధర్మరాజు వలన పాప విముక్తి నందెను. యయాతికి యదు,దూర్వాసులు, శర్మిష్టకు ద్రుహుడు, అనుడు, పూరుడను వారు పుట్టిరి, పూరునకు జనమేజయుడు, వీనికి సచిన్యాసుడు, వానికి ప్రవీణుడు, వానికి మనుష్యుడు, వాని కభయదుడు కురుషయుడు, వానికి తారణి, వానికి పుష్కరారుణి, వానికి బృహత్ క్షేత్రుడు, వానికి హస్తి జన్మించిరి. ఆ హస్తియే అతని పేరిట హస్తి నాపురమును గట్టించెను. వాని కజామీడుడు, అనామీడుడు, పురుడను ముప్వురు కుమారులు. అజమీఢునకు ఋషుడు, అతనికిసంవరుణుడు, యతనికి కురురాజు యతనికి పరీక్షితు- నిషధుడు-సుదన్యుడు- జహ్నులను నలుగురు కుమారులు గల్గిరి.సుధన్వునకు సుహోత్రుడు చ్యవనుడను నిద్దరు పుత్రులు గల్గిరి.

వారిలో సుహోత్రునకు బృహద్బుడుడు, వానికి కుశాగ్రుడు వీనికి ఋషభుడు, వీనికి సత్య జితు, వీనికి పుష్టభానుడు, వీనికి నహుషుడు బృహద్రథు కలిగిరి. ఈ బృహద్రథునికి సోమాపి జరాసంధుడని యిరు వురు పుత్రులు . జరాసంధుని కుమారుడు సహదేవుడు మగధ దేశపు రాజు, సోమాపికి శ్రుతశ్రవుడు, వీనికి సురథుడు అతనికి బంధురథుడు వానికయుతాయువు. వీనికి కోపనుడు వీనికి దేవాతిథి, ఋక్షుకుడు అని ఇద్దరు పుట్టిరి. ఋక్షునికి దిలీపుడు, వీనికి ప్రదీపుడు,వీనికి నుమ పుట్టనాము. నా పేరు దేవాపి . నేను నా కుమారుడైన హూతునకు రాజ్యమిచ్చితపస్సు చేసుకోబోయి , పిమ్మట కలాపి గ్రామమున నీ దర్శనమునకు వేసి యున్నాను. వార్త తెలిసి వచ్చినా నని దేవాపి చెప్పును.

అంత కల్కి మూర్తి "ఓ సూర్య చంద్రవంశ రాజవర్యులారా ! మీరు సత్యము, ధర్మము విడువక సంచరించుచున్నారు. కాన. నేను మీకు రాజ్యాభిషేకము గావింతును మరుత్తునకు యోధ్యను, దేవాపికి హస్తినాపురమును అభిషికముగా చేసి రాజ్యము లప్పగించును. తరువాతవిశాఖ యూపుని కుమార్తెలను మరుత్తునకును, రుచిలాశ్వునికుమార్తెను దేవాపికి ఇప్పించి వివాహము చేయించును. తరువాత కల్కి దేవు డాకాశము వైపుచూడగా రెండు విమానములు వచ్చును. ఆ రెంటిని చూచి మీరొకదానిమీద బయలు దేరి మీమీ రాజధానులకు జేరుడని చెప్పి, అవి కామగమనము గలవని వివరించి , వారికిచ్చి పంపును. వారితో వీటియందు దివ్యాయుధములున్నవి ముల్లోకములు మీ రడ్డు లేకుండా తిరుగగలరని చెప్పును, ఆ సమయములో కృతయుగం యతి రూపములో కల్కి దేవుని దర్శించును. ఆ యతి రూపుని గౌరవించి యాదేవుడు మీరెవరు ? ఎందులకు వచ్చితిరి ? నావలన నేమి కావలయును?" అని ప్రశ్నించెను.

నేనం కృతయుగమున కలిబాధలు పడలేకయె యతిరూపముతోతిరుగుచున్నాను. నీ వవతరించి యధర్మమును, యనాచారమును, నాస్తికత్వముండి ప్రజల ను ధర్మ మార్గము నిలుపుచున్నావు. నాకానందమైనిన్ను దర్శింప వచ్చితిని. నీవుమహామహాడవగు శ్రీహరి యని పొగడి కల్కి మూర్తి చే సత్కారములందుకొని సంతోషముతో తనదారిని పోవును.

## కల్కి మూర్తి - శశిధ్వజుడు

ఆ తరిని కృతయుగము. మరుత్తు, దేవాపి, విశాఖయూపుడు వారి వారి బలములతో కల్కి మూర్తి మ్లేచ్ఛబర్బర దేశములపై దండయాత్రకు బయలు దేరును. ఆ సమయమున యవన దేశాధినాథులను జయించి

శశిధ్వజుడును రాజాపై యుద్ధమునకు బయలు దేరును. కల్కి దేవుడు యుద్ధములో తన పరాక్రమము చూపించి చాతుర్యము నెఱిపి శశిధ్వజుని జయింప జూచును. కాని శశిధ్వజుడు తన నగరమునకు బోవును. అతని భార్యసుశాంత ఆమె ఈ విషయ మెరిగి భర్తతో శ్రీ హరిని జేరి యనేక విధముల స్తవములు గావించును. దానితో కల్కి తెలివి జెందును. తనయెదుట చేతులు జోడించి నిలబడిన సుశాంతను జూచి యాదేవుడు "ఓయమ్మా! నీ వెవరవు? ఎవరి భార్యవు? ఎందులకిట్టులున్నావు?" అని ప్రశ్నించును. అందులకామె "దేవా! నేను శశిధ్వజుని భార్యను, సుశాంతయను పేరుగల దానను. నాభర్త తెలియకమీతో యుద్ధమునకు దిగెను. మేము నీదాసులము. మమ్ము కరుణతో చూడగోరుదము." మానేరమునకు దగిన శిక్ష విధింపుమని ప్రార్థించును. శ్రీ హరి సంతసించి "మీరు ధర్మాత్ములు. మీభక్తికి మెచ్చినాను. వరములు కోరుకొను"డనును. వారానంద పడి తమ కుమార్తె నిచ్చి వివాహము గావించెదరు. అల్లునకు హెచ్చుగా బహుమతులిచ్చి గౌరవించెదరు. పెండ్లికి వచ్చిన బంధువులు మీకీ హరి సంబంధమెట్లు వచ్చినదని యడుగగా శశిధ్వజుడు "మేము పూర్వము గరుడ పక్షి దంపతులము. మమ్మొక వేటకాడు పట్టుకొని గండకి నదిలోని సాలగ్రామముతో చితుక బాది చంపెను.

సాలగ్రామ స్పర్శచే మే మాశరీరములు వదలి యీ జన్మయందు దంపతులమైనాము. గండికీ స్నానము పరమ పవిత్రము. మరియు సాలగ్రామ స్పర్శచే పూర్వజన్మజ్ఞానంతో కల్కిని శ్రీహరిగా నెరిగితిమి. స్వయముగా శ్రీ హరిపాదములు గడిగి యల్లునిగా జేసికొని తరించితి"మని చెప్పును.

శశిధ్వజ దంపతుల సాగనంపి, కల్కి కాంచనాపురము ప్రవేశించును. అతనికి దారిలో నొక దివ్య సుందరీ మణిగనుపింప నాతడామె సమాచారమడుగును. దానికామె నేను చిత్రగ్రీవుడను గంధర్వుని భార్యను.

యక్షుడను మునిని చూచి హాస్యం చేసితిని . ఆయన కోపగించి నన్ను విషనేత్రవు గమ్మని శపించె" ననును. "అయిన నీవెందులకిక్కడ నిలబడినావు!" అని ప్రశ్నించగా "నిన్ను దేవదేవునిగా గుర్తించినాను. నా విషదృష్టి పడిన వారు భగ్గున మండిపోదురు నేను చూచినను నువ్వు ఏ మాత్రము నొవ్వక చెడక పోవుటచే నిన్నాశ్రయించినాను. నిన్ను దర్శించుటచే నాశాపవిమోచనమైనొదని ప్రకాశమానమగు విమానము నెక్కి యామె వెడలిపోవును.

కల్కి మూర్తిశంబళ గ్రామము చేరును. తండ్రిచే రాజసూయము చేయించి ఆయనకు సంతోషము గల్గించును. శంబళమండలమునకు తానురాజై శోభిల్లగలడు . మిగిలిన రాజ్యములన్నియు అందరికి యిచ్చి. వారినిశక్తి మంతులుగా చేయును. తరువాత పరశురాముడు శిష్యుని చూడ వచ్చును. కల్కిమూర్తి ఆయనను తన భార్య రమా దేవికి సంతానము ప్రసాదింపుమనికోరెను. పరశురాముడు రుక్మిణి, ద్రౌపది మొదలగు వారు చేసిన వ్రతమునుచేయుమని యామెచే చేయించును. ఆమెకు మేఘనాథుడు, బలాహకుడను ఇద్దరు కుమారులు గల్గుదురు. తరువాత దేవగణములు పిలువగా కల్కి యోగస్థితిని దేహము విడచి చతుర్భుజములతో శ్రీహరి రూపుడై వైకుంఠము జేరును.

## కల్కి పురాణము సమాప్తం



# 10. బ్రహ్మవైవర్త పురాణము

శ్లో॥ "సావర్ణినా నారదాయ, కృష్ణమాహాత్మ్యమమ్!
బ్రహ్మరూపవరాహస్య, చరితం వర్ణ్యతేముహుః!!"

ఈ శ్లోక ప్రమాణాలను సారం వరాహ స్వామి మరియు శ్రీకృష్ణునికి సంబంధించి సావర్ణి మనువు నారద మహర్షికి తెలియ జేసినదే యీ బ్రహ్మవైవర్త పురాణం? "బ్రహ్మవైవర్త సంజ్ఞంతువామోజానూరు దాహృత!! శ్రీమన్నారాయణుని ఎడమ కాలితో పోల్చబడినది పురాణం." 1) బ్రహ్మాండం 2) ప్రకృతి ఖండం 3) గణేశ ఖండం 4) శ్రీకృష్ణఖండం అనే నాల్గు ఖండాలు (భాగాలు) ఈ పురాణంలో నున్నవి.

శ్లో॥ "తదష్టాదశ సాహస్రం, బ్రహ్మవైవర్తముచ్యతే!"

అనగా ఇది పదునెనిమిది వేల శ్లోకాలతో కూడిన పురాణము. అష్టాదశ పురాణాల సారభూతమే. ఈ బ్రహ్మవైవర్త పురాణమని కూడా చెప్పవచ్చును. ఇందు బ్రహ్మఖండంలో – పరబ్రహ్మవర్ణన, ప్రకృతి ఖండంలో ఆజ్ఞానుసారం దుర్గ–లక్ష్మి–సరస్వతి మొ॥ న రూపాలతో ప్రకృతి ఆవిర్భావం గణేశ ఖండంలో వినాయకునికి సంబంధించిన సమగ్ర వర్ణన , శ్రీకృష్ణ ఖండంలో "దుష్ట శిక్షణ శిష్టరక్షణ శ్రీకృష్ణలీలలు" మొ॥ న విషయాలు వర్ణింపబడి యున్నవి.

గణేశ ఖండలో అతిధి సత్కారం గూర్చియిలాగు వర్ణింపబడింది

శ్లో॥ "అపూజితో తిధిర్యస్య, భవనాద్వనివర్తతే!
పితృదేవాగ్నయః పశ్చా దుర్గవో యాన్య పూజితా!!"

ఇంటికి ఆకలిగా వచ్చిన అతిథిని ఆదరించి ఆకలి తీర్చకపోతే ఆయింటినుండి అదృశ్యరూపాలతో నున్న పితృదేవతలు, అగ్ని హోత్రుడు

గురువులు–పూజలందుకొనకుండా వెళ్ళిపోగలరు. అందుకే "అతిథి దేవోభవ" అని ఉపనిషత్తులుపదేశిస్తున్నవి. అతిథిని సాక్షాత్తు ప్రత్యక్ష దేవతగా భావించాలని తండ్రితో పాటు, అస్థాయిలోనైదుగురున్నారని యీ పురాణం సూచిస్తున్నది.

శ్లో॥ విద్యాదాతాన్నదాతాచ భయత్రాతాచ జన్మద:!
కన్యాదాతాచవేదోక్తా, నరాణాంపితర:స్మృతా!!

1) విద్యాదాత (గురువు) 2) అన్నదాత (పోషకుడు) 3) అభయదాతా (శరణాగత రక్షకుడు) 4) జన్మదాతా (తండ్రి) 5) కన్యాదాత (కన్యనిచ్చినమామ)–వీరే యీ అయిదుగురు తండ్రులని యీ పురాణం తెల్పుతున్నది. ఇట్లే కుమారుడంటే తనవారసుడుగా రక్తసంబంధంతో పుట్టిన వాడే గాక పుత్రదృష్టితో చూడదగిన వారయిదుగురు. వారిలా 1) సేవకుడు 2) శిష్యుడు 3) పోషితుడు 4) ఔరసుడు 5) శరణాగతుడు అప్తబంధువులు, సమస్త సంపదలకంటె గొప్పది ధర్మం . ధర్మం కంటే ప్రియమైనది మరేది లేదు. అందుకే స్మృతి యిలా చెప్తుంది. "ధర్మోరక్షతి రక్షతి రక్షతః!! అందు చేత ధర్మాన్ని తప్పక రక్షించాలి! అసత్యం కంటే వేరే పాపము లేదు. ఇలాగే గంగానదితో సమానమైన నది లేదు. శ్రీమహావిష్ణువుతో సమానమైన దైవము లేడని యీ పురాణం చెప్తున్నది.

శ్లో॥ "నాస్తి ధర్మాత్పరో బంధు: ర్నాసిధర్మాత్పరం ధనం!
ధర్మాత్రియతరః కోవాస్వధర్మం రక్షయత్నతః!!

శ్లో॥ నహి సత్యాత్పరోధర్మో, నానృతాత్పాతకం మహత్!
నహిగంగా నామం తీర్థం, నదైవం కేశవాత్పరమ్!!" అన్నవి

ఉదాహరణాలు. ఇక గురు మహిమ గూర్చి "గురౌహిసర్వేదేవాన్యశ్చ, తిష్ఠన్తి సతతం ముదా!" అనగా సకల దేవతలు గురునిలోను దర్శన మిస్తారు.

శ్లో॥ "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః!
గురుస్సాక్షాత్పరం బ్రహ్మ, తస్మైశ్రీగురువేనమః!!"
అనే ప్రసిద్ధ శ్లోకం కూడా యిదే భావాన్ని ప్రకటిస్తోంది.

పై అమృత విషయాలేకాక, భగవత్స్వ రూపం, సరస్వతీ పూజా విధానం భూదాన మహిమ, గంగావతరణం, సంక్షిప్త రామాయణం, శంఖ చూడ వృత్తాంతం, తులసీ మాహాత్మ్యం, మహాలక్ష్మిస్తోత్రం, దుర్గాదేవి ఉపాఖ్యానం, దేవకీ వసుదేవుల వృత్తాంతం, రేవతీ బలరాముల వివాహం, శిశుపాల వధ, శ్యమంతకోపాఖ్యానం మొ॥ ఎన్నో విషయాలీ పురాణంలో చోటు చేసికొన్నవి.

## వేదవతీ వృత్తాంతం:- (సీతాదేవి పూర్వజన్మ వత్తాంతం)

పూర్వం త్రేతాయుగంలో ధర్మధ్వజుడు. కుశధ్వజుడనే రాజులిద్దరుండేవారు. వీరిద్దరు సహోదరులు. కుశధ్వజుని భార్య పేరు "మాలతీ దేవి" ఈమె శ్రీమహాలక్ష్మిదేవి దయతో కుమార్తెను ప్రసవించింది. ఆ స్త్రీ శిశువు భూమిపై పడగానే "వేదవతి " అని నామకరణం చేశారు. ఆమె చిన్న వయస్సులోనే ధ్రువునివలె, తపస్సు చేసికొనుటకు అరణ్యాలకు వెళ్ళింది. విష్ణుభక్తురాలామె. శ్రీ మహవిష్ణువునే తన భర్తగా గోరినది. కొన్నివేల సంవత్సరాలు ఘోర తపస్సు చేసింది. అయినా శరీర మణుమాత్రం కృశించలేదు. నిత్యనూతన యౌవనంతోనే విలసిల్లుతున్నది. ఆమె కోరిక తరువాత జన్మలో మాత్రమే తీరుతుందని ఆకాశవాణి పలికింది. అయినా తన ప్రయత్నం విరమింపక గంధమాదన పర్వతంపై తన తపస్సుకొన సాగించింది.

ఆ సమయంలో లంకాధిపతి రావణాసురు డక్కడికి వచ్చాడు. సాంప్రదాయబద్ధంగా అతిథి మర్యాద చేసిందాతనికి, వేదవతి, ఆమె

అందచందాలు చూచి వ్యామోహితుడయి, దగ్గరికి వెళ్ళి ఆమెను తాకపోయాడు. అంతే రావణుని కాళ్ళు, చేతులు స్తంభించి పోయాయి.

"నాకారణంగా నీవు సమస్త బంధు నాశనం, రాజ్యభోగనాశనంతో పాటుప్రాణాలుగూడా పోగొట్టుకొనెదవుగాక " అని శాపమిచ్చింది. కదలలేకపోయాడు. దేవి స్తుతి చేసి తిరిగి కాళ్ళస్తంభన పోగొట్టుగొని యథాస్థితికి వచ్చాడు. అతని కర స్పర్శతో అపవిత్రురాలయ్యాననే భావన తో యోగాగ్ని చేత దగ్ధమైపోయింది వేదవతి. ఈ సంఘటన చూచి రావణుడు దుఃఖంతో కుమిలి పోయాడు.

ఈ సాహసవతియే మరుసటి జన్మలో యాగశాలకై దున్నే జనకమహారాజునకు నాగేటి చాలునందు (అయోనిజగా పుట్టి) లభించింది. ఆమెకాయన సీరము (నాగలి) నుండి జనించినదని "సీత " అని నామకరణ చేసి, అల్లారు ముద్దుగా పెంచి శ్రీరాముని (విష్ణువు) కిచ్చి పెళ్ళి చేశాడు. సీతా దేవి నపహరించుకొని పోయిన కారణంగా ఆమె శాపం ఫలించి "సీత పుట్టి లంక చెడె" నన్నట్లుగా రావణుడు మూలసైన్యంతో సర్వ నాశనమయాడు. లంకా నగరం నుండి తిరిగి వచ్చింది రాముడు కడకు ఆమెకు అగ్ని పరీక్ష పెట్టాడు. అగ్ని దేవుడామెను తలవెంట్రుక కందకుండా, సాదరంగా తెచ్చి శ్రీరాముని కర్పించాడు. అగ్నిపునీత అయిందీ మహాసాధ్వి. ఆ జన్మ ముగిసింది.

ఆ మరుసటి జన్మలో అయోనిజగనే యజ్ఞకుండం నుండి యాజ్ఞసేనిగా ద్రుపద మహారాజు పుత్రికగా పుట్టి, ద్రౌపది పేరొందినది. ఈ విధంగా కృతయుగంలో వేదవతిగను, త్రేతాయుగంలో సీతాదేవిగను, ద్వాపర యుగంలో ద్రౌపదిగను అవతరించింది మహాసాధ్వి.

శ్రీరామ చంద్రుడు తన శీలం తెలిసీ, అగ్ని పరీక్ష పెట్టి నందులకు విలపించింది. "పతిందేహి" అంటూ అయిదుసార్లడిగింది. పూర్వం తపస్సు చేసి పరమ శివున్ని వరం కోరింది కనుకనే ఈమెకు పంచ పాండవులు భర్తలుకాగా, పంచభర్తృక అయింది. కశ్యప మహర్షి మానసపుత్రిక, మరియు వాసుకి అనే దేవతాసర్పం యొక్క సోదరి జరత్కారువు. ఈమెను క్రింది విధంగా స్తోత్రం చేస్తే సర్పభయము తొలగుతుందుని యీ బ్రహ్మవైవర్త పురాణం బోధిస్తున్నది,

శ్లో॥ "జరత్కారుర్జర ద్గౌరీ, మనసాద్ధియోగినీ!
వైష్ణవీ నాగభగినీ, శైవనాగేశ్వరీ తథా!
శ్లో॥ జరత్కారు ప్రియా స్తీకమాతా విషహరీతిచ!
మహాజ్ఞానయుతాచైవ, సాదేవీ విశ్వపూజితా!!
శ్లో॥ ద్వాదశైశాని నామాని పూజాకాలేతుయఃపఠేత్!
తస్యనాగభయంనాస్తి తస్యవంశోద్భవస్యచ!!
శ్లో॥ నాగభీతీచశయనే, నాగ గ్రస్తైచ మందిరే!
నాగరక్షతే మహాదుర్గే, నాగవేష్టిత విగ్రహే!!
శ్లో॥ ఇదం స్తోత్రం పఠిత్వాతు, ముచ్యతేనాత్రసంశయాః!
నిత్యం పఠేచ్ఛ్రుతం దృష్ట్వా, నాగవర్గ పలాయతే!!
శ్లో॥ శుభదం పుణ్యదంచైవ, విఘ్ననిఘ్నకరం పరమ్!
హరిదాస్య ప్రదంచైవ, పరలోకే ప్రహర్షదమ్!!"

ఈ బ్రహ్మవైవర్త పురాణం గూర్చి "పఠన, శ్రవణాలు వలన శుభలాభాలు బ్రహ్మవైవర్తపురాణం గూర్చిన పఠన, శ్రవణాలు వలన శుభం, పుణ్యం చేకూరుతాయి. సర్వవిఘ్నాలు దూరీకృతం అవుతాయి. హరిభక్తిని పెంపొందిస్తాయి. పరలోకంలో సహితం సుఖ సంతోషాలు కల్గుతాయి.

# సృష్టి క్రమము

ఈ పురాణము పూర్వము బదరి కావనమున నారాయణడు నారదున కుపదేశింపగా నారదుడు వ్యాసున కుపదేశించెను. మీకు దానిని వినిపింతును వినుడని సూతుడు మొదలు పెట్టెను. ఇందు నాల్గుఖండములు కలవు. ప్రళయ కాలమందు జలం సమస్త లోకములాక్రమించును. దాని ప్రభావవము సర్వ ప్రపంచవము మీద ప్రతి ఫలించుచున్నది. ఆపై గోలోకమున్నది. అందు మూడు కోట్ల యోజనములు వైశాల్యముగల మనోరమ పురియుండేను. అది మధ్య భాగములో దేనికంటకుండ కేవల హరిప్రభావంతో నిలబడియున్నది. ఏబది కోట్ల యోజనవములు గోలోకవైశాల్యము పురి ఉండేది. పరబ్రహ్మ నివాసము ఇతడు తన దివ్య తేజమును నలు దిక్కులా వ్యాపింప చేయుచూ లోకములను చూచుచుండెను. దాని క్రింద వైకుంఠము అందు సృష్ట్యాదిని శ్రీహరియై యాదిపురుషుడు శ్రీలక్ష్మితో నుండెను. దానికి వామ భాగములో కైలాసముండును. శివుడు పార్వతీ సహితుడై అందుండును. గోలోకమునుండి యాతేజోమయుడు పారచూడగా ఇవి అన్నియు శూన్యవుగా కనిపించును. త్రిగుణములాధారముగా త్రిమూర్తులు కల్గిరి మూడు కల్పకములున్నవి. బ్రహ్మ వరాహ పద్మ కల్పకములు. కల్పాంతకమందు వారు నశింతురు. నూరుయుగములు నాల్గు జరిగిన దేవతల కొకయుగము. దేవతాయుగములు డెబ్బది యొక్కటి కాగా మన్వతరమగును. బ్రహ్మదినము పదునాల్గు మన్వంతరముల కాలము. బ్రహ్మ సంవత్సరమనగా నటువంటి దినములు మూడు వందల యరువది కావలెను. అట్టి సంవత్సరములు నూటయెనిమిది బ్రహ్మయుర్దాయము.

బ్రహ్మదేవుని నూరు సంవత్సరములు మార్కెండేయుని కాయుర్దాయము. కల్పాంతరమం దన్నియు నశించగా మరల సృష్టి ప్రారంభమగును. సమస్తము శర్వునకప్పగించి సృష్టిని గోలోకవాసి నడుపుచుండును. మహేశ్వరుడు విరాగియై యుండనెంచి శివశక్తి ఇటకు వచ్చెను. శక్తి సంబంధముగా నన్ను యేల బంధనములో నుంచెదవు? స్వేచ్ఛగా మసలీనీయు" మని కోరగా శ్రీహరి శివునకు భక్తి ప్రభావము చెప్పసాగెను. పరమ పురుష ధ్యానము శక్తి వంతుని చేయును. భక్తి వలన ననేక శక్తులుత్పన్నమగును. నవ విధ భక్తి మార్గములో కొన్ని గాని, యన్నీ కాని తమకులంభించిన వారికి ముక్తిక ల్గును. మోక్షము పొందుటనగా షడ్గుణైశ్వర్యంలభించుట ఈశ్వర రూపమందుట ప్రభునియందు లీనమగుట. ముక్తి రూపము లిన్ని విధముల నుండును. శరీరములు వదిలిన తరువాత మోక్షము. భక్తి వలన లభించును. ఇంకను సిద్ధులను పేరుగల శక్తులు యెనిమిది ఉన్నవి అవి భక్తి విశేషంతో ప్రాపించగలవు. వాటి లాభములు వివరింతునని ఇట్లు మొదలిడెను. అందు మొదటిది ఇతరులకు కనిపించకుండా నణువుగామారి యుండునది. దానినే "అణిమ" యందురు. సర్వలోకముల నణురూపములో తిరుగట తన ప్రభావముతో సూర్యమండలము దాక సంచారము చేయు శక్తిని లఘిమయందురు. తనకు కావలసిన వస్తువుల ఇతర సహాయము లేకుండా తన వద్దకు వచ్చునట్లు చేసికొను బలమును ప్రాప్తి శక్తి యందురు. తనకు ఇష్టమైన గతితో సంచరించుచు కావ్యముల నందినను పాపమంటని బలమిచ్చు నది ప్రాకామ్యశక్తి యందురు. మహిమయను పేరు గల శక్తి యున్నవాడు ఎంతో దుర్లభమగు వస్తువునైనను తన దగ్గరకు జేర్చుకొను దివ్యాకర్షణ కలిగి యుండును. సమస్త ప్రకృతి మీద తన యాధిపత్యము నిరూపణ చేసి నడుపుటను ఈశత్వమందురు. సర్వము తన వశములో నుంచుకొని

యాధిపత్యము పొందుట వశిత్వము "గా తెలియవలయును. ప్రపంచము నందలి సర్వపదార్థ జ్ఞానము కలిగి యుండునది, "సర్వజ్ఞత శక్తి" యనబడును. దూరములో వుండు వాటిని తానున్న స్థలముల నుండి చూచుట, అచటజరుగు విషయములు ఎరుగుట "దూర దర్శిత్వం" దూరములో రహస్యముగామాట్లాడు మాటలు వినపడు శక్తిని "దూరశ్రమణము" అందురు. ఇతర మృత దేహములందు ప్రవేశించి దానిని నడుపు బలము "పరకాయ ప్రవేశము" తానన్నమాట జరుగునట్లుండుట. వాక్శుద్ధి అందురు. కోరినవి సమకూర్చి ఇచ్చుట "కల్పవృక్ష శక్తి" అందురు. సృష్టించు శక్తితో నుండినది ప్రభుత్వ శక్తి అందురు. సమస్తమును సంహరించు శక్తిని "సంహార శక్తి" అందురు. దేవతారూపంలో స్థిరత్వంగా ఉండు శక్తిని "దేవత్వ బలము" అందురు. అందరిలో తాను ముఖ్యడుగా ఉండు శక్తిని సర్వాగ్రత్వ శక్తి అందురు. సమస్తకామములను జయించి నిర్వికారంగా నుండు శక్తి సర్వమవశానస్వ్ ము అనబడును. వీటిలో మొదటి ఎనిమిది శక్తులు "అష్టైశ్వరములు" అనబడుచున్నాయి. ఇట్లు భక్తి ప్రభావము నందు ఉత్పన్నమగు శక్తులు గురించి శివుడు శ్రీహరిని చూచి "శ్రీహరీ! నన్ను యీ దుర్గాబంధనములో నెందుకుంచెదవు? మహాశక్తులు సంపాదించుకొని, విశ్రాంతిగా నుండనీయరాదా?" యనగావిని శ్రీహరి "శంకరా! నీవు సర్వసమర్థుడవు. నీవు జ్ఞానవైరాగ్యములందు ప్రముఖుడవై యుందువు. ఈ దుర్గ మహాపతివ్రత. నీయడుగుజాడలలో నడుచుకొనును. నిన్ను దాటిపోవదు. నిన్ను కామ్యాదులందు దిగనీయదు. నీకు యీదుర్గసాయపడును. అని చెప్పి దుర్గను చూచి "దుర్గా! నీవు నిన్ను స్మరించిన వారికిని, నీ ప్రతీకలుగా లింగముల నారాధించిన వారికి సమస్త పాపములు నశించి సర్వశుభాలు కల్గును. సర్వశక్తి స్వరూపిణివి. కొన్నాళ్ళకు సతీ దేవియను పేరు దక్షపుత్రిగా జరింతువు. శివుని మనువాడెదవు. నీభర్తను

ఆహ్వానింపక పరాభవించెనని లెక్కబెట్టక అడుగుటకు పుట్టింటికి వెళ్ళెదవు. నీ తండ్రి దక్షునిచే పరాభవితవై నీ శరీరమును యోగాగ్నిచే భస్మీభూతము గావింతువు. తరువాత జన్మలో హిమవంతుని కుమార్తెవై పార్వతిగా పుట్టి శివుని గురించి తదేక దీక్ష బూని తపము చేసి శివ కటాక్షము పొందగలవు . ఈమహేశ్వరుడు స్వయముగా వచ్చి నిన్ను గ్రహించగలడు. తరువాత మీరిరువురు శివ దంపతులనబడుచు శాశ్వత స్థానము పొంది లోకపూజనీయులై యుండగలరని చెప్పి" శ్రీహరి వెడలిపోయెను.

# విష్ణువు -దేహరుగ్మతలను చెప్పుట

పూర్వం మాలావతి అనే విష్ణుభక్తురాలు వుండేది. ఆమె భర్త పేరు ఉపబర్హణుడు. మంచి యవ్వనంలో వున్న ఆ నూతన దంపతులు ఎంతో ఆనందంగా వుంటూండగా –కర్మవశాన ఉపబర్హణుడు స్వల్పకాలంలోనే అకాలమృతువు పాలైపోయాడు. వయస్సులోవున్న మాలావతి తన దురవస్థకు శతధా విలపించింది. విష్ణువును పదేపదే స్మరించింది. విష్ణువామెయందు దయాళువై బ్రాహ్మణ రూపంలో దర్శన మిచ్చి ఆమెను ఓదార్చాడు. అశాశ్వతమైన దైహికపర దుఃఖం విసర్జనీయమని బోధించాడు. ఆ సమయంలో మాలావతిచే ప్రశ్నించబడిన వాడై– శ్రీమహావిష్ణువు– బ్రాహ్మణ రూపంలో – ఆమెకు దేహరుగ్మతలను గురించి చెప్పసాగాడు.

"లలనామణీ! వ్యాధులన్నిటిలో శ్రేష్టమైనది జ్వరం. దానికి అన్నగారు అజీర్ణము. జ్వరం నాలుగు రకాలు. 1. పిత్తజ్వరము 2. శ్లేష్మజ్వరము 3. వాతజ్వరము 4. త్రిదోషజ్వరము ఈనాలుగుగాక ఇంకా అరవైనాలుగు రకాల వ్యాధులున్నాయి. ఈ సర్వ వ్యాధులు దేహంలోకి ఒక్క సారి ప్రవేశించాయిరా అంటే మరి వదలవు. అందువల్ల, ముందు జాగ్రత్త విజ్ఞాల లక్షణం.

## ఆరోగ్య సాధనములు

కష్టపడి పనిచేయడం, అరికాళ్ళకూ, తలకూచెవి రంధ్రములందూ తరచుగా తైలసంస్కారం జరపడం. వసంత ఋతువులో నులివెచ్చనిఅగ్నితోనే కాచు కొనుట, వయసులో ఉన్న స్త్రీలనుమాత్రమే సంగమించుటం, నదీతటాకాలలో స్నానం చేయడం, గంధం మొదలగునవి, రాసుకోవడం, ఎండాకాలం సాయంత్రాలు గాలిలో సంచరించడం, నియమితమైన భోజనం చేయడం, శరదృతువులో శరీరానికి ఎండ తగలనివ్వకపోవడం, కూపస్నానం అగ్నినికాచుట వెచ్చని ఆహారం తీసుకొనుట, శిశిర ఋతువులోవేడినీళ్ళ స్నానంచేయడం, శరీరాన్ని యుక్తవస్త్రాలతో ఆచ్ఛాదించు కొని యుండుట, ఆకలి కలిగినపుడు మంచి ఆహారము తినుట, చల్లనీరు త్రాగుట, తాంబూలము, వయస్కులైన స్త్రీలతో మిత సంపర్కము, రాత్రులందు మజ్జిగతోను, పగలు ఆవు పెరుగుతోను భుజించుట. బెల్లము– పంచదారలతో కూడిన పదార్థములు తినుట, ఇంద్రియ నిగ్రహము, సర్వాయవముల చేత మితముగా పనిచేయించుట మొదలగు నియమములను క్రమం తప్పక పాటించినట్లయితే అనవసరజ్వరం, అకాల మృత్యువులు సంక్రమింపవు. ఎండుమాంసం భుజించకూడదు. తనకన్న యెక్కువ వయసు గల స్త్రీతో సంయోగం కూడదు. రాత్రుళ్ళు పెరుగు త్రాగరాదు. పుల్లని పెరుగును యెన్నడు సేవించకూడదు. ఋతుకాలంలో స్త్రీని కూడరాదు. ఇవన్నీ శీఘ్రజరా, జ్వర–మృత్యువులకు దారులు.

## పిత్తప్రకోపకారణం

బాగా ఆకలిలేస్తున్నప్పుడు భోజనంచేయకుండా వుండడం, తాటి పండువంటివి తిని వెనువెంటనే మంచి నీళ్ళు త్రాగడం, శరదృతువులోవెచ్చటి పానీయాలు తీసుకోవడం, భాద్రపద మాసంలో చేదు తినడం– వీటివల్ల

పైత్యం పుప్పొంగి వ్యాధులు వస్తాయి. ధనియాలచూర్ణమును పంచదార నీళ్ళలో కలిపి త్రాగటం వలన, పెసలు నానబెట్టి త్రాగడంవలన పిత్త శాంతి కల్గుతుంది.

## శ్లేష్మం (కఫం) ప్రకోపించు హేతువులు

అన్నం తిని స్నానం చేయడం, దాహంలేకనే నీరు త్రాగడం, పాసిపోయిన అన్నం తినడం, వాననీరు త్రాగడం వర్షాకాలంలో నూతినీళ్ళతో స్నానం చేయడం, అరటిపళ్ళూ పెరుగు కలిపి ఆరగించడం, వంటివి దుర్గంధతైలం రాచుకోవడం, నిలవనీళ్ళతో జలకా లాడటం – అనే వాటివల్ల కఫరోగాలు కలుగుతాయి. ఇటువంటి కఫప్రకోపాలు తగ్గాలి అంటే దిగువ నియమములు పాటించాలి, శొంఠిని కాల్చుకొని తినడంవల్లా– కఫప్రకోపం నశిస్తుంది. అధికంగా నీరు త్రాగకుండుట, లేతఅరటికాయ తినుట, అమిత సంచారాలవల్ల కూడా కఫం తొలగుతుంది. అగ్ని హోత్రం దగ్గర వళ్ళు కాచుకొనుట. వేయించిన కందులు తినడం కందిపొడి శనగ పొడిలాంటివి సేవించడం, మరగబెట్టి చల్లారిన తైలాలతో మర్దనా చేసుకోనడం యెండగట్టివేసిన వస్తువులు భుజించుటవల్లా కఫం తగ్గే అవకాశాలు వున్నాయి.

## వాతప్రకోప-నివారణ

అమితమైన భయంవల్లా, అధికమైన కోపంవలన పరుషశబ్దాలచే కలహప్రియుల్లా చరించడంవల్లా, తరచు పస్తులుండడంవలనా, అతిగా దుఃఖితులు కావడంవలనా, అతి సంచారం, అతి రతి, అస్తమానం నిప్పుదగ్గర వళ్ళు కాచుకోవడం– మరీముఖ్యముగా భోజనంచేసిన వెంటనే రవ్వంత విశ్రాంతి నైన యివ్వకుండానే పనులు చేయడం అనేవి వాత ప్రకోపహేతువులు. గంధాదులు రాచుకొనుట తామరాకులలో శయనించుట, తలకూ, వంటికీ చక్కగా నూనె మర్దనా చేసుకొనుట,

చన్నీరు సేవించడం, కొబ్బరి నీరు–పంచదార పానకం సేవించడం, మంచి అరటిపళ్ళు భుజించడం, తియ్యటి ఆవుపెరుగు తినడం అనేవాటి వల్ల –వాతప్రకోపం శాంతిస్తుంది.

విష్ణువు చెప్పిన దైహికరుగ్మతా నివారణాదులు వినిపించి తదనంతరం ఉపబర్హణుడి పూర్వజన్మమైన "బ్రహ్మనారదులు" కథను ఈ విధంగా చెప్పసాగాడు సూతమహర్షి.

# బ్రహ్మ-నారదుడు

శ్రీహరి నాభికమలమందు బ్రహ్మజన్మించెను గదా! అతడు జన్మించిన తరువాత సనక, సనంద, సనత్కుమారాదులను నలుగురతనికి మానసపుత్రులై జన్మించి తపమాచరింపబోయిరి. బ్రహ్మవామభాగమునుండి స్వాయంభువమనువు. వాని భార్య శతరూప బుట్టిరి. వీరు క్షత్రియ వంశమునకు మూలపురుషులైనారు. ఏకాదశ రుద్రులు పాదముల నుండియు, దక్షిణ కర్ణమునుండి పులస్త్యుడు వామ కర్ణము నుండి పులహుడు, దక్షిణ నేత్రమునుండి అత్రి, వామనేత్రమునుండి యొకమహర్షిని, అంగీరసుని, భృగువుని దక్షుని నారదుని జనింపజేసెను. వారిని సృష్టికై వినియోగించగా నారదుడు బ్రహ్మనుచూచి "తండ్రీ! నాయగ్రజాలు సనక సనందనాదులు తపములాచరించుచుండగా నన్ను ప్రకృతిలో బడవేయుదువా! యిది న్యాయమా?" అని యడిగెను. దానికి బ్రహ్మదేవుడు "నారదా! నాయాజ్ఞ ధిక్కరించి మాట్లాడినావు గాన, నీవు తత్త్వవిషయము మరచిపోయి స్త్రీలోలత్వమున విహరించుచుందువుగాక. గంధర్వుడవై "ఉపబర్హణ" నామముతో నాజాతికి మూలపురుషుడవై పదారువేల

సంవత్సరముల స్త్రీ భోగముల మునిగియుండి వీణావాదన కుశలత్వమున ఘనుడవగుదువు. మరుజన్మలో దాసీపుత్రునిగా జన్మించి శ్రీహరి భక్తినలవరచుకొని, యాతని దయవలన పునః నాకు కుమారుడవై జన్మింతువుగాక! ఆ జన్మలో నాచే జ్ఞానోపదేశితువై శ్రీహరిభక్తిసమారి భక్తిరసమూర్తివై శాశ్వతకీర్తి పొందెదవు పొమ్మ"నెను. నారదుడు కోపగించి "కుమారుని వల్ల నిర్దయ చూపిన నీవు ముల్లోకములలో యెవరివలనను పూజాదులే పొందకుందువు గాక! యని శపించి పోయెను.

## ప్రకృతి- వివిధరూపములు

లోకములన్నియు ప్రకృతి బాహ్యరూపము. ఈశ్వర తేజములోని యదృశ్యరూపము. ప్రకృతి పురుషుడు కలిసినప్పుడే స్వరూప స్వభావము లేర్పడును. వివిధాకృతులతో ప్రకృతి శక్తి స్వరూపయై సంచరించుచుండును. ఆమెయే "ఆదిశక్తి" అనబడుచున్నది. ఆమె నుండి త్రిమూర్తుల భార్యల రూపములతో సరస్వతి, లక్ష్మి పార్వతి లావిర్భవించిరి. అందరు మెచ్చునట్టి పశు, ధాన్య, ధనగృహారామ, రాజభూస్వరూపముల ఆధిక్య రూపమై లక్ష్మిగా యీనామముల బిలువబడుచు శోభించుచున్నది. విద్యాశక్తి సావిత్రియనబడుచున్నది. ఆమె శక్తితో మంగళా శక్తి యుదయించినది. ఆమెయేచండీశక్తి యనబడుచున్నది. దుర్గాకాళీ వీరందరూ శక్త్యంశా సంభూతు రాండ్రే. వీరు దుష్టశిక్షణార్థం అవతారములు దాల్చి, లోకరక్షణము కావించిరి. ప్రకృత్యంశజాతయే భూదేవి. ఆమెవలననే సమస్తజంతుజాలము కడుపార నన్నము భుజించుచున్నది. భూదేవి యందు ఖనిజములు, లోహములు, రత్నములు సర్వనిధులూ నిక్షిప్తములై యున్నవి. ఆమెకు రత్నగర్భయను పేరుమగలదు. మరియొక శక్తి స్వరూపిణిస్వాహాదేవి. ఈమె యగ్ని దేవుని భార్య. దేవతాహ్వానములు కావించుచు యజ్ఞములందు

చివర స్వాహా యని యుచ్చరించక పోయినచో, యగ్ని, నిర్దిష్టదేవతలకా యజ్ఞభాగముల నాహుతుల నందీయడు. పితృదేవతలు మెచ్చరు. వాయుదేవుని భార్య"స్వస్తి" గాన యామెనుచ్చరించకున్న దానధర్మాదులు నిష్ఫలమగును. యాజ్ఞవల్క్యమహాముని మునున్న శాపగ్రస్తుడై దేవీయవతారిణియగు సరస్వతి గూర్చి తపమాచరించెను. ఆ తపమునకు లోకము లాశ్చర్యమందెను. ఆ ముని తపస్సునకు మెచ్చుకొని సరస్వతి దేవి వరదానము చేయదలచి ప్రత్యక్షమై"ఏమి కావలె" ననగా – అతడానందపడి "తల్లీ! నేను మరచిన విద్యలన్నియు మరల స్ఫురణకు వచ్చునట్లు వరమీయుమని' కోరిన విని నీ విద్య నేలమరచితివి! అని ప్రశ్నించగా నాతడిట్లు చెప్పెను.

# యాజ్ఞవల్క్య శాపము

"అమ్మా! నా చరిత్ర వినిపింతును వినుము. మాగురువు వైశంపాయనుడు మహాపండితుడు. ఆయన చక్రవర్తి కాశ్రితుడు. ప్రతిదినము పూజాదులైన తరువాత అక్షితలు చల్లి రాజును దీవించి వచ్చుటాయన కాచారముగా సాగుచుండేను. ఒక నాడు గురువుగారు గ్రామాంతరమేగవలసి వచ్చినది. ఆయన నన్ను బిలిచి ఆరోజున తనమారుగా రాజగృహమునకు పోయి రాజును దీవింపమన్నారు. నేను రాజభవనమునకు పోయి పూజగృహము వద్ద వేచితిని. అప్పటికే రాజు పూజ పూర్తిగావించుకొని వెళ్ళి పోవుటచే యామందిరము సందడి లేకుండెను. నేను నా చేతిలోని యక్షతలు యాప్రదేశమున జల్లి నా దారిన నేను పోతిని. కొంతసేపటికి రాజు మరల పూజగృహమునకు వచ్చుసరికి సువర్ణచ్ఛాయలు చిమ్ముచు నక్షతలు నేలమీద వింతకాంతులీనుచున్నవి. దానితో ఆయన నన్ను చూడవలయు నని గురువు వచ్చిన తరువాత కబురు పంపెను. నేను

తానులేకుండా అక్షంతలు నేలచల్లి నానన్న కోపముతో రాజా దండించునని భయపడితిని. గురువుగారు వచ్చిన పిదప రాజవర్తమానము ననుసరించి, రాజదర్శనము చేసి రమ్మని గురువు పదేపదే చెప్పెను. నేను ఆ మాటలను పాటించలేదు. గురువునకు కోపము వచ్చి తాను చెప్పిన విద్యలు క్రక్కివేయుమని తీవ్రముగాననగా నేను క్రక్కివేసితిని. అవితిత్తిరిపిట్టలు తినినవి. ఫలితముగా వాని స్వరములు తైత్తరీయోపనిషత్తులైనవి అని యాజ్ఞవల్క్యుడు చెప్పినది విని సరస్వతి నీకు విద్యలు మరపురాకుండా నుండు గాకయని వరమిచ్చిపోయెను. ఆ తరువాత యాజ్ఞవల్క్యుడు సూర్యశిష్యుడై సమస్త విద్యలనభ్యసించెను.

## కుజ జననం

తరువాత కుజ జననము గురించి యడుగగా సూతు డిట్లారంభిచెను. పూర్వము హిరణ్యాక్షుని వధించి యాభూమిని వరాహరూపమైన శ్రీహరి తన కోరలపై నిల్పికొని వచ్చెను. అప్పుడు భూదేవి యతని రూపమును చూచి మోహించి తన్ను సంతోషపరచుమని వేడెను. శ్రీహరి యామెకోరిక తీర్చగా సద్యోగర్భమున భూపుత్రుడై మంగళుడను నామముతో కుజుడు జన్మించెను. తరువాత, వేదవతీ చరిత్రమును చెప్పుమని కోరగా నాతడిట్లు ప్రారంభించెను.

## వేదవతి చరిత్రము

మున్ను మనువంశము నందు శ్రీ రాజసావర్ణియను వాడు మహాశివభక్తుడై శివానుగ్రహము నంపాదించెను. శ్రీరాజసావర్ణిపై సూర్యుడెందుకో కోపము చెంది, రాజ్యలక్ష్మి భ్రష్టత్వమందుమని, శపింప శివుడు శూలము గొని సూర్యుని వధింపబోయెను. అతడు భయపడి బహ్మనాశ్రయించి బ్రహ్మ

సలహాపై సూర్యుడు శ్రీహరిని శరణువేడెను. ఇంతలో శివుడు శూలాయుధముతో వైకుంఠమునకు వచ్చెను. విష్ణువు శాంతిపరచి సూర్యశాపము తప్పకపోయినను నేను దానిని మరల్చిరాజ్య, లక్ష్మి లాభములు కలిగింతునని చెప్పి ఇట్లనెను.

ఈ సావర్ణి రాజ్యము పోయినను వీనికి వృషధ్వజుడు వానికి ఋతుధ్వజుడు గల్గుదురు. వానికి ధర్మధ్వజకుశ ధ్వజులు కల్గి విష్ణుభక్తి పరులగుదురు. వారికి లక్ష్మియంశగా ఒక కుమార్తె కల్గునని. శివుని శాంత పరచి పంపెను. ఆ విధముగా జన్మించిన కన్యక లక్ష్మి అంశము కలది. కుశధ్వజానకు మాలావతికి కన్యగా జన్మించినది, వేదవతి. ఆమె శ్రీహరినే భర్తగా వాంఛించి పుష్కర తీర్థమున బ్రహ్మను గురించి తపమాచరింప బోయెను. బ్రహ్మ ప్రత్యక్షమై నీకోర్కె మరొక జన్మలో నెరవేరును అని చెప్పి వెడలిపోయెను. ఆమె బ్రహ్మ చర్య దీక్షతో గంధ మాధన పర్వతమునకు వెళ్ళి శ్రీహరిని గూర్చి పరమ నిష్ఠతో తపమాచరించు చుండెను. ఇంతలో రావణుడు దేవలోక దండయాత్ర గావించుకొని ఆ పర్వతమార్గముగుండా పోవుచు. తపమాచరించుచున్న వేదవతిని మోహించెను. తనకు భార్యగా వుండమని అనేక విధములుగా బ్రతిమాలెను ఆమె తన తపోవిఘ్నమునకు కోపించి రావణుని వంశము నాశనమగునట్లు శపించి గంగలో మునిగి ప్రాణములు విడిచెను. ఆమె మరుజన్మలో లంకలో ఒక సరోవరమందలి తామర పువ్వులో జన్మించెను.

రావణుడు "పుష్పజను" ఒక పెట్టెలో పెట్టి సముద్రమున విడచి వైచెను. ఆమెయేం విధివశమున మిథిలలో జనకుడు యజ్ఞభూమిని దున్నుచుండగా నాగలి చాలులో దొరకినది. ఆమెను చూచి సంతోషించిజనకుడామెను సీత అని నామకరణము గావించి పెంచుకొని

రామునకిచ్చి వివాహము చేసెను. ఇది వేదవతి వృత్తాంతమును వినిపించెను. "మునీంద్రులారా! మీకు వేదవతి చరిత్ర వినిపించితిని. ఇంక ఏమి కోరుదురో చెప్పుడనగా వారు సాలగ్రామ మహిమకు కారణమగు తులసి వృత్తాంతమును చెప్పుమనికోరిన మీదట ఇట్లు ఆరంభించెను.

## తులసి వృత్తాంతము

కుశధ్వజునియన్న ధర్మధ్వజుడు. అతడు మాధవి యను భార్యతో కూడి గంధమాదనమున తపమాచరించగా వారికొక కుమార్తె కలిగినది. అతిలోక సౌందర్యవతి యైను ఆమెకు బృందా అని పేరు పెట్టిరి. ఆమెకు శ్రీహరిని వాంచించి బదరికాశ్రమునచేరి బ్రహ్మను గురించి తపమాచరించసాగెను. బ్రహ్మ దర్శనమిచ్చి నీకోరిక చెప్పుమనగా నేను రాధాశాపముతో వున్న రుక్మిణిని, నాకు శ్రీకృష్ణుడే భర్తగా కావలయును అన్నది.

బ్రహ్మ విని నీకు తప్పక అతడే భర్తకాగలడు గోలోక నివాసి సుధాముడు మొదట నిన్ను పెండ్లాడును. తరువాత నీవు కోరినవాడే నీకు పతియగును అని చెప్పి వెళ్ళిపోయెను. బ్రహ్మదేవుడు చెప్పిన సుధాముడు శాపకారణమున భూలోకమున శంఖచూడుడై జన్మించెను. అతడు కూడా బ్రహ్మ గురించి పుష్కర తీర్థమున చిరకాలము తపమాచరించెను.

## తులసీ - శంఖచూడుడు

బ్రహ్మ ప్రత్యక్షమై వరము కోరుకొమన్నాడు. అప్పుడు శంఖచూడుడు"లక్ష్మిభూలోకమున పుట్టినదట! నాకు ఆమెతో వివాహము చేయించ కోరుతున్నాను" అనెను. దానికి బ్రహ్మ ఆమె బదరికాశ్రమున

నున్నది, నీకు లభ్యమగునని చెప్పి అంతర్ధానమందెను. శంఖచూడుడు వెంటనే బదరికాశ్రమునకు వెళ్ళి తపోనిష్ఠ వున్న బృందను చూచి పరమానందము పొంది "ఓ సుందరి! నీవెవ్వరిదానవు ఒంటరిగా ఇచట యేలవున్నావు" అని ప్రశ్నించెను.

బృంద తన గురించి చెప్పి అతని విషయమడిగినది. అందులకతడు "నేను శంఖుచూడుడను వాడను. నాది రాక్షస వంశము నిజముగా నేను ఆ వంశములో జన్మించ వలసినవాడను కాను. పూర్వము నేను గోలోక వాసియగు సుధాముడను. రాధాదేవి శాపముతో నాకీ జన్మవచ్చినది. నేను పుష్కర తీర్థమున బ్రహ్మ దర్శనమందితిని. నాకు తగిన తరుని బదరిక్రాశ్రములో వున్నది చూడమని అతడు చెప్పగా నీకైవచ్చితిని." అని అనగా విని తులసి "తపోనిష్ట వున్న స్త్రీలతో ఇలా మాట్లాడుట తగదు" అని నిరాదరించెను. అప్పుడు బ్రహ్మ ప్రత్యక్షమై "బృంద! నీవు ఈ శంఖచూడుని వివాహమాడుము. నేను చెప్పిన మొదటి భర్త ఇతడే" అని చెప్పి అచ్చటనే బృంద శంఖచూడులకు వివాహం చేసెను. శంఖ చూడుడు బృందతో కలసి తన నగరమునకు పోయి సుఖములను భవించుచుండెను. లక్ష్మీ అంశతో ఉన్న భార్యకల్గుటచే అతనికి రాజ్యము, బలము సంపద పెరిగిపోయినవి. శంఖచూడుడు క్రమక్రమంగా సర్వాధిపత్యమును సాధించి దేవరాజ్యములను కొల్లగొట్టసాగెను. వారందరు అతని తపోబలమునకు వెరచి ఎదురించలేక తప్పుకొని తిరుగుచుండిరి. ఒకనాడు శంఖచూడుడు కైలాసమునకు పోయెను. ఆ సమయమున పార్వతి సమేతుడైన శంకరుని చూచి శివా! నీ భార్య సుందరాంగీ ఆమెను నాకు వశ్యురాలుగా చేయుము. అట్లు చేయనిచో నీతో యుద్ధంచేసియైనను పొందెదనని బీరములు పల్కెను. శివుడు యుద్ధం

చేసి వాని గర్వమనుచబూనెను. వాడు అజేయుడై వుండుటకు తెల్లబోయి వెంటనే శ్రీహరిని సమీపించి శంఖచూడుని విషయంవమునం వివరించి సాయపడమనెను. శ్రీహరి నవ్వి"శివా! వీని భార్య మహాపతివ్రత, ఆమె పాతివ్రత్యము చెడిననే గాని వీడు చావడు, పాతివ్రత్య భంగము నేనాచరింతను. నీవు వీనిని వధించు" అని యుక్తి చెప్పెను.

నారాయణుడు మాయాశంఖ చూడుని వేషము ధరించి బృందయున్న రాచనగరికి వెళ్ళెను. అతడు భర్తయే వచ్చాడని సంతోషించి బృంద అతనికి వుపచారములు గావించి కుతూహలముతో వుండగా శ్రీహరి ఆమెను స్పృశించెను ఆమె తన పాతి వ్రత్యము భగ్నమగుట గ్రహించి అతడు తన భర్తకాడని గ్రహించి మండిపడి వచ్చినది శ్రీహరిగా నెరిగి తీవ్ర కోపముతో "నీవు శిలారూపవుందుదువు గాక" అని శపించగా అతడు "నీవు వృక్షమగుదువు గాక" అని శపించెను. ఇంతలో శివుడు శంఖచూడుని సంహరించగా అతడు దేహమును విడచి సుధాముడై గోలోకమునకు పోయెను. బృంద తులసి వృక్షమై పోయింది. శ్రీహరి సాలగ్రామశిలా రూపమొందెను. ఇద్దరూ ప్రపంచముచే పూజనీయ స్వరూపములందిరి. తులసితో హరి తమతమ శాపాలు లోకోపకారము లగునని తెలియచేయుచు శ్రీహరి తులసితో నిట్లుచెప్పెను.

## సాలగ్రామ విశేషాలు

"వేమ గండికి నదిలో సాలగ్రామములో పుట్టుదును నన్ను పూజించినవారు సమస్త కోరికలు పొందగల్గురు. సాలగ్రామ విశేషములు వివరింతును వినుము. లక్ష్మీనారాయణమను సాలగ్రామము నాల్గు చక్రములు ఒక రంధ్రము వనమాల యున్నదగును. ఒక చక్రమున్నది లక్ష్మీజనార్దనము. రెండు రంధ్రములు ఒకచక్రము వనమాలా గోపాదములు గలదానిని

రఘునాదమని అందురు. రెండు చక్రములు ఒక రంధ్రముపైన రంగున్న దానిని దధివామన అందురు. రెండు చక్రాలు వనమాలయున్న శ్రీధరమందురు. గుండ్రని యాకృతి కల్గి స్థూలముగా రెండు చక్రములు వుండుదానిని దామోదరమందురు. గుండ్రముగా నుండి రెండు చక్రములు గల్గినదై బాణ తూణీరములున్న బలరామందురు. గుండ్రమై ఏడు చక్రములు గల్గి ఛత్రబాణ తూణీరములున్న రాజరాజేశ్వరమందురు. రెండు చక్రములుండి నీలవర్ణమై గోష్పాదములున్న దానిని మధుసూదనమందురు. సుదర్శన గదాదులుండి చంద్రాకారంతో నున్నది గదాధరమందురు. రెండు రంధ్రములు చక్ర గదా సుదర్శనములు గల దానిని హయగ్రీవమందురు భయంకరమగు వికృత రూపము గల్గి రెండు చక్రములున్న దానిని నారసింహమందురు. దీనిని సన్యాసులు పూజింతురు. వికృతముగా నుండి రెండు చక్రములు వనమాలా గలది. లక్ష్మీనారసింహమందురు. ఇది లక్ష్మీప్రదమైనది. రెండు చక్రములుండి పురుష రూపము గల్గినది వాసదేవమందురు. ఎన్నో చిందర వందరములు గల్గి చిన్న చక్రములున్నదానిని ప్రద్యుమ్నమందురు. రెండు చక్రములు కుడివైపు రంధ్రము గల్గినది సుదర్శనమందురు. దీనిని ఇంటియందుంచుకొని పూజించిన ధనధాన్యాదులుసమస్త సంపదలు పెరుగును. చక్రాకారముగల సాలగ్రామము ఏ ఇంటనుండిన ఆ ఇల్లు లక్ష్మీనిలయమగును. గోలాకృతిగానున్న సాలగ్రామము ఇంటియందుంచుకొని పూజించినవారికి విశేష లాభములు కల్గుచుండును. నీవు పొందిన శాపమును లోకోపకారముగా మారగలదు . సాలగ్రామారాధనకు తులసి పత్రములు ప్రశస్తములుగా నిర్ణయించితిని. బృంద నీవెవరవో ఎరుగుదువు. గోలోకములోనిదానవు. రాధ చెలికత్తెవు. రాధశాపముతో ఈ జన్మమెుందినావు. నీవు నన్నానాడు కాంక్షించి చేరుటచేతనే మనము శాపమందినాము.

ఇప్పుడు నా వల్ల నీపాతివ్రత్యమునకు భంగము జరిగినదని వాపోనక్కరలేదు. నన్ను గురించి బదరికాశ్రమములో తపమాచరించిన ఫలితముగానే నన్ను పొందితివి. సుధాముడు శాపవిముక్తి పొందినాడు నీవు స్వేచ్ఛగా గోలోకమునకు వెళ్ళి రాధాదేవి అనుగ్రహము పొంది సుఖించు"మని చెప్పి వెడలెను. ఇది తులసి సాలగ్రామ పవిత్ర చరిత్రము. ఇది పఠించినవారు లక్ష్మీ కటాక్షమంది శ్రీహరి దీవెనెలు పొందగలరని సూతుడు మునులకు చెప్పెను.

# ఇంద్రుడు -దూర్వాసుడు

ఈ విధంగా మహా పురాణకథలు వినిపించుచున్న సూతమునిని చూచి శౌనకాదులు తిరిగి ఇట్లు ప్రశ్నించిరి. "మహాత్మా! దూర్వాసుడు ఇంద్రుని శపించెనని అందురు. అతడా దూర్వాసుని ఆగ్రమునకెందులకు పాత్రుడయ్యెనో చెప్పగోరెదమని ప్రార్థింపగా ఇట్లు ప్రారంభించెను.

మహా మునులారా! ఈ వింత కథ మాకు విన్పింతును వినుడు. ఒక నాడు ఇంద్రుడు ఐరావతమునెక్కి లోక పర్యటనము చేయుచుండెను.. ఆ సమయమున దేవగణములు, మునులు, మహానీయులు, ఎందరో అతని వెంటబడి వచ్చుచుండిరి మధ్య దారిలో అతనికి దూర్వాసుడు ఎదురుగా వచ్చెను. ఆ మహామునిని నల్లంత దూరమున చూడగనే ఇంద్రుడు తన ఐరావతమును దిగి పాదచారియై ఎదురేగి సాష్టాంగ పడెను. దానికా మునీంద్రుడమితానందపడి చేతిలోని పారిజాత పుష్పమాలను దేవేంద్రునకు బహుమానముగా నిచ్చెను. అతడు ఆదరముగా అందుకొని తన వాహనమగు ఐరావత కంఠమున వేసి దాన్నలంకరించెను. అదామాల కంఠమునదాల్చి చికాకు పొంది తొండముతో వెలికి లాగి తన కాళ్ళతో

దానిని తొక్కివేసెను. ఇదంతయూ దూర్వాసుని కళ్ళముందే జరుగటకు అతడు మండిపడి నీయందు ప్రేమతో పారిజాత పుష్పమాల నేనీయగా దానిని నాల్గు కాళ్ళజంతువులకిచ్చి నాశనవుచేయించినావు. నా బహుమానము యొక్క విలువ గ్రహించని మూఢత్వము బూనినావు నీవు ధరించక దాని మెడలో వేసి ఇట్లు నలుగురిలో నన్ను అగౌరవము చేసినావు. నీవు అచిర కాలములో రాజ్యభ్రష్టుడవగుదువుగాక, నాపుష్పమాలను కాలనంటరాసిన నీ ఏనుగు తల తెగిపోవునుగాక!" అని శపించి వెళ్ళెను తరువాత శ్రీహరిని సేవించి రాజ్యమును సంపాదించుకున్నాడు ఇంద్రుడు. దేవతాద్వీపమున శిరస్సు తెగిపడెను. ఆ శిరస్సును తెచ్చి వినాయకునకు శంకరుడతికించెను. ఇది దూర్వాస శాప కథ యని చెప్పెను.

# రాధా కృష్ణ - విభేదము

అంత మునులు మహాత్మా! నీవలన మహా గాథలు వినుచున్నాము. శ్రీహరి ప్రసాదమును వాంఛించి మేము విను ఈ గాథలు శ్రీహరి అవతార విషయములుగా వుండుట మా పుణ్య విశేషము. శ్రీ కృష్ణ భగవానుని ప్రభావము అవతార విశేషములు మాకు వినివంపుమని కోరగా, సూతుడిట్లు చెప్పదొడగెను. "గోలోకమునందొకనాడు, రాధాదేవి బృందావనంలో విహరించు కాలములో చూచుచుండగానే శ్రీకృష్ణుడు మాయమైపోవుట కారాధ చాలా బాధ పడివిరహవేదనతో తన ఇల్లు చేరినది. తనతో చెప్పకుండా మాయమైన శ్రీకృష్ణుని కసర దలచి విస విస అతని మందిరమును చేరెను. ఆ మందిర ద్వార రక్షకుడుగా సుధాముడుండెను. ఆమె చర చరా పోవు సమయములో సుధాముడు అడ్డుపడి స్వామి వారి అనుజ్ఞ లేనిదే లోనికి పోరాదనెను. దానికి రాధ మండిపడి ."నీవు ద్వార

పాలకుడవు. నేను శ్రీకృష్ణుని ప్రియురాలినై యుండగా నన్ను నీవు ఆటంకపరచెదవా! నీ ఆజ్ఞకు నేను లోబడవలయునా దుర్మార్గుడా! నీవు భూలోకమునకు వెళ్ళి రాక్షస జన్మమెత్తుమని శపించెను. తరువాత రాధ శ్రీ కృష్ణుని మందిరము లోనికి పోయి అనేక విధములు నిందాలాపములాడి" విరజతో వున్నావుగాన ఈ విరజ ప్రవాహ రూపమగును గాక!" అని శపించెను. తనను శపించుటకన్న తన ప్రభువును నిందించుటచే కోపము చెందిన విరజ "ఓరాధాదేవి! నీవు కూడా భూలోకమున స్త్రీవై పుట్టుదువుగాక!" అని ప్రతిశాపమిచ్చెను. ఇది వినిన శ్రీకృష్ణ దేవుడు ఓలలనా మణులారా! ఇది శాపాల ప్రకారం సుధాముడు శంఖచూడుడుగా జన్మించును. నీవు బృందయను పేర జన్మించి వానిని పెండ్లాడి కొన్నాళ్ళకు వాడు శరీరము వదలగ నన్ను పొంది తిరిగి ఈ లోకమునకు వచ్చెదవు. ఈ విరజ నదీ రూపము ధరించి సమస్త జీవజాలముల పాపములు పోగొట్టుచు ధన్యమగు రీతిగా మహానదియై ప్రవహించునుగాక అని చెప్పి అప్పటికా ఘట్టము శాంతి పరచెను.

## శ్రీకృష్ణ ఖండము

ఆదివిన్నది మొదలు గోలోకవాసియగు శ్రీకృష్ణుడు యాదవ కులమందు జన్మించెనందురు. మహాకా కృష్ణ జన్మప్రకార మును ఆ లీలావతారమును కర్ణానందముగా వినిపింపుమని ప్రార్థింపగా సూతుడిట్లు ప్రారంభించెను.

కంసాది రాక్షసవీరులు లోకములోని ప్రజలను బాధించుచు యజ్ఞయాగాదులు ధ్వంసంచేయుచు భూదేవికి భారముగా సంచరించుచుండిరి. ఆ అధర్మవర్తనులను భరించలేక ఆ భారము మోయలేక భూదేవి బ్రహ్మపలవాపై ఆమె వైకుంఠమునకు పోయి నారాయణుని దర్శించి

తన గోడు వినిపించెను. అంత నారాయణుడు"ఓభూదేవి ! నీవు విచారించకుము. యాదవవంశమందు వసుదేవునకు దేవికీ దేవి యందు పుత్రుడనై పుట్టి నిన్ను బాధించువారిని నాశనము చేసి ధర్మమును నిలిపి నీ శ్రమమును తగ్గింతు"నని ఓదార్చి పంపెను.

శ్రీ హరి యాజ్ఞా ప్రకారం దేవతలందరు గోపాలురై జన్మింప సాగిరి. ఆదిశేషుడే బలరాముడిగా ఉద్భవించెను. పార్వతీ దేవి యోగమాయా రూపము ధరించినది. ఇట్లు శ్రీహరి జన్మావతారములో తోడ్పడుటకు ఎవరికి వారు భూలోకమున తమ తమ అంశముతో జననమందిరి. శ్రీహరిని కుమారునిగా పొందెడి వరమొందిన కశ్యపముని వసుదేవునిగను అదితి దేవకిగను ఉద్భవించిరి. పిమ్మట వసుదేవునకు దేవకీ దేవికి వివాహము జరిగినది. దేవకీదేవకి తోడబుట్టినవాడగు కంసుడు తోబుట్టువును, బావమరిదిని గౌరవముగా వారింటికి సాగనంపుచూ వారి రథము తానే స్వయముగా తోలుచుండెను. ఆ సమయంలో మార్గ మధ్యమున ఆకాశవాణి "కంసా! నీవెంత వెర్రివాడవు ఎవరిని రథముపై కూర్చోబెట్టి ప్రేమతో సాగనంపుతున్నావో! ఆ దేవకి దేవి ఎనిమిదవ గర్భాన జన్మించ బోయే బిడ్డే నిన్ను సంహరించును. తెలిసి వర్తించు" అని పలికినది అది విని కంసుడు తుళ్ళి పడి వెంటనే రథమాపి దేవకీ దేవిని సంహరింతునని కత్తి దూసెను.

## శ్రీకృష్ణ జననము

వసుదేవుడు అతనని నివారించుతూ"బావా! ఈ దేవకి ఎవరు నీతోబుట్టువు. నీకపకారం జరిగిన ఆమె సహించునా! నీవు కంగారు పడకు ఈమె వలన ఏ హాని లేదు గదా. కాన స్త్రీ హత్య మానుము మాకు కల్గిన సంతానమును నీకిచ్చి వేయుదుము. నీచిత్తము వచ్చినట్టు చేసికొనుమ"

అన్నాడు కంసుడనుమానించి యేమో! మీరేమి మాయ చేయుదురో మీరు ఇప్పుడు నాసాధీనములో బందీఖానాలో వుండుడు. మీకు పిల్లలు కలుగగానే కావలివారే నాకు చెప్పుదురు. నేను వారిని సంహరింతును" అని రథము మళ్లించి నూతన దంపతులను చెరసాలలో వుంచి గట్టి కాపు వుంచాడు. తరువాత దేవకీదేవి సంతానము ఏడుగురు కంసుని చేతిలో మరణించిరి. దేవికి చాలా బాధవడినది. కానీ ప్రయోజనం లేకపోయెను.

ఎనిమిదవ బిడ్డగా దేవకీ గర్భములో శ్రీహరి తన అంశమును నిల్పెను. శుభసమయమునకు బ్రహ్మాది దేవగణముల చెరసాలలోకి వచ్చి ఆదేవకీ గర్భస్థతేజోమూర్తినుద్దేశించి "ఓ తేజస్వరూపా! నారాయణా! నీవు ఈవలకు రాదగిన కాలము వచ్చినది. కంసాదులను సంహరించి భూభారము తీర్చుటకు నీవు వేంచేయు"మని ప్రార్థించిరి వారి ప్రార్థనమ విని ఆ శ్రీహరి దివ్యవాక్కుతో "నేనవతరించుచున్నాను. మీదారిన మీరు పొండి" అని వారలను పంపి తన నిజస్వరూపముతో అనగా చతుర్భుజములు శంఖ, చక్రాయుధములతో దేవకి వసుదేవులకు దర్శనమిచ్చెను. వారాజగత్ప్రభువును చూచి ఆనందం దయను సంపాదించిరి. శ్రీహరి పరమానందమంది "మీరు నన్ను పుత్రునిగా కావలెనని కోరినారు. మీ కోర్కె తీర్చుటకు నేను బాలక రూపమును దరింతును. నన్ను యమునా నది దాటించి రేపల్లెలోని యశోదకడ నుంచుడు. ఆమెవద్దనున్న ఆడ శిశువుని ఇచ్చుటకు కొని రండు తర్వాత పని చూతును. ఈ చెరసాల తాళములు వాటికవే విడియుండును. మరలి వచ్చిన పిదవ తాళములు పడియుండును. యమునా నది నీకు దారియ్యగలదని చెప్పి వారు చూచుండగానే శిశు రూపమందెను.

శిశు రూపమొందగానే దేవకీ వసు దేవులు పుత్ర ప్రేమతో ఆ బాలుని

రక్షణమాలోచించిరి. అర్ధ రాత్రియందు చెరసాల తాళములు విడిపోగా ఒక తట్టలో బాలునుంచుకొని దానిని తలపై నిడుకొని వసుదేవుడు రేపల్లెకు పోయెను. ఆ సమయమున యశోద నిద్రలో నుండెను. ఆమె ప్రసవించిన బాలిక ఆమె ప్రక్కనే పరుండియున్నది. వసుదేవుడు తన బాలుని ఆమె ప్రక్కన పరుండబెట్టి యాబాలికను తన తట్టలో నుంచు కొనెను. ఆ తట్టతలపై వుంచుకొని మరల యమునా నదిని దాటి చెఱసాలకు వచ్చి చేరెను. ఎప్పటి యట్లు తాళము పడిపోయెను. పిమ్మట ఆ బాలిక అప్పుడే జన్మించినట్లు కేరు కేరు అని బిగ్గరగా అరవసాగెను. చెరసాల కావలి వారు ఈ బాలికారోధనము విని తుళ్ళి పడి లేచి పరుగు పరుగున కంస మహారాజునకు నివేదించిరి. వాడు. నిద్రలో నుండి హఠాత్తుగా లేచి కత్తిపుచ్చుకొని చెరసాల గదిలోనికి ప్రవేశించెను. పరుండి ఏడ్చుచున్న బాలికను ఒంటి చేత్తో పైకెత్తి కత్తి దూసెను. దేవికి అడ్డువచ్చినది."ఇది ఆడు పిల్ల! మొగవాడైన నిన్ను బాధించునేమో గాని ఆడుదేమి చేయును. దీని వదలమని" ప్రార్థించెను. వాడు వినలేదు ఆమెను తలక్రిందులుగా పట్టుకొని కత్తితో నరకబోయెను. ఆ శిశువాపట్టు తప్పించుకొని గగనమునకెగసి పోయి అట ఎనిమిది చేతుల నిండుగా ఆయుధములతో యోగమాయ రూపమున నిలబడి "ఓరీ పాపీ కంసా! నీకాయువు మూడినది. నిన్ను చంపదగిన వాడు రేపల్లెలో పెరుగు చున్నాడు నీవతని వలన నీకు చావు తప్పదు. బుద్ధి కలిగి వర్తించుమని హెచ్చరించి అంతర్ధానమందెను. కంసుడు విచారముతో ఇంటికిచేరెను. ఆ రోజు రేపల్లెలోజన్మించిన శిశువులందరిని చంపుటే కర్తవ్యముగా భావించి ఎందరో రాక్షసులను ఆ పనికి పురమాయించెను.

# పూతన శకటాసుర సంహారము

కంసుడు పంపిన వారలలో పూతన యను రాక్షసి ఒకతె వుండెను ఆమె ఒక బాలెంత రూపము ధరించి వేపల్లెలో ఇల్లు ఇల్లు తిరుగుచుండెను. చివరకు యశోదా దేవీ గృహమునకు చేరి ఎవరు లేని సమయమున బాలుని ఎత్తుకొని పాలియ్య సిద్ధపడెను. యశోద వారించినను మానక " మా నాయన! రమ్మని చీర అడ్డము వేసి ఎత్తుకొనెను. అక్కడ వారందరు చూస్తున్నారు. విషము ధరించి పాలియ్య వచ్చిన పూతన చనుపాలను శ్రీకృష్ణుడు ఒక్క గ్రుక్కలో త్రాగివేసెను. ఆ గ్రుక్క పట్టుతోనే ఆమె శరీరములోని రక్తమాంసముల నరములు సమస్తము నలిగిపోవునట్లు పీల్చివేసెను. దానికి ఆగలేక పూతన"కుయ్యో మర్రో" అని కేకలు వేయుచు గింజాకో సాగెను. అతడు పట్టువీడక అట్టేపీల్చి ఆమె ప్రాణాలు తీసివేయగా పూతన మహా పర్వతమువలె కుప్పకూలెను. ఆమె పొట్ట మీద నున్న ఆ బాలుని యశోద ఎత్తుకొని దిగదుడుపుటు పెట్టితొట్టెలో నుంచెను. పూతన చనిపోయిన వార్త కంసుడు విన్నాడు. పూతనను చంపగలవారచట ఎవరున్నారని పరమాశ్చర్యమునొంది శకటాసురుని పిల్చి"ఓరీ! నీవు నందునిప్రేల్లెకు చేరి అచ్చటనున్న శిశువులనందరిని సంహరించి రమ్మనెను వాడు బండి చక్రపు రూపమొంది వీధులోకి వచ్చిన శిశువులను సంహరించు యెాజనతో తిరుగుచుండగా మాయారూపదారిగా శ్రీహరి వానిని కనిపెట్టెను. ఆడు కొనుటకు బయటకు వచ్చినట్లు ఇంటి వెలుపలకు వచ్చెను. అదే అదనుగా శకటాసురుడు యదునందనని మీదకు దొర్లాడుగా మీదకి వచ్చు బండి చక్రము చూచి దాని ఆకు పట్టుకొని దానితో దొర్లాడుచు పట్టుడిడుకవ దానినెక్కి త్రొక్క సాగినాడా శ్రీహరి.. ఈ మాయా బాలుని భారము వాడు సహించలేక తన బలము నశించిపోగా పడి పోయేను. ఈ

బాలుడు దానిని భారవముతో నొక్కివానిని సంహరించెను. వాడా సమయమున బండిచక్రాకారము వదలి నిజరూపముతో చనిపోయెను. బాలుడు వానిమీదాడుకొనుచుండుట చూచిన వారాతని యెత్తుకొని యింటికి గొనివచ్చిరి. రక్కసుని శరీరము దహనము గావించిరి.

# తృణావర్తుడు- విశ్వరూప సందర్శనము

శ్రీకృష్ణుడు శకటాసురుని వధించిన విషయము కంసునకు గూఢాచారుల వలన వార్త వెళ్ళినది. వాడాశ్చర్యపడి పోయెను. "మహాభయంకరులు, అపరిమిత బలవంతులగు నావారిని యెవరు సంహరించగలరు? వ్రేపల్లెలో నంతవీరుడెవడూ లేడే ! ఇది మాయాగా వున్నది ఈ సారి తృణావర్తుని పంపి ఆ శత్రువుని సంహారము చేయింతునని నిశ్చయించెను. తృణావర్తుని పిల్చి నందవ్రజములోని శిశువులను సుడి గాలి రూపమున సంహరించమని ప్రేరేపించెను. వాడు వేగముగా గొల్లపల్లెకు వెళ్ళి సుడిగాలి రూపమున వీధులలో తిరుగుచుండెను. వీని రాక గ్రహించిన జగత్పతి బాలక రూపముతో బయటకు వచ్చెను శిశు రూపధారియగు మాయా బాలుని తృణావర్తుడు తన సుడి గాలితో చుట్టబెట్టుకొని గగన మార్గంపట్టెను. అది చూచి మన కథానాయకుడు వానిని గట్టిగా పట్టుకొని వ్రేలాడసాగెను. కొంత దూరమా బాలుని గొంపోవగా ఆ భారమాతడు సహించలేకుండెను. వాడు గుడ్లు వ్రేల వేసి తన మాయా రూపము వదలి నిజమగు రాక్షసుడై నేలకూలెను. పర్వతాకారుడై పడిన వాని మీద బాలకృష్ణుడు చేతులు కాళ్ళాడించుచు నిలబడెను. అది చూచి నందాదులు ఆ బాలుని ఈ వలకు గొని వచ్చి తృణావర్తుని శరీరము తుండెముల క్రింద నరికి దహనము గావించిరి. శ్రీహరి స్పర్శచే ఆ శరీరము నుండి

సుగంధములు బయలు దేరి అచటి వారినాశ్చర్య పరచినవి. ఇట్లు మహామహామహుడగు జగదీశుడు తన మాయా రూపముతో ఎన్నెన్నో లీలా విశేషములు చూపించసాగెను. అందులో విశ్వరూప ప్రదర్శనమొకటి.

ఒకనాడు శిశువు తిరుగుచుండగా తోడి బాలురు యశోదకడకు వెళ్ళి "నీకుమారుడు మట్టితినుచున్నాడని చెప్పిరి. ఆమె వెంటనే బాలుని దండించదలచి, పిలిపించి "కృష్ణా! మన్ను తినుచున్నావా?" యని కోపపడెను. అందుకో గోపాలుడు "తల్లీ! నేను మన్ను తినుటలేదు. నామీద వారు నేరముమోపి చెప్పినారు కావలసిననానోరుచూడు" మని యొక్క సారి నోరుతెరచెను. యశోద నోటిని శోధించుచుండగా బ్రహ్మాండమైన ధ్వనులు విన్పించినవి. అవియేమో? యనితిరిగి చూచుచుండగా ఆనోటిలోనదులు, పర్వతములు, సమస్త లోకములతో సహా బ్రహ్మాండమంతయు కన్పించినది. ఆమె పరమేశుని స్తవముచేసినది కృష్ణుడు మరల మాయతో నోరుమూసికొని తల్లిని చేరెను.

# రుక్మిణీ కళ్యాణము

విశ్వకర్మ వలన సముద్రమధ్యమున ద్వారకా నగరము నిర్మింపజేసి శ్రీహరి యందు నివాసముగా నుండెను. ఆ సమయమున విదర్భ దేశమున భీష్మకుడను రాజు పరిపాలించు చుండెను. వానికైదుగురు పుత్రులు, నొక కుమార్తెయు నుండిరి. ఆ కుమార్తె పేరు రుక్మిణీ ఆమె శ్రీకృష్ణునియం దాదర బుద్ధితో నాతని వివాహమాడ దలచెను. తన తండ్రి యింటికి వచ్చుచుండు బ్రాహ్మణుల వలన శ్రీహరి చరిత్రము విని పొంగిపోవుచుండెను. ఈమె యన్నగారు రుక్మి యను వాడు తన చెల్లెలును శిశుపాలుడను రాజానకీయ దలచి ముహూర్తము నిశ్చయము చేసెను. తల్లి దండ్రులు కుమారుని వ్యతిరేకించలేక మిన్నకుండిరి. ఇది తెలిసి రుక్మిణి దేవి

అగ్నిద్యోతను డను బ్రాహ్మణునితో "నామాటగా ద్వారకా నగరమునకు పోయి శ్రీకృష్ణ భగవానునితో నామాటగా ఈ సందేశము చెప్పు గోరెదను. రుక్మిణి నిన్ను తప్ప యితరులను వివాహమాడదు. నీవు వెంటనే వచ్చి ఆమెను వివాహ మాడ గొనిపోవ గోరుచున్నది. నీవు రాకున్న ప్రాణములు వదలునని చెప్పు" మని పంపించెను. అది విని కృష్ణుడా బ్రాహ్మణుని గౌరవించి, నేను తప్పక వచ్చి రుక్మిణిని చేపట్టుదు నని వాగ్దానము చేసి పంపెను. తరువాత రథమాయత్త పరచుకొని రుక్మిణి చెప్పిన విధముగా నూరి వెలుపల దేవీయాలయమునకు సమీపముగా రథము నిల్పి యుండెను.

దేవాలయములో పూజలు గావించి వచ్చుచున్న రుక్మిణి తన ప్రియుడగు శ్రీహరి రథము నందు చూచి యానంద మందెను. చేరువకేగి శ్రీకృష్ణునకు చేయినిచ్చి రథమెక్కెను. ఈ వార్త విని రుక్మి మండి పడి శిశుపాల, జరాసంధాదులతో యుద్ధమునకు వచ్చి యోడిపోయెను. తరువాత శ్రీహరి వానిని బంధించి పరాభవించి విడిచెను. రుక్మిణి కోరికతో వానిని వదలి వేసెను. చేయునది లేక వాడు సిగ్గుతో తలవంచుకొని పోయెను. శ్రీకృష్ణుడు రుక్మిణి దేవిని ద్వారకకు గొనిపోయి, యక్కడ చక్కగా వివాహమాడి యామెతో ప్రేమ చూపుచు కాపురము చేయుచుండెను.

## జాంబవతీ -సత్యభామ పరిణయములు

రుక్మిణి కళ్యాణమైన తర్వాత కొన్నాళ్లకు సత్రాజిత్తను రాజా సూర్యవరంతో సంపాదించిన శమంతకమణిని చూచి తన కామణిని నిమ్మని కృష్ణుడడుగగా, నాతడు నిరాకరించెను. శ్రీకృష్ణుడు మిన్నకుండెను. సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనుడా మణిని ధరించి వేటకు పోవగా వానినొక సింహము చంపి యామణిని నోట గరచుకొని పోవుచుండగా జాంబవంతుడు

అది చూచి సింహమును వధించి మణిని గొనిపోయి తన గుహలో నున్న కుమార్తె యూయెల కాట వస్తువుగా కట్టి యుంచెను. సత్రాజిత్తు శ్రీకృష్ణుడే తన తమ్ముని చంపి మణి నపహరించెనని అపవాదు వేసెను. ఇది శ్రీకృష్ణునకు తెలిసినది. తనపై అట్టి అపవాదు వచ్చినదని విచారించి, మణిని వెదకి తెచ్చుటకై ప్రసేనుడు పోయిన మార్గముగా పోయి వెదుక సాగెను.

ఆతడరణ్య మార్గమున బడి పోవుచుండ దారిలో చని పోయిన ప్రసేనుని శవము, వాని గుఱ్ఱము శవము, చనిపోయిన సింహమును చూచి ముందుకు సాగిపోవుచుండెను. అచ్చటకు దూరములో నున్న గుహనుండి సూర్యకాంతు లు చిమ్మబడు చుండుట చూచి యిదేవో చిత్రమగు కాంతి గుహలో నున్నదని తలచి ముందుకు సాగిపోయెను. గుహలోనికి కాంతులుప్రసరించు బాటను వెళ్ళి ఊయెల మంచమునకు కట్టబడ్డ మణినితెచ్చుచుండగా, వాని కూతురు గోలకు జాంబవంతుడు పరుగుపరుగున వచ్చి శ్రీకృష్ణుని నెదిరించెను. వారిద్దరకు పదునెన్మిది రోజాలు ఘోరమగుయుద్ధము జరిగినది. అందు జాంబవంతుడు ఓడిపోయి యుద్ధము జరిగినది. అందు జాంబవంతుడు ఓడిపోయి శ్రీకృష్ణునకు పాదాక్రాంతుడయ్యెను.తరువాత మణితో కన్యకామణిని కూడా గొనుమని జాంబవతినిచ్చి వివాహము చేసెను. కృష్ణుడు జాంబవతితో, మణితో ద్వారకకు వచ్చి సత్రాజిత్తునకు కబురు చేసి – యిట

"సత్రాజితా! నీమణిని గురించి నామీద నింద వేసినావు, జరిగినది ఇదని వినిపింపగా నాతడు సిగ్గుపడి "నా పొరపాటు క్షమించుము. నాకుమార్తె సత్యభామని నీ కిత్తునని వివాహము చేసెను. మణిని ఈయబోగా వలదనెను. ఇట్లు రుక్మిణిని, తరువాత యిద్దరు కన్యకలనుతరువాత ఐదుగురను వివాహమై పుత్ర పౌత్ర గణముతో శ్రీకృష్ణుడు సుఖము లందుచుండెను.

బ్రహ్మవైవర్త పురాణము

# ముసలము-శ్రీకృష్ణ నిర్యాణము

కొంత కాలమునకు ధర్మరాజు రాజసూయ యాగము చేయనెంచగా దానికిజరాసంధుడడ్డుపడెను. వానిని మాయా విధానముగా జయించవలయుననియెంచి బ్రాహ్మణ వేషములతో కృష్ణుడు భీమార్జునులు కలిసి వెళ్ళిరి, జరాసంధుడు వీరిని బ్రాహ్మణులు గానే భావించి "మీకేమి కావలయునో కోరుకొనుడనగా యుద్ధబిక్ష పెట్టుమనిరి. ఆ యుద్ధములో భీముడు జరాసంధుని సంహరించెను. ధర్మజుని రాజసూయములో శిశుపాలుని శ్రీకృష్ణుడు వధించెను. ఇట్లు కొంత కాలము జరిగిన పిదప నారదాదులు శ్రీకృష్ణ దర్శనార్థము ద్వారకకు వచ్చిరి. అప్పుడు యాదవ కుమారులుసాంబునకు స్త్రీ వేషము ధరింపచేసి "ఈమెకు కల్గు సంతానము స్త్రీయా పురుషుడా?" యని హేళనగా ప్రశ్నించిరి. వారందులకాగ్రహించి, యీమెగర్భము నుండి రోకలి పుట్టి మీవంశ నాశనము చేయు"ననిరి, అట్లే సాంబునకు రోకలి పుట్టగా శ్రీకృష్ణుడు "దాని నరుగ దీసి ఆ రజమున సముద్రములో కలుపు" మనెను. వారట్టు రోకలి నరుగ దీసి సముద్రములో రజమును కలిపిరి, చిన్న ముక్కమిగులగా దానిని తీరమున వదలి వేసిరి. ఒక బోయవాడా దారిన బోవుచు ఆ కలపముక్కను తన యలుగునకు ములికిగా నమర్చుకొనెను. కొన్నాళ్ళకుయాదవులు జాతర పేరుతో మధువును త్రాగి, ఆ కైపులో సరసమున కన్నట్లు జెల్లు నూడలాగి బాదుకొనసాగిరి. వంశముల నాశన కరమగు ముసలి రజమా జెల్లు దుబ్బుల కంటుటచే వారా దెబ్బలకు చనిపోసాగిరి. ఇట్లా యాదవ వంశమంతయు క్రమముగా నశించెను. శ్రీకృష్ణుడు ఉద్ధవునితో కలసి యరణ్యములో తిరుగుచు నొక చెట్టు మొదలున విశ్రమించెను. కాలుపైకాలుంచి కాలు కదుపుచుండ నది యొక మృగముగా భావించి యిదివరలోనలుగునకు

దాపిన ముసలి శకలను దొరుకగా అద్దానితో గురిచూచికిరాతుడు కొట్టెను. ఆ దెబ్బతో శ్రీకృష్ణుడు తన యవతారము సమాప్త మొనరింప దలచి య వా శరీరమున విడిచెను. ఈ విధముగా శ్రీకృష్ణనిర్యాణము, యాదవ వంశనాశనము జరిగినవి. తదనంతరము యాదవ వనితలు చిందర వందరలై చెదరిరి. తరువాత సముద్ర ముప్పొంగి ద్వారకను ముంచి వేసిన దని శౌనకాదులకుసూతుడు చెప్పెను.

## బ్రహ్మవైవర్తపురాణము సమాప్తము



# 11. లింగ పురాణము

అగ్నిలింగంలోనున్న శివమహాదేవుడుపదేశించిన పురాణమే లింగపురాణం! "లింగంతు గుల్పకం" దక్షం శ్రీమహావిష్ణువు యొక్కకుడి చీలమండగా వర్ణితమైనదీ లింగపురాణం.

"తదేకాదశ సాహస్రం, హరమాహాత్మ్య సూచకం" అనే శ్లోకాన్ని బట్టి ఈపురాణంలో పదునొకండు వేల శ్లోకాలున్నవి. పూర్వార్ధంలో నూటయెనిమిది ఉత్తరార్ధంలో ఏబదియైదు కలిసి, మొత్తం నూటఅరువదిమూడు అధ్యాయాలిందున్నవి. ఇరువది ఎనిమిది విధాలైన శివావతారాలకుసంబంధిచిన కథలీ పురాణంలో వర్ణింపబడుతాయి. శివతత్త్వ పరిశోధకులకు ఈ పురాణం చాలా ఉపయోగ పడుతుందని పండితులు తెల్పుతున్నారు.

యమ, నియమాదులనే అష్టాంగయోగాలతో శివారాధన విధానం విష్ణువు యొక్క నాభికమలం నుండి బ్రహ్మదేవుని జన్మము, లింగార్చనవిధానం, మానస శివపూజ బ్రహ్మరచించిన శివారాధన విధము యుగధర్మాలు సప్తసముద్రాలు, మరియు సప్త ద్వీపాల వర్ణన గ్రహమండల పరిమాణం, సూర్యదేవ మాహాత్మ్యము, సంగ్రహంగా శ్రీకృష్ణుని చరిత్ర, త్రిపురాసుర సంహారం శివభక్తిమాహాత్మ్యం, అహింసా ప్రశంస, శివదర్శన ఫలం, కైలాపర్ణన నరనారీ శుభప్రదమైన ఉమామహేశ్వర వ్రతం, సదాచార నిరూపణం వారణాసిక్షేత్ర మాహాత్మ్యం, నరసింహావతార వర్ణన, పార్వతీ కల్యాణం, వినాయక జన్మవృత్తాంతం, శివదీక్షా విధానం షోడశ మహాదానముల వర్ణన మొదలగు విషయాలు ఈ లింగ పురాణంలో మనకు సాక్షాత్కరిస్తాయి.

మానవులకు కోరికలకు పరిమితం లేదని, అనుభవించిన కొలది పెరుగుతూనే ఉంటాయని, కాయేన, వాచా, మనసా–వీటికి బహు దూరంగా ఉండాలని నొక్కి వకాణిస్తున్నదీ పురాణం

శ్లో॥"భోగేనతృప్తిర్నైవాస్తి, విషయాణాం విచారతః।

తస్మాద్విరాగః కర్తవ్యః మనసాకర్మణాగిర॥

శ్లో॥ నజాతు కామః కామానా, ముపభోగేన శామ్యతి।

హవిషాకృష్ణవర్త్మేవ, భూయేవాభివర్తతే॥"

ఉత్తరార్ధంలోని పదమూడవ అధ్యాయంలో శివుని అష్టవిధములైన మూర్తుల వర్ణన యిట్లుంది. 1) పృథివీ స్వరూపుడు– శర్వుడు. 2) జలస్వరూపుడు భవుడు 3) అగ్నిస్వరూపుడు– పశుపతి 4) వాయుస్వరూపుడు– ఈశానుడు 5) ఆకాశస్వరూపుడు– భీముడు 6) సూర్య స్వరూపుడు –రుద్రుడు 7) సోమమూర్తి– మహాదేవుడు 8) యజమాన స్వరూపుడు– ఉగ్రుడు– అని లింగపురాణం లో వర్ణితం. ఈ పురాణంలో శివభక్తి మహిమను చాటి చెప్పే ఒక కథ యిలా గుంది.

పూర్వమొక కొండగుహలో శ్వేతుడ నే మునీశ్వరు డుండేవాడు. శివారాధనమే తన జీవిత ధ్యేయంగా పెట్టుకొన్న పరమ భక్తాగ్రేసరుడు. నమక– సేవించేవాడు. ఇట్లుండగా అక్కడికి యముడే వచ్చాడు. ముని అప్పుడే వచ్చాడు. ముని అప్పుడు శివ పూజలో మునిగియున్నాడు. "మునీంద్రా! నీ అయుస్సు తీరింది. శివపూజవలన నీవు రక్షింపబడలేవు. ఆలసింపక నాతోరమ్ము!" అన్నాడు యముడు. అప్పుడాముని శివుని శరణుగోరుతు "శంకరా! మహాదేవా! హరహరా! ఈ యమ మృత్యుపాశం నుండి నన్ను రక్షింపు" మని బిగ్గరగా ఆర్తనాదముతో ప్రార్థించాడు.

"ఓ యమ ధర్మరాజా! సర్వదేవాధీశుడైన పరమ శివుడు నాకండగానున్నాడు. నీ యమపాశం నన్ను ఏమి చేయజాలదు. నీదారిన వెళ్ళి పొమ్ము" అన్నాడు. ఈమాటలువిన్నయముడు ఆగ్రహోదగ్రుడై మండిపడూ ఇలా గన్నాడు. "ఏడిరా! నీ శివుడు? ఏమైంది నీ శివ పూజ? శివుడీ లింగంలో నున్నాడా? ఉంటే మరి బయటికి రాడేమిరా!" అని ఎగతాళి చేశాడు నిర్లక్ష్యముగా అంతే పార్వతి, నందీశ్వరాది సకలప్రమద గణాలతో శివుడు ప్రత్యక్ష మయ్యాడు. యముడు శివునికి క్షమాపణ కోరుతూ శరణాగతుడయ్యాడు. స్తోత్రంచేయగా శివుడు శాంతించాడు. తన భక్తుడైన మునికి మృత్యువు తప్పింది. అతని అభీష్టముల సిద్ధింప జేశాడుశివుడు. ఈ కథ పరమ పవిత్రమైనది భక్తిదాయకమైనది. లింగ పురాణంలో వర్ణింపబడింది. కాశీక్షేత్ర మహాత్మ్య వర్ణన యిలాగున్నది.

శ్లో॥ "యధామోక్షమవాప్నోతి, అన్యత్రచ తథా క్వచిత్!
కామం హ్యత్రమృతోదేవి, జంతోర్మోక్షాయ కల్పతే!
శ్లో॥ కామన్ భుంజన్ స్వపన్ క్రీడన్, కుర్వన్తి వివిధాఃక్రియాః!
అవిముక్తేత్యజేత్ ప్రాణాన్ జంతుర్మోక్షాయ కల్పతే!!

ఇతర క్షేత్రాలలో నెక్కడా మోక్షం, లభించని వారికి సహితం కాశీక్షేత్రంలో మోక్షం లభిస్తుంది. ఇచ్చట మరణించే ప్రతిజీవి మోక్షార్హుడౌతాడు. భోజన, నిద్ర, క్రీడా సమయాల్లోనే అవస్థలోమరణించిన ఈ క్షేత్రం మోక్షమిస్తుంది.

అష్టదిక్పాలకులలో దేవేంద్రుని నగరం అమరావతి. అట్టే తక్కినదిక్పాలకుల నగరాలు ఇలా తెల్పబడినవి. కుబేరుని.

1. ఇంద్రుని రాజధాని- అమరావతి

2. ఈశానుని రాజధాని- యశోవతి, కైలాసం

3. యముని రాజధాని – సంయమిని
4. వరుణుని రాజధాని– శ్రద్ధావతి
5. నిర్వృతి రాజధాని– కృష్ణాంగన
6. వాయుదేవుని రాజధాని–గంధవతి
7. అగ్నిదేవుని రాజధాని– తేజోవతి
8. కుబేరుని రాజధాని– అలక

ఇలా ఈ నగరాల పేర్లు. లింగ పురాణంలో వీటి వివరణ పూర్తిగా కలదు. శివ పూజా మాహాత్మ్యాన్ని తెలియజేసే మరొక కథ యిలాగున్నది

వశిష్ఠమహామునికి శక్తి మొదలైన వందమంది కుమారులుండేవారు. వీరందరిని ఒక శాపకారణంగా రుధిరుడనే రాక్షసుడు మ్రింగి వేశాడు. ఈ దుర్వార్తను వినగానే తల్లియైన అరుంధతికి వశిష్ఠ కి మహర్షికి పుత్రశోకము తీవ్రమైంది. వందమంది కుమారులు ఒకే సారి అపమృత్యుపాలపడడంతో మొత్తం సమూలంగా వంశ నాశనమైంది, మనోవ్యధ చెందారు. ఆత్మహత్య మహాపాపముమని తెలిసికూడా, ఆత్మహత్య పూనుకొని ఒక కొండ (అమాంతం) లోయలోనికి , ఆ దంపతులు దూకారు. భూదేవి దయతలచి, వారిని తన యొడిలోనికి తీసికొని చావకుండా బ్రతికించింది. ఆత్మహత్య ప్రయత్నం నుండి పూర్తిగా విరమింప చేసింది. అదే సమయంలో వశిష్టుని జ్యేష్ఠ పుత్రుడైన శక్తి భార్య అదృశ్యంతి అక్కడికి వచ్చి యిలా ఓదార్చింది అత్త మామలును "ఓ మహాశయా! నాగర్భంలో పెరుగుతున్న మీ పౌత్రుని కొరకైన, మీ వంశవృద్ధి కాంక్షించిన మీరు. అన్నీ తెలిసిన వారు ఇలా ఆత్మహత్యకు పూనుకోవడం సమంజసం కాదు." అని ప్రార్థించింది. ఆమె అత్తయైన అరుంధతిని లేవనెత్తి. అభయమిచ్చి ఓదార్చింది.

అప్పుడాకాశం నుండి మహావిష్ణువు వారికి సాక్షత్కరించి ఇలా ఓదార్చాడు. "ఓమహర్షి వశిష్టా! శక్తి కుమారుడుగా అదృశ్యంతికి పుట్టబోవు నీమనుమడు నాతో సమానుడగును. శివపూజా పరాయణడౌతాడు. శివా కృపచే నీవంశం ఉద్ధరింప బడుతుంది." అని పలికి మాయమై పోయాడు.

అయితే భర్తలేని జీవితం వ్రోడులతో సమానం అనుకొని అదృశ్యంతి జీవితం పై విరక్తురాలైంది. అయితే వృద్ధలైన అత్తమామలకోసం, పుట్టబోయెడి వంశోద్ధారకుని కోసం మనస్సు లోని దుఃఖాన్ని నిగ్రహించుకొని జీవించాలని నిశ్చయించుకొన్నది. ఒక శుభలగ్నమందు ఆమెకు పుత్రుడు పుట్టాడు అతనికి "పరాశరుడు" అని వశిష్టుడు నామకరణం చేశాడు ఇట్లు, తనకు పుత్రుడు పుట్టాడన్న శుభ వార్త తెలసి తండ్రియైన శక్తి ఎంతో సంతోషపడ్డాడు. ఈ వార్త అక్కడి సోదరులందరికి తెల్పాడు. వారు కూడా సంతోషించారు వశిష్టాశ్రమ ం లోని మునులకందరికి ఆనంద దాయకమైందీ వార్త. తల్లి యైన అదృశ్యవతి కూడా కుమారుని పరాశరుని చూచుకొని , సంతోషపడింది . తన భర్త జీవించి యుంటే ఇంకెంత సంతోషపడునో గదా! అని క్షణకాలం భర్త వియోగం తలంచి బాధ పడింది. అయినా కుమారుని చూచుకొని భర్త వియోగ బాధను దిగమ్రింగుకొన్నది.

తన చిరంజీవియైన పరాశరుని అతి జాగ్రత్తగా పెంచుతు తీర్చి దిద్దుతోంది తల్లి అదృశ్యంతి కుమారుడు శుక్ల పక్ష చంద్రుని వలె పెరిగి కొంచం పెద్ద వాడైనాడు. ఊహ తెలిసిన నాటి నుండి నిరాలంకృతయైన తల్లిని చూచి తన తండ్రి ఏమైనాడని పదేపదే అడుగ సాగాడు. ఆమె కుమారుడు బాధ పడుతాడని అతనికి ఏమి సమాధానం చెప్పక మౌనంగా నుండేది. అయినా తనయుడు పదేపదే తల్లిని నిలదీసి అడగటం తోచెప్పక

ఆమెకు తప్పలేదు "నాయనా! నీతండ్రి పిన తండ్రులు రాక్షసునిచే మ్రింగబడి మరణించా" రన్నది. అప్పుడు పరాశరుడాగ్రహోదగ్రుడై రెండవ రుద్రుని వలె మండి పడుచు మా పితరుల మ్రింగిన రాక్షస జాతిని సర్వనాశనం చేస్తానని భీషణ ప్రతిజ్ఞ చేశాడు. శివరుద్ర సూక్తాలతో శివలింగార్చన చేశాడు. అప్పుడాతనికి పరమశివుడు ప్రత్యక్ష మయ్యాడు. ఏమి వరంకావాలో కోరుకొమ్మన్నాడు పరమశివుడాతని తన తండ్రి పిన తండ్రులను సందర్శించదలచినట్లు చెప్పాడు. పరాశరుడు. శివానుగ్రహంతో పరలోకవాసులైన తన పితరులను చూడగల్గాడు. అదే విధంగా శక్తి కూడా తన తల్లితండ్రులైన అరుంధతీ వశిష్టులను, భార్యాపుత్రులైన అదృశ్యంతిని, పరాశరుని కనులార చూచుకొని సంతోషించాడు. ఇదంతా శివ పూజా ఫలం. సకలలోకానుగ్రహకారుకుడైన ఆ పరమేశ్వరుని సదా పూజింపగోరాడు శక్తి , తన వశిష్టుడు కూడా ఒక రాక్షసుని నిమిత్తమై సకల రాక్షస సంహారం చేయబూన సమంజసం కాదని పరాశరుని వారించాడు. క్రోధం తగదని శాపప్రభావంతో నీతండ్రులు మరణించారని రాక్షసుడు నిమిత్త మాత్రుడని చెప్పి రాక్షస సంహారాన్ని ఆపించాడు. తాత వశిష్టుని పై గల గౌరవంతో తన ప్రయత్నం విరమించాడు పరాశరుడు. అందుకు సంతోషించిన పులస్త్య బ్రహ్మ "పరాశరా! నీవు సకల శాస్త్రజ్ఞుడవు కాగలవు నీకు జన్మించబోయే కుమారుడు పురాణ కర్త కాగలడు" అని అశీర్వదించి పోయాడు. ఆ పరాశరునికి సత్యవతి (మత్స్యగంధి) యందు కన్యకగానున్నప్పుడే జన్మించిన వాడు శ్రీ కృష్ణ ద్వైపాయనుడనబరగిన, అష్టాదశ పురాణ కర్త శ్రీ వేదవ్యాస మహర్షి.

ఈ విధంగా శివపూజా మాహాత్మ్యాన్ని వర్ణిస్తున్నది లింగ పురాణం.

శ్లో॥ యః పఠేత్ శృణుయద్వాపి లైంగం పాపహరం నరం।
సభుక్త భోగోలోకేస్మిన్నన్తే శివపురం వ్రజేత్॥

ఈ శివ పురాణం వినేవారు, చదివేవారు సకల సౌఖ్యాల ననుభవిస్తారు. వారి పాపాలన్నీ పటాపంచలౌతాయి. చివరకు కైలాస ప్రాప్తి కూడా కల్గుతుంది.

శ్లో॥ "విష్ణునాభిహితం శ్లోక్యైతద్వారముచ్యతే!!"

తరువాత మహాముని కోరికపై సూతుడిట్లు ఆరంభించెను. త్రిమూర్తులను రూపములను, పేరులును వేరు గాని వారందరు తేజస్సుగా మన మెఱుగదగును. ఈ విషయము తెలియుట కిట నొక పరీక్షా కథ వినిపింతును. పార్వతి శివుని చూచి "రాముడు దేవుడందురు గదా! మరి సీత కొరకు విచారించుచుండు వాడు దేవుడెట్లగును?" యని ప్రశ్నించెను. అందులకు శివుడు లోక వ్యవహారము ననుసరించి యే శరీర ధారి మైననటనగావించక తప్పకనే రామునిలో బలము లేకుండ లేదనెను అయితే నేను చూచెదనని పార్వతి రాముని పరీక్షంప బయలు దేరెను. రాముడిప్పుడు సీతకై విచారించుచున్నాడు గాన కాముకుడు నేను సీతగా మారి యెదుట బడిన యేమి చేయునో చూతునని తలచి సీత వేషము దాల్చి రాముని కెదురుగా నిలబడెను. రాముడా మాయా సీతను చూచి ఇట్లనెను.

" ఓ యమ్మా! హిమవంతుని కుమార్తె వగు నీవు సీతగా నెందులకు వచ్చినావు? నీకీ రూపమెందుల కమ్మా!" యనగా నివ్వెరపోయిన పార్వతి తన దారిన తాను మరలి యథారూపమున శివుని జేరెను. శివుడా పార్వతిని చూచి "గిరిజా! నీవెక్కడకో వెళ్ళినావు ఏమి జరిగినదనగా విని యూరకే వెళ్ళి వచ్చినానని" యనగా, శివుడు దివ్య దృష్టితో చూచి, జరిగినది గ్రహించి పార్వతితో నిట్లనెను. "పార్వతీ! రాముని పరీక్షించితివా? సీతవై వెళ్ళినావా? పావము. నిన్నుతన భార్యగా చూచినాడా? ఏమన్నాడని ప్రశ్నించెను. పార్వతి విని తలవంచి, "శంకరా! నేను పొరపడితిని. అతడు భార్య కోసము శోకించుచున్నాడు గాన భార్యగా నేనగుపించిన యేమి చేయునో యని

మాయా రూపమున బోయితిని, తక్షణమే నన్ను గమనించినాడు. విచారమూలేదు ఏమియును లేదు– "గిరిజాదేవి! నీవు యిలా వచ్చి నావేమి? ఈ రూపమెందులకు ధరించినా" వన్నాడు. నేను మారు మాట్లాడలేదు. నారూపమందు వచ్చినాను. దీని వలన నీవు చెప్పినది సత్యము, రూపాంతరములు తప్ప యొకటే తేజమని ఇప్పుడెరిగి నా యజ్ఞానము బాపుకొని తృప్తి చెందినతి " నని చెప్పినది. తృప్తి చెందినది.

# సతీ దేవి యోగాగ్ని ప్రవేశము

బ్రహ్మదేవుని కుమారులలో దక్షప్రజాపతి యొకడు. ఆతనికి యిరువదేడుగురు కుమార్తెలు. అందులో నొక కుమార్తె సతీ దేవి ఆమెను శివుని కిచ్చి వివాహం గావించెను. దక్షుడు, శివుడు తనకల్లుడయ్యెను తనకు గౌరవము చూపడని యొక రకమగు నిరాదరణతో నుండ సాగెను. ఒక మహాయజ్ఞ సమయములో దేవతలు, బ్రహ్మేంద్రాదులు విష్ణువు నందురు వచ్చి యుండిరి. శివుని కూడా పిలువగా నాతడు వచ్చెను. ఆ ప్రదేశమునకు దక్షుడు రాగా నందరు లేచి గౌరవించిరి. కాని శివుడు లేవలేదు గౌరవించలేదు ఇది చూచి దక్షున కరికాలి మంట నెత్తికెక్కినది. ఇట్లుండగా కొన్నాళ్ళకు దక్షుడు యజ్ఞము చేయ తలపెట్టెను. దాని కాతడందరిని పిలిచెను. అతడు యజ్ఞము చేయు సమయమున నొక ముని దక్షుని చూచి శివాపరాధము ప్రమాదము శివుడు సామాన్యుడు గాడు. సమస్త దేవతా పూజనీయుడుగా నెరుగుము" యని మందలించినను వినలేదు.

ఇట్లుండగా విమానము మీద దేవ గంధర్వాదులు జంటలు జంటలు బయలుదేరి సందడి చేయుచు దక్షయజ్ఞం చూడ బయలు దేరిపోవుచున్నారు. ఈ సందడి సతీదేవి తన మేడపై నుండి చూచినది.

వారి నెక్కడకు బోదురని ప్రశ్నించగా వారు "వెఱ్ఱితల్లీ! నీ తండ్రి దక్షుడు యజ్ఞము చేయుచున్నాడు. నీకా మాత్రము తెలియదా?" యని నవ్విరి. అది విని సిగ్గుపడి సతీ దేవి తన భర్త శంకరుని దటి జేరి లాలనగా నిట్లు మాట్లాడ దొడగెను. "శివా! నీవు మహానుభావుడవు నిన్ను సామాన్యులెరుగరు నీప్రేమ సంపాదించినవాడు మహాలోకములలో సుఖాలనుభవించెదరు. నా తండ్రి యిప్పుడు మనలను పిలువకుండా యజ్ఞము చేయుచున్నాడట. మీరు వినలేదా? మనమాయజ్ఞమును చూడబోదము రండు. ఆలస్యము చేయవల"దని శంకరుని బ్రతిమాలెను.

శంకరుడు విని సతీ దేవిని చూచి యిట్లనెను. "సతీదేవీ ! నీ తండ్రి యిప్పుడు! మనయందు ద్వేషముతో నున్నాడు. పోవగూడదు. మనలనే పరాభవించును పిలువని చోటకు పోయిన యెంతవారైన గౌరవము దక్కదు. నీవా యత్నము విడువు" మనగా విని సతీ దేవి "శంకరా! నాతండ్రి నన్నూ మిమ్మూ పిలువ లేదు అతడు యేయుద్దేశముతో పిలువలేదో పోనీయుడు. మనము కులాసాగా యజ్ఞము చూచి వత్తము రండు. అదిగాక, ధర్మములు మీరెరుగనివి లేవు. కానినే నాడు దాననగుటచే మరల మరల చెప్పుచున్నాను యజ్ఞములకు పెండ్లిండ్లకు, స్నేహితుల యిండ్లకు పిలువకపోయినను వెళ్ళవచ్చు నని. చెప్పుదురు. గదా! అక్కడ మావారందరూ వత్తురు. వారందరితో సుఖముగా సంతోషముతో కాలము జరుపవచ్చును. యజ్ఞదర్శనము చేసిన ఫలితము వచ్చును రండి రండని చాలా దీనముగా బ్రతిమాలెను. అది విని శివుడా సతీదేవియందు దయగల్గి "సతీ! నీవు వెళ్ళిచూడ దలచినచో చూచి రమ్ము నేను మాత్రము రానిని" చెప్పి నందీశ్వర,చండీశ్వర, చండముఖాది మహావీరుల నామెకు సాయమిచ్చి తన వాహనమగు, వృషభరాజముపై కూర్చుండబెట్టి గౌరవము ప్రేమయు నిండునట్లు సతీదేవి కోరిక ననుసరించి పంపెను.

అట్లు భర్తచే పంపబడిన సతీదేవి తండ్రి యజ్ఞ ప్రదేశము నుత్సాహముతో ప్రవేశించి, తండ్రిని చూచెను. అతడు మాట్లాడలేదు. తనసోదరీ మణులు ఇతర చుట్టాలు తల్లి వీరందరు మాత్రమాదరించి కౌగలించుకొని మర్యాద చేసిరి. అచట నున్నవారు, యజ్ఞమునకు వచ్చిన దేవగణాలు, యితర ప్రముఖులు దక్షునకు భయపడి మాటలాడలేదు.మరల తండ్రి కెదురుగా వచ్చి సతీదేవి నిలబడినది. కాని యాతడు మాట్లాడలేదు. దానితో నా పరాభవము సహించలేక, తన భర్తకు మొగముచూపలేక యోగాగ్నికల్పించుకొని యాయజ్ఞకుండము వద్ద భస్మమైపోయెను సభయంతయు హాహా కారములు లేచినవి. ఇది దక్షనకు కీడుగా నందరు నెక్కువగా భయపడిరి. నారదుడీ చెడు వార్త నీశ్వరుని చెవినివైచెను.

శివుడపుడు మండి పడి తన జటా జూటములో జడను లాగి నేలకువైచికొట్టెను. అందుండి వీరభద్రుడు వేయి బాహువులతో జన్మించి భూమ్యాకాశములు బ్రద్దలగు నట్లరచి నన్నే పనికి సృష్టించినావు "తండ్రీ! యని యడిగి దక్షాధ్వరము నాశనము చేయ మన్న తండ్రికి ప్రణమిల్లి కోట్లాది ప్రమథగణముతో బయలు దేరి వెళ్ళి యజ్ఞ ధ్వంసము గావించి, వచ్చిన వారలందరను పరాభవించి తిరిగి శివుని జేరెను. తరువాత దేవతలు బ్రహ్మాదుల ప్రార్థనలతో శివుని దక్షుని బ్రతికించ గోరగా అతడు గొఱ్ఱె తలను దక్షుని కతికింపుడగా, వారట్లు చేసి బ్రతికించిరి. శివుడు తపోభూముల కేగెను.

## శివ తపోభంగము

సతీ వియోగమైన తరువాత విరాగియై శివుడు తపమాచరించసాగెను. విశ్వకర్మ కుమారుడు తారకుడు రాక్షస బలముతో, తన నాన్న త్రిశిరుని సంహరించిన కోపముతో ఇంద్రుని రాజ్య భ్రష్టుని చేసి స్వర్గమాక్రమించి

దేవతలను బాధింపసాగెను. వారాబాధ భరించ లేక బ్రహ్మవద్దకు వెళ్ళగా బ్రహ్మవారందరితో శ్రీహరిని దర్శింపబోయెను. వారి రాక నెరిగిన శ్రీహరి, "తారకుని వధించు నుపాయమాలోచించుచుండగా నాకాశవాణి ఇట్లు పల్కెను. "తారకుని వధించుటకు గిరిజకు శివునకు పుట్టిన కుమారుడే సమర్థుడు గాని ఇతరులు కారని " పల్కగా వారంద రామాట విని ఆ యత్నము నందుండిరి. శివుడు తపమారించుచున్నాడు. సతీదేవి పార్వతీ దేవియై శివుని గురించి హిమగిరి కంధరములో తపమాచరించుచుండెను. అందులకై యింద్రుడు దేవ వేశ్యలను, మన్మథుని పంపెను. శివుడు కండ్లు మూసికొని యుండగా మథనుడాతని తపముచెరుప పూల బాణాలు వేయగా శివుడు, కోపించి మూడవ కన్ను తెరచి వాడిని బూడిద చేసెను.

రతీదేవి, తన భర్త భస్మమగుటకు విచారించి పతివ్రత గావున శివునారాధించి పతి భిక్ష పెట్టుమని ప్రార్థించెను. శివుడు దయబూని "నీకు మాత్రము నీ పెనిమిటి కన్పించును. అందరకు మాత్రము మనస్సులో మాత్రము వుండి సంచరించగలడని" వరమిచ్చెను. తరువాత దేవతలు శంకరుని సమీపించి, తమ పాట్లు వివరించి యాకాశవాణి మాటలను విన్పించి ప్రార్థించిరి. సతీదేవి పార్వతియైనదని యీశ్వరుడు యట్లే "మీకోర్కె తీర్చ తారకాసురుని వధింపజేయుదు" నని వరదానము చేసెను. శివుడుపార్వతీ హృదయమును పరీక్షచేసి, యామె నిశ్చల భక్తిని చూడ దలచెను. అందుచే మాయా వటుని రూపుగైకొని యామె గృహమునకు వెడలి "నీవు శ్మశానవాసము చేయు వానిని, జంగమ రూపము వానిని యెందులకు కోరెదవు? మంచి వారిని కోరుకొమ్మని", శివుని నిందించునట్లు నటించగా, నామె చాలా కోపమంది, "నాప్రాణము శివుడు, నాకధిపతి శివుడు, నా సర్వస్వమునూ శివుడే" నని ఖచ్చితముగా చెప్పెను. అందుకు శంకరుడు లోలో నానందించె నిజరూపములో పార్వతి చేతిని పట్టుకొనెను.

# పార్వతీ కల్యాణము

పార్వతీ దేవి పరమానందమంది తన్ను శివుడు దయతలచి వివాహమాడనున్నాడని గ్రహించి "దేవా! నీవు కరుణా మయుడవు. నన్ను వివాహమాడ పాణిగ్రహణము చేసినావు. నేను తండ్రి చాటు దానను గదా! నాతండ్రితో మాట్లాడి నీవు నన్ను పరిణయమాడ ప్రార్థించుచున్నానని " వేడెను. వెంటనే శివుడు హిమవంతు నింటిలో ప్రవేశించి, "నీ కుమార్తె పార్వతిని నాకు వివాహము చేయు"మనగా గిరిరాజు పరమానందముతో నంగీకరించెను. సమస్తదేవకోటులు, యక్ష కిన్నెర గంధర్వాదులు శివ కళ్యాణము తిలకించుటకు తమ్ము బాధించు తారకాసురుని వధించి కుమారని ప్రసాదించి తమ బాధలె తీర్చునను యమితోత్సాహముతో పెండ్లి వారై వచ్చిరి.

తరువాత బంగరు పళ్ళెరమున శివుని పాదములు గడిగి హిమవంతుడు తన కుమార్తె పార్వతిని కన్యాదానము గావించి తరించెను. శివుడు పార్వతితో కైలాసము ప్రవేశించి యుత్సాహముగా నుండెను. శివ దంపతులు కొన్నాళ్ళు ఇట్లు గడిపిన పిదప పార్వతీదేవి శివ వీర్యము ధరించినది. ఆ వీర్యము ధరించి చక్కని బలాఢ్యుడగు కుమారస్వామిని పుత్రునిగా పొందెను. దేవతలు కుమార సంభవమునకు మితిమీరిన యుత్సాహముతో జేజేలు కొట్టిరి. కుమార స్వామి సమస్త ప్రమధ గణ సైన్యమునకు, దేవతా సైన్యమునకు అధిపత్యము వహించి తారకాసురునిపై దండెత్తి పోయెను. తరువాత బ్రహ్మాండమైన యుద్ధము జరిగినది. దేవతల పక్షమున కుమార స్వామి గొప్పగా యుద్ధము చేసెను. ఆ యుద్ధములో తారకుని బలమంతయు నశించెను. తారక కుమారులిద్దరూ ద్వంద్వ యుద్ధమునకు తలపడిరి.

ఆ మహా యుద్ధములో తారకుడు కుమారస్వామి చేతిలో మరణించెను. దేవతలు, సమస్త భూతములు భేష్ యని కుమార స్వామిని ప్రస్తుతించిరి. ఇట్లు శివు కల్యాణము జరిగినదని మహాముని చెప్పి, యీ శివ కల్యాణ కథ మహాపుణ్య ప్రదమనియు, దీనిని వినిన వారికి, చదివిన వారికి శివదంపతులు నిత్య శుభములు ప్రసాదింతురనియు సూత మహాముని శ్రుతి ఫలము ముని మండలికి వివరించెను.

## కిరాతార్జునీయము

పాండవులు వనవాసము చేయు కాలమందు పాండవ మధ్యము డర్జునుడు తీర్థ యాత్ర చేయ వలసి వచ్చినది. ఆ సమయములో పాతాళ లోకవాసిని వాసుకి కుమార్తె యైన ఉలూచి స్నానము చేయ దలచి, యచట స్నానమాచరించి, ఆ సమయమున కర్జునుడు స్నానము చేయుచుండగా నతని రూపాదుల కానంద మంది తన మాయాప్రభావంతో నాతనిని తన లోకమునకు గొనిపోయి తనను వివాహమాడి కొన్నాళ్ళు యచ్చట నుండగా యులూచి యొక బలసంపన్నుడగు కుమారుని ప్రసవించింది. వానికి రెండు జాతులకు చెందునట్లుగా నాగార్జునుడని పేరు పెట్టిరి. తరువాత అర్జునుడు వెడలిపోయెను. కొన్నాళ్ళకు ధర్మరాజు వద్దకు నారదుడు వచ్చెను. ధర్మరాజు నారదుని చూచి విశేషము లేమని యడిగెను.

నారదుడు, "యమలోకంలో నీ తండ్రి దేవతా పంక్తితో కూర్చుండ లేకున్నాడు. గండామృగమాంసముతో పితృకార్యము గావించినచో నాతడు దేవతా పంక్తిలో నుండగలడని చెప్పిపోయెను. ధర్మరాజు గండామృగము ఎచ్చట నున్నను పట్టి తెమ్మని తమ్ముల కాదేశించెను. భీముడు బయలు

దేరి పోవుచుండగా నర్జునుడు వారించి తాను తెచ్చెదనని బయలు దేరెను. గండామృగమును గురించి నానా దేశములు శోధించుచు, పోయెను. అట్లు పోగా పోగా ఒక చోట నాగార్జునుడు పార్వతీ దేవి పెంపుడు జంతువగు గండామృగమును మేపుచుండెను. ఆ రోజున నాగార్జునుడు పుట్టిన రోజగుటచే తల్లిచే తలంటించు కొనుటకు పాతాళమునకు పోయెను. అర్జునుడు నానాలంకారవములతో నున్న యామృగవమును ఎవరో పెంచుచున్నారని యనుకొనియు, కాపెవరూ లేరు గదాయని, దానిని చంపి యజమాని వచ్చు వరకు వేచి యుండెను. మరలి వచ్చిన నాగార్జునుడు తన పెంపుడు మృగము చనిపోవుట చూచి, నలు దెసలు పరికించగా నొక పొదచాటున నున్న అర్జునుడు బయటకు వచ్చి "మృగమును నేను చంపితిని, దీని శరీరము మీద నున్న నగలు యజమానికి నప్పగించి పోదమని కాచియుంటినని" యానగల నిచ్చి పోబోయెను.

తాను ప్రాణములకన్న ప్రీతితో పెంచుచున్న మృగమును చంపినాడని మండి పడిన నాగార్జునుడు "నీకు చావు మూడినది. నా జంతువును నీవెందులకు సంహరించితివి? నా బలము చూతువు గాక" యని కోపించగా వానిని చూచి అర్జునుడు "నీవు బాలుడవు. నాతో పోరాడ జాలవు. పైగా నేను మృగమును వినోదార్థమై గాకుండా పితృకార్యార్థముగా చంపితిని. కావున నీవు మారుమాటలాడవలద"నెను. దానితో మరింత కోపగించిన నాగార్జునుడు అర్జునునితో యుద్ధమారంభించెను. "ఈతడు బాలుడు నేనెట్లు యుద్ధము చేయుదు"నని తలచి, పార్థుడాతని యమ్ములను లక్ష్యపెట్టకుండెను. వాడు శివుని ధ్యానించి నర్జునుని మీద కొక మహాస్త్రమును ప్రయోగించెను. ఆ బాణము యర్జునునితో "ఓయీ!

మహావీరుడవును, ఘనుడవుడను, నగునిన్ను చంపినచో లోకము నన్ను నిందించును. నాకా నింద లేకుండా నొక బాణము నాపై ప్రయోగించుము నేను తొలగిపోయెదను. లేనిచో నిన్ను చంపక తప్పదు. వీడు నీ కుమారుడు. ఆనాడు నిన్ను పాతాళమునకు గొనిపోయి వివాహమాడిన, యులూచి యను నామెకు బుట్టినవాడు. తండ్రి కొడుకులకు జగడం తగ'దని యా యస్త్రము చెప్పగా అర్జునుని పొదిలో బాణమొక్కటియు లేక పోయినది. దానితో నిస్సహాయుడై యుండెను. చివరకాయస్త్రము క్రీడి నిండు పరాక్రమమున కానందపడి నాగార్జునుడు వాని నెత్తురును బొట్టు పెట్టుకొని తన తల్లి వద్దకు వెళ్ళిపోయెను. ఆకాశము నుండి తండ్రి కుమారులు యుద్ధము చూడ వచ్చిన చిత్రసేనుడను గంధర్వ రాజు యర్జునుని శరీరము కుళ్ళిపోకుండా దివ్య పుష్పములను వర్షముగా కురిపించెను.

ఆ సుగంధ మహిమతో శరీరమట్టే చెడి పోక యుండెను. ఈ వార్త చిత్రసేనుడు దేవలోకమునందును, పాండవులకును, శ్రీకృష్ణాదులకు, తనకువీలైన చోట్ల తాను, మిగతా చోట్లకు నారదుని పంపి యందరికి తెలియజేసెను. ఈ వార్త విని వారందరు నమితముగా బాధపడసాగిరి.

నాగార్జునుడు తల్లి కడకు వెళ్ళి జరిగినదంతయు వివరించగా, ఉలూచి తన భర్త పడియున్న తావుకు వచ్చి, దేవతావస్త్రములో ముక్కలుగా పడియున్న పెనిమిటిని చూచి యిట్లనెను. “నాగార్జునా! నీచేతులతో నీ తండ్రిని చంపుకొంటివా? నా భర్తతో చిరకాల సుఖము పొందలేదు గాని, చిరకాలము పతిహీననై బ్రతుకవలసినదేనా? ఎంత మహావీరుడిట్లు పడియున్నాడు?” యని పెక్కు విధముల బాధపడెను. తరువాత నాగార్జునుని మీదకు సైన్యములు దండెత్తి వచ్చుట చూచి తన కుమారునకే యుపద్రవము వచ్చునోయని గజగజలాడుచుండెను.

# యుద్ధములో త్రిమూర్తులు కలియుట యముని కుష్ఠవ్యాధి నివారణముగుట

అతి లోక భయంకరులైన పాండవులు పౌరుషాలకూ, ముఖ్యంగా సాక్షాత్తు పరమాత్ముడైన శ్రీకృష్ణునికి భయపడి పోతున్న తల్లిని ఓదార్చాడు నాగార్జునుడు.

"అమ్మా! నేను నా కర్తవ్య నిర్వహణలో తప్పని సరియై చేసిన పనే గాని యితరమైన కాపట్యంతో చేసిన పని కాదు. సర్వాభరణ భూషితమైన మృగం పెంపుడు జంతువవుంతుందని తెలియదా? మాంగల్యచిహ్న శోభితయైన సాధ్విని గలియబోయే కాముకునిలా ప్రవర్తించాడు నా తండ్రి. వారి వారు వారికి వుంటే నా యజమానురాలే నాకు దిక్కు. జగత్పితలైన పార్వతీ పరమేశ్వరులనే శరణు కోరుతాను" అని చెప్పి, సరాసరి కైలాసానిని వెళ్ళి జరిగిన విషయమంతా అ లోకేశ్వరి లోకేశులకు విన్నవించుకున్నాడు. సర్వజ్ఞుడైన ఈశ్వరుడు–నాగార్జునునికి అభయం ప్రసాదించాడు. అప్పటికేఅర్జునుని కళేబరం వున్న ప్రాంతానికి వచ్చి రణభేరి మ్రోగించారుపాండవులు. కృష్ణుడు పాంచజన్యం పూరించాడు.

శివ సమేతుడై రణభూమికి వచ్చాడు నాగార్జునుడు. కృష్ణుడు నాగార్జునుణ్ని ఢీకొనబోగా పరమ శివుడు అడ్డుపడ్డాడు. "కృష్ణా! నీకు సరైనజోడిని నేనే కాని, యీబాలకుడు గాడు, త్రిమూర్తులలో ఒకడవైన నిన్నుయెవ్వరూ జయించలేరు,అయినా యే లీలార్థం నీ వీరణభూమికి వచ్చావో లీలార్థమే నేను కూడా సమరానికిదిగుతున్నాను. నీ పాండవులు, సైన్యము మొత్తము అందరికి నా నాగార్జునుడే ఒక్కడే జవాబు చెబుతాడు. నీ ఒక్కడిని నేను సమాధాన పరుస్తాను" అన్నాడు.

అందుకు అంగీకరించాడు కృష్ణుడు, హరిహరుల పోరాట వార్త విని సర్వదేవ, గరుడ, గంధర్వ, సిద్ధ, సాధ్య, యక్ష, కిన్నర, చారణ, విధ్యాధర, గుహ్యక, నాగ, గరుడాది సర్వ గణాలూ సమర భూమికి చేరాయి.

అర్జునుడి ప్రాణాలను తమతో కొనిపోవాలో- కూడదో తెలియక, అనుమానంతో ఊగిసలాడుతున్న యమదూతలలో కొందరు సమస్తవార్తలనూ సమవర్తి అయిన యమునికి విన్న వించారు. కాలరూపుడైన కృష్ణుడు, మహాకాలుడైన శివుడూ వీరికి యుద్ధం అంటే బ్రతికి బట్టకట్ట గలిగిన దెవరు? యమదూతలకు చేతి నిండా పనే కదా! తన సేవా సమేతంగావచ్చి మృత్యుపాలకుడైన యమధర్మరాజు పార్థుడి శవం ప్రక్కనే శిబిరం వేశాడు.

ఘోరాతి ఘోరంగా సాగుతున్న ఆ మహాసంగ్రామంలో కృష్ణుని చాతుర్యాలకు శివుడూ, శివ చాతుర్యాలకు కృష్ణుడూ పై పందెములు వేసుకుంటూ సర్వాన్నీ మరచి- అంతకంతకూ యుద్ధభీభత్సాన్ని పెంచి వేయసాగారు.

దానితో అంతరిక్షం, అతలాది అధోలోకాలు ఆర్ద్రమై పోయాయి. పితామహుడైన బ్రహ్మను ప్రార్థించాయి. విషయం తెలుసుకున్న బ్రహ్మ, తత్ క్షణమే హంసవాహనారూఢుడై ఆహవ భూమికి చేరాడు. శివ కేశవుల నడుమ నిలిచి వారిద్దరినీ స్తుతించాడు. లోకశాంతి కోసం యుద్ధం ఆపమన్నాడు. "హేకృష్ణా అర్జునుడికి గర్వ భంగం జరగాలని నువ్వు సంకల్పించడం వల్లనే యిలా జరిగింది. అనవసరంగా భోలాశంకరుణ్ని యిందులో ఇరికించారన్నాడు అనంతరం నారదున్ని పిలిచి మందలించాడు. పరిహసించిన మాత్రాన, యింత ప్రళయం సృష్టించాలా నారదా! ఇంకెప్పుడూ పగలను ఇటువంటి యుద్ధాలు సృష్టించకు" అని

హెచ్చరించాడు. యుద్ధశిబిరాలను ఎత్తివేయమని ఆజ్ఞాపించాడు బ్రహ్మ -పాండవులు అంగీకరించలేదు పగ తీర్చుకోవలసినదే నన్నారు. అప్పుడు కృష్ణుడు బ్రహ్మను చూచి, "చతుర్ముఖా! అర్జునుణ్ని బ్రతికించు పోరు చల్లారుతుందో" అన్నాడు.

వెంటనే బ్రహ్మ అక్కడే యున్న యముని పిలిచి పాశగ్రస్తమైన ప్రాణములను పునఃపార్థుని దేహంలో ప్రవేశింప చేయమన్నాడు. అదే తగిన సమయం అనుకున్నాడుయముడు చేతులు జోడించి యిలా చెప్పసాగాడు.

"ఓ చతుర్ముఖా! సర్వం సృష్టించు ప్రజాపతివి నువ్వు. ఓ కృష్ణా! లీలార్థం గోపాలుడిగా అవతరించావే గాని – సర్వలోక స్థితిగతుల్ని సక్రమంగా నడిపించే స్థితికారకుడివైన శ్రీమన్నారాయణుడవు. పరమేశ్వరా! సర్వ కాలుడివైన లయకారుడివి నువ్వు సృష్టి స్థితి లయ మూర్తులైన మీరు ముగ్గురూ ఇలా ఓకే తావులో కలసి దర్శనం యివ్వడం అనేది చాలా అరుదైన విషయం. అటువంటి మహాదృష్టాన్ని కలిగించి నందుకు మీకు నమస్కరిస్తున్నాను. మీకు పేరు పేరుగా నీ వందనాలు ఆచరిస్తున్నాను. మీ ఆజ్ఞను కాదనే వాడిని కాను. తప్పక అర్జునుణ్ని బ్రతికిస్తాను. అయితే నాదో చిన్న మనవి. నేనూ నాచెల్లెలైన యమున మేమిద్దరం సూర్యదేవునకు పద్మిని సంధ్య యందు జన్మించాము. మాపుట్టుకల తరువాత, మా తల్లి మాతండ్రియైన భాస్కరుని తాపానికి తాళలేక– తన నుండి ఛాయ అని అచ్చం తనలాగే వున్న స్త్రీని సృష్టించి తాను సూర్యమండలం విడిచి పోయింది. ఈ రహస్యం మాకు తెలియక ఛాయనే మాస్వంత తల్లిగా అనుకుంటూ వుండేవాళ్ళం. కాలాంతరాన నాకు సోదర సోదరీమణులైన శనైశ్చరుడు, తపతీ జన్మించారు. అప్పటి నుంచీ ఆమెకు మా యందు ప్రేమ తగ్గినది. తపతినీ, శనిని ఆదరించడం నన్నూ యమున నూ బాధించడం ఆరంభించింది.

అది సహించలేని నేను "తల్లివై వుండి తరతమ భేదాలు చూపిస్తున్నావు. ఇది నీకు తగదు. సంతానం విషయంలో పలపక్షం చూపించడం వల్ల, ఆ తల్లి అయినా సరే దండ్యురాలే అవుతుంది"అని చెప్పాను. అందుకామె కినిసి నన్ను నానా దుర్భాషలాడింది. ధర్మం చెప్పడానికి నువ్వేం ధర్మమ్డివా" అంది. ఆమె మాటలు వినలేక విసుగు చెందిన నేను చిన్నతనపు ఆవేశంతో ఆమెను నా కాళ్ళతో తన్నాను.

ఆమె ఆగ్రహించి నాపాదాలు కుష్ఠువ్యాధిగ్రస్తం కావాలని శపించింది. తక్షణమే నాకు కుష్ఠవ్యాధి సంక్రమించింది. శప్తుడనూ, వ్యాధిభీతడనూ అయిన నేను ఆమె నింకేమీ అనలేకపోయాను. అనంతరం మా తండ్రికిచెప్పగా - ఆయన అసలు రహస్యం తెలుసుకొని, మా తల్లిని మళ్ళా తెచ్చారు.

అపుడు మా నాన్న గారైన మార్తాండుడు నన్ను చూచి ఏ ద్వాపరముగంలో నైన కైలాసం వద్ద త్రిమూర్తులను కలిసి వుండగా వారిని ప్రార్థించుము. వారే నీకు రోగ నివారణ చేయుగలరని చెప్పి వున్నారు. కాబట్టి "ఓ త్రిమూర్తులారా! మీరు నా ప్రార్థన మన్నించి మీ సేవకుడనైన నన్నీ వ్యాధి నుండి విముక్తుణ్ని చేయండి, నేను మీ ఆజ్ఞను త్రికరణాలా పాటిస్తాను"అని చెప్పాడు.

త్రిమూర్తులు నవ్వుకున్నారు. శివుడు తన విభూదిని, బ్రహ్మ తన కమండలి జలాన్ని యీయగా, శ్రీకృష్ణుడు ఆ రెంటినీ తన మహత్తుతో యముని పాదాలపై ప్రోక్షించి- స్పృశించాడు. తక్షణమే యముని కుష్ఠువ్యాధి తొలగిపోయింది. మహానందభరితుడై యముడు, మూర్తిత్రయాన్ని స్తుతించాడు. పాశగ్రస్తమై యున్న పార్థుడి అసువులను- తిరిగి అతని దేహంలోనికి ప్రవేశింపచేశాడు. ప్రాణాలు పొందినప్పటికి రెండుగా విడిపోయిన దేహం అతుకు కొనలేదు.

అందరూ ఆశ్చర్య పడేలా ఆకాశవాణి కృష్ణ సంకల్ప లోపమే అని చెప్పడంతో లోకేశుడైన శ్రీకృష్ణుడు, యోగమాయతో స్వయంగా అర్జునుని శిరసునూ మొండేన్నీ చేరువ చేశాడు. అప్పుడు అర్జునుడు పునర్జీవితుడయ్యాడు. దేవతలు వారిని దీవించి తరలి వెళ్లిపోయారు. అర్జునుడు నాగార్జునున్ని ఆదరించాడు. అనంతరం- ఉలూచీ నాగార్జునులు నాగలోకానికి యాదవ, పాండవులు వారివారి సైన్యాలతో వారి వారి తావులకూ నిష్క్రమించారు.

## లింగ పురాణము సమాప్తం



# 12. వరాహ పురాణము

వరాహావతారంతో మహావిష్ణువు భూదేవికి చెప్పిన పురాణమే ఈ వరాహ పురాణం. "చతుర్వింశదత్సహ స్రాణి తత్పురాణ మిహోచ్యతే!" అనే శ్లోకాన్ని బట్టి ఇందులో ఇరువది నాల్గువేల శ్లోకాలున్నవని తెలియుచున్నది. "వారాహం వామ గుల్ఫకమ్" మహావిష్ణువు యొక్క ఎడమ చీలమండలంతో ఈ పురాణం పోల్చబడినది. ఇందులో రెండు వందల పదునైదు అధ్యాయాలున్నవి.

తొమ్మిది విధాలైన సృష్టి, నారదముని పూర్వజన్మ వృత్తాంతం, అష్టమూర్తిగా మహావిష్ణువు ధర్మవ్యాధుని చరితం, దుర్జయ చరితము అగ్ని అశ్వనీ దేవతల పుట్టుక, దక్షయాగ వినాశనం, పార్వతీదేవి పుట్టుక, వినాయక జన్మ, పాడ్యమి మొ॥ న తిధుల అధిపత్యం, ఆయా మాసాల్లోని ద్వాదశీ వ్రతమహాత్మ్యము. ఏకాదశీ వ్రతమాహాత్మ్యము. సౌభాగ్య, కాంతి ఆరోగ్యసూత్రాలు, వ్రతాలు, నాల్గు యుగాల స్వరూపం, విష్ణుదీక్షావిధానం, అన్నదాన మహాత్మ్యము. వరాహ స్వామి భూదేవి నుద్ధరించడం, ఆయా ఋతువుల్లో విష్ణుపూజాఫలం, చక్రతీర్థ మాహాత్మ్యము, విష్ణు మందిరాలలో గాన, నాట్యఫలం, మధురాక్షేత్రం, శ్రాద్ధ విధానం, నాచికేతుని వృత్తాంతం, యమయాతనల (నరకం) వర్ణన, పతివ్రతా మాహాత్మ్యం, గోకర్ణక్షేత్రం మొ॥న విషయాలు ఈ వరాహ పురాణంలో మనకు అగుపిస్తాయి.

మహా విష్ణువు అష్టమూర్తిగా ఇందు వర్ణింపబడి నాడు. 1) పృథ్వి, 2) జలము,3) అగ్ని 4) వాయువు 5) ఆకాశం 6) సూర్యుడు 7 చంద్రుడు 8) ఆత్మ- ఇవిస్వామి వారి అష్ట మూర్తులు, అష్టాదశ పురాణాల వివరణకూడా యిందులో నిలా యున్నది.

శ్లో॥ అష్టాదశ పురాణాని, వేదవ్యాస ద్వైపాయనో గురుః!
బ్రాహ్మం, పాద్మం, వైష్ణవంచశైవం(వాయుః) భాగవతం తధా!!
శ్లో॥ తధాన్యన్నారదీయంచ, మార్కండేయం సప్తమమ్!
ఆగ్నేయ మష్టమం ప్రోక్తం, భవిష్యం నవమం తధా!!
శ్లో॥ దశమం బ్రహ్మవైవర్త, లైంగమేకాదశం స్మృతమ్!
వారాహం ద్వాదశం ప్రోక్తం, స్కాంధంచాపిత్రయోదశమ్!!
శ్లో॥ చతుర్దశం వామనంచ, కౌర్మం పంచదశమం స్మృతమ్!
మత్స్యంచ గారుడంబైవ- బ్రహ్మాండంచ తతఃపరమ్!!

భక్తుల అంగరక్షకుడు శ్రీ మహావిష్ణువు తన భక్తుల అంగాలను వివిధ రూపాలతో సంరక్షించగలడని చెప్పడమైనది. అవేమనగా 1) కేశవుడు- పాదాలు, 2) నారాయణుడు- పిక్కలు, 3) మాధవుడు-నడుము 4) గోవిందుడు -రహ్యాసాంగం 5) విష్ణువు- నాభి 6) మధుసూదనుడు- ఉదరం 7) త్రివిక్రముడు- తొడలు, 8) వామనుడు- హృదయం, 9) శ్రీధరుడు- కంఠం, 10) హృషీకేశుడు-ముఖం, 11) పద్మనాభుడు- కళ్ళు, 12) దామోదరుడు - శిరస్సు.

## వైష్ణవ మాయః-

'మాయ అనగానేమిటి?' అని అడిగింది భూదేవి. అపుడు శ్రీ వరాహస్వామి ఇట్లు సమాధానము చెప్పాడు భూదేవికి. "బ్రహ్మరుద్రాదులు దేవేంద్రుడుగానీ తెలిసికోజాలని నా మాయ గూర్చి చెబుతున్నాను వివరంగా

వినుము భూదేవి!" అంటూ యిలా చెప్పసాగాడు. కొన్ని చోట్లతి వృష్టి, మరికొన్ని చోట్ల అనావృష్టి, చంద్రుడు ప్రకాశించుట, క్షీణించుట, హేమంత ఋతువులో బావినీరు వేడెక్కడం, క్షీణించడం, గ్రీష్మ ఋతువులో చల్లగానుండడం సూర్యుడు తూర్పున ఉదయించుటం పడమర అస్తమించుటం గర్భంలో శిశువు ప్రవేశించటం, గత జన్మవిషయాలు మరచి పోవడం, హిమవత్పర్వతం నుండి గంగానది భూలోకానికి ప్రవహించడం, మేఘాలు సముద్రంలోని ఉప్పునీటిని ఆవిరి రూపాన్ని గ్రహించి, మంచి నీటిని వర్షించుట, రోగిష్టులైన ఔషధ సేవన ద్వారా అస్వస్థులవటం కొందరైతే ఏ ఔషధమిచ్చినా, బ్రతుకక మరణించటం, ఇదంత నా మాయ వలనే జరుగుతుంది. కుబేరున్ని ధనాధిపతిగా పిలుస్తారు కాని యధార్థంగా ధనాధిపతిని నేనే! వృత్తాసురుని చంపింది దేవేంద్రుడు నిమిత్తమాత్రం నిజంగా నా మాయయే! పంచభూతాలకు సంబంధించిన కర్తవ్య నిర్వహణ మంతయు నామాయయే!

## అన్నదాన మహిమ:-

పూర్వం ఇలావృతమనే దేశాన్ని శ్వేతుడనే రాజు పాలించేవాడు. అతడు తన రాజ్యంలోని వారికి భూదానం చేయాలనుకున్నాడు. ఈ విషయాన్ని తన కులగురువైన వశిష్ఠ మహాముని తో సంప్రదించాడు. అపుడా మహర్షి ఇలా అన్నాడు ఆ రాజుతో?

శ్లో॥ "అన్నదానం దదాత్‌రాజన్, సర్వలోక సుఖావహమ్!
అన్నేన చైవ దత్తేన, కింవదత్తం మహీతలే!!
శ్లో॥ సర్వేషామేవ దానా నామన్నదానం విశిష్యతే!
అన్నాద్భవంతి భూతాని, అన్నేనైవ చవర్ధతే!!
శ్లో॥ తస్మాత్ప్రయత్నేన అన్నం దదస్వ భూపతే!"

అన్ని లోకాల్లోనూ, అన్ని కాలాలోను, సుఖదాయక మైనది అన్నదానం! అన్నదానం చేస్తే అన్నిదానాలు చేసినట్లే అవుతుంది. సృష్టిలోని సర్వజీవులు అన్నం వల్లనే పుట్టి వృద్ధి పొందుతున్నాయి. కనుక నీవు తప్పక అన్నదానం చేస్తుండవలసింది. ఈ విధంగా అన్నదానం మహిమ యీ పురాణంలో చెప్పబడింది.

## రాగిపాత్రల ప్రాశస్త్యం:-

దైవమందిరాలలో మరియు పరమనిష్టా గరిష్టులైన మహానుభావుల గృహాల్లోను రాగి పాత్రలనే సదా వాడుచుందురు. ఇది మనం మన నిత్యానుభవంలోని విషయంగా నిత్యం చూస్తున్నాం. వెండి బంగారు పాత్రల వాడగలిగే శక్తిగల ధనవంతులు సహితం ఈ రాగి పాత్రలనే ఉపయోగిస్తుండలంలోని మర్మమేమిటి? ఈ విషయమై భూదేవి విష్ణుదేవుని ప్రశ్నించింది.

శ్లో॥ "ముచ్ఛ సౌవర్ణ- రౌప్యంచ కాంస్యం చైవ జనార్దన!
ఏ తన్నే పరమం గుర్యాం, తామ్రాస్తే రోచతే కథమ్!!
అపుడు వరాహస్వామియైన విష్ణుదేవుడిలా జవాబిచ్చాడు.
శ్లో॥ సౌవర్ణం రాజతం కాంస్యం, యేషు ప్రావణా!
తాని సర్వాన్ పరిత్యజ్య, తామ్రంచ మమంచ తామ్రంచ మమ రోచతే!!"

బంగారు వేండి, కంచు మొ॥ పాత్రల్లో కాక రాగి పాత్రలతో కర్మానుష్టానం చేస్తే నేను సంతోషిస్తాను. ఏడువేల యుగాల క్రితం నామాయ కారణంగా ఈ తామ్రం(రాగి) పుట్టింది. గుడాకేశుడనే రాక్షసుడు తామ్రరూపమతో నన్నారాధించేవాడు. ఒక సారి నేనాతని ఆ శ్రమానికి వెళ్ళాను, ఆయాశ్రమం పరమాద్భుతుడనై కావలసిన వరం కోరుకోమన్నాను.

సుదర్శన చక్రంతో తన్ను వధించమని కోరుకొన్నాడు. తన అవయవాలన్ని తామ్ర రూపం దాల్చాలని, భగవత్పూజకా పాత్రలనే వాడాలనీ సవినయంగా గుడాకేశుడు కోరాడు. ఒక శుభ ముహూర్తంలో శుక్ల ద్వాదశినాడు గుడాకేశుని సంహారం జరిగింది. అతని కోర్కె నారాయణుని వలన నెరవేరింది. ఈ విధంగా మనకు తామ్ర పాత్రలు లభించాయి.

శ్లో॥ పవిత్రానాం పవిత్రంచ, మంగళానాంచ మంగళమ్!

విశుద్ధానాం శుచి శ్చైవ, తామ్రం సంసార మోక్షణమ్!!

రాగి మిక్కిలి పవిత్రమైనదే కాక, సంసార బంధం నుంచి విముక్తిని కూడా ప్రసాదించగలదు.

## తీర్థ ప్రాశస్త్యము:-

వరాహపురాణంలో నూట ముప్పదేడవ అధ్యాయంలో చక్రతీర్థం, రూప తీర్థం, యోగతీర్థం, సోమ తీర్థముఅన్న నాల్గు తీర్థాల వర్ణన విస్తారంగా గలదు. దాని ఫలం ఈ తీర్థాలలో స్నానమాచరించేవారు పుణ్యలోకాల పొందగలరట.

1) వైశాఖ శుద్ధ ద్వాదశినాడు చక్ర తీర్థంలో స్నానం చేస్తే పదివేల సంవత్సరాల పాటు ధన, ధాన్య సమృద్ధి పొందగలరు.

2) కార్తీక శుద్ధ ద్వాదశినాడు చక్ర తీర్థంలో స్నానంచేస్తే పితృదేవతలకు మోక్షం సిద్ధిస్తుంది. రూపవతియైన భార్యప్రాప్తిస్తుంది.

3) మార్గశీర్ష శుద్ధ చతుర్దశినాడు యోగతీర్థంలో స్నానం చేస్తే రాగద్వేషాలు హింసా ప్రవృత్తి దూరీకృతమౌతాయి.

4) వైశాఖ బహుళ ద్వాదశినాడు సోమతీర్థంలో స్నానంచేస్తే వేద వేదాంగాలలో సర్వవిద్యలలో ప్రావీణత పొంది ముప్పది మూడు వేల సంవత్సరాల పాటు ఘనకీర్తులందుకుంటారు.

## విష్ణు సేవామందిరాలలో సేవాఫలం;-

భూదేవి వరాహ స్వామినిట్లు అడిగింది. "స్వామి! విష్ణు మందిరాలనెవరైతే శుభ్రం చేస్తారో, నృత్యగీత నాట్యాదులతో నిత్య జాగరణలతో స్వామిని సేవించే వారికెట్టి ఫలం కల్గుతుంది. అందుకు సమాధానంగా వరాహ స్వామి యిలా జవాబిచ్చారు."దేవి! విష్ణు మందిరాలలో నెన్ని యడుగుల నేల శుభ్రం చేస్తే అన్నివేల సంవత్సరాలు స్వర్గసుఖాన్నను భవిస్తారు. విష్ణుగానం చేస్తే వారి పాటల్లో ఎన్ని అక్షరాలుంటాయో, అన్నివేల సంవత్సరాలు అమరలోక సుఖాలు పొందుతారు. జాగరణచేసేవారు జంబూద్వీపంలో చక్రవర్తి పదవిని పొందగల్గుతారు నాట్యం చేసేవారు సంసారం బంధాలకు దూరవవౌతారు. ఇలాగే భక్తితో నాకు పుష్పాల సమర్పించేవారు అనేక పుణ్యకర్మలు చేసి, చివర్లో వైకుంఠం చేరుకోగల్గుతారు అన్నాడు వరాహస్వామి.

శ్లో॥ "యావన్తః భూమేరుడ్డీయన్తేతు చాలితాః!
తావద్వర్ష శతాన్యాశు స్వర్గలోకే మహీయతే!!
శ్లో॥ యావన్తి చాక్షరగిరాణ్యేవ, గీయమనే యశస్విని!
తావద్వర్ష సహస్రాణి, ఇంద్రలోక మహీయతే!
శ్లో॥ నృత్యమానస్యవక్ష్యామి తశ్శృణస్వ వసుంధరే!
మానవోయేన గచ్ఛేత ఛిత్వా సంసార బంధనమ్!
శ్లో॥ త్రింశద్వర్ష సహస్రాణి, త్రింశద్వర్షక శతానిచ!
యస్తు జాగరతే నిత్యం, ఏకం కర్మపరాయణః!
శ్లో॥ జంబూద్వీపం సమాసాద్య, రాజరాజస్తుజాయితే!!"

## సత్యం యొక్క ప్రాశస్త్యం;-

శ్లో॥ "సత్యమూలం జగత్సర్వం, లోకాస్సత్యే ప్రతిష్ఠితా!
శ్లో॥ సత్యేన గమ్యతే స్వర్గం, మోక్షం సత్యేన ప్రాప్యతే!
సత్యేన తపతేసూర్య, సోమః సత్యేనరంజతి!!"

ఈసకల చరాచర జగత్తునకు సత్యమే మూలాధారం. తత్త్వవిదులైన ఋషులు సత్యం వలన మాత్రమే సిద్ధిపొందగలరు. స్వర్గంగానీ, మోక్షంగానీ, పొందాలంటే సత్యమే సాధనం సత్యం కారణంగానే సూర్యుడు మింట ప్రకాశిస్తున్నాడు. ఈ సత్యం కారణంగానే చంద్రుడు అన్ని లోకాలకు చల్లని ఆహ్లాదకరమైన వెన్నెల నిస్తున్నాడు.

# నాచి కేతుని వృత్తాంతము

పూర్వం సకల వేద-వేదాంగ పారంగతుడైన ఉద్దాలకుడనే ముని ఉండేవాడు. ఇతని పుత్రుడే నాచికేతుడు. తండ్రివలె నితడు కూడ సర్వశాస్త్ర, వేదవేదాంగ కోవిదుడు. ఒక సందర్భంలో తండ్రి నెదిరించి మాట్లాడుట వలన తండ్రి కోపానికి గురియై, "యమలోకానికి వెళ్ళెదవుగాక" అన్న తండ్రి శాపానుసారం, సవినయంగా యమపురికి బయలుదేరాడు. తాను చేసిన కోపావేశపు తొందరపాటు పనికి ఉద్దాలకుడు పశ్చాత్తాప పడ్డాడు. కన్నుమిన్నుగానక కొడుకును శపించితినే అని రోదించాడు. తండ్రిశోకాన్ని చూచి నాచికేతువు, తాను వెంటనే తిరిగి రాగలనని విచారించవలసిన పని లేదని ఊరించాడు. తన యోగ విద్యతో యమపురిచేరాడు. మహా పండితుడైన నాచికేతునికి స్వయంగా యమ ధర్మరాజే స్వాగతం చెప్పాడు. తన లోకంలోని దృశ్యాలను చూపెట్టాడు. గౌరవంగా అతనికి వీడ్కోలిచ్చి పంపాడు నాచికేతుడు భూలోకం క్షేమంగా చేరుకొన్నాడు.

తిరిగి క్షేమంగా వచ్చిన తన కుమారుని చూచి తండ్రి ఉద్దాలక మహర్షి పరమానంద భరితుడయ్యాడు. అక్కడి మునులందరికి తన కుమారుని సామర్థ్యం గూర్చి యమలోకానికి వెళ్ళి తిరిగి వచ్చిన అద్భుతకార్యం గూర్చి విశేషంగా చెప్పాడు.

## యమలోక విశేషాలు:-

1) అసత్యవాదులు, సాధులను, స్త్రీలను, పసి పాపలను బాలలను వేదించేవారు

2) కన్నె పిల్లల బలాత్కరించేవారు, కృతఘ్నులు, నమ్మక ద్రోహులు, దేవశాస్త్ర దూషణ చేసేవారు.

3) తల్లిదండ్రులను సదాచారవతులైన భార్యలను వదిలి వేసేవారిని

4) గురుద్వేషుల, రాగద్వేషవంచితులైన రాక్షసులను, పరగృహుల, పొలాలను నపహరించేవారు.

5) ఆవకట్టలను తెంచేవారు, కనపడ్డ ప్రతి వస్తువును అపహరించే వారు.

6) ప్రభుహితాల్లో నిమ్నమై ప్రాణ హరణం చేసేవారు.

7) తమ ప్రభువుల చంపేవారు. యుద్ధభీతిచే పారిబోయేవారు, యుద్ధంలో పారిపోయేవారు, వారలందరు యమపురికి చేరుకొంటారు.

నాచికేతుడు యమపురి గురించి ఇలా చెప్పాడు. "వెయ్యియోజనాల వెడల్పు, రెండువేల యోజనాల పొడవు గల్గి ఎంతో విశాలమైనది, యమపురి. బంగారు మేడలు, స్వచ్ఛమైన నదులు, సరోవరాలు పచ్చని చెట్లక్కడున్నాయి. ఈ విధంగా సౌందర్య శోభావిరాజితమైంది. యమపురి. నాచికేతుడు నరక లోకంలో యమధర్మరాజు దగ్గరనున్న సమయంలో నారదుడక్కడికి వచ్చాడు.

"స్త్రీలు ఏవిధమైన కర్మలను ఆచరిస్తే ఉత్తమ స్వర్గలోకాలను పొంద గలరు?" అని యముని ప్రశ్నించాడు. అందుకు జవాబుగా యముడిలా చెప్పాడు. "మహామునీ! స్త్రీలకు ప్రత్యేకించి ఏ విధమైన నియమవ్రాలు, దానాలు, ఉపవాసాలు చేయవలసిన అవసరంలేదు వారు చేమవలసినదల్లా ఒకటే పతిపూజ.

1) పతి మేల్కొనే సమయానికి తాను మేల్కొనడం. అతను నిద్రపోతే తాను నిద్ర పోవడం చేయాలి.

2) భర్త భుజించకుండా తాను భోంచేయరాదు.

3) భర్త ఏదైనా దుఃఖంలో నుండి మౌనంగా ఉంటే విచారించి సమాదరంచాలి ఒకే దృష్టి ఒకే చిత్తంతో పతి మాట వినాలి.

4) భర్త కోపంగా ఉన్నా తను మౌనంగా శాంతముగా ప్రవర్తించాలి.

5) పతియే స్త్రీలకు ప్రత్యక్ష దైవం. ఈ లక్షణాలున్న స్త్రీలను దేవతలు కూడ పూజిస్తారు. వీరు విషయంలో దేవుడనైన నేను కూడా(యముడు) భయపడుతాను.

6) ఇటువంటి స్త్రీలు నా లోకాన్ని (నరకాన్ని) చూడరు. నరకానికి రారు.

7) వీరు ఏ సమయంలోను పరపుషన్ని తలంచరాదు.

8) వీరు సూర్యోదయానికి ముందే నిద్రలేచి వాకిట ముగ్గులు పెట్టాలి.

9) ఈ విధంగా ఆచరించే స్త్రీలు పుణ్యలోకాలు (స్వర్గం) పొందుతారు.

10) ఈ విధంగా నారదునికి యమధర్మరాజు బదులిచ్చాడు.

ఈ విధంగా నాచికేతుని వృత్తాంతం ఎంతో విపులంగా వరాహ పురాణంలో సాక్షాత్కరిస్తున్నది. ఇలాంటి మరెన్నో కథలు – వృత్తాంతాలతో శ్రీ వరాహ పురాణమెంతో ప్రాధాన్యం వహించి ఉన్నది.

శ్లో॥ "శ్రుత్వాతు పూజయేద్యస్తు, శాస్త్రం వారాహసంజ్ఞితమ్।
సర్వపాప వినుర్ముక్తో విష్ణుసాయుజ్యమాప్రజేత్॥"

ఎవరైతే ఈ మహాపురాణాన్ని మనసారా శ్రవణం చేస్తారో! భక్తి శ్రద్ధలతో పూజిస్తారో! వారు సర్వ పాపాలనుండి విముక్తులై శ్రీ మహా విష్ణు సాయుజ్యం పొందగలరు.

"సూత మహామునీ! నీవలన పరమేశ్వరుని యనంత లీలా వైభవములు నిండిన దివ్య పుణ్యకథాశ్రవణము గావించుచున్నాము. మా జన్మలు తరించినవి. ఇంక మాకు వరాహపురాణము విన్పించి తరింప జేయు" మని మునులు ప్రార్థించగా, సూతుడిట్లు మొదలు పెట్టెను.

## వంశ చరిత్ర

రాజవంశములు రెండు రకములు. సూర్యవంశపు రాజులు, చంద్రవంశపు రాజులనబడుదురు. సూర్యవంశము వారికి మూలపురుషుడు సూర్యుడు. అతనికి భార్యలుండిరి వారిలో పద్మిని సూర్యుని తీక్షణతకాగలేక సంజ్ఞయను దానిని కల్పించి, తన కుమారులగు రేవతుడు, యముడను వారలను చూచుచుండుమని వెళ్ళి పోయెను. ఆ సంజ్ఞకు సూర్యుని వలన వైవస్వతుడు పుట్టెను. ఆవైవస్వత మనువుకు తొమ్మండుగురు కుమారులు వారిలో జ్యేష్టుడు ఇక్ష్వాకుడు. అతడే కాకుత్స్థు డను పేరు గల వాడయ్యెను. వాని కుమారుడు పృథు చక్రవర్తి వానికి విశ్వకుడు, వాని కార్ద్రకుడు, వానికి యువనాశ్వుడు పుట్టిరి. అతడు దుంధువను రాక్షసుని సంహరించుటచే దుంధుమారుడనే పేరువచ్చినది. వానికి ముగ్గురు కుమారులు, పెద్దవాడు బృహదశ్వుడు వానికి ప్రమోదుడు, వానికి హర్యశ్వుడు, వానికి నికుంభుడు వానికి సంహితాశ్వుడు, వానికి కుశాశ్వుడు వానికి అరుణాశ్వుడు పుట్టిరి. అరుణాశ్వునకు యువనాశ్వుడు గల్గెను. వానికి మాంధాతయును

మహావీరుడు, విష్ణుభక్తి పరుడు జన్మించెను. వాని ముగ్గురు పుత్రులలో నంబరీషుడు రాజుగా నయ్యెను. వానికి యువనాశ్వుడు, వానికి హరితుడు, వానికి పురుకుత్సుడు వానికి సమంజసుడు, వానికి సంభూతి, వానికి విష్ణుదర్శనుడు వానికి నరణ్యుడు, వానికి బృహదశ్వుడు, వానికి హర్యశ్వుడ జన్మించిరి. అతడు కర్దమ ప్రసాదమున సూర్యోపాసన చేసి వసుమనుడను పుత్రుని గనెను. వసుమనుడు రాజై యశ్వ మేధ యాగము గావించి, మునులను పిలిచి వారి దీవెనలందెను, తరువాత సభలో బ్రహ్మవాదులకు నమస్కారములు గావించి యజ్ఞతపో సన్యాసములలో ముఖ్యమైనదేదని ప్రశ్నించెను.

అందుకు వశిష్ఠ మహాముని "వేదాదులు నేర్చి గృహస్థుగా మారి క్రతువులు గావించి, వనములకు పోయి యోగమవలంబించి శరీరమును విడుచుటచే ముక్తి నందగలర"నెను. అంత పులస్త్యుడు యజ్ఞములు చేసి దేవతలను తృప్తి పరచి, తపో యోగిగా మారి సన్యాసము గ్రహించుట మంచిదనెను. జమదగ్ని సర్వేశ్వరుని యోగ మార్గమున ధ్యానము గావించి శ్రీహరిని దర్శించుటుత్తమనెను. విశ్వామిత్రుడు లేచి శంకరుని పాశుపతిమహా మంత్రములచే తృప్తి పరచి యోగియై నడచుట తగుననెను. భరద్వాజుడు శ్రీహరి భక్తి కన్న మిన్న యొక్కటియు లేదన్నాడు, అత్రి మహాముని విని, నారాయణుని నిర్మల తపోబలముతో తృప్తి గావించుట కన్న, యితర తపములు యేవియు సరిపోవనెను. గౌతమమహాముని జగదాధారుని పూజించుట కంటే యుత్తమైనది ఇంకొకటి లేదని కశ్యపుడూ శివారాధనము చేయుమనీ, ఇంకొక మహామునీ వేదాదులు నేర్చి యజ్ఞములు గావించుచు సంతాన వంతుడై కుల పవిత్రత నిల్పి యోగ మార్గాన శరీరమును వదులుట ధర్మము నిలుపుట యుక్తమని యనిరి. తరువాత నాతడు

వారందరి యుపదేశముపై కుమారునకు పట్టము గట్టి తపోవనమునకు పోయి గాయత్రీ మంత్ర పారాయణము గావించసాగెను.

అతని మంత్రబలముతో బ్రహ్మ, విష్ణువు లిద్దరు దర్శనమిచ్చి యాయుర్దాయము పెంచిరి. ధర్మము వలన నాయుర్దాయము పెరుగును. బ్రహ్మజ్ఞానముతో తపమాచరించు వారు బ్రహ్మలోకమును, యోగమార్గము గమనించి నడచు వారు కైలాసమును పొందుదురు. బ్రహ్మజ్ఞానులగు వారికి ఈ లోకములో చావు పుట్టుకలుండవు. ప్రణవము నారాధించిన వారు జన్మ రాహిత్య మందుదురు. నీవు తరించుటకు ప్రణవముపదేశింతునని శ్రీహరి యతనికి ప్రణవమునుపదేశించెను. అతడు నారాయణుని తనలోని షట్చక్రములలో నిల్పి శ్రీహరి రూప ధ్యానము చేయుచు శరీరమును విడిచెను. వానికి త్రిధన్వుడు, వానికి త్రయ్యారుణుడు కల్గిరి. ఈ త్రయ్యారుణుని కొడుకే సత్య వ్రతుడు. సత్య వ్రతుని కుమారుడు హరిశ్చంద్రుడు, వానికి లోహితాస్యుడు, వానికి దుంధువు, వానికి విజయుడు విజయునికి కారకుడు, వానికి కుష్మకుడు, వానికి వీరబాహువు అతనికి సగరుడు వాని మొదటి భార్య ప్రభవలన నరువది వేల కుమారులు– రెండవ భార్య భానుమతి యందు యసమంజసుడు గల్గిరి. అతనికి దిలీపుడు అతనికి భగీరథుడు పుట్టిరి.

ఆ భగీరథుడే గంగను భూమికి తెచ్చినాడు. వానికి శ్రుతుడు, నాభాగుడు, వానికి సింధు దీపుడు, అతనికి అయుతాయువు, వానికి ఋతుపర్ణుడు, అతనికి సుదాసుడు అతనికి కల్మాషపాదుడు, వానికి కశ్మకుడు వానికి ఉత్కళయందు మూలకుడు జన్మించిరి. ఈతడు పరశురామ భయముతో ఆడు వేషము ధరించి యరణ్యములకు పారి పోయెను. అందుచే నాతడు నారీకవచుడను సార్థక నామమందెను. అతనికి

శతరథుడు, వానికి లభికుడు, అతనికి బృహదశుడు అతనికి శ్వ్వ విశ్వసహుడు, అతనికి ఖట్వాంగుడు, వానికి దీర్ఘబాహువు, నాతనికి రఘువు, అతనికి అజ మహారాజు, యాయజునకు దశరథుడు జన్మించిరి, దశరథుడు ముప్పురి భార్యలందు రామ లక్ష్మణ, భరత, శత్రుఘ్నులను పుత్రులుగా బడసెను. శ్రీరామునకు లవకుశులు, వారిలో కుశునకు తిథి, అతనికి నిషధుడు వానికి క్షేమధన్వుడు, వానికి నభుడు, వానికి పుండరీకాక్షుడు, వానికి క్షేమధన్వుడు, వానికి దేవానీకుడు, వానికి అహీణుడు అతనికి మహా స్వానుడు జన్మించిరి. తర్వాత చంద్రాలోకుడు అతనికి తారాపీడుడు, అతనికి చంద్రగిరి, వానికి భానుజిత్తుడు, అతనికి శ్రుతాయువు జన్మించిరి. వీరందరు సూర్య వంశజులుగా, యిక్ష్వాకు వంశ వర్ధనులుగా నెరుగుడు; ఈ పరంపర విన్న వారికి శుభములు గల్గును. దీని తరువాత జయధ్వజమహారాజు చరిత్రము విన్పింతును, శ్రద్ధగా మీరాలకింపుడు.

# జయధ్వజుడు

వైవస్వతమనువు కుమార్తె ఇళావతికి పురూరవ చక్రవర్తి పుట్టెను. అతడూర్వశిని వరించి యామె వలన నల్గురు పుత్రులను బడెసెను. వారిలో పెద్ద ఆయువు, అతని పెద్ద కుమారుడు నహుషుడు; వానికుమారుడు యయాతి. అతడు, దేవయానితోను, రాకువరార్తె శర్మిష్ఠతోను, వివాహమయ్యెను. వారిద్దరి వలన నలుగురు కుమారులను పడేసెను జిత్తు వానికి శత్రు జిత్తు అతనికి హైహయుడు, వానికి వేణు హయుడు గల్గిరి. హైహయుని వంశములో కృతవీర్యుడు, అతనికి కార్తవీర్యుడు, వానికి సుర ధ్వజుడు జయధ్వజుడు మొదలగు వారైదుగురు పుత్రులు గల్గిరి. పెద్దవాడు యదువు. వానికి సహస్రజిత్తు. వీరు ఈశ్వరుని భక్తులేకాని జయధ్వజుడు శ్రీహరి భక్తుడు. వారందరు తమ్మునిబిలిచి యీశ్వర భక్తి గొప్పదని

దానిలో నుండుమనిరి. అతడు శ్రీహరియు మోక్షదాత యని వాదించెను.

జయధ్వజాడు శ్రీహరిని భక్తితో సేవించి శ్రీహరి దర్శనమందెను. విష్ణువాతనికి కవచము నొకదానినిచ్చియే యస్త్రములు నిన్ను జయించవని చెప్పి యదృశ్యమయ్యెను. తర్వాత తండ్రిని జయించిన పరశురామునిపై రాజులందరను గూర్చుకొని యుద్ధమునకు సిద్ధమయ్యెను. ఆ యుద్ధములో పరశురాముడు జయించెను. జయధ్వజాడు విదేహదైత్యుని సంహరించెను. శ్రీకృష్ణుడు శివారాధన పరుడై లింగము నర్చించు చుండగా మార్కండేయ మహాముని యచ్చుటికి వచ్చెను. ఆయన కర్ఘ్యపాద్యములు సమర్పించి సుఖాసనమున కూర్చుండ జేసెను. యాదవవీరులందరు వచ్చి మహామునికి సాష్టాంగము లాచరించిరి. తరువాత శ్రీకృష్ణుడు ఏవైన విశేషములు చెప్పమని కోరెను. మార్కండేయుడు నవ్వి "నీకన్న నేనేమెరుగుదును? నీవు యోగమార్గములో గన్పించు మహనీయుడ"వనెను. అది విని కృష్ణుడు "నాదేమున్నది నేనే యుపమన్యుని వలన శివమంత్రము పొంది పూజించుచున్నాను.

శివుడే సర్వ వ్యాపక తేజాడు. శివలింగారాధనమే ఇహ పరములిచ్చును. శివుడు జ్ఞాన ప్రదాత! శివుడే యజ్ఞ కర్త, యజ్ఞ భోక్త పరమ కల్యాణమూర్తి. అందుచే శివునారాధించుచుంటి ననగా" విని, యా ముని వెడలి పోయినాడని తెలిపి తదనంతరం సూతుడు మునుల ప్రశ్నపైతిథులు, ద్వాదశి వ్రతాలు చెప్పసాగాడు

## తిథులు- వ్రతాలు-దేవతలు

బ్రహ్మయొక్క క్రోధం నుంచి అగ్ని జన్మించాడు "పితృపాదా! నాఖ్యాతి విశ్వమున వ్యాపించుటకు గాను నా కొక తిథిని ఏర్పాటు

చేయుడనెను."అందరికన్నా దొలుత పుట్టావు గనుక, నీతిథి పాడ్యమియే అవుతుంది. నీ భక్తుడైన వాడు పాడ్యమి నాడు వుపవాసం చేసి పాలు మాత్రము త్రాగినట్లయితే ఇరవై నాలుగు కల్పముల పాటు స్వర్గంలో వుంటాడు," అని వరమిచ్చాడు బ్రహ్మ. అశ్వనీ దేవతలు బ్రహ్మసారమనే స్తోత్రంతో బ్రహ్మదేవుడి అనుగ్రహానికి పాత్రులయ్యారు. బ్రహ్మవారి కనుగ్రహించిన రోజు విదియ కావున, ఈ తిథికి అశ్వినీ దేవతలు అధిపతులు, సంవత్సరం పాటు ప్రతి విదియ నాడు కేవలం పువ్వుల మాత్రమే ఆహారంగా తింటూ అశ్విని దేవతలను సేవించిన వాడు రూపవంతుడౌతాడు. తదియ నాడు గౌరి కల్యాణమైన రోజు. అందుచేత ఆనాడామెను పూజించిన స్త్రీ అతిలోక సౌభాగ్యవతి కాగలదు, ఆరోజు పప్పు తినడం మానివేయాలి. చవితి, వినాయకుని జన్మదినం, భాద్రపద శుద్ధ చవితి వినాయక చవితి సరే ప్రతి పక్షమునందలి చవితి నాడూ గణపతి నర్చించి కేవలం నువ్వుల మాత్రమే భుజించి వుండే వారికి వినాయకుడు అభీష్టములు తీర్చగలడు.

పంచమికి అధిదేవతలు నాగులు, కశ్యపుని సతియైన కద్రువకు– నాగు లుదయించిన తిథి పంచమి. కావున ప్రతి పంచమి నాడు పులుపు తినకుండా, పాలతో నాగులను పూజించిన వారికి నాగులు మిత్రులవుతారు. సుబ్రహ్మణ్య షష్టి, లేదా, కుమార షష్టి ఇది ఆయన జన్మదినం ఈ తిథికి శ్రీకుమార స్వామి అధిపతి. కేవలం పండ్లు మాత్రమే భుజిస్తూ– షష్టినాడు కుమారార్చన చేసిన వారికి అన్ని కోరికలుతీరతాయి. ఆ యింటి బాలురకు క్షేమం ఆరోగ్యం కలుగుతాయి.

రథసప్తమి. సప్తమికి అధిపతి సూర్యుడు. ఈ రోజు, సూర్యునకు, పాయసము నైవేద్యము చేసి అర్చించిన వారిని అన్ని విధములా ఆదిత్యుడు కరుణిస్తాడు.

అష్టమాతృక లావిర్భంచినది అష్టమి. అంధకాసురునితో శివుడు యుద్ధం చేసే వేళ, దేవతల సహాయార్థం మహేశ్వరి, మహేంద్రాది మొదలైన అష్ట మాతృకలు అవిర్భవించారు. వారిలో యోగేశ్వరి కామం మహేశ్వరి క్రోధం- వైష్ణవి లోభం మదం బ్రహ్మణి, మోహం కౌమారి, మాత్స్యర్యం యింద్రాణి, పై శున్యం అనసూయ, (మృత్యుత్వం) యమదండధర వరాహ అష్టమి నాడు వీరిని పూజిస్తే కరుణించి కాపాడతారు. ఎటొచ్చి అష్టమి పూజనాడు కేవలం మారేడు చివుళ్ళు మాత్రమే తినాలి.

దుర్గా నవమి, లేదా, మహర్నవమి, నవమికి అధినేత్రి శ్రీదుర్గాంబ అది యామె యవతరించిన రోజు కావున అనాడామెను పూజింపవలెను. పిండి మాత్రమే ఆహారముగా గొనవలెను.

దశమికి దిక్కులే దైవాలు దశమినాడు బహ్మపది దిక్కుల్ని సృష్టించాడు. ఎనిమిది దిక్కులను యింద్రాదులకిచ్చిదిక్పాలురుగా నియమించాడు. పై దిక్కుతాను తీసుకొని దిగువ దిక్కు ఆది శేషుడికిచ్చాడు. కావున దశమినాడు పెరుగు మాత్రమే త్రాగి దిక్కులనూ, దిక్పతులనూ ఆరాధించిన వారి పాపాలు దిక్కూ మొక్కు లేకుండా పోతాయి.

ఏకాదశినాడు ధనదుడు అవిర్భవించాడు అరోజు అగ్ని పక్వం గాని భోజ్యాహారాలు మాత్రమే తింటూ, అతనిని పూజించినట్లయితే, ప్రీతుడై యిష్టములు సమకూర్చుతాడు.

ప్రసిద్ధమైన తిథి ద్వాదశి, 12నెలలలోను 12 ద్వాదశులూ పరమ పవిత్రమైనవే, ముఖ్యముగా విష్ణ్వాధీనమైన తిథి ఈ రోజున నెయ్యి మాత్రమే స్వీకరించి విష్ణువు నర్చించిన వారి పుణ్య ఫలం చెప్ప నలవి కాదు.

త్రయోదశి ధర్మని తిధి, ఈ రోజు వుపవాసముండి ఏ దైవాన్ని అర్చించినా అది సత్ఫలాన్నిస్తుంది.

రుద్ర చతుర్దశి, ఈ తిధి రుద్రాధీనం. ఈ రోజు వుపవసించి, యవల, గోధుమల అన్నం తిని, రుద్రార్చన చేసే వారికి అత్యుత్తమ లోకాలు ప్రాప్తిస్తాయి.

అమావాస్యకు పితృదేవతలు అధిష్ఠాతలు, పితృదేవతలకు దర్భలు, నువ్వులు, నీళ్ళు సమర్పించాలి. ఎవరైతే అమావాస్యనాడు ఉపవాసం ఉండి నువ్వులు దానం చేస్తారో వారి పితృదేవతలు వారి పట్ల పరమ ప్రీతులౌతారు.

పౌర్ణమి అధిపతి చంద్రుడు పగలు వుపవసించిరాత్రి చంద్రుని (సోముడు) స్మరించుకొని భుజించిన వారికి జ్ఞానం కాంతి ధనధాన్యాలు కూడా ప్రసాదిస్తాడు.

## ద్వాదశీ ద్వాదశం

"సంవత్సరంలోని పన్నెండు మాసాలలో వచ్చే పన్నెండు ద్వాదశులూ గొప్పవే నన్నావుకదా! వాటిని వివరించు" అన్నారు ఋషులు.

సూతుడు చెప్పసాగాడు– "నేననలేదు. వరాహస్వామి భూదేవికి చెప్పాడే. ఆ విషయం క్లుప్తంగా చెబుతాను వినండి

1. చైత్రమాసం– శుద్ధద్వాదశినాడు వామనమూర్తి ధరుడైన నారాయణాన్ని పూజించాలి.

2. వైశాఖమాసం– ఇదీ శుద్ధపక్షమే. పరశురామ ద్వాదశి అని కూడా అంటారు. పరశురామావతారుడైన విష్ణువును ఆరాధించాలి.

3. జ్యేష్ఠ శుద్ధ ద్వాదశి దీనికి శ్రీరామ ద్వాదశి అనే పేరు కూడా వుంది. ఆరోజు శ్రీరామావతారుడైన విష్ణువును పూజించాలి.

4. ఆషాఢ శుద్ధ ద్వాదశి – దీనిని కృష్ణ ద్వాదశి అంటారు ఈ రోజు కృష్ణున్ని అర్చించాలి.

5. శ్రావణ శుద్ధ ద్వాదశి అనగా బుద్ధ ద్వాదశి ఆపదలనుండి రక్షణకు గాను ఈ ద్వాదశి వ్రతం చేస్తారు.

6. భాద్రపద శుద్ధ ఈ ద్వాదశి దీనినే కల్కి ద్వాదశి, వామన ద్వాదశి అంటారు, కల్క్యవతారాన్ని పూజించాలి.

7. ఆశ్వయుజ శుద్ధ ద్వాదశి- ఈ రోజు పద్మనాభ స్వామిని పూజించాలి.

8. కార్తీక శుద్ధ ద్వాదశి – హిరణ్యాక్షుని వల్ల పతనం కాబోతున్న వరాహస్వామి భూమి నుద్ధరించాడు. ఈ నాడే విష్ణువును పూజించింది.

తత్కారణాన విష్ణువు వరాహమూర్తియై ఆమెను రక్షించాడు. దీనినే పతిత పావనమైన ధరణి ద్వాదశీ యంటారు.

9. మార్గశిర శుద్ధ ద్వాదశి – మత్స్యావతారము దాల్చిన తిథి గావున దీనికి మత్స్య ద్వాదశి అని కూడా పేరు గలదు.

10. పుష్య శుద్ధ ద్వాదశి – ఈ రోజు కూర్మావతారుని కొలువవలెను. దీనినే కూర్మ ద్వాదశియని యందురు.

11. వరాహద్వాదశి అను మాఘ శుద్ధ ద్వాదశి –మాఘమాసంలోని శుద్ధ ద్వాదశి నాడు వరాహమూర్తిని అర్చించవలెను. సర్వ పాపహరం ఈ వ్రతం.

12. ఫాల్గుణ శుద్ధ ద్వాదశి- ఇది నృసింహ ద్వాదశిగా ప్రసిద్ధి. ఈ రోజున నృసింహుని అర్చించినచో ఆయన ప్రసన్నుడగును.

# గౌతముడు గంగను భూమికి తెచ్చుట

ఇంకా చెబుతున్నాడు సూతుడు

దండకవనం అని ఒక అరణ్యం వుంది. అక్కడ గౌతముడు అనే ఋషి వుండేవాడు. బ్రహ్మదయ వలన చక్కటి సస్య సమృద్ధి కలిగేలా వరం పొంది, దండక వనంలోని శతశృంగమనే స్థలంలో ఆశ్రమం నిర్మించుకొని వుండసాగాడు.

గౌతముడు ప్రతి రోజూ ఉషఃకాలంలోనే చేనివద్దకు వెళ్ళి విత్తనాలు చల్లేవాడు. అవి మధ్యాహ్నాని కల్లా పండిపోయేవి. కోతలు కోసి ఆ తాజా పంట గింజలను అప్పుడే వండించి బ్రాహ్మణులకు ఆతిథ్యంయిస్తుండేవాడు. ఇలా నిత్యాన్న సంతర్పణతో గౌతమాశ్రమ కీర్తి దేశదేశాలా వ్యాపించినది.

ఇలా వుండగా ఒకప్పుడు ద్వాదశ వర్షక్షామంవచ్చింది. దాంతో కంద మూలాలు కూడా కరువైపోయిన ఎందరో ఋషి ముని తాపస ప్రవరులు గౌతముణ్ని శరణు వేడారు. ఆకరువు సాగిన పన్నెండు సంవత్సరాలు కూడా గౌతముడు, వారినందరినీ అతిథి సత్కారాలతో అలరించాడు. పన్నెండు సంవత్సరాలూ గడిచి పోయాయి. వర్షాలు పడసాగాయి. అన్నాళ్ళు అక్కడున్నఋష్యాదులందరూ తమ తమ ఆశ్రమాలకూ, తీర్థ యాత్రలకూ బయలు దేరతామన్నారు. పన్నెండేళ్ళ సాహచర్యం వల్ల గౌతముడు వారిని వదలలేక– రేపు మాపు అని జాప్యం చేస్తు వచ్చాడు. ప్రతి రోజు సుష్ఠుగా తిన మరిగిన వారు కొందరు "గౌతముల వారు వెళ్ళవద్దంటుంటే ఎక్కడకు వెడతాం? ఇక్కడే వుండి పోదాం" అనుకున్నారు. "పన్నెండేళ్ళుగా పడి తిన్నదిచాలదు! ఇంకా ఆయన్ని శ్రమ పెట్టాలా?" అని కొందరన్నారు. "ఆపద్ధర్మంగా ఆశ్రయించామె గాని మనం

వెళ్ళిపోవడానికి ఆయన అనుమతి దేనికి?" అని మరి కొందరు దీర్ఘాలు తీశారు. గౌతమా(శమానబడి తినగా గౌతముడి సస్యసంపన్నతకు కన్నుగుట్టి, లోలోపలే కుతకుతలాడుతున్న కుటిలస్వభావులు కొందరు, అదే అదనుగా భావించి ఒక మాయాగోవును సృష్టించారు.

ఒక రోజు మధ్యాహ్నం ఆ మాయాగోవు కోతకు సిద్ధంగావున్న ధాన్యపు చేనిపై బడి చెరుపసాగింది. ఆతిథ్య(వ్రతానికి అంతరాయం కలిగే అకృత్యాన్ని భరించలేని గౌతముడు గోవు పూజనీయం కావటం వలన కాసిన్ని నీళ్ళు దానిపై ప్రోక్షించి చేనిలో నుండి తరిమి వేయాలనుకున్నాడు. నీరె చల్లాడు కూడా! సమయమెప్పుడా అని చూస్తున్న మాయా గోవు నీరు చిలకగానే నేల కూలి మరణించింది. నిమిషంలో ఈ వార్త ఆ(శమమంతా ప్రాకిపోయింది గోహత్య జరిగిన ఆ(శమంలో మేము నిలవంగాక నిలువమని అంతావెళ్లి పోసాగారు. బ్రాహ్మణులు ఆతిథ్యానికి రాని ఆ(శమవాసం గౌతమునికే కష్టం అనిపించింది.

పరిష్కారమేమిటంటూ పదుగురు పెద్దలనీ అడిగాడు తానొక స్మృతి కర్త అయివుండి కూడా- పరుల వాక్యాన్నే పాటించదలిచాడు. గౌతముని మీద నిష్కారణ యీర్ష్యాళువులైన విప్రులంతా ప్రోగుపడి -"సగర సంతానం కోసం భగీరథుడు ఆకాశగంగను దింపినట్లే- నువ్వు శివజటలనుంచి గంగను దెచ్చియీ గోకళేబరం మీద ప్రవహింపచేసేదాకా నీపాపం పోదు. మేమెవరం నీతోపలకం నీ ఆ(శమానికి రానేరాం" అన్నారు. తథాస్తు అన్నాడు గౌతముడు.

ఉన్నవాడు వున్నట్లే హిమాలయాలకు తరలి వెళ్ళాడు కఠోరమైన దీక్షవహించి కంఠేకాలుడి కోసం తపస్సాచరించాడు తపస్సుకు మెచ్చి గౌతముని ముందు తోచాడు కళాధరుడైన శివుడు ఏంకావాలో కోరుకో గౌతమా?" అని అడిగాడు.

"శంభో! హతమైనదో హత్యే చేయబడినదో నా ఆశ్రమం వద్ద గోవు మరణించింది. తత్కారణంగా యోగి, తాపస ఋషి, ముని బ్రాహ్మణప్రవరులంతా, నా అతిథ్యం స్వీకరించడాన్ని బహిష్కరించారు. అసలు నా ఆశ్రమంవైపుకే రావడం మానివేశారు. ఆ ఆశ్రమ ప్రాంతంలో గంగ ప్రవహిస్తేనే గాని పాపపరిహారం కాదని పెద్దలు చెప్పారు. "గంగాధరా! నన్ను ఒక కంటచూచి గంగనేఅనుగ్రహిస్తావో, ముక్కంట చూసి దగ్ధుణ్ణే చేస్తావో" నీదయ అన్నాడు గౌతముడు.

అతని బ్రాహ్మణ ప్రియత్వానికి, వ్రతదీక్షకూ, అసత్యాభియోగాన్ని ధరిస్తున్నా అచంచలత్వానికి, తన ఎడల భక్తి కోసం తపించినవాడైన గౌరీపతి-తన జటలలోనుంచి- ఒక జటను తీసీ గౌతమునికిచ్చి "ఇది నీ ఆశ్రమం వాకిట పిండు -గంగ ప్రవహిస్తుంది " అన్నాడు.మహాప్రసాదం అంటూ ఆ గంగార్ద్రశివసటతో ఆశ్రమానికి వచ్చాడు గౌతముడు. ఆశ్రమంవద్ద పడివున్న గోకళేబరం మీద పిండాడు. ఆశ్చర్యంగా ఆమాయాధేనువు పునర్జీవితయై- యెటో సాగిపోయింది. శతశృంగ ప్రాంతంలో శివగంగ చిందులు వేసింది. కపర్దీజటాఖండ నిర్గతమైన వారి పూరంపాయలు పాయలైచీలి కూడా-శతశృంగ ప్రాంతాన ఒకేయేరుగా మహానదియై నిజ జల నిమజ్జజ్జంతునివహాలత పాపాల జిడ్డు కడిగేస్తూ ఒకచోట దుడుకుగా, మరోచోట మందంగా, ఇంకొక చోట సుడులు తిరుగుతూ, నురువులు గ్రక్కుతూ, వుక్కుమిగిలి బ్రహ్మ హత్యాది ఘోరపాపవికారాల్ని తిరస్కరిస్తూ ప్రవహిస్తోంది. ఆపుణ్యనది గౌతమునిచే తేబడినదవటం చేత గౌతమిగా పేర్వహించింది. గోవును పునరుజ్జీవితను చేయటం చేత గోదావరి అయింది. స్మరణమాత్రసర్వాపు సంహారియైన గోదావరికి నమస్కారం! అనంతరం గౌతముడు, తీరికగాకూర్చున్నాడు, నింద తొలగించుకున్న నిర్మలచిత్తంతో పరికిస్తున్నాడు - కుటిల

బ్రాహ్మణులాడిన నాటకం తెలిసిపోయింది. కూడ బెట్టినవాణ్ణే కూలద్రోయాలనుకున్న మీరంతా వేదబాహ్యగుదురు గాక అని వారిని శపించాడు, గౌతముడులా శపించగనే తథాస్తు దేవతలూ, సప్తర్షులు ఆయనముందు ప్రత్యక్షమయ్యారు, "ఆ బ్రాహ్మణులు అబ్రాహ్మణ్యంగా ప్రవర్తించిన మాట నిజమే, కాని, నీవు కూడా ఆవేశపడుట సబబు కాదు" అని సర్ది చెప్పారు.

"నేనిచ్చిన శాపాన్ని ఉపసంహరించుకోలేను." అన్నాడు. గౌతముడు, ఆ శాపం కలియుగంలోని కపటులకు వర్తించేలా అనుగ్రహించు అని సప్తర్ష్యాదులు కోరడంతో గౌతముడు అంగీకరించాడు.

తమ మాట మన్నించినందులకు గాను యేమైనావరాలు కోరుకోమన్నారు వారు, అందుకుగాను పునరుజ్జీవిత చేసిన యీ జీవనది శివ గంగ గోదావరీ నామంతో వర్ధిల్లాలి. ఈ నది తీరానగాని, దీని ప్రాంతానగాని, గోదానం చేసిన వారికి అనంతపుణ్యం లభించాలి. గురుడు సింహరాశిలో ఉండగా(పుష్కరాలప్పుడు) ఈ నదీతీరంలో పితృదేవతను కొలచినవారు స్వర్గాన్నందుకోవాలి." అని కోరుకున్నాడు. గౌతముడు . తథాస్తుదేవతలూ, సప్తర్షులూ అంతాకలసి యేకకంఠంతో –తథాస్తు– తథాస్తు అని ముమ్మారు పలకారు.

సంతృప్తుడయ్యాడు గౌతమి సంయమి వరేంద్రుడు. తదనంతరం శాపం వల్ల భావి, బాహ్మణ జాతి నశించకుండా వుండడం కోసం –వారంతా శివకేశవులను ప్రార్థించారు. అప్పుడు శివకేశవులు తీవ్రంగా ఆలోచించి, కపాలము నకులము– భైరవము –పాంచరాత్రము మొదలైన గ్రంథములను నిర్మించి యిచ్చారు. వీటికే మోహన గ్రంథములని పేరు. ఏతత్స్మరణ మాత్రంచేతనే తత్కాలపూర్వపాపాలన్నీ పటాపంచలవుతాయని శివుడువరం ఇచ్చాడు.

# హిరణ్యాక్షుడు

ప్రజాపతులలో కశ్యపప్రజాపతి ఒకడు. అయనకు నలుగురు భార్యలు. దితి, అదితి, వినత, కద్రువ వాళ్ళ పేర్లు. అందు యది దేవతలు, దితికి రాక్షసులు, వినతకు నమారుడు, గరుత్మంతుడాది పక్షిగణములు కద్రువకు సర్పవీరులైన తక్షక, కర్కోటకాదులు జన్మించిరి. దితి సంతానం దైత్యులు. ఆమె గర్భములో హిరణ్యాక్ష హిరణ్యకశిపులను యిద్దరన్న దమ్ములు గల్గిరి. వారిలో చిన్న వాడగు హిరణ్యాక్షుడు హిమగిరి కేగి వాయువును బంధించి బ్రహ్మను గూర్చి మహాతీవ్రముగా తపమాచరించ సాగెను అతని ఘోరతపమునకు బహ్మాండమల్లల్లాడసాగినది. దేవగణములు బెంబేలు పడసాగెను. భూమి వణకుచుండెను. దిక్కులన్నియు నావేడిమి కావిరులుగ్రమ్మి దశదిశలా వుష్ణవాయువు వ్యాపింపసాగెను. స్వర్గములో నున్న దేవతా సమూహములు భీతిల్లి తమరాజ్యములు, సింహాసనములు నిలువ వని కంగారుపడసాగిరి. ఈ తపోవేడిమి భరించలేక, దేవతాగణములు మహాభీతి సత్యలోకమున కేగి బ్రహ్మను జేరి "ఓ బ్రహ్మదేవా! నీవు సర్వవేదసారసంపన్నుడవు. సృష్టి కర్తవు, నీవెరుగనిది లేదు. మాపాట్లు వర్ణింపతరముగాదు. మా మాస్థావరములలో నుండు యోగ్యత కన్పించుటలేదు. ఈ రాక్షసుని తపమువలన వచ్చు ఉత్పాతములు భరింజాలకున్నాము. వాని తపస్సు మాన్పించి మాకును, లోకములకును శాంతి గూర్చకున్న మేము నిల్వలేము. నీవు తప్ప మాకెవ్వరు గతిలేరు. కాపాడు మని కాళ్ళ" వ్రేళ్ళుబడిరి. వారిని చూచి విధాత జాలిపడి "ఓ దేవకోటులారా? మీరు భయపడనవసరములేదు. ఇప్పుడే వెళ్ళి వానికి వలయు కోర్కెలు దీర్చి తపము మాన్పించెదను. మీరు శాంతిని పొంది సుఖముగా మీ నివాసములకు బొండు. నేనిక రక్షణాయత్నములో

నుందునని" వారిని పంపించి, తాను హిరణ్యాక్షుని జేరెను. వానిని సమాధినుండి మామూలుస్థితికి రప్పింపదలచి తన కమండలంలోని జలమునుకొంచెము ప్రోక్షించెను. బ్రహ్మకమండ లోదకముతో నాతడు నిద్రనుండి లేచినవానివలెశరీరమున చైతన్యంగల కదలికలు బూని క్రమముగా కన్నులు తెరచి ఎదుట బ్రహ్మదేవుడు కనిపించగా నొక్కసారి సాష్టాంగముచేసి "మహానుభావా! పితామహా! నీ దర్శన భాగ్యమునకిన్ని సంవత్సరముల నుంచి వేచియుంటిని. నా పుణ్యవిశేషముచే నాకు నేడు దర్శనమిచ్చి నావు- నా జన్మ తరించినది నాయభీష్టములు నెరవేరగలవు.

ఇంక నేసందేహములే"దని చేతులు జోడించుకొని వినయముతో నున్నయా రాక్షసవీరుని చూచి బ్రహ్మ "ఓ భక్తశిఖామణి! ఇంత దీక్షతో తపమాచరించువారు లెక్కకు మాత్రమే యుందురు. నీవు చేసిన ఈ మహాతపమునకు మెచ్చుకొంటిని. నీవు యేమికోరి యాతపము చేసితివో అడుగుము. నీవు కోరిన కోర్కెలు తీర్చెదన"నగా విని యా రాక్షస వీరుడు "పితామహా! ప్రపంచముపుట్టిన జీవులకు ముఖ్యమగు కోర్కెలేవి యుండునో నీవెరుగుదువు. కాని, నా వలన రాబట్టదలచినావుగాన చెప్పుచున్నాను. ముందుగా నాకు యెవరివలనను. యే యాయుధముల వలనను, యే యితర సాధనముల వలనను, యే యితర సాధనముల వలనను, మంత్ర -తంత్ర -యన్త్ర-శస్త్రదుల వలనను మరణము లేకుండా - దేవదానవ మనుష్య గణాదిసమస్త ప్రకృతిలోని వారి వలన శరీరపీడ మరణము లేకుండా వరము మొదటిది కావలేను, రెండవవరము వినుము. ఈ సృష్టిలో నాకెదురు లేకుండా త్రిలోక పాలనము సాగించవలెను. ఈ రెండు వరములు నాకీయవలయు" నని యనగా బ్రహ్మ శ్రీహరిని తలచుకొని యన్నిటికి నీ నీవున్నావు- నేను వరదానము చేయుచున్నాను. ఇందులో నుండు సాధకబాధకములు, లోకక్షేమము -సమస్తము నీవెరుగుదు" వని

యనుకొని వాడు కోరినవరములిచ్చి, తాను సత్యలోకమునకు పోయెను.

హిరణ్యాక్షుడిట్లు బ్రహ్మవలన వలన వరములు పొంది యింక తన కెదురు లేదని నిశ్చయించి, రాజ్యములాక్రమించ సాగెను. దేవతలను గంధర్వులను, యక్షసిద్ధ సాధ్యులను క్రమముగా తన పరాక్రమముతో జయించసాగెను.

వారంద రాతని తీవ్రత ముందు నిలువజాలక దశదిశల పరుగులు తీసి యరణ్యములు, పర్వతములు నానా రహస్య ప్రదేశములు చూచుకొని యందు తల దాచుకొనసాగిరి. వాడు స్వర్గముమీద దండెత్తి వారిని జయించి తనకు, కావలసిన మహాపదార్థములు గైకొనుచు యథేచ్ఛగా భోగము లందుచు తనకడ్డులేకుండా సంచరించసాగెను. తరువాత దిక్పాలురలోకములన్నియు తన చేతిక్రిందకు తెచ్చుకొనెను. అటుపై త్రిమూర్తుల మీదకు దండెత్తదలచి సత్యలోకమునకు పోయి "విధాతా! నీ ప్రభావముతో నేను సమస్త దేవగణములను జయించినాను. మీరు నన్ను గొప్ప చేయదలచిరి. గాన నిన్ను జయింపవచ్చితిననెను. బ్రహ్మదేవుడది విని "కుమారా! నేను పెద్దవాడును గదా! నీతో యుద్ధము చేయగలనా? నీవు వీరాధి వీరుడవై శోభించుచున్నావని నేను గర్వించుచున్నాను. నేనెప్పుడును నీకు స్వాధీనుడనేకదా! ఇదివరలో నన్ను తపస్సుతో జయించి వరములు గొన్నావు. ఇంకేమి కావలయును? నీకు కీర్తి గల్గుట. మహావీరత్వము ప్రకటించుట, లోకములు సెహబాసని మెచ్చుట– జరుగగల సన్నివేశము చెప్పెద వినుము. లోకములన్నింటియందు వీరుడని ప్రఖ్యాతి గడించిన వాడు. వైకుంఠవాసి నారాయణుడు. అతనితో పోరినీవు జయము సంపాదించినచో త్రిలోకములందు నీకిర్తికి సాటికానరాదు, అందుచే నీవా వైకుంఠునితో పోరుసల్పి ఎనలేని కీర్తి సంపాదింపుము. ఇప్పుడే నీవుబయలు దేరి

వైకుంఠమునకు బొమ్మని" చెప్పగా–దానిని ముందే గ్రహించిన శ్రీహరి తనవారితో "నేను పాతాళలోకములో పనియుండి వెళ్ళినానని చెప్పు" డని చెప్పి తాను మాయమయ్యెను. రాక్షసుడు వచ్చి ద్వార పాలకులను చూచి "మీ యధిపతి యెక్కడున్నాడు?" అనియడుగగా విని.వారు చలించి "అయ్యా! మీరెవరో మాకు తెలియదు ఇది శ్రీహరి నివాసము, వైకుంఠము. ఆయన పాతాళమున కేగినారు. నీవు లోనికి వెళ్ళిచూ చేడదలచినను తిరుగ దలచినను ఏమి చేయదలచినను మేము నిన్నడ్డుపెట్టము. స్వేచ్ఛగా నిరాటంకముగా లోనికి పొమ్మని జాగ్రతగా మాట్లాడి అతనిని లోనికి పంపిరి.

శ్రీహరి నివాసము సామాన్యమా! ఎన్నిరాజభవనములు! ఎన్ని యుద్యానవనములు! యెన్ని యమృతసరోవరములు! ఎన్ని రత్నరాసులతో నిండి ఎన్ని నదీ నదములలో! అవి యివి యని యెన్ని వర్ణించగలము? వైకుంఠమును వర్ణించుట సామాన్యమా? దాని పరిమాణము దాని మాహాత్మ్యము దాని చిత్రవిచిత్ర యనుభూతులతో భక్తగుణ సముదాయము గల్గియుండెను. సామీప్య భక్తులు, సాలోక్యభక్తులు, సారూప్యభక్తులు సాయుజ్య భక్తులతో నిండియుండును. అచట అందరును శ్రీమహావిష్ణుస్వరూపులే! శంఖ చక్ర గదాపాణులు, పీతాంబరధారులు కౌస్తుభ భూషణులు, సర్వాలంకారశోభితులై యుండువారితో నిండియుండును. ఇట్లు వర్ణింప లేని మహావైకుంఠము ప్రవేశించి. వాడు శ్రీహరికై వెదక నారంభించెను. ఎక్కడచూచిన శ్రీహరి రూపములో ఎవరు శ్రీహరియో తెలియరాకుండెను.

వారందరనూ చూచి తనకు హరి కనిపించకపోవుటకు క్రోధముబూని ద్వారపాలకులు చెప్పింది నిజమని పాతాళమునకు పోవజూచెను. కాని దారి తెలియకుండెను. దానితో దారి తెప్పించవలెననిపించి వెంటనేభూమిని చాపగా చుట్టదలచెను. అదితెలిసీ పాతాళవాసులు శ్రీహరి నాశ్రయించిరి. అతడు వారికభయ మిచ్చెను. వాడుక్రమముగా భూమిని చాపవలె చుట్టుచు పోవుచుండెను. భూదేవి ఘొల్లుమనెను. వెంటనే శ్రీహరి "నీవు విచారించకు! నీకు ఈ జీవజీలమునకు నోషధీచయమునకు హాని రాకుండా చూతు" నని యజ్ఞ వరాహరూపము ధరించెను. శంఖచక్రములు పార్శ్వభాగముల నుండెను. వాడి కోఱతో, నిడుదయగు ముట్టెతో, మహాభయంకర ఘుర్ఘరారవములతో, వాని కెదురుసాగెను. చాపగా భూమిని చుట్టుకొని వచ్చువాని మీదకు లంఘించితనకోరలతో నొక్కపోటు పొడిచెను.

వాడాపోటునకు గుండెపగులగా రక్తము గారుచు జలములలో బడిపోయెను. మరల తనపాదములతో వాని శరీరము నొక్కిపట్టి తనకోరను గ్రుచ్చెను. ఆదెబ్బతో వాడు నెత్తురు గ్రక్కుచు చనిపోయెను. వాని నంటి యున రాక్షసమూక చల్లాచెదురయ్యెను. చాపగా చుట్టబడిన భూమిని నారాయణుడు తన కోరమీదనిల్పిక్రమముగా పట్టువదలక చుట్ట విప్పి సమస్త జంతుజాలమును రక్షించి ఆ యవతారమును చాలించి వైకుంఠము జేరెను.

## వరాహపురాణము సమాప్తం



# 13. స్కాంద పురాణము

శ్లో॥ యత్ర స్కందః స్వయంశ్రోతా, వక్తా సాక్షాన్మహేశ్వరః।

శివుడు కుమార స్వామికుపదేశించిన పురాణమే ఇది కావున స్కంద (కుమారస్వామి) పురాణమను పేరు సార్థకమైంది. కుమారస్వామి దీనిని తండ్రియైన పరమ శివుని నుండి అతి భక్తి శ్రద్ధలతో విన్నాడు. ఆ తర్వాత దానిని మహామునులకు ఉపదేశించాడు.

óί ॥ "ఏకాశీతి సహస్రంతు, స్కాందః సర్వాఘ కృంతనమ్!"

ఈ స్కాంద పురాణం సర్వపాపాల దూరీకృతం చేయగలది. దీనిలో ఎనభై యొక్క వేయి శ్లోకాలున్నవి. అష్టాదశ మహాపురాణాలలో చాలా పెద్దది స్కాంధ పురాణం.

శ్లో॥ స్కాందం పురాణంరోమాని।

అని శ్రీమహావిష్ణువు యొక్కరోమాలతో పోల్చబడింది. శరీరమంతా రోమాలుంటాయి గదా! అంత ప్రాధాన్యమైనది.

## స్కాంద పురాణమని భావము.

ఇందు ఏడు ఖండాలు (భాగాలు) ఉన్నవి.

1. మహేశ్వర ఖండం 2. వైష్ణవ ఖండం 3. బ్రహ్మఖండం 4. కాశీఖండం 5. అవంతీ ఖండం 6. నాగర ఖండం 7. ప్రభాసఖండం అని కలవు.

1) మహేశ్వర ఖండంలో– కేదార ఖండం, కౌమారీ ఖండం, అరుణాచల మాహాత్మ్యం అనే విషయాలున్నవి.

2) వైష్ణవ ఖండంలో– వేంకటాచల మాహాత్మ్యం, బదరికాశ్రమ మాహాత్మ్యం, కార్తీకమాసమాహాత్మ్యం, మార్గశీర్షమాస మాహాత్మ్యం అయోధ్యా మాహాత్మ్యం మొ॥ న అంశాలు సాక్షాత్కరిస్తాయి.

3) బ్రహ్మఖండంలో- సేతు మాహాత్మ్యం, ధర్మారణ్యఖండం, బ్రహ్మోత్తర ఖండాలన్న విషయాలున్నవి

4) కాశీఖండంలో- కాశీ క్షేత్రానికి సంబంధించిన సంపూర్ణ వర్ణన అగుపిస్తుంది.

5) నాగర ఖండంలో- తాపీతరంలోని తీర్థాల వర్ణన అగుపిస్తుంది. ఈ కారణంగా ఈ ఖండానికి తాపీ ఖండమనే పేరు వచ్చింది. విశ్వకర్మో పాఖ్యానం, హాటకేశ్వరోపాఖ్యానం మొ॥ ఉపాఖ్యానాలు ఈ స్కాందపురాణంలో కలవు.

6) ప్రభాస ఖండంలో - ద్వారకా నగరంలో దాని పరిసర ప్రాంతాలకు సంబంధించిన చక్కని వర్ణన ఈ పురాణంలో కలదు. ఖండం రూపములోనే కాక సంహితా రూపంలోను, స్కాంద పురాణమున్నది.

1) సనత్కుమార సంహిత 2) సూతసంహిత 3) శంకర సంహిత 4) వైష్ణవ సంహిత 5) బ్రహ్మ సంహిత 6) సౌర సంహిత ఇవి అందులోని వేదభాగాలు.

సూత సంహితలో శివోపాసన ఎంతో విశదంగా వుంది. శివమాహాత్మ్యాన్ని తెలియజేసే ఒక శ్లోక ముదాహరంతును.

శ్లో॥ శివ ప్రసాదేన వినా, నభక్తాయః ప్రసాదేన వినా నముక్తవాః!
శివపున వినా న దేవతాః శివ ప్రసాదేనహి సర్వసిద్ధయః!!

శివుని దయలేనిదే ఆహారం లభించదనియు, మోక్షం లభించదనియు, ఇతర దేవతల శక్తులు పనిచేయవనియు, శివానుగ్రహం వలన సర్వ సిద్ధులు చేకూరుతాయని ఈ శ్లోకార్థం.

కాశీఖండానికి సంబంధించిన ఆకర్షణీయమైన ఒక విషయ మిక్కడ చెప్పబడుచున్నది. అది యేమనగా :-

శ్లో॥ "అయోధ్యాయా మథావంత్యాం, మధురాథామాయాథా పివా!
ద్వారవత్యాంచ కాంచ్యాంవా, మాయాపుర్యాం మృతాన్నృపః!!
శ్లో॥ అపిపాతకీనో యేచ కాలేన నిధనం గతాః!
తేహి స్వర్గాదిహాగత్య, కాశ్యాంమోక్షమవాప్ను యుః!!"

అనగా అయోధ్య, అవంతి, మధుర, ద్వారక, కంచి మాయాపురి అనే నగరాలలో మరణించిన వారు, ఆయానగరాల మాహాత్మ్యం వలన పాపాత్ములైనను స్వర్గాన్ని పొందగలరు. స్వర్గనుండి ముక్తులైతారు. అనగా పై ఆరు నగరాలు సాక్షాత్తు మోక్షదాయాకాలు కావు. కాశీక్షేత్రం మాత్రమే ప్రత్యక్ష మోక్షదాయకమైనదని భావం కనుకనే కాశ్యాంతు మరణోన్ముక్తిః అని ఆర్యోక్తి దీన్ని నిరూపిస్తున్నది. ఇట్లే

శ్లో॥ "క్షేమమూర్తిరియం, కాశీ క్షేమమూర్తిర్భవాన్ భవః!
క్షేమమూర్తి స్త్రిపథగా, నాన్యత్ క్షేమత్రయం క్వచిత్!!"

క్షేమదాయక నగరం కాశీ, క్షేమాన్నిచ్చే దైవం శ్రీకాశీవిశ్వేశ్వరుడు క్షేమ దాయకమైనది గంగ, ఈమూడింటి కలయిక ఒక్క కాశీ నగరానికి మాత్రమే పరిమితమైంది. మరొక చోటెక్కడా, ఈ మూడు ఒకే చోట కానరావని భావం, కాశీక్షేత్రం పవిత్రతను చాటుచున్నదీ శ్లోకం.

అనేక ప్రాంతాల దేవాలయ జీర్ణోద్ధరణ జరుపు చుందురు. ఈ కార్యక్రమం నిర్వహించేవారు, ఎటువంటి ఫలాన్ని పొందగలరో స్కాంద పురాణం విశద పరస్తున్నది. దేవాలయ జీర్ణోద్ధరణ జరిపిన వారు పొందిన పుణ్యం ప్రళయకాలంలో సహితం నశింపక శాశ్వితంగా నుంటుందని చెప్పబడింది.

శ్లో॥ "కాలేన భగ్నమానసం, జీర్ణోద్ధారం కరోతియః!
ఇహతస్య ఫలస్యాన్తః ప్రళయే పిన జాయతే!!"

ఎవరైతే కాల గర్భంలో కలసి పోయిన దేవాలయాల జీర్ణోద్ధరణ చేస్తారో, వారి పుణ్యం ప్రళయ కాలంలో నశింపక చిరకాలముంటుది.

శ్రీ సత్యనారాయణ స్వామి వ్రతాన్ని భారతీయులెంతో భక్తితో శ్రద్ధతో ఆచరిస్తుంటారు. ప్రత్యేకించి ఏ శుభ కార్యారంభం జరిగిన ఈ వ్రతం (కథ) చేయడం మన తెలుగు వారి కానవాయితీ. ఎంతో మహిమతో కూడిన ఈ వ్రత కథ స్కాండ పురాణంలో రేవా ఖండంలో దర్శనమిస్తుంది. పై విషయాలేగాక ఈ పురాణంలో ఇంకా-

విభూతి మాహాత్మ్యం, గోకర్ణక్షేత్రంలో రావణుడీశ్వరుని పూజించుట, దేవతలు వానరులుగా జన్మించుట, రామావతార-వర్ణన, క్షీర సాగర మథనం, అందులో లక్ష్మీదేవి అమృతము జన్మించుట, విష్ణువు మోహిని రూపం ధరించుట, గిరిజాకల్యాణం కుమార సంభవం, తారకాసురవధ, శివరాత్రి మాహాత్మ్యము, శివ-పార్వతుల జూదం, అందులో ఓడిన శివుడు కాపీనం(గోచి), ధరించి కైలాసం వదలి అడవులకు వెళ్ళడం, పార్వతీదేవి కూడ ఆయన్ను అనుసరించడం. అన్న గృహ, వాహన దానాల ఫలం ఓంకార మహిమ స్వాయంభువు మొ॥ పదునాల్గురు. మనువుల వర్ణన, తల్లిదండ్రుల మాహాత్మ్యం ఇంద్రద్యుమ్న చరితం, సప్తద్వీప వర్ణన భీమేశ్వర మాహాత్మ్యం మార్కండేయోపాఖ్యానం, హయగ్రీవోపాఖ్యానం, సోమవార వ్రత మాహాత్మ్యం, రుద్రాక్ష మాహాత్మ్యం, పురాణాల నిందిస్తే కలిగే పాపాలు, అగస్త్యాశ్రమ వర్ణన సదాచారాలు, గృహస్థ ధర్మాలు మాంధాతృ వృత్తాంతం, గోదాన మహిమ గాయత్రీ మాహత్మ్యం, శివరాత్రి మాహాత్మ్యం మొ॥ వృత్తాంతాలెన్నో ఇందున్నవి.

## స్కాంద పురాణంలో వన భోజనం:-

ప్రతి వ్యక్తి జీవితంలోనూ ఎన్నో ప్రధాన ఘట్టాలుంటాయి. వాటిలో ప్రధానమైనది ఆహార సేవనం. ఆహారశుద్ధి, సత్త్వ శుద్ధి పరిశుద్ధాహారం స్వీకరిస్తే సత్త్వ గుణం పెంపొందుతుంది. అందుకే ఆహారం తీసికొనే ముందే

"బ్రహ్మార్పణం బ్రహ్మహవిష్ బ్రహ్మాత్మా బ్రాహ్మణప్రియః! బ్రహ్మాగ్ని తేన గంతవ్యం, బ్రహ్మకర్మసమాధినా!!"

అని దైవ ధ్యానం ప్రార్థన (జపం) చేస్తారు. ఒక్క భోజనంతో అతిథులను గానీ మరెవరినైన సంతృప్తి పరచినట్లు మరే దానితో తృప్తి పరచలేము. ఆంధ్రులు అతి భోజన ప్రియులు; కార్తీకమాసంలో ఆంధ్రులు చేసే వన భోజనాలు ఎంతో ముచ్చటగా నుంటాయి. అయినవారితో భార్యా పుత్రులతో ఇష్టబంధులతో కలసి, కనీసం ఏదో ఒక రోజైన వన భోజనానికి తప్పక వెళ్లుతుండే ఆచారం సాంప్రదాయకంగా వస్తున్నది. ఈ కార్తీక మాసానికి వన భోజనాలకు మధ్యనున్న బాదరాయణ సంబంధమేమిటి? అని ప్రశ్నించకుంటే ఈ స్కాంద పురాణంలో యిలా సమాధానం స్పష్టంగా లభిస్తుంది.

శ్లో॥ కార్తికేమాసి సంప్రాప్తే, యః కుర్యాద్వన భోజనమ్!
స యాతి పరమంలోకం, విష్ణుర్దేవస్య చక్రిణః!!

కార్తీక మాసంలో వన భోజనం చేసేవారు ఇహలోక యాత్ర ముగిశాక (జీవితం) నేరుగా వైకుంఠం చేరుకోగలరని భావం.

ఈ వన భోజనం ఏదో ఒక చెట్టు క్రింద కూర్చుండి పూర్తి చేయడం గాక ఉసరిక చెట్టుకింద చేయగల్గితే మంచిదని ఈ స్కాంద పురాణం చెబుతుంది.

శ్లో॥ ధాత్రీవనే హరేఃపూజాః ధాత్రీచాయా సుభోజనమ్!
కార్తీకమాసిః యకుర్యాత్త స్వపాపం వినశ్యతి!!
శ్లో॥ ధాత్రీఛాయాయాం సమాశ్రిత్యం కార్తీకే న్నం భునక్తియః!
అన్న సంపర్గ వ్రజం పాప, మావర్షం తస్యనశ్యతి!
ఉసరిక చెట్టు పూజ, ఉసిరి చెట్టు నీడలో భోజనం చేస్తారో వారి పాపాలన్నీ దూరీకృతమౌతాయి అని వర్ణింపబడ్డాయి. ఇది కార్తీక మాసంలో వన భోజనం ఫలం

## స్కాంద పురాణంలో గురుపూజ:-

శ్లో॥ "సర్వేషా మేవ ధర్మాణాం, గురుపూజాపరామతా!
గురు శుశ్రూషయా సర్వం, ప్రాప్నోతి హి నసంశయః!
శ్లో॥ గురౌ తుష్టేచ తుష్టాః, స్యుఃదేవా స్సర్వేసవాసవాః!
గురౌరుష్టేచ రుష్టాః, స్యుదేవా స్సర్వే సవాసవాః!!
శ్లో॥ యత్కించిద్వా సమాధిష్టో, గురుణా తత్సమాచరేతిః!
ఆజ్ఞప్తో గురుణా శిష్యః న తద్వాక్యంతు లంఘయేత్!
శ్లో॥ గురౌ నప్రాప్యతే యత్త, న్నాన్యత్రావరాలభ్య!
గురు ప్రసాదత్యరంతు, ప్రాప్తోమ్యేవ సంశయా!!"

సర్వ ధర్మాలలో అత్యుత్తమమెనది గురువు సేవ. ఈ గురుసేవ వలన సకలాభీష్టము సిద్ధిస్తాయి. గురువు మనపట్ల సంతోషిస్తే దేవత లందరు సంతోషిస్తారు. గురువు కోపగిస్తే దేవతలు కుడా దూరవౌతారు. గురువులమాట జవదాటరాదు. గురువు గారి ఆజ్ఞను పాలించి వారి అనుగ్రహమొక్కటి సంపాదించగల్గితే చాలు, దేవతలందరు అనుగ్రహించినట్లే.

## పురాణాలెందుకు వినాలి?

ఈ సంశయానికి, సందేహానికి సమాధానంగా నూటముప్పది ఆరు శ్లోకాలలో విపులంగా పురాణాల మాహాత్మ్యన్ని వ్యాసముని స్కాంధ పురాణంలో తెలియ జేశాడు. ఆవివరాలు-

1. పురాణాలు సంసార సాగరమగ్నులై కొట్టు మిట్టాడుతున్న సంసారులకు సులువైన మార్గంలో ముక్తిని సంపాదించగల్గేవి పురాణాలు. వేదాధ్యయమును చేయలేని వారికి సులువైన సాధనా మార్గాలు ఉపదేశించింది పురాణం. అజ్ఞానమనే అంధకారంలో అలమటిస్తున్న వారికి జ్ఞాన దీపాలు, భవరోగులకు ఔషధాలివి. ఈ పురాణ విజ్ఞానం ద్వారా సకల సంపదలు లభిస్తాయి. సతతం పురాణ పఠనం చేసేవారు సాక్షాత్తు దేవతాస్వరూపులౌతారు.

2. పురాణాలలోని కథలనెవరు భక్తిశ్రద్ధలతో వింటారో అట్టి వారు కర్మఅనే అరణ్యాన్ని కాల్చివేసి మోక్షాన్ని దైవసాన్నిధ్యాన్ని పొందగలరు. సదా పురాణ శ్రవణం చేయలేని బలహీనుడు పర్వదినాల్లో పుణ్యతిథుల్లోనైనా పురాణ శ్రవణం చేయాలి. సర్వయజ్ఞ ఫలం, సర్వదాన ధర్మాల ఫలం పురాణ శ్రవణం వల్ల కల్గుతుంది. ఈ అష్టాదశ పురాణాలు సకల పాప వినాశకాలు.

3. ఈ కలియుగంలో పురాణ శ్రవణం కంటే పవిత్రమైన ధర్మం మరొకటి లేదు. మానవ జాతి మీద గల కృపా దృష్టితో వ్యాస ముని రచించిన యీ అష్టాదశ పురాణాలచెప్పగలవారు; ప్రవచనం చేయగల వాళ్ళు తప్పని సరి పూజనీయులు. వారిని నీచంగా చూడరాదు. అలా చేస్తే శ్రేయస్సు కల్గదు, గురువులకే గురువు లీ పురాణ ప్రవక్తలు.

4. ఈ పురాణ పాఠకులు- ప్రవక్తలు- పవిత్రులై యుండాలి.

దానము, శాంతి, సహనాలు, దయ, అనసూయ, మొ॥ సుగుణాలు వాళ్ళలో బహుళంగా ఉండాలి. కుతర్కవాదుల కివి వినిపించరాదు. ఉపదేశించరాదు. మంచి మనుష్యులున్నచోట, నదీ తీరం దేవాలయం మొ. పవిత్రప్రదేశాల్లో మాత్రమే పురాణ పఠనం చేయాలి.

5. పురాణ పఠన సమయంలో ఏముంది అని మధ్యలో లేచి, విసుగుకొనిపోరాదు. తల రుమాలను ధరించడం తాంబూల భక్షణ చేయరాదు. పాపహరములైన పురాణ కథలను ఎగతాళి చేసేవారు నీచ జన్మలో పుడ్తారు. ఎంతో వినయంతో పూజ్యభావంతో శ్రవణం చేయాలి. ఈ విధంగా పురాణ శ్రవణ మహిమ స్కాంధ పురాణంలో వర్ణితం.

## రుద్రాక్ష మహిమ:-

శ్లో॥ అభక్తివాపి భక్తోవా నీచోనీచ తరో పివా!
రుద్రాక్షాన్ ధారయేద్యస్తు ముచ్యతే సర్వపాతకై:!!
శ్లో॥ రుద్రాక్షధారణం పుణ్యం, కేనవాసదృశ్యం భవేత్!
యో ధారయతి రుద్రాక్షాన్, రుద్రవత్ సోపి పూజ్యతే

శివభక్తుడైన, కాకపోయినా సరే రుద్రాక్షమాలను ధరిస్తు, సర్వపాప విముక్తిని పొందగలడు. వీటిని ధరించడం వలన గల్గే పుణ్యానికి సాటియైన దేదీ లేదు, రుద్రాక్షలు ధరించినవాడు పరమశివుని వలె పూజిలందు కొంటాడు. రుద్రాక్షలమాలతో ఏమంత్రాన్నైనా జపిస్తే తప్పక సిద్ధి కల్గుతుంది. వీటిని తలపై ధరించి స్నానం చేస్తే గంగా స్నాన ఫలం లభిస్తుంది. ఏకముఖీ పంచముఖీ, ఏకాధశ ముఖీ, చతుర్దశ ముఖీ అను పేర్ల తో రుద్రాక్షలు నానారకాలుగా ఉన్నవి.

రుద్రాక్ష మహిమను తెలియజేసే పరమాద్భుత కథ యొకటి స్కాంద పురాణంలో నీ విధంగా వర్ణింబడి యున్నది.

పూర్వం కాశ్మీర దేశాన్ని భద్రసేనుడను మహారాజు పాలిస్తుండేవాడు. అతని కుమారుడు సుధర్ముడు. ఇతడు చక్కని మేధా సంపన్నుడు మరియు బలపరాక్రమోపేతుడు. మహామంత్రిగారి కుమారుడు తారకు డీతనికి పరమ మిత్రుడు గా నుండే వాడు వీరిద్దరు పరస్పరం మంచి మిత్రులు. చదువు సంధ్యలు ఆటపాటలు మొ॥ కార్యక్రమములను కలిపి పూర్తి చేసేవారు. ఈ యిద్దరికి స్వర్ణాది ఆభరణాలంటే గిట్టేది కాదు. సదా సర్వాంగ సుందరంగా రుద్రాక్షమాలలను మాత్రమే ధరించేవారు. ఎవరెందరెన్ని విధాలుగా చెప్పినా వీరు రుద్రాక్షధారణ మానుకోలేదు. ఇట్లుండగా ఒకనాడు పరాశర మహర్షిగారు ఈ రాజస్థానానికి వచ్చాడు. సాదరంగా రాజ భవనంలో అర్ఘ్యపాద్యాది పాజ పూజలందుకొన్నాడు.

పరస్పరం కుశల ప్రశ్నలైన తర్వాత మహారాజు సుధర్మ తారక యువకులను తమ, మంత్రి యొక్క కుమారులను పరిచయం చేశారు. ఆ యువకుల రుద్రాక్షధారణ అలవాటును గూర్చి చెప్పారు. ఎన్ని విధాలుగా తాము చెప్పినా రుద్రాక్ష ధారణ మానరు యువకులు స్వర్ణములు ధరించాలని చెప్పినా కూడా, రుద్రాక్ష మాలలే తమ కిష్టమని ధరిస్తున్నారని. ఆ మునితో దానికి కారణేమేమైయుండునో తెల్పమన్నారు. అప్పుడు పరాశర మహర్షి దివ్యదృష్టితో వీక్షించి ఆయిద్దరి యువకుల పూర్వ జన్మ వృతాంతమిలా వివరించి చెప్పాడు.

పూర్వం నంది గ్రామంలో ఒక వేశ్య నివసిస్తుండేది. ఆమె పేరు మహానంద, అందాల రాశియైన ఆ వేశ్య తన కుల వృత్తి ద్వారా రాజు, పేద అనక అందరిని మన్మథానందడోలికల ముంచితేల్చేది. వారి వలన గొప్ప

ధనరాశులను ఆర్జించింది. బంగారు పల్లకి బంగారుపట్టె మంచాలు అమూల్యాభరణాలు ఇంటి నిండా దాసదాసీ జనంబుల నిత్యం షడ్రసోతమైన రాజనాల భోజనాలు, నానావిధాలైన అలంకరణ సామాగ్రి, ఇంటిగోడల నిండా తైలవర్ణ చిత్రాలు, చక్కని భవంతి పశు సంపద, ఇట్లు అదియిది యనక సకల సంపదలతో విరాజిల్లు చుండెను.

ఇన్ని వైభోగాల అభవిస్తున్నా మహానంద వేశ్యయైనా ఒక సుగుణముండేది. అదేమన శివపూజ స్వయంగా చేయకుండా పచ్చి మంచినీరైనా ముట్టేది గాదు. నిష్టతో నిత్యం శివపూజ గావించేది. శివ కథలను భక్తి శ్రద్ధలతో వినేది. తన నాట్యశాలలో ఒక కోతిని మరియు ఒక కోడిని పెంచుకొనుచుండెను. వాటికి సరదాగా రుద్రాక్షమాలలు కట్టి ఆడించేది. ఆమెతో కలసి, అవి చక్కగా లయబద్ధంగా నృత్యం చేస్తుండేవి. వీటి నాట్యం చూపరులకాశ్చర్య జనకంగా నుండేది.

ఇలాగుండగా ఒక దినమొక శివయోగి ఆమె యింటికి రుద్రాక్షమాలలు విభూతి ధరించి పరమశివుని వలె ప్రకాశిస్తూ వచ్చాడు. అతన్ని చూచి మహానంద ఆశ్చర్యపడి పోయింది. భక్తి శ్రద్ధలతో శివయోగిని అర్ఘ్య పాద్యాది విధుల పూజించింది. అతని చేతికొక రత్నకంకణ ముండి ధగధగా ప్రకాశిస్తుండెను. ఆ రత్న కంకణం సంపాదించాలని ఆమె ఆ రత్న కంకణం తనకివ్వమని కోరుకొన్నది శివయోగిని. "దీనికి తగిన మూల్యం చెల్లింప గలవా?" అని అడిగాడతడు. అప్పుడామె వ్యభిచారమే మా వృత్తి. అయితే ఈ రత్న కంకణం మాకిస్తే మూడు దినాలు నీకు పవిత్ర మైన భార్యగా నుండి స్వర్గ సుఖాలలో తేలిస్తానంది. దానికి శివయోగి సమ్మతించాడు. తమ మధ్యగల యీ యొప్పందానికి సూర్యచంద్రులే ప్రత్యక్ష సాక్షులని సంతోషంగా రత్న కంకణమామెకిచ్చాడు. దానితో పాటు ఒక

రత్న మయమైన శివలింగాన్ని కూడా యిచ్చాడు. జాగ్రత్తగా దాన్ని దాచమన్నాడు. పొరపాటునైన అది, పోతే తనకు మరణం కల్గుతుందన్నాడు. ఆమె దాన్ని జాగ్రత్తగా దాచింది. ఆ రాత్రి సుఖంగా నిద్రించారిద్దరు. అర్థరాత్రి జామున అకస్మాత్తుగా మంటలు చెలరేగాయి నాట్యశాలలో. వెంటనే ఆమె మేల్కొని, పరిగెత్తి తన కోతిని కోడిని మంటల బారినుండి తప్పించింది. కాని దాచి పెట్టిన శివయోగి. రత్నకంకణం శివలింగం మాత్రం అగ్నిలో బూడిదయ్యాయి. ప్రాణ సమానమైన శివలింగం, రత్న కంకణం లేకుంటే తాను బ్రతుకలేనని అగ్నిలో దూకి ప్రాయోపవేశం చేయడానికి, చితినేర్పాటు చేయమన్నాడు భర్త శివయోగి ఆయనతో కూడా తాను చితిలో అగ్ని ప్రవేశం చేయబోయింది. అప్పుడామె పవిత్రమైన భక్తికి నిజాయితికీ మెచ్చి శివుడు ప్రత్యక్షమయ్యాడు . శివుడు సూర్యచంద్రులవలె ప్రకాశిస్తున్నాడు. ఆగుమని మహానందను అడ్డుకొన్నాడు. "మహానంద! నీభక్తిని సత్యనిష్ఠను పరీక్షచేయడానికి నేనే శివయోగిగా వచ్చాను. నాట్యశాలలో మంటలు నేను పుట్టించినవే! నా పరీక్షలోనెగ్గావు. నీ కోరికలు తీర్చగలను" అన్నాడు. పరమశివుడామెతో; అప్పుడా వేశ్య "శంకరా! నాకు నీ సాయుజ్యం తప్ప మరే ఇతర భౌతిక భోగ భాగ్యా లవసరం లేదు. నాతో పాటు నాసేవకులు దాసదాసీ జనము, బంధుమిత్రులను కూడా నీలోనికి తీసికొని, నీసాయుజ్యము దయ సేయుమన్నది. ఆమె కోరిక తీర్చబడి వారందరు శివునితో పాటు కైలాసమునకు వెళ్ళారు.

"మహారాజా! అగ్ని ప్రమాదం నుండి తప్పించుకొని, దూరంగా వెళ్ళి పోయినట్టి కోతి, నీ కుమారుడైనది తప్పించుకొని మరియు ఆమె పెంచిన కోడియే నీ మంత్రి కుమారుడైన తారకుడుగను జన్మించారు. పూర్వజన్మ సంస్కార బలము వలన ఈ యిద్దరు రుద్రాక్ష మాలలను ప్రీతితో

ధరించడానికి అలవాటు పడ్డారు. వీరు సంపూర్ణ శివానుగ్రహ పాత్రులయ్యారు. ఇది వీరి పూర్వజన్మ వృత్తాంతం. ఈ కారణంగా ఈ రుద్రాక్ష ధారణ ఫలం సాటిలేనిదని నిరూపణమగుచున్నదిగదా! అని పరాశర మహర్షి భద్రసేన మహారాజుకు వివరించాడు. భక్తి తత్త్వాన్ని తెలియజేసే కథలెన్నో స్కాంద పురాణంలో గలవు.

# శివ మాహాత్మ్యము

నైమిశారణ్యము నందు దీర్ఘ సత్రయాగము జరుపుచున్న శౌనకాది మునులు వ్యాస శిష్యుడైన సూత ముని యచ్చోటునకు జేరగా వారాతనిని గౌరవించి "మహామునీ! నీవు నీ గురువుగారగు వ్యాస మహా మునీంద్రుని వద్ద సమస్త పురాణములు, వాటిలో నున్న రహస్యములు చక్కగా గ్రహించి యున్నావు. నీకన్న పురాణ రహస్యము లెరిగిన వారెవండరు, లేరు. మాకు ఈ సత్ర యాగమందు వాటిని వినిపింప గోరెదము మాయందు ప్రేమతో మీరా విషయములు సవిస్తరముగా వివరింప గోరెద" మని ప్రార్థింపగా నాతడంగీకరించెను. ముందుగా శివుని విషయము శివ మాహాత్మ్యము చెప్పితృప్తి గల్గించుమని మునులు కోరగా నాతడు చెప్పనారంభించెను.

"మునీంద్రులారా! శివుని గురించి యెంత చెప్పిననూ తనివి తీరదు. శివనామములోని మహిమ వర్ణనా తీతము, శివ శబ్దము సర్వ మంగళములకు ప్రధానమైన స్థానము. శివుడు భక్తులకు కల్ప వృక్షము వంటి వాడు. మంగళదాయకులైన పార్వతీ పరమేశ్వరులను దలంచినచో, మృత్యుభయము లేదు. శివునారాధించిన వారికి యమభటుల దండనము లుండవు. శివారాధనా పరులకు దరిద్రము దరికి రాబోదు. శివభక్తులు రావణుడు, బాణాసురుడు మొదలగు వారందరు మితిమీరిన సంపదలతో

కుబేరుని తలదన్ని లోక రాజ్యములు పరిపాలించి యెదురులేని విధముగా సంచరించ గల సామర్థ్యతో పేరొంద గల్గినారు.

శివునారాధించిన మార్కండేయ మహా మునీంద్రుడు పదునారేండ్ల వయస్సులో యమ భటులను దరి చేరనీయకున్న సమయములో యముడు స్వయముగా వచ్చినాడు. ఆ శివ భక్తునిపై పాశం వైచినాడు. అతడు శివలింగము నాశ్రయించి వదలకున్న సమయములో లింగ సహితముగా పాశం బాలునిపై వేయగా ఆ లింగమందుండి యావిర్భవించి యముని శిక్షించి బాలుని రక్షంచిన దయాశాలి శివుడు. శివారాధనము యిహపరసాధనము. శివుడే భోక్త, ప్రదాతయని శివ మహిమను వర్ణించుచుండ విని మునులు తమలోని సందేహమొక దానినిట్లు వెల్లడించిరి .

## దక్షుడు- శివుడు

"మహాత్మా! శివుడు దయామూర్తి, భక్త రక్షణ పరుడు, మోక్ష ప్రదాతయని సెలవిచ్చినారు. అట్టి శివుని యాతని మామ గారగు దక్షుడేల నిందించెను? అతనితో విరోధ మెందులకందెను? అంతటి దయా మూర్తిని నిందించిన దక్షుడు పాపఫలమనుభవించలేదా; నీవు మాకా విషయములు సవిస్తరముగా శ్రవణానందముగా విన్పింపగోరెద" మని ప్రార్థించిరి. అంత నాసూత మహాముని "మీసందియము తీర్చెదనని యిట్లు" చెప్పదొడగెను. "మునీంద్రులారా! పూర్వము నైమిశారణ్యము నందు మహామునులు యజ్ఞమును గావింపసాగిరి. ఆ యజ్ఞమునకు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను గూడ పిలిచిరి. వారు వచ్చి తగు పీఠములందు కూర్చుండిరి. పూర్వము బ్రహ్మదేవుని యాజ్ఞానుసారము దక్షుడు తన కూతురగు సతీ దేవిని శివునకిచ్చి వివాహమొనర్చెను.

అందుచే శివుడు దక్షున కల్లుడైయుండెను. ఈ యాగమునకు మహామునులు దక్షుని పిలిచి యున్నారు. ప్రజాపతులలో నొకడైన దక్షుడు మహామునుల యాగమునకు బయలు దేరి వచ్చెను. వచ్చిన దక్షుని చూచి యచటి వారందరునూ లేచి గౌరవించిరి. శివుడు మాత్ర మాతని రాకకు గౌరవ మీయలేదు. లేచి నిలబడలేదు. ఇది చూచి యాదక్షుడు మండి పడ్డాడు. సభలోని వారందరను చూచుచు"ఓ సభాసదులారా! నారాకను మీరందరు గమనించి యెదురు వచ్చి నాప్రజాపతిత్వ గౌరవమును నిలబెట్టినారు కదా! ఈతడు నాకల్లుడై యుండి మామగారినని గాని, ప్రజాపతినని గాని మర్యాద పాటించక మూర్ఖత్వముతో తన స్థానము నుండి లేవక యెట్లు దిక్కరించి యున్నాడో చూడుడు. వీని పొగరు అణిచి వేయుదును. ఈ శివునకు నేటి నుండి యజ్ఞములందు హవిర్భాగము లేకుండా పోవుగాక! నపరిశుద్ధుడగుగాక! యని కోపముతో నల్లుడను మాట లేకుండా తీవ్రమతియై శపించెను. సభికులు శివనిందకు శివశాపమునకు భయపడిరి. తమకు ముందే కీడు మూడునో శివుడేమి చేయునో యని భయమందిరి శివుడు మాత్రము మాట్లాడకుండ యట్టే యుండెను.

కాని, ఈ శాపమును శివభక్తి పరుడగు నందీశ్వరుడు విన్నాడు. "ఔరాదక్షుడు తన ప్రభువగు శివుని నిందించి శపించెనా? వీని గర్వము తీయవలయును ఈ సభలో నుండు బ్రాహ్మణులు శివనిందా వాక్యములు సహించి యూరకుందురా? ఈ దక్షునకు, నీ బ్రాహ్మణులకు తగిన పరాభవము చేయక మానుదునా? వీడేనా యంత శాపమొసగు శక్తిమంతుడు? నేను నిరంతరం శివారాధనా కార్యమందు నిమగ్నుడనైన

వాడను గానా? నేను శివ దేవునారాధించు ముఖ్య భక్తుడనగుదునేని నే నీయబోవు శాపము ఫలించకపోవ" దని తలచి "ఓరీ దక్షా! యే మహా మహుని నామ స్మరణముతో సమస్త పాపములు నశించునో, యే ప్రభువు నాశ్రయించినచో, యిహపరాదులు చక్కగా లభ్యమై, సుఖము పొందగలరో, యెవనికి ప్రీతి గావింప దానములు, ధర్మములు, జపములు, తపములు, పూజలు గావించి భక్తులారాధింతురో, సర్వ లోకములకు సృష్టికి కారణమై, స్థితి శక్తియై, లయమునందు తానొక్కడై యుండునో యట్టి మహాదేవున కపరాధము గావించినావు. నీ దుర్బుద్ధి నిన్ను కుట్టి కుడుపక మానదు. నీ వజ్ఞానములో నున్నావు నీ బుద్ధిచాపల్యము నిన్ను శిక్షించ గలదన్న" మాటలు విని దక్షుడు కోపించి నందీశ్వరుని చూచి రౌద్రమూర్తియై "ఓ పాపాత్మా! నందికేశా! నీవు పిన్న పెద్ద తారతమ్యము పాటించక ఈ సభలో నన్ను మాట్లాడిన మాటలకు ఫలితమనుభవించెదవు. నీ గురువు శివుని వలె నీకు యజ్ఞ భాగము లేకుండా యుందువు గాక! నీవు పాషండ సంప్రదాయముతో నిలచెదవు" గాక యనెను.

అది విని నందికేశుడు మరింత కోపము చెంది "దక్షా! నీవు మూర్ఖత్వముతో శివ నిందాలాపము లాడినావు. నేను నిర్దోషిని. నేను శివుని సేవయందుండు వాడను ఏ విధముగు మద మాత్సర్యములు లేని హృదయముగలవాడను. నీకు ఈ సభికులకు శాపమొసంగుచున్నాను. వినుము! మీరు వేద వాదములు చేయుచుందురుగాక? మోక్షా సక్తి వదలి స్వర్గ సుఖ సంబంధమగు యజ్ఞములను చేయుదురు, గాక! బ్రాహ్మణులు పురోహితులై పొట్టపోషించుకొంటారు గాక! నిత్య దరిద్రులై ఉందురుగాక" యని శపించెను.

# దక్షయజ్ఞము

ఇట్లు ఒకరినొకరు శపించుకొనుట విని గొడవ ముదరనీయు రాదని తలచి శివుడు "ఈ బ్రాహ్మణుల నందర నేల వృధాగా శపించితివి? వేదములు మంత్రములు, సూక్తములతో నిండి యున్నవి. అవి యన్నియు నన్ను గా నెరిగి యాత్మజ్ఞానము నందియుండు వారు నిందకు పాత్రులు గారు. మనస్సు నిర్మలత్వము గలవారు తత్త్వవేత్తలగుదురు సుమా!" యని నందీశ్వరునకు బ్రహ్మజ్ఞాన విషయము చెప్పి, శాంతింప జేసెను. శివుని బోధామృతము విని శివ సాయుజ్య మంద గోరి, నంది కోపము తగ్గించుకొనెను. దక్షుడు మాత్రమే కోపముతోనె తన నివాసమునకు మరలెను. కొంత కాలము తరువాత దక్ష ప్రజాపతి యజ్ఞ మొకదానిని చేయు దలపట్టెను. ఆ యజ్ఞమునకు దక్షుడు సమస్త దేవ గణమును, ఇంద్రాదులను, మహామునులను ప్రేమతో నాహ్వానించెను. ఆ వర్తమానమందిన వెంటనే అత్రి, కశ్యపుడు, భృగువు వశిష్ఠ వామ దేవులు, భరద్వాజుడు, దధీచి, మొదలగువారు బయలు దేరిరి, వారే కాక ఇంద్ర, యమ, వరుణ వాయువు, కుబేరాది దిక్పాలురు యక్ష గంధర్వ కిన్నర కింపురుషాదులు వడి వడిగా రాజొచ్చిరి. బ్రహ్మయు, నాహ్వానింపబడగా పరివారంతో విచ్చేసిరి, ఇట్లు సమస్త దేవ గణముల, దిక్పాలురు దక్ష యజ్ఞ దర్శనార్థము వచ్చిరి. అచట ధర్మ దేవతచే నిర్మింపబడిన రత్న స్థాపిత దివ్యభవనములందు విడుదులు చూపగా ప్రవేశించి యందుండిరి. దక్షుడు సమస్త దేవ ఋషి గణాదులతో బంధు మిత్రులతో కూడిన వాడై యజ్ఞ ప్రదేశమునకు బయలు దేరి వచ్చెను. నార చీరలతో ముని వేషము ధరించి, భార్య వెంట రాగా తగు స్థానమున గూర్చుండెను. ఋత్విక్కులు, బ్రహ్మయితర వేద విదులు మునులు, దేవతా సమూహము శ్రద్ధతో యజ్ఞమును చూడ వాంఛించి వారి వారి కేర్పరచిన స్థలములలో తగు యాసనములందు గూర్చుండిరి.

ఆ సమయములో దధీచి మహాముని సభాప్రదేశమును కలయు చూచి "ఓ దక్ష ప్రజాపతీ! నీ యజ్ఞమునకు సమస్త మహామునులను గౌరవముగా పిలిచియున్నావు. వారందరును వచ్చినారు. సంతోషము. మరి నీకుమార్తె సతీదేవి, నీ యల్లుడు శివుడూ ఈ సభలో గన్పించుట లేదు? నీవు పిలువ లేదా, లేక, వారే రాలేదా? అదే అయినచో యెందులకు రాలేదు? వారు లేకున్న యజ్ఞ ఫలమెట్లు పొంద గలవు? శివుడనగా నీ వేమని భావించుచున్నావో. శివుని గూర్చి నీకు తెలియదు గాని. లోకమంతయు శివమయమే శివుడు జ్ఞాన మూర్తి! అతడే యజ్ఞ భోక్త, యజ్ఞ స్వరూపుడు, సర్వలోక ము లందుండు జీవుల హృదయములందు ప్రకాశించు జ్యోతిర్మూర్తి. శివుని తప్పించి యే పదార్థమూ లేదు నీ యల్లుడే గదా! యనుకొను చున్నావేమో? తక్కువ విధముగా భావించకుము. నీవా శివునికి యజ్ఞభాగము నీయకున్నచో నీ క్రతు ఫలమునకు నీ కర్తృత యుండ బోదు సుమా యని గట్టిగావాదించి చెప్పెను. అది విని దక్షుడు చీదరించుకొన్నాడు. "దధీచీ! నీ వేమెా శివుని గురించి వర్ణించుచున్నావు. శివుడొక్కడే యధిష్ఠాతయా? ప్రపంచమందున్న వీరంద రసమర్థులై పోయినారా? అతడేనా సమర్థుడు? ఇందరు వచ్చినప్పు డాతడొక్కడు రాకున్నచో యేమీ లోపములేదు. నేనాతనికి కబురు చేయను గాక చేయు" ననెను.

ఇట్లాతడు భీష్మించి యాగము చేయ దొడగెను. యజ్ఞమును చూచుటకా దేవతలు, ఇతర దేవగణములు విమానముల మీద జంటలు జంటలుగా రాజొచ్చిరి. అప్పటికింకా ఆయా విషయము సతీ దేవి కే మాత్రమును తెలియదు.

శివుడు సమస్తము నెరిగి మానావమానములతో సంబంధము లేని వాడై మిన్నకుండెను. సతీదేవి తన భవనము పై భాగము వైపు యెదురు

పాటున తిలకించగా విమానములు పక్షుల గుంపుల వలే పోవుట చూచి "మీరందరెక్కడి కిట్లు పోవుచున్నా"రని ప్రశ్నించెను. వారందరు నవ్వుచు "ఈ సతీదేవి పిచ్చితల్లి. తన తండ్రి యజ్ఞము చేయుచున్నట్లు యెరుగదు గదా! ఆ తండ్రి ఈ మెనను యజ్ఞమునకు పిలువనే లేదట యని నవ్వుచుపోయిరి. సతీదేవి భర్తను జేరి ప్రేమతో లాలనముగా "మా తండ్రి యజ్ఞము చేయుచున్నాడట మనమా యజ్ఞమునకు పోవుదము రండనెను. అది విని శంకరుడు నీ తండ్రి యజ్ఞము చేయుచు కూతురవగు నిన్ను పిలువ లేదు గదా! పిలువని చోటునకు వెళ్ళుట మానవంతులకు తగదు" అనెను. అది విని, సతీదేవి నావారందరు వత్తురు, వారిని చూడవచ్చును . పెళ్ళిళ్ళవంటి పెండ్లిండ్లాది శుభకార్యములకు, యజ్ఞములకు స్నేహితుల యిండ్లకు పిలువకున్ననూ పోవచ్చునన్నధర్మము మీకు తెలియనిది కాదు. కావున, నేను పోయి వచ్చెదను. శలవిమ్మని ప్రార్థించెను."సతీదేవి! నీ వమాయకముగా నున్నావు నీకగౌరవము వచ్చును. నీవు దానిని సహించినచో నిన్ను పంపెదను.నేను మాత్రం రానని" చెప్పి, భార్య కోర్కె తీర్చుటకు సమ్మతించి, యామెను నంది వాహనముపై గూర్చుండ నియోగించి ప్రమథ గణ పరివారమును యామెతో సాయముగా పంపెను. ఆమె పరమోత్సాహముతో బయలు దేరి తండ్రి యజ్ఞవాటికను ప్రవేశించి నలు దిక్కులానందముతో తిరగ సాగెను. దక్షుడు మాట్లాడలేదు. తల్లి గాని, సోదరి గాని, సోదరి గణము గాని పెదవి విప్పి పలుకరించలేదు. ఇతర బంధుజాలము చూచియు చూడనట్లే యుండిపోయినది. తన్ను తండ్రి యంతటి సభామధ్యములో పరాభవమొందించుట కాగ్రహమందిన సతీదేవి ఆ యజ్ఞకుండము వద్దనే యోగమును పూని శరీరము నుండి యోగాగ్నిని లేవదీసినది. శరీరమంతయు మహాజ్వాలామయమైనది. చిట పట లాడుచు యోగాగ్ని జ్వాలలామె శరీరమును భస్మము గావించినవి. ఆ ప్రదేశమంతయు

హాహాకారములు బయలు దేరినవి. యజ్ఞసమయమందు మరణము వల్ల ఆ స్థలమంతయు నశౌచముతో నిండి యపవిత్రమై పోయినది. దురాత్ముడగు దక్షునిచే పరాభవమంది, ప్రాణములు విడచిన సతీదేవిని గురించి అచట బుద్ధిగలవారందరును చాల విచారించి కన్నీళ్ళు కాల్వలు గట్టిపోవునట్లు శోకించిరి. నారదుడు వెంటనే యీ వార్తను శివునకు వినిపించెను. అది విని శంకరుడు మండి పడి పండ్లు పట పట కొరికి, కండ్ల నుండి నిప్పుల వర్షము గురిపించెను. తన జటా జూటము నుండి యొక జడను పెరికి నేలకు పైచి కొట్టగా అందుండి మహాభయంకర రూపముతో వేయి చేతులు, వానినిండా సమస్తాయుధములూ ధరించి భూమ్యాకాశము లదర గర్జించుచు భద్రకాళీ సమేతంగా వీరభద్రుడు ఆవిర్భవించి శివునకు నమస్కరించి "తండ్రీ! నీవు నన్ను ఎందులకు పుట్టించితివో! యాజ్ఞాపించుము. ఆ పని నిప్పుడే నేరవేర్తు" ననగ విని శివుడు "వీరభద్రా! నా సమస్త పరివారం పైన నీకు సైన్యాధిపత్య మొసంగతిని. నీవు తక్షణమే దక్షుడి యజ్ఞం ధ్వంసం చేయుమని ఆజ్ఞాపించాడు. వీర భద్రుడు మహోద్రేకముతో బయలు దేరి వెళ్ళాడు. దక్షయజ్ఞాన్ని నానావిధాలా ధ్వంసం చేశాడు. అక్కడ యెదరు తిరిగిన వాళ్ళందర్నీ అభాసుపాలు చేశాడు

# దక్షుడు -పునర్జీవితము

వీరభద్రుడందరి కన్ని విధముల పరాభములు గావించి దక్షునితల తెగనరకెను. తన కుమారుని మరణమునకు బ్రహ్మ చాలావిచారించి హంసవాహనమెక్కి తిన్నగా శివనివాసమునకు పోయి "ఓ సర్వేశ్వరా! నీ వెరుగనిది లేదు. నీవు సర్వవ్యాపకుడవు. సమస్తము నీ చేతిలో నున్నదని

యెరుగుదును. నీవు దయదలచి నాకుమారుడగు దక్షుని పునర్జీవితునిగా చేయ ప్రార్థించుచున్నా "నని ప్రార్థించెను. బ్రహ్మప్రార్థనను దయతో నాలకించి దయామయుడగు శంకరుడు వృషభ వాహన మెక్కి బ్రహ్మాది దేవతలతో గూడి యా యజ్ఞ వాటికను సమీపించెను."దక్షుడు చనిపోవుటకు నేను కారణముగాదు. ఎవరికి కర్మ పరిపాకము చెందునో వారికా విధముగనె చావు తెచ్చి పెట్టు"నని బ్రాహ్మకు చెప్పి, "వీరభద్రుని పిలిచి వీరభద్రా! ఈ దక్షుని శిరస్సు గొనిరమ్ము వానిని బ్రతికించెద"ననెను.

అంతట వీరభద్రడు "వాని శిరస్సును నేనగ్నికుండవములో వ్రేల్చివేసితి" ననగా శివుడు పాపం"బ్రహ్మదేవుడు చాలా బాధపడుచున్నాడు, ఏ శిరస్సైననూ తీసిగొనిరమ్ము. దానినే యతికించి దక్షుని బ్రతికించెద ననెను. అప్పుడు గొఱ్ఱె తలను తెచ్చి వీరభద్రుడు దక్షుని మొండెమున కతికించి, యాతని బ్రతికించెను. పునర్జీవితుడైన దక్షుడు శివునితో"స్వామీ! నీ మహిమలు, యెవరికి తెలియును? నీ శ్రేష్టత్వమును నేను ఇప్పుడే గ్రహించితిని. నాతప్పు క్షమించుమని" ప్రార్థించెను. అదివిని శంకరుడు దయాహృదయుడై క్షమించి దక్షుని దీవించి గర్వము పడకుండా జీవితమును నడుపుకొనవ" మని బోధించెను. శివుని ధ్యానించుచు యోగాగ్నిచే భస్మమైన సతీదేవి పార్వతియను పేరుతో హిమగిరికి పుత్రికయై జన్మించెను. ఆమె శివారాధనా తత్పరు రాలుగా నుండెను. కాలాంతరాన పునః శివుడామెను చేబట్టి తన వామపార్శ్వ భాగము నామెకు నిత్యనివాసముగా నిచ్చెను. బ్రహ్మదేవుడు దక్షునకువలయుబోధల నన్నిటనీ చేసి జ్ఞానమును మేల్కొల్పి "సుఖముగా నుండుమని దీవించి" మహామునులతో, దేవగణములతో సత్యలోకమునకు పోయెను. దక్షుడు ప్రాసాదపంచాక్షరీ మంత్రమును పారాయణసేయుచు శివభక్తి తత్పరత్వముతో మెలగుచుండెను.

# పంచాక్షరీ మంత్రము- శివాలయము

"ప్రాసాదపంచాక్షరీ మంత్రము విషయమువమాకు సవిస్తరముగా చెప్పుమని మునులుకోరగా సూతుడిట్లారంభించెను. "గౌతమీతీరమున వింధ్యారామను పురముగలదు. ఆ పురమునందు అర్థనారాయణుడను బ్రాహ్మణుడొడుండెను. అతడు శివభక్తిపరాయణుడు. ప్రాసాదపంచాక్షరీజప మాచరించుచు పరమనిష్టతో సంచరించసాగెను. అతడు నిరుపేదయూగాక, ధనవంతుడునూగాకుండా సంసారమును చక్క దిద్దుకొను చుండెను. కొందరాయనను పరామర్శింపదలచి యెన్నో యత్నములు గావించి, తపస్సంపన్నుడైన యూతని చెంతకు పోవలేక పరాభవమంది యుండిరి. అతడు ప్రణవబీజము, మాయూబీజము, కామబీజము శక్తిబీజము సంపుటీకరణముగు ప్రసాదపంచాక్షరి మంత్రపారాయణ సిద్ధి పొంది యుండెను.

ఆ మహామంత్ర పారాయణతో నాతడు శివసన్నిభుడై సిద్ధి బడసెను. అతడు తండ్రి ప్రతిభను మించిన వాడై ఆ మహేశునర్చించి వంశఖ్యాతి నిలబెట్టెను. అందుచే మహామంత్ర రాజమగు ప్రసాదపంచాక్షరీ మంత్రమునకా బీజములు సంపుటి గావించి వారికి సమస్త కామ్యములు శివుడు సమకూర్చును. ప్రతిదిన మారాధనము గావించలేక పోయినవారు కార్తీక, మార్గశిర, ధనుర్మాసాదులందు, సంక్రమణ పుణ్యకాలములందునా దానిని జపించినచో వారి కనంత శుభ ఫలములు ప్రాప్తించును. పరమ కల్యాణము సమకూర్చు మహానిర్ణేత శివుడు. శివారాధనము భుక్తి ముక్తి ఫలప్రద" మని చెప్పగా విని యూమునులు సూతుని చూచి "మాకు సవిస్తరముగా నీవు శివతత్త్వమును తదారాధనమును. శివాలయమహిమను చెప్పు" మనిరి. సూతడిట్లారంభించెను. "మునులారా! యెవరు నిత్యము శివాలయమును శుభ్రపరచెదరో, యెవరైతే నానాసుగంధద్రవ్యముతో

శివునకభిషేకము చేయుదురో,యెవరు సుగంధపుష్పములతో శివునారాధింతురో, యెవరైతే సతతము బిల్వదళములతో పూజించెదరో, ధూపదీపనైవేద్యములు శ్రద్ధాభక్తులతో విడువక సేయుదురో వారే ఈ లోకమునందు సమస్త సుఖభోగము లనుభవించుటయేగాక, అంత్యమున శివసాయుజ్యమంది తీరెదరు. శివాలయము నలంకరించువారు, శివకథల నాలయములలో విన్పించువారు. శివారాధనకై భూవములిచ్చి నిత్య పూజావిధానమును జరిపించువారు, శివానుగ్రహ పాత్రులగుదురు. ప్రతిదిన మొకసారిగాని, రెండుమార్లుగాని శివదర్శనము గావించుకొనువారు. కీర్తివంతులగుదురు.ఎంతటి పేదవాడైనను నిత్యము శివారాధనము కావించువాడు సర్వసంపత్తులు గల్గి దరిద్రమునుండి విముక్తి పొందును. ఈ విషయము తేటతెల్లమగునట్లు పురాణేతిహాస మొకటియున్నది. దానిని మీకు విన్పించెదను. మీరు శ్రద్ధాసక్తులతో విన్నచో మీకు జ్ఞానాభివృద్ధి తత్త్వజ్ఞానము, శివతేజోదర్శనము సులభముగా గల్గును. దానిని వినినచో సమస్త సంశయములు విడిపోవును.

# ఇంద్రసేనుడు

పూర్వకాలమందు ప్రతిష్ఠాన పురమున "ఇంద్రసేనుడు" అను మహారాజు మూర్ఖత్వములో సంచరించుచుండెడివాడు. అతనికి వేటయందాసక్తి మెండు.క్రూర బుద్ధితో దురాచారములు నడుపుచు దుర్మార్గుడను నిందపొందియుండెను. పరధనములకు, పరకాంతలకు వ్యామోహము చెందుచు, వాంఛించుచు తిరుగుచుండెడివాడు. దుష్కార్యములు పెక్కు లాచ, లాచరించుచు ననేక మందిని బాధించుచుండెను. అతడిట్లు దుర్మార్గజీవితము నడుపుచు చాలాకాలము రాజ్యము పాలించి చివరకు మరణము చెందెను. యమదూతలా రాజు జీవిని బంధించి యమ ధర్మరాజువద్దకు గొనిపోయిరి.

అచ్చట ఆ రాచజీవి యమునిచూచి గడగడలాడసాగెను. యముడాతనిని చూచి శాంతముతో నిట్లనెను. "రాజా! నీవు చిరకాలము పుణ్యము సంపాదించిన స్థలమునకే పొమ్ము. నీకా పుణ్యస్థలము లభించగలదనెను. అదివిని యా రాజు తెల్లబోయి "స్వామీ! నేను చేసిన పుణ్యము లేవియునూ లేవు. నేనొక్క పుణ్యము గూడ చేయలేదు. అన్నియు పాపములే యొనర్చితిని. నాకు పుణ్యమే లేదు గదా!" యనవిని యముడు నీవు పాపకార్యము లాచరించినమాట సత్యమే! కాని. నీ వేపనిని చేసినను శివుని నామముచ్చరించుచు చేసియున్నావు. నీ వాహారాదులు తీసికొనప్పుడు కూడా శివస్మరణము వదలలేదు. అందుచే నీవు శివస్థానమునకు వెళ్ళి అచ్చటనే యుండగల వనెను. అది యా జీవి 'యెంతకాలము వరకట్లుండగల నన గా సూర్యచంద్రాదులున్నంత కాలముండగలవు. నీ వందు యే విధమగు బాధలు లేకుండా పరమనస్కుడవై సంచరించగలవు' అని యిట్లు యమధర్మ రాజు చెప్పుచున్నదాతడు వినుచుండులోననే శివదూతలు యమసదనమునకువచ్చి "ఓయమరాజా! ఇక్కడ ఇంద్రసేనుడున్నాడా?" యని యడిగిరి. అదివిని యముడు వారిని చూచి 'మీరెవరు? మీకా యింద్ర సేనునితో సంబంధమేమి'"యనెను. వారు విని మేము శివదూతలము. శివునాజ్ఞానుసార మీతనిని గొనిపోవుటకు వచ్చినాము. ఇంద్రసేనుడు మరణించుట విని యాతని రాజధానికి వెళ్ళి మేము వెంటగొనిపోవనెంచితిమి. కాని, ఈ లోపలనే మీదూతలాతని నిటకు గొనివచ్చిరని వీని గొనిపోవలయునని" అని వారనగా విని యమాయముడు యీ జీవినెట్లు గొనిపోయెదరని ప్రశ్నించెను. మేమువిమానమును గొనివచ్చినాము. ఆ రాజును విమానముపై నెక్కించుకొని పోయెదము. ఇది సదాశివుని యాజ్ఞయని" వారన్నారు.

ఇంద్రసేనుని జీవిని శివకింకరులు విమానముపై నెక్కించుకొని కైలాసమునకు గొనిపోయిరి. అతడు కైలాసమున విమానమును దిగి శివదర్శన మాచరించెను. కౌగిలించుకొని, ప్రేమతో దీవించెను. తరువాత తన ప్రక్కను కూర్చుండ బెట్టుకొని సంతోషముగా చూడసాగెను. ఇంద్రసేనుడా శివదర్శనముతో శరీరము పులకింపగా చూడసాగెను. ఇంద్రసేనుడా శివదర్శనముతో శరీరము పులకించగా యన్నో విధముల స్తవములు గావించెను. శివకరస్పర్శచే యాతనికి మహావిజ్ఞానము గల్గినది. ఈశ్వరుడు దయామయుడై యాతనికి శివచండుడను నామధేయ ముంచి తన పరివారములో నొకనిగా జేసెను.

శివారాధనము, శివనామోచ్చారణము శివగ్రంధపారాయణము, శివ నిలయం నివాసము, నిరంతరం పూజావిధానములు ఎంతటి పాపములనైనను తుడిచి పెట్టి దివ్యలోక నివాసము గల్పించును. శివుని నామము సర్వమంగళ ప్రదము. శివా! యన్నంత మాత్రమున యమభటు లాతని చేరలేరు. శివుని మహామహిమలు వర్ణింప శక్యముగాదు.

ఇంకను శివుని మహామహిమ నుదహరింతును, "వినుడని యిట్లు చెప్పదొడగెను. పూర్వమవంతీ పట్టణము నందొక వైశ్యుడుండెడివాడు. అతడు సమీపమందున్న దేవాలయమునకు జేరి యుటనున్న సరోవరములలో మునిగి శివలింగమును పూజించు చుండెను. మారేడుదళములతో, పువ్వులతో, రత్నములతో శివారాధన గావించుచు చాలకాలమట్లే శివపూజ చేయుచుండెను. అట్లుండగా కొంతకాలము తరువాత నొకబోయవాడు ఆ శివాలయమును చేరి శివుని లింగముపై నున్న పూవులు, పత్రి, రత్నములు తప్పించి తాను వేటాడి తెచ్చిన పచ్చిమాంసమును నచటపెట్టెను. అటుపిదప కొలనులోని జలమును శివలింగముపై నభిషేకించి, పచ్చిమాంసము నివేదన

చేసిపోయెను. మరునాడు యథాప్రకారముగా వచ్చిన వర్తకుడు క్రితమురోజు తాను చేసిన పూజ భగ్నము గావింపబడి యుండుటకు విచారించి ఎవడో మూఢుడు నా స్వామికి వచ్చి మాంసము తెచ్చిపడవేసెను. దేవాలయము మైలపడె నని విచారించెను.

ఇట్లు విచారించి యొక ధర్మశాస్త్ర మెరిగిన బ్రాహ్మణునిచేరి ఈ విషయము నివేదించెను. ఆయన యొకటి రెండు మార్లు చూడమని చెప్పగా నాతడు నిదానించి యొకటి రెండు రోజులపాటు చూచెను. కిరాతుడు తన పచ్చి మాంస పూజ మానలేదు. వెంటనే వర్తకుడు ధర్మవేత్తయగు బ్రాహ్మణునితో సంప్రదించగా నాత డాశివలింగము గొనిపోయి నీయింట నుంచుకొని పూజించుమనెను. వర్తకు డట్లే గావించెను. తదువరి నీకిరాతుడు వచ్చియథాస్థానములో శివలింగమునుచూడలేక పోయెను. అందులకెంతయో విచారించి "శివునారాధించజాలని నాబ్రతుకెందుల"కని విసుగుచెంది కత్తితో తన తలను నరకుకొనెను. శివ కటాక్షముతో శిరస్సు తెగినను, మరల వచ్చెను, అతడు చేయునది లేక అదే పనిగా శివుని ప్రార్థించుచూ యుండిపోగా, శివుడు వాని మూఢ భక్తికి సంతసించి ప్రత్యక్షమై యాదేవళము వద్ద ద్వార పాలకునిగా నుండగా నియమించి ప్రమథగణములు మహావాద్యములు మ్రోగించిరి. ఆ ధ్వని విని వర్తకుడు పరుగు పరుగున వచ్చి కిరాతుని చూచి సర్వము తెలిసికొని సంతసించి అతనికి నమస్కరించి "నీవు ధన్యుడవు నన్ను కూడా పవిత్రుని చేయు" మని వేడగా, కిరాతుని కోరికపై శివుడు దయతలచి యెదురు నిల్చి నీవు కూడా యీతనితో బాటే ద్వార రక్షకుడవై యుండుమని యాజ్ఞాపించి వారినను గ్రహించెను. అతనంతరము ఋషులు లింగ శోధ గాథ నుడువు డనగా సూతుడిట్లు చెప్పడొడగెను.

# లింగశోధ- బ్రహ్మ విష్ణువు

మున్నొకప్పుడు ఋషుల శాపముతో శివలింగము తెగిపడి మూడులోకములు ఆక్రమించుకొని యుండెను. దేవతలు దిక్పాలరు సమస్త దేవలోక వాసులు ఆలింగమును చూచి విభ్రాంతి పొందిరి. ఆ విషయమును బ్రహ్మ విష్ణువులకు ఎరుక పరచగా వారిద్దరును ఆలింగమును చూచిరి. తుది మొదలు ఎక్కడ వరకున్నవో తెలియరాని ఆలింగమును గూర్చి యోచించి ఒకరొపైకిని రెండవ వారు క్రిందకును కనిపెట్టవలెనని తలచి ఎవరు ముందు చూచి వత్తురో వారు పందెము నెగ్గినట్లని ఒక మర్యాద చేసికొనిరి. బ్రహ్మయూర్ధ్వముగను, విష్ణువు కింది భాగమునకు ప్రయాణము అయి పోయిరి. బ్రహ్మచాలాదూరము పోయి విసిగి పై నుండి పడి వచ్చుచున్న ఒక మొగలి పువ్వును చూచి"ఎచ్చట నుండి వచ్చుచున్నవు? ఈ లింగమున కగ్రము ఎంత దూరములో నున్నదో " అని ప్రశ్నించెను.

మొగలి పువ్వు ఆ పైనుండియే వచ్చుచున్నాను. అటచేరుటకు కొన్ని యుగములు పట్టు'ననగా దానితో మాట్లాడులోన కామధేనువు శివలింగముపై తన పాలనభిషేకించి వచ్చుచుండుట చూచి దానిని కూడా ఆపి మీరిద్దరు నాకొక సాయం చేయవలెను. నేను లింగాగ్రము చూచినట్లు చెప్పవలెనని బ్రతిమాలుకొనగా వారిద్దరు సమ్మతించిరి. బ్రహ్మ వారిని యథా ప్రదేశమునకు గొని వచ్చి విష్ణువు కొరకు ఎదురుచూచుచూ కూర్చుండెను. విష్ణువు లోనికి వెళ్ళగా వెళ్ళగా లింగమూలము కనలేక తిరిగి వచ్చెను. అతని గాంచుచునే బ్రహ్మదేవుడు"మొదలు కనుగొంటివా!" అని అడెగెను. విష్ణువు నిరాశగా కానరాలేదని చెప్పడంతో బ్రహ్మ గర్వంగా"నేను లింగాగ్రము చూచి వచ్చినాను. పందెము నెగ్గితిని. వీరిరువురు సాక్ష్యము అనెను."అంత హరి మొగలి పువ్వుతో "బ్రహ్మ లింగాగ్రము చూచినాడా! అని అడగగా

అది చూచినాడని అబద్ధము" అడెను. కామధేనువును ప్రశ్నించగా అది తలతో నౌనౌను అనుచునే తోకతో లేదులేదనెనె. తాను పందెము ఓడిపోయినట్లు నిశ్చయించుకొని విష్ణువు శివుని గురించి ప్రార్థించెను. తక్షణమే శివుడు ప్రత్యక్షమై "ఓ శ్రీహరీ ఈ బ్రహ్మ చెప్పినది అబద్ధము. వీరి సాక్ష్యములు అబద్ధములు. దొంగ సాక్ష్యము చెప్పిన మొగలిపువ్వు ఈ రోజునుండి నా పూజకు తగనిదగుగాక! ఈ కామధేనువు తోకతో నిజమును, తలతో అబద్ధము చెప్పుటచే దీనిని మొగము చూచిన పాపమును, పృష్టము చూచిన పుణ్యమును వచ్చునట్లు శపించు చున్నాను. అబద్ధము ఆడిన బ్రహ్మకు పూజార్హత లేకుండుగాక! ఓ శ్రీహరి యధార్థ వాదివైన నీవు సర్వులచే పూజింపబడుదువు గాక ! అని ప్రకటించి అంతార్థనమయ్యెను.

# ఇంద్రుని బ్రహ్మహత్యాదోషము

నాటి నుండి శివుడు లింగ రూపముతో మహాక్షేత్రములందు నివసించుచూ భక్తులను తరింప చేయుచున్నారు. విష్ణువు శివుని ఆనతితో పాన ట్టము అయి శివలింగమును ధరించుచున్నాడని సూతడు చెప్పగా వినిఋషులు "ఇంద్రుడు బ్రహ్మహత్యాదోషము పొందినాడని అందురు కదా! వానికా బ్రహ్మహత్యాదోషము ఎందులకు వచ్చినది" అని ప్రశ్నించగా సూతుడిట్లు చెప్పెను. "ఒక సమయమున దేవగురుడు బృహస్పతి ఇంద్ర సభలోనికి పోగా దేవగణములందరూ ఆయనకు గొప్ప మర్యాదలు చేసిరి. కానీ దేవ వేశ్యల నృత్య గానాదులలో మునిగి, ఇంద్రుడు ఆయనను గౌరవించలేదు. అందుకు కోపగించిన బృహస్పతి "గౌరవము లేని చోట నివాసముండతగదని యెంచి అమరావతిని వదిలిపోయెను. తరువాత ఇంద్రుడు గురుని విషయమై విని "గురువున్నిచేరి గురువుగారెచ్చట" అని ప్రశ్నించెను.

దానికి సమాధానముగా "గురువు గారెచ్చటకు పోయినారో తెలియ"దనెను. కొందరు ఇంద్రుని చూచి గురువు లేకున్నా అశుభములు వచ్చుననిరి. అదివిని ఇంద్రుడు భయపడి బృహస్పతిమరలి వచ్చునంత వరకు ఆ పద్ధర్మముగా మరొకరెవరినైన గురువుగా నుంచుకోదలచి అందుకు గాన విశ్వకర్మ కుమారుడగు విశ్వరూపుని యెంచుకొనెను. ఈ విశ్వరూపుడే త్రిశిరుడని పిలువబడేవాడు. వీడు రాక్షసులందు అధిక ప్రేమగలవాడు. దేవగురువుగా ఉంటున్నప్పటికి హవిర్భాగములు రాక్షసులకిచ్చేవాడు. అది తెలిసి తనకు పురోహితుడై, వుండికూడా రాక్షస పక్షమున ఉన్నాడని ఇంద్రుడు కోపగించి ఆ త్రిశిరాసురుడి మూడు తలలను తెగవేసాడు. అదిగో ఆ కారణంగా ఇంద్రుడికి బ్రహ్మహత్యాదోషము సంక్రమించింది. ఆ పాతకం భయంకరాకారంతో ఇంద్రున్ని తరుమసాగెను. దానికి భయపడిన పాక శాసనుడు సూక్ష్మరూపం ధరించి హిమగిరిలోని మానససరోవరం నందలి తామర తూడులో దాగుకొన్నాడు.

ఇంద్రుడు లేని కారణంగా అమరావతి అల్లకల్లోలమయింది. అరాచకం ప్రబలింది. దేవతలందరు భయపడి ముల్లోకాలు గాలించి గాలించి బృహస్పతిని దర్శించగా "గురువర్యా! తమరావతిని వదలినది మొదలు రాజ్యము అరాచకమయినది. ఇంద్రుడు త్రిశిరుని వధించి బ్రహ్మహత్యా పాపం తరమగా రాజ్యము విడిచి పోయెను. మా కాతని జాడ తెలియుట లేదు. మాకు తమరే దిక్కు! దయతో అమరావతికి విచ్చేసి మా బాధలు తీర్చుడని ప్రార్థించగా గురుడు జాలిపడి జరిగిందంతయూ దివ్య దృష్టితో చూచెను.

## నహుషచరిత్రము

ఇంద్రుడున్న స్థావరము గ్రహించాడు బృహస్పతి. దేవతలతో

అది చూచినాడని అబద్ధము" అడెను. కామధేనువును ప్రశ్నించగా అది తలతో నౌనౌను అనుచునే తోకతో లేదులేదననె. తాను పందెము ఓడిపోయినట్లు నిశ్చయించుకొని విష్ణువు శివుని గురించి ప్రార్థించెను. తక్షణమే శివుడు ప్రత్యక్షమై "ఓ శ్రీహరీ ఈ బ్రహ్మ చెప్పినది అబద్ధము. వీరి సాక్ష్యములు అబద్ధములు. దొంగ సాక్ష్యము చెప్పిన మొగలిపువ్వు ఈ రోజునుండి నా పూజకు తగనిదగుగాక! ఈ కామధేనువు తోకతో నిజమును, తలతో అబద్ధము చెప్పుటచే దీనిని మొగము చూచిన పాపమును, పృష్టము చూచిన పుణ్యమును వచ్చునట్లు శపించు చున్నాను. అబద్ధము ఆడిన బ్రహ్మకు పూజార్హత లేకుండుగాక! ఓశ్రీహరి యధార్థ వాధివైన నీవు సర్వులచే పూజింపబడుదువు గాక ! అని ప్రకటించి అంతార్థనమయ్యెను.

## ఇంద్రుని బ్రహ్మహత్యాదోషము

నాటి నుండి శివుడు లింగ రూపముతో మహాక్షేత్రములందు నివసించుచూ భక్తులను తరింప చేయుచున్నారు. విష్ణువు శివుని ఆనతితో పాన ట్టము అయి శివలింగమును ధరించుచున్నాడని సూతడు చెప్పగా వినిఋషులు "ఇంద్రుడు బ్రహ్మహత్యాదోషము పొందినాడని అందురు కదా! వానికా బ్రహ్మహత్యాదోషము ఎందులకు వచ్చినది" అని ప్రశ్నించగా సూతుడిట్లు చెప్పెను. "ఒక సమయమున దేవగురుడు బృహస్పతి ఇంద్ర సభలోనికి పోగా దేవగణములందరూ ఆయనకు గొప్ప మర్యాదలు చేసిరి. కానీ దేవ వేశ్యల నృత్య గానాదులలో మునిగి, ఇంద్రుడు ఆయనను గౌరవించలేదు. అందుకు కోపగించిన బృహస్పతి "గౌరవము లేని చోట నివాసముండతగదని యెంచి అమరావతిని వదిలిపోయెను. తరువాత ఇంద్రుడు గురుని విషయమై విని "గురువుత్నినిచేరి గురువుగారెచ్చట" అని ప్రశ్నించెను.

దానికి సమాధానముగా "గురువు గారెచ్చటకు పోయినారో తెలియు"దనెను. కొందరు ఇంద్రుని చూచి గురువు లేకున్నా అశుభములు వచ్చుననిరి. అదివిని ఇంద్రుడు భయపడి బృహస్పతిమరలి వచ్చునంత వరకు ఆ పద్ధర్మముగా మరొకరెవరినైన గురువుగా నుంచుకోదలచి అందుకు గాన విశ్వకర్మ కుమారుడగు విశ్వరూపుని యెంచుకొనెను. ఈ విశ్వరూపుడే త్రిశిరుడని పిలువబడేవాడు. వీడు రాక్షసులందు అధిక ప్రేమగలవాడు. దేవగురువుగా ఉంటున్నప్పటికి హవిర్భాగములు రాక్షసులకిచ్చేవాడు. అది తెలిసి తనకు పురోహితుడై, వుండికూడా రాక్షస పక్షమున ఉన్నాడని ఇంద్రుడు కోపగించి ఆ త్రిశిరాసురుడి మూడు తలలను తెగవేసాడు. అదిగో ఆ కారణంగా ఇంద్రుడికి బ్రహ్మహత్యాదోషము సంక్రమించింది. ఆ పాతకం భయంకరాకారంతో ఇంద్రున్ని తరుమసాగెను. దానికి భయపడిన పాక శాసనుడు సూక్ష్మరూపం ధరించి హిమగిరిలోని మానససరోవరం నందలి తామర తూడులో దాగుకొన్నాడు.

ఇంద్రుడు లేని కారణంగా అమరావతి అల్లకల్లోలమయింది. అరాచకం ప్రబలింది. దేవతలందరు భయపడి ముల్లోకాలు గాలించి గాలించి బృహస్పతిని దర్శించగా "గురువర్యా! తమరావతిని వదలినది మొదలు రాజ్యము అరాచకమయినది. ఇంద్రుడు త్రిశిరుని వధించి బ్రహ్మహత్యా పాపం తరముగా రాజ్యము విడిచి పోయెను. మా కాతని జాడ తెలియుట లేదు. మాకు తమరే దిక్కు! దయతో అమరావతికి విచ్చేసి మా బాధలు తీర్చుడని ప్రార్థించగా గురుడు జాలిపడి జరిగిందంతయూ దివ్య దృష్టితో చూచెను.

## నహుషచరిత్రము

ఇంద్రుడున్న స్థావరము గ్రహించాడు బృహస్పతి. దేవతలతో

మునులతో కలిసి మానస సరోవరానికి చేరి ఇంద్రున్ని బయటకు రమ్మని పిలిచాడు బృహస్పతి. గురువుగారి గొంతు గుర్తుపట్టి బయటకు వచ్చాడు, ఇంద్రుడు. కన్నీళ్ళు కార్చుతూ బృహస్పతికి నమస్కరించి తన బాధ వివరించెను. గురువు అతని ఓదార్చాడు."బ్రహ్మ హత్యాదోషము ఊరక పోదు. నీవిట్లు కొన్నాళ్ళు అనుభవించక తప్పదు. తరువాత కాలం అనుకూలంగా ఉన్నతరిని నేనే కబురు చేస్తాను. అప్పుడు వచ్చి రాజ్యమేల గల" వని చెప్పాడు. దేవతలతోను. ఋషులతోను, మరలి అమరావతికి వచ్చి ఈ విషయము సచివులు మొదలగు వారికి చెప్పి జాగ్రత్తగా ఉండుడుని హెచ్చరించెను. దేవతల తమకు రాజులేకుండటచే విచారించి "మాకు ప్రభువొకనిని సమకూర్చు"డని బృహస్పతిని కోరారు.

అందుకు గురుడు "భూలోకములో నహుషుడు ఇంద్రత్వమును కోరి నూరు మహాయాగములు గావించి యున్నాడు. మీరాతనని రాజుగా నిర్ణయించుకొని ఇంద్రత్వము కట్టబెట్టుడనెను. వారు నహుషుని చేరి ఇంద్ర పదవినీకై ఎదురు చూచుచున్నది. మారాజు అమరావతిని వదిలి పోయినాడు. రమ్మని సగౌరవంగా ఆహ్వానించిరి. నహుషుడు తన కింద్రత్వము వచ్చుటకు ఆనందించి వెంటనే దేవరాజ్య పట్టాభిషేకమంది ముల్లోకములు పాలించుచుండెను. ఇట్లుండగా అతనికొక నాడు త్రిలోక సౌందర్యముతో విరాజిల్లుచున్న శచీదేవియందు కామ వికారము కలిగినది. అతడు బృహస్పతిని చేరి గురువర్యా! నేను ఇంద్రత్వమొందగా అన్ని భోగముల రీతినే ఇంద్రాణియైన శచీదేవి నన్ను కూడావలెను కదా! కావునా నా ఆజ్ఞగా ఆమెను నాశయ్యాగృహమునకు రమ్మని చెప్పుడని కబురు పంపెను. అది విని శచీదేవి "గురుదేవా! ఈ నహుషుడు శతక్రతువులు చేయలేదు. ఇంకనూ ఒక క్రతువుబాకీ యున్నది. శతక్రతువులు పూర్తి చేసిన వానిని గానీ అన్యుని నేను చూడ"ననెను. బృహస్పతి ఆ మాట చెప్పగానే నూరవ కృతఫలమెట్లు పొందవలెనో చెప్పమని మళ్లా కబురు పెట్టాడు నహుషుడు.

శచీదేవికి ఏమి చెప్పాలో తోచలేదు. అందువల్ల "గురువర్యా! వీడు దుర్మార్గుడయి ఇంద్రాణినైన నన్నే వాంఛిస్తున్నాడు. వీనికి తగిన పరాభవము జరుగుటకు గాను మీరు ఉపాయము చెప్పు"డని – ఆ భారము బృహస్పతి పైనే పెట్టెను. ఆయన దూరము ఆలోచించి నహుషునికి పతనము ఇంద్రునకు రాజ్యలాభము వచ్చు మార్గము ఆలోచించి "నేటి నుండి ఏడవ రోజు సాయంత్రము మహామునులచే "బ్రహ్మ రథము"లో వచ్చినచో నూరవ యజ్ఞ ఫలము పొందగలడని అట్లు చేయుమని తెలియ చేయు" మని చెప్పగా శచీదేవి వానికట్లే వార్త పంపెను.

ఆ ఉపాయము విని నహుషుడు సంతోషించి దినములు లెక్కపెట్టుకొనుచుండెను. నియమిత దినమునకు మునులను వాహకులుగా ఉంచుకొని శచీ మందిరమునకు పోవ నహుషుడు సన్నద్ధమై బ్రహ్మరథ మెక్కి బయలు దేరెను. పదవీ మత్తతతో అమిత కాముకుడైన నహుషుడు రథ గమనమందలి కుదుపులకు కోపించి "ఎవడీ విధముగా ఇంద్రుడనగు నాకు బాధ కలిగించువాడ"ని కోపగించి దూలనాడగా వాహక బృందమందున్న పొట్టివాడగు అగస్త్యుడు మండిపడి "నీవు మమ్ముల్ని అదలించుటయా! ఛీ దుర్మార్గా! సర్పము కమ్ము" అని శపించెను. దానితో అతడు త్రుళ్లిపడి మహాసర్పరూపమొందెను. అగస్త్యుని పాదములపై పడి నా తప్పులు క్షమించి మోక్షము ప్రసాదింపుమని దీనముగా ప్రార్థించగా అగస్త్యుడు జాలిపడి "ద్వాపర యుగంలో పాండునందనులగు ధర్మరాజాదులు అరణ్యవాసము చేయుచున్న సమయంలో ధర్మమూర్తి యగు ధర్మరాజు నీ ప్రశ్నలకు సమాధానము చెప్పినపుడు నీ శాపము తీరగలదు అంత వరకు సర్పరూపుడవై వుందువు. పొమ్మని" సాగనంపెను. ఇంతలో ఇంద్రుని బ్రహ్మహత్యాదోషము తొలగిపోయెను. బృహస్పతి దేవతలతో కలసి ఇంద్రుని చేరి ఇంద్రా! దోషము తీరినది. నహుషుడు

శాపగ్రస్తుడై పడిపోయెను. ఇంద్ర పదవి చేపట్ట రమ్మని సగౌరవముగా గొని వచ్చి అతనికి మరలా స్వర్గరాజ్య, పట్టాభిషేకము గావించెను. ఇంద్రుడు దేవరాజ్యాధిపత్యము వహించి గురుదేవునాశ్రయించి రాజ్యమేలుచుండెను. అంత ఇంద్రుడు వదల్చుకున్న బ్రహ్మ హత్యవారి ఎదుట నిలచి "ఇంద్రా! నన్ను ఎచట నివ్వమందువు నీవు వదిలించు కున్నావు కానీ నాకు తావు చూపించవే "మని అడిగెను.

ఇంద్రుడు గురునితో యోచించి "ఓ బ్రహ్మ హత్య పాతకమా! నీవు ఇకపై నాలుగు భాగములుగా విభజింపబడి ఒక భాగము భూమి యందు రజోరూపముగాను, రెండవ భాగము జలములయందు నురుగు రూపముగను, మూడవ భాగము వృక్షములందు జిగురు రూపముగను నాల్గవ భాగము స్త్రీలయందు రజోరూపముగాను నివసింపు"మని ఆజ్ఞాపించి పంపెను. తరువాత ఇంద్రుడు శచీదేవితో గూడి సక్రమంగా రాజ్యపాలన చేయసాగెను.

# వృత్రాసురుని చరిత్రము

ఇంద్రుడు రాజ్యాభిషేకము అందిన తరువాత విశ్వకర్మ ఇంద్రుని జయించి తన కుమారుని పొందవలెనని బ్రహ్మదేవుని గుఱించి తపము చేయసాగెను. బ్రహ్మ దేవుడు ఆ "విశ్వకర్మ" తపమునకు మెచ్చి దర్శనమిచ్చి విశ్వకర్మా నీ తపమునకు మెచ్చితిని ఏ వరము కోరెదవో కోరుకొమ్మనెను. అది విని సంతోషించిన "విశ్వకర్మ!" "మహానుభావా! నా కుమారుని ఇంద్రుడు సంహరించినాడు. ఇప్పుడు ఇంద్రుని జయించే కుమారుడు నాకు కావలెను. ప్రసాదింపుమని ప్రార్థించెను. అతడట్లే అని సమ్మతించి వరదానము చేసెను. విశ్వకర్మ తన సదనము చేరెను కొన్నాళ్ళుకతనికి బ్రహ్మవరముతో ఒక్క కుమారుడుకలిగెను.

వానికి వృత్రుడు అని నామకరణము చేసి పెద్దవానిగా చేసి విద్యాబుద్ధులు నేర్పించెను. వృత్రుడు బ్రహ్మను గూర్చి తపస్సు చేసి వరబలమును పొందియుండెను.

దేవదానవుల యుద్ధమందు ఓడిపోయి పాతాళములో దాగుకొనిన రాక్షసులందరిని గుమిగట్టుకొని ఒక సైన్యముగా సిద్ధపరచి వృత్రుడు ఇంద్రుడి నెదిరింపసాగెను. ఇంద్రుడా వరసంపన్నుడగువృత్రుని ముందు నిలుబడలేక భయపడి ఈ విషయముతనగురువుతో మనవి చేసెను. అతడు "బ్రహ్మదేవుడు విశ్వకర్మకువరమిచ్చినాడుగాన దానికి విరుగుడు కూడా అతడే చెప్పగలడు పొ" మ్మని బ్రహ్మ కడకు పంపెను.

ఇంద్రుడు సకల దేవతలను మునులను గురునితో బయలు దేరి సత్యలోకము చేరి బ్రహ్మదేవునకు సమస్కరించి విచారముఖముతో సంస్తుతులు గావించి నిలబడి యుండెను. అది చూచి బ్రహ్మ "నీ వెందుకట్లున్నావు. నీవు వచ్చిన పని ఏమి అని ప్రశ్నించెను. ఇంద్రుడు విని "మహానుభావ! విశ్వ కర్మకు నీవిచ్చిన వర ప్రభావంతో వృత్రుడు జన్మించి రాక్షస మూకను చేర్చుకొని నన్ను బాధించుచున్నాడు. వాని వలన ముల్లోకముల వారును బాధలనుభవించుచున్నారు నాకు వాని బాధ తప్పించుకొను ఉపాయము సూచించి ఈ ఆపదనుండి బయట పడవేయు"డని అతి దీనముగా ప్రార్థించెను.

అది విని నిదానించి బ్రహ్మ "ఓ సురనాయకా! వృత్రుడు బ్రహ్మవర సంపన్నుడు వానిని నీ వస్త్రాదులతో జయింప జాలవు. నీకు నేనొక ఉపాయము చెప్పుచున్నాను. భూలోకమందు దధీచి యను మునిపుంగవుడు కలడు. మీరందరూ ఆయనను చేరి దధీచి మహామునితో "వృత్రాసురిని బాధ పడలేకుండా వున్నాము. మమ్ము రక్షించు "మనుడు. ఆయన

నావలన వలయు సహాయము ఏదియో చెప్పుడు. మీకు మేలు చేతు"నని అనును. అప్పుడు మీరు మీ శరీరమందలి ఎముకలను మాకు ప్రసాదించుడు "వాని నాయుధములుగా చేసుకొనిన గానీ వృత్రుని జయింపలేమని చెప్పుడు. అయన తప్పక తన శరరమునందలి శల్యములను మీకిచ్చును సందియ పడవల" దనెను.

అది విని ఇంద్రుడు "ఇది వరలోనే త్రిశిరవధతో బ్రహ్మ హత్యాదోషము కలిగినది. దానిని వదిలించుట కొనుటకు తల ప్రాణము తోకకు వచ్చినది. ఇప్పుడు బ్రహ్మ హత్య కూడా నన్ను పీడించునేమోనని భయపడు చున్నా"ననెను. అది విని అతడు "ఇది బ్రహ్మ హత్య కాదు ఆయన ఇచ్చాపూర్వకంగా ఇచ్చు వరము. భయపడవలదని చెప్పి వారిని సాగనంపెను. వారు ఆ ఉపాయము గ్రహించి పరమానందముగా అమరావతిని చేరి అచట నుండి దధీచి ఆ శ్రమమునకు గుంపులుగా వచ్చి చేరిరి. ఇంద్ర బృహస్పతి సమేతులై వారందరూ తన ఆశ్రమము చేరుట చూచి దధీచి పరమానందము పొందెను.

వారికి తగిన అతిథి సత్కార్యములను గావించి కూర్చుండ చేసి వారు వచ్చిన విషయము ప్రశ్నించి సంగతంతయూ సవివిస్తరముగా విని "ఈ మాత్రము దానికి మీరందరూ రావలయునా! కబురు చేసినా నేను రానా! నేనిప్పుడు యోగాగ్నిచే నాదేహమును రగల్చి భస్మము చేయుదును. మీకు వలయు ఎముకలను మీరు ఏరుకొని వాటి వలన ప్రయోజనము పొందుడు. పది మందికి సహాయపడుటకు శరీరప్రయోజనం" అనుచునే యోగము పూనెను.

యోగాగ్ని దగ్ధమగు దధీచి శరీరమునుండి దేవతలు ఒక్కొక్కటిగా ఎముకలను గ్రహించి ఆయుధములుగా చేసికొనిరి. ప్రత్యేకించి ఇంద్రుడు

దధీచి వెన్నెముకను వజ్రాయుధముగా చేసుకొని వృత్రుని ఎదిరింప సిద్ధముగా నుండెను. వృత్రాసురుడు విజృంభించి దేవలోకమును భీతిల్లజేయుచు తనకెవరూ లేనట్లు వర్తిల్లు కాలములో ఇంద్రుడు వానిని సంహరించి బాధ తప్పించుకొన దలచి యుద్ధసన్నాహము గావించుకొని యాతనిపైకి యుద్ధమునకు పోయెను. వృత్రుడు కూడా మహాబల సంపన్నుడై ఇంద్రుని ఎదిరించి ఘోరముగా పోరాడసాగెను. ఇంద్రుడాతని యందు నిలువజాలక కంగారు పడిపోవ చుండగా నాకాశవాణి "ఇంద్రా! భయపడకుము సముద్రముపై నున్న నురుగును వజ్రాయుధమునకు సంధించి వదులుము వాడు నశించునని" చెప్పెను.

ఇంద్రుడు బృహస్పతిని చేరి గగనవాణి మాటలు వివరించగా "ప్రదోష సమయమునందు శివుడు తాండవించును. నీవు ప్రదోషవ్రతము గావించి శివుననుగ్రహము పొందుము అప్పుడా నురుగునువజ్రాగ్రమున అతికించి సంధించుము. శివుడు ఆ నురుగులో సూక్ష్మరూపముగా నుండి వానిని వధించును. ఇదియే మార్గమని చెప్పెను.ఇంద్రుడట్లే ప్రదోష వ్రతమును గావించి యోగశక్తితో శివారాధనముగావించి శివదర్శనమొందెను. "నీ కోర్కె తీర్చెదను లెమ్మని" శివుడు దీవించి యంతర్ధానమొందెను. తరువాత మరల వృత్రాసురునిపై యుద్ధమునకు దిగెను. వానితో ఇంద్రుడు ఘోరమైన యుద్ధమాచరించువేళ రాత్రి సమయమగుటచే రాక్షసుల బలమెక్కువైనది. వృత్రుడు ఇంద్రుని మ్రింగి వేయనాతడు శివుని ధ్యానించివాని కడుపు చీల్చుకొని బయటకు వచ్చెను. అనంతరము సముద్రపునురుగుతో తడపిన తన వజ్రాయుధముతో వృత్రాసురుని సంహరించెను. రాక్షసవీరులు భయపడి పాతాళమునకు పారిపోయిరి.

సూతుడిట్లు తమకు వృత్రాసురవధ చెప్పగావిని మునులందరు సంతసించి "మహాత్మా! ఇంత బలవంతుడైన ఇంద్రునెదురించు శక్తి గల్గిన వృత్రాసురుడు పూర్వజన్మమునందున ఎవరు? వీని పూర్వ చరిత్రము వున్నదా? వున్నచో చెప్పుమని కోరగా సూతడిట్లు ప్రారంభించెను. వృత్రాసురుని గురించి పూర్వచరిత్రమున్నది దానిని వివరింతును వినుడు. "వృత్రుడు గతజన్మలో చిత్ర రథుడను గంధర్వరాజు శివభక్తి పరాయణుడు. ఒకానొక సమయందతడు విమానము మీద కైలాసమునకు వెళ్ళెను. అచట పార్వతి పరమేశ్వరులు నిండు సభలో సింహాసనముపై నుండిరి. పార్వతి దేవి శివుని ఎడమ తొడపై కూర్చుని వుండెను. ఆ సభలో మహా ఋషులు, దేవతలు, గంధర్వులు నానావిధములుగా మహనీయులు చేరి వుండిరి. ప్రమథ గణములు వీరభద్ర, సుబ్రహ్మణ్య నందీశ, భృంగీశ, చండీశాది మహానాయకులు ఉద్దండులైన వారందరును వున్నారు. ఆ సమయమున చిత్రరథుడు సభలో ప్రవేశించి శివస్తవము గావించి "పరమేశ్వరా! మేము సామాన్యులము విషయవాంఛలకు లొంగేవారలము, మా చేతలు గుణత్రయముతో నిండినవి. కాని మీరు మహిమ గల వారు మీకు మీరే సాటి. అట్టి కాముకులమగు మావలె లజ్జవిడచి నిండు సభలో భార్యను తొడపై కూర్చుండ బెట్టుకొనుట తలవంపు పని కాదా? యని లేశ మాత్రమున నిందా సూచకముగా మాట్లాడెను. అది విని కోపించిన పార్వతి "దుర్మార్గుడా! మా చర్యను నీవు విమర్శింతువా! నీకు గర్వము పెరిగినది. నీవు ఇప్పుడు సభలో రాక్షసుని విధముగా సంచరించినావు కావున, రాక్షస జన్మమొందెదవుగాక!" అని శపించెను. అతడా శాపమునకు వణికి పోయెను. చేయునది లేక విశ్వకర్మకు తపోఫలముగావృత్రునిగా జన్మించెను. అంతటివాడు కావుననే శివదత్త మహాబలముతో ఇంద్రుని యెదిరించెను. తపస్సు చేసి వరములు పొంది త్రిలోకాధిపత్యముతో వృత్రుడు నిదానముగా నుండలేకపోయినాడు. ఇంద్రునిపై కత్తిగట్టి యుద్ధమునకు దిగి యస్త్రు

శత్రువుల బలము దిగజార్చి విజృంభించెను. అట్టి వానిని శివపూజా సలముతోనే ఇంద్రుడు సంహరించెనని సూతమహాముసీంద్రుడు వృత్తాసురుని పూర్వజన్మవృత్తాంతము ఋషులకు చెప్పెను.

# బలి చక్రవర్తి- పూర్వకథ

వృత్రాసురుని వధానంతరము రాక్షసులు చెల్లాచెదరై పాతాళలోకమునకు వెళ్ళి ఇచట నున్న బలిచక్రవర్తిని ఆశ్రయించిరి. బలిచక్రవర్తి రాక్షస సైన్యమును కూడట్టుగొని ఇంద్రుని మీదకు యుద్ధము ప్రకటించి దేవతలను ఇంద్రుని, ఇంద్రబలమును యమరావతినుండి తరమి తానాక్రమించుకొని యుండెను. బలి మహాయాగములు చేసి పెక్కుదానములు కావించి దానవీరుడను ఖ్యాతి గడించెను. ఇట్లుండగా తన కుమారులు రాజ్య హీనులై పోవుటకు విచారించి నది యదితీ దేవి తన భర్తకు తన సంతాన దుస్థితిని వర్ణించి వారి బాధ పోగొట్టుమని ప్రార్థించెను. అతడు శ్రీహరిని ఆ శ్రయింపుమనగా ఆమె శ్రీహరి గురించి దీక్షగా వ్రతము గావించి ప్రసన్నుని చేసుకొని వామన రూపము గలవాడై మాయా మార్గముతో నడచు కుమారునిగా వరము పొందినది. ఆ వామనుడు మహాదాతయైన బలిచక్రవర్తిని మూడడుగులు దానమడిగి భూవ్యాకాశలాక్రమించి బలిని రసాతలమునకు బంపి, ఇంద్రునకు రాజ్యదానము గావించెను. ఇట్లు బలి శ్రీహరి వల్ల జయించపడెను. అని చెప్పగా మునులు విని బలి ఇంతటి వాడగుటకు వాని పూర్వజన్మ ప్రకారము వినిసింపగోరెదమనగా విని సూతడు ఇట్లు ప్రారంభించెను.

# బలి పూర్వజన్మము

పూర్వమందు యొక నీచ జాతిలో జన్మించిన పాపిగలడు. వాడు చేయని పాపకర్మలు లేవు. పరధనము హరించును. పరులను చంపుచుండెను.

దారులు కొట్టి ధనములు దోచుచుండెను. పరస్త్రీలను బాధించు దుష్టుడై సంచరించుచు మహా భయంకరముగా తయారై తిరుగుచుండెను. ఇట్లుండగా వాడొకనాడు రాత్రివేళ పూలు, పండ్లు సువాసన ద్రవ్యములు తమలపాకులుమొదలైనవి పుచ్చుకొని ఉంపుడుగత్తె ఇంటికై చీకటిలో పోవుచుండగా దారిలో కాలికొక పెద్దబండ తగిలి యెదురు దెబ్బ కొట్టెను. అతడా దెబ్బకు తాళలేక మూర్ఛపోయెను. కొంతసేపటికి తెలివి వచ్చి దైవకృపవలన బ్రతికియే వున్నానని తలచుకొని దేవునకు సమస్కరించి తనకు దగ్గరగా నున్నయొక శివలింగమును చూచి దానిపై కొన్ని పూవులు సుగంధ ద్రవ్యములు పెట్టి నమస్కరించి పోయెను. కొన్నాళ్లకతడు మృత్యువాత పడెను. వానిని యమధర్మరాజు కడకు గొనిపోయి నిలబెట్టగా యముడు చిత్రగుప్తుని చూచి వీని పుణ్య పాపములు వివరించుమని ఆజ్ఞాపించెను.

అతడు లెక్కలు చూచి ఈతడు జీవితమంతయు మహాపాపములు గావించినాడు. ఒకనాటి రాత్రి మాత్రము వేశ్య గృహమునకు పోవచుండగా దారిలో రాయి తగిలి పడిపోయి తిరిగి లేచి తాను పట్టు కొని పోవు పూవులు పండ్లు సుగంధ ద్రవ్యములు సమీపమునున్న శివలింగము పై వుంచి విడువక పూజించెను. ఇదొక్కటే వాని పూజా పుణ్యకార్యమనెను. యముడది విని ఈ పుణ్య కార్యమునకు వీనిని ఇంద్ర సింహాసనము ఎక్కించవలెను మూడు గడియల పాటు ఇంద్ర పదవి పొంది సుఖించుటయే వీని పూజాఫలమని నిర్ణయించి చెప్పెను వెంటనే అతడు విమానము మీద ఇంద్రలోకమునకు వెళ్ళి సింహాసనము ఎక్కెను. అతడున్న మూడు గడియలలో కల్పవృక్షము కామధేను, చింతామణి, ఐరావతము, మొదలుగాగల అనేక రత్నములు సువర్ణములు అన్నియును మహామునులకు దానము గావించెను.

మూడు గడియల తరువాత ఇంద్ర పదవి వదలి యమలోకమునకు వచ్చెను. అసలు ఇంద్రుడు సింహాసనమెక్కి. తన బొక్కసమును చూచుకొనగా ఏ యొక్కటియు లేకుండటకు బాధ పడి

యముని వద్దకు వచ్చి తన సొత్తంతయూ పోయినదని వీడు నేరస్థుడనియు అనెను. వానిని పిలిచి "ఇంద్రలోకములోని సమస్త వస్తుజాలములు ఏమి చేసితివి"? అని ప్రశ్నించగా ఆ వస్తువులు ఎక్కడకునూ పోలేదు. అందుండు మహామునులకే దాన ధర్మముల నాచరించినానన్నాడు. అంతటి దాత యమలోకమునకు రావలసిన పని ఏమున్నదని యోచించి యముడు ఇంద్రునితో సర్వ విషయములు చెప్పి పంపి వేసెను. ఆ పాపిని పునర్జన్మమునకై విడువగా అతడు వెంటనే ప్రహ్లాదుని కుమారుడగు విరోచనునకు సురచియందు కుమారుడై పుట్టెను. అతడే బలి చక్రవర్తి బలి తన తల్లి క డుపులో నుండగానే ఇంద్రుడు బ్రాహ్మణ రూపంతో విరోచనుని వద్దకు వచ్చెను.

విరోచనుడు వచ్చిన బ్రహ్మణుని పూజించి గౌరవించి ఏమి కావలయునవి అడుగగా అతడు 'నీశిరస్సునిమ్మనెను.' మాట తిరుగని విరోచనుడు తాను తల నరుకుకొని బ్రాహ్మణునకిచ్చెను. కొద్దికాలమైన తరువాత అతని భార్య సురిచి బలిని ప్రసవించినది. తరువాత ఆమె భర్త పోయిన విచారముతో తాను దేహత్యాగమును కావించెను. బలిచక్రవర్తి పాతాళ లోకములో తన రాజ్యము నిలుపుకొని రాక్షసవీరులను సైన్యముగా నుంచుకొని మహాయాగము గావించి దానము చేసి శ్రీహరి యందు భక్తిని దయను సంపాదించెను. అది బలిచక్రవర్తి పూర్వగాథ యనెను.

## తారకాసుర వృత్తాంతము

ఇట్లు బలి వృత్తాంతము చెప్పగా మునులు తారకాసురుని వృత్తాంతము వినిపింపు మని కోరరి. సూతడది విని ఇట్లు చెప్పసాగెను. వృత్రాసురుని మంత్రులలో ముఖ్యులు నముచి, విప్రజిత్తి మొదలగు వారుండెడివారు. వారిలో నముచి కుమారుడు తారకాసురుడు.

వృత్రాసురునితో యుద్ధము చేయు సమయమందు నముచుని ఇంద్రుడు సంహరించెను. తన తండ్రిని చంపిన పగతో ఇంద్రుని చంపవలెనని తారకాసురుడు నిశ్చయించుకొనెను. అందులకు తగిన బలము కావలెను. కాన బ్రహ్మను గురించి గొప్ప తపస్సు గావించెను. బ్రహ్మ ప్రత్యక్షమై "ఏమి వరము కావలెయునో కోరుకోమ్మని" అడిగెను. అతడు తనకు మృత్యువు లేకుండా వరమిమ్మనెను. బ్రహ్మ విని "నాయన ఇటువంటి కోరిక ఎవరునూ కోరలేదు. నీవు కోరరాదు. పుట్టిన జీవి చావక తప్పదు. ఇంకొక వరమును అడుగుమనెను. అది విని ఇంద్రుని జయించు వరమి"మ్మననెను.

దానికి అతడు సమ్మతించి వరమిచ్చి వెడలిపోయిను. తరువాత తారాకాసురుడు వర గర్వము చెంది ఇంద్రుని మీదకు దండెత్తి పోయి అతనిని ఓడించి రాజ్యము గ్రహించి బాధించుచుండెను. ఇంద్రుడు తన రాజ్యము పోవుటకు తారకాసురుడు గద్దెనెక్కి తన్ను బాధించుటకును వాని చేతిలో తాను ఓడుటకు విచారించి బ్రహ్మ కడకేగి తన గోడు విన్నవించెను. బ్రహ్మ విని తానా ఇంద్రునకు సాయ పడ శక్తి లేక వారిని వెంట పెట్టుకోని శ్రీహరి నివాసమునకు వెళ్ళి ఇంద్రుని బాధ విన్నవించెను. శ్రీమహా విష్ణువు ఏమి చేయవలయునా అని! యోచించులోన ఆకాశవాణి తారకాసుర సంహారము శివుని వలన పార్వతికి కలిగిన కుమారుడు మాత్రమే చేయగలడు. కావున శివకళ్యాణము జరిపింపుడు అని పలికెను.

దక్ష యజ్ఞములో యోగాన్ని రగులుకొలుపుకొని చనిపోయిన సతీదేవి, హిమవంతుని గర్భమున గిరిజ యను పేరుతో పుట్టి పెరుగ సాగెను. ఆమె శివుని తప్ప ఎవరిని వివాహమాడనని పట్టుదల పూనెను. దేవతలు తమ్ము రక్షించుటకు పార్వతిని వివాహమాడుమని ప్రార్థించిరి. దేవతల ప్రార్థనను అంగీకరించి మారువేషమున పార్వతి కడకు వెళ్ళి శివుని నిందించ సాగెను. ఆమె శివనింద సహించక కోపపడినది. తరువాత తానే శివుడనని ఆమెకు దర్శనమిచ్చెను.

# కుమార సంభవం

తరువాత హిమవంతుని ప్రార్థనంతో శివుడు వచ్చి అతని కుమార్తై పార్వతీ దేవిని వివాహమాడెను. వారికి కొన్నాళ్ళకు కుమారస్వామి జన్మించెను. కుమారస్వామి పెరిగి పెద్దవాడైనప్పుడు దేవతలు శివదంపతులు కడకువచ్చి "కుమారస్వామిని తారకాసురుని మీదకు యుద్ధమునకు పంపు" మని ప్రార్థించిరి. వారు అంగీకరించగా కుమారస్వామి యుద్ధమునకు ప్రమథ గణములతో వీరభద్రునితో దేవతాసైన్యముతో దేవేంద్రాదులతో బయలుదేరి తారకుని ఎదురింప నిలబడెను. ఉభయ పక్షములు గంగాయమునా నదుల మధ్య ప్రదేశమునకు వచ్చి యుద్ధమునకు దిగినవి. యుద్ధములో కుమారస్వామి ఏపుమిగిలి, శక్తి ప్రయోగము ఆచరించి తారకాసురుని కాళ్ళను నరికెను. తరువాత కుమార విజయమునకు పరమోత్సాహమొంది దేవతలు జయజయ ధ్వనులు పిక్కటిల్లేలా చేసిరి. ఇంద్రుడు తన రాజ్యం తిరిగి పొంది ఆనందించెను.

# శివ పట్టాభిషేకం

ఒక నాడు శివ దంపతులుండగా నారదుడు వచ్చి మీరిద్దరు ఆటలాడగా చూచెదనని వారిచే జూదమాడించెను. జూదములో శివుడు ఓడిపోయి దిగంబరుడై తపస్సునకు పోగా ఆమె విచారించుచు భర్తను పొందదలచెను. మాయరూపంతో చెంచు కన్యవలె నటించుచు అతడు మోహించునట్లు నటించెను. ఆమెను తన్ను వివాహమాడుమనగా నా ఇంటికి రమ్మని అతనని కైలాసమునకు గొని వచ్చెను. తరువాత అతడు ఆమెను. పార్వతీ దేవిగా గ్రహించి స్వీకరించెను. దేవతలు ఆనందముగా శివ దంపతులకు పట్టాభిషేకం గావించి సంతోషించిరి.

## స్కాందపురాణాం సమాప్తం

# 14. వామన పురాణము

బ్రహ్మ దేవుడు శ్రీ మహావిష్ణువు యొక్క ఐదవ అవతారమైన వామన మాహాత్మ్యాన్ని కీర్తిస్తూ బోధించిన పురాణమే వామన పురాణము "త్యాగస్య వామనం స్మృతమ్!" అన్న శ్లోకార్థం మహావిష్ణువు యొక్క చర్మంగా వర్ణింపబడ్డదీ పురాణం. "సంఖ్యయా దశసాహస్రం ప్రోక్తం కులపతే పురా" అను శ్లోకానుసారం ఇందులో పదివేల శ్లోకాలున్నవి. మరియు తొంబది యైదధ్యాయా లున్నవని తెలియుచున్నది.

ముఖ్యంగా వైష్ణవ ధర్మాలను వామన పురాణం బోధిస్తుంది. విష్ణుభక్తులు ఆరాధించు విష్ణు మందిరాలు, వాటి నిర్మాతలను గూర్చిన విషయ ప్రస్తావనలే యిందెక్కువగా నున్నవి. ఉత్పత్తి, ప్రళయాల వర్ణన కామదహనం, ప్రహ్లాదునికి మహావిష్ణువు వరదానం, పుష్కరద్వీప వర్ణన, సుకేశి చరితము, దేవీ మాహాత్మ్యం, పలు విధాలైన పుణ్యతీర్థాల వర్ణన– మహిమ, ఋణవిమోచన పుణ్యతీర్థాలు, కురుక్షేత్రమాహాత్మ్యం, పార్వతీ వివాహం, వినాయకుని విజయం. మురాసుర సంహారం, చిత్రాంగద వివాహం, శ్రీరామ చరిత్ర, గజేంద్ర మోక్షం మొ॥ కథా విశేషాలిందున్నవి.

పంద్రెండు విష్ణు స్తోత్రాలు, ఎనిమిది శివస్తోత్రాలు నాలుగు దేవీ స్తోత్రాలు మరియు సుదర్శన చక్ర స్తోత్రమిందు గలవు. మొత్తం ఇరువది యైదు స్తోత్రా లిందులో గలవు.

దేవతల్లో ముఖ్యుడు శ్రీ మహా విష్ణుదేవుడు. అట్లే ఆయుధాల్లో శ్రేష్టం సుదర్శన చక్రం, పక్షుల్లో గరుడుడు, సర్పాలలో వాసుకి, పంచభూతాల్లో భూమి, నదుల్లో గంగానది నీట జన్మించిన వాటిలో పద్మం సరోవరాల్లో మానస సరోవరం, వనాల్లో నందన వనం, లోకాల్లో

బ్రహ్మలోకం ధర్మాల్లో సత్యం, క్రతువుల్లో అశ్వమేధం, ఋషీశ్వరుల్లో అగస్త్యమహర్షి, పురాణాల్లో మత్స్య పురాణం, స్మృతుల్లో మనుస్మృతి, తేజోవంతుల్లో సూర్యుడు, జలాశయాల్లో సముద్రుడు, ధాన్యాల్లోవరి, చతుష్పాత్తులలో గోవు,(కపిల) పుష్పాల్లో జాజి, నగరాల్లో కంచి, సుందరీమణుల్లో రంభ, పట్టణాలలో కుశస్థల (శ్రీరాముని కుమారుడైన కుశుడు నిర్మించింది.) పళ్ళలో మామిడి, తెల్లని పదార్థాలలో పాలు, కళల్లో శాస్త్రాలలో గణిత శాస్త్రం, విజ్ఞానాల్లో మహేంద్ర జాలం (గారడి), షడ్రుచులలో లవణం, వృక్షాల్లో రావిచెట్టు సతీమణుల్లో పార్వతీదేవి, మొ.. వాటిని శ్రేష్ఠ పదార్థాలన్నిటిని వర్ణించాక చివరికి మహాపాతుమ్మల్లో కృతఘ్నునికి సమానుడు లేడంటున్నది వామన పురాణం. బ్రహ్మ హత్య, గోహత్య మొ॥ మహా పాపాలకు కూడా పరిహార మున్నది. కాని కృతఘ్నతా పాపానికి నిష్కృతి లేదని వామన పురాణం వినిపిస్తున్నది.

ప్రతి వ్యక్తి నిద్ర లేవగానే వామన స్తుతి చేయాలనియు, తర్వాత బ్రహ్మ, విష్ణు, పరమేశ్వరులను ప్రార్థించాలనియు సూర్యాది నవగ్రహాలు , సప్తఋషులు సప్తలోకాలు తమకు శుభం చేకూర్చాలని ఉదయ ప్రార్థన చేయాలనియు మనకు కర్తవ్య హిత బోధ చేస్తున్నది వామన పురాణం.

ఆపత్కాలంలో సహితం కొందరి నాశ్రయించరాదని ఈ వామన పురాణం హితవు గఱవు చున్నది. వారి లక్షణాలివి.

1. షండుడు: - సకాలంలో స్నానం దేవతారాధన చేయని వాడు మరియు తల్లిదండ్రులను గౌరవింపని వాడు.

2. ఆఖువు:- కావలసినన్ని సంపదలున్నా, తానే భుజించక ఇతరులకు పెట్టనివాడు.

3. మార్జారుడు;– పుణ్యలోక ప్రాప్తి కొరకుగాక, అహంకారం నిర్లక్ష్యాలతో జపతపము లాచరించువాడు.

4. కుక్కుటుడు;– పక్షపాతంతో తీర్పు చేప్పేవాడు.

5. పతితుడు;– తన ధర్మం వదలి పరధర్మాన్ని ఆచరించేవాడు.

6. అపవిద్ధుడు;– స్త్రీహత్య, గోహత్య వంటి మహాపాతకాల చేసేవాడు.

7. నగ్నుడు;– దైవభక్తి లేని వాడు (నాస్తికుడు)

8. చండాలుడు;– ఎంతో ఆకలితో వచ్చినవారికి తాను సాయం చేయక ఇతరులు కూడా చేయకుండా అడ్డుపడేవాడు మరియు శరణాగతుడై వచ్చిన వానిని నిర్లక్ష్యం చేసి విడిచి పెట్టేవాడు.

9. అధముడు;– బంధువులు, స్నేహితులు, ఉత్తములు మొ.. వారి నందరిని వదిలేసి కాని, వారు వెలివేసి గానీ వారికి దూరమైనవాడు.

మనుష్యుడాచరించ వలసిన సదాచారాలు నూట ఇరువది రెండు శ్లోకాలతో చక్కగా వామన పురాణంలో వర్ణింపబడినవి.

పుత్రుని కంటే శిష్యుడే గొప్పవాడు;– ప్రతి వారికి ఒక ఆసక్తి దాయకమైన వాడు పుత్రుడు – శిష్యుడు. ఈ ఇరువురు సమానులేనా? లేక భేదమేమైనా ఉన్నదా? అని సనత్కుమారుడు తన తండ్రియైన బ్రహ్మదేవుని నడిగాడు.

"నవిశేషో స్తి పుత్రస్య, శిష్యస్య చ పితామహ?"

బ్రహ్మ దేవుడిట్లు సమాధానమిచ్చాడు.

శ్లో॥ "పునామో నరకా త్రాత్తే, పుత్ర స్తే నేహ గీయతే॥
శేష పాప హర శిష్య; ఇతీయం వైదికీ శ్రుతిః॥"

"పుత్" అనే నరకం నుండి మాత్రమే రక్షింపగల్గేవాడు పుత్రుడనబడును. మిగిలిన పాపాల బారి నుండి తప్పించ గల్గే వాడు శిష్యుడు మాత్రమే అని

భావం. అంటే గురువు తన శిష్యుని పుత్రుని కంటే మిన్నగా ఆదరించాలని వామన పురాణం హితోక్తి పలుకుచున్నది.

విష్ణు భక్తి ప్రబోధించే ఈ క్రింది శ్లోకాల పరిశీలిస్తాం.

శ్లో॥ సా జిహ్వాయా హరిం స్తుతి, తచ్చిత్తం యత్త దర్పితమ్!!

తవేవ వేవలా శ్లాఘ్య, యా తత్పూజా కృతౌ కరే!!"

శ్లో॥ రోగాశ్చాన్యోన సాజిహ్వా, మాన వక్తి హరేర్గుణానే ఇదే భావం పోతన పద్యాల్లో కూడ యిలా స్పష్టమౌతుంది.

సీ. 2) శ్రీనాథు వర్ణించు– జిహ్వ జిహ్వ, 1) కమలాక్షు నర్చించే– కరములు కరములు, విష్ణు నాకర్ణించు వీనులు వీనులు, సుర రక్షకుని చూచు చూడ్కులు చూడ్కులు, పద్మ నాభుని పొగడు పదములు పదములు.

పాపాలను దూరీకృతం చేసికోవడ మెలాగో ఈ కథలు వివరిస్తున్నవి.

"ముద్గల మహాముని కుమారుడు" అను ఈ కథ ఇలా వివరిస్తోంది. వేదాలను చక్కగా చదివాడు. ఇతని భార్య ధర్మిష్ట. కడు ఉత్తమ గృహిణి. వీరికొక కుమారుడు జన్మించాడు. ఆ బిడ్డ మూగ, గ్రుడ్డి. ఒకనాడు శూర్పాక్షి అనే రక్కసి తన కుమారు నక్కడ వదలి, ఈ వికలాంగుడైన శిశువు నెత్తుకొని వెళ్ళింది. భక్షించడానికి తన గుహకు తీసికొని పోయింది. ఈ రక్కసి భర్త ఘటోదరుడను రాక్షసుడు గ్రుడ్డివాడతడు కూడా. తన భార్య శూర్పాక్షిని "ఏం తెచ్చావు" అని అడిగాడు. తను చేసిన బిడ్డల మార్పు సంగతి చెప్పింది. అందుకు భర్త యిలా అన్నాడు. "నీవు చేసిన పనికి మాలింది మరీ నష్టం కల్గించేది. ఆ విషయం ముద్గల మహామునికి తెలిసిన మనం శాపానికి గురికావలసిన వస్తుంది. కావున అతని బిడ్డను అక్కడే వేసి రమ్మ"న్నాడు ఘటోదరుడు. అలాగే నని శూర్పాక్షి ఆకాశ మార్గంలో బయలు దేరింది. కాని యింతలో "తానొకటి తలిస్తే దైవ మొకటి తలచాడు"

అన్నటు కోశాకారు డక్కడ తన పుత్రుని స్థానంలో ఉన్న రాక్షస కుమారుని చూశాడు. ఇది రాక్షస మాయ అని గ్రహించాడు. తన మంత్ర ప్రభావంతో రాక్షస బాలకుని బంధించి వేశాడు. ఇంతలో శూర్పాక్షి అక్కడికి చేరుకొంది. అదృశ్య రూపంలో ముని కుమారు నక్కడ పెట్టింది. తన కుమారుని తీసికొని పోవాలని ప్రయత్నించింది. కాని సాధ్యం కాలేదు. మంత్ర బద్ధుడై స్థంబించి యున్నాడా రాక్షస బాలుడు. చేయ కల్గిందేమి లేక మరల భర్త దగ్గరికి పోయి జరిగిన విషయం చెప్పింది. చివరికి తమ కుమారుడు తమకు దక్కడని వానిపై ఆశ వదులుకొన్నారు.

బాలకు లిద్దరికి నామకరణాలు జరిపించాడు ముని రాక్షస బాలుని పేరు దివాకరుడనియు, ముని కుమారుని పేరు నిశాకరుడనియు పేర్లు పెట్టాడు. ఆవు పాలతో పెరిగా రిద్దరు. ముని పుత్రుడు మొదటినుండీ మందకొడిగా వున్నాడు. అతనిలో ఏమార్పు రాలేదు. అందరి చీవాట్లు తల్లి దండ్రుల తిరస్కారాలను భరించాడు. ఇలాంటి నిర్భాగ్యున్ని భరించలేక బావిలో తోశాడు తండ్రి. ఆ బావిలో ఒక ఉసిరి చెట్టున్నది. ఆ ఉసరికి కాయలే ఆ బాలుని ఆహారంగా తింటు పదేళ్ళు బావి మీద మూసిన బండరాతిని చూసి ఎవరీపని చేశారు అని గట్టిగా అరిచింది. "అమ్మా ఈ బండరాయి వేసింది ఎవరో గాదు తండ్రిగారే" అన్నాడా బాలుడు దివాకరుడు. "అయితే బావిలో నుండి మాట్లాడేదెవరు?" ` అని ప్రశ్నించింది. దానికి అమ్మా! నేను నిశాకరున్ని అని బాలుడు జవాబిచ్చాడు. మూగవాడైన కుమారునికి మాటలు వచ్చినందుకాశ్చర్య పడిందామె. అతి కష్టం మీద బండరాతిని తొలగించిందామె. కుమారుని బయటకు రప్పించేందుకు ప్రయత్నించింది. నిశాకరా! అని పిలిచింది నిశాకరుడు క్షేమంగా కసుకందకుండా బయటకు వచ్చాడు. కన్న కుమారుని తనివి దీర చూచి ముద్దాడింది. భర్త దగ్గరికి తోడ్కొని పోయి జరిగిన వృత్తాంతం చెప్పి భర్తను

నిలదీసింది. "నిశాకరా, నీలో ఈ మార్పు ఎట్లు వచ్చిందో" అని అడిగాడు తండ్రి. తన మూగతనం, గుడ్డితనం, బుద్ధి మాంద్యం వీటికి కారణం వివరించాడు.

పూర్వ జన్మలో వేద శాస్త్రాలను, ధర్మార్థ కామ మోక్షాల గూర్చి చక్కగా ఉపదేశించాడు నా తండ్రి. నేను విజ్ఞాన ఖని నయ్యాను. జ్ఞానంతోపాటు నాకు అహంకారము కూడా పెరిగింది. అడ్డు అదుపు లేకుండా పాప కార్యాలు చేశాను. పరస్త్రీ పరధనాల తస్కరించేవానిని. ఆహాకారాలు చేస్తున్న వారిని నేను బలాత్కారంగా అనుభవించేవాన్ని. ఈ కారణంగా మరణాతరం నాకు నరకం ప్రాప్తించింది. వెయ్యి సంవత్సరాలు నరక యాతనలననుభవించాను. ఆ తర్వాత అడవిలో క్రూర మృగమైన పులిగా పుట్టాను. ఎందరినో నాపొట్టను బెట్టుకొన్నాను. పులి రూపంలో నున్నా ధర్మార్థ కామ మోక్షాలు నా మేధస్సులో సదా మెదలుచుండేవి.

ఒకనాడు రాజు నగరం వెలపలికి వెళ్ళాడు. అపుడు రాణి అజిత నాదగ్గఱికి వచ్చింది. ఆమె అతిలోక సుందరి. ఆమెను చూశాక నేను విరహ వేదనకు గురి యయ్యాను. ఆమె అందచందాలను వర్ణించాను. బోను తలుపు తెరవ మన్నాను. ఇది సమయం కాదు. రాత్రికి వచ్చి నీ కోరిక తీర్చుతా నన్నది రాణి. ఇపుడే తెరవ మన్నాను. బోను తెరిచిందామె. బయటకి వచ్చాను ఆమెను దగ్గఱికి లాక్కున్నాను. ఆ అలికిడికి రాజభటులు దగ్గరికి వచ్చి, పెద్ద తాళ్ళతో గొలుసులతో నన్ను బంధించి వధించారు.

పరస్త్రీ పొందు కారణంగా మళ్ళా నరక ప్రాప్తి కల్గింది. మరో వేయి సం॥ అక్కడనుభవించాను. ఆ తర్వాత తెల్ల గాడిదగా జన్మించాను. ఒకరింట్లో పెరుగుతున్నాను. నా యజమాని యిల్లాలు పుట్టింటికి వెళ్ళ వలసి వచ్చింది. ఈ గాడిద నెక్కి ప్రయాణం చెయ్యమన్నాడు తన భార్యతో, ఆమె అట్లె నాపై ఎక్కి వస్తూ దారిలో ఒక చోట దిగి నదీ స్నానం చేయబోయింది.

ఆమె ననుభవించాలని కోరికతో దగ్గరికేగాను. గాడిద జన్మ వచ్చినా గాడిద బుద్ధి పోలేదు. దార్లో పోతున్న ఒకడు నా చేష్ట గమనించి,చావ మోదాడు. పరిగెత్తిపోబోయి కాలు జారి పడ్డాను. తీవ్రంగా గాయ పడ్డాను. బాధతో ఆరురోజులు గడిచాక కడకు మరణించాను. ఆ తర్వాత చిలుకగా, ఎద్దుగా పుట్టాను. ఇలాంటి అవకతవక పనులే చేసి నరకయాతన లనుభవించాను. చివరకు మీ కుమారునిగా గ్రుడ్డి, మూగగా మెర్రి మొర్రి లక్షణాలతో పుట్టినాను.

ఉసిరిక ఆరు నెలలు తిన్న ఫలితంగా ఇపుడే నాకు జ్ఞానోదయమైంది. పూర్వజన్మలో అధ్యయనం చేసిన శాస్త్రాలు ఇపుడు అకస్మాత్తుగా జ్ఞాపకానికి వస్తున్నాయి. తపస్సు నాచరించి వాటిని దూరం చేసికోవలెనని, పాపపు ప్రక్షాళన కోసం బదరికాశ్రమానికి వెళ్ళుతున్నానని తల్లి తండ్రులకు నమస్కరించి నిశాకరుడు వెళ్ళిపోయాడు.

కాయేనా, వాచా, మనసా, పూర్వజన్మలో చేసిన పాపాలన్నితర్వాత జన్మలో స్మరణలోనికి వస్తాయి. తపస్సు చేసి వాటిని దూరం చేసికోవాలని ఉపదేశిస్తున్నదీ పురాణం. "మే పఠంతి చ శృణ్వంతి. తేపియాతిపరాంగతిః" ఈ వామన పురాణాన్ని చదివిన వారు విన్నవారు ఉత్తమ గతిని పొందగలరు.

# శివుడు బ్రహ్మ హత్య

ఇట్లు పురాణ కథలు విన్పించుచుండు సూత మహామునిని చూచియింకొక పురాణమును గురించి విన్పించమని కోరగా నాతడు వామన పురాణము చెప్పనారంభించెను.

ఒక వర్షాకాలములో జడివానలో యుండ లేక తమ కొక స్వంత యిల్లు కట్టమని పార్వతి శివుని కోరినది. "నేను పేదవాడను నాకు శక్యము కాద" ని శివుడామెను పర్వతము మీదకు గొనిపోయెను. ఇది విని

నారదునితో "శివునకు బ్రహ్మ హత్యా, సంబంధమగు దోషము ఎందుకు వచ్చినది?" చెప్పమన్నారు. నారదుడిట్లు మొదలిడెను. ఒకసారి శివుడు బ్రహ్మ కడకు వెళ్ళి నీవెవరు? ఎవరు నిన్ను కన్నారు? చెప్పమని యనగా విని, యాతడు సమాధానమియలేదు. ఎంతకూ సమాధాన మీయక పోవుటతో శివునకు కోపము వచ్చినది.

బ్రహ్మ దేవుడది చూచి "నీవు దిగంబరుడవు. శ్మశాన వాసివి. నాశనము చేయువాడ" వని నిందించగా ఉగ్రుడై శివుడతని శిరస్సును తన గోళ్ళతో నరికెను. ఆ శిరస్సు శివుని హస్త మంటుకొని వదలకుండెను. ఇంతలో విధాత శరీరములో నుండి యొక విచిత్ర పురుషుడు జన్మించి వాడియగు ఆయుధములు ధరించి శివుని చూచి యిట్లనెను. "నీవు బ్రహ్మహత్యా దోషివి. నీ ముఖము చూడ రాదు నిన్నంటరాదు పట్టుకొన రాదు. పొమ్మన విని, తన చేయి వదలని బ్రహ్మ శిరస్సు చూచి విచారించి బదరికాశ్రమములో నున్న నారాయణుని దర్శించి తప దీనావస్థ వివరించెను. నారాయణుడు విని "శంకరా! నీవు త్రివేణీ స్నానము గావించి వారణాసి (వరుణ- అసి యను నదుల మధ్య దేశము) యందున్న శేషశాయిని దర్శించు"మన్నాడు. అతడట్లే చేసెను కాని. శిరస్సు వదలలేదు.

తిరుగ నారాయణున్ని దర్శించి "నాకు ఈ బ్రహ్మ శిరము వదులుట లేదని మరల మొరపెట్టగా ఆశ్రీహరి "శివా! నాయెదట నున్న జలాశయములో స్నానము చేయుము. నీ చేతిలో శిరస్సు పోవు"ననెను. వెంటనే యాతడందులో మునిగి లేవగా బ్రహ్మ శిరస్సు వదలిపోయెను. నాటి నుండి యాక్షేత్రము బ్రహ్మ కపాల మను పేరుగల క్షేత్ర రాజమయ్యెను.

## నర నారాయణ వృత్తాంతము

ధర్ముని అవతారమైన "బహురుచుడు" అనే విప్రుడు వుండేవాడు.

అతిని భార్యపేరు అహింస. ఆ దంపతులకు నలుగురు కుమారులు కలిగిరి. వారిలో మొదటివాడు హరి, రెండవ వాడు కృష్ణుడు. కడపటి ఇద్దరిపేర్లు నరనారాయణులు, పెద్ద వారైన హరికృష్ణులిద్దరూ లోకోత్తర యోగులయ్యారు.

ఎవరు తపస్సు చేస్తున్నారన్నా ఇంద్రుడికి భయమే కదా! అందునా- నరనారాయణు లంతటివాళ్ళు ఘోరమైన తపస్సుకు ఒడిగట్టారూ అంటే పదవి కేదో ప్రమాదం తప్పదనుకున్నాడు పాకశాసనుడు. తనవద్దనున్న అప్సరస లందరినీ పిలిచీ – "బదరి కావనంలో తపస్సు చేస్తూన్న నరనాయణులను మోహితులను చేయవలసినదిగా" ఆజ్ఞాపించాడు వారికి తోడుగా-మన్మథుణ్ణి, వసంతుణ్ణి కూడా పంపాడు.

వాళ్ళంతా స్వర్గనుంచి బయల్దేరి, సరాసరి బదరీవనం చేరారు. ఆడారు, పాడారు, వసంతుడు విరబూసి వాతావరణాన్ని మార్చేశాడు. మన్మథుడు పూలబాణాలుసంధించాడు.

వీళ్ళ అట్టహాసాలకు ఆ నరనారాయణలు రవ్వంతకూడా చలించలేదు. అచ్చరలూ, వసంతమదనులూ అచ్చెరువు చెందారు. తమ ప్రయత్నాలు విఫలమయ్యాయే అని బాధ పడసాగారు. అప్పుడు కళ్ళు తెరిచారు నరనారాయణులు.

"తాహతును గుర్తించకుండా మాతో తలపడటం మీ దేవరాజు తప్పు. మేము అతని పదవికోసం మాత్రం తపస్సు చేయడంలేదు. ఈ వార్త వెంటనే ఆయనకు చెప్పండి. తామేదో అందగత్తెలమనీ తాపసులను చెరచగలమనీ తలపోసే మీ అచ్చరలకు మచ్చరం కలిగించే మచ్చె కంటిని మేమే సృష్టించి యిస్తాం. ఆ సుందరిని మీ యింద్రునికి మాహూడిదగా తీసుకుపొండి" అని, వారిని హెచ్చరించారు. అనంతరం నరనారాయణులు

తమ తొడల నుంచి ఒక మహాద్భుత సౌందర్యరాశిని సృష్టించి వారికి ఒప్పగించారు. నరనారాణుల ఊరువుల (తొడలు) లో నుంచి జన్మించడం వలన ఆమెకు ఊర్వశి అని నామకరణం చేసి, దేవతాళితో బాటు అమరావతికి పంపించారు.

అనంతరకాలంలో – భూమిని గల పుణ్యతీర్థాలు సేవించే లాలసతతో అక్కడకు వచ్చిన ప్రహ్లాదుడు– తానే విష్ణు భక్తుడూ వీరుడూ అనే గర్వంతో కన్నూ మిన్నూ గానక నరనారాయణులతో కలబడ్డాడు. వాళ్ళతనికి గర్వ భంగం చేశారు.

తదనంతరం ప్రహ్లాదుడు పూర్వ విరక్తుడై పెదతండ్రి హిరణ్యాక్షుని కుమారుడైన అంధకుడనే వాడిని రాజుగా అభిషేకించి తాను వైరాగ్యంలో జీవితం గడపసాగాడు.

# అంధకాసురుడు

ఈ అంధకాసురుడు అధోకాలంలో అంధుడిగా వుండే వాడు.

అందుకే – అందరూ అతనిని అంధకుడనేవారు. కాలవశాన అతను దృష్టినిపొంది రాజయ్యాడు. ఆ అంధకుడు కాలకంధరుని గురించి కాలనియమం లేని ఘోరతపస్సు చేశాడు. ఆ భోలాశంకరుణ్ణి మెప్పించి అసమానాలూ, అప్రతీహతాలూ అయిన వరాలు సంపాదించాడు.

అలవాటు ప్రకారం దేవతలంతా ఆది నారాయణున్ని ఆశ్రయించారు. "అంధకుడు అపరిమితమైన శివ భక్తుడు. అందువల్ల నేనేమి చేయడానికి లేదు. వెళ్ళి గంగాధరుణ్ణి ఆ శ్రయిద్దాం" అన్నాడు విష్ణువు. అందరూ కలిసి అంబికాపతిని చేరి ప్రార్థించారు.

వారి ప్రార్థనలు విన్న - వారిధరుడు- అంధకుడ్ని తుదముట్టించేందుకు అంగీకరించాడు. సర్వ దేవతా సైన్యాలతోనూ పరమశివుడు అంధకుడిపైకి దండెత్తాడు.

## దేవతలూ- వారి వాహనాలు

శివుడు నందినీ, బ్రహ్మ హంసనూ, విష్ణువు గరుత్మంతుడినీ అధిరోహించారు. అనుచరులు చిలకలమీదా, మరుత్తులు లేళ్ళపైనా, అశ్వినీ కుమారులు గుఱ్ఱాలపైనా, యక్షులు, నర అనే వాహనాలపైనా బయలు దేరారు. గుఱ్ఱాలు, ఒంటెలు, రథాలు వాహనాలుగా ఆదిత్యులు ఏనుగులు వాహనాలుగా వసువులు; గంధర్వులూ, పదాతి దళంగా పాదచారులై రణభూమికి నడిచారు. మహావీర్య వంతులైన గంధర్వులూ, భయంకరమైన సర్పాలు, కామధేను, సంతాన మైన వృషభములూ- తమ వాహనాలుగా యేకాదశ రుద్రులూ సమరాంగణానికి సాగారు. అయిదు వందల హంసల చేలాగబడే రథం అనే వాహనం పైన చంద్రుడు వచ్చాడు. ఐరావతం అనే నాలుగు దంతాల తెల్ల యేనుగు మీద యింద్రుడు వచ్చాడు.అంబిక పాదాల వద్ద జన్మించిన నర అనే బండి చక్రాల వంటి కళ్ళు గల భూతం పై కుబేరుడూ రుద్రుడి కర్ణ కమలావిర్భూత మైనది మిక్కిలి శ్యామల వర్ణంతో కూడినదీ అయిన జలధి అనే వాహనం మీద వరుణుడూ, పౌండ్రక అనే పేరు గల భీషణమైన మహిషం మీద యమ ధర్మ రాజూ. యీ విధంగా ఎవరెవరి వాహనాల మీద వారు అధిరోహించి ముక్కంటిని ముందుంచుకొని అంధకాసురుడిపై మోహరించి నిలిచారు.

# భైరవ కుజోద్భవం- అంధకాసుర వధ

రాక్షసులు కూడా వారి వారికి తగిన ఆయుధ వాహనాదులతో చేరారు. ప్రహ్లాద, విరోచన, కుంభకర్ణ శంఖు కర్ణ, హయగ్రీవ, మయాసుర, దుందుభి, అయశ్శృంఖ శంబరాది రాక్షస ప్రముఖులంతా రణోత్సాహంతో దేవతలపై దుమికారు. అతిలోక భీషణమైన ఆ యుద్ధంలో భక్తుడైన అంధకుడి ముందు భగవంతుడైన యీశ్వరుడు బలహీనుడు గాక తప్ప లేదు. ఆ భక్తి భగవానుల భయంకర సంగ్రామం చూడడానికి గాను సర్వ దేవ దానవులూ స్తబ్ధులై నిలబడి పోయారు. సైన్యాలు యుద్ధంమాని అంధక, యీశ్వర సమర విన్యాసాల చూడడంలో మునిగిపోయారు.

ఆ ఘోర యుద్ధంలో శివుడు విపరీతంగా అలసిపోయి చెమటలు క్రక్కసాగాడు. ఆ చెమట నుంచి రక్తం కారుతూ జన్మించింది ఒక కన్యక. ఆమె పేరే చర్చిక. ఆ సమయంలో అంధకుడు హరకరస్థితమైన శూలాన్ని లాగికొని దానితోనే శివుడి శిరస్సు మీద మోదాడు. రజితాద్రివాసి తల నుంచి రక్తం ధారలు ధారలుగా ప్రవహించసాగింది. వాటిలో ఒక ధార నుంచి – అగ్ని తేజుడు, పద్మ మాలాలంకృతుడూ అయిన విద్యా రాజా అనే భైరవుడు ఇంకొక ధారనుండి శూలాస్త్ర ధారి అయిన రుద్రుడు అనే భైరవుడు పుట్టారు.

వేరొక రక్త ధార నుంచి- చండ, కపాలాది భైరవులు నలుగుర ఆవిర్భవించారు. భూమిని పడిన రక్తంలోంచి లలిత రాజా శూలధారియైన భైరవుడు- వీరందరికి అతీతంగా విఘ్న రాజా అనే యెనిమిదవ భైరవుడూ ప్రభవించాడు. ఒక చెమట బిందువు భూమిపై నుండి అందులోంచి ఒక బాలకుడు ఆవిర్భవించాడు. అతడు అంధకుని రక్తం త్రాగసాగేడు.

శివుడందులకు గాను అనుగ్రహ చిత్తుడై బాలకా! "నీవు గ్రహమూర్తివై లోకాలకు శుభములు కూర్చెదవు గాక' అని వరమిచ్చాడు. ఆ వర ప్రభవంతో ఆ బాలకుడే అత్యంత ప్రభావ సంపన్న గ్రహంగా పరిణమించాడు. ఆ గ్రహమే కుజుడు లేదా అంగారకుడు.

"ఓం॥ ధరణీ గర్భ సంభూతం విద్యుత్కాంతి సమ ప్రభం
కుమారం శక్తి హస్తంచ- తం మంగళం ప్రణమామ్యహం."

ఏత దనంతరం- హరుడు వేయి ఫంవత్సరాలపాటు తన నేత్రానలజ్వాలలతోనూ, సూర్య తేజంతోనూ అంధకుణ్ణి నిస్సారునిగా శుష్కంప చేసేశాడు. శివ తేజ తాపం వలన సారహీను డవడం అలా వుంచి అంతకు ముందే పాప హీనుడయ్యాడు. పాపం నశించగనె రూపం మారి దేవతా మూర్తిత్వం యేర్పడింది. దేవత్వం అలవడగానే అంధకాసురుడు తన తామస గుణాన్ని విడిచి శివుణ్ణే శరణు కోరాడు. శివుడాతనికి నచ్చ చెప్పి లోక సంగ్రహణార్థం అతనిని వధించాడు.

# సుకేశుని వృత్తాంతము

నారద మహాముని శివుడి బ్రహ్మ హత్యాదోష నివారణమగు మహాక్షేత్రము గురించి చెప్పావు. ముందు చరిత్రము విన్పిపుమనగా సుకేశుడి చరిత్రను వినుడని ఇట్లారంభించెను. విద్యుత్కేశుడను రాక్షస రాజునకు సుకేతుడు కుమారుడు. వాడు శివుని గురించి మహాతపము గావించెను. శివుడు ప్రత్యక్షంకాగా "మరణము లేకుండా శత్రు జయము పొందు వరమివ్వమనగా," శివుడు ధర్మమునందు బుద్ధి కూడ యుండునని వరమిచ్చెను. అతడు సద్బుద్ధి గలవాడై మగధ రాజ్యములోని మహర్షులను జేరి తన సందేహము గూర్చి ప్రశ్నించగా, వారు"ఇహపరములు ధర్మము

వలన వచ్చు ననియు సజ్జనులు ధర్మాత్ములను పూజింతు రనియు ధర్మాత్ములు సౌఖ్యవంతులగుదు రనియు యజ్ఞ యాగాద్యాచరణ, హరి పూజనము, శాంతము ధర్మము, పరోపకారము, బ్రహ్మచర్యము, అతిథిపూజ, బ్రాహ్మణ భక్తి యివి యన్నియు ధర్మములు. మనుజులు వసించు ద్వీపములో జంబూ ద్వీపము ప్రశస్తమైనది. శ్వేత ప్లక్ష ద్వీపము, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, ద్వీపములలోని వారు దేవతాసములు. పుష్కర ద్వీపవాసులు భయంకర రూపులు. ధర్మవిదులుండని చోటులందు మహానరకము లున్నవి. అవి యిరువయ్యెనిమిది రకములుగా నున్నవి. చతురాశ్రమములు నడుపుచు జీవ యాత్ర సాగించిన వారు, పుణ్యాత్ములగుదురు"అంటూ సుకేశునకు సమస్త ధర్మములు మహామునులు విన్పించిరి. వారి బోధలను విని యాతడు పరమానందమందెను. తరువాత శివుడిచ్చిన వరము ననుసరించి ధర్మ మార్గమున నడచుచు సుఖముగా జీవ యాత్ర సాగించెను.

# అరజా-దండుడు చిత్రాంగద గొలుసు కథ

పులస్త్యుడు- అంధక వృత్తాంతము, భైరవోత్పత్తి కుజ గ్రహ ఆవిర్భావము మొదలైన విషయములు నారదుని ద్వార విని సంతసించినవాడై- అరజ, దండుడు అనే వారి కథ వినిపించుమని కోరాడు. నారదుడు చెప్పసాగాడు.

పూర్వం దండుడు అనే రాజు వుండేవాడు. అతని పురోహితుడు భార్గవుడి పౌత్రి అయిన అరజను మోహించాడు. (భార్గవుడి కొడుకు -శుక్రుడు అతని కూతురు అరజ) ఒకనాడా రాజా కన్యనే కాంతముగా కలిసి తన మనసు తెలియు చేశాడు. తన కోరిక తీర్చమని అడిగాడు. అరజ అంగీకరించలేదు."మానాన్నగారు వచ్చే సమయం అవుతోంది. నీ కోరికను

అయునతో చెప్పు. ఆయున నన్ను నీకు ఇస్తే నీ కోరిక తీర్చుతానంది. దండుడా మాటల్ని ఖండిస్తూ "వెర్రిదానా! యిలాంటి విషయాలలో వయస్సులో వున్న వాళ్లం మనం నిర్ణయించుకోవాలే గాని.- పెద్దవారి ప్రమేయం ఎందుకు? ఉదాహరణకి- విశ్వకర్మ కూతురైన చిత్రాంగద కథ చెబుతాను విను" అంటూ చెప్పనారంభించెను.

త్రిలోక సుందరిగా పేరు పొందిన చిత్రాంగద జలక్రీడలాడుతుండగా, సురథుడు అనే వాడు ఆమెను చూశాడు. ఆమె కూడా అతనిని చూసి మోహించింది. తన వాంఛ తీర్చమని కోరింది. అతనంగీకరంచలేదు. చిత్రాంగద చిన్నది గనక ఆమె తండ్రి యాజ్ఞ లేకుండా అలా చేయడం దోషమని చెప్పాడు. కాని, ఆమె ఆతని మాటలను వినకుండా అతనిని మొగమాట పెట్టి మరీ సంగమించింది. కాబట్టి స్వదేహవయో సుఖానుభవానికి పెద్దల ప్రసక్తి లేదు"- అని దండుడు చెప్పింది విని, అరజ యిలా అంది. "ఓ రాజా! నువ్వాకథని కొంత వరకే చెప్పావు. నీ వాదాన్ని సమర్థించే మేరకే చెప్పి, తక్కింది వదిలివేస్తే యెలా? ఆ తర్వాత జరిగిందేమిటో నేను చెబుతాను విను.

"కన్న కూతురు కాముకియై -తన అనుమతి లేకుండానే సురథుడితో సురతక్రీడ లాడిందన్న వార్త తెలిసి - ఆమె తండ్రి యైన విశ్వకర్మ వ్యాకులుడై పోయాడు. చిత్రాంగదకి పెండ్లి కారాదనీ, పిల్లలు పుట్టరాదనీ, సుఖాలకి దూరమై పోవాలనీ, పతితగనే మిగిలిపోవాలనీ శపించాడు. ఆ శాపతీవ్రత కామె వణికి పోయింది స్పృహ తప్పి పడిపోయింది. చెలికత్తెలు ఆమె చనిపోయిందనుకొని ఆ శరీరాన్నలాగే వదలిపెట్టి వెళ్ళిపోయారు. కర్మావశాన ఆ కళేబరం సరస్వతి నదిలో బడి కొట్టుకుపోయింది. అందులోంచి గోతి లోకి వెళ్ళింది. ఇలా పడరాని పాటు

పడింది అంటే కారణం ఏమిటి? తండ్రి యాజ్ఞ లేకుండా తమకం తీర్చుకోవడమే కదా! కాబట్టి "అలాటి పనులు నాకు చెప్పకు. నా తండ్రి వచ్చే దాకా ఆగు, ఆయునను అర్థించి, స్వీకరించు" అన్నది అరజ. దండుడు నవ్వి "కన్యా మణీ! కష్టాలు కలకాలం వుంటాయా? కష్టానికి భయపడి సుఖాన్ని దూరం చేసుకుంటామా? తండ్రి ఆగ్రహానికి ఎరయ్యె ఆమె కష్టాల పాలవడం వరకే చెప్పావు. తక్కిన కథ నేను వివరిస్తాను. శ్రద్ధగా విను" అని చెప్పసాగాడు.

"సరస్వతీ నదిలోంచి, గోమతీ నదిలో పడిన చిత్రాంగద ఒక అరణ్య ప్రాంతం చేరింది. అక్కడున్న గుహ్యాకుడు ఒకడు ఆమెను కృష్ణుడి వద్దకు తీసుకు వెళ్ళాడు. కృష్ణుడి ఆదేశానుసారం ఆమె శ్రీకంఠాలయంలో స్వామిని అర్చించసాగింది. అక్కడ ఆమెకు ఋతధ్వజాడు కలసి "అఖండ గోదావరీ మండల ప్రాంతం లోని హాటకేశ్వరుణ్ణి కొలువ"మని చెప్పాడు. చిత్రాంగద అలాగే హాటకేశ్వరుణ్ణి సేవించింది. గోదావరిని సేవించింది. హాటకేశ్వరుడు ఆమె శాపాన్ని తొలగించి, పునః సురథునితో కలిసేలా చేశాడు. వాళ్ళిద్దరూ ఏ ఆపదా లేకుండా కలకాలం సుఖంగా జీవించారు. అందుచేత, ఆందకత్తెవైన ఓ అరజా! నీ తండ్రి ప్రమేయం లేకుండా నువ్వు నా మాట నంగీకరించు. అంతగా కష్టంగా వస్తే గోదావరి లేదా? హాటకేశ్వరుడు లేడా? అన్నాడు.

అరజ అంగీకరించలేదు. దండుడు తన మదనాతురతను అణచుకోలేక ఆమెను బలాత్కరించబోయి శుక్రాగమనాన్ని తెలుసుకొని అప్పటికి పలాయనం చిత్తగించాడు. భీతగాత్రీ, దుఃఖ నేత్రి అయివున్న ప్రియ పుత్రి అరజను చూచిన భార్గవ పుత్రుడు "కారణమేమిట"నో అడిగాడు. దుఃఖం తాలూకు ఎక్కిళ్ళతో గద్గద స్వరంతో అంతా వివరించింది అరజ.

ఆగ్రహించిన శుక్రాచార్యుడు "నాటికి యేడవ నాటికి దండుడు దగ్ధమౌవుగాక" అని శపించాడు. అది తెలిసి, రాక్షస రాజా బంధువులంతా పరుగున వచ్చి క్షమించమని కోరారు. శుక్రుడందుకు అంగీకరించలేదు. శుక్రుని శాపానుసారం వారం తిరిగే సరికల్లా దండుడు నిలువునా దగ్ధం అయిపోయాడు. అతని కథనంతా అంధకుడికి చెప్పారు. అంధకుడు మత్తత విడవకుండా ఆ జగ దంబయైన పార్వతినే తప్ప అన్యకాంతలను వొల్లనన్నాడు. అప్పుడతనికి దేవి ప్రభావాన్ని వినిపించారు.

# బలి చక్రవర్తి -వామనుడు

ఇట్లు నారదుడు చెప్పగా వినిన పులస్త్య మహాముని యింకను విచిత్రములగు పరమేశ్వర కథావృత్తాంతములను వినిపింపుమని ప్రార్థింపగా, నారదమహాముని "హిరణ్యకశిపుని చరిత్ర మెరుగుదువు గదా! వాడికి ప్రహ్లాదుడు కుమారుడు. వాడి పుత్రుడు విరోచనుడు. ఆ విరోచనుడికి బలి చక్ర వర్తి కుమారుడు. బలి చక్ర వర్తియైన తరువాత దుర్మార్గులగు యమశంబరులను, రాక్షస యోధులను జయించి ధర్మ యుక్తంగా రాజ్యము పాలించుచు, ప్రజలను పాపములనుండి తప్పించి పుణ్యమార్గములో నడచునట్లు చేయుచుండెను.

ఇట్లాతని రాజ్యమంతయు ధర్మము, నీతి, దైవ బలము కలిగి పెంపొందసాగెను. అతని యోగము ననుసరించి బలి సభా భవనమునున్న ఒకానొక సమయములో కమలముల చేతులలో నుంచుకొని మహాలక్ష్మీ దేవి ప్రత్యక్షమై "ఓ బలి చక్ర వర్తీ! నీవు తాత ప్రహ్లాదుని కీర్తి నిలబెట్టినావు. ధర్మయుక్తంగా రాజ్యము చేయుచున్నావు. నీ ధర్మగుణములను మెచ్చుకొని నీ వద్ద కొన్నాళ్ళు నివసింప వచ్చినాను. మీరందరు సమస్తైశ్వరములతో

తులతూగుడు' అని వరమిచ్చి మాయమయ్యెను. దానితో బలికి, పూర్వముకన్న బలము పెరిగి అమరావతిపై దండెత్తి దేవ రాజ్య మాక్రమించి, ప్రభుత్వం సాగించుచుండెను. దానవుల వలన నోడింపబడిన దేవతలు దారిలేక విచారముతో బ్రహ్మదేవుని చేరి మొరలిడిరి. అతడు"మీ తండ్రి కశ్యపుడు మేరుపర్వతము పై తపమాచరించు చున్నాడు మీ పాట్లాతనితో చెప్పుడని పంపగా వారాతని కలుసుకొనిరి. అతడు అదితి నాశ్రయించు డని హెచ్చరించెను. వారు అదితిని కలుసుకొని అమ్మా! నీవు దీక్షతో శ్రీహరి నాశ్రయించి మమ్ముద్ధరించు మని ప్రార్థించిరి.

ఆ నిమిత్తముగా దేవమాతయగు అదితీ దేవి పాల్గుణ శుద్ధ పాడ్యమి మొదలు పండ్రెండు రోజులు పయోభక్షణ వ్రత దీక్షతో శ్రీహరిని ఆరాధించసాగెను. దీక్షానంతరము శ్రీహరి నిజరూపముతో దర్శనమిచ్చి "అదితీ! నీ కోర్కె తీర్చెదను. నీ పుత్రులకు రాజ్యమిచ్చెదను నీ గర్భమున కుమారుడనై పుట్టెద'నని వరమిచ్చి మాయమయ్యెను. నారాయణు డదితి గర్భములో తన తేజముతో వృద్ధి చెందు చుండెను. దేవతలు పరమోత్సాహముగా నుండుట చూచి బలి చక్రవర్తి యనుమానించి. తన తాత ప్రహ్లాదుని చేరి "తాతా! దేవ రాజ్యము, రాక్షస రాజ్యము నే నాక్రమించి యుండగా దేవతలెందుకో ఉత్సాహముతో నున్నారు. కారణము చెప్పుమనెను.

ప్రహ్లాదుడు దూరదృష్టితో చూచి"బలీ ! నీవు దేవ రాజ్యమును వదులుట మంచిది. శ్రీహరి యదితి గర్భములో జన్మించునున్నాడు. నీకు ప్రమాదము వచ్చును అనెను. బలి నిర్లక్ష్యంగా"ఏమీ! శ్రీహరి యంతవాడా? నాసైన్యము, సైన్యాధిపతులు, యింకా మహావీరులున్నారు. మమ్మల్నా హరి యేమి చేయగల" డని ధిక్కరించి మాట్లాడుట విని ప్రహ్లాదుడు కోపింగించి

"ఓరీ! నన్ను కాదన్నావు గనుక నీ కనతి కాలంలోనే రాజ్య భ్రష్ట యోగము తప్ప"దని శపించెను. ఆ శాపమునకు బలి గడ గడలాడి తాత పాదములు పట్టుకొని నమస్కరించి యిట్లనెను. "తాతా! చిన్నవారు నేరచియో నేరకయో యేమో మాట్లాడితే పెద్దవారు వాటిని పాటించి యాగ్రహము చెందుట తగునా? నాకు శాపమోక్షము జరుగు వుపాయమాలోచించి తెలుపుమని దీనముగా ప్రార్థించెను. మనుమని ప్రార్థనము విని జాలిపడిన ప్రహ్లాదుడు "బలీ! నాకంటే శ్రీహరికే దయ యెక్కువ, నీవు నేటినుండి శ్రీమన్నారాయణ భక్తిని పెంచుకొనుము. నారాయణ ప్రీతిగా కార్యము లాచరించుము. స్వార్థము వదలుము. నీకు మేలు బాటచూపి, నిన్నాతడే రక్షించు" నని హితము చెప్పెను. నాటినుండి బలి శ్రీహరిని ధ్యానించుచు మహాక్రతువులు గావించుచు, ఎడతెరపిలేని దానధర్మలాచరించు గొప్పదాతగా కీర్తిని సంపాదించుచుండెను.

ఇక యిటు నారాయణుని తేజము ధరించిన అదితీదేవి మిగుల కాంతితో ప్రకాశించుచుండెను. నవమాసములు నిండిన పిదప యదితి గర్భములోనుండి విష్ణుతేజము శంఖ, చక్ర, గదా పాణియై పీతాంబరధారియై యీవలకువచ్చి "అవ్వా! నీవు గతజన్మలో నన్ను పుత్రునిగా పుట్టుమని కోరియున్నావు. ముమ్మారు పుత్రుడగునట్లు నీకోరిక నాకు తట్టగా సమ్మతించి యిప్పుడు నీ శరీరమునుండి నీ తేజమును రూపొందించితిని. నీ మనస్సులోని దిగులును తీర్చెదను. నీ సంతానమునకు మరల రాజ్యాభిషేకము జరిగించెదను విచారించకు" మని యామెనోదార్చి తన యుభయ హస్తముతో దీవించి ఆమెను పుత్ర ప్రేమ యను మాయలో నుంచ దలచి, ఆ తేజోరూపము నుపసంహరించుకొని మాయా మానవ రూపము–వామనాకృతి ధరించి అతిదియొడిలో గూర్చుండెను.

ఆమెయు ఆ బాలకుని కొంతసేపు ప్రేమతో చూచి లాలించి, ముద్దాడి, ఎంతయో పొంగిపోయెను. అప్పుడా పొట్టి వాడు తల్లితో "అమ్మా! నీవు పూజనీయురాలవు. నాకుపనయనము చేయించి నన్ను వదలుము. నీకు నా ప్రజ్ఞ తెలయగలదు. నాకు వేద గానము చేయు బుద్ధి గల్గుచున్న" దనెను ఆ సమయములో కశ్యపుడు తన భార్య వద్దకు వచ్చి విషయ మెరిగి ఆ పొట్టి కుమారునకు ముద్దుగా ఉపనయనము గావించెను. దేవగణములు, బ్రహ్మర్షులు దేవఋషులు, ప్రజాపతు లుపనయనము చూడవచ్చిరి. వారిలో బ్రహ్మదేవుడు వటునకు జపమునకు తగిన వస్తువులను, లేడి చర్మమును బహూకరించెను. మరీచి దండమును, గురుడు యజ్ఞోపవీతమును, మౌంజీ బంధము, నంగీరసుడు, కమండలము వసిష్ఠుడు యింకా మిగిలిన వారు కౌపీనాదిక యితర బహుమతులు యిచ్చిరి. ఉపనయనమునకు బ్రహ్మయే బ్రహ్మత్వము వహించి సర్వము నడపెను. అతడు చదువుకొనవలెనా. గురు శుశ్రూష కావలయునా? "బ్రహ్మ శ్రీ గురుభ్యోనమః" అనుట తరువాయిగా చిత్రముగా ఆ మాయా వటువు నాల్గు వేదములు ఘన, జట, పనసలతో సహా గానము చేయసాగెను. తరువాత కొనాళ్ళు తల్లిదండ్రుల వద్ద ముద్దుగా సంచరించి మహానందము గూర్చెను.

అనంతర మొకనాడు "తల్లి తండ్రులారా! మీ యనుగ్రహముతో దేహమును నాకొసగితిరి. నన్ను గన్నందుకు మీకానందము చూపుటయే కువారుని విధియని యెరిగితిని. నేను ప్రజ్ఞావంతుడనై పది మంది మెచ్చునట్లు రాజసభలకు పోయి నాప్రజ్ఞాపాటవములు ప్రదర్శించి రాజ సన్మానములు గ్రహించి నప్పుడు మీ రెరుగునట్లు చేయుట పుత్రుడనైన నా విధి. అందుచే ధనవంతులున్న ప్రదేశములకు వెళ్ళి ధనమార్జించుకొని వచ్చెదను. దీవించి పంపుడని" కోరెను. వారానందించి బాలుని దీవించి మళ్ళీ రమ్మని సాగ నంపిరి.

# యాగ భూమి - వామనాగమనము

అలా బయలు దేరిన వామనుడు సరాసరి బలియాగ భూమికి చేరాడు. ప్రజాసమూహంలో బడి సందు చేసికొనుచు సాగి నడుచుచుండెను. మాయా మానవ వటుడైన ఆహరి వేషము చూచి ఆకర్షింపబడని వారొక్కరునూ లేరు. వారందరూ విస్తు పోయి ఆ బాల రూప బ్రహ్మతేజోగర్భుని పదేపదే చూడసాగారు. వారిని దాటి, క్రమముగా యజ్ఞశాలను సమీపించి, వేదములను ఋత్విక్కులతో చదువుచు, సామ వేదమును గానము చేయుచు, వేదములో జటలు చెప్పుచు ఘనాపాఠీలతో ఘనపనసలు వల్లించుచు, తర్క వ్యాకరణములు విడదీయుచు, వ్యాకరణ శాస్త్ర ప్రశంసలు చేయుచు, నవియు నివియు ననక యందరితో నన్నిటితో తన ప్రజ్ఞను చూపించుచు "ఇంతటివాడు" లేడనిపించి నమస్కారములు గొనుచు క్రమముగా బలిచక్రవర్తి యున్న ప్రదేశమును జేరి ప్రశస్తమగు తన దక్షణ హస్తమును సాచి రాజును దీవించెను.

ఈ మహనీయుని చూచి, యా చక్రవర్తి రమ్మని పిలిచి యుచితాసనమిచ్చి కూర్చుండ జేసి నానా విధముల మర్యాదలు కావించి యిట్లనెను. "ఓ బ్రాహ్మణోత్తమా! నీదే దేశము? ఎవరి బిడ్డవు? నీకేమి కావలయును? బ్రహ్మచారి వలె నున్నావు. చక్కని కన్యను వివాహమాడుదువా? వివాహము చేయించనా?" యని యనేక విధముల ప్రశ్నించెను. అతడు "నేనొంటి వాడను. తల్లి తండ్రులు లేరు. నాకెవరునూ కారు. నేనందరికి నగుదును. ఇది వరలో లక్ష్మి యుండెడిది గాని, యిప్పుడు లేదు. నేను బ్రహ్మచారిని, గేస్తును గాను. కావున నాకుండుటకు మూడడుగుల నేల యిప్పించిన చాలు" ననెను. ఆ మాట విని"చాల పసి వాడివి గాబట్టి నీ వడుగ నేరకున్నావు. నేనిచ్చు వాడ నుండగా నీకెందుకు సిగ్గ"నెను. "నాకాశ లేదు మూడడుగుల నేల చాలు నని తృప్తి చూపించి

వామనుడడిగెను. రాజు సమ్మతించి భార్యతో సువర్ణ కలశము నిండా జలము తెప్పించి, బంగరు పళ్ళెములో వామనుని కాళ్ళు పెట్టించి, మూడడుగుల నేల ధార పోయ నెంచగా శుక్రాచర్యులు "దానమీయవలదు. ఈ మాయారూపధారి శ్రీహరి"యని చెప్పెను. బలి యా మాటలు వినక తను మాట తిరుగనని చెప్పి ధారపోయు సమయంలో శుక్రుడు చెంబు కొమ్మున కడ్డుపడెను. శ్రీహరి దర్భపుడకతో వాని కన్ను గ్రుచ్చి వాని యడ్డు తప్పించి రాజుచే ధార గొనెను. పిమ్మట వామనుడు త్రివిక్రముడై – యెదుగ సాగెను.

రాజు చూచుచుండగానే వామన మూర్తి చిత్రముగా భూమి నాక్రమించి, యాకాశము దాటి స్వర్గమాక్రమించెను. రెండు లోకములు రెండు పాదములతో నాక్రమించి బలితో 'మూడవ పాదమునకు చోటు చూపు'మనెను. బలి ఆ మూడవ పాదము తన శిరసు పై పెట్టుమనగా నాతడట్లే చేసి బలిని పాతాళమునకు పంపెను. ఈ విధముగా బలి చక్రవర్తి ప్రహ్లాదుని శాపముతో రాజ్యభ్రష్టత పొందెను." అని యిట్లు చెప్పిన తరువాత కురుక్షేత్ర మహిమ వర్ణించి, అటు "పై దేవతలు సంతాన హీనులు సుమా! అన్నారు. అదెట్లో చెప్పుమని మునులడుగగా సూతుడిలా చెప్పాడు.

# దేవతలకి పిల్లలు పుట్టరు

పెండ్లయిన కొత్తలో – పార్వతీ పరమేశ్వరు లిద్దరూ కామ కేళి లాలసులై మందర గిరిపై సంచరించసాగారు. ఊర్ధ్వరేతస్కుడైన శివుడి వీర్యం వల్ల జనించబోయే బిడ్డ – సర్వదమనుడవుతాడనే భయంతో, గౌరీశంకరుల కేళికి అడ్డు తగలమని అగ్నిని పురమాయించారు దేవతలు. అది దంపతుల సురతం రసపట్టులో వుంది. శివతేజంతో తాను తల్లి కావాలనే సంకల్పంతో పార్వతి ముద్దులు గూర్చేబాలుడి రూపాన్ని వూహించుకోసాగింది. శివుడు రేతస్కలనం చేసే సమయం చేరువైంది. అదే అదనుగా అగ్ని హంస

రూపంతో వారి చుట్టూ చెక్కర్లు కొట్టాడు. కేళి తడబడింది ఇంతలోనే దేవతలు మందిరద్వారం వద్ద తీవ్రమైన ధ్వనులు చేశారు. దాంతో రమణ విరమణులై పోయారు ఆది దంపతులు. ఈశ్వరుడు మందిర ప్రాంగణానికి వచ్చి దేవతలను విషయం అడిగారు. వారాయనను కామ కేళీ విముఖుడవు కమ్మని" కోరారు. "సరే అన్నాడు శివుడు. కాని అప్పటికే కేళ్యంత్యావస్థలో వుండటం వల్ల తన తేజాన్ని భరించుకోమన్నాడు. సర్వభుక్కయిన అగ్ని ఆ భారాన్ని వహించడానికి అంగీకరించి శివ వీర్యాన్ని త్రాగి వేశాడు. శివుడు మరలి వెళ్ళి పార్వతిని కలిసి విషయం వెల్లడించాడు. పుత్ర వాంఛాతప్తయై వున్న ఆమె, దేవతలు చేసిన పనికి దుఃఖించింది. అలిగింది. ఇంక నుంచి "మీ దేవతలెవ్వరికి పుత్రులు కలుగ కుందరు గాక అసలు పుత్రులే కాదు, సర్వ దేవకోటి నిస్సంతులగుదురు గాక" అని శపించేసి వడివడిగా కైలాసాన్ని చేరి తాపోపశమనార్థం స్నానానికి వెళ్ళింది.

## వినాయక జననం

సర్వ సుగంధ ద్రవ్య లేపనాలన్నిటిని సమకూర్చారు చెలులు. కాని, పార్వతి మనస్సులో మాత్రం కేళి చివరలో కదలాడిన పసినిసుగు రూప ఒక్కటే మెదలసాగింది. ఆర్త హృదయుయైన ఆ భువనాంబిక, వంటి నలుగైన సర్వ సుగంధ ద్రవ్యాలతోనూ తన వూహలో నున్న బాలుడి బొమ్మను చేసింది. ఆ బొమ్మను చూసుకొని తన దురదృష్టానికి విలపిస్తూ గుండెల కదుముకుంది. అదుముకోగానే ఆ జగన్మాతకు పాలు పడ్డాయి. అబ్బురపడిన ఆ తల్లి పుత్ర కామన నోపలేక తత్ క్షణమే ఆబొమ్మకు ప్రాణ ప్రతిష్ఠ చేసింది.

అంతటితో ఆ బొమ్మ కాస్తా అమ్మ వారి వూహాలలో మసలిన మహా సౌందర్య వంతుడైన బాలకుడయ్యాడు. అంబ ఆ బాలునికి స్తన్యమిచ్చింది. జగదంబా స్తన్యం వల్ల పసిబిడ్డ సద్యో వేళనే మరిచిపోయినదై ఆ బిడ్డను శివునకు

అప్పగించాలని ఆత్రుత పడింది పార్వతి. శివదర్శనార్థం అలంకరించు కోదలచి బాలకుణ్ణి చూసి "నాయనా! నీవు వెళ్ళి స్నానశాల వెలుపల కాపలా వుండు. పర పురుషులను లోనికి రానీయకు" అని చెప్పింది. అంబాస్తన్యపాన శక్తి మంతుడైన ఆ బాలకుడు చేతిలో ఒక క్రీడా శూలాన్ని ధరించి స్నాన శాల వెలుపల కావలి కాయసాగాడు.

అమ్మ వారి కోపం తగ్గడం కోసం కొంత సేపు ఎక్కడెక్కడో మసలి – కైలాసానికి వచ్చాడు శివుడు. పార్వతి స్నాన వార్త తెలుసుకొని అటు పోబోగా పార్వతీ తనయుడు శివుణ్ని నిరోధించాడు. సమస్త సృష్టిని శాసించే తననే ఆపబోతున్న ఆ బాలకుడిపై కినిసి, శూలంతో అతని తల నరికి వేశాడు రుద్రుడు. అప్పుడే స్నానాలంకారాదులన్నీ పూర్తి చేసుకుని వెలికి వచ్చిన గిరిజ– జరిగిన ఘోరం చూసి ఘొల్లు మంది. "సృష్టినే కీలు బొమ్మగా ఆడించే ఓ వల్ల కాటి వేలుపా! నేనేదో ముచ్చట పడి చేసుకున్న ఈ బొమ్మను కూడా దక్కనివ్వవా? నాసృష్టి కూడా నువ్వే నశింప చేస్తావా?" అని నిష్ఠురమాడుతూ నిలిచిన పార్వతి వేదనను అర్థం చేసుకున్నాడు శివుడు.

వెంటనే ప్రమథులను పిలిచాడు. "బాలకుడి శిరస్సు వుత్తర దిశగా పతనమైంది గనుక, ఉత్తరదిశగా తలనుంచి శయనించిన ఏదో జీవి తలను తెగనరికి యైనా సరే తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు. స్వర్గలోకంలో ఇంద్రవాహనమైన ఐరావతుడి కొడుకు ఉత్తర దిశను తలనుంచుకొని శయనించి యుండగా చూశారు, ప్రమథులు. దాని తల నరక బోగా ఇంద్రుడు వారిని వారించాడు. ప్రమథులకి వారికి పోరు జరిగింది. ఆ పోరిలో నడుమ నున్న ఏనుగు యొక్క ఒక దంతం విరిగిపోయింది. అయినా లెక్క చేయకుండా ప్రమథులు ఆ యేనుగు తల నరికి తెచ్చి శివుడికిచ్చారు. శివుడా శిరస్సుని బాలకుని మొండేని కతికించారు. ఏకదంతుడయ్యాడు.

అతనిని గణపతిగా దీవించారు శివుడు. ఈ వార్త లోకాలకూ తెలిసింది. అందరూ వచ్చి ఆ బాలకుడ్ని దీవించారు పురస్కరించారు. అతడే వినాయకుడు. సర్వ విఘ్నాలకు అధిపతి. ఆయనే మన కార్యక్రమాలకు యెట్టి విఘ్నములూ కలిగించకుండుగాక! ఆయనకు నమస్కారము. ఒక నాడు వినాయక, కుమార స్వాముల నడుమ వివాహ ప్రసక్తి వచ్చింది. తన పెళ్ళి ముందని అన్న దమ్ము లిద్దరూ తగవులాడుకుని తల్లి దండ్రులైనా పార్వతీ పరమేశ్వరుల వద్దకు వెళ్ళారు. ఒకరు సర్వం సహా సమస్త గణాధిపతి; మరొకరు దేవసేనాధిపతీనాయె. సమస్యయెలా తీర్చాలా అని ఆలోచించి చివరికిలా అన్నారు. పార్వతీ పరమేశ్వరులు.

# వినాయకుడి వివాహం

"మీలో ఎవరు ముందుగా భూప్రదిక్షణం చేసి వస్తారో వాళ్ళకే ముందుగా వివాహం జరుగుతుంది.

ఆ మాట వినగానే కుమార స్వామి తన నెమిలి వాహనం మీద భూప్రదక్షణార్థం వెళ్ళి పోయాడు. వినాయకుడెలాగ? అసలే గుజ్జు రూపం. పైగా ఆయన వాహనము మెల్లగా వెళ్ళే యెలుక పిల్ల. ఏమి చేయడమా! అని ఆలోచించి ఒక నిశ్చయానికి వచ్చాడు. వెంటనే వినాయకుడు పార్వతీ పరమేశ్వరులను ప్రక్క ప్రక్కనే కూర్చుండ బెట్టి, వాళ్ళకి ముమ్మారు ప్రదక్షిణం చేసి నియమం ప్రకారం"మీరు నాకు వెంటనే వివాహం జరిపించండి" అని కోరాడు. తెల్లబోయారు. ఆది దంపతులు. భూప్రదక్షణము కదా! పందెం? అని అడిగారు. నిజమే వ్ళదువుగా చెప్పసాగాడు గణపతి కాని, "తల్లి దండ్రులకుప్రదక్షణం వల్ల భూప్రదక్షణ ఫలం గలుగుతుందని కదా పెద్దల వాక్కు. మీరు నాకే గాక సర్వ జగత్తుకూ మాతా పితలు కాబట్టి మీకు ముమ్మారు ప్రదక్షణ చేసాను ముందు నాకు పెండ్లి చేయండి" అన్నాడు.

వినాయకుని బుద్ధికుశలతకు మెచ్చుకొని తక్షణమే పెండ్లి తల పెట్టగా ఆయన యుక్తికి ముగ్ధుడైన విశ్వరూపుడు అనేవాడు సిద్ధి - బుద్ధి అను తన యిద్దరు కూతుళ్లనీ వినాయకుని కిచ్చి కన్యాదానము చేశాడు.

# వామన జయంతి

అది విన్న నారదుడు, వామన జయంతి మహాత్మ్యం వినిపించుమని కోరాడు. పులస్త్యుడు చెప్పసాగాడు. భాద్రపద శుద్ధ ద్వాదశి శ్రవణా నక్షత్రంలో విష్ణువు వామనుడిగా అవతరించాడు. అంతకు ముందు రోజు పరివర్తన యేకాదశి. ఈ వామన ద్వాదశినాడు చేసే దానం అనంత పుణ్యాన్నిస్తుంది.

పూర్వం శాకల్య పురంలో సోమశర్మ అనే బ్రాహ్మణుడుండేవాడు. అతని జన్మ మొత్తంలో ఒకే ఒకసారి వామన ద్వాదశి నాచరించి కుండెడునీళ్ళు, కుండెడు పెరుగన్నం బ్రాహ్మణుడికి దానమిచ్చాడు. ఆ పుణ్యాని కతడు మరు జన్మలో కూడా బ్రాహ్మణుడిగా జన్మించి వామన జయంతి వ్రతం కూడా చేస్తూ ఉత్తరోత్తర జన్మలో షట్చక్రవర్తులలో ఒక డైన పురూరవ చక్రవర్తిగా అవతరించాడు. అందువల్ల వామన ద్వాదశీ (జయంతి) వ్రతం అత్యంత మహిమాన్వితమైంది.

ఇదీ వామన పురాణం అని ముగించాడు సూతుడు.

# వామన పురాణం సమాప్తం



# 15. కూర్మ పురాణము

శ్లో॥ "ఇదంతు పంచదశకం పురాణం కౌర్మ ముత్తమమ్!!"

అష్టాదశ పురాణాల్లో పదునైదవది కూర్మ పురాణం.

శ్లో॥ "కౌర్మం పృష్టం సమాఖ్యాతం"

అనగా శ్రీ మహావిష్ణువు యొక్క పృష్ట (వీపు) గా వర్ణింపబడినదీ కూర్మ పురాణం. పదునేడువేల శ్లోకాలలో పూర్వార్థంలో ఏబది మూడు ఉత్తరార్థంలో నలువది ఆరు కలిపి మొత్తం తొంబది తొమ్మిదధ్యాయా లిందున్నవి.

కూర్మ రూపంలో నున్న శ్రీ మహా విష్ణువే స్వయంగా దేవేంద్రుని సమక్షంలో మహర్షులకు ఉపదేశించిన పురాణమిది.

లక్ష్మీదేవి – ఇంద్ర ద్యుమ్నుల సంవాదం, విష్ణు, మహర్షుల సంభాషణ సృష్టి విధానం వర్ణన, ద్వాదశాదిత్య వర్ణన, హేమకూట పర్వత వర్ణన, అష్టాంగ యోగాలు, అశౌచవిధి, వానప్రస్థాశ్రమ మాహాత్మ్యము. యతి భిక్షా మాహాత్మ్యం, మొ॥ అంశాలెన్నో కూర్మ పురాణంలో చోటు చేసికొన్నవి.

మరీచి, భృగువు, అంగిరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, దక్షుడు, అత్రి, వశిష్టుడు ఈ తొమ్మిదిమంది బ్రహ్మ మానస పుత్రులని ప్రజాపతులనియు నవ బ్రహ్మలనియు ఈ పురాణం చెప్పుచున్నది.

పూర్వకాలం ప్రజానీకమంతా ఏ చీకూ చింతా లేని వారై, పరిశుద్ధాత్ములై స్వధర్మాచరణ గల్గియుండేవారు. ఆ తర్వాత కాల పరిణామంలో యుగ మాహాత్మ్యంగా రాగ ద్వేషాలు ప్రబలుచు వచ్చినాయని కూర్మ పురాణం వివరిస్తూ, ధర్మ ప్రాధాన్యత చెప్పింది.

శ్లో॥ "ధర్మాత్ సంజాయతే హ్యర్థో, ధర్మాత్ కామో భిజాయతే!
ధర్మ ఏవాప వర్గాయ, తస్మాద్ధర్మం సమాశ్రయేత్!!"

ధర్మం వలననే అర్థ కామ మోక్షాలు లభిస్తాయి. కనుక మానవులు సదా ధర్మాన్ని వదలకుండా ఆశ్రయించి, ఆచరించాలని కూర్మ పురాణం ధర్మాన్ని ప్రబోధిస్తున్నది.

**శివకేశవుల అభేదము :–** శంకరుడు మహాదేవుడనీ సృష్టి, స్థితి, లయ కారకుడనీ కూర్మ పురాణం వర్ణిస్తున్నది. పరమ శివుని మరో రూపమే శ్రీ మహావిష్ణువు. ఈ రహస్యాన్ని స్వయంగా విష్ణుదేవుడే ఇలా చెప్పాడని ఈ పురాణంలో వర్ణితం.

శ్లో॥ "సృజత్యేష జగత్ కృత్స్నం, పాతి సంహరతే తథా,
కాలో భూత్వా మహాదేవ : కేవలోనిష్కల శివపి!"

శ్లో॥ బ్రహ్మాణం విదదే పూర్వం, భవంతం యస్సనాతన:
వేదాంశ్చ ప్రదదౌతుభ్యం సోయ మాయాతి శంకర:

శ్లో॥ "అస్యైవ చాపరాం, మూర్తిం విశ్వయోనిం సనాతనీం!
వాసుదేవాభిదానం మామవేహి ప్రపితా మహ!!"

"ఓ బ్రహ్మ దేవా! పితామహా! ఈ లోకాల నెవడు సృష్టిస్తున్నాడో, రక్షిస్తున్నాడో మరియు నాశనం చేస్తున్నాడో, ఆ ఉమాధవుడైన పరమశివుడు వస్తున్నాడు. బ్రహ్మనైన నిన్ను కూడ పుట్టించిం దాయనే. వేదాల నీకు ప్రసాదించింది ఆయనే. విశ్వ స్థితి కారణమైన వాసుదేవాకారం (విష్ణు విరాట్స్వరూపం) అతనిదే!" అని పై శ్లోకాల భావం. ఈ విధంగా శివకేశవుల అభేదత్వాన్ని ఏకత్వాన్ని కూర్మ పురాణం ప్రబోధిస్తున్నది మనకు.

భగవద్భక్తు లేయే రూపాలతో అరాధిస్తే, ఆయా రూపాలతో శివుడే వారి వారి అభీష్టాల నెరవేర్చుతాడని యిలా చెప్పిందీ పురాణం.

శ్లో॥ "యం యం భేదం సమాశ్రిత్య, యజంతి పరమేశ్వరమ్।
తత్తద్రూపం సమాస్థాయం, ప్రదదాతి ఫలం శివ:॥

ఈ విధంగా శివ మాహాత్మ్యాన్ని కూర్మ పురాణం వివరిస్తున్నది. స్వధర్మాచరణ లేని వారి కెన్ని పుణ్య తీర్థాల సేవించినా ఫలం లేదట.

శ్లో॥ "య: స్వ ధర్మాన్ పరిత్యజ్య, తీర్థ సేవాం కరోతిహి
న తస్య ఫలతే తీర్థ, మిహలోకే పరత్ర చ॥

మన సమాజంలో కొందరు బాధ్యతా రహితులై వినోదానికై తీర్థయాత్రలు సేవిస్తుంటారు. ఇట్లు చేస్తే యిహ పరలోకాల్లో ఏలాంటి ఫలితముండబోదని కూర్మ పురాణం హిత బోధ చేస్తున్నది.

పరిసరాల పవిత్రతను లక్ష్య పెట్టని కొందరు దేవాలయాల్లోనూ ఉద్యానవనా ల్లోనూ, మల మూత్ర విసర్జన చేస్తుంటారు. అలాంటి వారు పాపానికి గురి కాగలరు. అందుకు ప్రాయశ్చిత్తం తప్పదనీ, కూర్మ పురాణం హెచ్చరిస్తున్నది.

ఈ పురాణంలో కాశీ క్షేత్ర మాహాత్మ్యం గూర్చి అద్భుతంగా వర్ణించిందీలాగున్నది.

శ్లో॥ పుణ్య క్షేత్రాభిగమనం, సర్వ పాప విశోధనమ్।
సర్వేషా మపి, చైతేషాం, తీర్థానాం పరమాపురీ॥
సామ్నాృ వారణసీ దివ్యా, కోటి కోట్యయుతాధికా।

కాశీ వంటి పుణ్య క్షేత్రాల సంర్శనం సర్వ పాప నివారకం. పుణ్య క్షేత్రాల్లో ప్రశస్తమైంది. కాశీ క్షేత్రమేనని ఈ శ్లోకం ద్వారా ప్రబోధిస్తున్నది.

వేద విభాగం చేసే వారందరూ వేద వ్యాసులనీ వీరు మొత్తం ఇరువది యారు మంది యున్నారనీ, పరాశరుని కుమారుడైన శ్రీకృష్ణ ద్వైపాయనుడు ఇరువది ఆరవ వాడని ఆర్యులు పేర్కొన్నారు.

సామాజికులలో కనీస కర్తవ్యాల్లో ఒకటి యిలా చెప్పబడింది.

శ్లో॥ "పంథాదేయో బ్రాహ్మణాయ స్త్రియై రాజ్ఞే హ్యచక్షుషే!
వృద్ధాయ భార భుగ్నాయ, రోగిణే దుర్బలాయచ!!"

మనం దారిలో నడిచేటప్పుడు మనకెదురుగా బ్రహ్మజ్ఞాన సంపన్నులు, స్త్రీలు, రాజులు, అంధులు, ముసలివారు, రోగిష్టులు బలహీనులెదురైతే వాళ్ళకు ముందుగా త్రోవ నిచ్చి నడవాలి. అంతే కానీ వారిని పడద్రోచి కొంటూ మనం నడువరాదని భావం.

*గురువుల దగ్గర ఎలా నడుచుకొనవలెను:–*

శ్లో॥ న పాదౌ సారయే దస్య సన్నిధానే కదాచన!
జృంభా హాస్యాదికం చైవ కంఠ ప్రావరణం తథా!!

ఎట్టి పరిస్థితుల్లోనూ గురువు గారి యెదుట కాళ్ళు చాపి కూర్చుండరాదు. ఆవలించరాదు. పరిహాసపు మాటలు పలుకరాదు. కంఠాభరణాలు ధరించరాదని భావం.

గురువులను, దేవతలను, కొందరెపుడు నాస్తికులై నిందిస్తుంటారు. అది వారి స్వభావం. అలా చేయక పోతే వాళ్ళకి కాలక్షేపం కాదు. అలాంటి వారికే విధమైన సమాధాన మివ్వరాదు. పాపాత్ములైన వారు యుగయుగాల్లో పాపఫలం తప్పక అనుభవిస్తారు. కనుక అలాంటివాని చూచి కూడ చూడరాదు. విననట్లు వెళ్ళి పోవాలి అంటూ క్రింది శ్లోకంలో కూర్మ పురాణం హితోక్తి తెల్పుతున్నది.

శ్లో॥ "నిందయే ద్వైగురూన్ దేవాన్, వేదం వాసోప బృంహిణమ్
కల్పకోటి శతం సాగ్రం, రౌరవే పశ్చతే నరః!
తూష్ణీ మాసీత, నిందాయాం, న బ్రూయాత్ కించిదుత్తరమ్!
కర్ణా పిధాయ గంతవ్యం, నదా చైతానవలోక యత్!"
అంటే కర్తవ్యోపదేశం కూర్మపురాణం మనకు చేస్తోంది.
వామన చరితం కూర్మ పురాణంలో నిలా వర్ణింపబడింది.

శ్రీ మహావిష్ణువు యొుక్క పరమ భక్తాగ్రేసరుడు ప్రహ్లాదుడు. ఇతని పుత్రుల్లో విరోచను డొకడు. మహాబల శాలి. దేవతలనందరినీ ఓడించి స్వర్గం నుండి పారద్రోలాడు. శ్రీ మహా విష్ణువు సలహా ప్రకారం సనత్కుమారుడు విరోచనుని దగ్గరకు వెళ్ళాడు. ఆయనను సాదరంగా ఆహ్వానించి, విరోచను డర్ఘ్యపాద్య విధులతో అర్చించాడు. ఆయన "ఊరక రారు మహాత్ములని, వారి రాక కారణమే అడిగారు. ఆ మునీశ్వరుడు తమకు ఆత్మజ్ఞాన ముపదేశించుటకు వచ్చినవాడనన్నాడు. జ్ఞానోపదేశం చేశాడు. దానితో రాజుకు వైరాగ్యం అలవడింది. తన కుమారుడైన బలి చక్రవర్తికి రాజ్య మప్పగించి తాను యోగ దీక్షలో లీనమయ్యాడు.

బలి చక్రవర్తి కూడా తండ్రి వలె మహా పరాక్రమ శాలియై ధర్మపాలన చేస్తున్నాడు. ఇతడు కూడ దేవేంద్రాది దేవతలను స్వర్గం నుండి ఓడించి పారద్రోలాడు. దీనితో దేవతల తల్లి అదితికి చాలా దుఃఖకరమైనది. బలి మొదలైన రాక్షసుల సంహరించేందుకు స్వయంగా శ్రీమహావిష్ణువే తన గర్భంలో పుట్టాలని సంకల్పించి కోరుకొంది. అపుడా దేవుడామె ప్రార్థనకు మెచ్చి ప్రత్యక్షమయ్యాడు. అదితి ఆనందంతో విష్ణుస్తోత్రం చేసింది. తన కోరికను తెల్పుకొన్నది. 'తథాస్తు' అని అదృశ్యమయ్యాడు విష్ణుదేవుడు.

కొంత కాలానికి ఆమె గర్భము దాల్చింది. బలి చక్రవర్తి రాజ్యంలో సకాల వర్షం కురిసింది. దిక్కులు గర్జిస్తూ పిడుగులు పడినాయి. బలి భయపడ్డాడు. ఈ ప్రకృతి వైపరీత్య పరిణామానికి కారణమేమిటని తాతయైన ప్రహ్లాదుని ప్రశ్నించాడు. ఆ విషయం గ్రహించా డాయన. మహావిష్ణువు అయిదో అవతారమెత్తబోతున్నాడని, రాక్షస వినాశనం జరుగబోతుందని, ఆ మహావిష్ణువునే శరణు వేడుమని ఉపదేశించాడు. ఆయన వస్తే శరణు వేడమని ఉపదేశించాడు. బలి అలాగే చేస్తానన్నాడు. ఆయన వస్తే పూజ చేస్తానన్నాడు.

ఒక శుభ ముహూర్తమున శ్రీ మహావిష్ణువు వామనుడుగా అతిథి గర్భం నుండి అవతరించాడు. అయిదేళ్ళ వాడు కాగానే ఉపనయనం చేశారు. సర్వ వేదాల నధ్యనం చేశాడు. సదాచార సంపన్ను డయ్యాడు. వామనదేవుడు.

ఇలాగుండగా బలి చక్రవర్తి స్వర్గంలోని అమరావతి లో మహాయజ్ఞమొకటి చేశాడు. ఆ యజ్ఞానికి వచ్చిన వారికందరికి భారీగా దక్షిణలిచ్చి సత్కరించి పంపుతున్నాడు. చివరకు బలి కడకు వామనుడు వచ్చాడు. జింక చర్మం ధరించి బ్రహ్మదండం దాల్చి, పొట్టివాడుగా మహాతేజస్వియై సూర్యుని వలె ప్రకాశిస్తున్నాడు. "భిక్షాందేహి" అన్నాడు. బలినాశీర్వదిస్తూ. బలి వటువు నేమి కావాలో కోరుకొమ్మన్నాడు. ఎంతో వినయంతో బలిని ప్రశంసించి, బ్రహ్మచారినైన తనకు కేవలం మూడడుగులు భూదానం చేయుమన్నాడు. "స్వపధ్భ్యాంక్రమితం దేశయాచతి బలింత్రిభి" అందుకంగీ కరించాడు బలి వామనుని పాదాలను భక్తితో కడిగి భూదానం మంత్రోక్తంగా ధారవోశాడు. అయితే వామనుడు త్రివిక్రముడై భూవ్యాకాశాలను రెండడుగులతో ఆక్రమించాడు. "మూడవ అడుగుకు చోటు చూపంచమ"నగా బలి తన తల మీద పెట్టమన్నాడు. వామనుడు మూడవ అడుగును బలి తలపై పెట్టి పాతాళానికి అణగద్రొక్కాడు. ఆ తర్వాత విష్ణు సాయుజ్య మిచ్చాడు బలికి.

ఈ విధంగా వామన చరిత్ర కూర్మ పురాణంలో, వామన పురాణంలో కూడా అద్భుతంగా వర్ణింపబడింది. అట్లే ఓ భక్తి కథ యిలా వర్ణింప బడిందిందులోనే.

## కూర్మపురాణంలో భక్తికథ:-

పూర్వం చంద్ర వంశలో దుర్జయుడనే మహారాజా ఉండేవాడు. అతడు సర్వశాస్త్ర కోవిదుడు. అతని భార్య పరమ పతివ్రత. ఉత్తమ స్త్రీ యోగ్యురాలై అన్ని విధాలైన సుగుణాలుకలది.

ఒకనాడు యమునా నదీ తీరానికి దుర్జయుడు వెళ్ళాడు అచ్చటాయనకు అప్సరసయైన ఊర్వశి అగుపించింది. ఆమె అద్భుత సౌందర్యానికి ఆశ్చర్యపోయాడు రాజా. ఆమె కూడా, ఆ అప్సరస మన్మథాకారంలోనున్న రాజాను చూచి ఆకర్షింపబడింది. పరస్పరం ఆకర్షితులయ్యారు. కొంతకాలం కలిసిగడిపినారు. తర్వాత రాజా తన రాజధానికి బయలు దేరాడు. ఊర్వశి"మళ్ళీ ఇక్కడే కలిసికొందా"మని వీడ్కోలిచ్చింది.

నగరానికి వచ్చిన రాజా పతివ్రతయైన భార్యను వంచించి నందుకామె ముఖం చూచే సాహసం చేయలేకపోయాడు. ఇతని భయానికి కారణ మడిగిందామె అతడు చెప్పలేదు. అమె జ్ఞాన దృష్టితో గ్రహించి"రాజా! ప్రభు వెప్పుడు భయపడరాదు. ఇది రాజ్యానికి క్షేమకరము కాదు. చేసిన తప్పుకు ప్రాయశ్చిత్తం చేసికొనడం మంచిది." అని ధైర్యంగా కర్తవ్యం బోధించింది. ఈ మాటలు విన్నంతనే కణ్వమహర్షి ఆశ్రమానికి బయలు దేరాడు దుర్జయుడు. తన తప్పుకు కణ్వముని నడిగి ప్రాయశిత్తం తెలిసికొన్నాడు. ఆశ్రమం నుండి తిరిగి వస్తున్నాడు. మార్గమధ్యము నందు

ఒక గంధర్వు డెదురైనాడు. అతని మెడలో ఒక రత్న హారమగుపడింది. తానూర్వశికకి ప్రేమగా నిచ్చిందాహారం. అంతే, "అప్సరయైనా వేశ్యజాతి ఎంత కృతఘ్నురాలు" అని భావించి తట్టుకోలేక పోయాడు. భయంకరంగా ఆ గంధర్వునితో పోరాడాడు. ఆ హారాన్ని చివరకు జయించి తన వశం చేసికొన్నాడు రాజు. కామాతురుడై మళ్ళీ యమునా నదీ తీరానికి వెళ్ళాడు. ఊర్వశి కొరకు వెదికాడు. ఆమె కనిపించలేదు. భూగోళమంతా గాలించాడు. ప్రయోజనం శూన్యం. మానస సరోవరం దగ్గరికి వెళ్ళగా అక్కడ అగుపించిందామె. ఆనందం పట్టలేక పోయాడు. హారంతో ఆమెనలంకరించాడు. శారీరక సౌఖ్యమనుభవించాడు. నగరానికి వెళ్ళి ఏమి చేశావన్న ది ఊర్వశి. భార్య హితవచనాలు కణ్వమహర్షి దర్శనం హారం కోసం గంధర్వునితో యుద్ధం చేసి సాధించడం. అంతా వివరించి చెప్పా డామెకు. "నీ హితము కోరి చెబుతున్నా! ఇక్కడి నుండి వెళ్ళిపో ! లేకపోతే మునిశాపానలానికి నీవు, నీ భార్య కోపానికి నేను గురి కావలసి వస్తుంది." అని హితోపదేశం చేసింది ఊర్వశి. కామాతురుడైనఅతనికా మాటలు రుచించలేదు. అప్పుడు తన వికృత రూపం చూపెట్టిందామె. ఆ భయంక రాకారాన్ని చూడలేక పోయాడు. కనువిప్పు కల్గిందా యనకు. తన తప్పు తెలిసికొని తన్ను తానే నిందించుకున్నాడు. కందమూల భక్షణంతో పదురెండు సంవత్సరాలు, వాయుభక్షణ మాత్రమే ఆహారంగా మరో పండ్రెండు సం॥రాలు ఘోర తపస్సు చేశాడు. సిగ్గు పడుతూ వెళ్ళి కణ్వ మహర్షికి జరిగిన వృత్తాంతమంతా పూసగుచ్చినట్లు నివేదించాడు. కణ్వముని కరుణించాడు. కాశీక్షేత్రం వెళ్ళి గంగా స్నానంచేసి డుంఢి విఘ్నేశ్వర దర్శనం చేసికోమన్నాడు ముని; దుర్జయుడు దైవ దర్శనం చేసికొన్నాడు. తద్వారా ప్రాయశ్చిత్తం జరగింది. మళ్ళీ తన నగరానికి వెళ్ళి ప్రజల చక్కగా పాలిస్తుండేవాడు.

ఇలాంటి భక్తి ప్రదాయకమైన చక్కని నీతి కథలెన్నో కూర్మ పురాణంలో నిక్షిప్తమై ఉన్నాయి.

శ్లో॥ "ఏతతూత్తకర్మ పురాణంతు, చతుర్వర్గ ఫలప్రదమ్!
పఠతాం శృణ్వతాం నృణాం, సర్వోత్కృష్ట గతి ప్రదమ్!!"

ధర్మార్థ కామ మోక్షాల నివ్వగల్గిందీ కూర్మ పురాణం. భక్తి శ్రద్ధలతో చదివే వారికి, వినేవారికి మోక్షదాయకమైనది.

# క్షీరసాగర మధనము

బ్రహ్మదేవుడు సృష్టి ప్రారంభించిన తరువాత దేవ రాజ్యమును ఇంద్రుడు పరిపాలించుచుండెను. అక్కడి సుధర్మాసనము మీద నింద్రుడు కూర్చుండి యుండగా దేవతలు మహాసభ గావించిరి. ఆ సభకు త్రిమూర్తులను, యితర దేవయోని విశేషములగు మిగిలినవారి నందరనూ పిలిచి సభప్రారంభించిరి. అందులో గంధర్వగానములు, కింపురుష నృత్యములు, దేవవేశ్యల యాటపాటలు జరుపబడుచుండెను. శివతాండవము కూడ జరిగెను. ఇట్లు జరిగిన కొంత సేపటికి కుబేరుడు లేచి సభవారిముందు యిట్లు చెప్పనారంభించెను. "నాకు సృష్టి ప్రారంభమునందు నవనిధులు, రత్నధన సంచయము లిచ్చియుండిరి. ఇంద్రునకు దేవాధిపత్యము వచ్చిన తరువాత నా నిధులన్నియు వ్యయమైపోయినవి ఈ మహేంద్రుడు యింద్రాదులకు, సూర్యచంద్రాదులకు నా వద్దనున్న సమస్త నిధినిక్షేపములను వ్యయము చేసియున్నాడు. ఇప్పుడు నేను రిక్తుడనై యున్నా"నన్నాడు. విష్ణుదేవుడదివిని "కుబేరుని మాటలు నిజము. అతని ధనసంచయము పూర్తిగా వ్యయమైనది. ఇప్పుడు క్షీరసముద్రమును మధించినచో నఖండ రత్నరాశులు యితరమగు యపూర్వ పదార్థములు

మనందరకు చిక్కగలవు. దానికితగిన ప్రయత్నములు గావింపుడు" యని యనగా విని, దేవతలు పరమానందమంది తమతమ వాహనములతో క్షీరవారాశి తీరమునకు జేరుకొనిరి. రాక్షస సమూహమును పంపమని పాతాళలోకాధిపతియగు బలిచక్రవర్తికి కబురు చేసిరి. బ్రహ్మ వాసుకిని రమ్మని సర్పలోకవాసులకు కబురు పంపుమనగా – వాసుకి తన శిరస్సులపైనున్న భూభారము దింపి యెట్లురాగలడని దేవతలు బ్రహ్మను ప్రశ్నించిరి. సమాధానముగా బ్రహ్మ "అన్నింటికీ సమర్థుడు శ్రీహరియే వున్నాడనెను, దానికి శ్రీహరి యోచించి ఆ భూభార మాదికూర్మరూపము ధరించి నేను వహించుమనని చెప్పెను. వాసుకి తన తలపైన వున్న భూభారము దింపి క్షీరసాగర తీరానికి బయలుదేరి వచ్చెను. అందరూ వచ్చిన తరువాత, పాలసముద్రమును మధించుటకు కవ్వముగా మందర పర్వతాన్ని గొనిరమ్మనిన బ్రహ్మశాసనము ననుసరించి వారు బయలుదేరి పోయిరి.

దేవదానవులు మందరపర్వతమును జేరి దానిని పెకలించసాగిరి. దాని భారము ఎటు మ్రొగ్గునో యని వారందరు తటపటలాడసాగిరి. అది యెటువైపు వ్రాలిన యటువైపు వారందరు నలిగిపోవలసిందే! వారందరూ "పరమేశ్వరా! మమ్ము రక్షింపుము రక్షింపు మని" కేకలు వేయసాగిరి. వారి గోలవిని "మీయత్నము విరమింపుడు. మీరీవలకురండని" చెప్పి శ్రీహరి యదృశ్యరూపమున యామందరగిరిని గొనివచ్చి క్షీరసముద్రములో విడచెను. దానిని నిలుపగల్గుటకు క్రిందకుదురు లేని కారణమున యది సముద్రములో మునిగిపోయెను. బ్రహ్మాదులందరు నిశ్చేష్టులై చూడసాగిరి. అప్పుడు గగనవాణి "ఓ దేవతలారా! రాక్షసులారా! మీరు వెరగందకుడు, మంథరపర్వతము కుదురులో విచిత్ర వర్ణములలో కూడిన కూర్మశాబకము

గలదు. మీరు దానిని జాగ్రత్తగా కొని వచ్చి ఈ సముద్రములో విడువుడు. అదియే మంధరమును వహించగలదు. సందేహింపకుడని" చెప్పగా విని, పరుగు పరుగున వెళ్ళి మంధర పర్వతము కుదురులోని విచిత్రవర్ణముగల యా తాబేలుపిల్లను వారందరు కలసి గొనివచ్చి క్షీరసాగరమున వదలిరి. వారు వదలుటే తడవుగానా కూర్మ శాబకము తన శరీరమును పెంచి సముద్రములో లక్షయోజనముల విస్తీర్ణముగల శరీరముతో మహాస్వరూపము బొంది మంధరపర్వతము క్రిందికి తన శిరస్సుదోపి తరువాత క్రమముగా తనువు జొనిపి పర్వతమును మూపున ధరించెను. పిమ్మట హరి, వాసుకిని చూచి "వాసుకీ! నిన్ను కవ్వపు త్రాడుగా జేసికొని వీరందరు ఈ సముద్రమును మథించి యందుండు రత్నసంపదల సారమగు వాటిని సంపాదింపగలరు. తక్షణము నీ వీగిరిని చుట్టుకొను"మన భయపడి, వాసుకి "నారాయణా! యీ కార్యము నోర్చుకొనుటకు నా శక్తి చాలదు. నన్ను యిందుంచి నా శరీరమును ముక్కలు ముక్కలు చేయింతువా! ప్రాణాపాయముగల ఈ కార్యమునందు నన్ను ప్రవేశపెట్టకు" మని బ్రతిమాలసాగెను. అది విని శ్రీహరి నవ్వుచు, "వాసుకీ! భూమినే నీ పడగలపై ధరించినవాడవు. ఈ గిరిని చుట్టుకొని ఉండలేవా! నీకే ప్రమాదమునూ, రానీయను. నీవు రవంతయూ నలగవు. నేనున్నాను అనుమానింపకు. తక్షణము వెళ్ళి పర్వతమును చుట్టుకొను మని యాజ్ఞాపింపగా, హరిని విశ్వసించి ఆ పనికి సమ్మతించి వెంటనే తన బలమును పుంజుకొని, వాసుకి యా గిరీంద్రమును చుట్టలుచుట్టలుగా చుట్టుకొనెను. దేవదానవులు వినాయకుని పూజించి, కార్యము నిర్విఘ్నముగా జరుప ప్రార్థించి, క్షీరసాగర మథనమున కుపక్రమించిరి.

# క్షీరాబ్ధి మథనము - దివ్యవస్తులాభము

వాసుకిని కవ్వపుత్రాడుగా నుంచుకొని తలవైపు రాక్షసులు, తోకవైపు దేవతలు పట్టుకొని క్షీరసముద్రమును చిలుకసాగిరి. దేవతలు, మహామునులు, మహారాజులు అందరును గగనమార్గమున విమానము లందుండి నేరుగా పరిశీలించసాగిరి. వర్తమానము అందించుటకు బ్రహ్మదేవుడు వార్తాహరులను నియమించెను. వారిలో వాయుదేవుడు ముఖ్యవార్తాహరుడు. ఇట్లు వారు మథించుచుండగా వారికి నానాశ్రమలు కన్పించసాగెను. వారంద రలసిపోయిరి. చేతులు కాళ్ళు లాగుచుండెను. నరముల పట్లు తప్పసాగెను. మనమీ కార్యము సాధించజాలమని వారందరూ నిరాశచెందిరి. వారా హరిని స్మరించి, "ఓ శ్రీమన్నారాయణా! మమ్ము శక్తిహీనుల నిందు ప్రవేశపెట్టినావు మాకు బలము సన్నగిల్లినది. నరముల పట్లు తప్పిపోయినవి. మా శరీరము మాకు తెలియుట లేదు. మమ్మురక్షింపుమని" ప్రార్థించిరి.

అది విని యా జగన్నాయకుడు వారికి వినబడునట్లు గంభీరస్వరముతో "ఓ దేవ దానవులారా! ఈ మాత్రపు పనికే మీరింత దిగజారిపోదురా? ఇదెంతపని? సముద్రమున్నది. కవ్వమున్నది. త్రాడున్నది. చేతులతో మథించుటకు యింత బ్రహ్మండమా? ప్రయత్నించుడు. నేనున్నానుగదా! శంకించకుడు. నేను మీలో బలము పుంజకొనజేసెదనని వాగ్దానము చేసెను. అట్లు చెప్పి వారిలోనికి తన తేజమును పంపి బలవంతులను చేసెను వారు నూత్నతేజమును పొంది పరమోత్సాహముతో మరల సముద్ర మథనము నారంభించిరి. వారు మథించు సమయములో పర్వతము ఇటునటు తొట్రిగిలసాగెను. వారా కుదుపున

కాగలేక పోవగా చూచి, జాలిపడి విష్ణుదేవుడు కూర్మ రూపున తనకాలుమోపి నొక్కిపట్టెను. దానితో నా కొండ నిలబడెను. రెండు గడియల తరువాత వారు గిరెని పట్టి విశేషముగా మధించసాగిరి.

ఎంత సేపు మధించినినను యందుండి యేమియు బయటకు రాకపోవుటతో బ్రహ్మదేవుడు జాంబవంతుని పిలిచి క్షీరసాగరములో నోషధులను వేయుమని యాజ్ఞాపించెను. ఓషదీ సమూహం భల్లూక రాజునకిచ్చి వాటిని తెచ్చి నలుగగొట్టి యందులో వేయించెను.

ఆ యెూషధులను మధించుచుండగా నందుండి తెల్లని రసముద్భవించినది. వారదిచూచి మధించుటమాని బ్రహ్మకావిషయము తెలియజేసిరి. బ్రహ్మదేవుడా రసమును యొక సువర్ణ కులశములోపట్టి తన యెద్దనుంచుకొనెను. ఇంకను మధింపగా నందుండి యైరావతమను మహాగజ ముద్భవించినది. తరువాత మధుద్రవము పుట్టినది. దానినుండి భరింపరాని దుర్వాసన బయలుదేరినది. దానిని స్వీకరించినవారు వారి వారి యున్నత స్థితులను చంపుకొని భ్రష్టులగుదురు గాన, యది స్వీకరింపరాని ద్రవమనియు – దానిని స్వీకరించినవారు నరక వాసమునకు పోవుదురనియు – దానిని దూరముగా నుంచిరి. తరువాత చాలా సేపటికి చంద్రుని కాంతులతో సమానమగు వెన్నెలలు చిమ్ముకాంతి బయటకు వచ్చినది.

వారందరా కాంతిని చూచుచుండగా చీని చీనాంరములను ధరించి దివ్యాభరణములు దాల్చి యపురూపలావణ్యవతియగు శ్రీ మహాలక్ష్మీ దేవి యందుండి యీవలకు వచ్చెను. ఆమె తేజోకాంతుల మెరుపులతో కళ్ళుజిగేలుమనగా నెల్లరూ మోహపరవశులై మూర్ఛబడిరి, తరువాత ఆమె వెనుక రంభ, మేనక, తిలోత్తమ, ఘృతాచి, సుకేశి, మంజుఘోష, చిత్రలేఖ మొదలగు దేవవేశ్యాగణము లొకరి వెనుక నొకరు రాసాగిరి. వారినందరిని

చూచుచు దేవదానవులు సంభ్రమాశ్చర్యములను పొందసాగిరి. పిమ్మట నవ నిధులు గల్గెను. నిత్యము శరీరమునుండి రత్నములు రాల్చుచుండు దివ్య పురుషు లిద్ద రందుండి ఈవలకు వచ్చిరి. వారిని చూచి వింత పడుచుండగా బ్రహ్మదేవుడు వారిని లక్ష్మిసన్నిధానములో నుండజేసెను. వారిద్దరును కుబేరునకు నవ నిధులను పూర్తిగా నిండజేసిరి. పిమ్మట నుచ్చైశ్రవ మను తెల్లగుఱ్ఱము, దానితో దాని జాతి గుఱ్ఱము లేడున్నూ బయటకు వచ్చినవి.

అటుపిమ్మట తామరపువ్వు గొడుగు రూపములో జన్మించెను. దానినండి రత్నవములు జాలువారి వ్రాలుచుండెను. దానినే బ్రహ్మదండమందురు. తరువాత బ్రహ్మకు తగిన కమండలము పుట్టినది. కల్పవృక్షము, కామధేనువు, సూర్యమణి, శ్యమంతకమణి, కౌస్తుభమణి, దేవదత్తమను శంఖము, పుష్పక విమానము, నందొఘోష రథము పుట్టినవి.

## హాలాహల భక్షణము

ఇట్లు సముద్ర మథన కాలము నందనేక యమూల్య వస్తుసంపద జన్మించుట చూచి వారిలో వారు తమ కదికావలయు ననియు, నిది కావలయుననియు, పెనుగులాటకు దిగుచుండిరి. అదిచూచి శివుడు వారితో నిట్లనెను." మీరు వృథాగా కలహించుటయు, తగవులాడుటయు తగదు. ఇందు వచ్చిన వస్తువులన్నియు నొకచోటనుంచి సముద్రమథనము పూర్తియైన తరువాత పంచుకొనవచ్చునని వారి నూరడించి మరల సముద్ర మథ నమునకు దింపెను. ఉభయపక్షములవారు వడివడిగా మంధరపర్వతమును త్రిప్పసాగిరి. వారటుల శక్తి కొలది త్రిప్పగా త్రిప్పగా నందుండి ముందు మహాభయంకర మైనదియు, భరింపరానిదియునగు హాలాహలము వేడిసెగలు బొగలుతో పైకి చిమ్మసాగెను. దానినుండి బుసబుస మని పొంగుతో నాకాశ మంటుచున్న జ్వాలలు అనేకం క్రమముగా

లేవసాగినవి. ఆ మంటలనుండి వారెవ్వరూ భరింపరాని యావేదన కల్పించు ఉష్ణవాయువు రాసాగింది. ఆ మంటలు సముద్రముపై నాల్కలు సాచుచు భూనభోంతరాళము లాక్రమించినవి. వాటి మహాభయంకర మగు మంటల వేడిమి తట్టుకొనలేక దేవదానవులు మూర్ఛిల్లసాగిరి. ముందు జరగవలసిన విషయమును గురించి, యా హాలాహలము తీవ్రత తగ్గుమార్గము గురించి యనేకమంది యనేక విధముల యూహాగానములు చేయసాగిరి. ఏమి చేయవలయునో యెవరికీ తెలియక తికమక పడుచుండిరి. "వాసుకి తలను బట్టి రాక్షసులు మథించుచుండ ఆ పాము శిరస్సునుండి వచ్చు మహావిషము భరించుటే కష్టమనిపింప, ఇప్పుడీ హాలాహలము నివారించుట యెంత కష్టము.

ఇంక ఈ సముద్రమథన కార్యము గావించ జాలము. ఈ విషయము విరమించుకొనుట మంచిది. ఈ దారుణ మహావిషజ్వాలల వేడిమి నెట్లు భరింతుము." అనివారు నిట్టూర్చుచు యనేక విధముల దీనాలాపములాడుచు శోషిల్లుచు "పరమేశ్వరా! మా మనుగడలే దుర్భరమగుచున్నవి. ఈ మథన యత్నము వలన యేమి లాభము పొందగల" మని నిర్వీర్యులై పోయిరి. హాలాహల విషమును భరించలేక అందరన్ని దిక్కులకు పారిపోయిరి. దేవదానవుల స్థితిని చూచి శ్రీహరి కరుణించి యావేడి చల్లారునట్లు దివ్యవర్షము గురిపించి వారిని తెప్పరిల్లజేసెను. కాని మంటలు మాత్రము సముద్రమంతయు ప్రాకుచు మహాభయంకరముగా నర్తించుచుండెను. శ్రీ విష్ణువు దాని వేడి సహించి నిలబడగా దాని వేడి వలన శరీరము కమిలినీలవర్ణముగా మారిపోయెను. తరువాత వారందరు ఆ స్థానము విడచి వేగముగా బ్రహ్మదేవునికై సత్యలోకమునకు పోయిరి. అచ్చట బ్రహ్మదేవుని దర్శించి "హే విధాతా! క్షీర సాగర మథనమున యేదో లాభముట్టి పడునని యింతవరకు ప్రయాసపడినాము. వచ్చినవేవో వచ్చినవి. ఇంకను రాదగినవి

యున్నను, యీ మహా విషజ్వాలలను భరించలేకుండా యున్నాము. నిలువ తావు కన్పించుట లేదు. నీవు పెద్దవు నీ సహాయము, సలహా వాంఛించి వచ్చినాము. మాకపాయము లేని యుపాయము చెప్పు" మని కోరిరి. బ్రహ్మవారిని వెంటనిడుకొని విషయమంతయు విష్ణువునకు విన్నవించగా నారాయణు డది విని "మీరా జ్వాలల గురించి భయపడనక్కర లేదు. మీ బాధలు తీర్చగల మహనీయుడు శంకరుడు. అతనిని మీరాశ్రయించిన తప్పక శుభము కల్గును. మిమ్ముద్ధరించ గలవాడా మహానుభావుడొక్కడే" నని వివరించి వారిని శివుని దగ్గరకు కైలాసమునకు పంపెను.

వారందరు "హర! హర! మహాదేవ" యని సంకీర్తనములు గావించుచు కైలాసాచలమును జేరి ప్రమథగణములతో నిండియున్న శివదంపతుల సింహాసనాసీనులగు వారిని దర్శించి యనేక విధముల స్తోత్రములు గావించి పాదాభివందనములాచరించి చేతులు జోడించి శిరములు వంచి నిలబడి "సాంబశివా! మీయందరి ప్రోత్సాహంతో మేము క్షీరసాగరమును మథించినాము. అందుండి అనేక యమూల్యవస్తు జాలము వచ్చినది. వాటిని చూచి మేమానందపడుచుండ మాకు ఘోరమగు మహాపద సంభవించినది. దానిని మీకు వివరించి మమ్ముద్ధరింప ప్రార్థింప వచ్చినా"మనిరి.

శివుడు చిరునవ్వు నవ్వి "భక్తులారా! మీ రాపదలో నుండి నన్ను ప్రార్థించిన ప్రార్థనలు వృథాచేయుదునా? నాపని నా భక్తుల కపాయము వచ్చినపుడు తప్పించుటకన్న ఇంకేమున్నది? ఎట్టి కష్టమగు పనియైనను, ఎంత ప్రమాదకరమైన దైనను నేననుభవించి సహించి మీ బాధ నివారింతును. శుభముగా నుండునట్లు చూతును. నేను యా విషమును నిముషములో మింగివైచెదను. మీరు భయపడకుడని" శంకరుడు వారి కభయదానము గావించెను. తరువాత పార్వతిని చూచి నవ్వుచూ "నేను సర్వ జన

సంరక్షణార్థము హాలాహల విషమును మింగ దలచినా" నన్నాడు. పార్వతీదేవి "శివా! నీవు పరోపకారముగా మ్రింగినది విషమైననూ యది యమృతమేయగును. నాకు సందియములే "దనెను.

పార్వతి హృదయము గ్రహించదలచి శివుడట్లాడియామె నిబ్బరమునకానందమంది, హుటాహుటిన క్షీరసాగరము దరికి వచ్చెను. నలువంకల ప్రాకుచు జీవులకు మృత్యుప్రాయమైన యా విషజ్వాలలను చేతితో నదిమి పట్టి యొక ముద్దగా చేసి మ్రింగెను. దానని గర్భ కుహరములోనికి పోకుండా కంఠము నందుంచుకొనెను.

అట్లు మింగిన తరువాత శివుని శరీరమంతయు జ్వాలా మయ మగుటకు మారుగా యా వేడిపైకి జిమ్మి లోకులను మరల చికాకు పరచసాగెను. వారందరు బ్రహ్మనాశ్రయించిరి. బ్రహ్మదేవుడు చంద్రుని బిలచి "చంద్రా! నీవు నీ యమృత కిరణములతో శివుని జటాజూటములో నిలచి యుండుము. నీ చల్లని యమృత కిరణ ప్రభావముతో శివునిలో నున్న హాలాహల విషపు వేడిని తగ్గించుము. దానితో లోకము శాంతమగును. ఇంతకన్న మార్గము లే"దని చంద్రుని పంపి, శివుని జడలలో నిలువ జేసెను. ఇంకను సెగలు బొగలు రాగా మరల బ్రహ్మదేవుడు గంగను పిలిచి "గంగా నీ స్పర్శ మాత్రమున సమస్త తాపములు చల్లారును నీ మహిమ లనంతములు నీవు నిలిచిన చోట శాంతి సుఖములు కల్గుటకు సందియము లేదు. ఇప్పుడు ప్రపంచము విషమ పరిస్థితిలో నున్నది, శంకరుడును విషమ పరిస్థితిలో నున్నాడు. ఆయన మింగిన హాలాహల ప్రభావము శివుని మీద ఫలించుచున్నది. దానితో సమస్త లోకములు కుతకుతలాడుచున్నవి. నీవు వెంటనే శివుని జడలలో నిలిచి నీ ప్రవాహముతో నాతని శిరస్సును, జడలను నిత్యము తడుపు చుండుము. నీ నిత్య వారాభిషేకముతో యాతనికి శాంతి

గల్గించుము. నీ నిరంతర ప్రవాహముతో హాలాహలము శమించును. వెంటనే పోయి నీ నివాసమందుంచుకొ'' మ్మని యాజ్ఞాపించెను. నాటి నుండి శివునకు గంగాధరుడని, చంద్రకళా ధరుడని, యిందు శేఖరుడని బిరుదము వచ్చినవి. అతడు నిత్యశాంతి సుఖము అందుచుండెను. ఈ హాలాహల భక్షణ కథ సమస్త పాపములను హరించి శివసాయుజ్యం జేర్చునని మౌనీంద్రులకు సూతుడు చెప్పెను.

తరువాత వృత్తాంతము చెప్పుమని ఋషులు కోరగా సూత పౌరాణికుడు పరమ సంతోషముతో మరల నిట్లు చెప్పనారంభించెను. ఇదివరలోని నియమము ప్రకారము హాలాహలోత్పత్తి వరకు వచ్చిన వస్తువులను దాచి యుంచిరి. వాటిని సమముగా పంచవలయునని రాక్షస ప్రముఖులొక తగాయిదా గొని వచ్చిరి.

## జాంబవంతుడు - జగన్మోహిని

ఆ తగవులలో సమస్త యమూల్య పదార్థములు వేరువేరుగా నుంచి విభాగము చేయదొడగిరి. ఒకనాటి కాలము నందు కైలాసము చుట్టూ మహావనమున్నది. దానిని రుద్రవనమందురు. ఆ వనము నందు శృంగార రసము చెన్నారుచుండెను. సింగార మెలకించు రకరకములగు పక్షులు, నెమళ్ళు నానా వర్ణములగు జీవ జాలములతో శోభాయమానముగా నుండెను. సువాసనలు గుబాళించు పుష్పవనముగా నది ప్రఖ్యాతి గడించినది. అందు పార్వతీ పరమేశ్వరులు నిత్యముల్లాసముతో సంచారము గావించుచు సుఖమును పొందుచుందురు. ఒక సమయమున శివుడందు సంచరించుచు భల్లూకమును చూచి తాను కూడ భల్లూక రూపము ధరించగా పార్వతి "శివా! వికార రూపమెందులకు ధరించినావు? స్వచ్ఛమగు కాంతుల జిమ్ము

శరీరము విడచి యీ రూపము నీకేల?" యని యనగా "యీ యరణ్యములో సంచరించు భల్లూక మిధునమును చూచి యేదో ముచ్చట పడి యీ రూపమును బూనినాను. నీవు కూడ నా వలె స్త్రీ భల్లూకమవై యుండ గోరెదను. ఈ రూపములో మనము ప్రేమ కలాపము సాగించ కోరిక యున్న"దన్న మాట విని, పార్వతి మారు మాట్లాడక తానొక స్త్రీ భల్లూక రూపము ధరించి శివునితో రతిసుఖమనుభవించెను. సద్యో గర్భము నుండి భల్లూక ముఖము మిగిలిన శరీరము మానవ శరీరము గలవాడైన యొక బాలుడు జన్మించెను. జగదీశుడు తనకు కుమారుడై పుట్టిన యా భల్లూక ముఖుడగు కుమారుని చూచి "పుత్రా! నీవు నా కడుపున శివాంశతో జన్మించినావు నా కుమారుడవైన నీవు సింహకోటి బలముగలవాడవై యుందువు గాక! ముల్లోకములలో నిన్ను జయించువారుండరు, చిరంజీవివై కల్పాంతముండుము. సర్వశాస్త్ర పిజ్ఞానివై యుందువు గాక! నీవునిర్భీతితో సంచరించెదవు గాక" యని వరము లిచ్చి స్వేచ్ఛగా సంచరించుమని వదలివేసెను. అటువంటి శక్తి సంపున్నుని పిలిపించి, క్షీరసముద్ర మథన కాలమునందు ఓషధ పరిజ్ఞానము సంపూర్ణముగా నున్న, జాంబవంతునిచే బ్రహ్మ యోషధులను దెప్పించి యమృతమును సాధించినారు గదా! తరువాత రాక్షసులు కలహము పెట్టగా వస్తు సముదాయము తీసి యిట్లు విభాగము చేయసాగిరి. శ్రీహరి కూర్మ రూపము నుపసంహరించెను. పిమ్మట శ్రీ మహాలక్ష్మికి రత్నాల హారమిచ్చి "నీకు ఇష్టమగు వాని మెడలో ఈ హారము వైచి వరించుమని" బ్రహ్మ యాజ్ఞాపించెను. ఆమె వెంటనే యా హారమును శ్రీహరి మెడలో వైచి యాతని వరించి వెంటనిలచెను. మిగిలిన పదార్థములలో ఇంద్రునకై ఐరావతమును, యెనమండుగురు యప్సరసలను, మహత్తరమగు రత్న ఛత్రమును పంపకములో నిచ్చిరి. కుబేరునకు నవ నిధులు నిండునట్లు రత్నసంచయమంతయు జాలు వారపోసిరి.

ఇందులో వచ్చిన సప్తాశ్వములను సూర్యుని రథాన కట్టుకొన నిచ్చిరి. శమంతక మణినీ - కుండలములనూ సూర్యునికే యిచ్చి వేయగా, కౌస్తుభమణిని శ్రీహరికిచ్చిరి ఈ మాణిక్యములను ధరించిన వారికి మరణము దాహము, క్షుత్తు నేమియు నుండవు. కుండలములలో నమృతముండుటచే వాటిని ధరించుటచే మహనీయులై ప్రఖ్యాతి గడించుచున్నారు. వరుణుడు పుష్పక విమానము పొందెను. తరువాత బ్రహ్మశివుని పిలిచి "నీ విందులో నేదైన యొకటి పుచ్చుకొను "మన్నాడు. శంకరుడు బ్రహ్మ మాటను త్రోసి వేయకుండా శంఖమును పుచ్చుకొందునని పుచ్చుకొన్నాడు. గరుడధ్వజమున్న రథమును శ్రీహరికి సమర్పించిరి, మహాచక్రవర్తులకు కిరీటములు, భుజకీర్తులు రత్న హారములు పంచియిచ్చిరి. బ్రహ్మదేవుడు మాత్రమొక మణిని గ్రహించి తాను ధరించెను.

తరువాత రాక్షసులు, "మాకు ఏమియు నీయలేదు. మాకు వలసిన యప్సరసలను పంచి పెట్టు" మని బ్రహ్మను కోరిరి. వారి మాటలు విని "యిదివరలో ఇచ్చి వేసినవి మీకివ్వబడవు. అవి అన్నియు మీకెందులకు? మీకు అమృతమున్నది గదా? దానినే స్వీకరించి మీరు చిరంజీవులై బ్రతుకు" డనెను.

ఆ మాటలు విని వారానందపడి సరే యమృత భాండమును మాకొసగు మని పట్టుపట్టిరి. వారిని జూసి బ్రహ్మదేవుడు "మీరొక్కరే దానిని త్రాగిన మిగిలిన వారు నన్ను నిందించరా? యక్షులు, గంధర్వులు, నాగులు, యితర దేవ గణములున్నారు. వారందరికి భాగములు సమానముగా పంచి బెట్టవలదా? తొందరపడకుడు, ఎట్లు వీలుగా నుండునో యెవరు దీనిని పంచిన సమముగా నెందరకు వచ్చునో చూడవలయును గదా! తొందరపడకుడని" వారించెను. దుడుకువారు మనము లాగుకొని త్రాగుద మని సిద్ధపడసాగిరి, దేవతలు వారి తొందరపాటునకు సహించలేక

వాక్కలహము లోనికి దిగిరి. మధ్యవర్తులు వారిని సముదాయించుట కష్టమయ్యెను. ఎట్లో యూరకుండ జేయ జూసినను తరముగా కుండెను. ఏమి మార్గమా? యని వారందరు తలక్రిందులు గాజొచ్చిరి.

ఏమి చేయుటకు తోచక బ్రహ్మాదులు శ్రీహరి ధ్యానము గావించిరి. సందిగ్ధ పరిస్థితులలో భక్తుల రక్షణభారము వహించువాడు, మహనీయుడు, సర్వలోక రక్షకుడును, సర్వభారములు వహించు నారాయణుడు తప్ప దిక్కులేక దేవతలు "శ్రీహరీ! యీ రాక్షసులు అమృతము సేవించినచో మా కజేయులై యుందురు. మాకు నీవు తప్ప శరణ్యము లేదు. మమ్మాపదల కాలము నందాదు కొనెడి మహనీయుడవు నీవు. మమ్ము నీ కృపా సముద్రములో ముంచి శాశ్వతానందము నొసగ ప్రార్థించు చున్నా" మనిరి భక్తులార్తనాదము లాల కించు మహానుభావుడు. వారి మొరలు విన్నాడు. చాతుర్యము భక్త రక్షణము గావించు శ్రీధరుడు, యుక్తిగా వారిని రక్షింపనెంచి చూచుచుండగానే మాయమయ్యెను.

దేవతలు, రాక్షసులు, నాగులు, ఇతర మహోరాజాలు మహామునులు క్షీరసాగర తీరమున ఈ సంరంభములో పడి కొట్టు మిట్టాడుచుండు సమయమందు బహుదూరము నుండి యేనాడు వినని కలస్వనముతో దేవతలాశ్చర్యపడిపోవు మహాగానము విన్పించసాగెను. వారందరా గానము వచ్చువైపు చెవులు దోరగా బెట్టుకొని నాగ స్వరమునకు సర్పములు పడగలు విప్పియాడినట్లు వినుచూ నాడ సాగిరి.

"మన మెప్పుడెరుగని యీ దివ్యగానము గావించునది యెవరా?" యని యావైపు చూడసాగిరి. కొంతసేపైనా తరువాత శ్రీవిష్ణువు మందమంద గమనముతో జగన్మోహినీ రూపముతో దివ్యసుందరిగా కాళ్ళ గజ్జెలు ఘల్లుమనగా, చేతి కంకణములు గలగలమని సప్తస్వరములు పల్కుచుండగా, ఎన్నెన్నో యపురూపాభరణములు ధరించి చూచినవారు మోహపరవశులై

యట్లే నిలబడునట్లు నయన గోచరముకాగా వారందరుబ్బి తబ్బిబ్బుకాసాగిరి. ఆమెను చూచిన కొలదీ మోహపరవశత్వమున ఎదురు నిలువలేక సాష్టాంగములు పడసాగిరి. వారినందరినీ మందహాసముతో, మాయా ప్రేమ వీక్షణములతో, ముద్దులు గుల్కు ప్రేమ వీక్షణములతో, ముద్దులు గుల్కు చిల్క పల్కుల తో మోహపరవశత్వములో ముంచెను. వారందరొక్కటై యా జగన్మోహినీ దేవతను తమ మధ్య కూర్చుండ బెట్టుకొనదలచి "యిట్లు రమ్మిట్లు రమ్మని బ్రతిమాలసాగిరి.

ఆ మాయా మోహిని బెట్టు చేయుచు వారి మధ్యకు వచ్చి, రాక్షస కోటికి తన చూపులతో కైపెక్కించుచు "మీరందరు యలసి నట్లున్నారు. ఏమైనా తగవు లాడుకున్నారా? మీరందరు యిక్కడెందులకున్నారు? మీ చరిత్రమేమి? నాకు జెప్పరా?" యని, ఆమె అడుగుటే తడవుగా దేవదానవులు "మేము ముందనిన మేము ముందనుచు నామెతో తమ గోడు చెప్పుకోసాగిరి . ఊకొట్టుచూ, నిట్టూర్చి మీరందరు ఒకరినొకరు కావలసిన వారులాగున్నారు. మీలో మీకు కలహ కారణమేమైనా నాకు చెప్పుడనెను. అందులకు వారిలోని రాక్షసులు ముందులకు త్రోసుకొని వచ్చి "ఓ సుందరాంగి మా రెండు తెగలవారమూ కష్టించి మధించగా ఈ సముద్రములో ఎన్నో యమూల్య వస్తువులు చిక్కినవి. కాని, వారవేమియు మా రాక్షసులకు రానీయలేదు. ఇప్పుడు మాకమృత పంపకము కావలసియున్నది. మాకీయవలసి వచ్చునను లోభముతో వారు తికమక పడుచున్నారు" అంటూ తమ కష్టం చెప్పుకున్నారు.

ఆ మాటలు వీని మాయా మోహిని దేవతల వైపు ఈసడింపుగా చూస్తూ "వీరి కన్యామయు చేయుదురా! అన్నియు మీరే పుచ్చుకుందురా? అమృతము కూడా పంచరాదా మీ వంతు తెగదా! మీరిట్లు అన్యాయము చేయరాదు. నా మట్టుకు నాకు అన్యాయమన్న మాటే గిట్టదు యని కోపపడుచున్నట్లు నటించుచు, రాక్షసుల వైపు మొగ్గు చూపసాగెను.

అందులకా రాక్షసు లపరిమితానందమును పొంది "ఓ సుందరీ! నీవు మాకు మధ్యవర్తిగా నిలచి యా యమృతము నీవే మా రెండు పక్షముల వారికి పంచెదవను నమ్మకము మాకున్నది. కావున, మాయందు దయయుంచి ఈ పని చేసి పెట్టుమని" కోరిరి. దేవతలు గూడ యంగీకరించుటతో దనుజారియైన ఆ సర్వ జగన్మోహిని బ్రహ్మదేవుని వద్దనున్న యమృత భాండమును సురాభాండమును చూచుచు "తాతా! నీవు పెద్దవాడవు. వీనిని మోయలేవు. కాళ్ళు చేతులు వణుకును. నీకు శ్రమ యెందుకు? యిట్టిమ్ము" అని చిరునవ్వులు నవ్వుచు, ఆ రెండు కలశములను తన చేతిలోనికి తీసుకొని రాక్షసుల నొక పంక్తిగాను, దేవతల నందరనొక పంక్తి గాను గూర్చుండ నియమించెను. ఆ తరువాత కలశములు గొని, వాలు చూపులతో రాక్షసులను చూచి, వారిని మోహపరచుచు, వారిని మధ్యపెట్టి – దేవతల కమృతమునూ పోయసాగెను.

మాయామోహినీ దృష్టి గల మాయాజాలంలో రాక్షసులకి సుధకి, సురకు తేడా తెలియడం లేదు. వారు వారి తొందరలోనూ శ్రీహరి మాయా విశేషములోనూ పడి సురనే సుధగా భావించి త్రాగ నారంభించారు. ఇంతలో రాక్షసులలో నొకతెలివి గలవాడు మనకమృతము దొరకుట లేదు. నేను దేవతల పంక్తిలో కూర్చుని యమృతము సేవించెదనని దేవతా వేషము దాల్చి వారి పంక్తిలో చేరి కూర్చుండి యమృతము త్రాగెను. ఈ విషయమును శ్రీహరి గమనించలేదు. సూర్యచంద్రులు గగన వీధినుండి దానిని చూచి చక్రధారికి రాక్షసుల మాయను సంజ్ఞగా చెప్పిరి. అది విని నారాయణుడు తన చక్రము ప్రయోగించి ఆ రాక్షసుని శిరస్సును మొండెము నుండి ఖండించి వేసెను.

కాని, మమృతము సేవించుటచే వాడు ఖండింపబడినను చావలేదు. తలయు మొండము రెండును గగన సీమలో సజీవముగా తిరుగాడసాగెను. తరువాత ఈ రెండు భాగములు రాహు కేతు గ్రహములుగా బాధించుట

యిప్పటికినీ మన మెరిగిన విషయమే. అటుపిమ్మట రాక్షసులు చెలరేగగా, విష్ణువు వారిని చక్రాయుధముతో నణిచి పాతాళమునకు పంపివేసెను. దేవతలు దేవ రాజ్యమును చేరిరి.

# జ్యోతిశ్చక్రము

సూతులు చెప్పింది విని దయ వుంచి జ్యోతిశ్చక్రము గురించి కూడా చెప్పుమని కోరారు మునులు.

"కుదిరినంత క్లుప్తంగా చెబుతాను వినండి!" అంటూ యిలా చెప్పసాగాడు సూతుడు.

ఈ బ్రహ్మాండంలో భూలోక, భువర్లోక, సువర్లోక, మహర్లోక, జనలోక, తపోలోక, సత్యలోకాలనే యేడు ఊర్ధ్వలోకాలున్నాయి. సూర్య చంద్రుల కిరణములు ఎంత వరకు ప్రసరిస్తాయో అంత మేరా భూలోకమని తెలుసుకోవాలి. భూమి నుంచి సూర్యుని వరకు గలది భువర్లోకం అక్కడి నుండి ధ్రువ మండలం వరకూ వున్నది సువర్లోకం. అక్కడ అవహం, ప్రవహం, అనువహం, సంవహం, వివహం, వరావహం, పరివహం అని ఏడు వాయువులున్నాయి. అలా వుంచండి.

భూమికి లక్ష యోజనాలలో భాను మండలం వుంది. దానికి లక్ష యోజనాల దూరంలో చంద్ర మండలం, అక్కడికి లక్షలో నక్షత్రమండలం అటునుండి రెండు లక్షలలో బుధుడు, అతనికి రెండు లక్షలలో శుక్రుడు, శుక్రుడికి రెండు లక్షలలో కుజుడు, అక్కడనుంచి రెండు లక్షలలో గురుడు, గురుడికి రెండు లక్షలలో శని, శనికి లక్ష యోజనా లవతల సప్తర్షి మండలం ఉన్నాయి. ఆపైన లక్ష యోజనాలలో ధ్రువుడున్నాడు.

సూర్యవిష్కంభం (వ్యాసం) తొమ్మిది వేల యోజనాలు. చుట్టుకొలత దానికి మూడింతలుంటుంది. చంద్రుడి చుట్టుకొలత సూర్యుడికి రెండు రెట్లు. రాహువు సూర్య చంద్ర మండలాల చుట్టుకొలతతో సమానమైన కొలత కలిగి వుంటాడు. అందుకే వారిని ఆక్రమించగలుగుతాడు.

రాహువుది మూడోస్థానం. అదంతా తమోమయం. ఇకశుక్రుడు చంద్రుడిలో పదహారో వంతు వుంటాడు. గురుడు శుక్రుడిలో ముప్పాతిక భాగం వుంటాడు. శని, కుజాలు గురునిలో ముప్పాతిక భాగం వుంటారు.వారిలో ముప్పాతిక వంతు వుంటాడు బుధుడు. తారానక్షత్రాలన్నీ బుధమండలంతో సమానమైన పరిమాణంలో వుంటాయి. నక్షత్రాలన్నింటిలోకి అతి చిన్న నక్షత్రం అయితే దాని చుట్టుకొలత అరయోజనం వుంటుంది. నక్షత్రమండలం పైన శని, గురు, అంగారక గ్రహాలు మందగతిని సంచరిస్తుంటాయి.

నక్షత్ర మండలం దిగువ సూర్య, చంద్ర, బుధ, శుక్ర లనే నాలుగు గ్రహాలూ ప్రవర్తిల్లుతూ వుంటాయి. ఇవి చాలా వేగవంతమైనవి.

ధ్రువుడికి కోటి యోజనాలలో వుంది మహర్లోకం. కల్పాధిపతులీ లోకంలోనే వుంటారు. అక్కడికి రెండు కోట్ల యోజనాలలో వుంది జనలోకం. బ్రహ్మమానస పుత్రులైన సనకాదులిక్కడ నివసిస్తారు. దానికి మూడు కోట్ల యోజనాల పైన – వైరాజాలకి దాహం అనేదే వుండదు. అక్కడికి ఆరుకోట్ల యోజనాలలో వుంది సత్యలోకం. త్రిగుణాత్మక బ్రహ్మ వుండేది అక్కడే. అక్కడ నైష్ఠిక బ్రహ్మచారులు, సిద్ధతాపసులు వుంటారు. ఆ త్రిగుణాత్మక బ్రహ్మలోకానికి పైన యెక్కడో వుంది విష్ణులోకం. అక్కడ మాయామయుడైన శ్రీహరి యోగి వలెశయనించి వుంటాడు. విష్ణు ప్రవృత్తి

గల మహాత్ములు మాత్రమే అక్కడకు వెళ్ళగలరు. ఆ నారాయణ లోకానికి ఊర్ధ్వాన అక్కడెక్కడో వుంది జ్యోతిర్మయమైన రుద్రలోకం. అది అగ్నితో ఆవరింపబడి ఉంటుంది. అక్కడే పరముడు దేవితో విహరిస్తూ వుంటాడు. ఇవి యేడూ ఊర్ధ్వలోకాలు.

# అధోలోకాలు

భూమికి దిగువ నల్లటి భాగాన్ని తలం అంటారు. దాని దిగువ పగడపు రంగులో ఉండే ప్రాంతం అతలం అనబడుతోంది దాని క్రింద తెల్లటి బాగం వితలం ఇక్కడ యవనాదులంటారు. తరువాతది సుతలం దీనిరంగు పసుపు పచ్చ. భుజంగాది నాగులూ, ప్రహ్లాదుడు వుంటారిక్కడ. దిగువది తలాతలం. ఇది వట్టి ఇసుక పర్ర. కాలనేమి మొదలైన రాక్షసులు కాపురముంటారు. ఆ క్రిందిది పర్వతభాగమైన రసాతలం. గరుడుడు, వాసుకి, విరోచనుడు, హిరణ్యాక్షుడు మొదలైన వాళ్ళుండే దిక్కడే. పదవది మహాతలం. చాలా నాగరికంగా వుండే యీ లోకంలో అనంతుడు, ముచికుందుడు అనే సర్పరాజులూ బలిచక్రవర్తీ వాళ్ళూ ఉంటారు. ఇంకా దిగువది పాతాళం. దాని క్రిందనే కూర్మాదినరకాలున్నాయి. అన్నింటికి క్రింద విష్ణుశరీరమైన శేషాహి వున్నాడు. కాలాగ్ని రుద్రుడు, నారసింహుడు అనంతుడు అనే పేర్లతో అతడు సంపూర్ణ యోగ సంపన్నుడు. ఈ లోకాలన్నీ ఆతనిని ఆశ్రయించే నిలబడే వున్నాయి. ఆయన కాలాగ్నిని ఆశ్రయించివున్నాడు. అంటూ ముగించాడు సూతుడు.

సూతర్షీ! కలిప్రభావానికి లొంగకుండా ప్రసన్నంగా పవిత్రంగా వుండాలంటే ఏం చేయాలి అని అడిగారు ఋషులు. “రుద్రనమస్కారాన్ని పఠించాలి” అని వుపదేశించాడు సూతుడు.

# రుద్ర నమస్కారం

ఓం॥ నమో రుద్రాయ మహతే దేవదేవాయ శూలినే
త్ర్యంబకాయ త్రినేత్రాయ యోగినాం గురవే నమః 1
నమోస్తు దేవదేవాయ మహాదేవాయ వేధసే
శంభవే స్థాణవే నిత్యం శివాయ పరమేష్ఠినే 2
నమస్సాంబామాయ రుద్రాయ మహాగ్రాసాయ హేతవే
ప్రపద్యేహం విరూపాక్షం శరణ్యం బ్రహ్మచారిణమ్ 3
మహాదేవం మహాయోగ మీశానం చాంబికాపతిం
యోగినాం యోగదాతారం యోగమాయా సమావృతం 4
యోగినాం గురుమానార్యం యోగి గమ్యం పినాకినం
సంసార తరణ రుద్రం బ్రహ్మాణం బ్రహ్మణోధిపం 5
రుద్ర నమస్కారం సమాప్తః

## కూర్మ పురాణం సమాప్తం



# 16. మత్స్య పురాణము

శ్రీ మహావిష్ణువు మత్స్య రూపంలో వైవస్వత మనువునకుపదేశించిన పురాణమే యీ మత్స్యపురాణం. "మత్స్యం మేధః ప్రవీర్యతే" మహా విష్ణువు యొక్క మెదడుతో ఈ పురాణం పోల్చబడింది. "తన్మత్స్యమితి జానీద్వం సాహస్రాణి చతుర్దశ" ఇందులో పదునాల్గు వేల శ్లోకాలున్నవని భావం. రెండు వందల ఎనుబది తొమ్మిది అధ్యాయాలున్నవి.

మత్స్యావతార వర్ణన, బ్రహ్మాండ సృష్టి, గర్భిణీ స్త్రీ ధర్మాలు, సూర్యచంద్రుల వర్ణన, పురూరవ చరితం శ్చమంతకోపాఖ్యానం శుక్రాచార్యులు చేసిన శివస్తుతి. కలి ధర్మాలు, కృష్ణాష్టమి వ్రతం, అక్షయ తృతీయా (తదియ) వ్రతం, కల్యాణ సప్తమీ వ్రతం, విశోక సప్తమీ వ్రతం, ఫల సప్తమీ వ్రతం, మహాదాన వర్ణన, పుష్పవాహన కథ, ప్రయాగ క్షేత్ర మాహాత్మ్యం, యమునా నదీ స్నాన మాహాత్మ్యం, సప్తద్వీపాల వర్ణన. త్రిపురాసుర సంహారం, దేవాసుర సంగ్రామం, త్రేత, ద్వాపర, కలియుగ ధర్మాలు, ఋషిలక్షణాలు, తారకాసుర వృత్తాంతం, పార్వతీ కల్యాణం, వినాయక విజయం, కుమార సంభవం, నృసింహావతార వర్ణన, శ్రీ కృష్ణలీలలు, కాశీక్షేత్ర మాహాత్మ్యం, సావిత్రీ సత్యవంతుల కథ, రాజ ధర్మాలు, సామదాన భేద దండోపాయాలు, సుస్వప్న, దుస్స్వప్న ఫలితాలు, వామనావతార, వరాహావతార వర్ణనలు, క్షీరసాగర మధనం, వాస్తు శాస్త్ర సిద్ధాంతాలు, క్రియాయోగ వర్ణన, అనేక విధాలైన ప్రతిమల లక్షణాలు మొ॥న విషయాలు మత్స్య పురాణంలో సాక్షాత్కరిస్తాయి.

శ్లో॥ "లబ్ధ్వా జన్మనయః కశ్చిద్ధుటయే త్పౌరుషం నరః।
జన్మతస్య వృథాభూత, మజన్మాతు విశేష్యతే॥"

ఈ ప్రపంచంలో జన్మించిన ప్రతివ్యక్తి ధర్మార్థ కామ మోక్షాలనే పురుషార్థాలను సాధించే ప్రయత్నం చేయాలి. అలా ప్రయత్నించని వాని జన్మ వ్యర్థం, అటువంటి వాడు బ్రతికినా, మరణించిన వానితో సమానమే అని భావం. ఈ విధంగా పురుషార్థముల పట్ల మానవున్ని ప్రోత్సహిస్తున్నదీ పురాణం. శ్రాద్ధకాలంలో పితృ దేవతలకు అన్న పానాదులకు సమర్పించడం మన సాంప్రదాయం. వాటికి సంబంధించిన విషయాలను మత్స్య పురాణం యిలా వర్ణిస్తున్నది.

ఆసక్తికర విషయాలు :-

శ్లో॥ దేవోయది పితాజాతః శుభకర్మానుసారతః।
తస్యాన్న మమృతం భూత్వా, దివ్యత్వేప్యను గచ్ఛతి॥
శ్లో॥ దైత్యత్వేభోగరూపేణ, పశుత్వేచ తృణం భవేత్।
శ్రాద్ధాన్నం వాయు రూపేణ, సర్పత్వేనుగచ్ఛతి॥
శ్లో॥ పానం భవతి యక్షత్వే గృధ్రత్వేపితదామిషమ్।
మనుష్యతే పి న్నపానాని, నానా భోగరసం భవేత్॥

మరణించిన పితరులు తమ శుభకర్మల వలన దేవతలుగా జన్మిస్తే శ్రాద్ధంలో నర్పించిన ఆహారం అమృతంగా మారుతుంది. దైత్యులైతే భోజనమౌతుంది! పశుజన్మనెత్తితే పశుగ్రాసంగా మారుతుంది. సర్పాలుగ జన్మిస్తే, నైవేధ్యం వాటికాహారంగా వాయురూపం దాల్చుతుంది. పక్షులైతే నీటిగా, గ్రద్దలైతే మాంసంగా, మరల మనుష్య జన్మనెత్తితే అన్నం, నీళ్ళుగావే ఉంటుందని శ్లోకార్థాలు ఇలా వివరించడం ద్వారా శ్రాద్ధకర్మల విశేషావశ్యకత తెలుస్తోంది.

ఇట్లే కాల జ్ఞానం గురించిన విషయాల్లో - బ్రహ్మకాల మానం ప్రకారం శత వర్షాలైతే, శివునికొకదిన ప్రమాణమౌతుంది. శివుని కాల మానం ప్రకారం శత సంవత్సరాలు విష్ణుదేవుని కొక నిముషమౌతుంది. "మహా విష్ణువు నిద్రిస్తే ప్రళయం, మేల్కొంటే సృష్టిస్థితి" అని ఈ మత్స్య పురాణం ద్వారా మనకు దేవ కాల పరిమితి, కాల మానం కాల జ్ఞానం తెలుస్తోంది. వాస్తు శాస్త్ర ప్రవర్తకులైన క్రింది వారి పేర్లు ఈ పురాణంలో అగుపిస్తున్నాయి. 1. భృగుడు 2. అత్రి 3. వశిష్టుడు 4. విశ్వకర్మ 5. మయుడు 6. నారదుడు 7. నగ్నజిత్తు 8. విశాలాక్షుడు 9. పురంధరుడు 10. బ్రహ్మ 11. కుమారుడు 12. నందీశ్వరుడు 13. శౌనకుడు 14. గర్గుడు 15. వాసుదేవుడు 16. అనిరుద్ధుడు 17. శుకుడు 18. బృహస్పతి- ఈ పదునెనిమిది పేర్లు అగుపిస్తున్నవి.

పతివ్రతల గురించి యిలా చెప్పబడినది:-

శ్లో॥ "తాసాం తు వాక్యం భవతీ హ్యమిథ్యా, నజాతు లోకేషు చరాచషు!

నజాతులోకేషు చరాచరషు, తస్మాస్సదా తాః పరిపూజనీయాః!!

అని మత్స్య పురాణం వర్ణించింది. పతివ్రతల పలుకులెంతో మహిమాన్వితాలై రాణిస్తాయి. వారినోటి నుంచి వెలువడే ప్రతిమాట అసత్యం కాదు. శిలాక్షరమౌతుంది. కావున పతివ్రతల యెడల సదా పూజ్యభావంతో ప్రవర్తించాలని భావం. శరీరావయువాలస్పందన (అదురుపాటు) వాటి ఫలితాలిట్లు వర్ణింపబడ్డాయి. మత్స్య రూపుడైన విష్ణువు అవయవాల అదురు పాటు ఫలితాల గూర్చి యిట్లు చెప్పెను.

పురుషులకు ఎడమ పార్శ్వములో వెన్నెముకలోనూ, గుండెమీద అదిరితే శుభం కాదు. కుడివైపు అదిరితే శ్రేష్ఠం. తల, భూలాభం, నొసలు

నందు స్థానాభివృద్ధి, కనుబొమ్మలు స్త్రీ సౌఖ్యము, లాభం, కన్ను - సేవకా లాభం, కంటి కొస - ధనలాభం, కను ఱెప్పలు - శత్రు విజయం, చెవి - శుభవార్త వినికిడి, నాసిక - సౌఖ్యం, అధరోష్ఠం - ఇష్ట స్త్రీ లాభం, కంఠం - సౌఖ్యం, భుజం - సుఖాభివృద్ధి, హస్తం - మిత్రలాభం, అరచేయి - ధనలాభం, కడుపు - సంతోషం. ఈ విధంగా మత్స్యపురాణంలో వివరింపబడ్డాయి.

## పితృ శ్రాద్ధ ఫలం :-

పితరులకు శ్రద్ధతో శ్రాద్ధం చేస్తే కలిగే ఫలం గూర్చి మత్స్య పురాణం లో ఒక చిన్న కథ యిలా వర్ణింప బడినది.

పూర్వ కాలంలో కురుక్షేత్రంలో కౌశికుడనే విద్వాంసుడుండే అతనికి 1. ఖస్పృడు 2. క్రోధనుడు 3. హింస్రుడు 4. మిథునుడు 5. కవి 6. వాగ్దుష్టుడు 7. పితృవర్తి అని ఆ విదాసునికి ఏడుగురు కుమార్లుండిరి.

వీరందరు గర్గుడనే మహా పండితుని కడ వేదాధ్యయనం చేయసాగిరి. అప్పుడు భయంకరమైన క్షామం సంభవించినది.

నియమానుసారం గురువు గారి హోమ ధేనువును మేపుటకై సమీపారణ్యానికి తోలుకని వెళ్ళారు. వీరందరికి బాగా ఆకలైంది. ఆహారం ఏమీ దొరకలేదు. ఆకలి బాధకు తాళజాలక ఆ గోవుని చంపి మాంసం భుజించారు. దాని దూడను మాత్రం భద్రంగా గురువుగారింటికి తోలుకొని పోయి అప్పగించారు. తల్లి గోవును పెద్దపులి పడి భక్షించిందని అబద్ధ మాడినారు. గోహత్యా పాతకం వలన ఈ ఏడుగురికి మరణానంతరం నీచ జన్మ ప్రాప్తించింది. కాని పూర్వ జన్మ జ్ఞానం కల్గి యుండేది. మరుసటి జన్మలో జింకలై, ఆ తర్వాతి జన్మలో చక్రవాక పక్షులై మానస సరోవర ప్రాంతంలో తిరుగుచు, ఎగురుచుండిరి.

ఒకనాడు విభ్రాజుడనే పాంచాల దేశపు రాజు ఆ ప్రాంతానికి పర్యటనకు వెళ్ళాడు. అతని రాజ భోగం చూశాక ఏడవ పక్షి తాను రాజు కాదలచింది. అయిదవ, ఆరవ పక్షులు మాత్రం తాము మంత్రులు కావాలని తలచాయి. మొదటి నాల్గు పక్షులు మాత్రం ఏవిధమైన కోరికలను కోరుకొనలేదు. ఏడవ పక్షి తన సంకల్పం ప్రకారం విభ్రాజ మహారాజు పుత్రునిగా జన్మించింది. అతని పేరు బ్రహ్మదత్తుడు. రాజ కుమారుడుగా పుట్టిన ఆ పక్షి సమస్త విద్యలు, పక్షి, జంతు భాషలు నేర్చుకొన్నది. అయిదు, ఆరవ పక్షులు వాటి కోరిక ప్రకారం మంత్రులై పుట్టాయి. పుండరీకుడు, సువాలుడని వీరి పేర్లు. మొదటి నాల్గు పక్షులు ఒక బ్రాహ్మణుని కుమారులుగ పుట్టినవి. బ్రహ్మదత్తునికి యుక్త వయస్సు రాగానే, విభ్రాజు డాతనికి పట్టాభిషేకం చేసి, వాన ప్రస్థానికి వెళ్ళాడు.

ఇలావుండగా పూర్వ జన్మలో ఈ సోదరు లేడుగురు చంపిన ఆవు దేవలుడు అనే వానికి కుమార్తెగా జన్మించింది. ఆమెను పెండ్లాడి సుఖ జీవనం చేయసాగడు రాజైన బ్రహ్మదత్తుడు. ఒకనాడు భార్యా భర్త లిద్దరు వన విహారార్థం ఉద్యాన వనానికి వెళ్ళారు. అక్కడ ఆలు-మగలైన చీమల జంట వివాద పడుచున్నవి. సకల పక్షి జంతు భాషలు తెలిసిన రాజు బ్రహ్మమిత్రు డాసక్తిగా వాటి తగవును చూస్తూ గమనింపసాగాడు.

అప్పుడు ఆడ చీమను శాంతింప చేయుటకై మగచీమ యిలాగంటున్నది.

శ్లో॥ "నత్వయే సదృశీలోకే, కామినీ విద్యతే క్వచిత్!
మధ్యేక్షామాతి జఘనా బృహద్వక్షోరు గామినీ!!

శ్లో॥ భోజ్య సే మయి భుక్తేత్వం, స్నాసి స్నాతే తథామయి!
ప్రోషితే సతి దీనా త్వం, క్రుద్ధేసి భయ చంచలా!!

శ్లో॥ కోమర్థం వద కల్యాణి సరోష వదనా స్థితా!"

"ప్రేయసీ! నీవంటి సౌందర్య రాశి ప్రపంచంలో నెక్కడా లేదు. సన్నని నాజూకైన నడుము, బలిసిన జఘనం, చక్కని పాలిండ్లు వెు॥ బాహ్య సౌందర్యంతో పాటు నీ ఆత్మ సౌందర్యం కూడా చాలా గొప్పది. నేను భుజించాకనే నీవు భుజించేది. నాకు స్నానాలు చేయించాక నీవు చేయడం, నే నెక్కడికైనా ప్రయాణమైతే దీనంగా ఎడబాటు సహింపలేక వణికి పోవడం, దీనంగా కాలక్షేపం చేయడం, నేను కోపపడితే భయంతో వణికి పోవడం మొదలగు పతివ్రతా గుణాలు నీ స్వభావాలు. ఇలాంటి నీవు నా మీద అలిగినావు. కారణం చెప్పుమని అడిగిందని" భావం. అపుడు ఆడచీమ యిలా సమాధానమిచ్చింది.

శ్లో॥ "త్వయా మోదక చూర్ణం తు మాం విహాయాభిలష్యతా!
ప్రమత్తే నవ్యతి క్రాన్తే, దినే న్య స్యా: సమర్పితమ్!!"

"కుముడుల పిండి నీవు నా కివ్వక మరో ఆడ దాని ఆకర్షణలో పడి, దానికి కివ్వడం న్యాయమా! అందుకే నాకు నీమీద కోపంగా వున్న"దని భావం. అందుకు సమాధానంగా మగ చీమ మళ్ళా యిట్లాగన్నది.

శ్లో॥ "త్వ త్సాదృశ్యా న్మయాదత్త, మన్యస్యావర వర్ణినీ!
తదేక మపరాధం మే క్షన్తు మ్మర్హసి భామినీ!!"

శ్లో॥ "నైత దేవం కరిష్యామి, పున: క్వాపీ హనువ్రతే!
సస్పృశామి పాదౌ సత్యేన, ప్రసీద ప్రణతస్యమే!!"

"భామా మణీ (భామినీ) ఆ, ఆడ చీమ అచ్చం నీ వనిపించే లాగున్నది. నీవేనేమో అనే భ్రాంతి చెంది నేనలా ప్రవర్తించాను. ఈ ఒక తప్పు మన్నించు, ఇంకెప్పు డిలాంటి తప్పు చేయనని, జరగనీయనని నీ పాదాల

సాక్షిగా ప్రమాణం చేస్తున్నా" అని భావం. ఈ మాటలతో ఆడచీమకు మగనిపై ముందున్న కోపమంతా మాయమై పోయింది. సంతోషంతో పరస్పరం గాఢ పరిష్వంగంలో లీనమయ్యారు. ఇది అక్కడ బ్రహ్మదత్తుడు చూచిన దృశ్యం. ఎంత అద్భుతంగా వున్నది. ఈ చీమల సంభాషణను పూర్తిగా అర్థం చేసికొన్నాడు బ్రహ్మదత్తుడు.

బ్రహ్మదత్తుడు సకల జంతు పరిజ్ఞానం ఆయన తండ్రి విభ్రాజాని తపః ప్రభావమే. అయన మహావిష్ణువును తన కుమారుడైన బ్రహ్మదత్తునికి సకల విద్యలు, జంతు భాషా జ్ఞానం ప్రాప్తించాలని ప్రార్థించాలని, అందుకే జంతు భాషా జ్ఞానం బ్రహ్మదత్తునికి అలవడింది.

ఇట్లుండ బ్రహ్మదత్తుని పెద్దన్నయ్యలు నలుగురు పేద విప్రునింట పుట్టి పెరిగి పెద్దవారయ్యారు. వారు యోగాభ్యాసం కోసం బయలు దేరుతుంటే తండ్రి "నన్ను వృద్ధాప్యంలో విడిచి వెళ్ళ వద్దన్నారు. నాకిక్కడ దిక్కెవ్వరు?" అని ప్రశ్నించాడు. మరేమీ పర్వాలేదు. నీకొక శ్లోకం చెపుతాము. ఈ నగరానికి రాజైన బ్రహ్మదత్తుని దగ్గర దానిని పఠిస్తే నీ కష్టాలన్నీ గట్టెక్కుతాయి. కోరినంత ధనమిస్తాడు. దానితో సుఖంగా ఉండవచ్చు, అని చెప్పి ఆ శ్లోకం వ్రాసి యిచ్చి తమ దారిన వెళ్ళి పోయారు.

చీమల జంట సరస సంభాషణను ప్రణయ కలహాన్ని గూర్చి విన్న రాజా బ్రహ్మదత్తు తన భార్యకు దానిని వివరించాడు. ఆమె దానిని నమ్మలేదు.

"నీకు చీమల భష ఎలా తెలుస్తుంది నీవు నన్ను చూసే నవ్వావు" అని నిష్ఠూరంగా మాట్లాడింది. భర్తపై అలుక వహించింది. చేయుగలిగింది లేక ఆమెతో రాజమందిరానికి వెళ్ళిపోయాడు. ఆ మరుదినమే"సప్తరాత్రం" అనే మంత్ర పారాయణ ప్రారంభించాడు బ్రహ్మదత్తుడు. నియమ నిష్ఠలతో ఆచరించాడు. ఏడవ రాత్రి అతనికొక కల వచ్చింది. శ్రీ మహావిష్ణువు

బ్రాహ్మణ వేషంతో ప్రత్యక్షమై యిలాగన్నాడట! "నీవీ దినం ఉదయం నగరమంతా తిరుగు. నీకొక వృద్ధ బ్రాహ్మణుడు ఢగుపిస్తాడు. అతన్ని దర్శించాక నీ సందేహాలన్నీ తీరిపోతాయి." అని అదృశ్యమయ్యాడు స్వామి. బ్రహ్మదత్తుడట్లే చేశాడు. ఒక వృద్ధుడు ఎదురయ్యాడు. ఆ వృద్ధుడీ శ్లోకం చదివాడు.

"శ్లో॥ హేవిప్రముఖ్యా! కురు జాంగలేషు వ్యాధాస్త థా దాశపురే
మృగాశ్చ కాళం జరే సప్త చ చక్రవాకా, యే మనసే తేవయు మంత్ర సిద్ధా:॥"

కురుక్షేత్రంలో బ్రాహ్మణులుగను, దాశపురంలో వేటగాళ్ళుగను, కాళంజరమనే చోట జింకలుగను, మానస సరోవరంలో చక్రవాక పక్షులుగా నుండిన మన యేడుగురిలో ప్రస్తుతం మేము నలుగురం యోగ సిద్ధులమయ్యాం అని దీని భావం. ఈ భావం గ్రహించినంతనే బ్రహ్మదత్తుడు, అతనితో మంత్రులుగ తన దగ్గరున్న యిద్దరన్నయ్యలను పూర్వ జన్మలను గుర్తుకు తెచ్చుకొన్నారు కాస్సేపటికి జ్ఞానోదయ మైంది. ఐహిక సుఖాలతో కాలక్షేపం చేయదలచుకోలేదు. విరక్తి గల్గి, తాము కూడా సిద్ధులు కావాలని నిశ్చయించుకొన్నారు. రాజు వృద్ధ బ్రాహ్మణునికెన్నో సంపదలు, అగ్రహారాలు దానమిచ్చాడు. తర్వాత బ్రహ్మదత్తు తన కుమారుడైన విష్వక్సేనునికి రాజ్యాధికారమిచ్చి తన యిద్దరన్నయ్యలతో (మంత్రులతో) కలిసి మానస సరోవర తీరానికి తపము చేసికొన దలచి వెళ్ళారు. తక్కడున్న తన నల్గురన్నయ్యలతో గలిసి యోగాభ్యాసం చేసి సిద్ధిని పొందారు.

ఈ విధంగా ఒకప్పుడు మహాపాతకమైన గోహత్య చేసినప్పటికీ వీరిట్లు యోగసిద్ధులు కాగల్గినారు. దీనికి కారణం భక్తి శ్రద్ధలతో ఆచరించిన పితృ శ్రాద్ధమే అని మత్స్య పురాణమిట్లు ప్రబోధిస్తున్నది.

శ్లో॥ "ఏవమాయుర్ధనం విద్యాం, స్వర్గం మోక్ష సుఖాని చ!
ప్రయచ్ఛన్తి సుతాన్రాజ్యం, నృణాం ప్రీతా: పితామహా!!
శ్లో॥ య ఇదం పితృమాహాత్మ్యం బ్రహ్మదత్తస్య చ ద్విజా!
నరేభ్య: శ్రావయే ద్యోవా, శృణోర్యథ పఠేతవా!
కల్పకోటి శతం సాగ్రం, బ్రహ్మలోకేమహీయతే!!"

పితృదేవతల సంతృప్తి పరచితే తమ సంతానానికి ఆయుర్వృద్ధి, ధనం, విద్య, స్వర్గం మోక్షం మొదలైన సుఖాలను ప్రసాదిస్తారు. పితరుల మాహాత్మ్యం తెల్పే యీ బ్రహ్మదత్తుని కథ చదివే వారు విన్నవారు బ్రహ్మ సాయుజ్యం పొందగలరని పై శ్లోకం భావం.

శ్లో॥ "అస్మాత్పురాణా దపి పాద మేకం పఠేత్తు య: సోపి విముక్త పాప:!
నారాయణాఖ్యం పదమేమతి నే నమనంగ వద్దివ్య సుఖాని భుంక్తే!!"

పరమ పవిత్రమైన ఈ మత్స్య పురాణంతో కనీసం ఒక్క పాద భాగమైనా శ్రద్ధతో చదివితే చేసిన పాపాలన్నీ నశిస్తాయి. అంత్యకాలాన శ్రీ మన్నారాయణుని నివాసమైన వైకుంఠానికి చేరుకొంటారు. అక్కడ విష్ణువుతో సాయుజ్య ముక్తి నంది సకల సుఖాల ననుభవిస్తారు.

## ప్రళయ సముద్రము - నారాయణుడు

ఈ పురాణాన్ని మత్స్యమూర్తి మనువుకు చెప్పాడు – కల్పాంతం కాగానే ప్రళయం సంభవిస్తోంది. ప్రళయమనగా – పర్వత, వన, దుర్గ సముద్ర, పట్టణ, గ్రామాదులనే వ్యత్యాసము లేకుండా సృష్టిసమస్తం జలమయమై యుండటం, అంతరజల సంపన్నులైన మహామేఘములా సమయమున కల్పింపబడగా అవి యెడ తెరిపి లేకుండా వర్షించును.

ఆ సమయములో ద్వాదశాదిత్యులు పెక్కువయుంది చంద్రులు కల్పింపబడుదురు. అనూహ్యమయిన వర్షముపడి యెత్తుపల్లములు పర్వతములను వ్యత్యాసము లేకుండా జలమయమై పోవును. ఆ సమయమే బ్రహ్మప్రళయంగా చెప్పబడెను. దేవతలందరు భస్మీభూతులగుదురు. ఆ సమయంలో శ్రీమన్నారాయణుడు కల్పవృక్షము క్రింద శేషుని మీద శయనించును. యోగనిద్రలో నుండును. కొంతకాలమట్లు జరుగును. పిదప పరబ్రహ్మ నిద్ర లేచు కాలము వచ్చును. అతడు తన నిద్రనుండి లేచి జలమయమై యున్న సమస్తమును చూచును. తరువాత నాతడు సృష్టిచేయదలచి దానిని గురించి యోచించును.

పరబ్రహ్మ – యోజనములు దీర్ఘములగు బాహువు లను సాచి యా జలమును చేతులతో మథించును. అట్లు మహాజలమును మథించగా నరుగుపుట్టును. దానినుండి రెండు పెద్దబుడగలు ఆవిర్భవించును. వాటినుండియే గగనము భూమియు కల్పింపబడి బయటపడును, భూమినుండి మన్ను పెద్దపెద్ద రాళ్ళు మొదలగునవి బయటపడును. ఆ సమయములో శ్రీహరి నాభినుండి యొక కమలము పుట్టినూరు యోజనముల విస్తీర్ణము గల్గియుండును. తరువాత నారాయణుడొక భ్రమరరూపాన్ని ధరించి దాని చుట్టూ తిరుగచు చాలాకాలము తరువాత దాని గర్భములోనికి ప్రవేశించును. తన తేజమంతయు నాభికమలమునకు సంక్రమింపజేసి, తన నిజస్వరూపాన్ని తాను పొందుతాడు ఆ కమలమునుండి నాలుగు మొగ్గలతో యెనిమిది చేతులతో దండక మండలములు, రత్నకమలములతో సృష్టికర్త బ్రహ్మ జన్మించును. ఆ బ్రహ్మ యట్లు పుట్టి నలుదిశలకు పరికించి చూడ మొదలు పెట్టును.

అతడన్నిదిక్కులు చూచినను, అంతయు జలమయముగా నుండి తానున్న కమలమున్న స్థానము కన్పించదు. ఎటువిన్నను ప్రణవనాదము

విన్పించుచుండును. అతడు తోచక ఏమీ చేయునది లేక తానున్న కమలనాళముగుండా లోనికి పోవును.

అట్లాతడు లోనికి పోవుచుండగా బ్రహ్మాండ మంతయు నదీనద సముద్ర పర్వతద్వీపాదులతో గుబగుబలాడుచున్న గోళమువలే కన్పించుటచే విసిగి, వచ్చిన దారినే మరలివచ్చి యాకమలగర్భములోనే విచారించుచు కూర్చుండును. ఆ సమయములో నాతనికి తపతప యనుపదములు విన్పించును. బ్రహ్మదానినే మననం చేసికొంటూ కొన్ని వేల సంవత్సరాల పాటు ధ్యానగతుడై తపమాచరిస్తాడు. తరువాత అతనికి శ్రీహరి దర్శనమిచ్చి "నిన్ను సృష్టికార్యమునకు నియోగించితిని, ప్రకృతియంతయు నీస్వాధీనములో నుండును" అని ఆజ్ఞాపించెను. వెంటనే ప్రకృతి స్త్రీ రూపములో వచ్చి యా బ్రహ్మశరీరము నందు నిలిచినది. అతడు ప్రకృతికలయికతో సరస్వతీ స్వరూపముగా నామె శక్తి స్వరూపిణియై నిలిచినది. ఆదిశక్తి వర్ణచ్ఛాయను గల గాయత్రి మహాశక్తిని తననుండి వెలికి రప్పించినది.

గాయత్రీశక్తికి సావిత్రి యుద్భవించినది. బ్రహ్మముఖములనుండి యారేసి యక్షరములు వేదమంత్రములుద్భవించి చతుర్వింశత్యక్షర గాయత్రిగా వేదమాతగా జన్మించినది. పిమ్మట బ్రహ్మ భ్రూమధ్యమునుండి దక్షప్రజాపతి జన్మించెను. తరువాత బ్రహ్మమానసపుత్రులు, ప్రజాపతులు జన్మించసాగిరి; బ్రహ్మదేవుడు తన ముఖములనుంచి వేదములను గానము చేయనారంభించెను. అతని సంతానమందరూ వేదములను గానముచేయనారంభించిరి. అతని సంతానమందరూ ఆ వేదములను చదువసాగిరి. తరువాత "యీ జలములను యింక చేయు"మని శ్రీహరిని బ్రహ్మకోరెను. బ్రహ్మకోరినట్లు శ్రీహరి "యీ సృజించిన జీవులలో తానులోననుండి చైతన్యము గల్గింతునని" చెప్పెను. తరువాత కోటి

సూర్యకాంతులుగలనొక మహాతేజమును గల్గించి యా ప్రళయజలమును హరింపజేసెను. బ్రహ్మయు సృష్టిచేయ ప్రారంభించెను, అందులలో ఏడూర్ధ్వ లోకములు, యేడధోలోకములు కల్గించెను.

ఈ లోకములందు ద్వీపములు, ఖండములు, రాజ్యములు, నదీనదులు, మహాపర్వతములు, సముద్రములు, పట్టణములు, పల్లెలు మహారణ్యములు, పుణ్యతీర్థములు ఇత్యాది సమస్త ప్రదేశములు కల్పించెను. అందాయా గతులతో జీవులను సృజించి వారికుపాధులు గల్పించెను. వారందరూ రకరకములుగా సంచరించుచు భోగభాగ్యము లనుభవించుచు కర్మఫలముల ననుసరించి దేహములను విడచుచుందురు.

## మత్స్యావతారము

శ్రీహరి యోగ నిద్రనుండి వటపత్రశాయియై యుండగా ప్రళయములో సమస్త లోకము లంధకార మయములై యుండును గదా! అట్లాతడు యోగనిద్రలో నున్న సమయములో నాతని చేతి నుండి శంఖము నుంచి ఒక రాక్షసుడు జన్మించెను. పుట్టగానే వానికి క్షుద్బాధ పెరిగినది ఆ బాధ భరించలేక యాత డావురావురు మని యరువసాగెను. అట్లరచి తిరిగి తిరిగి బ్రహ్మ దేవుని సమీపించి మ్రింగజూచెను. అతడు కలవరపడసాగెను. ఇంతలో నాతని తొడపై నున్న వేదజాలమును చూచి యాహార వస్తువుగా దలచెను. బ్రహ్మదేవుడు లేవబోగా నా వేద జాలము నీట బడెను. దానిని రాక్షసుడు తనతో గొనిపోయి సముద్రమున కడుగున నుండి పోయెను.

వేదములు జారి, రక్కసుని చేతిలో బడగానే కంగారుపడి బ్రహ్మ శ్రీమన్నారాయణున్ని సమీపించి స్తోత్రములు గావించి యిట్లనెను. "నారాయణా! నీ శంఖమువలన జన్మించిన రాక్షసుడు నా వేదములను

హరించుకొని పోయెను. నాకు వేదములు లేని కారణమున సృష్టికి హేతువు లేకున్నది. నాకు చేదోడు వాదోడుగా నున్న వేద ప్రపంచము వాడు గొనిపోగా నేను దుర్బలుడనైనాను. నాకు నీవు వాని వద్ద నుండి వేద సంచయము మరల చిక్కునట్లు చేయవలసినదని' ప్రార్థించెను. గడగడ వణకుచువచ్చిన బ్రహ్మదేవుని చూచి నారాయణుడు జాలిపడి "విధాతా! విచారమెందులకు నేను పోయి యా రాక్షసుని వధించి నీకు వేదములను తెచ్చియిచ్చెదను. శాంతిపొందు" మని యూరడించి పంపెను., తరువాత శ్రీహరి మహామీనరూపము ధరించెను. గదాయుధము, చక్రాయుధము ధరించి నాలుగు భుజములు గల్గి ప్రళయ సముద్రము నీదుచు ముందుకు చొచ్చుకొని పోవసాగెను.

అట్లాడతడు దినదినము శరీరమును పెంచుచు యేడు రోజులకు పూర్ణబలయుక్తమీన శరీరము దాల్చెను. మహా మీనముగా నుండి సముద్రము కళవళపడు నట్లీదుచూసాగిపోవుచున్న యా మీనస్వరూపమును శంఖాసురుడు చూచెను. తన కిన్నాళ్ళనుండి యాహారము కడుపునిండా లేకుండుటయు, ఎదురుగా మహాభోజనమున కనువగు మీనము చూచి సంతోషించెను. వెంటనే మహామీనముగా నున్న శ్రీహరి మీదకు వచ్చి చూచి "నీవెవడవు? నాకు మేలైన యోగిరము దొరకిన" దనగా విని సర్వేశ్వరుడు నవ్వి "నీవు జన్మిస్తూనే నా శంఖము, వేదములను స్వాహాచేసినావు. శంఖమును వేదముల నిత్తువా? బ్రతుకుదువు, లేకున్న నిన్ను సంహరించి వాటిని గొనిపోదు"నని ప్రతిధ్వనించునట్లు పల్కెను. అది విని వాడు "నీవెవడవు? నీ చేతిలోనివి యేమి యావస్తువులు? నాకు చాలా కాలమునుండి తిండి కడుపునిండా లేకుండా బాధపడుచున్నాను. నిన్ను భుజించి నా యాకలి తీర్చుకొందును చూడు" మని యాచక్రధారిమీద బడబోయెను. "మూర్ఖులకు చేయు హితోప దేశమువలన ప్రయోజన ముండ"దని హరి తన చక్రాయుధమును గొని వాని శిరస్సు ఖండించెను.

తరువాత వాని యుదరగత శంఖమును గ్రహించి తాను ధరించెను. శంఖముతో పాటుగానే వేద సంచయమును యీవలకులాగి బ్రహ్మదేవునకు నిచ్చెను. తరువాత ఆ వేదబలముతో "సృష్టిని గావించు" మని యాజ్ఞాపించెను. ఇదివరలో నీటి బుడగవలన సృష్టింపబడిన భూమిని బ్రహ్మదేవుడి సృష్టిబలముతో జీవరాశులు తిరుగాడుచుండెను. శ్రీహరి తనమనస్సు నుండి చంద్రుడిని కల్పించెను. ముఖమునండి వీతిహోత్రుని (అగ్నిని) పుట్టించెను. శరీరమునుండి వాయువులను లేవదీసెను. హృదయకుహరమునుండి మేఘజాలమును వెలికి దీసెను. వదనము నుండి మహామునులు (సప్తమహాఋషులు) మరీచి మొదలగు వారు జన్మించిరి. వారికి బ్రహ్మ యుక్తమైన కన్యలను సృజించి వివాహములు గావించెను. తరువాతనొక అండముపుట్టి (గుడ్డు) యందుండి స్వాయంభువ మనువు జన్మించెను పిదప విశ్వకర్మకల్గెను.

బ్రహ్మదేవుడు హంసవాహనము నెక్కి శ్రీహరిని దర్శించి "కాలనిర్ణయముగా దివారాత్రములు విభాగించుమని" ప్రార్థించెను. మేరు పర్వతమును భూమధ్యముననిల్పి యెనుమిది కులపర్వతములు, ఎనిమిది దిక్కులందు నిల్పెను. తరువాత శ్రీహరి మన్మథుని కల్పించెను, సూర్యకిరణములు తగ్గించి సముద్రములందు జలమును నిలువజేసి యుంచెను. బ్రహ్మ వలన నాల్గు వర్ణములవారు కల్గిరి. పైన ఏడులోకములు, క్రింద ఏడు లోకము లందు ప్రజలను సృష్టిగాంచెను.

# సృష్టిక్రమము

దక్షప్రజాపతి కుమార్తెలను శివునకు, శ్రీహరికి, చంద్రునకు, సూర్యునకు, అగ్నికి యమునకు, కశ్యప ప్రజాపతికి నిచ్చిర వివాహం

గావించెను. ఆయనకు కదితివలన దేవతలును, దితివలన రాక్షసులును కల్గిరి. దేవతలలో ప్రముఖుడు యింద్రుడై, దేవతలకు ప్రభువై అమరావతిని రాజధానిగా చేసుకొని స్వర్గమును పాలించుచుండెను.

తూర్పునకింద్రుడు, ఆగ్నేయమున కగ్ని, దక్షిణమునకు యముడు, నైఋతికి నిఋతి, పడమరకు కుబేరుడు, యీశాన్యమునకు యీశానుడు దిక్పాలకులై యుండిరి. దితి సంతానము దైత్యులు పాతాళమునకు బోయి, అచట రాజ్యము స్థాపించుకొని, కులగురువుగా శుక్రాచార్యులను నియమించుకొనియుండిరి.

శ్రీహరి సావకాశముగా వియన్మండమున నవగ్రహములు, ద్వాదశ రాశులు ఏర్పాటుచేసి కాలగమనము గణనమునకు గొనివచ్చెను. సూర్యుడు, చంద్రుడు, కుజాడు, రాహువు, గురుడు శని, బుధుడు, కేతువు, శుక్రుడు నవగ్రహములనబడును. ద్వాదశ రాసులకు మేషము, వృషభము, మిధునము, కర్కాటకము, సింహము, కన్య, తుల, వృశ్చికము ధనుస్సు, మకరము, కుంభము, మీనము, అని నామకరణము గావించెను. చంద్ర, సూర్యగణములతో దివారాత్రములు కల్గుచుండెను. చంద్ర గమనము నక్షత్రసంచారముతో దినములు లెక్కించబడుచున్నవి. నక్షత్రము లిరువదియేడు. అశ్వనీ, భరణి, కృత్తికా మొదలగు నామములతో వ్యవహరించబడును.

చంద్రుడు రోజున కొక నక్షత్రములో సంచరించును. ఇరువదేడు దినములకు మరల రాశిలో ప్రవేశించును. గణితములో హెచ్చుతగ్గులతో నెలలో వెనుకముందు రాశులందు గమనము లేర్పడును. దానిన బట్టి రోజా, ఆనాటి నక్షత్రము, తరువాత రాశులు, రాశియందు గ్రహసంచారము, దశలు, కాలప్రమాణము లేర్పడును. ఈ విధముగా సృష్టి ప్రారంభమయ్యెను.

# కచ - దేవయాని

స్వర్గాధిపత్యం పొందాలనే ఆశగల రాక్షసులకీ, ఆ యాధిపత్యాన్ని తామే నిలుపుకోవాలనే తపనగల దేవతలకీ తరచూ తగవులు జరుగుతూండేవి. ఆ రణరంగాలలో మృతులైన రాక్షసుల్ని, వారి గురువైన శుక్రాచార్యుడు మృత సంజీవినీ విద్యతో పునర్జీవితుల్ని చేస్తుండేవాడే. తద్వారా రాక్షసజాతి - వృద్ధిచెందడమేగాని, తగ్గడం లేదు. పెరుగుతున్న రాక్షసుల సంఖ్యవల్ల దేవతలకు పీడన యెక్కువ కాసాగినది. దేవతలు తమ గురువైన బృహస్పతితో ఆలోచించారు. బృహస్పతి - తన కుమారుడైన కచుడు అనేవాణ్ణి పిలిచి - ఎలాగైనా సరే కష్టపడి, శుక్రుడి దగ్గర మృత సంజీవనీ విద్యను నేర్చుకొనిరమ్మన్నాడు. తండ్రి మాటని తలదాల్చి దానవ స్థావరానికి చేరాడు కచుడు. విద్యార్థిగా వచ్చిన కచుని (అంగీరసుణ్ణి) శిష్యుని అంగీకరించాడు శుక్రుడు.

శుక్రుడి కూతురు దేవయాని చూడచక్కని యౌవన వతియైన ఆ ముగ్ధ - కచున్ని చూసిచూడగానే కామించింది. శుక్రుడికి కూతురి మాటే వేదవాక్కులావుండేది. స్వకార్యార్థం కచుడు శుక్రుడితోబాటు, దేవయానికి కూడా ప్రీతికలిగేలా ఆమెను సేవిస్తూ వుండేవాడు.

కచుడి విద్యాభ్యాసం రాక్షసులకు కంటకంగా వుంది. శత్రుపక్షం వాడు వచ్చి తమ రహస్యాలు తెలుసుకోవడం ఎవరు మాత్రం భరించగలరు? అందుకే - శుక్రుడి దగ్గరకు వెళ్ళి "కచుణ్ణి ఆశ్రమంనుంచి తరిమేయు"మన్నారు. శుక్రుడు అంగీకరించలేదు. "విద్యనుకోరివచ్చినవాణ్ణి - నిరాశామయుంగా వెనక్కి పంపన"న్నాడు. పైగా - దేవయాని కచుడి పక్షాన నిలబడింది. ఇది కాదు పని అనుకున్నారు రాక్షసులు. ఒకనాడు

గోపాలనా నిమిత్తం అడవి వెళ్ళిన కచుణ్ని పట్టుకొని మట్టుబెట్టి, (చూపి) శవాన్ని ఓ చెట్టుకు వ్రేలాడగట్టి వెళ్ళిపోయారు. సాయంకాలమైంది. ఆవులు ఆశ్రమం చేరాయి గాని – వాటిని తోలుకుని పోయిన కచుడు రాలేదు. దేవయాని దిగులు పడింది. శుక్రుడి వద్దకువెళ్ళి –"తండ్రీ!

ఉ॥ వాడిమయూఖముల్ కలుగు
వాడపరాంబుధిగ్రుంకె, ధేనువుల్
నేడిటవచ్చె, నేకతమనిష్ఠమెయిన్
భవదగ్నిహోత్రముల్
పోడిగవ్రేల్వగాబడియె
ప్రొద్దునుబోయె, కచుండు నేనియున్
రాడు, వనంబులోన మృగ
రాక్షస పన్నగ బాధనొందెనో"

అని విలపించింది. శుక్రుడు తన దివ్యదృష్టితో కచుడి శవాన్ని గుర్తించి దేవయానికి చెప్పాడు. విషయం తెలియగానే విలవిల లాడిపోయింది దేవయాని. కూతురలా కుమిలిపోవడాన్ని చూడలేక పోయాడు శుక్రుడు. "అమ్మాయీ! నీవు ధైర్యంగా వుండు నా వద్దనున్న మృతసంజీవినీ విద్యా ప్రభావంతో కచుణ్ని బ్రతికిస్తాన"ని వాగ్దానం చేసాడు. శుచియై – మంత్రాన్ని జపించి – కచుడ్ని ఆహ్వానించాడు. నట్టడవిలో శవంలా పడివున్న కచుడు బ్రతికాడు. ఆశ్రమానికి వచ్చాడు. దేవయాని ఆనందించింది. దానవుల గుండెలు పగతో దహించుకుపోయాయి."ఈ సారి కచుడి గాలితాలూకు ఉనికి కూడా శుక్రుడికి తెలియకుండా వుండేలాగా – అతనిని చంపాలి" అనుకున్నారు.

మరొక అవకాశం రాగానే దైత్యులు కచుణ్ణి మళ్ళా వధించారు. శవాన్ని కాల్చివేశారు, ఆ బూడిదను కల్లులో కలిపి వేశారు. శుక్రుడికి కల్లు అంటే ప్రీతి. అందువల్ల – కచుడి బూడిద కలిపిన కల్లును తాగినమైకంలో, అరకన్నులతో నిద్రపోసాగాడు శుక్రుడు. కాని దేవయాని మాత్రం కచుడు కానరాక కలతపడిపోసాగింది. తండ్రిచూస్తే – తాగిపడుకుని వున్నాడు. మనసుపడినవాడు కానరావడంలేదు. రాక్షసులేమో కచుడి మీద కత్తిగట్టివున్నారు. గతంలో ఒకసారి వధించారు కూడాను. బెంబేలు పడిపోయిన దేవయాని – తనకి కచుడే ప్రధానమని నిశ్చయించుకున్నదై శుక్రుణ్ణి సమీపించింది.

మాదక ద్రవ్యం యొక్క మత్తులోవున్న తండ్రిని తట్టి లేపింది. తన హృదయావేదన తెలిపింది. అంత మైకంలోనూ శుక్రాచార్యుడు కుమార్తె దుఃఖాన్ని భరించలేకపోయాడు. కచుణ్ని రాక్షసులే చంపివుంటారని ఆయన కూడా శంకించాడు. వదలని కల్లుమత్తులోనే కళ్ళుమూసుకొని దివ్యదృష్టితో పారజూశాడు. యోగసంభరిత శరీరుడు శుక్రుడు. ఎప్పుడైతే ధ్యానమగ్నుడవడానికి సిద్ధపడ్డాడో అప్పుడే కల్లుప్రభావం, ఆయన దేహాన్నుంచి తొలగిపోయింది.

శుక్రుడికి భూలోకంలో ఎక్కడాకూడా కచుడి జాడ కానరాలేదు. అతల, వితల, సుతల, తలాతల, రసాతల, మహాతల, పాతాళంలోగాని, భూ, భువ, సువ, మహాజన తపోసత్యలోకాలలోగాని – యేడేడు పధ్నాలుగు లోకాల్లో కూడా కచుడి జాడ కానరాకపోవడంతో శుక్రుడు కూడా చోద్యపడిపోయాడు. మహామేధావి శుక్రుడు. కార్య, కారణావకాశకోణాలలో యోచించాడు. ఇలా జరిగివుండవచ్చునను కున్నాడు. సర్వభూతాలనూ సమాహితం చేసి మృతసంజీవనిని ధ్యానించాడు – కచా – కచా – కచా అని ముమ్మారు పిలిచాడు.

బుగ్గిగామారి కల్లులో చేరి గురుగర్భాంతర స్థితుడైన కచుడు - గురువు ఉదరంలోనుండే సజీవుడై - "గురుభ్యోన్నమః" అన్నాడు. శుక్రు డావందనాన్ని విన్నాడు, జరిగింది గ్రహించాడు.

తన కడుపుపంటయైన దేవయానిని సంతోషింపచేయటం కోసం శుక్రుడు - "నాయనా కచా! నాకడుపు చీల్చుకొని బయటకు రా" అన్నాడు కాని కచుడురాలేదు. "గురుదేవా! మీ వుదర భేదనంవల్ల - మీరు మృత్యుపాలౌరని భయంగావుంది. ఏతత్కారణంగా నేను గురుహంతకుణ్ని అవుతాను. నన్ను బ్రహ్మహత్యాదోషం పట్టుకుంటుంది. ఇంకొక మాట - మీరు నాకు విద్య నేర్పుతానని మాట యిచ్చినారు. నేర్పకుండా మరణిస్తే మీకు అసత్యదోషం అంటుకుంటుంది. అందువల్ల మీరు మోక్షంపొందటం కష్టం. ఈ సర్వానార్థానికీ నేనే కారణమవుతాను. అందువల్ల నన్నిలా మీలోనే లీనమైపోనివ్వండి" అన్నాడు.

శుక్రుడు నవ్వేడు. "నాయనా కచా! బుద్ధికి బృహస్పతి" అని మీనాన్న గారికి పేరువుంది. ఆయన కుమారుడివి నువ్వు యింకా బుద్ధిమంతుడివి. నీ బుద్ధిచాతుర్యానికి మహానందంగావుంది. ఇదిగో! ఏవిద్యనిమిత్తమై నువ్వు నావద్దకు చేరావో, ఆవిద్యను నీకు చెప్పేస్తున్నాను. ఈ మృతసంజీవిని విద్యను అందుకో ధ్యానించు. సద్యోసిద్ధికలిగేలా వరాన్నిస్తున్నాను. నీకు సిద్ధిపొదగానే నా వుదరం చీల్చుకొని బయటకురా గురుదక్షిణగా నీకు సిద్ధించిన మృతసంజీవనితో నన్ను బ్రతికించు" అంటు, రాక్షస గురువు - దేవగురుపుత్రునికి అతిగోప్యమైన మృతసంజీవనిని ఉపదేశించాడు.

గురు గర్భంలోనే ధ్యానమగ్నుడై జీవరూపంలో సిద్ధి పొందిన కచుడు శుక్రుని గర్భాన్ని చీల్చుకొని బయట పడ్డాడు. వచ్చినపని పూర్తికావడంతో - కచుడు స్వర్గానికి బయలుదేరాడు. శుక్రడంగీకరించాడు. దేవయాని

ఒప్పుకోలేదు. తనను పరిణయమాడమన్నది. కచుడది తగదన్నాడు - గురుపుత్రీసంగమం ద్రోహమన్నాడు. శుక్రుని గర్భంనుంచి వెలువడడంచేత తాను శుక్రుడికి పుత్రుడనౌతాననీ, దేవయాని చెల్లెలవుతుందని, అన్నా చెల్లెళ్లు సంగమించరాదనీ అన్నాడు.

శ్లో॥ "గురు పుత్రస్య పుత్రోమేనతుత్వమసిమేపితుః
తస్మాన్ మాన్యశ్చ పూజ్యశ్చ మమాపిత్వంద్విజోత్తమ"! (27 అధ్యాయం 9వ శ్లోకం)

కచదేవయానుల వాగ్వాదాన్తరాన – కుపితయైన దేవయాని –"కచా! నా తండ్రివద్ద నేర్చిన విద్య నీకు ఫలించకుండును గాక!' అనిశపించింది. అందుకు ప్రతిగా కచుడు దేవయానికి "నీకు బ్రాహ్మణునితో పెళ్లి కుండుగాక" అని ప్రతిశాపమిచ్చి స్వర్గానికి తరలి పోయాడు.

తనకు ఫలించని "మృతసంజీవని' విద్యను దేవతలందరకూ వుపదేశించి వారిని సంతుష్టులను చేశాడు కచుడు. కచుడి శాపంవల్ల దేవయాని – బ్రాహ్మణేతరుడైన యయాతి అనే రాజాకు భార్య అయ్యింది.

# యయాతి

చంద్రవంశానికి మూలపురుషుడు చంద్రుడు. చంద్రుడి కొడుకు బుధుడు. బుధుడి అపత్యం పురూరవుడు. పురూరవుడికి ఎనమండుగురు కుమారులు వారిలో ఆయువు అనే వాడికి అయిదుగురు కొడుకులు. ఆ అయిదుగురిలోనూ ప్రసిద్ధుడునహుషుడు. నహుషుడి కొడుకు యయాతి.

ఈ యయాతి రాక్షసేంద్రుడైన వృషపర్వుడి కూతురు శర్మిష్ఠను, రాక్షస గురువైన శుక్రుడి పుత్రిక దేవయానని కూడా పెండ్లాడాడు. వాళ్ళలో దేవయానియందు యదువు, తుర్వసువు అనే యిద్దరు పిల్లల్నీ, శర్మిష్ఠయందు ద్రుహుడు, అనుడు, పూరువు అని ముగ్గురు బిడ్డల్నీ కన్నాడు.

శర్మిష్ఠాదేవయానుల నడుమ సవతిపోరులో, దేవయాని శుక్రుడిచేత - భర్త అయిన యయాతిని శపించజేసింది. ఫలితంగా యయాతి అకాలవృద్ధాప్యాన్ని పొందాడు. భోగలాలసతను వదులుకోలేని యయాతి ఆ శాపాన్ని ఉపసంహరించి యవ్వనాన్ని ప్రసాదించమని శుక్రుణ్ని ప్రార్థించాడు. "ఎవరైనా యువకుడు తన యౌవ్వనం నీకిచ్చి నీ వృద్ధాప్యాన్ని స్వీకరిచేందుకు అంగీకరిస్తే వినా - మరోదారి లే" దన్నాడు శుక్రుడు.

బిడ్డలయిదుగుర్నీ పిలిపించి శుక్రుడు చెప్పిన మాటల్ని చెప్పాడు యయాతి. దేవయాని కొడుకులిద్దరూ తమ యౌవనాన్నివ్వడానికి తిరస్కరించారు. శర్మిష్ఠ సంతానంలో కడవాడైన పూరుడు మాత్రం తండ్రి వృద్ధాప్యం తాను భరించడానికి అంగీకరించి, తన యౌవనాన్ని తండ్రికి ధారపోశాడు - పుత్రదత్తమైన నూత్న యౌవనంతో యయాతి లాలసతీర సర్వభోగాలూ అనుభవించాడు.

అని - మత్స్యమూర్తి చెప్పిన కథ విని ముదితుడైన మనువు స్వామివారిని అగస్త్య చరిత్రని వినిపించమని కోరాడు శ్రీమత్స్యావతారుడు వినిపించ నారంభించాడు.

# అగస్త్య చరిత్ర

విష్ణువతారులైన నరనారాయణులు బదరికాశ్రమంలో తపస్సు చేసుకుంటుండగా వారి తపోభంగంకోసం వాసవి ఇంద్రుడు అప్సరసల ను వారి మావభావ శృంగార చేష్టలకు పంపాడు. అవుచ్చుకు నర నారాయణులు లొంగలేదుసరికదా, వాళ్ళందర్నీ తలదన్నే సుందరాంగినీ తమ తొడలనుంచి పుట్టించారు. ఊరువులనుంచి పుట్టడం వల్ల ఆ ఉవిదకి "ఊర్వశి" అని పేరు పెట్టారు. ఇంద్రుడికి గుణపాఠంగా ఆమెను ఇంద్రుడి వద్దకే వెళ్ళమన్నారు - నరనారాయణులు ఆజ్ఞానుసారం బయల్దేరింది ఊర్వశి.

అమరావతివైపు వెడుతూన్న ఆ అతిలోక సౌందర్యరాశిని ఆదిత్యుడు చూశాడు వలచాడు. సంకేతస్థలం చెప్పి రమ్మన్నాడు. సై అంది పూర్వశి. తీరా ఆమె సూర్యుడి దగ్గరికి వెడుతుండగా మధ్యలో వరుణుడు అడ్డుతగిలాడు. తనని సుఖపెట్టమన్నాడు. ముందుగా పూషుడికి మాటయిచ్చాను. అతగాడి తర్వాత నీ దగ్గరకు వస్తాను అంది పూర్వశి. వరుణుడు ఒప్పుకోలేదు ముందు, చివరకు మార్తాండుడితో క్రీడించేవేళకూడా మనసును తనవంకే లగ్నంచేసే షరతు మీద ఆమెను విడిచాడు. తత్కారణంగా తరణాసంపర్కంలోని ఊర్వశీ మనోగతి రత్యనుభూతులకి వరుణు డుద్రిక్తుడవుతున్నాడు. జగత్సాక్షియైన సూర్యుడు, పూర్వశిమనోభావాన్ని పసిగట్టాడు. తనతో రమిస్తూ, వరుణుడిని మోహించు కుంటున్నందువల్ల ఆమెను వేశ్యగా దూషించి వైదొలగిపొమ్మన్నాడు. ఊర్వశి యొక్క దైహిక సంపర్కం వల్లసూర్యుడికి, మానసికోల్లాసంవల్ల మరుణిడికీ వీర్య స్ఖలనం జరిగింది. రేతం భూపతనం చేయటం పాతకం గనుక వాళ్ళు వాటిని జలభాండంలో (కుండలో) దాచివుంచారు. ఈ కథయిలా వుండగా –

ఒకనాడు వరుణుడింట నిమీ, వరుణుడూ పాచికలాటలో వుండగా వశిష్ఠుడు ప్రవేశించాడు. ఆట మైకంలో వున్న నిమి, వశిష్ఠుణ్ణి గౌరవించని కారణంగా, ఆయున అలిగి నిమిని "విదేహుడవు కమ్మని" శపించాడు. ఆటమైకంలో జరిగిన పొరబాటుకు శపించటతో నిమి బాధపడి నువ్వుకూడా అలాగే అవ్వాలి అంటూ వశిష్ఠుణ్ణే ఎదురు శపించాడు. ఫలితంగా యిద్దరూ విదేహులయ్యారు. ఇరువురి దేహాలూ పతనాలయ్యాయి. నిమి, తాను భూజనుల నేత్రాలనంటి వుంటానన్నాడు. అందువల్లనే కనురెప్ప పాటులు నిమి పేరున నిమిషములుగా మారాయి. వశిష్ఠుడు ఏమీ కోరని కారణంగా

– అంతకుపూర్వం మిత్రావరుణుల తేజస్సు నిక్షిప్తం చేయబడిన ఘటాన్ని (కుండను) ఆశ్రయించమన్నాడు వరుణుడు వశిష్ఠప్రాణం అదేచేసింది. కాలాంతరాన ఆ కడవలోంచి వశిష్ఠుడు, అతనితో బాటే అగస్త్యుడు ఆవిర్భవించారు ఇద్దరూ తపోభూములకు వెళ్ళిపోయారు.

పవనాగ్నుల సమ్మేళనంలో పగవారైన రాక్షసులను పరిమారించేస్తున్నాడు – పాకశాసనుడు. కాని, రాక్షసులలో చెప్పుకోదగ్గవారైన తారకుడు, మయుడు, విద్యున్మాలి, కాలదంష్ట్రుడు, కమలాక్షుడు, పరావసువు, విరోచనుడు అనే యేడుగురూ సముద్రములో దాక్కున్నారు. అగ్నిగాని, గాలిగాని వారినేమీ చేయలేకపోగా – సముద్రాన్ని ఎండగట్టమని ఇంద్రుడాజ్ఞాపించాడు. అది అధర్మమని సూచిస్తూ తమ అశక్తతను తెలియజేశారు పవనపావకులు."మార్గాంతరం ఏమిటా!" అని ఆలోచించిన దేవేంద్రుడు ఎండవలసిన వరుణాంశ ఎండగట్టే సూర్యాంశాగల అగస్త్యుణ్ని ఆశ్రయించాడు. అప్పుడా మహానుభావుడు – సప్తసాగరాలనీ త్రాగేశాడు. అసువులు బాసిన అనేక జలచరాలతో బాటే కాలదంష్ట్ర కమలాక్ష, పరావసు, విరోచనులు, కళ్ళుమూసేశారు. అగస్త్యుడి కృపతో అమరేంద్రుడు ధైర్యంగా అమరావతికి తరలాడు.

మత్స్యమూర్తి చెప్పిదివిన్న మనువు "మరి ఆ రాక్షసులలో మయ, తారక విద్యున్మాలు లేమయ్యారు?" అని అడిగాడు. అపుడు మత్స్యమూర్తి ఇలా చెప్పసాగాడు.

## త్రిపురాసురవధ

ఆ సముద్రగర్భంలోంచి – ఇంద్రుని బారినపడకుడా తప్పించుకున్న మయతారక విద్యున్మాలులు ముగ్గురూ అజ్ఞాతవాసంలో చేరి – అతిలోకాలూ,లోకభీకరాలూ యైనమూడు అద్భుతనగరాలు నిర్మించారు.

ఆ నగరాలలో వాళ్ళు దాగి సర్వలోకాలను చీకాకుపరచసాగారు. ఒకవంక లోకాల్ని బాధిస్తూనే, మరోవంక బ్రహ్మకోసం తపస్సుచేసి ఆయన సాక్షాత్కారం పొందారు. మూడునగరాలూ ఏకకాలంలో ఏకబాణంతో ఏణాంకధరుడి (శివుని) చేతుల్లో తప్ప నశించని వరాన్ని కూడా పొందారు. దానితో మరీ విజృంభించేశారు.

ఆఖండలుడికి ఇంద్రునికి గుండెలు దిగ జారి పోయినంత పనైంది. సర్వదేవతా సమేతంగా శర్వుణ్ణి శరణు వేడాడు. భోలాశంకరుడు దేవ కార్యం నిర్వర్తిస్తానన్నాడు. యుద్ధానికి సిద్ధమయ్యాడు. కాళరాత్రి నారిగా మేరువు ధనువుగా విష్ణువు అమ్ముగా త్రిపురాలపై దండెత్తాడు త్రినేత్రుడు. ముప్పురాలకీ ముప్పువాటిల్లింది. ముల్లోకాల్లోనూ కల్లోల మణి గింది.

# సత్యవ్రత చరిత్రము

మహా ప్రళయానికి ముందు సత్య వ్రతుడనే రాజు భూమిని పాలించు చుండెను. అతడు శ్రీహరి పూజాతత్పరుడై ధర్మమును పాటించుచూ ప్రజలను కన్న బిడ్డల వలె పరమానందముగా చూచుచు, వారికి సౌఖ్యము కల్గు నట్లు జాగ్రత్తగా చూచి, బాధలు లేకుండా చేయు చుండెను. అతడు రాజర్షియై సంచరించుచు రాజ్య భారమంతయు శ్రీహరి మీద నుంచి తాను చక్రధారికి సేవకుని వలె సంచరించుచు వైరాగ్యవంతుడై యుండెను. ఒకనాడు యా రాజర్షి కమండలములోని జలములను విచిత్రమైన రంగులతో నొకచేప పిల్ల గన్పించెను. "ఎప్పుడూ లేనిదీ చేప పిల్ల వింత రంగులతో నున్న దెక్కడనుండి వచ్చినదా?" యని సందేహించుచు సత్యవ్రతుడు చూచుచుండెను. ఆ చేప పిల్ల క్రమముగా నిమిషముల మీద కమండలి మంతయు నిండిన శరీరముతో భారముగా నగుపించెను. ఆ రాజర్షి చూచుచు పరమాశ్చర్యము చెందుతున్న సమయంలో ఆ చేప పిల్ల మనుష్య కంఠముతో

"ఓ రాజా! నేటి కేడవ దినము జల ప్రళయము రానున్నది. ఆ సమయములో నొక నావ నీ దగ్గరకు వస్తుంది. నీవును, సప్త మహర్షులును, ఓషధులను దానిలోకి ఎక్కియుండండి! నేను ప్రళయావసానము వరకు మీకే ప్రమాదము రాకుండా నా కోరతో దానిని నిల్పి యుంచెదను. జలప్రళయానంతరము మరల సృష్టి ప్రారంభమగును. నీవీ భూమండలమున కధిపతివై క్షత్రియ వంశమునకు మూలకారకుడవై యుండ గలవని" చెప్పెను. ఆ మత్స్య మూర్తి సెలవిచ్చినట్లు జల ప్రళయము వచ్చినది. వారంత వరకు నావ మీద నుండి పోయిరి. తరువాత భూమండల మేర్పడును. బ్రహ్మాండమందులో నుండి పోయెనను. సత్యవ్రతుడు భూమండలమున కధిపతియై రాజ్యాధికారమందెను.

ఆయన సోమశర్మ కుమార్తెను వివాహమ్మై, బహు సంతానము గాంచి రాజవంశమును వృద్ధిచేసెను. జంబూ ద్వీపమును నిరాటంకముగానూ నిష్కంటకముగానూ పాలించెను. తరువాత ఆతని కుమారులు బ్రహ్మ వలన విద్య నేర్చుకొని విశ్వకర్మ తయారు చేసిన ఆయుధములతో రాజ్యపాలనము గావించిరి. ఆ విధముగా మత్స్యమూర్తి - మనువుకు చెప్పినట్లుగా మా గురువు గారైన వ్యాసుల వారు నాకు చెప్పిన విధానమంతా మీకు చెప్పాను. ఇంకేమి వినాలని వున్నదో కోరుకోండి అన్నాడు సూత మహర్షి – శౌనకాదులతో; శౌనకాదులు తృపాత్తృప్త భావ డోలాయమానులై హే పురాణవచో విలాసా! మాకు దయచేసి గరుడ పురాణం వినిపించు మని అడిగారు.

సూతుల వారు గరుడ పురాణాన్ని చెప్పనారంభించారు.

**మత్స్య పురాణం సమాప్తం**



# 17. గరుడ పురాణము

పక్షి రాజైన గరుత్మంతుడు అడిగిన ప్రశ్నలకు స్వయంగా శ్రీ మహావిష్ణువే చెప్పిన సమాధానాల గ్రంథమే గరుడ పురాణం.

శ్లో॥ "ఏ కోన వింశతి సౌ పర్ణమ్!"

అనగా ఈ పురాణంలో పందొమ్మిదివేల శ్లోకాలున్నవి. పూర్వ ఖండంలో రెండు వందల నిరువది తొమ్మిది అధ్యాయాలు, ఉత్తర ఖండంలో ముప్పది అయిదధ్యాయాలు కలిపి మొత్తం ఇందులో రెండు వందల అరువది నాల్గు అధ్యాయాలు.

"శ్లో॥ మజ్జాతు గారుడం ప్రోక్తం" అనగా ఆది విష్ణు దేవుని శరీరపు క్రొవ్వు మాత్రమే చాలా మందికి తెలియును. కానీ మరణానంతరం జీవుని స్థితి ఎలాగుంటుంది? ఏ యోనులందున ప్రవేశిస్తాడు? ఏవిధములైన సుఖ దుఃఖాలననుభవిస్తాడు మొదలైన ప్రశ్నలన్నింటికి ఇందులో సమగ్రమైన సమాధానాలున్నవి. మృతునింట పదవ దినం లోపుగా ఈ గరుడ పురాణ పఠన చాలా మంది చేస్తుంటారు. యమలోక వర్ణన, మరియు శ్రాద్ధ సంబంధమైన సకల కర్మానుష్టాన విషయాలిందులో వివరించడం జరిగింది.

ఈ పురాణానికి సంబంధించిన ఒక ముఖ్య విషయాన్నిక్కడ చెప్పవలసి యున్నది. అదే మన గరుడ పురాణమనే సరికి చాలా మందికి యమలోక వర్ణన విషయాలు మాత్రమే యిందుటాయని భావిస్తుంటారు. కానీ వాస్తవానికి ఇతర పురాణాల్లో అగుపించని ఎన్నో అమూల్య విషయాలను తనలో నిక్షిప్త పరచుకొని మనకు తెలియ చేస్తున్నదీ గరుడ పురాణం. గరుడ పురాణంలోని పూర్వ ఖండం–ఉదాహరణకు భగవంతుని అవతారాలు, సరస్వతీ దేవి ఉపాసనావిధానం, నిత్య నైమిత్తిక, కామ్యకర్మల వివరణ, మహ

పాతకాల ప్రాయశ్చిత్తం, బావుల త్రవ్వకం, మొ॥ కార్యక్రమాలకు సంబంధించి, యోగ్యమైన తిథి వార నక్షత్ర వివరాలు, నవ గ్రహ దశలు, వాటి శుభాశుభ ఫలితాలు హస్త సాముద్రిక విచారం, ముత్యాల పరీక్షా విధానం ఇంద్రనీల, వైడూర్య, పుష్య రాగ, మకరత, పద్మరాగ, వజ్ర, గోమేధిక, ప్రవాళ స్ఫటికములనబడే నవరత్నాల పరీక్షా రీతులు, బ్రహ్మచర్యాశ్రమ వర్ణన, గృహస్థ, వాన ప్రస్థ, సన్న్యాసాశ్రమాల వర్ణనలు, అఖండద్వాదశి వ్రతం, చాతుర్మాస్య వ్రతం, భీష్మ పంచక వ్రతం, కృష్ణాష్టమీ వ్రతం, వీర నవమీ వ్రతం, సకల రోగ సంభవ కారణాలు, స్త్రీలకు వచ్చు రోగాలు, వాటికి చికిత్సలు, ఆయుర్వేద వైద్యులకెంతో ఉపయోగ పడే రహస్యాలు అనేక విధాలైన ఛందస్సులు, వాటి లక్షణాలు మొదలగు విషయాలు అరువది తొమ్మిది నుండీ, ఎనుబదవ అధ్యాయం వరకు ముత్యం, పుష్యరాగం, వైడూర్యం, స్ఫటికం, పద్మరాగం, మరకతం మొదలైన విలువైన రత్న పరీక్షా విధానం, నీతి బోధలు, నూట నలువది ఆరవ అధ్యాయం నుండి నూట తొంబది అధ్యాయం వరకు వంధ్య ఆయుర్వేద చికిత్స బుద్ధి బలం పెరిగేటందులకు వాడవలసిన ఆయుర్వేద మహౌషధాలు మరియు పశు వైద్యం చికిత్స గురించియు వివరంగా చెప్పబడినవి.

ఈ గరుడ పురాణంలోని కొన్ని నీతి వచనాల బోధలిట్లున్నవి.

1. "పరవేశ్మని వాసంచ నకుర్వీత కదా చన"–పర గృహాన నివసించరాదు.

2. భార్య అంటే ఎలాగుండాలి అన్న దానికి ఉదాహరణ క్రింది శ్లోకం

శ్లో॥ యస్య భార్యా గుణజ్ఞా, చ భర్తార మనుగామినీ!
అహర్నిశే సంతుష్టా, సా ప్రియా న ప్రియా ప్రియా!!

ఏ స్త్రీ సర్వదా భర్త మార్గంలో నడచు కుంటుందో, సకల సుగుణాల రాశియో, భర్త అందించే అల్ప సుఖాన్ని కూడా పరమానందంగా భావిస్తుందో

ఆవిడే ఉత్తమ యిల్లాలని చెప్ప వచ్చును. కాని ప్రేయసి అయినంత మాత్రాన ఉత్తమ యిల్లాలు కాలేదని చెప్పడమైనది.

శ్లో॥ "కారణేన వినాభృత్యే యస్తు కుప్యతి మనహః!
సగృహ్ణాతి విషో న్మాదం, కృష్ణ సర్ప విసర్జితమ్!!"

కొందరు యజమానులు నిష్కారణంగా తమ సేవకులపై నిష్కారణంగా మండి పడుతుంటారు. అనవసరంగా చీటికి మాటకి అవమానిస్తుంటారు. అట్టి వారు నల్ల త్రాచులతో పొల్చ దగిన వారని గరుడ పురాణం చెప్పుతున్నది. ధనం, జ్ఞానం, రూపం, మైత్రీ ఇవి ఎలాగుండాలో ఈ పురాణం యిలా చెప్పింది.

శ్లో॥"అర్థేన కిం కృపణ హస్త గతేనసుంస్తా జ్ఞానేన కింబహుశ తాకులసంకులేన!
రూపేణ కింగుణా పరాక్రమ వర్జితేన, మిత్రేణ కిం వ్యసన కాల పరాఙ్మఖేన!!"

పిసినారి (లోభి), చేతిలో నున్న ధనం, జగమెండికున్న జ్ఞానం, సుగుణాలు పరాక్రమం లేని సౌందర్యం, ఆపత్కాలంలో ఆదుకోలేని మైత్రి వ్యర్థమని పై శ్లోకం ద్వారా ఈ పురాణం తెల్పుతున్నది.

కష్ట కాలంలో చిర పరిచితులైన స్నేహితులు సహితం మెల్లిగా జారుకుంటారని క్రింది శ్లోకాలలో నీతిబోధలు తెల్పుతున్నది.

శ్లో॥ "వృక్షం ఓణ ఫలం త్యజన్తి విహాగా : శుష్కం సరస్సారసా:!
నిర్ద్ర వ్యం పురుషం త్యజన్తి గణికా భ్రష్టం నృపం మంత్రిణః:!!"

శ్లో॥ "పుష్పం పర్యుషితం, త్యజన్తి మధుపా దగ్ధం వనాంతం మృగా:!
సర్వ: కాల వశాజ్జనోహిరమతే కస్యాస్తి కో వల్లభ:?!!"

పక్షులు పండ్లు లేని వృక్షాల వదలివెళ్ళి పోతాయి. జలం లేక ఎండి పోయిన తటాకాల్లో తామరలుండవు. పైకంలేని విటుల (పురుషుల) ను వేశ్యలు

వదలి వేస్తారు. అధికారం లేని రాజుగారి సమీపంలో మంత్రులెవ్వరు అగుపడరు. వాడిన పూల కడకు తుమ్మెదలు రావు. దగ్ధారణ్యంలో జంతువులుండవు అని భావం.

ఇక్కడొక ముఖ్య విషయాన్ని గమనించాలి. అదేమనగా వృక్షాలకు కాయలు గాస్తే పారిపోయిన పక్షులు మళ్ళా వచ్చి వాలుతాయి. తటాకాలు జలపూరితమైతే తామర తంపరగా పద్మాలు వికసిస్తాయి. అదృష్టం కలిసి వచ్చిన విటుల కడకు వేశ్యలు మళ్ళీ వచ్చి ఆకర్షిస్తారు. అధికరాం పునఃప్రాప్తిస్తే మంత్రులందరూ మళ్ళీ వచ్చి, వేనోళ్ళ పొగడి ఆశ్రయిస్తారు. పూలు వికసించి కళకళ లాడితే, వదలి పోయిన తుమ్మెదలన్ని మళ్ళీ వచ్చి, అనురాగాన్ని ప్రదర్శిస్తాయి. దగ్ధాటవి మళ్ళీ వర్షానికి చిగురించితే పారిపోయిన జంతువులన్ని మళ్ళీ వచ్చి ఆ అడవినే ఆశ్రయించుతాయి.

స్వార్థపరుల యొక్క అవకాశవాదం యొక్క స్వరూప స్వభావాలన్ని ఈ విధంగా ఉంటాయని పై శ్లోకాల ద్వారా చక్కని నీతిని ఈ గరుడ పురాణం ప్రదర్శిస్తున్నది.

ఇట్లే మరణానంతరం కాక జీవించియుండగానే మోక్షాన్ని (జీవన్ముక్తిని) పొందగలిగే అవధూతల యోగుల విషయమిట్లు వర్ణితమైంది క్రింది శ్లోకంలో నిలాగుంది.

శ్లో॥ "స్వధర్మ కర్మార్జిత జీవితానాం శాస్త్రేషు దారేషు సదారతా నామ్।
జితేంద్రియాణా మతిథి ప్రియాణాం గృహే పి మోక్షః పురుషోత్మా నామ్॥"

తమ కర్మ ధర్మముల ద్వారా జీవించేవారు, శాస్త్రాధ్యయం పట్ల తమ భార్యల పట్ల సదా ఆసక్తి అప్యాయత చూపించేవారు, ఇంద్రియ నిగ్రహం గలవారు, అతిథి సేవే పరమార్థంగా భావంచేవారు, తమ యింటి యందుండే మోక్ష సుఖాన్ని (జీవన్ముక్తిని) అనుభవిస్తే ఉత్తమ పురుషులుగా (పురుషోత్తములుగా) కీర్తింపబడుతారని భావం.

ఈవిధంగా గరుడ పురాణంలో కథల కన్నా, నీతి సూక్తులెంతో మధురాతి మధురం, అమృతపు గుళికలుగా అందిస్తున్నాయి. ఉదాహరణకు మరి కొన్నింటిని భావం గ్రహిస్తాము.

1. దుర్మార్గుల వలన యిహపర లోకాలకు గానీ, ఏ విధమైన మేలు చేకూరదు. కనుక అటు వంటి దుర్మార్గులతో స్నేహం చేయరాదు. ఉత్తములతోనే సహవాసం చేయాలి.

2. మూర్ఖులైన శిష్యులకు పాఠాలు చెప్పడం వలననూ, నీచురాలైన భార్యను పొందడం వలననూ, దుర్మార్గులకు ఆశ్రయ మిచ్చుట వలననూ, మహా మేధావంతులు సహితం అప్రతిష్ట పాలౌతారు.

3. ప్రాణాలను సృష్టించేది, సంహరించేది కాలమే. మనం నిద్రాసుషుప్తిలో నున్నా కాలం మాత్రం మేలుకొనే గంటలు కొడుతూ ఉంటుంది. కనుక ఏవిధంగా చూచినా, కాలాన్ని కాదని జరిగేది ఏది ఉండదు. విధి అనులంఘనీయం కదా.

4. శత్రుపక్షం వాడైనా, మన హితం కోరే వాడైతే వాడే నిజమైన బంధువు. బంధువుగా నటించే మన వినాశాన్ని కోరే వ్యక్తి యే మనకు నిజమైన శత్రువు. అదెలాగంటే మన శరీరంలో పుట్టిన దైనప్పటికీ వ్యాధి రాకుండా నిరోధించుకోవాలి కదా! ఎక్కడో అడవుల్లో దొరికేవైనా ఔషధాలు మనకు సేవింప దగ్గవే గదా!

5. "హృదయ విశాల సౌహార్ద్ర భావాన్ని చాటే ఒక సూక్తి రత్నమిలాగున ఈ గరుడ పురాణమందు వర్ణింప బడింది. అది యిలాగుంది."

మనకు హితైషి ఎవరైనా సరే మన ఆప్త బంధువుగానే సంభావించాలి. పోషించేవాడు పితతో (తండ్రితో) సమానుడే. విశ్వాసం గలవాడే మిత్రుడు మనం నివాసముండే ప్రాంతం ఏదైనా మన స్వదేశంగా కన్పించును.

6. దుశ్చరిత్ర (దుర్మార్గురాలు) యైన యిల్లాలు, నీచుడైన కపట మిత్రుడు, సదా యెదురాడే సేవకుడు, సర్పాలకు నెలవైన గృహవాసం కల్గియున్న వానికి వేరుగా మృత్యువంటూ వుండదు. పై వానిలో ఏదైనా మృత్యువును కల్గించును.

7. చక్కగా విద్యాభ్యాసం (అధ్యయనం) చేయ దలచిన వాడెవ్వడు కూడా నిద్రా భోజనాల గురించి పట్టించుకొనడు. "విద్యాతురాణానాం న సుఖం నా నిద్రా" అన్నట్లుండును. ఎంత దూరప్రదేశమైన గరుడ వేగంతో వెళ్ళి, అక్కడ తన కార్యం నిర్వర్తించి, లక్ష్యాన్ని సాధిస్తాడు.

8. ఆల మందలో వేలాది ఆవులున్నను దూడ అందులో తన తల్లిని అవలీలగా గుర్తించి, తల్లిని చేరుకుంటుంది. అదేవిధంగా మనం కూడా ఎంత దూరాన దాక్కొందామనుకున్నా మన పురాకృత కర్మ వదలక మనలను ఆవు వెంటదగులు దూడ వలే వెంటాడుతూనే వుంటుంది.

ఇంకా ఇటువంటి అమూల్యములైన సూక్తి రత్నాల నెలవు ఈ గరుడ పురాణం.

విష్ణు పూజా విధానం, గరుడ విద్య, సర్ప మంత్రం హయగ్రీవ పూజా విధి, గాయత్రీ మహాత్మ్యం, సాలగ్రామ లక్షణాలు సప్త ద్వీప వర్ణన, స్త్రీ పురుష ప్రవర్తనా లక్షణాలు, పంచ మహా యజ్ఞాలు, యతి ధర్మాలు, రాజ లక్షణాలు, సేవకా లక్షణాలు, సర్వ రోగ నివారణోపాయాలు బ్రహ్మజ్ఞాన ప్రాప్తి మొదలగు జనోపయోగ విషయాలెన్నింటికో గరుడ పురాణం నెలవు.

అగ్ర వర్ణాలకు చెందిన కొందరు కుల వృత్తులకు చెందిన కార్మిక కర్షకులను తగ్గు భావంతో అంటరాని వారిగా చూస్తుంటారు. ఇది యెంత మాత్రం తగదని కుల వివక్షను ఖండిస్తూ హెచ్చరిస్తున్నదీ గరుడ పురాణం.

శ్లో॥ "కన్యదోష: కులే నాస్తి, వ్యాధినా కో నపీడితః!
కేనన వ్యసనం ప్రాప్తం, శ్రియ: కన్య నిరస్త రా!!"

తక్కువ కులంలో జన్మించడమొకరి దోషం కాదు. వ్యాధులెవరికైనా రావచ్చుననీ, కష్టాలందరికీ వస్తాయనిన్నీ శాశ్వతం కావనీ దీని భావం.

శ్లో॥ "కీర్తితం పాప శమనం, పఠతాం శృణ్వతాం నృణామ్"

ఈ గరుడ పురాణం పఠించు వారికి శ్రవణం చేయువారికి సకల పాపాల నుండి విముక్తి లభించగలదు.

ఈ పురాణము శ్రీహరి తన వాహనమగు గరుత్మంతునకు చెప్పిన కారణమున గరుడపురాణముగా పేరు పెట్టబడినదనీ, వ్యాసభగవానుడు వ్రాసినదనీ సూత పౌరాణికుడు శౌనకాదిములు కిట్లు చెప్పనారంభించెను. ఒకానొక సమయములో శ్రీవిష్ణుదేవుడు శాంతముగా గూర్చున్న సమయమున గరుత్మంతు డాయనను జేరి "స్వామీ! మీ పాద భక్తి నెరుగని జీవులు నరకమునకు బోవుదురందురు. నరకములన్నియు యమ నగరములో నున్నవి గదా? యమలోకమునకు బోవు మార్గము మహాభయంకరముగా నుండునందురు. దానిని గురించి నాకు వివరముగా చెప్పుడని" ప్రార్థించెను. శ్రీహరి విని "గరుత్మంతా! నీకు యమలోక మార్గము వివరించెదను వినుము, ఆ దారి మహాంధకారముగా నుండును. భయంకరముగా నుండును. ఏ జీవులు దయాధర్మశూన్యులై యుందురో, పరదారాధనాదులు గోరి యనేక నీచ వర్తనములలో నడుచుచు నాచారములు వదలి సంసారములో నుండి మరణ మందుదురో వారు యమపాశ బద్ధులగుదురు.

ఆ జీవులు యమ పాశబద్ధులై యాతనా శరీరములో ప్రవేశించి యమదర్శనము చేయించగా మరల మృత స్థానము నకు గొని రాబడుదురు. వారి గోలలు యితరులకు వినరాకుండా యమదూతలు వారికి వాగ్బంధనము గావింతురు. అచ్చట వారి సంతాన మొసంగు తిలోదకాలు, పిండ

ప్రదానములు మంత్రములతో చేయబడినవి తిని, యాకలి దీరక నానాబాధలు పడుచుందురు. పదిరోజుల కర్మా పూర్తి కాగానేజీవిని యమసదనమునకు గొని పోవుదురు. యముడు వారి పాపకర్మలననుసరించి శిక్షలు విధించును. కర్మకాండము జరుపబడని జీవులు ప్రేత రూపమున ఉందురు. అంతవరకు వారికి యమదండనము లేదు. వారు ప్రేతములై తిరుగుచుండగా కుటుంబములోని వారెవరైన గయా శ్రాద్ధ మాచరించినచో ప్రేతత్వము వదలిపోవునని చెప్పెను. ఇది విని గరుత్మంతుడు శ్రీహరిని చూచి "పిండ ప్రదానము వలన లాభమేమి యని యడిగెను.

అన్నము వలన శరీరము పెరుగును. చనిపోయిన వాని ప్రాణములు వాయు రూపము చెంది యముని కడకు గొనిపోబడును. తరువాత మృత స్థలమునకు గొనిరాగా తొమ్మిది రోజులలో నీయ బడిన పిండోదకములతో నొకశరీర మేర్పబడును. ఆ పిండ శరీరము ఏర్పడు విధానము చెప్పుచున్నాను వినుము.

మొదటి దినము శిరస్సు, రెండవ రోజున మెడ, మూడవ రోజున వక్షము, నాల్గవ రోజున వెనుక భాగము, ఐదవ రోజున నాభి దేశము, ఆరవ రోజున నడుమ భాగము, యేడవ రోజున తొడలు, యెనిమిదవ రోజున పిక్కలు తొమ్మిదవ రోజున పాదములు, పదవ రోజున రక్త మాంసాదులు గలిగి మూరపొడుగు శరీరము గల్గి పిండములను భుజించి పదమూడవ రోజున యమదూతలచే గొనిపోబడుదురు. మనుష్య మానసముగా రోజునకు నాల్గువందల యోజనముల దూరము చొప్పున తొంబదియారు కోట్ల యోజనాల దూరములోనున్న యమలోకమునకు ఈ మృతజీవిని యమదూతలు గొనిపోవుదురు. ఆ దారి మహా భయంకరమైనది. దాహమునకు జలముండదు. ఆ దారియంతయు ముండ్లు, విష

జంతువులతో, అవి పెట్టు బాధలతో, కాకులు, గ్రద్దలు మొదలగు ఇనుప ముక్కులు గల పక్షులు కరచు చుండగారక్తము గారుచు బాధలు పడుచు పోవుదురు.

యమలోకమునంటి వైతరణి నది ప్రవహించుచుండును. దానిని దాటుట మహాకష్టము. దాని వెడల్పు నూరు యోజనములు. ఈ పాపజీవుల నందులో బడవైచి లాగుచు యమదూతలు బాధించుచుందురు. ఆనదియంతయు రక్తముతో మొసల్లు మొదలగు క్రూర జంతువులు గల్గి యా జీవులను బాధించుచుండును. చనిపోవుదమన్న చావు రాదు. వాటి బాధలు పడుచు జీవులు గొల్లుమని గోలపెట్టుచుందురు. ఇట్టి దుస్థితిలో యమదూతలు జీవుల నిట్లు "మాటి మాటికిని బాధపడు వ్రాత యున్నది పడుమని చెప్పుచుందురు. నీకు పవిత్రమగు మానవ జన్మ మీయగా దానిని నిష్ప్రయోజనముగా నడపినందులకీ కర్మ అనుభవింపక తప్పదందురు." ఇట్లనుచు పదహారు మజిలీలు చేయించుచు యమలోక ప్రాంతమునకు జేర్తురు. ఈ మజిలీలు నెలలకు గాని పదిహేను దినములకు గాని మజిలీగా నిల్పుదురు. ఆ మజిలీలలో నుండగా పుత్రులొసంగిన పిండోదకములతో నాకలి బాధలు తీర్చుకొందురు. కావున మాసికము, త్రయపక్షికములు యూనషణ్మాసికములు సంవత్సర విమోకము జరుప వలెను.

వారి పదహారు మజిలీలతో వారిపుర, జంగమపుర నాగేంద్రపుర, గంధర్వపుర, భైరవ పుర, శంకర పుర, చిత్రపుర, బహూవిధపుర, దుఃఖమయ పుర, బహువిధరోదనపుర, ఉతత్వపుర, భయంకర పుర, తప్తవారిపుర, నియమయపుర, బహుభీతిపుర, శమన పురములను మజిలీలలో నుంచి గొనిపోవుదురు.

# యమపురి వర్ణనము

యముని పురమును శమన పురమందురు. దానికి ద్వారములు నాల్గుండును. పాపులను దక్షిణ ద్వారం ద్వారా గొని పోవుదురు. ఆ ద్వార రక్షకుడు దంభ ధ్వజాడను గంధర్వుడు. ఆయన వచ్చి జీవుల విషయము చిత్ర గుప్త మంత్రితో చెప్పి యాతని యనుజ్ఞతో లోనికి గొనిపోవును. వారిని చిత్ర గుప్తుడు యమునకు జూపి యిట్లు చెప్పెను. "వీరు మానవ జన్మ నెత్తి మహాపాపములు చేసి పండి పోయి యున్నారు. వాటి వివరములు యమ ధర్మరాజా మిమ్మడుగును. ఇంతలో యమదూతలతో ముఖ్యుడగు శ్రవణుని చెప్పుమనును. ఈతడు బ్రహ్మ పుత్రుడు, మహావిద్యా వంతుడు. ఈతనికి సమస్త శక్తులు గలవు జీవులు చేసినవన్నియు తూ.చ. తప్పక చెప్పగలడు. ఆయనకు అశాంతియను భార్య గలదు. ఆమె లోకమునండి వచ్చిన స్త్రీ జీవుల సంబంధమగు కృత్యములను వివరించు శక్తిమంతురాలై యుండును. వారిద్దరూ స్త్రీ పురుషుల కర్మలను యముని ముందు వివరించుచుందురు.

వారు చిత్రగుప్తునిగా ప్రతి రూపములుగా, సమస్త శరీరములలో నుండి యముని సన్నిధికి జేరునప్పుడు బయటకు వచ్చి యా విషయము లన్నియు విప్పి చెప్పుదురు. వారిని కాయస్థులు కరణములని పేర్లు గల్గిన వారందురు. అది వినగా యముడు వారికి నిజ రూపముతో గన్పించును. యముని యాకారము మహాభయంకరముగా నుండును. అతడు మూడు యోజనముల పొడవుండును. చేతులు ముప్పది రెండు వుండును. వాడియు, పొడవుగల యెనుబోతు మీద నెక్కి యుండును. చేతిలో కాలదండము ధరించి యుండును. ఆతని చూచినంతనే గుండెలు పగిలి పోవును. అట్టి భయంకరరూపుడగు యముడుండగా చిత్రగుప్తుడు యమదూతలు

భయంకరముగా గర్జించుచుందురు. జీవులా భయంకర తర్జన గర్జనలు భరించలేక ఇంకేమి చేయుదమని మహాదుఃఖముతో చెప్పరాని బాధలు పడుచుందురు.

వారిని తప్పించుకొని పోవు మార్గము లేక, యెన్నియో యాలోచనములు చేయుచు, గతమున చేసినవి తలచుకొనుచు దారి తెన్నులు లేక కృశించుచు, గడగడలాడుచు నిలబడుదురు.

# కలియుగం - వివిధ పాపాలు

కృతయుగ, త్రేతా, ద్వాపర యుగములందు జనులు రాజశిక్షణములో నుందురు. ఆ కాలములో ప్రజలకు యాయాగ్రామ వాసులు గాని, బంధువులు గాని, స్నేహితులు గాని, యింటిలో నుండు వారు గాని నీతులు గరపుచుందురు. ఎక్కువ మంది మంచి మార్గములందుండ తక్కువ జనమును తప్పుడు మార్గములనుండి తప్పించుట సులభము. అనగా నా మూడు యుగములలో సత్యము, ధర్మము, పరోపకారము, న్యాయ సంరక్షణ, దుష్ట శిక్షణాదుల యందు ప్రజలు, రాజులు నిమగ్నులై యుండుటచే నా యుగములు ధర్మ యుగములుగా చెప్పబడినవి. అందుండు పాలకులు పక్షపాత రహితులూ కఠిన మగు శిక్షలు విధించి వాటి ననుభవింప జేసి జీవులను ధర్మమార్గలో నడుపుచుందురు. కలియుగములో ధర్మ మార్గము నశించిపోవును, స్త్రీ పురుషాదులు పాప భీతి లేకుండా సంచరించెదరు. ఇతరుల ద్రవ్యములను హరించి, పరస్త్రీలతో సంచరించెదరు. స్త్రీలు స్వైర విహారములు గావించుచుందురు. న్యాయము, భయము, ధర్మము ఈ యుగమునందుండవు. వావివరుసలు గణింపరు.

దైవ, పితృ దేవతారాధనలు, శ్రాద్ధకర్మలు, నరక లోకము, యమలోక శిక్షలు యివి యన్నియు కల్లలని త్రోసి పుచ్చెదరు. శరీరము శరీరముతో కలిసిన పాపమా! పాపమన్న నెట్టుండును? ప్రకృతి వలన జంతుజాలము పుట్టుచు ప్రకృతిలో గలయుచున్నది. ఈ దేహము పాపమని చెప్పువారు ఛాందసులనియు, యివి యన్నియి పిచ్చి నమ్మకములనియు చాటి, దేవుడు లేడని వాదింతురు. ఉన్నచో కన్పింపక పోవునా? యందురు. వారికి బాధలు వచ్చినప్పుడు తీరరానివైన యొకసారి నన్ను తలచి వెంటనే మరుదారి త్రొక్కుచుందురు. వీరందరు ముసలితనము రాగా మరల తమ యుద్దేశములు మార్చుకొన జూచి, బుద్ధి స్వాధీనము గాక బాధలు పడి యమకింకరులకు చిక్కుదురు.

పాపముల రకములు వినుము. బ్రహ్మహత్య, గోహత్య, శిశుహత్య, భ్రూన హత్య, పరదారా గురుదారాగమనము. పరవస్తు తస్కరణము, చోరత్వము, అనాథ బాధాయుద్దేశము మార్గానురోధము, ఆచార విహీనము, ఈశ్వర కార్య నిరసనము, నాస్తిక వాదము, దుర్మార్గ సహవాసము దుష్ట లక్షణములు. ఇవి యన్నియు ముఖ్య పాపములు. ఇందు మహాపాతకములు పెక్కులున్నవి. దేనికి తగినట్లు దానికి శమనుడు శిక్షలు వేయును. "రాజ దండన మనుభవించిన వానికి యమ దండనమండ" దని చెప్పగా, గరుత్మంతుడు విని, గతములో చేసిన పాపముల వలన యమ శిక్షలంది యెట్టి జన్మలు జీవులందెదరని ప్రశ్నించెను. వారు పాప పుణ్య మిశ్రమమగు విధానముగా జన్మలనందెదరు. వారికి లోకములో మూడు రకములు యోగము లుండును. ప్రారంభము నుండి యంత్యము వరకు తక్కువ పాపములు గతములో చేసినవి వారు పొందుదురు. మధ్య తరగతిగా పాపములాచరించు వారు, ఆచరించువారిని మన్నించక దూరముగా

నుండువారు మధ్య వయస్సునుండి యోగమనుభవించెదరు. దుర్మార్గములు చేయుటకు పరులను ప్రోత్సహించి తామెరుగనట్లు తప్పించు కొని తిరుగుచు పైకి మందలించు వారంత్యమునందు యోగము పొందుదురు. నరకములో నున్న గొప్ప నరకములు రౌరవము, మహారౌరవము మొదలగునవి పదునెమ్మిదియుండును. ఉపనరకములు లెక్కకు మిక్కిగా నుండును." అని శ్రీహరి చెప్పగాచే విని గరుత్మంతుడు "పాపములు చేయుటకు కారణమేమి మూలమేమి" యని ప్రశ్నిెను. ఈ పాపము లాచరించుటకు ప్రకృతి యందు వ్యామోహమే కారణము! అందు స్త్రీ ప్రకృతి స్వరూపిణి గాన, స్త్రీయే మూలకారణమనెను. దాని మూలముననే నహంకార మమకార గుణములు ప్రధానములై పాప కర్మలు చేయుచుందురు. పాపులుగా, వారుత్తమ గతి పొందుటెట్లన్న యుద్దేశము నీకున్నదని గ్రహించితిని. దానిని నీకు చెప్పెదను. ఎవరి వంశములోని వారైనను ధర్మకార్యములు, తీర్థయాత్రా శ్రాద్ధములు, పితృ పూజలు, నితర దానధర్మ పరాయణత్వము గల్గిన వారుండినచో వారు చేయు సత్ ఫలితముల వలన పాపులు పుణ్య లోక వాసము పొందుదురు.

యముని నగరమున పాపులు ప్రవేశించు దారులు వేరు మహా మునీంద్రులు, పుణ్యాత్ములు, పతివ్రతాంగనలు మొదలగు వారు ప్రవేశించు దారులు వేరుగా నుండును. పుణ్యాత్ములకా యముడు మిగుల మర్యాదలు గావించుచు, సౌమ్య రూపమున దర్శన మిచ్చి గౌరవించును" అని శ్రీహరి చెప్పెను.

## బభ్రువాహన - ప్రేత సంవాదం

గరుత్మంతు డడిగిన ప్రశ్నకు ఈ విధంగా బదులు పలికాడు నారాయణుడు.

ఒక ఉపాఖ్యానం చెబుతాను విను. అతి పూర్వ కాలంలో మహోదయమనే నగరాన్ని పరిపాలించే బభ్రువాహనుడనే రాజు వేటకు వెళ్ళాడు. ఆ వేటలో లేడని తరుముతూ పరివారానికి దూరమై ప్రేతలు సంచరించే తావుకు చేరుకున్నాడు. పరివారం వచ్చి తనను కలిసే దాకా అక్కడే అలసట తీర్చుకోదలిచాడు. అదే సమయానికి అక్కడ తిరుగాడుతున్న ఒక ప్రేతం వచ్చి అతనిని దర్శించి "హే రాజా! దీర్ఘకాలం ప్రేత రూపంతో వున్న నేను ఇన్నిళ్ళకు రాజువైన నిన్ను చూసి కొంత పాపాన్ని పోగొట్టుకున్న వాడినైతిని మహారాజా! మృతుడనైన నాకు ఉత్తరక్రియలు నిర్వర్తించే వారెవరూ లేక నేనిలా మారాను. నీవు రాజువి రాజంటే ప్రజలనురంజింప చేసే వాడని అర్థం. కాబట్టి, నువ్వు నగరానికి వెళ్ళిన తర్వాత నా నిమిత్తమై ఉత్తరక్రియలు ఆచరించు . బాగా బ్రతికిన వాణ్ణి అనాధలా ఎవరి సొమ్ముతోనో అంత్య క్రియలు జరిపించుకోలేను.

నాదగ్గర ఒక అతిలోకమైన మణి వుంది. ఇది చాలా విలువైన రత్నం దీనిని తీసుకో. ఖర్చు నిమిత్తం యిచ్చాననుకున్నా సరే, లేదా, యీ మణికి నీవు నా వారసుడవనుకున్నా అభ్యంతరం లేదు. విధ్యుక్తంగా నాకు అంత్య క్రియలు మాత్రం జరిపించు సుమా!" అని వేడు కోవడం జరిగింది.

ప్రేత దర్శనానికే ఆశ్చర్యపోయిన బభ్రువాహనుడు ఆ ప్రేతం యొక్క ప్రార్థన నాలకించి మరింత విస్మయం చెందాడు. రాజు గాబట్టి తన విచిత్ర స్థితి బైటకు తోచనీయక అణిచి ఓ "ప్రేతమా! నీ కోరిక సబబుగా తోస్తు వున్నది. కాని, నీ వెవరివో, యే కులస్థుడవో, యే గోత్ర ప్రవరలకు చెందిన వాడివో తెలియకుండా ఉత్తరకర్మ కాండాదులు చేయడం కష్టం గదా! అందువలన నీవు పార్థివ శరీరంతో వున్న నాటి వివరాలన్నీ తెలియ చెప్పు" అని అడిగాడు.

అది విని ప్రేతం చేత యిలా చెప్పబడింది. "కృపాళా! మహోదయ నృపాలా! శ్రద్ధగా విను సమస్త వైభవోపేతమైన వైదశమనే నగరంలో, వైశ్యకులంలో జన్మించాను నేను, దేవగుప్తుడు అనే పేరుతో వ్యవహరించ బడే వాడిని, నేనేమి అధర్మ మార్గ గామిని కానుసుమా! జ్ఞానం గల్గింది లగాయితు జీవించిన కాలమంతా నిత్యం దేవతార్చనలు చేసాను. గురు బ్రాహ్మణ పూజ లనేకం చేశాను. ఆలయాలు కట్టించాను. నిర్మితాలైన శూన్య ఆలయాల్లో ప్రతిష్టలు చేయించాను. శిధిలాలయాలను పునరుద్ధరింప చేశాను. అగ్రహారాలు కట్టించి విప్రులకు ఇచ్చినాను. పేద సాదలకు అన్న పానీయాది ఆహారాలు దానధర్మాలు చేశాను. నోములూ, వ్రతాలూ ఆచరించాను. సత్యాన్ని గౌరవించాను. ఎన్ని చేసి ఏం లాభం! మరణానంతరం యిదిగో! యిలా ప్రేతంగా మారి పోయాను.

ఎందువల్లనుంటే చెప్పానుగా కన్ను మూసే వేళకి కూడా చెవిలో "రామా! రామా!" అను వారు లేరు. చుట్టూ చేరి "గోవిందా! నారాయణా!" అని భగవన్నామ స్మరణ చేసేవారు లేరు. ఉద్ధరిణెడు తులసి నీళ్ళు గొతుకలో పోసేవారు లేరు. ప్రాణాల విడిచి వేయబడిన దేహాన్ని దహింప చేసే వారసులు లేరు కాల్చేందుకు బిడ్డలు వేరు. కనీసం కన్నీరు కార్చేందుకైనా దాయలు లేరు. అందువల్ల విధ్యుక్తమైన వుత్తర క్రియలకు నోచుకోని కారణంగా యిలా అయిపోయాను. ఇదిగో, ఈ మణిని స్వీకరించు, నాకు ఉత్తర క్రియలాచరించు.

"అలాగే చేస్తాను" అన్నాడు బభ్రువాహనుడు. "కాని, వుత్తర క్రియాహీనులకేనా! లేక యితరులకు కూడా ఎవరికైనా యీ ప్రేతత్వం సిద్ధిస్తుందా?" అని అడిగాడు.

" ఇతరులకి సిద్ధిస్తుంది' చెప్ప సాగాడు, ప్రేతం.

## ప్రేతం ప్రేతలవడానికి కారణాలు - విమోచన మార్గాలు

సాధారణంగా మృతులకు దహనం, సంచయనం, వృషోత్సర్జనం, షోడశ సప్తకాలూ, సపిండ కరణం, మాస తిథులు శ్రాద్ధములు, యనములు మొదలైనవి. కొడుకులూ మొదలైన వాళ్ళు చేయాలి. అలా చేయకపోతే యీ ప్రేత రూపం వస్తుంది. ఇంతేకాదు – దేవతలు, బ్రాహ్మణుల, స్త్రీల, బాల బాలికల, బధిరాంధాది అవిటి వారియొక్క ద్రవ్యములను అపహరించితే ప్రేత రూపం వస్తుంది.

నియత స్త్రీని, సగోత్రీకురాలినీ, పరపురు భార్యను కూడిన వారు. అలా కూడాలని కోరేవారూ కూడా ప్రేతాలవుతారు. వజ్ర, వైడూర్య, మకరత, మాణిక్య, నీల, మౌక్తిక గోమేధికాది నవరత్నాలనూ కానీ – వానిలో ఏ ఒక్కదానిపైనాగాని బంగారాన్ని కాని, తామరపువ్వులను కాని, చివరకు స్త్రీ యొక్క పేరణాలనుగాని దొంగతనం చేస్తే – యీ ప్రేత రూపం వచ్చి తీరుతుంది.

యుద్ధం చేస్తూ చేస్తూ – పౌరుషహీనంగా వెన్ను చూపి కన్నుమూసినవాళ్ళు, ఒకరుతమకు చేసిన మంచిని మర్చిపోయే వాళ్ళు తమకి ఉపకారం చేసినవాళ్ళకే అపకారం తలపెట్టే వాళ్ళు – తప్పనసరిగా ప్రేతరూపం పొంది తీరుతారు.

ప్రేతం చెప్పింది విన్న బభ్రువాహనుడు – "ఓ ప్రేతశ్రేష్ఠ! మరి యీ ప్రేతత్వ విముక్తికి మార్గమేమిటో, ఉత్తర క్రియా పద్ధతులేమిటో కూడా వివరించు" అన్నాడు.

"వివరించి చెప్పేంత సమయం లేదు. టూకీగా చెబుతాను, ఆలకించు – నారాయణ నామ పారాయణం పూజ చేయడంవల్ల ప్రేతత్వవిముక్తి కలుగుతుంది. బంగారాన్ని తెచ్చి, రేకుకొట్టించి, దానిమీద స్వర్గాధిపతియగు

వాసుదేవుని ప్రతిమను శంఖచక్ర గదా ద్యాయుధములతో ఏర్పరచి అదే నారాయణ విగ్రహమునకు తూర్పుగా శ్రీధరుణ్ని, దక్షిణాన మధుసూదనుణ్ని, పడమర వామనుణ్ని, వుత్తరదిక్కున గదాధరుణ్ని మధ్యలో బ్రహ్మ రుద్రేంద్రులనీ యేర్పరచి, వైకుంఠ వాసుణ్ణి పూజించినట్టులయితే ప్రేతత్వం వదలిపోతుంది. పిదప హోమం చేయాలి. ఆవెనుక వృషోత్సర్జనం చేయాలి. అటు తర్వాత పదముగ్గురు బ్రాహ్మణులకు గొడుగులు, పాదరక్షలు, ఉంగరములు, పీటలు, వస్త్రములు, బంగారము మొదలగు వానిని దానము చేయాలి. బ్రాహ్మణులకు షడ్రసోపేతముగా సంతర్పణం చేయాలి. శయ్య, ఉదకకుంభం మొదలైన దానాలు చేయాలి, ప్రేతత్వంపొందిన వారినిమిత్తమై యిలా ఎవరైనా చేసినట్లయితే తక్షణమే ప్రేతత్వం వదలిపోతుంది.

ప్రేతం అలా ప్రేతత్వ విమోచనా విషయాలు చెబుతుండగానే బభ్రువాహనుడి బలగం అతనిని సమీపించింది. ప్రేతాలు అదృశ్యం అయిపోయింది. ప్రేతం యిచ్చిన మణితో సహా మహారాజు తన పరివారాన్ని కలిసి వూరుచేరుకున్నాడు. ఉత్తరక్షణంలోనే సద్బ్రాహ్మణులను రప్పించి - దేవగుప్తుడికి ఉత్తర కర్మలాచరించాడు.

మరుక్షణమే అడవిలో వున్న దేవగుప్తుడు ప్రేతరూపాన్ని విసర్జించి స్వర్గాభిముఖంగా అంతరిక్షానికి ఎగిరిపోయాడు.

నారాయణమూర్తి చెప్పింది విని గరుడుడు "స్వామీ! ప్రేతత్వ విమోచనానికి మరేమిదారులు లేవా?" అని అడిగాడు.

"ఎందుకు లేవు" అని ఇలా చెప్పాడు యిందిరారమణుడు. "ఒక పాత్ర నిండా నూనె పోసి, బ్రాహ్మణునకు దానమిచ్చినట్టయితే సర్వపాపములూ పోతాయి. ప్రేతరూపం పోతుంది స్వర్గంచేరుతాడు. అలాగే ఏకాదశ స్వర్ణపాత్ర క్షీర ఘృతాది దానాలూ వున్నాయి.

"ఇంకొక సందేహం పాపపుణ్యాలు లెక్కచూసేది యమధర్మరాజా. అందువల్ల పాపాలు ఆయనకు తెలుస్తాయి. "ఎవరు పాపులో తేల్చుకున్న అవకాశం యమునకు తప్ప అన్యులకు లేదా!" అని అడిగాడు గరుడుడు.

"ఉంది గతంలోచేసిన ఘనకార్యాలని బట్టే వర్తమాన జన్మవుంటుంది" అంటూ ఆరంభించాడు నారాయణుడు.

## పాపాలవల్ల కలిగే జన్మలు

పూర్వ జన్మలో అబద్ధాలాడిన వాడూ, మూగవారినీ, గోవులనీ హింసించినవాడూ - యీ జన్మలో వాచకశక్తిలేని వారుగానూ, వున్నా హీనస్థాయి వాచకులు గాను పుడతారు, కొంపలు కాల్చినవారూ, బ్రాహ్మణుల్ని చంపినవారూ కుష్ఠురోగులై జన్మిస్తారు. బంగారం దొంగిలస్తే పిప్పి గోళ్ళూ, మద్యపానం చేస్తే పిప్పిపళ్ళూ గలవాళ్ళుగా పుడతారు. గురుద్రోహం చేస్తే వికార రూపం గల జన్మలభిస్తుంది. స్వజాతిలోని పరస్త్రీని కూడినవాడు పంచముడిగానూ, దాన ధర్మాలు చేయని వాడు దరిద్రుడుగానూ అవతరిస్తారు.

యోగ్యతలేని వాళ్ళకీ, శూద్రులకీ సత్యహీనులకీ పౌరోహిత్యం చేసేవాడు పందియై పుడతాడు. ఒక ఊరికి ఎంతమంది పురోహితులుంటే అంతమందికి ఆ పాపం పంచబడుతుంది, ఒక్కడే పురోహితుడైతే మొత్తం పాపం అంతా అతనికే చుట్టుకుంటుంది. ఒక్క ముక్కలో చెప్పాలంటే గ్రామ పురోహితుడు గాడిద జన్మనెత్తుతాడు.

స్నానసంధ్యలు, దేవతార్చనా చేయకుండా భోంచేసే వాడు కాకిలా పుడతాడు. పైకప్పులేని బయలులో భుజించే వాడు మనుష్యులు మసలని వనాలలో కోతిగా అవతరిస్తాడు. కర్కశంగా మాట్లాడే వాళ్ళు పిల్లులవుతారు.

చెట్లు కాల్చేవాళ్ళు మిణుగురు బూచులవుతారు. శూద్రస్త్రీ సాంగత్యం చేసేవాడూ, బ్రాహ్మణులకు చెడిన పదార్థాల్ని పెట్టేవాడూ ఎద్దులవుతారు. బ్రాహ్మణులకు చల్ది అన్నం పెడితే కోతి అవుతాడు. తీరికూర్చుని దెబ్బలాడేవాడు, పుస్తకాలూ దొంగతనం చేసే వాడూ - జీవనమధ్యంలో అంధులౌతాడు.

బ్రాహ్మణకుటుంబ ఘాతికి - పుట్టిన పిల్లలు మిగలరు. ఆకలిలో అన్నమడిగిన వానికి లేదంటే పిల్లలు పుట్టరు. బట్టల దొంగ ఉడుముగా పుడతాడు. ఇతరుల మీద విషప్రయోగం చేసేవాడు పామైపుడతాడు. సన్యసించిన వాడి భార్యతో సంగమించినవాడు, పిశాచంగానూ, యితర స్త్రీలతో విహరించేవాడు అల్పాయుష్కుడుగానూ, గురు భార్యను కోరినవాడు తొండగానూ పుడతారు. తక్కువ జాతి స్త్రీని కూడేవాడు రేచుకుక్క అవుతాడు. నూతులు, చెరువులు త్రవ్వించి తిరిగి పూడ్పించినవాడు చేపరూపాన్ని – న్యాయ విరుద్ధంగా నడిచేవాడు గుడ్లగూబ రూపాన్నీ, ఇచ్చిందీ లేదని చెప్పి ఋణం తీర్చనివాడు నక్కరూపాన్నీ, బ్రాహ్మణులలో తప్పులుపట్టి విమర్శించేవాడు తాబేలురూపాన్ని, డబ్బుతీసుకొనీ దేవతార్చన చేసేవాడూ, వేదాలు వల్లించేవాడూ చండాల రూపాన్ని పొందుతాడు.

చెట్లు నరికినవాడూ, గనులు తవ్వినవాడూ దిక్కులేని వాళ్ళవుతారు. పరిమళ ద్రవ్యాపహరణం చేసినవాడు దుర్గంధ భూయిష్ఠ శరీరం గల జన్మను పొందుతాడు. పరద్రవ్యాపహరణులు క్రిమికీటకాలుగా పుడతారు. ఆఘోర కృత్యాలు చేసే వారు వైతరణిలో స్నానం చేయించబడతారు. అహంకారులకూ గర్విష్ఠులకు – తల్లిదండ్రులనూ గురుపురోహితులనూ అవ మానించే వారికి స్త్రీ బాలవృద్ధులకు అపకృతి చేసేవారికి చీమునెత్తురులతో కూడిన వైతరిణీయే ఆవాస స్థానమవుతుంది.

వికలాంగులకు, అవయవహీనులకు చెడ్డచేసేవాడూ, పెళ్ళిళ్ళ పాడు చేసేవాడూ, దానధర్మాలకి అడ్డుపడేవాడూ, బ్రాహ్మణ ద్రోహి, ఆశబెట్టి త్రిప్పేవాడూ, పురోహితుడి భార్యతో శయనించినవాడు, భాగవతగాథలు చదివేచోట అల్ప ప్రసంగాలూ చేసేవాడూ, అవివాహితలైన కన్యలందు దోషారోపణచేసే వాడూ, ఆవులకు మేతా – నీరూ సరిచూడనివాడూ, తన పశువులకను చక్కగా చూసుకొని యితరుల పశువుల్ని పట్టించుకోనివాడు స్వార్థపరుడు, ఆవులకు మేతా – నీరూ సరిచూడనివాడూ దానధర్మాలకి ధనం ఖర్చయిందని విచారించేవాడూ, బ్రాహ్మణ నిష్ఠ తీసుకున్న శూద్రుడు, విహితకర్మలు విస్మరించిన బ్రాహ్మణుడు, దేవుడు లేడని ప్రచారం చేసేవాడూ, సర్వద్వేషి, పరదూషకుడు వీళ్లంతా వైతరణిలోనే పడతారు. "వినతాగర్భశుక్తి ముక్తాఫలా! వైనతేయా! సదాచారపరులు సత్కర్మానష్టానపరులూ అయినవారు దేహంతాన స్వర్గానికి వెడతాడు. అక్కడి పుణ్య పరిపాకానంతర దివ్య క్షేత్రాలలోనో, శ్రేష్ఠకులాలలోనో, దివ్య క్షేత్రాలలోని శ్రేష్ఠకులాలలో జన్మించి శాస్త్ర పారగులై సద్వర్తనతో పూర్వ పుణ్యాన్ని ద్విగుణీకృతం చేసుకుంటూ కాలం గడుపుతారు.

గరుత్మంతా! నాచే నీకు వినిపించబడిన యీ పురాణం నీ పేరున గరుడ పురాణమై వర్ధిల్లుతుంది. తల్లిదండ్రులు మరణించిన దశరాత్రములోపల, అశౌచియైన కుమారుడు ఈ పురాణాన్ని విన్నట్లయితే – తప్పనిసరిగా మృతులు స్వర్గస్థులవుతారు. అలావినిన కుమారుని తల్లి మరుజన్మమున పురుషునిగా జన్మిస్తుంది. ఈ పురాణాన్ని శ్రద్ధగా విన్నవారి గురించి వారి పితృదేవతలు ఎనలేని సంతోషాన్ని పొందుతారు.

సంక్రాంతి నాడుగాని, విషువత్కాలమందుగాని, గ్రహణ సమయంలోగాని, శ్రాద్ధము జరిపిన దినమందుగాని – యీపురాణమును చదివేవారూ, చదివించేవారూ, వినేవారూ స్వర్గాన్ని పొందుతారు. వారి పితరులు సద్గతులు చెందుతారు.

నీ బారిపడిన పాములకు ఏగతిపడుతుందో, నీపేరిటి ఈ పురాణాన్ని పఠించినవారి పాపాలకు కూడా అదే గతి పడుతుంది.

ఈ పురాణ శ్రోతలకు కోటికన్యాదాన ఫలం వందషోడశమహాదాన ఫలం, గయా శ్రాద్ధఫలం కలుగుతాయి. యమపురనివాస భయనివృత్తి అవుతంది. స్వర్గగాములవుతారు.

నాగేంద్రశయనుడు విష్ణువు చెప్పిందివిని, నాగారి గరుడుడు ఆనందించాడు నారాయణునకు ప్రదక్షిణ నమస్కారాలాచరించి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు.

అని సూతుడు చెప్పగా విని శౌనకాదులు సంతస స్వాంతులై తదుపరిపురాణ శ్రవణాసక్తులై – సూతుడేం చెబుతాడా అని యెదురు చూడసాగారు.

## గరుడ పురాణం సమాప్తం

# 18. బ్రహ్మాండ పురాణము

బ్రహ్మ సృష్టికి సంబంధించి సమస్త విశేషాలను గూర్చి వివరించి చెప్పేదే బ్రహ్మాండ పురాణం. "బ్రహ్మాండం మస్తి గీయతే."

శ్రీ మహావిష్ణువు యొక్క అస్తులు ( ఎముకలు) గా ఈ పురాణం పోల్చబడింది. "బ్రహ్మాండం ద్వాదశైవతు" అంటే ఈ పురాణంలో పండ్రెండు వేల శ్లోకాలున్నాయని భావం. ఇందులో 1. ప్రకియా పాదం 2. అనుషంగ పాదం 3. ఉపోద్ఘాత పాదం 4. ఉపసంహార పాదము

అను నాలుగు భాగాలు బ్రహ్మాండ పురాణంలో గలవు.

1. ప్రకియా పాదంలో నైమిశారణ్యానికి సంబంధించిన సమగ్ర వర్ణన, సృష్టి వర్ణన, బ్రహ్మ పుట్టుక, వరాహావతార వర్ణన మొదలగు అనేక విషయాలిందున్నవి.

2. అనుషంగ పాదంలో, ఆశ్రమ ధర్మాలు 2. భృగువు మొదలగు సప్తర్షుల వృత్తాంతం 3. దక్షుని శివ దూషణ 4. సతీదేవి అగ్ని ప్రవేశం, దక్ష శంకరుల పరస్పర దూషణ, శాప ప్రయోగాలు, ప్రియవ్రతుని వర్ణన, జంబూ ద్వీపం మొదలగు సప్త ద్వీపాల వర్ణన, సూర్య భగవానుని మహిమ, చంద్రాది గ్రహాలు మరియు నక్షత్రాలు సూర్యాధీనంలో నుండుట, పగలు రాత్రి, వారాలు, మాసాలు, ఋతువులు, అయనాలు, సంవత్సరాలు, యుగాలనే పేర్లతో వైవిధ్యమేర్పడుటకు మూల కారకుడు సూర్యుడే అని నిరూపించుట. లింగోత్పత్తి చతుర్థ యుగధర్మాలు, ఆయా యుగాల్లోని ప్రజల లక్షణాలు మొదలగునవి.

3. ఉపోద్ఘాత పాదంలో సప్తర్షుల జన్మ విశేషాలు, నరసింహావతార వర్ణన, కుమార స్వామి జన్మము, పుణ్య ప్రదేశాల వర్ణన, శ్రాద్ధ కార్యాలకు ప్రశస్తమైన

నదీ తీర్థాల వర్ణన, అన్నదాన మహిమ, గయా శ్రాద్ధఫలము, శివానుగ్రహం కోసం పరశురాముని తపోదీక్ష కార్తవీర్యార్జునుడు జమదగ్నిని పీడించుట సంజీవనీ విద్య కారణంగా జమదగ్ని మరల జన్మించడం, శ్రీకృష్ణ ప్రేమామృత స్తోత్రమ్, సగర చరిత్ర యయాతి చరిత్ర మొదలైన విశేష విషయాలున్నవి.

4. ఉపసంహార పాదంలో లలితా దేవికి సంబంధించిన విస్తారమైన వర్ణన, కామాక్షీ దేవి మహాత్మ్యములు శ్రీదేవి దీక్ష లలితా సహస్రనామ స్తోత్రాదులు బ్రహ్మాండ పురాణంలో సాక్షాత్కరిస్తాయి.

శ్లో॥ ఇదం కీర్తయేత్వత్సశృణోతిచ సమాహితః।
సవిధూయేహ పాపాని యాతిలోక మనామయమ్॥

ఈ బ్రహ్మాండ పురాణాన్ని పఠించువారు, వినేవారును సమస్త పాపాలకు దూరస్థులై ఉత్తమ లోకాల పొందగలరు.

శ్లో॥ వ్యాసాయ విష్ణు రూపాయ, వ్యాసరూపాయ విష్ణవే।
నమోబ్రహ్మనిధయే, వాశిష్టాయ నమోనమః॥
నారాయణం నమస్కృత్యా, నరంచైవ నరోత్తమమ్।
దేవీ సరస్వతీం వ్యాసం, తతో జయముదీరయేత్॥
వ్యాసం వశిష్ట నప్తారం, శక్తేః పౌత్ర మకల్మషం।
పరాశరాత్మజం వన్దే, శుకతాతం తపోనిధిమ్॥

# యుగములు - ప్రమాణములు

సూతుడు చెబుతున్నాడు:-

కాలము పరమేశ్వర స్వరూపము. అది జీవుల శరీర ధారణల ప్రమాణము నిర్ణయించు కొలబద్ధ ఈ కాలము, తృటి, నిమేషము, ఘడియ,

హోర, జాము, దినము, రాత్రి, వారము, పక్షము, మాసం, ఋతువు, అయనము, సంవత్సరము, తరువాత యుగముగా నిశ్చయించి పరిగణనకు వీలుగా ఏర్పరచబడింది. ఆ యుగములు నాలుగు. మొదటది కృతయుగము, రెండవది త్రేతాయుగము, మూడవది ద్వాపరము, నాలుగవది కలియుగము.
1. కృతయుగము పదిహేడలక్షల యిరువది వేల సంవత్సరములు;
2. త్రేతాయుగము పండ్రెండు లక్షల తొంభయ్యారు వేల సంవత్సరములు;
3. ద్వాపరయుగము యెనిమిది లక్షల ముప్పది రెండువేల సంవత్సరములు
4. కలియుగం నాల్గు లక్షల ముప్పది రెండువేల సంవత్సరాలు.
కాలచక్రములో నీయుగము లాకులవలె తిరుగుచుండును. మొత్తం నాల్గుకోట్ల ముప్పదొక్కలక్షల రెండు వేల సంవత్సరములు. ఈ మొత్తము కాలము ఒక మహాయుగము. బ్రహ్మదేవునకు ఇట్టి వేయి మహాయుగములు ఒక పగలు, వేయి మహాయుగములు ఒక రాత్రి అనగా మనకు రెండు వేల మహాయుగములు బ్రహ్మ కొకదినము. అప్పుడాయన నిద్రించును. మరల లేచిన తరువాత దినప్రళయము పూర్తియై సృష్టి మొదలగును తన సంకల్పముతో మానస సంతానముగా వేయిమంది స్త్రీ పురుషులను పుట్టజేయును. వారు మహాభక్తులై శ్రీహరి ధ్యానములో మునిగియుందురు.

1) కృతయుగంలోని జనులు దీర్ఘాయువు, ధర్మము సదారోగ్యము, తపోవృత్తి గల్గి సుఖము పొందుచు సమశీతోష్ణ స్థితులతో కష్టమెరుగకుండ నుందురు. వారు నిరంతర బ్రహ్మచర్య వ్రత దీక్ష గలవారై యుందురు. సత్యవ్రతదీక్షతో శ్రీహరి భక్తితో నియమ బద్ధముగా జీవితము గడుపుచు దేవతాబలము సంపాదించినవారై యుందురు. (సత్యవ్రతదీక్షతో శ్రీహరి భక్తితో నియమ బద్ధముగా జీవితము గడుపుచు దేవతాబలము సంపాదించినవారై ) సుఖముగా జీవయాత్ర చేయువారగుదురు.

2) త్రేతాయుగమందు జనులకు కొంచెము సత్త్వ గుణము తగి

రజోగుణముతో నుండగలరు. భూమి - సర్వసస్యసమన్వితముగా నుండును. ప్రజలు సుఖశాంతులు గల్గియుందురు. రజోగుణప్రభావముతో కొంచెము శత్రుమిత్ర భావములు బయలుదేరి పరస్పరం బాధించుకొనుచుందరు. స్త్రీలకు ఋతుదోషం ప్రారంభమగుచు గుణములచే వృత్తులారంభమగు చుండును. వ్యవసాయాది కృషులు ప్రారంభమగును. గృహనిర్మాణములు కావించుకొనుచు నొక విధమగు నాగరికత నారంభించుదురు.

3) ద్వాపరయుగంలో ధనవాంచా పరులై వృత్తులు చేయుట, ప్రజలలో కొంత కొంత సాంకర్యము ప్రారంభమగును. అప్పటినుండి అనావృష్టి క్షామాదులు గలిగి ప్రజలు భాధపడుట జరుగుచుండును.

4) చివరియుగము కలియుగము . ఇందు ధర్మము నశించును సత్యము మాటు మణుగును. జనులలో రోగాదులు, శరీరపీడాదులు హెచ్చుగా కల్గు చుండును. జనులు వారి వారి జాతి గుణాలు వదలి నానా దుర్గుణములతో సంచరించెదరు. స్త్రీలయందు ధర్మములు నశించును. వేదములనమ్ముకొని జీవించెదరు దుర్గుణములతో నల్పాయుర్దాయులగుదురు. కలియుగ మందు శ్రీహరి భక్తి యొక్క రోజున ఎంత కల్గి, యున్నదో, యితర యుగములలో కొన్ని సంవత్సరములు చేసిన ఫలిత మొందగలరు. ఈ కాలమున కంతకు సూర్యగమనము ప్రధానము సూర్యరథమును మందేహులను రాక్షసు లడ్డగించు చుందురు. మంత్ర పూతమగు నర్ఘ్యజలము. ప్రాతః సంధ్యాకాలమందు యనగా ఉషః - సాయంకాలము లందు వదలినచో వారనన్యపుణ్య వంతులగుదురు.

## వాలి - రావణుడు

సూతోక్తముగా - కాలము యుగములు, ప్రమాణములు గురించి

విని మునులు – "మహానీయా! రావణుడు మహాపరాక్రమ వంతుడని, సమస్తం జయించినవాడని. అఖండ శివారాధకుడని విన్నాము వాని పరాభవం గురించి వివరింప వేడుచున్నా మని కోరగా సూతమహర్షి పుంగవుడిట్లు చెప్పనారంభించెను. రావణుడు విశ్రవసువుని కుమారుడు. శివుని గురించి ఘోరమగు తపము గావించెను. వేయి దివ్య సంవత్సరముల కొక శిరస్సు చొప్పున దేవమానము ప్రకారము పదివేల సంవత్సరములు పదిశిరస్సులను తెగనరికి శివునకర్పించెను. సమస్త దేవతలనుజయించి, ముల్లోకములందునా సాటిలేని వేంటిగా తిరుగు చుండెను. ఆ సమయముననే అతడు వానరవీరులతో శ్రేష్ఠుడగు వాలిని గూర్చి విన్నాడు. వానిని జయించు కోర్కెయు తనకు ఈడైన పరాక్రమ వంతుడెవడూ వుండరాదనుతలంపుతో దండయాత్రగా బయలుదేరి కిష్కంధా నగరము ప్రవేశించెను. "వాలి ఎచ్చటనున్నా"డని ప్రతిహారులను ప్రశ్నించెను. రావణుని చూచి వారు భయపడి వణకుచు, "ఇప్పుడే మా ప్రభువు దక్షిణసముద్రమునకు సూర్యనకర్ఘ్యమీయ వెడలినారు. మీ రెందులకు వచ్చినా"రని ప్రశ్నించగా నాతడు గర్వముతో మీ ప్రభువు బలపరాక్రమములు పరీక్షింప వచ్చితిని. నా ప్రతాపము చూపించదలచినా" నన్నాడు అది విని, వారు, వెల్లమొగములతో "మా ప్రభువును నీవు గెలువలేవు" అన్నారు. ఆ మాటలు తృణీకరించి "వీరితో నాకేల? నేనా దక్షిణసముద్రమునకే వెళ్ళి నాపరాక్రమము చూపుదు" ననుకొనెను.

తక్షణమే బయలుదేరి దక్షిణ సముద్రజలముతో సూర్యునకునర్ఘ్య మిచ్చుచున్న వాలిని సమీపించి "వాలీ! నీవు పరాక్రమవంతుడవని కొందరన్నారు. నేను నీ ప్రతిభను చూడదలచి వచ్చినాను. నాతో యుద్ధముగావించి జయము సంపాదించుము. అప్పుడు నీ బిరుదుతనము గన్పించు" ననెను.

రావణుడు తన సూర్యదేవతారాధనమున కడ్డువచ్చి నాడని తలచి, వాలి - చేయిసాచి వానిని దగ్గఱిలాగుకొని "నా సూర్యదేవతారాధన మగు వర కాగుము నీకోర్కె తీరు"నన్నాడు. వాలి పట్టునుంచి విడిపించుకొని రావణుడెగుర బోవగా వానని తన చంక సందులో నుంచుకొని నొక్కి పెట్టి క్రమముగా నాలుగుదిశల సముద్రజలములతో సూర్యున కర్ఘ్యము నిచ్చుచు తనపనియైన తరువాత వానిని చంక నుండి క్రిందకు జార్చి పడవేసెను. దానితో రావణుడు గడగడలాడి, వాని కెదురుగా నిలబడి చేతులుజోడించెను. వానిని చూచి వాలి "రావణా! నీవెందులకు వచ్చినావు? నీ యభిప్రాయమేమి?" యని ప్రశ్నింపగా రావణుడు డిట్లు చెప్పదొడగెను.

"మహావీరా! నేను ముల్లోకములు జయించినవాడననియు నన్నుమించిన మొనగాడు లేడనియు గర్వమందినాను. నాకు ఈ గర్వవిషయము బాధింప నీవు తప్ప నింక నేవీరుడను లేడని నాకు కొందరు చెప్పినారు. నిన్ను జయించు కాంక్షతో నీవద్దకు వచ్చినాను. నీ పరాక్రమమును చూడనక్కరలేకుండా నీ భుజబలమునే చూచినాను. నీ కక్ష్యభాగమున జిక్కుపడి యూపిరాడక గిజగిజ కొట్టుమిట్టాడినాను. నాకు మా భుజబలమింతటితో తెలిసినది. నా జన్మలో నీతో విరోధము తలపెట్టను. నన్ను మన్నింపుము. నాకు ఇంతకన్న నేమి కావలయును. నీ వంటి వీరాగ్రణి సాయసంపదలున్న నన్ను యెవరు కన్నెత్తి చూడగలరు? నీ ప్రాపుగోరెద" నని ప్రార్థించెను. వాలి వాని దీనస్థితిని చూచి జాలిపడి "రావణా! నీవు నన్ను గురించి భయపడ నవసరము లేదు. నాతో స్నేహముగా నుండుము. నీకాపద కాలాన నన్ను గోరిన ఏ సాయమైనను చేయగలను. నేను పిలిచినప్పుడు పల్కుచుందువు గాన, నీవు స్వేచ్ఛగా పొమ్మని" సాగనంపెను. వారిద్దరును స్నేహితులుగా మసలసాగిరి. చాలాకాలమైన పిదప, రావణవధార్థము శ్రీహరి రామావతారము దాల్చెను. రాముడు సీతను వివాహమాడి తండ్రి

ఆజ్ఞననుసరించి భార్య సీతతో, సోదరుడు లక్ష్మణునితో నరణ్యవాసము చేయసాగెను. రావణుని చెల్లెలు శూర్పణఖ దుష్టస్వభావురాలై రాముని జేరి సీతను వదలి తనను పెండ్లాడుమని బలవంతము చేయసాగెను. రాముడు లక్ష్మణుని ద్వారా ఆమెను పరాభవము చేసి పంపగా యామె లంకకుపోయి రావణునితో సీతను రూపవతిగా వర్ణించి గొనిరమ్మని ప్రోత్సహించెను. రాముడు వర్ణశాలలో సమయమున రావణుడు సీతను దొంగతనముగా నెత్తుకొనిపోయెను. సీతను వెదకుచు రామలక్ష్మణులు పంపాతీరమున సంచరించుచుండగా సుగ్రీవుని ముఖ్యమంత్రి హనుమంతుడు వారిని కలుసుకొని రామ సుగ్రీవులకు సఖ్యము చేసెను.

వారి స్నేహములో నొకరి యాపద కొకరు సాయపడునట్లు నియమ మేర్పరచుకొనిరి. ముందు సుగ్రీవుని కోర్కె ననుసరించి వాలిని వధించి రాజ్యము సుగ్రీవుని కప్పగించవలయును. అందుచే వాలి సుగ్రీవులకు యుద్ధ మేర్పరచగా రాముడు ముందు వారిద్దరిలో యెవరెవరో యెరుగక వాలిని చంపలేదు. సుగ్రీవుడు చావు దెబ్బతిని, గోలపెట్టుచు శ్రీరాముని చేరెను. రాముడు తన సందేహము తీర్చుకొనుటకు సుగ్రీవునకు పుష్పమాల వేయించి గుర్తు పట్టునట్లు నిలబెట్టెను. తరువాత శ్రీరాముడు వాలి బలమెరిగిన వాడగుటచే ఎదురు నిలవక, చెట్ల చాటు నుంచి బాణము వేసి వాలిని పడగొట్టెను. వాలి పడిపోవగా రాము డతనిని జేరి యోదార్చబోయెను. వాలి రాముని చూచి నిందగా "రామా! నీవు నన్ను నిష్కారణముగా, విరోధము లేకుండా పడగొట్టుట ధర్మమా? నీకు సీత కావలసినచో నేను రావణుని పిలపించి సీతను నీ కాళ్ళముందు పడవేయుజేయునా? ఇట్టి అధర్మ మెందులకు చేసితివ"నెను వాలి మాటలకు సమాధానముగా రాముడు "క్షత్రియులకు వన్యమృగములను వేటాడుట అధర్మము కాదు. పైగా నీ స్నేహితుడైన రావణునకు శత్రువును, అపకారము చేసిన వానిని దండించుట

నా ముఖ్య ధర్మము. నీవు సుగ్రీవుని భార్యను చెరబట్టి పాపమున కొడిగట్టినావు. క్షత్రియుడు ధర్మపాలన చేయదగును. కాన నిన్ను దండించితి "నని సమాధానము చెప్పెను. అది విని వాలి తనను క్షమింపుమని రాముని ప్రార్థించి ప్రాణములు విడచెను.

## పరశురాముడు - గోకర్ణ క్షేత్రము

ఇట్లు వాలి కథ వినిన మహామునులు గోకర్ణ క్షేత్రమును గురించి, పరశురాముడు దాని నుద్ధరించిన విషయమును సవివరముగా చెప్పగోరెదమని అడుగగా సూతుడిట్లు చెప్పనారంభించెను. పూర్వము సగర చక్రవర్తి యశ్వమేధ యాగము చేయ ప్రారంభించెను. సగరుని కుమారులు అరవై వేల మంది గుఱ్ఱమునకు రక్షగా బయలు దేరిరి. వారిట్లు వెళ్ళుచుండగా ఇంద్రుడు తనలో "సగరుడు యిదివరలో చాల యజ్ఞములు చేసినాడు. ఈ యజ్ఞము కూడా సాగించినచో నా పదవికే భంగము వాటిల్లునో"యని యెాచించి, తన మాయతో గుఱ్ఱమును గొనిపోయి, పాతాళమందున్న కపిలాశ్రమములో కట్టివేసి, తన దారిని తాను పోయెను. సగర పుత్రులు గుఱ్ఱము కొరకై నలుదెసలు తిరిగి తిరిగి చివరకు పాతాళమున కేగ నిశ్చయించిరి.

పాతాళము చేరవలెనన్న భూమిని త్రవ్వవలయును గదా! అందులకై వారందరు భూమిని త్రవ్వసాగిరి. ఆ తవ్వుటలో గోకర్ణ క్షేత్రము కూడా త్రవ్వబడి సముద్రములో కలిసిపోయినది. గోకర్ణక్షేత్రము పరమ పవిత్ర క్షేత్రము గాన మునులంద రచ్చుట నుండి తపస్సు చేసుకొనవలయునని వాంఛించ సాగిరి. ఆ గోకర్ణ క్షేత్రమెక్కడ నుండి యెంతవరకుండినదో నిర్ణయించలేక పోయిరి. వారు మహా పరాక్రమ మూర్తి యగు పరశురాముని సమీపించి "భార్గవ రామా! నీవు దుష్ట శిక్షణము శిష్ట రక్షణము చేయుటలో

సమర్థుడవని యిదివరలోనే లోకమెరుగునట్లు సంచరించినావు. మేము మా తపో కార్యములు గావించుటకు గోకర్ణక్షేత్రము ప్రసిద్ధి గాంచిన మహాస్థలము. ఇప్పుడా క్షేత్రము సముద్ర మట్టమున బడియున్నది. దానిని వెలికి దీసి మాకు యిప్పింపు" మని ప్రార్థించిరి. వారి మాటలు విని పరశురాముడు వరుణుని పిలువగా అతడు పలుకలేదు. మహాస్త్రము సంధించి వేయుగా వరుణుడు వచ్చి "నీకు వలయు క్షేత్రస్థలము కేటాయించుకొమ్మ"నెను. అతడు దర్భనభిమంత్రించి వేయుగా, అది రెండు వందల యోజనముల దూరమున బడగా నంత వరకది గోకర్ణ దివ్యక్షేత్రమని నిశ్చయించి, వరుణుడు తన జలమును వెనుకకు లాగుకొని, యా క్షేత్రమును మునులకు వదలివేసెను. నాటి నుండి గోకర్ణ క్షేత్రము పునఃయందరిచే సేవించబడుచు, ఇప్పుడు క్షేత్ర రాజమై విలసిల్లుచున్నది.

# స్వాయంభువ మనువు - ద్వీపములు

సూతుడిట్లు గోకర్ణక్షేత్రమును గురించి చెప్పిన తరువాత మునులు - మనువు విషయము, ద్వీపములు గురించి చెప్పమని వేడగా, నిట్లు చెప్పసాగెను. మనువులు పదునాల్గురుండిరి వారిలో స్వాయంభువ మను వొకడు. వాని కుమారుడు ప్రియవ్రతుడు. అతడు తన కుమారుల కేడు దీవులు రాజ్యపాలనకు పంచి యిచ్చెను. వారిలో 1) జంబూద్వీపమును పెద్దవాడగు నాగ్నీంధ్రునకు, 2) ప్లక్ష ద్వీపము మేధాతిథికి , 3) శాల్మలీ ద్వీపము వపుష్మంతునకు, 4) క్రౌంచ ద్వీపము హవ్యునకు, 5) పుష్కర ద్వీపము సేవనునకు యిచ్చి పట్టాభిషేకము గావించెను. ఆ ద్వీపములో క్రమముగా దేశములు, రాజ్యములు విడదీయుగా అందు వార లాయా దేశభాగముల కధినేతలుగా నుండి వారి పేర్లతో పట్టణములు రాజ్యములు నిలబడిపోయినవి.

**1. జంబూద్వీపము :-** ఈ ద్వీపము తొమ్మది వర్షములుగా విభజింపబడినది. నూరువేల యోజనములు దీని విస్తర్ణము. ఇందు ఏడు కుల పర్వతములు, మహానదులు దేవ గంధర్వ, సిద్ధాదులు సేవించు పవిత్ర క్షేత్రములు గల్గి శోభాయమానంగా నుండును. ఈ యేడు మహాపర్వతములలో మేరువు గొప్పది. నీలగిరి, హిమగిరి, శ్వేతగిరి, మాల్యవంతము, గంధమాదనము, వింధ్యాద్రి పర్వతము లున్నవి. చూతఫల సేవనముతో నచటివారు సదా ఆరోగ్య వంతులై యౌవన ప్రాయులై సంచరించెదరు.

**2. ప్లక్ష ద్వీపము :-** జంబూ ద్వీపము కన్న రెండు రెట్లు పెద్దది, ఇందుండు వారు మత్సరాదులు లేకుండా సంచరించుదురు వార్థక్యము ఇచ్చట వారి కుండదు. గోమేధకము, నారదము, దుందుభి, సోమకము, సుమనోపర్వతము లిచ్చటను. ఇచ్చట యేడు మహానదులున్నవి. ఈ ద్వీప మధ్యమున ప్లక్ష వృక్షములు కొన్నివేల యోజనములు విస్తరించి వాని నీడనుండు వారికి క్షుత్పిపాసలు లేకుండా చిరంజీవులు చేయు గొప్ప సామర్థ్యంగల్గి యున్నది. దీనికి యొక ప్రక్క లవణ సముద్రము, మరో ప్రక్క యిక్షు సముద్రము గల్గి యుండును. వీరికి యా ప్రదేశమహిమచే మద, మాత్సర్యములు లేకుండా సుఖిమిచ్చుచు.

**3. శాల్మలీ ద్వీపము:-** ప్లక్ష ద్వీపము కన్న రెండు రెట్లు పెద్దది. ఈ ద్వీపమునందున్న పర్వతములలో కుముదము, వలాహకము, ద్రోణము, మహిషము మనబడు పర్వతములు గొప్పవి. ఇందు ద్రోణపర్వతము మీదనే సంజీవ కరణి, సౌకర్ణ కరిణి, సంధాకరణి, విశల్య కరణి యను మహౌషధీ సంతాన మున్నది. ఇందు మహానదులలో జ్యోతిస్సు. శాంతి, తష్ట, చంద్ర, శుక్ర విమోచని, నివృత్తి యను నదులు పేరు పొందినవి. ఈ ద్వీపమధ్యమున

శాల్మలీ వృక్ష ముండుటచే దానికా పేరు వచ్చినది. దాని కొక వైపు యిక్షు సముద్రము, యొక వైపు సుర సముద్రము సరిహద్దులుగా నున్నవి.

**4. కుశ ద్వీపము :-** శాల్మలీ ద్వీపము కన్న రెండు రెట్లు కుశ ద్వీపముండును. ఇందు విద్రుమ గిరి, మృతిమంతము, పుష్పక గిరి, హరిగిరి మందిరము, కుశైశయము మొదలగునవి పెద్ద పర్వతములు. ఇందలి ప్రజలు గౌరవర్ణము వారు. వారు మహాపుణ్యాత్ములు. దీని కిరువైపుల సుర సముద్రము, ఘృతసముద్రములున్నవి.

**5. క్రౌంచ ద్వీపము :-** కుశద్వీపము కంటె రెండింతలు పెద్దది. యిందు క్రౌంచపర్వతము వామనగిరి, అంధకగిరి, దివావృత్తము, ద్వివిదము, పుండరీకము, దుందుభి, స్వనగిరి యనునవి పెద్ద పర్వతములు. ఇవన్నియు రత్నమణులచే నిండి శోభాయమానముగా గన్పించు చుండును. ఇందు సిద్ధ, చారణాదులు సంచరించెదరు. దీనికొక ప్రక్క ఘృత సముద్రం మరియొక ప్రక్క దధి సముద్రములున్నవి.

**6. శాక ద్వీపము:** దీని వైశాల్యం క్రౌంచ ద్వీపానికి రెట్టింపు వైశాల్యము గల్గియుండును. ఇచటి వారు పుణ్యపురుషులు. దైవతగిరి, జలధార, శ్యామలగిరి, అస్తాద్రి, అంబికేయగిరి, కేసరాద్రి మొ॥ ముఖ్యమగు పర్వతాలతో శోభిల్లు చుండును. ఈ ద్వీపము చక్రాకారముగా నుండును. దీనికి రెండు ప్రక్కల దధి సముద్రాలు, మంచినీటి సముద్రాలు కలవు.

**7. పుష్కరద్వీపము :-** శాకద్వీపమునకు రెట్టింపు వైశాల్యముగలది. దీనికొక ప్రక్క జలసముద్రము, ఇంకొక ప్రక్క క్షీరసముద్రములున్నవి. జనులలో భేదము లేదు. హరిభక్తులు, వేదదపఠనముగావించు చుందురు. ఇది సర్వకాలాలందు సుభిక్షముగా నుండు దివ్య ప్రదేశము.

# విశ్వేదేవతలు - అశ్వినీదేవతలు

తరువాత మహామునులు విశ్వేదేవతలని యందురు. వారెవరు? వారెప్పుడుద్భవించరి. ఆ విషయం మాకు చెప్పుడని కోరగా సూతుడిట్లు చెప్పనారంభించెను. – దక్షప్రజాపతికి విశ్వయను కుమార్తె గలదు. ఆమె యమ ధర్మరాజు నాశ్రయించి పదిమంది కుమాళ్ళను గనెను. వారు హిమగిరి వెడలి బ్రహ్మదేవుని గూర్చి తపము నాచరించుండిరి. బ్రహ్మదేవుడు వారి తపమునకు మెచ్చి ప్రత్యక్షమై మీకేమి వరము కావలయునో కోరుకొండనగా వారు "ఓ బ్రహ్మదేవా! మాకు పితృదేవతలతో సమానముగా శ్రాద్ధకాలమునందు భాగము నిప్పింపగోరెద" మని ప్రార్థించరి. అదివిని బ్రహ్మ పితృదేవతలను పిల్చి "ఓ పితృదేవతలారా! ఈ విశ్వకుమారులు పదిమందికి మీతోపాటు సమానముగా శ్రాద్ధకాలమున భాగమిప్పింప వరమడుగుచున్నారు. మీ సమ్మతిని బట్టి నేను వరమీయదలచినాను. మీ యభిప్రాయమే" మని యడుగగా వారు మా కభ్యంతరము లేదు. ఆది యందు వారిని గొల్చునట్లును, విసర్జన కాలమునందు మమ్ము ముందుగొల్చునట్లుగావించినచో మాతో పాటు వారు భాగములు గ్రహించవచ్చుననిరి. నాటి నుండి శ్రాద్ధకాలమునందు యమ ధర్మరాజుకుమారులైన విశ్వేదేవతల నారాధించినగాని శ్రాద్ధక్రియ పూర్తికాదని వరమిచ్చి బ్రహ్మదేవుడు వెడలి పోయెను. తరువాత మునులు అశ్వినీ దేవతల వృత్తాంతము చెప్ప"మని కోరిరి.

వారుకోరినదే తడవుగా సూతడిట్లు చెప్ప ప్రారంభించెను. పూర్వము సూర్యుడు సంజ్ఞయను పేరుగల పద్మినియను స్త్రీని వివాహమాడెను. ఆమెకు వైవస్వతుడు, యముడు యను ఇద్దరు కుమారులు – యమి యను

కుమార్తె గలిగిరి. మహాతేజోవంతుడైన సూర్యుని వేడిమి సహించలేక సంజ్ఞ తన తేజముతో ఛాయయను నొక స్త్రీని పుట్టించి 'ఛాయా! నేను పుట్టింటికి పోయివత్తును, నీవు నా పిల్లలనుకని పెట్టి చూచుచుండు"మని దాని కప్పగించి పుట్టింటికి పోయెను. ఆమె తండ్రి దక్షప్రజాపతి. అతడు తన యింటికి వచ్చిన కుమార్తెను చూచి "అమ్మాయి! నీ కాపురమువదలి యిక్కడకెందుకు వచ్చినావు? కులస్త్రీ భర్తను వదలి యుండదగదు. నీ భర్తకడకే పొమ్మనగా విని, సూర్యుని జేర యిష్టములేక, ఆమె యాడు గుఱ్ఱమై యుత్తర కురుభూములిందు తిరుగాడుచుండెను. పిమ్మట ఛాయతో సూర్యుడుండు కాలమునందు సావర్ణి, శనైశ్చరుడు యను నిద్దరు కుమారులు గల్గిరి. ఛాయకు క్రమముగా సవతి బిడ్డలందు భేదము రాసాగెను. వారిని పక్షపాతి బుద్ధితో చూచుట యముడు గ్రహించెను. అతనికి ఛాయమీద కోపము వచ్చి యామెను కాలెత్తి తన్నెను. ఛాయ కోపగించి "నీవు కుష్ఠరోగి వగు" మని శపించినది. ఈ విషయము యముడు తన తండ్రియగు సూర్యునితో చెప్పెను. ఈమె నా భార్యకాదు, ఇంకొకతె యేయని నిశ్చయించుకొని వెంటనే తన యత్తవారింటికి బయలుదేరి వెళ్ళెను. దక్షప్రజాపతి తన కుమార్తెను మందలించి పంపిన సంగతి చెప్పెను. ఆమె యింతవరకు రాలేదని చెప్పగా నతడు దూరదృష్టితో చూచి, సంజ్ఞఘోణియై ఉత్తరకురు భూములందు తిరుగు చున్నదని గ్రహించెను. ఆ మాటవిని సూర్యుడు సంజ్ఞయందలి మమకారముతో తానుకూడ నొక పురుషాశ్వమై యందు దిరుగుచు నామెతో క్రీడించసాగెను. వారిరువురుకు కవల పుత్రులు జన్మించిరి. సత్యాఖ్యుడు, దస్రుడను కవలలే యశ్వినీ దేవతలని పిలువ బడుచుండిరి. వారు దేవవైద్యులు. వైద్యశాస్త్ర ప్రవీణులై యుండిరి. తరువాత పద్మినీ సూర్యులు నిజరూపము లందగా విశ్వకర్మ సూర్యునిలోని

కిరణములు కొన్ని గ్రహించి తరిగి వాటితో సుదర్శన చక్రమును తయారుచేసి, శ్రీహరికి సమర్పించెను. మిగిలిన సూర్యపుత్రులు వైవస్వతుడు, సావర్ణిమనువులలో కలిసిరి. యముడు ధర్మబుద్ధి గలవాడై దిక్పాలురలోనొకడై యుండెను శనైశ్చరుడు గ్రహములలో కలిసెను. యమి, యముని కామించి తిరస్కరింపబడి యయునా నదియై ప్రవహించెను.

# వైవస్వతవంశము - ధన్వంతరి

ఇది అశ్వినీ దేవతల యుత్పత్తి క్రమమని చెప్పగా మునులు "వైవస్వతుని వంశ క్రమము వివరించు"మని కోరగా సూతుడిట్లారంభించెను. చాక్షుషమన్వంతరమున వైవస్వతునికి దేవతలు భూలోక రాజ్యభారమునిచ్చిరి. అతనికి పదిమంది తనయులు. ఇక్ష్వాకు, నృగుడు, ధ్రష్టుడు, శర్యాతి సుద్యుమ్నుడు, పాంశుడు నాభాగుడు. కరూషుడు, వృషధ్రుడు. సూర్యుడు తన కుమారుడగు వైవస్వతుని జేరి యజ్ఞము చేయుమని ప్రోత్సహించెను. అశ్వమేధయాగము చేయు సమయములో యజ్ఞకుండమునుండియొక స్త్రీ జన్మించెను. ఆమెను వైవస్వతుడు కోరగా నేనుమిత్రావరుణ వంశములోని దానను. నేనటుకే బోదునని యామె వెడలిపోయెను. ఆమె పేరు ఇల. ఒకానొక సమయములో బ్రహ్మ మానస పుత్రులగు సనక సనందనాదులు ఈశ్వరుని దర్శించుటకు ఇలా వృతమునకు వచ్చిరి. శివదంపతులేకాంతమందిరమున నున్న సమయములో తమ తపోబలముతో వారా మందిరమునకు వచ్చిరి. వారిని చూచి ఓ మునీంద్రులారా! ఈ వనమునకు పురుషులెవ్వరు ప్రవేశించినను వారు స్త్రీలుగా మారుదు"రని శాపమిచ్చెను మను పుత్రుడు సుద్యుమ్నుడు యూ వనమునకు వచ్చిన వెంటనే స్త్రీ రూపమందెను. అతడు భవానీదేవి నాశ్రయించగా యామె కరుణించి నీవు చంద్రుని కుమారుడు బుధుని వరించి

పురారవుడను కుమారుని కనిన పిదప, సుద్యుమ్నుడవై మరల రాజ్యమును చేబట్ట గలవో నెను. ముగ్గురు కుమారులాతనికి గల్గిరి. వినతుడు, ఉత్కలుడు, గయుడు. ఈ గయుడే గయాపట్టణము నిర్మించినాడు. వీరు చంద్రవంశపు రాజులు. ధన్వంతరి భూలోకమున కవతరించి ఆయుర్వేదమును వివరించెను. ధన్వంతనరి దేవ దానవుల సముద్రమథన కాలమునందుదృవించెను, బ్రహ్మ దేవుని చూచి ధన్వంతరి "నాకు దేవతలతో సమానముగా యజ్ఞభాగము నీయవలెనని అని కోరగా నిదివరలోనే వేదిక విభాగము, యజ్ఞభాగములు నిర్ణయించబడినవి. వాటిని మార్పు చేయవలనుపడదు. ముందు యుగములో అష్టసిద్ధులు, దేవత్వము పొందెదవు. నీకు దేవతాప్రభావము విస్తరిల్లు నని చెప్పి యగాత డంతర్ధానమందెను.

## విష్ణువు - భృగువు

మునులారా! రాక్షసులకు దేవతలకు మొదటినుండి బద్ధ విరోధమే గదా! అందుచే నొకరి నొకరు జయించుతలంపుతో యుద్ధము చేయుచుండిరి. హిరణ్యకశిపుని వలన, బలిచక్రవర్తివలన పరాభవములు పొంది చివరకు శ్రీహరి దయవలన స్వర్గ రాజ్యము తిరిగి సంపాదించిన దేవతలు సుఖముగా పాలించుచుండిరి. వారి పాలనలో దేవతలు రాక్షసులను తరిమితరిమి కొట్టిరి. రాక్షసగురువైన శుక్రాచార్యుడు కైలాసమునకు వెళ్ళి శివుని వద్ద మహామంత్రములను గ్రహింపబోయెను. ఈ యదను చూచి దేవతలు విజృంభించిరి. గురువు తన యింటలేని సమయములో రాక్షసులు భృగుపత్నిని రక్షింప ప్రార్థించిరి. ఆమె తన తపోబలముతో వారికి అభయమిచ్చెను. రాక్షసులను వెంటబెట్టుకొని - వారిపై దండెత్తి వచ్చిన ఇంద్రుని స్తంభింపజేసినది. ఇంద్రుడు కంగారుపడి, శ్రీహరిని ప్రార్థించి

ంయుట్లనెనం. "భృగుపత్ని రాక్షసజాతికి తోడుగా నుండి నన్ను మెదలనీయలేదు. నీవు స్త్రీయని సందేహింపక యామెను ఖండించకున్న ప్రమాదము దేవలోకమున కంతకూ ప్రాప్తించును. మనల నిద్దరనూ భస్మముచేయుదునని దీక్షపట్టినది యని శ్రీహరి పాదములు తలచుకొని ప్రాదేయపడెను. ఇది గ్రహించి శ్రీహరి తన చక్రమును ప్రయోగించి భృగు పత్ని శిరస్సును ఖండించెను.

ఈ వార్త తెలిసిన భృగుడు "ఓ శ్రీహరీ! స్త్రీయను సందేహము లేకుండా నీవు నా భార్యను ఖండించినావు. దానికి ప్రతిగా నీవు మానవ యోనులందు జన్మలంది భార్యావియోగాది దుఃఖము లనుభవించెదవుగాక!" అని శపించెను. తరువాత తన భార్య శిరస్సును మొండెమున కతికించి మంత్రజలము ప్రోక్షించి యామెను బ్రతికించుకొనెను. ఆ బ్రుగు మహర్షి శాపము వలనే శ్రీహరి, శ్రీరామావతారము నెత్తినప్పుడు లక్ష్మ్యంశ అయిన తన భార్య సీతను కోల్పోయి మిక్కిలి దుఃఖమును అనుభవించెను."విధి ఎవ్వరికైన అనులంఘ నీయు"మని చెప్పి సూతుడు ఈ అష్టాదశ పురాణాల కథల ప్రవచనము ముగించెను.

శ్లో॥ త్ర్యంబకం యజామహే; సుగంధిం పుష్టివర్ధనం!
ఉర్వారమివ బంధనాత్, మృత్యో ముక్షీవ మామృతాత్!!
శ్లో॥ ఓమ్, భూర్భువఃస్వః ఓంతత్సవితుర్వరేణ్యం!
భర్గోదేవస్యధీమహి, ధియో యోన ప్రచోదయాత్!!
శ్లో॥ ఇయం భగవతీ సాక్షాత్, శంకరార్ధ శరీరణి!
పంచవక్రా దశభుజా, త్రిపంచ నయనోజ్వలా!!
శ్లో॥ నవరత్న కిరీటోద్యత్, చంద్ర లేఖావతంసినీ!
శుద్ధ స్పటిక సంకాశా, దశాయుధ ధరాశుభా!!

శ్లో॥ హార కేయూర కటక-కింకణీ నూపురాదిభిః
భూషితావయవా దివ్య; వసనారత్న భూషణా!!
శ్లో॥ సదా శివస్యదేవస్య – ధర్మపత్నీ మనోహరా!
జగదంబాత్రిజననీ, త్రిగుణా నిర్గుణాప్యజా!!

## పుష్పాంజలి

శ్లో॥ నత్వహం కామయే రాజ్యం, న స్వర్గం నాపునర్భవమ్!
కామయే దుఃఖ తప్తానామ్, ప్రాణినామార్తి నాశనమ్!!
శ్లో॥ జయన్తి తేసుకృతినః, రస సిద్ధాకవీశ్వరాః!
నాస్తి యేుషాం యశః కాయే, జరామరణజభయమ్!!
ఓం తత్సత్ ఓంనమోః నారాయణాయ!
ఓం నమశ్శివాయః సిద్ధమ్ నమః
శ్లో॥ వ్యాసం వశిష్ట నప్తారం, శక్తే పౌత్ర మకల్మషం !
పరాశరాత్మజం వందే, శుక తాతమ్ తపోనిధిమ్!!
శ్లో॥ వ్యాసాయ విష్ణురూపాయ, వ్యాస రూపాయ విష్ణవే!
నమోవై బ్రహ్మ నిధయే, వాశిష్టాయ నమోనమః!!

## శ్రీదేవి స్తుతి

శ్లో॥ అఖ్యాసాతి శయ జ్ఞాతా, షడధ్వాతీత రూపిణీ!
అవ్యాజ కరుణామూర్తి, రజ్ఞాన ధ్వాంతదీపికా!!
శ్లో॥ ఆ బాల గోపవిదితా; సర్వానుల్లంఘ్యశాసనా!
శ్రీ చక్ర రాజనిలయా, శ్రీమత్రి పురసుందరీ!!

అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వము

శ్లో॥ శ్రీశివా శివ శక్త్యైక్య రూపిణీ లలితాంబికా!
ఏవం శ్రీలలితా దేవ్యా, నామ్నాం సాహస్రకం జగు!!

శ్లో॥ త్ర్యంబకం యజామహే; సుగంధిం పుష్టివర్ధనం!
ఉర్వారమివ బంధనాత్, మృత్యో ముక్షీవ మామృతాత్!!

గద్యము:- ఏ వం ఇతి శ్రీ కృష్ణ ద్వైపాయన, వేద వ్యాస మహర్షి ప్రణీతమ్ సంస్కృత భాషాయాం అష్టాదశ పురాణాయాం, కథావిజ్ఞాన సర్వస్వ నామసమస్త మష్టాదశాపురాణాః సర్వం పరిసమాప్తమ్ ఓం సర్వేజనాః సుఖినోభవంతు శుభంభూయాత్.

ఇది: పుణ్య కర్మ శేషోద్భూత సార సారస్వత పరిచయ బుధారాధన విధేయ భృక్త రహిత తారక రాజయోగ విరాజిత నంది రాజ వంశోదయ స్వర్గీయ వేలు గోటార్య గురు చరణారాధన ధౌరేయ సకల బుధజన విధేయ అభినవ వేమన, సరసకవి సుధాకర, అష్టావధాని, ఆయుర్వేదాచార్య, కవి శేఖర, మహాకవి, కవన కళాప్రపూర్ణ, న్యాయవాది పట్టభద్ర ఇత్యాతి బిరుదవిరాజిత ఇర్గం రెడ్డి వంశోద్భవ రాకాసుధాకర యల్లయార్య వేంకటాంబ గర్భ శుక్తముక్తాఫల ఉభయకులోద్ధారక శివశ్రీ శివరామారెడ్డి నామధేయ కః ప్రణీతంబైన అష్టాదశ పురాణ కథా విజ్ఞాన సర్వస్వ, నామాంధ్రీకరణ సమాప్తం.

**సర్వేజనా సుఖినోభవంతు, సర్వేజనా సన్మంగళాని భవతు**

**సర్వేజనాః శాంతిర్భవతు, ఓం శాంతిః శాంతిః శాంతిః**

## బ్రహ్మాండ పురాణం సమాప్తం